# కుటుంబరావు సాహిత్యం

## మూడవ సంపుటము

సంపాదకుడు :

కేతు విశ్వనాథరెడ్డి




విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001

ప్రచురణ నెం : 1892

ప్రతుల సంఖ్య : 1000

ప్రథమ ముద్రణ : ఆగస్టు, 1982
ద్వితీయ ముద్రణ : అక్టోబరు, 1990
తృతీయ ముద్రణ : జూన్, 1995

ముఖచిత్ర కల్పన : చంద్ర



**వెల : రూ. 95-00**

ప్రతులకు :

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన్ భవన్, 4-1-435, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాద్ - 500 001.

విశాలాంధ్ర బుక్ హౌస్
విజయవాడ, హైదరాబాదు, విశాఖపట్టణం, హనుమకొండ,
అనంతపురం, తిరుపతి, గుంటూరు, కాకినాడ.

---

ముద్రణ : నాగార్జున ఎంటర్‌ప్రైజెస్, విజయవాడ - 520 004.

# మా రా కు . . .

'కుటుంబరావు సాహిత్యం' మొదటి సంపుటాన్ని '82 జనవరిలో మీకందించాం.

దరిమిలా 'చదువు' నవలని సంపుటాల్లో చేర్చకుండా జూన్‌లో విడిగా ప్రచురించాం.

పుస్తకాల్లో కెక్కకుండా పత్రికల్లోనే మిగిలిపోయిన కొ. కు. రచన లెన్నో వున్నాయి. వాటికోసం వెతుక్కోవడం యింకా పూర్తికాలేదు.

ఏకసూత్రత ప్రాతిపదికగా కొ. కు. కల్పనా సాహిత్యాన్ని ఆరు సంపుటాలుగా ఏ పథకం ప్రకారం ప్రచురించదలిచామో మొదటి సంపుటం సంపాదకీయంలో చెప్పాం. ఇది తెలుగు ప్రచురణలో యింతవరకు జరగని ప్రయోగం. అదీకాక కొ. కు. కల్పనా సాహిత్యం అంతా ఆరు సంపుటాలకి ఒదగదు. అందువల్ల ప్రాధాన్యతలు నిర్ణయించుకొని ఎంపిక చేసుకోవాలి. కేవలం సంకలనం చేయటం కాదు.

ఈ పరిమితులన్నిటి మూలాన్ని సంపుటాలని వరుస క్రమంలోనే ప్రచురించాలంటే ఎక్కువకాలం పట్టేలా వుంది.

కాని, మొదటి సంపుటానికి పాఠకులూ, పత్రికలూ, సమీక్షకులూ చూపించిన ఆదరణా, యిచ్చిన ప్రోత్సాహమూ ఓ పక్కనున్నాయి. 'మిగిలిన సంపుటా లెప్పుడొస్తా' యంటూ చూపిస్తున్న ఆత్రుతతో పక్కనుంది. వీటిని లక్ష్యపెట్టకుండా వుండటం భావ్యం కాదు.

అందుకని వరుస క్రమం పాటించకుండా ప్రచురిస్తేనే, ఆరు సంపుటాల్నీ తొందరగా అందించగలమని అనుకున్నాం.

అందుకనే యిప్పుడీ మూడో సంపుటాన్ని కుటుంబరావుగారి రెండో వర్థంతి సందర్భంగా ఆగస్టులోనే మీ కందిస్తున్నాం.

కుటుంబరావు రచనల్లో ఎన్నో చారిత్రక సంఘటనలు, ఎందరో వ్యక్తులూ, రచయితలూ, కళాకారుల ప్రస్తావనలొస్తాయి. ఆయా సందర్భాలలో ఆ సంఘటనల్ని వ్యక్తుల్ని యిప్పటి పాఠకులకి పరిచయం చెయ్యడం అవసరం అనిపించింది. అందుకని ఈ సంపుటి నుంచి అధోజ్ఞాపికలు చేరుస్తున్నాం. కొందరు మిత్రులు ఇది "ఎంతో అవసరం' అన్నారు.

ఈ సంపుటం సిద్ధం చేస్తున్నపుడు 'పాఠ భేదాల' సమస్య ఎదురైంది.

కుటుంబరావుగారికి వెనక్కి తిరిగి చూసే అలవాటు లేదు. రాత ప్రతులు లేవు. అంచేత పుస్తకాలలోనో పత్రికలలోనో అచ్చయినవే ఆధారం. అవికూడా అన్నీ లభించలేదు. దొరికినవాటిలో ఒకదానికీ, ఒకదానికీ తేడాలున్నాయి. యాతావాతా అసలేదో అచ్చు తప్పేదో నిర్ధారించుకోవడమూ కష్టంగానే వుంది. వ్యవధికూడా లేకపోవటంవల్ల ఈ సంపుటంలో పాఠ నిర్ణయంపట్ల తగినంత శ్రద్ధ చూపించడం సంపాదకునికి సాధ్యం కాలేదు.

అయినా, యికమీదట ఈ విషయమై తగు శ్రద్ధ వహిస్తాం; పై పరిమితు లన్నిటికీ లోబడే అయినా.

ఈ ప్రోత్సాహం యిచ్చిన పాఠకులకీ, పత్రికలకీ, ఆకాశవాణికీ, సమీక్ష కులకీ కృతజ్ఞులం.

ఈ సంపుటాన్నీ మొదటి సంపుటాన్నిలాగే ఆదరిస్తారనీ, మిగిలిన సంపుటాల విషయంలో కూడా చేయూత యిస్తారనీ ఆశిస్తూ....

—ప్రకాశకులం

# భూమిక

"... చాలామంది చాలా రంగాలలో చాలా సంఘర్షణలు కొనసాగి
స్తేనేగాని, జీవితంలో సుఖపరిణామాలకు దారి ఏర్పడదు. జీవితం
నిండా పురోగమనానికి అడ్డుతగిలే శిథిలాలున్నాయి. వాటిని
నిర్మూలించిన మీదటగాని కొత్త నిర్మాణానికి అవకాశాలేర్పడవు."

—కొడవటిగంటి కుటుంబరావు.

తెలుగు సృజనాత్మక వచన సాహిత్యంలో దాంపత్యేతర కుటుంబ సంబంధా లను ప్రధాన రచనా వస్తువుగా తీసుకున్న రచయితలు చాలా తక్కువ. ఈ సంబం ధాలను చిత్రించేటప్పుడు అసలు భార్యాభర్తల సంబంధాల ప్రస్తావనే వుండదని కాదు అర్థం. తల్లిదండ్రులుగా, తాతలుగా, అమ్మమ్మలుగా, యితర రక్తబంధువు లుగా వాళ్ళ పాత్ర వుండితీరుతుంది. కుటుంబరావుకు ముందుతరం రచయితల్లో యీ రకం సంబంధాలను చిత్రించినవాళ్ళు దాదాపు యెవరూలేరు. ఆయన తరంలో కూడా, ఆయనంత విస్తారంగా ఆ జీవిత పార్శ్వానికి చెందిన సామాజిక, సాంస్కృ తిక సమస్యల్ని పరిశీలించినవాళ్లు లేరు. అంతటి సామాజిక చైతన్యంతోనూ, అంతటి చారిత్రక దృష్టితోనూ ఆ లోకాన్ని చిత్రించిన వాళ్ళు లేరు.

చింతా దీక్షితులు, చలం, విశ్వనాథ సత్యనారాయణ, మా గోఖలే, కరుణ కుమార, చాసో మొదలైనవారి పేర్లు యిక్కడ మనకు జ్ఞాపకం రావచ్చు. దీక్షితులు పిల్లల గురించి రాసిన రచనల్లో గ్రామీణ అమాయకత్వం కన్పిస్తుంది. చలం 1924 లోనే 'బిడ్డల శిక్షణ' అనే పుస్తకాన్ని రాసినా, ఆయన పిల్లల సమస్యలపై కథల్ని, నవలల్ని రాసినట్లు లేదు. స్త్రీ పురుష ప్రణయ సంబంధాలు అణువణువునా చలాన్ని వూపిరి సలపనియ్యకపోవడంవల్ల, అది వొకరకం అబ్సెషన్‌గా తయారవటంవల్ల, బాల్యంలో తండ్రి హింసలు భరించికూడా పెంపకాల్లోని అమానుషత్వాన్ని గుర్తించి కూడా దానిమీద కథలు రాయలేదేమో! యెదిగిన పిల్లలూ తల్లి తండ్రుల మధ్య సంబంధాలను గురించి కూడ ఆయన పెద్దగా స్పృశించినట్లులేదు. విశ్వనాథ 'మా బాబు' 'జేబు దొంగలు' నవలల్లో ఆధునిక దృక్పథం మృగ్యం. మా గోఖలే పదిపైగా కథల్ని, కరుణ కుమార, చాసో వొకటి, రెండు కథల్ని రాసినా కుటుంబ రావంత విస్తారంగా రాయలేదు. మా గోఖలే ప్రత్యేకత కిందివర్ణాల జీవితం, కింది వర్గం జీవితం. ఆ వర్గ మాండలికంలోనే రాయడం. కాకపోతే కరుణకుమార,

చాసోలకు యీ సందర్భంగా వొక ప్రత్యేకత వుందని చెప్పుకోవాలి. కరుణకుమార 'టార్చిలైటు' కథలోనూ, చాసో 'కుంకుడాకు' కథలోనూ ఆర్థిక పీడనకు గురి అయిన పిల్లల్ని గురించి రాశారు. ఈ విషయంలో యీ వారసత్వాన్ని అందుకొని ఆర్థిక పీడన విషయమై సామాజిక దీక్షతో, అనుభూతి తీవ్రతతో కొంత విస్తృతంగా రాసిన మలితరం కథకుల్లో ప్రముఖుడు రావిశాస్త్రి.

ఇప్పటికి దొరుకుతున్న కుటుంబరావు రచనల్లో, వాటి తొలి ముద్రణ వివరాలనూ లేదా ప్రచురణ వివరాలనూ బట్టి చూస్తే, 1935 నాటికే ఆయన దాంపత్యేతర కుటుంబ సంబంధ సమస్యలపై దృష్టి నిలిపినట్లుంది.

పసిపిల్లల మనస్తత్వం యేమిటి? వాళ్ళ జీవశక్తి యేమిటి ? సంఘ జీవితంలో, పిల్లల విషయంలో కుటుంబం నిర్వహించే పాత్ర యేమిటి ? కుటుంబం ద్వారా లభిస్తున్న పోషణ యేమిటి ? రక్షణ యేమిటి ? దానినుంచీ అలవడుతున్న భావాలూ, అనుభవాలూ, అనుభూతులూ, సంస్కారమూ యేమిటి? కుటుంబంలోని రక్త సంబంధీకుల మధ్య సంబంధాలను నిర్ణయించేది జీవలక్షణాలా ? సమాజమా ? కుటుంబ సంబంధాలూ, సామాజిక సంబంధాలూ, వీటిమధ్య పరస్పర ప్రభావాలేమిటి ?– యీ రకం ప్రశ్నలు ఆనాడూ, ఆ తర్వాతా, ఆయనను శాస్త్ర విద్యార్థిగా, భౌతికవాదిగా, రచయితగా కదిపినట్లుంది. అప్పటినుండీ 'అనుభవం' నవల ముద్రితమైన (యువ 1968 - 1969) దాకా రచించిన పిల్లలను గురించి పెద్దల కోసం రాసిన యీ సంపుటంలోని రచనలే పై ప్రశ్నలకు సాహిత్య సమాధానాలని మనం భావించవలసి వుంటుంది.

ఈ సంపుటిలో కూర్చిన రచనలు పిల్లలను గురించి రాసినవి; వాళ్ళ పెంపకానికి సంబంధించినవి; వాళ్ళ యెదుగుదలను చిత్రించినవి; యెదుగుదలతో, చదువుల ద్వారా, కుటుంబేతర సామాజిక అనుభవాల ద్వారా పొందే భావాలకు సంబంధించినవి; ఆ భావాలను అనుసరించి సాగే వర్గ స్వభావాన్ని చిత్రించినవి. పిల్లలకూ పెద్దలకూ మధ్య కాలక్రమంలో యేర్పడే భావ వైషమ్యాలకూ, వాళ్ళలో తలయెత్తే సామాజిక అంతస్సంఘర్షణకూ, వాళ్ళ మధ్య చెలరేగే చారిత్రక ప్రాధాన్యమైన ఘర్షణకూ కేంద్రకమైనవి. యాభైయేళ్ళ మన సంఘ జీవితానికి తార్కాణమైనవి. మన సంఘ చరిత్రకు ఫలితమైనవి. మన సామాజిక చైతన్యంలోని వైరుధ్యాలకు దర్పణమైనవి. మన సంస్కార చోదకమైనవి.

వొక్క 'అనుభవం' నవల మినహాయిస్తే, యీ సంపుటిలోని యితర రచనలన్నీ 1900 - 1945 చారిత్రక దశలోని తెలుగు మధ్యతరగతి రక్త సంబంధాల కథలు. 'అనుభవం' నవలలో 1900-1950 దశకు చెందిన సంబంధాలు కన్పిస్తాయి. చదువు నవలలో 1915-1935 దశలోని యిరవైయేళ్ళ సంఘ చరిత్రలో కన్పించే వ్యక్తి వికాస చిత్రణనూ, కొన్ని కుటుంబ సంబంధాల చిత్ర

ణనూ కుటుంబరావు చేశారు. సంపుటి పుటల పరిమితి దృష్ట్యా యీ నవలను యీ సంపుటిలో చేర్చకుండా ప్రత్యేకంగా, భూమికతో సహా, యిటీవల ప్రచురించడ మైనది. యీ సంపుటికి అనుబంధంగా దాన్ని పరిగణించి, తులనాత్మకంగా పరిశీలించుకోవచ్చు. (చూడండి : చదువు, 1982, విశాలాంధ్ర ప్రచురణ).

యితివృత్తాలను స్థూలంగా పరిశీలిస్తే :

యీ రచనల్లోని కథా స్థలాలు కోస్తా ప్రాంత గ్రామీణ ప్రాంతాలు, చిన్న బస్తీలు, రాష్ట్రేతర నగరాలు. యితివృత్తాలుగా అచ్చమయిన గ్రామీణ వ్యావసాయిక కుటుంబాలంటూ లేనేలేవని చెప్పవచ్చు. 'అనుభవం' నవలలో పార్వతి అత్తగారు శ్యామలాంబ భూవసతి గల కుటుంబమే అయినా, అది పతనమైపోతున్న జమీందారీ ఫాయా భూస్వామ్య కుటుంబం. 'నిష్కామ కర్మ'లో తండ్రిది ధనిక రైతు కుటుంబం. ఆ తర్వాత నానాటికీ దిగనాసిల్లిపోతున్న మధ్యతరగతి కుటుంబాలే యెక్కువ. వీళ్ళు చాలామటుకు వుద్యోగులూ, అంతో యింతో భూమి ఉన్నవాళ్ళూ. రంగయ్యతాత ఒక్కడే ఫ్యూడల్ అహంకారమూ, బూర్జువా వంచనా మనస్తత్వమూ ప్రదర్శించే కుటుంబ యజమాని.

కుటుంబ, సామాజిక సంబంధాల మధ్య, పిల్లలూ, వాళ్ళ యెదుగుదల, తరాల మధ్య అంతరాన్ని చిత్రించిన నవల అనుభవం. సవతితల్లి(1954), తాతయ్య(1941-1942), దేవుడింకా ఉన్నాడు (1954), వరప్రసాదం (1938), హింస, పోయిన సొమ్ము (1935), ఎందుకూ కొరగాడు (1935), దత్తపుత్రుడు (1947), పిల్లి కథ (1946), దీపావళి (1946), తల్లిలేని పిల్ల (1947), కథల్లో; తల్లిప్రేమ, తండ్రిప్రేమ (1944), దయ్యం, అంపకాలు, చిట్టి (1942), గల్పికల్లో పిల్లల పెంపకమూ, పిల్లల మనస్తత్వాలూ సంస్కారాలూ రూపొందే తీరూ ప్రాధాన్యం వహించాయి. చిన్నతనపు పెళ్ళి (1938) కౌమారదశకు సంబంధించినది. పెంకె పిల్ల (1937), బాల్య ముగ్ధత్వం పెద్దయ్యాక తెచ్చిపెట్టిన నైతిక, ఆత్మిక సమస్యలకు సంబంధించినది. మధ్యవర్తి (1935), పంచరత్నాలు (1968), నిష్కామ కర్మ (1939), దుక్కిటెద్దు (1954), ధర్మసందేహం (1948), బేడా కాసులు ఆదా (1942), తండ్రులూ కొడుకుల మధ్య గొడవలకు సంబంధించినవి. నమ్మదగిన మాట (1942), అన్నదమ్ముల సంబంధాన్ని చిత్రించిన గల్పిక. రంగయ్య తాత గారి పరువు మర్యాదలు (?), రంగయ్య తాత మీద తిరుగుబాటు (1944), తాతలూ మనవళ్ళ మధ్య జరిగిన స్వేచ్ఛా పోరాటానికి సంబంధించినవి. ఒక తల్లి పిల్లలు నాటిక (1959) డబ్బుమీద కాపీనంతో చిన్నతనపు పరస్పర ప్రేమాభిమానాలను పోగొట్టుకున్న అన్నదమ్ములూ, అక్కచెల్లెళ్ళూ తిరిగి పొందడాన్ని చిత్రించింది. అక్క పెళ్ళి (1954), రాసిన రాత (1942), తల్లిదండ్రులూ కూతుళ్ళ సంస్కారాల అంతరాల చిత్రణకు సంబంధించినవి.

యీ యితివృత్తాల్లో కన్పించే పాత్రలు మూడు తరాలకు చెందినవాళ్ళు. తాతయ్యలు, అమ్మమ్మల తరం పందొమ్మిదో శతాబ్దిది. తలిదండ్రులు స్థూలంగా మొదటి ప్రపంచయుద్ధ తరం. కొడుకులూ, కూతుళ్ళూ రెండో ప్రపంచ యుద్ధతరం. పిల్లల పెంపకం ప్రాధాన్యమున్న యితివృత్తాల్లో పురుష పాత్రలకంటే స్త్రీ పాత్రల ప్రాధాన్యం కన్పిస్తుంది. తరాల మధ్య అంతరం చిత్రించే సందర్భంలో పురుష పాత్రల ప్రాధాన్యం ప్రధానంగా కన్పిస్తుంది.

యీ రచనల్లో చిత్రించిన ప్రధాన సమస్యలు : 1. పిల్లల పెంపకం, 2. బాల్య వివాహాలు, 3. సంస్కారాల్లోని అంతరాలూ, వైషమ్యాలూ, ఘర్షణా, పర్యవసానాలూ.

కుటుంబరావు యీ రచనల్లో ప్రధానంగా భావాల స్థితిపై, భావాల ఘర్షణపై దృష్టిని కేంద్రీకరించారు. భూస్వామ్య భావజాల స్వరూప స్వభావాలేమిటి ? ఆ భావ జాలం క్షీణ దశలో యే విధంగా వుంటుంది ? భూస్వామ్య పతన దశలో పుట్టే ధనస్వామ్య భావజాలం, ధనస్వామ్య దశలోనే పుట్టే సామ్యవాద భావజాలం కుటుంబ సంబంధాల్లో యే విధంగా కన్పిస్తాయి ? ఈ ప్రశ్నలు ఈ సంపుటిని రచనల పరంగా మనం పరిశీలిస్తే, కుటుంబరావు యిప్పటికీ మన సంస్కారాన్ని పట్టిపీడిస్తున్న భూస్వామ్య కుసంస్కార భావాలపై, జడ మనస్తత్వంపై, హేతురాహిత్యంపై ప్రముఖంగా దండెత్తినట్లు తెలుస్తుంది. మన సమాజంలోని అప్పటి వైరుధ్యాలూ, బ్రిటిష్ ధనస్వామ్య వలసవాద విధానాలూ వీటి పరస్పర ప్రభావాలవల్ల పందొమ్మిదో శతాబ్దిలోనే మన ఆర్థిక సంబంధాలలో, సామాజిక సంబంధాలలో ధనస్వామ్య లక్షణాలు ప్రవేశించినప్పటికీ, అవి కుటుంబ సంబంధాలపై గణనీయమైన ప్రభావాన్ని కలుగజేసినప్పటికీ, భూస్వామ్య సంస్కార క్షాళనం సంపూర్ణంగా జరుగలేదు. ఇందుకు కారణం ఒక విధంగా పితృస్వామిక సమిష్టి కుటుంబ జీవనం లేదా దాని వారసత్వం. కొన్నిచోట్ల పట్టుసడలని, భూస్వామ్య కుసంస్కారం; మరికొన్నిచోట్ల "తడిబట్ట సాంప్రదాయం," "పట్టుబట్ట సాంప్రదాయం" సర్దుబాట్లు (చూడండి : తాతయ్య కథను). మరికొన్నిచోట్ల తల్లిదండ్రుల నుంచీ, పెరిగిన సామాజిక వాతావరణం నుంచీ, విద్యాగంధం నించీ యేర్పడిన సంస్కార వైషమ్యాలు.

ఈ సర్దుబాట్లూ వైషమ్యాలూ వున్న కుటుంబాల్లో అజ్ఞానం, అర్థంలేని నమ్మకాలూ రాజ్యం చెయ్యక తప్పవు. లేదా పిల్లల మానసిక జీవితంపై ప్రభావం చూపక తప్పవు. పిల్లలను పెంచడం చేతకాని తల్లులుండక తప్పదు. "సమర్థుడైన మగవాడితో సమానంగా, చదువూ, వివేకమూ, సరైన దృక్పథమూ గల" తల్లులున్నచోట్ల, తల్లిదండ్రుల సంస్కారం స్థాయీభావం పొందినచోట్ల, కుటుంబంలో కాస్త మంచిగాలి వీస్తుంది.

ఈ భావాల స్థితిని, యీ భావాల ఘర్షణనూ, దాని ప్రభావాలనూ యీ రచన అంతటా చూడవచ్చు. రాజకీయ భావాల కారణంగా తలయెత్తే భావవైషమ్యం వొక్క 'పంచరత్నాలు' కథలో మాత్రమే రేఖామాత్రంగా కన్పిస్తుంది. 'అనుభవం' నవలలో పార్వతమ్మకు, నారాయణకు మధ్య తలయెత్తిన భావవైషమ్యం నారాయణ రాజకీయాలవల్ల కాదు. నారాయణ అభిమానించే విప్లవ సిద్ధాంతాలు పిల్లల పెంపకంలో కొత్త సంస్కారాన్ని చేపట్టిన అతని భార్య సావిత్రికే- "కాలంతోపాటు కదిలే శక్తిని ప్రదర్శించిన" ఆమెకే - మింగుడు పడలేదు. సావిత్రి "మొగుడికి కొంచెం వెనుకగా పరుగులు తీసింది. పాత ఆచారాలను తోసేసింది. కులాలనుదాటి ఆలోచించ గలిగింది. అన్నీ చేయగలిగిందిగాని ఈ కమ్యూనిజం ఏమిటో అర్థం చేసుకోలేక పోయింది. అది ఆమె ప్రాణానికి పచ్చివెలక్కాయ అయికూర్చుంది" వర్గ సమాజ స్వరూపాన్ని గురించి నారాయణ తనకు తెలిసిన దృష్టాంతాలతో వివరించినాకూడా "సావిత్రి ఎటూగాని స్థితిలో" పడింది. అర్థం చేసుకోనూలేదు. రామకృష్ణ భార్య సీతలాగా గుడ్డిగా నమ్మనూ లేదు. ఆ రాజకీయాల ప్రభావం ముమ్ముందు యే విధంగా వుంటుందో నవలేతివృత్త పరిధి కాదు.

భూస్వామ్య సంస్కారం వున్న "కుటుంబాల్లో పిల్లల్ని పెంచడానికి రెండే పద్ధతులు. చావగొట్టి చెవులుమూసి చెప్పినమాట వినేటట్టు చెయ్యటమూ, లేకపోతే వాళ్ళను గారాబంచేసి వాళ్ళు ఆడినట్లు ఆడటమూ. ఒకటి సన్మార్గమూ, రెండోది దుర్మార్గమూను. కొందరికి రెండూ దుర్మార్గాలే అనిపించవచ్చు. అది వేరే విషయం. మరో పద్ధతిలో పిల్లల్ని పెంచటం సాధ్యమని" వాళ్ళు మాత్రం ఒప్పుకోరు. 'దేవుడింకా ఉన్నాడు'లోని వదిన, 'వరప్రసాదం'లోని కనకమ్మ, 'హింస'లోని మహలక్ష్మమ్మ, 'తల్లిలేని పిల్ల'లోని సవతి తల్లి లక్ష్మి యీ సంస్కారానికి ప్రతినిధులు. 'దేవుడింకా ఉన్నాడు' కథలోని వదినె కొడుకును వీపుమీద చరుస్తుంది. వాడికి మెడలో రెండు తాయత్తులూ, మొలకు మరొక తాయత్తూ, అనారోగ్యం, పొట్ట పెరిగింది. రొమ్ము యెండుకుపోయింది. కాళ్ళు పుడకలల్లేనే వున్నాయి. తల పెద్దదిగా వుంది. "పిల్లవాడట్లా వున్నాడేం?" అన్న కథనం చెప్పే భూస్వామ్య వర్గచ్యుతుడైన మరిదికి సమాధానంగా "నేను చేసుకున్న రాత" అంటుంది ఆ తల్లి. 'యేమన్నా మందిప్పిస్తున్నారా' అంటే "భైరవ శాస్త్రుల్గా... నవగ్రహ పూజచేసి తాయత్తు కట్టాళ్ళే" అనే చినతాతయ్య, ఆ మూఢాచార పితృస్వామిక సమిష్టి కుటుంబం పెద్ద. ఆ యింట్లో పెదనాన్నకు భేతాళ మంత్రాల్లో, మారణహోమంలో ముగ్గుల్లో, బ్రహ్మహత్యా పాతకాల్లో నమ్మకం. ఆ యింట్లోని ఒక తల్లికి సవాయిరోగం వుందని డాక్టరు చెబితే "బ్రాహ్మణ కుటుంబంలో సవాయి ఏమిటీ? వాడి శ్రాద్ధం? భైరవ శాస్త్రులను పిలిస్తే అసలు కీలకం యిట్టే చెప్తాడు" అన్న భైరవశాస్త్రుల లోకంలో వున్న ఆత్మవంచితుల కుటుంబం అది. యిట్లాంటి కుటుంబాలలో పిల్లలూ,

ఆడవాళ్ళూ వంచితులే, బాధితులే. అయితే ఆడవాళ్ళు తమ కసిని పిల్లలమీద తీర్చు కుంటారు. కాబట్టి పిల్లల పరిస్థితే మరీ అన్యాయం.

'వరప్రసాదం'లోని కనకమ్మతోబాటు సమానమైన మూర్ఖుడు ఆమె భర్త నరసింహం. నానాదేవుళ్ళకూ మొక్కి, వాళ్ళ వరప్రసాదంగా కన్నామనుకున్న సత్యనారాయణవరప్రసాద్ వురఫ్ వెంకటనారాయణకు తల్లిదండ్రుల పెంపకంవల్ల ప్రవర్తన అనేదానికి సూత్రం తెలీకుండ పోయి, వాజగా ఒకరకంగా రావిశాస్త్రి అల్ప జీవి సుబ్బయ్యలాగా 'బుల్లి సుబ్బయ్య' అవుతాడు. 'హింస'లోని తల్లి మహలక్ష్మమ్మ కొడుకు కిష్టణ్ని భయభక్తులలో పెంచుతుంది. వెయ్యి కళ్ళతో చూస్తుంది. యెవరి సావాసమూ చేయనివ్వదు, అన్నం తూచినట్లు పెడుతుంది. ఆకలైనా లేకపోయినా, గడియారం ప్రకారం పెడుతుంది. తిండి సరిగ్గా తినకపోతే మొట్టికాయలువేసి మరీ తినిపిస్తుంది. (అన్నం తినకపోతే గుద్ది, పిల్లలు యేడుస్తూ నోరు తెరిస్తే అన్నం ముద్దలు నోటిలో దురిగి తల్లి ప్రేమను ప్రకటించే తల్లులు యిప్పటికీ కావలసినంత మంది కన్పిస్తారు) వాడికి నరాల జబ్బు వుందని చెబితే నాటువైద్యునికి చూపిస్తారు. తల్లికి మించిన దైవం తండ్రి హూంకరిస్తే కిష్టుడు లాగులో ఉచ్చపోసుకోక తప్పదు. ప్రేమించే శక్తి తలిదండ్రులనుంచీ అబ్బనపుడు, చుట్టూ అనుభవాల్లో ప్రేమ దొరకక నప్పుడు ప్రేమ స్థానంలో హింస ప్రవేశించక తప్పదా ? కిష్టుడి బుర్రలో అలాటిదేదో జరిగింది. మమకారం మితిమీరినప్పుడు దాని పర్యవసానాలను 'తల్లిప్రేమ', 'తండ్రి ప్రేమ' గల్పికల్లో చూడవచ్చు. 'దయ్యం' గల్పికలో రాధ తల్లిమీద ప్రేమతో గుండె పగిలి చనిపోతే తల్లి దయ్యమై తీసుకపోయింది అని మూర్ఖులనుకుంటారు. 'బేడా కాసులు ఆదా'లో పిల్లల సరదాలు తీర్చని తండ్రుల లోభత్వం కన్పిస్తుంది.

ఈ కథల్లో గల్పికల్లో బిడ్డల శిక్షణకు సంబంధించిన పద్ధతులనూ, భావా లనూ, విలువలనూ కుటుంబరావు ఆందోళన మనస్తత్వంతో చిత్రించారు. వాటిపై అసహ్యం కలిగేలా చిత్రించారు.

పెద్దకథ 'తల్లిలేనిపిల్ల'లో సవతితల్లి కారణంగా ఒకప్పుడు తలిదండ్రులకూ పిల్లలూ మధ్య వున్న పైస్థాయి సంస్కార స్థానంలో, పాతకథే పునరావృత మవు తుంది. ఆ పాతకథ పునరావృతం కాకూడదని తెలియజెప్పినవాడు శివయ్య కొడుకు నరుసు. శివయ్య కథాంతానికి యింట్లో నుంచీ పారిపోయిన సంస్కారం విలువ తెలుసుకుంటాడు. కానీ భార్యాభర్తల సంస్కారాల మధ్యవున్న వైరుధ్యం, వైషమ్యం కారణంగా ప్రత్యక్ష ఆచరణకు దిగలేకపోయాడు.

వీటికి భిన్నమైన రచన 'సవతితల్లి' నవలిక. సవతితల్లిలోని రాజ్యం యింగ్లీషు చదువులు చదువుకున్న మనిషి. ఆధునిక భావాలున్న మనిషి. కుళ్ళు లేని మనిషి. దాను రెండో భార్యగా ప్రవేశించి సవతిపిల్లల పెంపకాన్ని మొదట్లో అసహ్యించుకొంది. మొదటివాడు రణపెంకె గోపీని చూసి మండిపడింది. రెండో

వాడు అర్భకుడు సత్యాన్ని చూసి జాలిపడింది. వాళ్ళను గోముతో, చాదస్తాలతో అట్లా చేసిన నాయనమ్మ, మేనత్తలమీద తిరగబడుతుంది. కడకు పిల్లలను శారీరకంగా, మానసికంగా ఆరోగ్యవంతుల్ని చేయగలుగుతుంది. కుటుంబరావు మాటల్లోనే చెప్పాలంటే "రాజ్యం గతాన్ని వదిలించుకోవటానికి శిథిలమైపోయే సనాతన శక్తులతో ప్రత్యక్షంగా పోరాడింది." రాజ్యం "వాస్తవమైన పాత్ర". రాజ్యంలాంటి వాళ్ల "చాలామంది చాలా రంగాల్లో చాలా సంఘర్షణలు కొనసాగిస్తేనేగాని జీవితంలో సుఖపరిణామాలకు దారి ఏర్పడదు. జీవితంనిండా పురోగమనానికి అడ్డుతగిలే శిథిలాలున్నాయి. వాటిని నిర్మూలించిన మీదటగాని కొత్త నిర్మాణానికి అవకాశాలేర్పడవు".

బాల్యాన్ని చిత్రించిన కథల్లో 'దత్తపుత్రుడు' కథకు ఒక ప్రత్యేకత వుంది. ఈ కథలో అయిదేళ్ళ ప్రసాదరావుకు తనను దత్తత యిచ్చిన తలిదండ్రుల డబ్బు దృష్టితో కూడిన ప్రేమాభిమానాల అసలు స్వరూపం అనుభవానికి వచ్చినపుడు, నిజమైన ప్రేమను విధవ దత్తు తల్లి దగ్గర పొందుతాడు. తలిదండ్రులపై ప్రేమను పోగొట్టుకొని ఆమెను ప్రేమిస్తాడు. కానీ ఆమె వాణ్ని ప్రేమతో సొంతం చేసుకోగలిగింది కూడా, తన ఆర్థికస్థితి ద్వారా ఆమెకు సంక్రమించిన ప్రేమ ప్రకటనా సామర్థ్యంవల్లనే.

పిల్లి కథ, దీపావళి కథల్లో సమాజాన్ని గురించి, సమాజంలోని స్వార్థ రాక్షసత్వాన్ని గురించీ, దృష్టాంతపూర్వకంగా తెల్పడం ద్వారా వుదార భావాలూ, మానవతా విలువలూ యేర్పడడానికి పెద్దవాళ్లు దోహదం చేయవచ్చునని కుటుంబరావు నిరూపిస్తారు. ఈ రెండు కథల్లో కన్పించే బావ పిల్లల చైతన్యం విస్తృతపరిచే కేటలిస్టు (Catalyst)గా, బాలల మనస్తత్వం, బాలసాహిత్య తత్వం తెలిసిన ఆలోచనా శీలిగా కన్పిస్తాడు.

1935 లో ముద్రితమైన 'పోయిన సొమ్ము'లోని కృష్ణుడూ, 'ఎందుకూ కొరగాడు'లోని ఆరేళ్ళ బక్కపలచని కుర్రాడూ - వీళ్ళిద్దరి మనస్తత్వమూ, జీవశక్తి యెక్కణ్ణుంచి వచ్చాయో స్పష్టంగా తెలియదు. 'పోయిన సొమ్ము'లోని కృష్ణుడు మూడోయేడే అందరి కళ్ళలోనూ దుమ్ముగొట్టి పులిగోరూ, వస్తువులూ బావిలో వేస్తాడు. యీ కథకు కుటుంబరావు యిచ్చిన ముగింపు : "పెద్దయిన తర్వాత గజదొంగగా తయారయినా ఆశ్చర్యం లేదు" అని. ఈ ముగింపు ఆయన అనాలోచితంగా చేసిందేమో! (ఉదాహరణకు చూడండి; రవిశాస్త్రి 'సబ్బుబిళ్ళ' కథలో ఇలాంటి ప్రవర్తన వెనుకవున్న ఒక స్పష్టమైన సామాజిక కారణం కన్పిస్తుంది). 'ఎందుకూ కొరగాడు'లో కుర్రాడిలోని జీవశక్తిని తలిదండ్రులు గుర్తించనప్పుడు వాడి ప్రవర్తనలో అలజడీ అరాచక ధోరణులు చోటుచేసుకుంటాయని కుటుంబరావు చెప్పదలచుకున్నారేమో కథ ముగింపు తెలియదు. 1938లో వచ్చిన

'వరప్రసాదం' నాటికి యీ విషయంలో కుటుంబరావులోని శాస్త్రీయ దృష్టి వొక స్పష్టమైన రూపానికి వచ్చినట్లు అభిప్రాయ పడవచ్చు.

'చిన్నతనపు పెళ్ళి'లో పదమూడేళ్ళ కృష్ణారావుకు, పదకొండేళ్ళ రుక్మిణిని యిచ్చి ముసలమ్మ అగాయిత్యంచేసి పెళ్ళి జరిపిస్తుంది. అది లైంగిక ప్రేమ తెలియని మూర్ఖ సమ్మేళనంగా పర్యవసిస్తుంది. పెంకెపిల్లలో రుక్మిణి నిలుపుకొన్న బాల్యముగ్ధ మనస్తత్వం తెచ్చిపెట్టే నైతిక ఆత్మిక దాంపత్య సమస్యల చిత్రణ. యీ రెండు కథల ప్రత్యేకత యేదైనా వున్నదంటే, అది శారీరకంగానూ మానసికంగానూ యెదగని పిల్లలు తెచ్చిపెట్టుకునే సమస్యల్ని తెల్పడం. 'పెంకెపిల్ల'లోని రుక్మిణి ముగ్ధత్వం వెనుక అన్యాయమల్లా ప్రేమ రూపాలు మారే కుటుంబ సామాజిక సన్నివేశాల గురించి అర్థం చేసుకున్నవాళ్ళూ, నచ్చచెప్పే వాళ్ళూ ఆమె చుట్టూ లేకపోవడం.

'మధ్యవర్తి' కథలో సంస్కారహీనులైన తండ్రీబిడ్డలు దశరథరామయ్యా హనుమంతరావులు. వాళ్ళ మూర్ఖ శత్రుత్వాన్ని కోడలు దమయంతి మధ్యవర్తిత్వం చేసి వుపశమింప చేస్తుంది. గురజాడ 'దిద్దుబాటు'లోని కమలిని లాటిది దమయంతి. 'నిష్కామకర్మ'లో శోభనాద్రి తండ్రి ఆస్తిముందు వ్యక్తిత్వాన్నీ ఆత్మగౌరవాన్నీ కాపాడుకుంటాడు. జబ్బుపడ్డ పిసినారి తండ్రిని ఆదుకుంటాడు. 'దుక్కిటెద్దు'లో జీవించడం, ప్రేమించడం చాతగాని కిష్టయ్య తన ఆఖరుకొడుకు 'కొద్దిపాటి హాస్య ధోరణి'లో రాసిన అయిదు పద్యాలు చదివాక అతనిలో 'ప్రేమ' కదులుతుంది.

'పంచరత్నాలు' కథలో బడిపంతులు రామకిష్టయ్య అయిదుగురు కొడుకుల్లో నలుగురు 'నాదీ, నా బతుకూ' మనస్తత్వాన్ని ప్రదర్శిస్తారు. కొడుకుల్ని అమ్మకం సరుకుగా, 'జాక్‌పాట్‌లు'గా, 'అమ్మకం పన్నులేని కార్గోలు'గా, 'బ్లాక్ మనీ'గా భావించిన తండ్రినే నిచ్చెనగా చేసుకుంటారు. మూడో కొడుకు నారాయణ మాత్రమే రామకిష్టయ్య కొడుకుల్లో ఒక ప్రత్యేకతను ప్రదర్శిస్తాడు. నారాయణకు చదువు అంతగా అంటలేదు. అయితేనేం, "కమ్యూనిస్టు సాహిత్యం బాగా అంటింది. జీవితంలో ప్రతిదాన్ని శంకించిన వాడి బుర్రకు మార్క్సిజం సూటి తగిలింది. మార్క్సు సిద్ధాంతాలలో ఏ కాపట్యమూ ఉండే అవకాశంలేదని వాడికి గురి కుదిరిపోయింది. జీవితంలో వుండే వంచనను నారాయణ ఊహించుకున్న దానికన్నా కూడా మార్క్సిస్టు సాహిత్యం బట్టబయలు చేసింది....విప్లవం, శ్రామికవర్గ నియంతృత్వం మొదలైన మాటలతో వాడి బుర్ర వెలిగిపోయింది. ఆ వెలుగులో వాడు అతి మనోహరమైన జీవిత విధానాలను రూపొందించుకున్నాడు." కమ్యూనిస్టుగా మారిన కొడుకు సంగతీ, అతని సిద్ధాంతాలూ, కమ్యూనిస్టుల కృషీ, సాహిత్య కృషీ యేమీ తెలియకుండానే రామకిష్టయ్య యెగబాకుడు మనస్తత్వంగల మధ్యతరగతి మానవుడుగా, కొడుకునూ, అతని జీవిత దృక్పథాన్ని, విధానాన్నీ మెచ్చుకోలేక

పోయాడు. మానవత్వం వున్న ఆ కొడుకు విశ్వాసాన్ని తండ్రి సొంతం పోగొట్టు కున్నాడు. రామకిష్టయ్య విషాదం, అతను ప్రాతినిధ్యం వహించే మధ్యతరగతి మన స్తత్వ దౌర్భాగ్యం. "ఆర్థిక స్థాయికి మించి ఆ స్థాయిని వ్యక్తులుగా మార్చలే"మని తెలియకపోవడం ఆ మనస్తత్వంలోని అన్యాయం. అంతకన్నా హీనం గుడ్డినమ్మ కాల కారణంగా నిజం చెప్పేవాళ్ళకు దూరం కావడం. 'ధర్మసందేహం'లోని ప్లీడర్ గుమాస్తా శివయ్య దాదాపు యీ కోవలోని మనిషే.

'రంగయ్యతాతగారి పరువు మర్యాదలు' కథలోని రంగయ్య తాత లక్షాధి కారి. వితరణశీలి. అయితే "మూడేళ్ళనాటి పాతగుడ్డలు పిగిలినందుకు చాకలాడికి డబ్బు విరగ్గోయ"గలిగినవాడు. పంటలు పండక రైతులు అలో లక్ష్మణా అని ఏడు స్తుంటే బకాయిపడ్డ ధాన్యానికి పత్రాలు రాయించి పుచ్చుకునేవాడు. కష్టసమయంలో పనిలోకి రాకపోయిన కూలివాళ్ళను పన్లోంచి తీసి, ఊళ్ళో ఎవ్వరూ పని ఇవ్వకుండా చేసి ఊళ్ళో నుంచి సాగనంపేవాడు. 'రంగయ్య తాతమీద తిరుగుబాటు'లోని రంగయ్య యింతకంటే దారుణం. ఈ రంగయ్య పొలాన్ని మక్తాలకిచ్చి రైతుల్ని దిగ్బంధం చేయగలవాడు. చెల్లెళ్ళను అల్లులకిచ్చి ఇల్లరికం తెచ్చుకొని ఆస్తులు కాజేసి చాకిరీ చేయించుకోగలవాడు. పెత్తనం కింద అందర్నీ అస్వతంత్రుల్ని చేయగల వాడు. ఈ రంగయ్యల నుంచీ కుర్రవాళ్ళు ముందుగా రాజకీయ స్వాతంత్ర్యాన్ని సంపాదిస్తారు. అయితే ఆ రాజకీయ స్వేచ్ఛ సంపాదనలో వాళ్ళ శ్రమ జీవనం పట్ల మొగ్గు చూపడం ఒక విశేషం. (యువ పత్రిక రచయితల మిత్రుల్లోని పిల్లలమర్రి బాలకృష్ణశాస్త్రి కూడా రంగయ్య తాత పాత్రగా కథల్ని రాశాడు. బహుశా ఈ రచయితల బంధువర్గంలో యే 'రంగయ్య'లు ఉన్నారో !)

'ఒకతల్లిపిల్లలు' నాటికలోని తాతయ్య అన్నేశ్వరరావు రంగయ్య తాతల కంటే భిన్నుడు. అతని కారణంగానే మనుమలూ మనుమరాండ్రూ స్వార్థాలతో పోగొట్టుకున్న బాల్యంలోని ఆత్మీయతల్నీ పరస్పర సహకార ధోరణినీ తిరిగి పొందు తారు. అలాగే 'అమ్మమ్మ' కథలోని అమ్మమ్మ అన్నపూర్ణమ్మ తన పెళ్ళి సమ యంలో ప్రదర్శించిన ధైర్యం మునిమనుమరాలుకు ధైర్యాన్ని యిస్తుంది. యీ కథ లోని రాములన్నయ్య శాస్త్రీయ దృక్పథం యిందుకు తోడ్పడుతుంది.

'అక్క పెళ్ళి'లో శ్వేతాంబరం, గుణమణి విరుద్ధ స్వభావాలూ పరస్పర ద్వేషాలూ వున్న దంపతులు. మూఢ యుద్ధం చేసే పతిపత్నులు. ఈ క్రూరమైన దాంపత్య సంబంధాల మూలంగా యిద్దరు కూతుళ్ళను చెరొకరూ ప్రేమ పంపకం చేసుకుంటారు. ప్రేమ పంపకంలోని క్రూరత్వం గ్రహించిన చిన్న కూతురు సీత "మానసికంగా దృఢంగా, బలంగా ఉండగలందులకు" "చాలా ఏళ్ళుగా ఎవరూ ఊహించని కృషి చేసినది. ఈ కృషి సఫలమయింది" అక్క కళ్యాణి అవ్యక్తురాలు. ఆమె అశక్తతను చూసి సీత మండిపోయింది. కళ్యాణికి వచ్చిన సంబంధంలోని

వరుని అపేక్షలు చూపే స్వభావం పద్ధతి తల్లిదండ్రులూ గుర్తించరూ, కల్యాణి గుర్తించదు. సీత గుర్తించి వాళ్ళకు గుర్తింపచేసి ఆ సంబంధం తనకు యిష్టమే నంటుంది. 'రాసిన రాత'లోని అమ్మాయి తండ్రి చెప్పే దైవజ్ఞుల అంచనాల్ని తల కిందులు చేసి బీదవాణ్ణి పెళ్ళి చేసుకుంటానంటుంది.

యీ కథలూ, గల్పికలూ, నాటికలోని పాత్రల స్వభావాలూ, వైరుధ్యాలూ, ద్వంద్వాత్మక వైఖరులూ, అంతఃసంఘర్షణలూ గమనించినపుడు పిల్లల పెంపకంలో పురోగమనానికి అడ్డుతగిలిన శక్తులూ, భావాలూ, భూస్వామ్య వ్యవస్థ తాలూకూ శిథిలాలేనని తెలుస్తుంది. ఆ శిథిలాలయంలోని పూజారులే తల్లిదండ్రులు, తాతలు. వాటితో ఘర్షణపడిందీ, పురోగమనాన్ని సాధించిందీ ఆధునిక దృక్పథమున్నవాళ్ళే. 'సవతితల్లి'లోని రాజ్యంవంటి ఒకరూ అరా తల్లులూ, 'తల్లిలేని పిల్ల'లోని నరుసు వంటి యువకులూ, 'అక్క-పెళ్ళి'లో సీతవంటి యువతులూ పురోగామి సామాజిక చైతన్యం కష్టపడి సాధించుకున్నవాళ్లు. రంగయ్యతాత కథల్లోని యువకులు వర్తమాన శక్తులతో పరోక్షంగా పోరాడినవాళ్ళు. 'పంచరత్నాలు'లోని నారాయణ భవిష్యత్తు కోసం జరిగే పోరాటానికి ఆయత్తమవుతున్నవాడు. యీ విధంగా కుటుంబరావు ప్రగతి వ్యతిరేక ప్రగతిశీల చారిత్రక శక్తులకు ప్రాతినిధ్యం వహించే పాత్రల్ని సృష్టించారు. యీ వుదాత్తపాత్రల (పాజిటివ్ పాత్రలు)తో పాటూ, భూస్వామ్యంలో కానీ, ధనస్వామ్యంలో కానీ ఆ వ్యవస్థ ప్రసవించిన వికృత శిశువుల్నికూడా ఆయన చిత్రించి తేడా చూపారు.

కుటుంబ సంబంధాలను విస్తృతంగా చిత్రించే వుద్దేశ్యంతో కుటుంబరావు 'చదువు', 'అనుభవం' నవలలు రాశారు. ప్రక్రియగా నవల పరిధి పెద్దది. విస్తృతంగా పాత్రలు జీవించే వాతావరణ కల్పనకూ, పాత్రల క్రమ పరిణామ చిత్రణకూ, ప్రాపంచిక దృక్పథ వివరణకూ నవలా ప్రక్రియలో అవకాశం వుంటుంది.

'అనుభవం' లో మీనమ్మ కుటుంబం, శ్యామలాంబ కుటుంబం, పార్వతి కుటుంబం, పార్వతి అన్నల కుటుంబాలు, ఆంజనేయులు కుటుంబం, నారాయణ కుటుంబం కన్పిస్తాయి. వీటిలో పిల్లల పెంపకాలు 'పాత శతాబ్ది' వెళ్ళిపోతున్న ప్పటినుంచీ, 1950 ప్రాంతాలవరకూ యెట్లా జరిగిందీ కుటుంబరావు విశదంగా చిత్రించారు. "రొచ్చుగుంటలాంటి ఫ్యూడల్ వ్యవస్థలో మొదటి రాయి పడింది" మొదలుకొని ఆ గుంటను పూడ్చే రాళ్ళు అన్ని రంగాల్లోనూ యెట్లా పడుతున్నాయో అన్న చారిత్రక పరిశీలనను కుటుంబరావు 'అనుభవం'లో చేశారు. ఈ చరిత్రలో అంతర్భాగంగా పిల్లల యెదుగుదల యింటా బయటా విద్యాలయాల్లో యెట్లా జరి గేదీ నిరూపించారు. తరాల మధ్య గోడలు యెందుకు, యే పరిస్థితుల్లో యెట్లా పెరి గేదీ విశ్లేషించారు. మీనమ్మ తన పిల్లల్ని పెంచిన తీరు, శ్యామలాంబ తన కొడుకు

కాంతయ్యను పెంచిన తీరూ, పార్వతి తన కొడుకును పెంచిన తీరూ, నారాయణా, సావిత్రీ తమ పాపను పెంచుతున్న తీరుకుగల భేదాన్ని కుటుంబరావు విపులంగా చిత్రించడం ద్వారా, పిల్లల పెంపకంలోని సంస్కారాల వ్యత్యాసాలనూ, వాటి తద నంతర ప్రభావాలనూ ఆయన చూపారు. కాంతయ్య నారాయణ యెదుగుదలకు ప్రేరకమైన స్నేహాలూ, చదువూ, సాహిత్యమూ, రాజకీయాలు వగైరా సామాజిక వాతావరణంలోని తేడాలను కూడా మనం ఈ సందర్భంలో గమనించాలి.

1935 నాటి నుండీ దాంపత్యేతర కుటుంబ సంబంధాలపై కుటుంబరావు మేధస్సులో జరిగిన ఆలోచనల మధనంలో పుట్టిన సిద్ధాంత కళా కల్పన 'అనుభవం' అనవచ్చు. అది 'A Book For Perents' కూడా. ఈ నవలలో పిల్లల మనస్తత్వం అనువంశికమైందా, సమాజం నిర్ణయిస్తుందా అన్న విచికిత్స ప్రధానంగా పార్వతి మాతృత్వ సమస్య ఆధారంగా సాగించి చెప్పవచ్చు. శ్యామలాంబ పెంపకంలో తన మగడు కాంతయ్య పరమ లుచ్చాగా తయారుకావడం పార్వతి గ్రహించడంవల్లనే కొడుకు క్షేమం కోసం ఆస్తి పంపకాలకు సిద్ధపడుతుంది. "తన కొడుకు మనసులో పడే ప్రతి ఆలోచనా వాడికి ముందు ముందు పనికిరావాలి. వాడి మనస్సు అడివల్లే తయారు కారాదు. తీర్చిదిద్దిన తోటలాగా ఉండాలి. అందులో ప్రతి అంగుళమూ తనకు అర్థమవుతూ ఉండాలి" అన్న దృక్పథానికి వస్తుంది. తన మొగుడూ, మామ గారూ ఎటువంటి వాళ్ళో, తన కొడుకు శరీరంలో ఎలాంటి రక్తం ప్రవహిస్తూందో, దాన్ని అదుపులో ఉంచాలంటే తాను ఎటువంటి పట్టుదల వహించాలో తనకు తెలుసు ననుకుంటుంది. అయినా భర్త జీవలక్షణాలేమైనా కొడుక్కు సంక్రమించాయేమో నన్న ఆలోచన ఆవిడకు కలగకపోదు. కొడుకును శిక్షణలో పెట్టడం మాత్రం మాను కోదు. "తాను శిక్షణ అనుకున్నది సక్రమమైనది కాకపోవచ్చునని" ఆమెకు తట్టక పోవటమే, దానికి కాలం చెల్లిపోయిందని ఆమె గ్రహించకపోవటమే జీవితంలో వైఫల్యానికి కారణం.

"ముప్పైయేళ్ళు వచ్చినదాకా పార్వతి మనసు నిండుగానే ఉన్నది. భర్తతో ఏ మాత్రమూ సహించని దాంపత్య జీవితం గడిపింది. భర్తకు దూరంగా వచ్చేసి పుట్టింటివాళ్ళ అండచేరింది. అప్పుడు కూడా పార్వతి మనసు నిండుగానూ, నిబ్బరం గానూ ఉన్నది. తన మనస్సులో కొడుక్కు పెద్ద ఆవరణ కేటాయించింది. అందు లోంచీ నారాయణ క్రమంగా బయటికి వెళ్ళిపోవటంతో ఆమె మనసు డొల్లకా సాగరంభించింది."

అయితే ఈ డొల్లవల్ల జీవితంలో తల్లి ఎంత ఒంటరితనం అనుభవిస్తున్నదో నారాయణ అర్థం చేసుకోలేక పోయాడు. అతని వాస్తవ ప్రపంచంలోనూ, కళా ప్రపంచంలోనూ ఆమెకు స్థానం లేకపోయింది. ఈ సందర్భంగా రచయిత అంటారు:

"సంఘంలో వర్గాలమధ్య ఉండే గోడలను పోలినవి తరాల మధ్య కూడా ఉంటాయి. పైతరం వాళ్ళు కింది తరం వాళ్ళను అర్థం చేసుకోటానికి ప్రయత్నిస్తారుగాని, ఆ ప్రయత్నం ఫలించదు. కింది తరంవాళ్ళు పై తరాలను అర్థం చేసుకునేటందుకు చెప్పుకోదగిన ప్రయత్నం చెయ్యరు. అది వాళ్ళకి చాలా అనవసరంగా తోస్తుంది. కాలం ఎప్పుడూ ముందుకు పోవటం అందుకు కారణం కావచ్చు. అయినా చిన్నవాళ్ళు కాలానికి ఎదురీదవలసి ఉన్నది."

ఈ తరాలమధ్య అంతరం "రెండు సమాజ వ్యవస్థలకు ప్రతినిధులు గనుక యీ సమస్య రెండు వ్యవస్థలకు అంతరం"గా "ఫ్యూడల్ పితృస్వామిక మనస్తత్వానికి" "బూర్జువా ధర్మాలకూ" జరిగిన ఘర్షణగా మనం భావించవలసి వుంటుంది.* ఈ విషయం నవలాంతంలో స్పష్టమవుతుంది. "నాయనా! నిన్ను ఎట్లా పెంచాలో చాతకాక దూరం చేసుకున్నా... మన అద్దెకున్న వాళ్ళను చూస్తే - ఆ తల్లీకొడుకులు ఎంత ప్రేమగా వుంటారు! వాళ్ళను చూస్తే ముచ్చటేస్తుంది" అని పార్వతి నారాయణతో మృత్యుశయ్యపై వున్నపుడు అంటుంది. "జీవితానుభవం వడగట్టి చివరకు తేలిన నిగ్గు ఆ రెండు ముక్కలే." ఆ ముక్కలో బుల్లి పార్వతి పోషణ విషయంలో, రక్షణ విషయంలో, తన వెనుకబాటుతనం గుర్తింపుకూడా లీలగా వుండివుండాలి. పార్వతి యింట్లో "అద్దెకున్న వాళ్ళు" ధనస్వామ్య ధర్మాల మధ్య జీవిస్తున్నవాళ్ళు. ఆ అంతరాన్ని పార్వతి మృత్యుశయ్య మీద మాత్రమే గ్రహించ గలిగింది.

'అనుభవం' నవల ద్వారా కుటుంబరావు తెల్పిన ప్రాపంచిక దృక్పథ సారం స్థూలంగా : బిడ్డల శిక్షణ, వ్యక్తిత్వ వికాసం కేవలం నైసర్గికంకావు. యాంత్రికం కావు. కుటుంబ ప్రభావాలు, సామాజిక ప్రభావాలూ మధ్యవున్న అనివార్య అన్యోన్య సంబంధంనుంచీ యేర్పడినవి. చారిత్రక శక్తులలోంచీ పుట్టినవి. నిర్దిష్ట లక్షణాలూ, సార్వత్రిక లక్షణాలూ కలిసిన సంకీర్ణ మిశ్రమం అది. నిరంతరం గుణాత్మకమైన మార్పుకు గురి అయ్యేవి. ఆ మార్పు, అడ్డు తగిలే శిథిలాలను నిర్మూలించడం ద్వారానే సాధ్యమయ్యేది.

---

* "యువరక్తంలోని ఉన్నతాశయాలనూ, నీచచాపల్యాలనూ ఒకేగాట కట్టే కుటిల ప్రయత్నం" కాదు ఈ తరాలమధ్య అంతర సిద్ధాంతం. ఈ చర్చకు చూడండి. రా. రా. సారస్వత వివేచన, విశాలాంధ్ర 1976. పుటలు, 80-81. కుటుంబరావు దృష్టి పైకి కన్పించడానికి వర్గాలతో తరాలను పోలిక తెచ్చినా, ఆయన దృక్పథంలో, పాత్రచిత్రణలో వ్యవస్థల అంతరంగానే చిత్రించారు.

కుటుంబరావు వస్తు పరామర్శ యెంత చేసినా అసమగ్రమే కాబట్టి ప్రధాన సమస్యల్ని స్థూలంగా సమీక్షించడమైంది. శిల్పాన్ని గురించి ఒక్కమాట :

తొలి కథ రోజుల్నుంచీ కూడా ఆయన కథా శిల్పానికి తగిన ప్రాధాన్య మిచ్చారు. ఇతివృత్త నిర్వహణలో, సజీవపాత్ర నిర్మాణంలో, స్థలకాల వాతావరణ చిత్రణలో, కథనంలో, క్లుప్తతలో, ఏకత్వసాధనలో, టోన్, శైలిలాంటి తదితర శిల్పాంశాలలో తన పురోగామి ప్రాపంచిక దృక్పథాన్ని సంలీనం చేయడంలో, కథను కళారూపంగా అనుభూతం చేయడంలో ఆయన పనితనం కాస్త కుదురుగా రాసిన ప్రతికథలోనూ కన్పిస్తుంది. కథా రచనలో ఆయన కున్నంత కుదురు నవలా రచనలో, అదీ కాస్త పరిమాణమున్న నవలల్లో కొరవడినట్లు తోస్తుంది. ఆయన రాసిన పెద్ద నవలలు 'చదువు', 'అనుభవం'. 'అనుభవం'లోని నారాయణ పాత్రవికాసం ఆఖరు అధ్యాయంలో కుదురుగా సాగలేదనిపిస్తుంది. దానివల్ల విశ్వస నీయత కొరవడే ప్రమాదం ఉంది. బహుశా ప్రథమ పురుష కథా కథనంలో ఆత్మీ యంగా జీవితాన్ని గురించి చెప్పే విషయజ్ఞుడైన గడుసరి జానపద కథకుడి అలవోక ధోరణి కుటుంబరావుకు ఉందేమో. గల్పికా రచనలో ఆయన పాయింటుకే పరిమిత మైన శిల్ప ఏకాగ్రత అనితర సాధ్యమైనది.

ఆయన రంగస్థల నాటకాలు రచించలేదు. రచించినవి అన్నీ శ్రవ్య నాటికలే. అందువల్ల రంగస్థలానికి సాధారణంగా అవసరంగా కన్పించే తీవ్ర ఘర్షణతో కూడిన నాటకీయత వీటిలో కన్పించదు. వీటిలో కథానికా శిల్పమే వుందని 1965 ప్రాంతాల్లో, ఒకానొక సందర్భంలో ఒక విమర్శక మిత్రుడు అన్నట్లు గుర్తు. నాటక రచనమీద కె. కె. దృష్టి పడివుంటే మరొక కన్యాశుల్కం లాంటి రచన వచ్చివుండే దన్న వాళ్ళు వున్నారు. కుటుంబరావు యితర కథలూ, నవలలతోపాటూ, ఆయన నవలికలూ, పెద్ద కథలూ, నాటికల శిల్పాన్ని లోతుగా చర్చించవలసిన అవసరం ఉంది. ఆ ప్రయత్నం ముమ్ముందు జరుగుతుందని ఆశించవచ్చు.

కుటుంబరావు యెటువంటి సమాజాన్ని పరిశీలిస్తూ వచ్చారో, యెటువంటి సమాజాన్ని విశ్లేషిస్తూ వచ్చారో, యెటువంటి సమాజాన్ని కోరుతూ వచ్చారో యీ రచనలనుబట్టి వూహించుకోవచ్చు. అది 'గోడలులేని సమాజం'. అది పిల్లలు సమాజ భవిష్యత్తు నిర్మాతలుగా తయారయ్యే సమాజం. సంపూర్ణ వ్యక్తిత్వ వికాసానికి తావుండే ప్రపంచం.

అందుకే యీ సంపుటం కూడా...

**కేతు విశ్వనాథరెడ్డి**
సంపాదకుడు

ఆగస్టు 8, 1982

ఈ పునర్ముద్రణ సంపుటిలో అదనంగా నాలుగు కథలను చేర్చారు. అవి : 1. దీపావళి రాజకీయాలు, 2. చురుకైన అబ్బాయి, 3. శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః, 4. సనాతనిస్టు విభ్రమం. దీపావళి రాజకీయాలు పిల్లలకు రాజకీయాలు నేర్పేకథ, మిగతా మూడు కథలు రెండు తరాల ఆలోచనల మధ్య ఉండే భేదాలను, ఘర్షణలనూ చిత్రించే కథలు.

అక్టోబరు 2, 1988 సంపాదకుడు

# సన్నిహితంగా...

రచనా వ్యాసంగం ప్రారంభించిన బహు స్వల్పకాలంలోనే, సాహిత్య ప్రయోజనాన్ని అర్థం చేసుకుని, సమాజంలో వస్తున్న పరిణామాలను అవగాహన చేసుకుంటూ, తన అవగాహనను వివిధ రచనా ప్రక్రియల ద్వారా వ్యక్తంచేస్తూ, పరి తరి ఆలోచనా విధానంపై ప్రగాఢమైన ముద్రవేసిన కుటుంబరావు; తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నంచేసి, ఒక మంచి మలుపుకు తిప్పినవారిలో అద్వితీయుడు.

ఆయన 1947 లోనే 'అభ్యుదయకు'కు రాసిన ఒక వ్యాసంలో, "జీవితం ప్రమాదభూయిష్టం కాదనీ, జీవితానుభవం వెనుక కొన్ని సూత్రాలున్నాయనీ, వాటి సహాయంతో జీవితాన్ని అభ్యుదయ మార్గాల నడిపించవచ్చుననీ, మన రచనలద్వారా మనం చాటాలి. జీవితాన్ని అధోగతికిలాగే శక్తులను అవకాశం దొరికినప్పుడల్లా ప్రతిఘటించి, వాటికి సమాజంలో నిలవనీడ లేకుండా చెయ్యడానికి మనలోవున్న సర్వశక్తులనూ ధారాళంగా ఉపయోగించడం మన విధి. జీవిత పరిణామంలో ప్రజాహితానికి అనుకూలంగా పాటుపడే అన్ని సాధనాలనూ గుర్తించి, వాటిని బలపరుస్తూ, వాటికి విజయం చేకూర్చుతూ, మన కళను ముందుకు నడపడం మన విధి. విద్రోహ శక్తులతో ఈనాడు శ్రామికులూ, శక్తిహీనులూ విజయవంతంగా పోరాడుతున్నారు. ఈ ప్రజాశక్తులను బలపరచడమూ, వీరి అసామాన్య పరాక్రమాలను గుర్తించి, కీర్తించడమూ మన విధి" అన్నారు.

అభ్యుదయ రచయితల దృక్పథం, బాధ్యతలను గురించి ఎంతోకాలం కిందటే, కుటుంబరావు యింత సూక్ష్మంగా, స్పష్టంగా కూడా చెప్పగలిగారు.

అసలు రచయిత దృక్పథం అభ్యుదయ ధోరణిలో కాక, మరేవిధంగా వుంటుందో తనకు తెలియడం లేదని ఒకప్పుడు సందేహాన్ని వెలిబుచ్చిన కుటుంబరావు, ఆ తర్వాత అభ్యుదయ సాహిత్యం ఒక ఉద్యమరూపంలో పఠితలకు చేరువ కావలసిన అవసరాన్ని గుర్తింపారు. అదే సమయంలో కళాత్మకం కానివి, అవాస్తవికం అయిన రచనలు అభ్యుదయ రచనలుగా చలామణి కావడాన్ని ఆయన గర్హించేవారు.

"సాహిత్యకారుడుగా నాకు జీవితం ప్రమాణం. సిద్ధాంతం కోసం జీవితాన్ని వక్రంగా చిత్రీకరిస్తే, ఆ రచన ఉత్తమ రచన ఎట్లా అనిపించుకుంటుందో నాకు

ఏనాడూ అర్థం కాలేదు" అన్నారు కుటుంబరావు ఒక సందర్భంలో.

కుటుంబరావు కథలు, నవలల్లో యథార్థమైన జీవితం ప్రతిబింబిస్తుంది. సమాజంలోని అస్తవ్యస్తత వివిధ పాత్రల స్వభావాల్లో అంతర్లీనంగా కనిపిస్తుంది. ఆ అస్తవ్యస్తత నిర్మూలన కావలసిన ఆవశ్యకతను, ఆయన రచనలు పరోక్షంగా సూచిస్తాయేగాని, ఎక్కడా ఉపదేశాలుండవు.

"ఉపదేశం మన వ్యక్తిత్వాన్ని పరాభవిస్తుంది. ఆలోచన రేపే గుణం వ్యక్తిత్వాన్ని నిద్ర లేపుతుంది" అంటారు కుటుంబరావు.

ఉదాహరణకు, 'తాతయ్య' కథలో ఒక పిల్లవాడి దృక్కోణంలో మన సామాజిక స్థితిగతులను, ఆయన ఎంతో ప్రతిభావంతంగా చిత్రీకరించగలిగారు.

సాధారణంగా ఆయన సాహిత్యం గురించి చర్చిస్తున్నప్పుడు, తన రచనల ప్రస్తావన తీసుకువచ్చేవారు కాదు. ఎవరైనా ప్రత్యేకంగా కొన్ని రచనలు పేర్కొని ఆయనను ప్రశంసించినప్పుడు, తేలిగ్గా నవ్వేసి, ప్రసంగాన్ని మరోవైపు మళ్ళించేవారు. అయితే, 'తాతయ్య' కథ గురించీ, తన 'ఎదుగుదల' గురించీ, ఆయన నిర్మొహమాటంగా యిలా రాశారు :

'తాతయ్య' అనే కథ రాసి, చాలా గొప్ప పని చేసినట్లు సంతోషించాను. నా కథ చూసి నాకు తృప్తి కలగడం అదే మొదటిసారి. ఆ కథను తెలుగువాడు తప్ప రాయలేడు. తెలుగు వాళ్ళలో కూడా నేను తప్ప మరొకరు రాసే అవకాశం లేదు. 'తాతయ్య' రాసేనాటికి నేను కథా రచన ఆరంభించి ఆరేళ్ళయింది. ఆ కథతోనే నేను వూహా ప్రపంచం నుంచి వాస్తవిక ప్రపంచంలోకి రావడం మొదలు పెట్టాను. ఈ రావటం పూర్తి కావటానికింకా రెండేళ్ళు పట్టింది. ఈ మార్పు కంతటికీ యుద్ధం చాలా తోడ్పడింది. (నా కథారచన, ఆంధ్రజ్యోతి 24-8-80).

కుటుంబరావు కథలు లేదా నవలల్లో నయాగరా జలపాతమంత ఉధృతంగా సాగే భావోద్రేక ప్రధానమైన సంఘర్షణలు కానీ, 'నాటకీయత' కానీ, విస్తృతమైన 'ఆకర్షణీయమైన' యితర విన్యాసాలు కానీ కనిపించవనీ, అందువల్ల అవి ఈనాటి కొందరు ప్రముఖ రచయితల రచనల్లా, పాఠకులను ఆకట్టుకోలేవనీ కొందరి ఫిర్యాదు. నిజానికి పాఠకులను ఆకట్టుకునేలా తను రాయలేక పోతున్నట్టుగా కుటుంబరావు ఎన్నడూ అనుకోలేదు. అలా అని పై లక్షణాలున్న కథలను ఆయన అభిమానించడమూ మానలేదు.

కుటుంబరావు కాల్పనిక సాహిత్యశైలి గంభీరంగా సాగే నదీప్రవాహం- ఒడిదుడుకుల్లేకుండా సాగే ఆ ప్రవాహంలో, పాఠకుడు ప్రశాంతంగా గమ్యం చేరతాడు. అయితే, ప్రయాణం గురించి ఆలోచించక మానడు.

ఆయన రచనలు, అవి కథలు కానీయండి, గల్పికలు కానీయండి—వాటిలో వ్యంగ్యం, హాస్యం అంతర్లీనంగా వుంటూ పఠితలను ఆకర్షిస్తాయి.

'మధ్యవర్తి' కథలో తండ్రి దశరథ రామయ్యా, కొడుకు హనుమంతరావూ యిలా మాట్లాడుకుంటారు :

"అసలు నువ్వు నా కొడుకువే కాదు. పో ముందు బయటికి"—తండ్రి.

"అదేమో నీకు తెలియాలి. మా అమ్మకు తెలియాలి. నేను మాత్రం వెయ్యి రూపాయలు పెడితేనేకాని ఎక్కడికీ కదిలేదు లేదు"—కొడుకు.

కుటుంబరావుకు వ్యక్తులలో వుండే 'హిపోక్రసీ" అంటే మహా చిరాకు. 'రంగయ్య తాతగారి పరువు మర్యాదలు' కథలో కృత్రిమ జీవన విధానాన్ని, మనుషుల్లోని కపట స్వభావాలను చక్కగా ప్రతిఫలింప చేశారు. 'హిపోక్రసీ'ని దుయ్యబట్టే ధోరణి, మరికొన్ని యితర కథల్లో కూడా కనిపిస్తుంది; ప్రత్యక్షంగా కాదు, పరోక్షంగా.

రచయితలు ఎప్పుడికప్పుడు ఆత్మవిమర్శ చేసుకోవాలని ఆయన భావించే వారు. తన రచనల్లో ప్రతిపాదించిన అంశాలను సైతం, ఆలోచించమన్న ధోరణిలో తప్పితే, ఖచ్చితంగా నమ్మితీరాలన్న ధోరణిలో ఎన్నడూ చెప్పేవారు కాదు.

'నా కథా రచన' అన్న వ్యాసంలో, "సామ్యవాదము, సోషలిజం, కమ్యూనిజం, డయలెక్టికల్ మెటీరియలిజం, మార్క్సిజం, అనే మాటలు నన్ను చుట్టుముట్టి నప్పుడు కూడా, నేను వాటిని గురించి సరైన అభిప్రాయాలు సంపాయించడానికి ప్రయత్నించలేదు. జీవితం నాకు అయోమయంగా కనిపించింది. ఆ అయోమయత్వం జీవితంలో స్వతస్సిద్ధంగా వుందనే విశ్వాసంతో, దాన్నికూడా కథలలో పెట్టాను. వాటిని తీవ్రంగా విమర్శించినవారు లేకపోవడం నా దురదృష్టం" అని రాశారు.

తెలుగు సాహిత్యం అభివృద్ధి చెందవలసినంతగా అభివృద్ధి చెందకపోవడానికి ప్రధాన కారణం, నిర్మాణాత్మకమైన విమర్శ ఎక్కువగా లేకపోవడమేనన్నది కుటుంబరావు భావన. ఆ మాటకొస్తే, "విమర్శ కూడా విమర్శకు గురికావాలి. సాహిత్య, సాంస్కృతిక విమర్శకావాలి. కుక్కలాగా పనిచెయ్యందే సాహిత్యానికి వర్తమానంకాని, భవిష్యత్తుకానీ లేదు" అంటారు కుటుంబరావు.

ఈ మాటలన్న కుటుంబరావుకు విమర్శకుడి బాధ్యత గురించి కూడా ఒక అవగాహన వుంది. "ఏ రచనకైనా ఆధారభూతమైనవి (1) రచించడానికి ఉద్రేకం (Inspiration) (2) రచయితయొక్క ఆశయం. (3) రచనా విధానం (లేక) శిల్పం. ఈ మూడూ కూడితేనే కానీ రచన కలగదు. రచయిత యందు ఈ మూడూ

ఏ స్వరూపంలో వున్నవో తెల్సుకునిగాని రచయితయొక్క గుణగణాలు నిర్ణయించ రాదు" అని 1937 అగస్టు సంచిక 'భారతి'లో రాశారు. ప్రసిద్ధ రచయితగా గుర్తింపు పొందిన తరవాత, పలు గ్రంథాలను సమీక్షించి, ప్రతిభగల విమర్శకుడిగా కూడా ఆయన పేరుపొందారు.

కుటుంబరావు సృష్టించిన పాత్రలు కొన్ని విలక్షణమైనవి. మరొకరెవరూ ఆ ధోరణిలో మలచలేరేమోనన్న విధంగా వుంటాయి ఆ పాత్రలు. అదే, ఆయన రచనా విధానంలో వున్న ప్రత్యేకత.

'అక్క పెళ్ళి'లో సీత, 'దుక్కిటెద్దు'లో గృహ యజమాని కిష్టయ్య, 'చిన్నతనపు పెళ్ళి'లో కృష్ణారావు, 'సవతితల్లి'లో రాజ్యం, 'గండం'లో సుందరి, 'అంపకాలు'లో చిట్టి, 'నిష్కామకర్మ'లో తండ్రి ఇలా వివిధ పాత్రలు మనలను పరిపరివిధాలుగా ఆలోచింపచేస్తాయి.

'ఒక తల్లి పిల్లలు' నాటకంలో బంధువుల మనస్తత్వాలు, 'దేవుడింకా వున్నాడు'లో మూఢనమ్మకాలు, అసంపూర్తికథ 'ఎందుకూ కొరగాడు'లో పిల్లల పెంపకానికి సంబంధించిన ధోరణి ('సవతి తల్లి'లో యీ అంశాన్నే మరింత విస్తృతంగా చర్చించారు.)— ఈ విధంగా ఏ రచన తీసుకున్నా, అది కుటుంబ రావు జీవితాన్ని పరిశీలించి, అవగాహన చేసుకున్న తీరును ప్రతిబింబిస్తుంది.

ఈ సంపుటిలో విశేష ప్రాధాన్యంగల మరొక రచన 'అనుభవం' నవల.

"సాహిత్యంలో జీవిత విశ్లేషణ ఉంటుంది. జీవితం స్పష్టం చేయలేనిదాన్ని సాహిత్యం స్పష్టం చేస్తుంది" అంటారు కుటుంబరావు.

'అనుభవం' నవల కొన్ని దశాబ్దాల తెలుగు జీవితాన్ని వివిధ కోణాలలో విశ్లేషించి చూపుతుంది. ఈ నవలలోని ప్రధాన పాత్ర పార్వతి జీవితంపై భూస్వామ్య వ్యవస్థ ప్రభావం, ఆమె అనుభవించిన సంఘర్షణ, ఆమె కళ్ళముందే సంభవించిన మార్పులు, ఆ మార్పులను ఆమె అవగాహన చేసుకున్న తీరూ ప్రతిబింబిస్తాయి. పురోగమనానికి ఆటంకంగా పరిణమించే దోపిడీ ఆర్థిక విధానం, సామాజిక జీవితాన్ని ఎంత అస్తవ్యస్తం, కలుషితం చేస్తుందో ఈ నవల చిత్రీకరిస్తుంది.

'ఈ నవలలోని పాత్రలు మనకు తెలిసిన వ్యక్తులే; ఇలాంటి సమస్యలు జీవితంలో తటస్థపడేవే!' అన్న భావం మనలో కలగడానికి, వాటిని గురించి మనం ఆలోచించేలా చేయడానికి కారణం కుటుంబరావు జీవితాన్ని అంత వాస్తవికంగా చిత్రీకరించిన తీరు.

ఆ విధంగా ఆయన ఎప్పుడూ తనకు తెలిసిన జీవితాన్ని, తన ధోరణిలో విశ్లేషించి రాయడానికే ప్రయత్నించారు. "శిల్పమూ, భాషా రచయితకి ముఖ్యం

కాదని కాదు. అవి చాలా ముఖ్యం. ఐతే, అవి కథా రచనకు మూలపరికరాలు. ముడిపదార్థం జీవితం" అని కుటుంబరావు భావించారు. తెలుగు ప్రజల జీవన విధానాలను మరింత లోతుగా పరిశీలిస్తూ తాను స్పందన పొందుతూ, పఠితలలో ప్రేరణ కలిగించే రచనలు చేయలేకపోతున్నానని ఆయన భావించిన నాటి నుంచీ కల్పనా సాహిత్య రచనకు ఆయన దూరం కావడం జరిగింది. రచయితగా యిది ఆయన నిజాయితీనే వ్యక్తం చేస్తుంది.

జీవితాన్ని మార్క్సిస్టు దృక్పథంతో విశ్లేషించి రచనలు చెయ్యడంలో ఆయన చూపిన పంథా, ప్రతి సాహిత్యాభిమానీ పరిశీలించదగ్గది. ముఖ్యంగా 'తమదీ మార్క్సిస్టుధోరణి' అని అనుకుంటూ, ఎన్నో విధాలుగా గందరగోళానికి గురయ్యే, 'అభిమానులు' కొందరు— తప్పనిసరిగా ఆయన రచనలను నిశితంగా పరిశీలించాలి. కుటుంబరావు సమగ్ర సాహిత్య సంపుటులు అలాంటి పరిశీలనకు ఎంతగానో దోహదం చేయగలవని నా అభిప్రాయం.

వ్యక్తిగా కుటుంబరావు ఉదారత, సౌజన్యం, నిరాడంబరత, నిరంతరం, తానొక 'విద్యార్థి' అన్న భావంతో జీవితాన్ని అధ్యయనం చేసే మనస్తత్వం, తన నమ్మకాలపై వున్న దృఢవిశ్వాసం ఆయనకు సన్నిహితులైన వారందరూ బాగా ఎరిగినదే. ఆర్థికమైన యిబ్బందులు, ఇతర వత్తిడులూ ఎదురైన క్లిష్ట సమయాలలో కూడా, ఆయన ఏనాడూ ఆత్మ వంచన చేసుకుని తలవంచలేదు. ఇది, మధ్యతరగతి నుంచి వచ్చిన మేధావుల్లో అంతగా కనబడని ప్రత్యేక లక్షణం.

రచయితలు ఎటువంటి రచనలు చెయ్యాలన్న విషయంలో కూడా ఆయనకు స్పష్టమైన అభిప్రాయాలున్నవి. "సమాజంలో అసహాయులుగా వున్నవారిలో చైతన్యమూ, బెదిరివున్న వాళ్ళకు ధైర్యమూ, వ్యక్తిత్వం కోల్పోయిన వాళ్ళకు వ్యక్తిత్వమూ యివ్వడంకన్న రచయిత తన రచనలద్వారా చేయగల ఉత్తమమైన పని ఏమన్నా వుందా ? లేదనుకుంటాను. తనను జీవితం హింసించినప్పుడూ, కవ్వించినప్పుడూ, తనకు కలిగే మనోభావాలను, క్షమిగిలిన సామాజికులతో పంచుకోవాలనే ఆవేదన ప్రతి రచయితకూ, కవికీ, కథకుడికీ, నాటకకర్తకూ బలంగా వుండి తీరాలి. అప్పుడే అతని అనుభవం అందరి అనుభవమూ అవుతుంది. అట్లాగే రచయిత ఒక సంఘటనలో ఒక జీవిత సత్యాన్ని చూడగలిగినప్పుడు, దాన్ని అందరితోటీ పంచుకోవాలి.

"దుర్భరమైన జీవిత సమస్యలకింద నలిగేవాళ్ళు చాలామంది జీవితంలో వున్నారు. కథలు చిత్రించవలసింది వాళ్ళనుకాదు, ఆ సమస్యలను పరిష్కరించటానికి ప్రయత్నించేవాళ్ళని!"

ఈ మాటలు వర్ధమాన రచయితలకే కాదు, సాహిత్యాభిమానులందరికీ వర్తిస్తాయి. ఈ సంపుటిలో ప్రచురితమైన కుటుంబరావు రచనలు సమీక్షించడం నా ఉద్దేశం కాదు. అర్ధ శతాబ్ద కాలంలో, తెలుగు సాహితీరంగంలో కుటుంబరావు నిర్వహించిన పాత్ర ఎన్నెన్నో జ్ఞాపకాలకు దోహదం చేస్తుంది. ఆ జ్ఞాపకాలకు సంక్షిప్తంగా యిచ్చిన రూపకల్పనే యిది.

మద్రాసు
జూలై 6, 1982

దాసరి సుబ్రహ్మణ్యం

# తన రచనల గురించి...

('సవతి తల్లి' లోని రాజ్యం, 'సరోజ డైరీ' లోని సరోజ పాత్ర సృష్టిలోని వైవిధ్యాన్నీ, పాత్ర చిత్రీకరణ యొక్క లక్ష్యాన్నీ తెలియ చేసే 'పాత్రలతో ముఖాముఖీ' యిది)

రాజ్యం : నమస్కారమండీ.

నేను : ఎవరమ్మాయీ నువ్వూ? ఏమనుకోకు. నేను చూసిన మనుషులని నేను మరచిపోతుంటాను. కాస్త జ్ఞాపకం చేస్తే—

రా : నన్ను మీరు పరీక్షగా ఎన్నడూ చూడలేదు. అందుచేత గుర్తించలేకుండా ఉన్నారు.... నేను రాజ్యాన్ని.

నేను : చెప్పినా జ్ఞప్తి రావటంలేదు. నువ్వన్నట్లు, నేను మొహాలు అంత శ్రద్ధగా గమనించను.

రా : అందుచేతేనేమో, నన్ను గురించి ఏమీ వర్ణించలేదు.... ఆ పిల్ల ఏమంత ఆకర్షవంతంగా లేదు.... అని అనేసి వొదిలేశారు.

నేను : నేనా? నాకు నిజంగా జ్ఞాపకం రావటంలేదు, నీలో ఏమంత ఆకర్షణ లేదనటం తప్పే. నీకేం వంకర వచ్చింది? ఆ కళ్ళూ, ముక్కూ— అంతా బాగానే వుందే.

రా : మీకు వర్ణించటం ఏమీ చేతకాదు, ఊరుకోండి, అయినా నాకేం బాధలేదు. నాకు సంబంధించినంతవరకు మీరు యేమంటే అదల్లా ఖాయమే.

నేను : ఎందుకట్లా?

రా : నేను మీరు సృష్టించిన పాత్రను గనకా.

నేను : అదా సంగతి? ఆ సంగతి మొదటనే చెప్పకపోయావా? రా, కూర్చో.... నీ పుట్టు పూర్వోత్తరాలు కాస్త జ్ఞాపకం చేస్తావా ఏమిటి?

రా : నేను చలపతిరావు చెల్లెల్ని. దాసు అనే ఒక బడిపంతులు రెండో భార్యను. గోపీ, సత్యం అనేవాళ్ళు నా సవతికొడుకులు. నేను వాళ్ళ సవతి తల్లిని.

నేను : ఇక చెప్పక్కర్లేదు. అంతా జ్ఞాపకం వచ్చింది. నేను నీకు చాలా కృతజ్ఞుణ్ణి.

రా : ఎందుకూ?

నేను : అట్లా అడగకూడదు. కాని అడిగావు గనుక చెబుతున్నాను. నేను సృష్టించిన అన్ని పావులకన్న నీ మూలంగా ఎక్కువ ఆర్థికలాభం పొందాను. అంత కన్న వివరాలు అడక్కు.

రా : ఆర్థిక లాభం తప్ప మీ కింకేమీ పట్టదా?

నేను : పట్టదని ఎందుకనాలిగాని, మిగిలినవి వివాదాంశాలు. డబ్బు ఒక్కటే నిర్వివాదాంశం.

రా : కీర్తి మాటేమిటి? నామూలంగా మీకేమి కీర్తి రాలేదా?

నేను : చెప్పానుగా? కీర్తి వివాదాస్పదం. ఒక్క ఉత్తరం వచ్చింది. అది రాసిన వారు నన్ను మెచ్చుకున్నారు. శరత్‌తో పోల్చారు. ఆ ఉత్తరం పొరపాటున ఇంకోర్ని చూడనిచ్చాను. వాళ్ళకు కోపం వచ్చింది. దానికి దానికి చెల్లు ఏమంటావ్?

రా : నన్ను చాలా నిరుత్సాహపరిచేశారు. నన్ను కీర్తికోసమే సృష్టించారని ఇంత కాలం అనుకుంటున్నాను.

నేను : నీదగ్గర నాకు దాపరికం ఎందుకు? ఒక కథల పోటీలో కేవలం ఒక్క వంద రూపాయలు చేసుకుందామనుకుని నిన్ను సృష్టించాను. రాదని నా అంతరాత్మ చెబుతూనే వుంది.

రా : ఏం?

నేను : ఏమంటే ఏం చెప్పను? నేను ఏ పోటీలోనూ గెలవను. అది మా ఇంటా వంటా కూడా లేదు. అనుకున్నంతా అయింది. నువు పోటీలో చిత్తుగా ఓడావు. నీ తప్పనను. తప్పు నాదే. ఎందుకంటావా? ఒకటి, నిన్ను సృష్టించింది నేను గనకా. రెండు, పోటీలలో ఓటమి నాకు పరిపాటే గనకా. అయినా ముగ్గురు జడ్జీలు కలిసి నిన్ను లాగి అవతల పారేసేసరికి నాకు నీ మీద ఏదో ఏవగింపు కలిగినమాట నిజం. దాచటం దేనికి? ఒకరిద్దరు స్నేహితులు నిన్ను ఏ పత్రికకన్నా అమ్మేసి అయిదో, పదో చేసుకోమన్నారు. నేను వినిపించుకోలేదు. నీమీద పెద్ద ఆశ పెట్టుకున్నానేమో, ఆ ఆశ నిరాశ అయేసరికి విరక్తి కలిగింది. కాని అంతలోనే నీకు గొప్ప అవకాశం ఒకటి వెతుక్కుంటూ వచ్చింది.

రా : అంటే, మీరు డబ్బు చేసుకునే అవకాశమా?

నేను : కోప్పడకు. నేను బమ్మెరపోతనను కాను.

రా : నన్ను సృష్టించటంలో మీకు ఏ ఆదర్శమూ లేనేలేదా?

నేను : ఉన్నట్టు నాకు గుర్తు రావటం లేదు. ఒకవేళ మరిచిపోయివుంటే జ్ఞాపకం చెయ్యి.

రా : నేను ఆదర్శప్రాయురాలైన సవతి తల్లిగా ఉండాలని మీ ఉద్దేశం కాదా ?

నేను : పాపం శాంతించుగాక. మొదలు, ఆదర్శప్రాయమైన సవతితల్లి ఎట్లా ఉండాలో నాకే తెలీదు. అటువంటి అభిప్రాయం కలిగేటట్టు ఏమైనా రాశానా కొంపతీసి ?

రా : మీరు రాశారని నే ననటంలేదు. కాని చదివేవాళ్ళు మీరు రాసిందే చదవాలని ఎక్కడుంది ? మీకు అదివరకు తెలియకపోతే ఇప్పుడు తెలుసుకోండి. నేను ఆదర్శప్రాయురాలైన సవతితల్లిగా కొంత చలామణీ అయాను.

నేను : చిన్నతనంలో నేను ఎక్కడో ఒక సవతితల్లికథ చదివాను. ప్రేమచందో మరొకరో రాసిన హిందీ కథకు అనువాదం. అందులోని సవతితల్లి ఆదర్శవంతంగా కనిపించింది. కాని నువు అటువంటిదానివి కావే. నీ అంతరాత్మసాక్షిగా నువ్వు చెప్పు.

రా : సవతి పిల్లల్ని నానా తిప్పలూ పెట్టలేదు గనుక నేను ఆదర్శప్రాయురాలినయా ననుకో రాదా ?

నేను : అవును. ఆ సంగతి కొంచెం నాకు విప్పి చెప్పు. నువు నీ సవతి పిల్లల్ని నిజంగా ప్రేమించావా ?

రా : లేదు, చాలా అసహ్యించుకున్నాను కూడా. మరీ పెద్దవాడు గోపీని. కాని వాళ్ళు నా సవతి పిల్లలని నేను అసహ్యించుకోలేదు. వాళ్ళ పెంపకాన్ని అసహ్యించుకున్నాను. రెండోవాడు సత్యాన్ని చూస్తే జాలివేసింది. వాళ్ళను అట్లా చేసిన వాళ్ళను ఎదురుగా చూడగానే నా కోపమంతా వాళ్ళ మీదికి తిరిగింది. ఆ వితంతువు లిద్దరూ ఎదట లేకుండా, ఆ పిల్లలు మాత్రం నా పాలపడి ఉంటే నేను వాళ్ళపట్ల ఎట్లా ప్రవర్తించి ఉందునో నాకే తెలీదు. కాస్త చదువుకున్న మనిషి, ఇతరులలో కుళ్ళు సహించలేని మనిషి ఏం ఏం చేస్తుందో నేను సరిగా అదే చేశాను. అంతకంటె ఎక్కువ ఏమీ చేయలేదు. ఆ వితంతువులు ఎదట ఉన్నంతకాలం నాకు వాళ్ళు భర్తవేపు బంధువులన్న ఆలోచనగాని, ఆ పిల్లలు నాకు సవతి పిల్లలవుతారన్న ఆలోచనగాని కలగనేలేదు.

నేను : నేను ఉద్దేశించినదీ అదే.

రా : మీరు ఉద్దేశించినట్టే జరగాలని ఎట్లా చెప్పటం ? నే నిప్పటొక ఫాషన్ అయికూచున్నాను. ఈమధ్య నన్ను బోలిన సవతితల్లులు బయలుదేరుతున్నారు.

నేను : బయలుదేరనీ.

రా : నాకు వాళ్ళంతా పోటీ వస్తుంటే చూస్తూ ఊరుకోమంటారా ?

నేను : ఎవరో నీకు పోటీ వస్తున్నారని నీ కెందుకు మంట ? నీకు ముందు నీకన్న ఎంతో ఆదర్శప్రాయమైన సవతి తల్లులున్నారు. నీ తరవాత నీ తలదన్నిన వాళ్ళు వస్తారు. నువ్వు ఉడుక్కుని లాభంలేదు.

రా : (రోషంతో) కీర్తికూడా దక్కకపోతే నాకింక ఏం దక్కినట్టు; నాకు మీరే మిచ్చారు? అందం ఇవ్వలేదు. ఒకగొప్ప మొగుణ్ణివ్వలేదు. డబ్బు ఇవ్వలేదు. నా జీవితంలో రొమాన్స్‌లేదు. ప్రణయంలేదు. నాకు మూడింతలు వయసుగల ఒక అత్తగారినీ, రెట్టింపు వయసుగల ఒక ఆడబిడ్డనూ, ముద్దూ మురిపెమూ లేని సవతి పిల్లల్నీ ఇచ్చారు. కనీసం నన్ను ఆదర్శప్రాయురాలైన సవతి తల్లిగా కూడా సృష్టించలేదు. పైపెచ్చు నన్ను డబ్బుకాసించి సృష్టించినట్టు కుండ పగలేసి చెప్పేస్తున్నారు. ఎంత దారుణం. ఎంత అన్యాయం .... ఈవిడ ఎవరు ?

సరోజ : హల్లో, హల్లో, జ్ఞాపకం ఉన్నానండీ ?

నేను : నేను సృష్టించిన పాత్రను నేనే మరచిపోతానా, సరోజా ! రా ? ఇట్లా కూచో.....ఈవిడ తెలుసునా ? రాజ్యం అని, సవతి తల్లిలో పాత్ర రాజ్యం. ఈ అమ్మాయి సరోజ. ఈ పిల్ల డైరీ ఒకటి నేను రాశాను.

రాజ్యం : చాలా అందంగా ఉందే? మీరు నాబోటివాళ్ళనే సృష్టిస్తారనుకుంటున్నాను.

నేను : ఆఁ. ఏమిటో ప్రపంచంలో అందమైనవాళ్ళు మాత్రం ఉండరా ?

సరోజ : ఏమండీ, రాజ్యంగారూ? మీ సంగతి నాకేమీ తెలియదు. మీ జీవితంలో కూడా రొమాన్స్ ఉందా?

రాజ్యం : నా జీవితంలో కూడా అంటే మీ జీవితంలో ఉందా?

సరోజ : ఓయెస్. ఆ రొమాన్స్ తల్చుకుని నేను గర్వపడతాను. నేను ఎటువంటి పరిస్థితుల్లో ఎటువంటి భర్తను సంపాదించుకున్నాను. ఆంధ్రదేశం మొత్తం మీద నా అంత అదృష్టవంతురాళ్ళు ఇంకో ఇద్దరు దొరుకుతారా అని. అన్నిటికన్న చిత్రమేమంటే నా పెళ్ళి జరగడానికి అవసరమైన ప్రయత్న మంతా నేనూ, నా భర్తా మాత్రమే చేశాం. మిగిలినవాళ్ళంతా మాకు ఎదు రన్నమాటే. నా పక్షాన పేరుకు మా అమ్మ ఉందన్నమాటేగాని, ఆమె అందరికన్నా ప్రతిబంధకం. అటువంటి పరిస్థితుల్లో పెళ్ళి జరిగింది.

రాజ్యం : మీకు రోతపుట్టించే అత్తగారుగాని, వదినెగారుగాని, పసిపిల్లలుగాని లేరా ?

సరోజ : నాన్సెన్స్. అటువంటివేమీలేదు.

రాజ్యం : పోనీ, మీరు ఒక ఆదర్శపాత్రగా లోకంలో చెలామణీ అవుతున్నారా ?

సరోజ : నేనూ ఒకళ్ళకు ఆదర్శంగా ఎందుకుండాలీ ? నాకు కావలసిన జీవితం నాకున్నది. మిగిలినవాళ్ళ గొడవ నాకు దేనికీ ?

రాజ్యం : మీకు ఇమిటేషన్లు బయలుదేరలేదూ?

సరోజ : నన్ను ఒకళ్ళెందుకు ఇమిటేట్ చెయ్యాలి?

రాజ్యం : నన్ను సృష్టించిన మనిషే మిమ్మల్ని కూడా సృష్టించి ఉండటం చాలా చిత్రంగా ఉంది.... ఏమండీ ఈ సరోజను కూడా స్వార్థంతోనే సృష్టించారా?

నేను : అట్లా నిలదీసి అడగటం భావ్యంకాదు. నిజం చెప్పాలంటే, సరోజ వల్ల నాకు చెప్పుకో దగిన లాభం ఏమీ రాలేదు.

రాజ్యం : అయితే మీరీ సరోజను ఎందుకు సృష్టించారో చెబుతారా?

నేను : నిజం చెప్పాలంటే, నిన్నెందుకు సృష్టించానో, సరోజనూ అందుకే సృష్టించాను.

రాజ్యం : నన్ను డబ్బుకోసం సృష్టించాననికదా చెప్పారు?

నేను : నేనామాట అనలేదే? నీవల్ల డబ్బు వచ్చినందుకు కృతజ్ఞుణ్ణన్నాను. ఆశించినప్పుడు డబ్బు రాకపోయేసరికి ఆశాభంగం కలిగిందన్నాను. డబ్బుకన్న కీర్తి వివాదస్పదమైన దన్నాను. అంతేగాని నిన్ను డబ్బుకోసమే సృష్టించానని నేను అనలేదు. అయినా, నువ్వింతకుముందు చెప్పినట్టు, నేను అన్న మాటలే ఇతరులు అర్థం చేసుకోవాలని ఎక్కడుంది?

రాజ్యం : మీరన్నదే నిజమని ఒప్పుకుంటున్నాను. అయితే ఈ సరోజ ద్వారా మీకు డబ్బురాలేదన్నారు; కీర్తి అయినా వచ్చిందా?

నేను : వచ్చిందని చెప్పలేను. సరోజనుంచి నేను నిజానికి కీర్తి ఆశించలేదు. ఆ మాటకు వస్తే డబ్బూ ఆశించలేదు.

రాజ్యం : అయితే ఎందుకు సృష్టించారు.

నేను : రచయితలు బ్రహ్మదేవుళ్ళకారు. పాత్రలను సృష్టించటంలో పరిస్థితుల ప్రోద్బలం చాలా వుంటుంది. ఆ మాటకొస్తే బ్రహ్మదేవుడు కూడా పరిస్థితులకు కట్టుబడినవాడే— తన ఇష్టం వచ్చిన ప్రాణిని సృష్టించలేడు! తల్లిదండ్రులను అనేక విషయాలలో పోలిన పిల్లల్నే సృష్టించగలడు. కనుక నేను కూడా పాత్రలను పరిస్థితుల ప్రోద్బలం వల్ల సృష్టించటం జరిగిందని ఒప్పుకుంటాను. అనేక కారణాంతరాల చేత సరోజను సృష్టించటం తప్పనిసరి అయింది. ఆమె అందగత్తె కావటం, ఒక యువకున్ని ప్రేమించటం, ఆ యువకుడు ఆమెను ప్రేమించటం, వారిద్దరి పెళ్ళికి అనుకూలం కాని పరిస్థితులు ఏర్పడటం— అంతా తప్పనిసరి అయింది.

రాజ్యం : అది నమ్మశక్యం కాకుండా వుంది. నన్ను ఎంతసేపూ గుర్తించలేక పోయిన మీరు ఈ సరోజను సులువుగా గుర్తించారు! నేను గమనించ లేదనుకోండి. నాకు చూడగా ఏం తోస్తున్నదంటే, మీరు ఈ సరోజను మీ ఆనందం కోసం సృష్టించుకున్నట్టు కనిపిస్తుంది. అందుకనే ఆమెను అందగత్తెను చేశారు. ఆమెకు ప్రణయం కల్పించారు. ఈడు జోడైన భర్త నిచ్చారు, ఇద్దరికీ సుఖంగా పెళ్ళి చేశారు. నేను ? నాకేముంది? నా భర్తను ఇష్టపడి చేసుకున్నానా? ఆ భర్త నన్ను ప్రేమించాడా? నేనాయన్ని ప్రేమించానా? నాకే తెలీదు. తెలుసుకునే అవకాశం కూడా నాకు మీరివ్వ లేదు. పిల్లను పెంచే దాదికీ నాకూ ఏమి తేడా? నేను పెంచిన పిల్లలు కనీసం నా పిల్లలన్నా కారే.

నేను : నీకా విచారం వద్దు. నిన్ను గురించి ఇంకా రాస్తాను. నీ సవతి పిల్లల్ని చంపేస్తాను. నీ భర్తకూ నీకూ ప్రణయం పెడతాను. నిన్ను బ్యూటీ స్పెషలిస్టు దగ్గిరికి పంపించి చాలా అందగత్తెనుగా తయారు చేయిస్తాను. తృప్తిపడతావా?

రాజ్యం : అప్పుడు నాకూ సరోజకూ ఉండే తేడా కాస్తా పోతుందా?

నేను : పోనీ సరోజకు స్ఫోటకం, పక్షవాతం మొదలైనవి తెప్పించి వికారంగా చేసేస్తాను. ఆమె భర్త ఇంకొకతెను ప్రేమించినట్టు చేస్తాను. నీకు తృప్తి కలుగుతుందా? కలిగే పక్షంలో ఇంకొక కథ రాస్తాను.

రాజ్యం : అప్పుడు ఆ పాత్ర సరోజే కాదూ.

నేను : నిన్ను మార్చేస్తే నువ్వయినా అంతేగదా?

రాజ్యం : అవును. నేను మారటానికి ఎంత మాత్రం ఒప్పుకోను.

నేను : ఎందువల్లా?

రాజ్యం : నా వ్యక్తిత్వం భంగమవుతుంది. నేను సనాతనత్వంతో పోరాడాను. అందులో నాకు ఆనందం ఉందని ఒప్పుకుంటాను. దానును కాకుండా ఇంకొకరిని పెళ్ళాడి ఉంటే నాకా అవకాశం చిక్కేది కాదేమో. పెళ్ళి అయి భర్త దగ్గరికి వెళ్ళేదాకా నేను చాలా సామాన్యమైన వ్యక్తిని. మా అన్నకు బరువుగా ఉన్నానేమో అన్న అనుమానమే నన్ను ఆ పెళ్ళికి ఒప్పించింది కూడా. ఎప్పుడైతే నా అత్తగారూ ఆడబిడ్డా తటస్థపడ్డారో అప్పుడు నాలో ఉన్న శక్తి ఏదో పైకి వచ్చింది. వాళ్ళను ఓడించటం, ఆ పిల్లల్ని జయించు కోవటం నాకు ఆనందం ఇచ్చినమాట నిజం.

వేను : సరోజా, నీ సంగతేమిటి ? నీకు అన్నీ అనుకూలంగా చేసిపెట్టానని రాజ్యం ఆక్షేపిస్తున్నది. ప్రతికూల పరిస్థితులు సృష్టిస్తే నువు సమ్మతిస్తావా ?

సరోజ : ఆవిడ అనుకూల పరిస్థితులని అనుకునే వాటన్నిటితోనూ నేను పోరాడ వలసి వచ్చింది. నాకు అందం ఉన్నది. ఆ అందం నేను ప్రేమించిన యువకుణ్ణి ఆకర్షించింది. మా అమ్మ నాకా కుర్రవాణ్ణి చెయ్యటానికి నానా అగచాట్లూ పడుతున్నది. కాని వీటన్నిటినీ నేను ప్రతిఘటించాను. అతని దగ్గిర సావిత్రి తెలివితేటల్ని సాధించాను. అతను నా అందం చూసి ముగ్ధ డవుతున్నట్లు కనిపిస్తే నాచాతనయినమటుకు నిరుత్సాహపరిచాను. నన్నతని కిచ్చి పెళ్ళి చెయ్యటానికి మా అమ్మ చేసిన ప్రయత్నానికల్లా ఏదో ఒక అడ్డుపుల్ల వేశాను. ఇదంతా చాతగానితనంకాదు. మా అమ్మ అనుకున్నట్టు పెడసరం కూడా కాదు. వాస్తవ ప్రపంచంలో అందానికీ, ప్రేమకూ దమ్మిడీ విలువలేదని నేనెరుగుదును. పోటీయే జరిగితే సావిత్రిముందు నాకు ఏ స్థానమూ లేదు. అందుచేత అతన్ని సావిత్రి చేసుకుంటే నాకు విచారం కలగకుండా ఉండగలందులకూ, అతనికి నా మీద ఉండే ప్రేమ నిజంగా బలమైనదైతే అది అడ్డంకులన్నిటినీ ఛేదించాలనే ఉద్దేశంతోనూ నేను నాకు అనుకూల పరిస్థితులలో పోరాటం సాగించవలసి వచ్చింది. మాది నిజమైన ప్రేమ కథ. ఎందుకంటే మేమిద్దరమూ సంఘంలోని వాస్తవ పరిస్థితులను జయించి పెళ్ళాడాం.

వేను : సరోజ పాత్రను సృష్టించటంలో నా ఆశయం అదే .... మీ ఇద్దరినీ సంఘర్షణకోసమే సృష్టించాను. కాని మీలో రాజ్యం గతాన్ని వదిలించు కోవటానికి, శిథిలమైపోయే సనాతన శక్తులతో ప్రత్యక్షంగా పోట్లాడింది. సరోజ భవిష్యత్తుకు అంతరాయంగా ఉన్న వర్తమాన శక్తులతో పరోక్షంగా పోరాడింది. ఈ రెండు రకాల పోరాటమూ నాకు సమ్మతమైనదే కాని భవిష్యత్తుకోసం జరిగే పోరాటం నన్ను మరింత ఆకర్షిస్తుంది. సౌందర్యానికీ, ప్రేమకూ విలువ లేకుండా చేసే పరిస్థితి చాలా హేయమైనది. దానిని కళా కారులెవరూ సహించరాదు.

రాజ్యం : అంతా బాగానే వుంది. కాని నా జీవితానికి సుఖపరిణామం ఎందుకు లేక పోవాలి ?

వేను : నువు వాస్తవమైన పాత్ర గనక. నీవంటివాళ్ళు చాలామంది చాలా రంగా లలో చాలా సంఘర్షణలు కొనసాగిస్తేనేగాని జీవితంలో సుఖ పరిణామా

లకు దారి ఏర్పడదు. జీవితం నిండా పురోగమనానికి అడ్డుతగిలే శిథిలాలున్నాయి. వాటిని నిర్మూలించినమీదటగాని కొత్త నిర్మాణానికి అవకాశాలేర్పడవు....నేను సృష్టించిన పాత్రలతో కాలక్షేపంచేసే అలవాటు నాకు లేదు. అయినా ఈః పూట మిమ్మల్నిద్దరినీ చూడటం నాకు సంతోషంగానే ఉంది. ఇక వెళ్ళిరండి.

"నేను సృష్టించిన పాత్రలతో ముఖాముఖీ: "

ముద్రణ : పద్మప్రియ ?

# వరుసగా ....

## నవలలు



## కథలు .... 220

# అనుభవం

## మొదటి భాగం

పాత శతాబ్ది వెళ్ళిపోబోతుండగా పార్వతమ్మ భూమి మీద పడింది. అయిదుగురు మగపిల్లల తరువాత ఆడపిల్ల పుట్టినప్పుడే అందరూ చూసి, "ముత్యంలాంటి పిల్ల," అన్నారు.

బిడ్డపుట్టగానే పోలికలు చూడటం తప్పనిసరి.

పార్వతమ్మ ఎవరిపోలికో అంతు చిక్కలేదు. తల్లిపోలికా కాదు. తండ్రి పోలికా కాదు.

"మా ఆఖరు తమ్ముడు పుట్టినప్పుడు అచ్చు ఇలాగే ఉండేవాడు." అన్నది పార్వతమ్మ తల్లి మీనమ్మ. ఆ తమ్ముడు పోయి అప్పటికే ఇరవై ఏళ్ళు దాటింది.

మీనమ్మ మాట మీద అందరూ పార్వతమ్మ మేనమామ పోలికేనని చెప్పుకున్నారు.

మీనమ్మ చాలా గండ్రమనిషి. మళ్ళీ నోరు పెట్టుకు బతికేరకం కాదు. ఇతరుల మాటలను ఏనాడూ లక్ష్యపెట్టేదికాదు. తాను చెయ్యదలచుకున్నది, ఆరునూరైనా చేసితీరేది. అటువంటి మనుషులను మెచ్చుకోకపోయినా, అందరూ గౌరవిస్తారు.

దానికి తోడు ఆవిడకు దేవుడూ, దైవమూ అన్నదేమీలేదు. అటువంటి మనిషిని చూసి అందరూ భయపడతారు. ఎటొచ్చీ దైవభీతిగలవాడే అందరికీ లోకువ. ఎవరేది చెప్పినా వినేవాణ్ని చూస్తే కూడా అందరికీ అలుసే. మీనమ్మ కాపరానికి వచ్చాక ఎవరికీ ఏ విధంగానూ అలుసు కాలేదు. తాను చేసిన ఫలాని పని పొరపాటే అని తన నోటిమీదుగా ఎన్నడూ అనలేదు. పశ్చాత్తాపం ఎట్లా ఉంటుందో మీనమ్మ ఎరగదు. కనీసం పైకి అలా కనబడేదికాదు.

మీనమ్మ భర్త ఒకటోరకం వాజ. ఏదీ చేతకాని దద్దమ్మ. అటువంటి మనుషులంటే ఇష్టమైనవాళ్ళు, "వట్టి ధర్మరాజు" అనే వాళ్ళు. మిగిలినవాళ్ళు తమ తమ మనస్తత్వాలనుబట్టి బుద్ధిమంతుడనీ, అమాయకుడనీ సజ్జనుడనీ, సాధువనీ రకరకాలుగా ఆయనను గురించి చెప్పుకొనేవారు. ఆయనను ఖాతరు మాత్రం ఎవరూ చేసేవాళ్ళు కారు. పసిపిల్లలకు కూడా ఆయన లోకువే.

ఆయనకు పిల్లలంటే ఇష్టం; పెద్దవాళ్ళమధ్య ఉన్నప్పుడాయనకు, పాపం, ముళ్ళమీద ఉన్నట్టుండేది. ఆయనకు దేవుడన్నా, తన భార్యఅన్నా అమిత భయం. వచ్చే జన్మగురించి ఆయన చాలా బాధపడేవాడు. ఆయనకు కప్పలంటే చాలా చీదర. అందుచేత వచ్చేజన్మలో కప్పగా పుడతానేమోనని, ఏ పామైనా తనను మింగుతుందేమోననీ చాలా భయపడేవాడు. పామునోటికి చిక్కిన కప్ప అదో రకంగా అరవటం ఆయన రెండుమూడుసార్లు విన్నాడు. ఆ అరుపు చాలా సేపటి దాకా వినబడుతూనే ఉంటుంది. చెవులు ఎంత గట్టిగా మూసుకున్నా చెవిపోటు వస్తుంది తప్ప, పాము పట్టుకున్న కప్ప అరుపు వినిపించకుండా మటుకుపోదు. ఘోరం! ఘోరం!

మీనమ్మ తన పిల్లలపట్ల చాలా క్రూరంగా ఉండేది. వాళ్ళచేత కత్తిమీద సాముచేయించేది. అయినప్పటికీ—లేక ఆ కారణం చేతనేనో—పిల్లలకు తల్లిమీద చాలా గురిఉండేది. కాఠిన్యం సామర్థ్యం కింద చలామణీ కావటం సాధారణంగా జరిగేదే. మీనమ్మ సంతానానికి తండ్రే ఏమీ చేతగాని అప్రయోజకుడని తెలుసు.

పార్వతమ్మ తండ్రిని దాదాపు ఎరగదనే చెప్పొచ్చు. తండ్రి పోయేటప్పటికి ఆమె మూడేళ్ళపిల్ల. ఆయన ఏ వ్యాధితో పోయినాడో ఎవరికీ తెలియలేదు. జ్వరం వచ్చిపోయినా డన్నారు. ఆయనకు వైద్యంచేసిన తంబళాయన, "ఖాండవ పోశాను. గరళం కూడా పోశాను. ఇహ నా చేతిలో ఏమీలేదు. ఈశ్వరేచ్ఛ!" అని ఒక దణ్ణం పెట్టాడు. ఈశ్వరేచ్ఛే నెగ్గింది.

ఆయన పోయాక మిగిలినవాళ్ళ జీవితంలో పిసరంత మార్పులేదు-మీనమ్మ నెత్తికి ముసుగు రావటం మినహాగా. ఉత్తరక్రియలూ, పిండ ప్రదానాలూ చేయించే బ్రాహ్మలను మూలగదిలో కూర్చుని ఆవిడే శాసించింది.

ఆ తరవాత అంతా మామూలే.

* * * *

చిన్న పిల్లలకు ఏమీ అర్థం కాదనుకుని పెద్దవాళ్ళు కొన్ని కొన్ని విషయాలు మాట్లాడుకుంటారు. ఎవరో తన తల్లి గురించి మాట్లాడుతూ, "ఆవిడకేం? కుంతీ దేవి" అనటం చిన్నతనంలో పార్వతమ్మ విన్నది.

నిజానికామాట ఆమెకు అప్పట్లో అర్థం కాలేదు. తరవాత కొంతకాలానికి, కుంతి అయిదుగురు కొడుకులను పెంచి పెద్దచేసిందని విని అందుకే తన తల్లిని వాళ్ళెవరో కుంతితో పోల్చారనుకున్నది. కాని ఇంకా పెద్దయాక ఒకరోజున అకస్మాత్తుగా మరొక అర్థం స్ఫురించింది. తల్లిని గురించి ఆమె తలలో ఒక అనుమానం తలఎత్తి, క్రాను రాను రూఢి అయింది.

అయినా పార్వతి "షాక్" కాలేదు. నిర్వికారంగా వుండిపోయింది.

నిజానికి పార్వతికి తన చిన్నతనంలో ఎటుచూసినా అవినీతే కనబడేది. మీనమ్మకు ముగ్గురు చెల్లెళ్ళుండేవాళ్ళు. వాళ్ళలో మీనమ్మ తరవాత ఆవిడేను

మాత్రమే మహా ఇల్లాలనేవాళ్ళు. మిగిలిన ఇద్దరిని గురించీ ఏవో గుసగుసలు ఉంటూఉండేవి. వాళ్ళిద్దరూ బస్తీకాపరాలు చేసేవాళ్ళు. ఒకావిడ భర్త కోమటి గుమాస్తా, రెండో ఆవిడ భర్త ప్లీడరు గుమాస్తా.

పార్వతి ఎప్పుడన్నా వాళ్ళ యిళ్ళకు వెళ్ళినప్పుడు వాళ్ళు ఆనందంగా జీవిస్తున్నా రనిపించేది.

'బుల్లి చిన్నమ్మ' గారింటికి ఒకాయన రావడం పార్వతి ఎరుగు. ఆయన ఎవరని అడిగితే, 'మీ బాబాయికి బంధువే,' అని బుల్లి చిన్నమ్మ అన్నది. ఆయనకు ఒక సొంత గుర్రబ్బండీ ఉండేది. అందులో వచ్చేవాడు. ముచ్చటముడి వేసుకునేవాడు. కళ్ళకు కాటుక పెట్టుకునేవాడు. చెవులకి రాళ్ళ తమ్మంట్లుండేవి. ఎప్పుడూ తాంబూలం నములుతూండేవాడు. నోరు ఎర్రగా కనిపించేలాగా నవ్వేవాడు—ఆయనతో మాట్లాడుతున్నా, ఆయన మాటలు వింటున్నా బుల్లి చిన్నమ్మకు మిగతా ప్రపంచం జ్ఞాపకం లేనట్లుండేది.

ఆ పేటలోనే మరో చిన్నచిన్నమ్మ ఉండేది. కోమటి గుమాస్తా భార్య. వాళ్ళింటికెవరూ రావటం పార్వతి ఎరగదు. కాని ఒకసారి తాను బస్తీలో ఉండగా చిత్రనళీయం నాటకం[1] ఆడటమూ చిన్నచిన్నమ్మ తమందరినీ నాటకానికి టిక్కెట్లు లేకుండా తీసుకుపోవటము పార్వతికి జ్ఞాపకం ఉన్నది. అందులో నలుడు వేసినాయన గురించి చిన్న చిన్నమ్మ చాలా చాలా చెప్పింది.

"ఏం బస్తీలు లెద్దూ! అంతా సంకరమే !" అని తమ గ్రామంలో వాళ్ళు అనటం పార్వతి చాలా సార్లు విన్నది. తన చిన్నమ్మలు బస్తీకి వెళ్ళిన కారణంగా కొంత విచ్చలవిడిగా వర్తిస్తున్నారని కూడా ఆమె అర్థం చేసుకున్నది. కాని పార్వతికి బస్తీ జీవితం రోత అనిపించలేదు.

తనకుకూడా ఒక ప్లీడరు గుమాస్తో, కోమటు గుమాస్తో మొగుడైతే బావుండుననీ, తానుకూడా బస్తీతో జీవిస్తే బావుండుననీ పార్వతి రహస్యంగా కోరుకునేది. ముఖ్యంగా పెద్ద చిన్నమ్మగారి ఊరు చూశాక ఆమెకు పల్లెటూళ్ళంటే మరీ రోత పుట్టింది. ఛీ ఛీ ! పాడు ఊరు ! కంకరరోడ్డుకు రెండు మైళ్ళ దూరాన ఉన్నది. వానకాలమైతే మోకాళ్ళలోతు బురదలోపడి పోవాలి. డొంకదారికూడా లేదు, అదేం ఊరోగాని.

మిగిలిన ఇద్దరు చిన్నమ్మలతోనూ పోలిస్తే పెద్ద చిన్నమ్మ జీవితంలో ఏ చిత్రమైన సుఖమూ ఉన్నట్లులేదు. ఎవరింటికీ పోదు-పొద్దుటిపూట చెరువునుంచి రెండు బిందెలు తాగే నీళ్ళు తెచ్చుకోవటానికి తప్ప వీధిలోకి కూడా అడుగుపెట్టదు. ఇంటి

---

1. ధర్మవరం రామకృష్ణమాచార్యులు (1853-1912) రాసిన అయిదు అంకాల సంగీత ప్రధాన నాటకం. రచనాకాలం 1886. ప్రథమ ముద్రణ 1894. సరస వినోదినీసభవారు 29-1-1887 నాడు మొదటిసారి ప్రదర్శించారు.

పని చేస్తుంది. పాడి చేస్తుంది. ఆవిడ నవ్వగా పార్వతి చూడలేదు. ఆవిడా భర్తా అత్యవసరమైన మాటలు తప్ప మాట్లాడుకోగా వినలేదు.

మొత్తంమీద పార్వతికి తన పెద్ద చిన్నమ్మ జీవితం చూసి ఏమాత్రమూ అసూయ కలగలేదని చెప్పొచ్చు.

* * * *

అయితే ఎవరో శిక్ష విధించినట్లుగా, పార్వతిని ఆ వూరే ఇచ్చారు. సంబంధం కుదిర్చినది పెద్ద చిన్నమ్మే. ఇంకోరి గడప తొక్కని ఆ మనిషి సంబంధం కుదర్చటము సాధ్యంకాని సంగతి. పిల్లవాడితల్లే పార్వతిని చూసి, "ముత్యమంటి పిల్ల" అని మనసులో అనుకుని, ఎవరాపిల్ల ? అని ఆరాతీసింది.

పిల్లవాడి కుటుంబం చాలా గొప్పది. చిన్న జమీందార్లు. ఊళ్ళో ఉన్న ఒక్క మేడా వాళ్ళదే. పిల్లవాడు మంచి ఛాయ. పద్దెనిమిదేళ్ళవాడు. తొమ్మిదేళ్ళ పార్వతికి ఈడుజోడుగా వుంటాడు. సంబంధానికి మీనమ్మ అభ్యంతరం చెప్పలేదు. పెళ్ళి ఖర్చులకుగాను డబ్బు అప్పు మాట్లాడి, మైనారిటీ తీరిన తన పెద్ద కొడుకులిద్దరిచేతా ప్రోనోటుమీద సంతకాలు పెట్టించింది.

అవతలవాళ్ళు పెద్ద అంతస్తుకు చెందినవాళ్ళు కావటంతో పెళ్ళికి అనుకున్న దానికన్న హెచ్చుఖర్చు చెయ్యవలసివచ్చింది. బస్తీ నుంచి భోగం మేళం పిలిపించారు.

పార్వతి ఆ ఆటసానులను చూసి వాళ్ళకుగల "స్వేచ్ఛ"కు ఆశ్చర్యపడింది. వాళ్ళ స్వేచ్ఛను ఎవరూ ఖండించలేరు. వాళ్ళ కట్టూ, బొట్టూ, అభినయమూ, నవ్వులూ అందరినీ ఆకర్షించినట్టే కనబడ్డాయి.

'వాళ్ళకే ఒక మొగుడంటూ ఉంటే ఇన్ని ఆటలు ఆడగలుగుదురా?' అన్న యీడుకు మించిన ఆలోచన పార్వతి తలలోకి వచ్చింది.

పార్వతి అన్నలు ఆ సానులకేసి నోళ్ళు తెరుచుకు చూడటం పార్వతి గమనించింది.

"ఆ ముసలిది చాలా అసహ్యంగా ఉందిగాని, చిన్నవాళ్ళిద్దరూ రంభలల్లే ఉన్నారు" అన్నాడు పార్వతి పెద్దన్న.

"ఆ ఈడొచ్చేసరికి వీళ్ళూ ఆ ముసలిదానిలాగే ఉంటారు." అన్నాడు పార్వతి మేనమామ.

"మొహాన ఇంత పిండి మెత్తుకోగానే సరా? అందంమాట కొస్తే మన పార్వతి కాలిగోరికి పోలరు వాళ్ళు" అన్నది మేనమామ భార్య.

తాను పెద్ద అయాక ఆ సానుల్లాగా నాట్యం చేసినట్టూ, తన అందం చూసి అందరూ నోళ్ళు తెరుచుకున్నట్టూ ఊహించుకుని పార్వతి కొద్దిగా భయపడింది.

పెళ్ళి అయింది. పెళ్ళిలో పార్వతి పల్లకి ఎక్కింది. గృహ ప్రవేశానికి అత్తవారింటికి మేనాలో వెళ్ళింది. మధ్య దారిలో బోయీలు మేనా దించి, అంత

దూరాన ఉన్న కల్లుపాకలో తాగివచ్చారు. వాళ్ళు తాగివచ్చాక మేనా ఎత్తుకుంటూ మాట్లాడే మాటలు వింటే పార్వతికి చచ్చే భయం వేసింది. ఆ తరవాత వాళ్ళు తీసిన దౌడు అంతా ఇంతా కాదు.

పెళ్ళికొడుకు అందంగానే ఉన్నాడు. వేసవి కావడంచేత అత్తవారి ఊరు కూడా బాగానే ఉంది. ఎక్కడా బురదలేదు. అత్తవారిల్లు వైకుంఠంలాగున్నది. అంత పెద్ద ఇంట్లో పార్వతి ఎన్నడూ అడుగుపెట్టి ఎరగదు. ఇంటినిండా జనం. కోలాహలం. పెళ్ళికొడుకు కాంతయ్య కట్టుకుపోయినంత ఆస్తికి ఒక్కడే కొడుకు.

అన్నీ చాలా బాగున్నాయి. అయినా తాను తన పెద్ద చిన్నమ్మలాగా జీవించ వలసి వస్తుందేమోనన్న అనుమానం పార్వతికి పోలేదు. దానికి వేరే కారణం ఏమీ లేదు; జీవితంలో ఆటే విశ్వాసం లేకపోవటమే - ఆశలు ఎప్పుడూ అడియాసలే అవుతాయి.

అందుకు తార్కాణం వెంటనే కనబడింది. తనను అత్తగారు ఏరి కోరి చేసుకున్నది గనుక, ఇతర కోడళ్ళకిమల్లే తనకు కోరంటికం ఉండదని పార్వతి ఆశపడింది. కాని అది అడియాసే అయింది. ఆ అత్తగారూ పెళ్ళి అయాక తనతో దాసీదానితో మాట్లాడినట్లు మాట్లాడుతున్నది. ఆవిణ్ణి చూస్తేనే తనకు భయంభయంగా ఉన్నది.

* * * *

పార్వతి అత్తగారు శ్యామలాంబ దూరాలోచన చేసే తన కోడలికి వరణం చేసింది. ఆవిడకు తన అత్తగారి వంశం గురించి బాగా తెలుసు. తనభర్త స్త్రీలోలుడు. తన మామగారు స్త్రీలోలుడు. ఆయన తండ్రి అచ్చమైన ప్రబంధ నాయకుడు. ప్రబంధనాయకులు కూడా ఆయన ముందు చాలరేమో. పన్నీట స్నానం చేసి, ఒంటినిండా గంధం పూసుకుని, తలలో పూలు తురుముకుని, మేనాఎక్కి ఉంపుడుగత్తె ఇంటికి మిట్ట మధ్యాహ్నంవేళ వెళ్ళేవాడు.

శ్యామలాంబను ఎక్కడో రామచంద్రాపురం తాలూకానుంచి తెచ్చుకున్నారు. ఆమె అందం ఎవరూ చూడలేదు. చూడటానికి ఆమెలో అందం లేదు కూడా. ఆమె పుట్టింటివారు కూడా గొప్ప శ్రీమంతులు. అందుకని అంత దూరం నుంచి ఆమెను తెచ్చి చేసుకున్నారు.

శ్యామలాంబ భర్త వెంకటనారాయణగారు కొడుకు పెళ్ళినాటికి బ్రతికే ఉన్నాడు. కాని పెళ్ళికి రాలేదు. ఆయన ఎప్పుడూ పట్నంలోనే ఉంటాడు. అక్కడ ఎవరో జమీందారిణి, వితంతువు ఉన్నదట. ఆయన ఆవిణ్ణి ఉంచుకున్నాడని చెప్పు కునేవారు. ఆవిడ వెంకటనారాయణకన్న చాలా పెద్దదనీ, ఆవిడే ఆయనను ఉంచుకున్నదనీ కొందరనేవారు.

ఏమైనా శ్యామలాంబ తన భర్తను గురించి మంచిగా గాని, చెడుగాగాని ఏమీ మాట్లాడేది కాదు. తన ఎదుట ఇతరులను మాట్లాడనిచ్చేది కాదు. కాని తన మన

సుతో ఏనాడో ఒక నిశ్చయం చేసుకున్నది. తన కొడుకు ముమ్మూర్తులా తండ్రే. అదే రూపం, అవే బుద్ధులు. ఒక అందమైన పిల్లను తెచ్చి ముడిపెట్టితే తప్ప ఈ వంశం స్త్రీ వ్యసనమనే ఊబినుంచి బైటపడదు. రెండోవీధిలో జానకమ్మగారి ఇంటికి బంధువులొచ్చారనీ, వాళ్ళవెంట ముత్యంలాంటి పిల్ల ఉన్నదనీ విన్నది. ఆ పిల్లను చూసిరావటానికి ముగ్గురిని మూడుసార్లుగా పంపింది. పిల్ల ముత్యమేనని ముగ్గురూ చెప్పారు. ఆ పిల్ల తనకు కోడలు కావాలని నిశ్చయించుకున్నది. జానకమ్మ మొగుడికి కబురుపంపి మాట్లాడింది. జానకమ్మ మొగుడు తన చెవులను నమ్మలేక పోయాడు. మళ్ళీ ఆవిడ మనసు మార్చుకుంటుందేమోనని, ఆయన తన పూచీమీద సరేననేశాడు.

"తొందర ఏమీలేదు. మీ వదినగారితో మాట్లాడాకనే నిశ్చయం చెయ్యండి" అన్నది శ్యామలాంబ.

"ఆవిడమాత్రం ఇంకేమంటుంది లెండి. మగదిక్కులేని మనిషి. వాళ్ళ వ్యవహారాలన్నీ నా చేతిమీదుగనే నడుస్తున్నాయి" అని జానకమ్మ మొగుడు బొంకాడు.

శ్యామలాంబ తన వియ్యపురాలినీ, ఆమె చెల్లెళ్ళనూ, అన్ననూ పెళ్ళిలో చూసింది. మిగిలినవాళ్ళందరూ ఆవిడకు హల్కా మనుషులల్లేనే కనిపించారుగాని మీనమ్మ ఆవిడకు నచ్చింది. మీనమ్మ సమర్థురాలల్లే కనబడింది. ఆ గుణం తన కోడలిలో కూడా ఉంటే తన కొడుకు ఊబిలోనుంచి బయటికి వస్తాడని ఆమె ఆశ.

కోడలిలో ఏపాటి చేవ ఉన్నదీ తెలుసుకునేటందుకే శ్యామలాంబ పార్వతితో కరుకుగా మాట్లాడిచూసింది. ఆవిడ ధోరణి చూసి, పార్వతి ఆశాభంగం చెంది, లోలోపల భయపడినా, మీనమ్మ ధాటికి అలవాటుపడినది కావటంచేత పైకి ఏమీ కనిపించనివ్వలేదు.

"ఫరవాలేదు. ఇంకా పసిపిల్ల. బాగానే తయారుకావచ్చు" అనుకున్నది శ్యామలాంబ. కోడలు తనను పోలి తయారు కావాలని ఆవిడ ఆకాంక్ష. అలాగే తరిఫీదు చెయ్యటానికి ఆమె నిశ్చయించుకున్నది.

* * * *

కొందరు మనుషులు ఒక పేడబొమ్మను చేసి, దాని కొక దేవుడి పేరుపెట్టి, కొన్ని గుణాలు దానికి ఆపాదించి, తమ కల్పన అంతా వాస్తవమే అయినట్టుగా ఆ కల్పనపైన అమూల్యమైన తమ జీవితపు భారం కొంత వేసేస్తారు. మరికొందరు తమ జీవితాలనే కల్పనలతో నింపి, ఆ కల్పనలు వాస్తవమనుకుని, వాటికి మెరుగులు దిద్దుతారు. వారు దిద్దే మెరుగులు వారి వాస్తవ జీవితానికి అంటవు. శ్యామల ఆ పనే చేసింది.

ఆమె కాంతయ్యను ఉద్ధరించటానికి మహా పెద్ద పథకం వేసింది. వాణ్ని

ఏ ఊబినుంచి అయితే ఆమె కాపాడదామనుకున్నదో, ఆ ఊబిలో అతను పెళ్ళికి పూర్వమే నడుమలోతున కూరుకుపోయి ఉన్నాడు.

కాంతయ్యను సుఖలాలసుణ్ణిగా చేసింది తల్లే. ఆమె కావాలని ఆ పని చెయ్యలేదు. ఆమె పుట్టింటివాళ్ళ సంస్కారం అత్తింటి సంస్కారంకన్న గొప్పది. శ్యామలాంబ మేనమామలిద్దరూ బొబ్బిలి దివాణంలో ఉద్యోగాలు చేశారు. ఆమె తండ్రి మట్టుకే ప్రభుత్వోద్యోగం చేశాడు. ప్రభుత్వోద్యోగాలు చేసేవారికి సంస్కారం ఉండదనేవారు శ్యామలాంబ మేనమామలు. "మీది మునిగిపోతున్న పడవ". అనేవాడు శ్యామలాంబ తండ్రి తన బావమరుదులతో.

కాపరానికి వస్తూనేశ్యామలాంబ తెలుసుకున్నది. తన అత్తవారు ఎంతసంపన్నులైనా, వారి మాటతీరూ, బుద్ధులూ, మర్యాదలూ మొదలయినవి వాళ్ళ కమతగాళ్ళను అట్టే మించిలేదని, వాళ్ళు తినే తిన్నగొడ్లుకూడా తినవనిపించేది శ్యామలాంబకు. ఈ లోపం సరిచెయ్యటాని కావిడ తన కొడుక్కు చిన్నచిన్న విషయాలలో సుఖమూ, "అందమూ" సాధించే పద్ధతి నేర్పింది.

కాంతయ్య గంగాళం నీళ్ళుంచేనే కాని స్నానం చేసేవాడు కాడు. వారానికో సారి ఒళ్ళు పట్టించుకుని, తల అంటించుకుని రెండుగంటలపాటు స్నానం చేసేవాడు. అతని తలంటుకిగాను శ్యామలాంబ తన పుట్టింటివారి సహాయంతో ఒక అప్పన్నను తెప్పించి, జీతమిచ్చి ఉంచింది.

కాంతయ్య ఉతికిన బట్టలు కట్టేవాడు కాడు; చలవబట్టలే కట్టేవాడు. అతనికి తియ్యకుండా ఒక డజను మిల్లుపంచెలూ, ఒక డజను సిల్కు చొక్కాలూ ఉండేవి; అవి బస్తీలో ఇస్త్రీ అయి వచ్చేవి.

ఇట్లా ప్రతి విషయానికీ కాంతయ్య సుఖసౌందర్యాల విషయంలో ఎటువంటి లోపమూ రానిచ్చేవాడు కాడు. అయితే అతను బాహ్యశుద్ధికోసం తపనపడినంతగా అంతశ్శుద్ధికోసం తపనపడలేదు. అతనికి చదువు అంటలేదు. కాకపోయినా తనకు చదువెందుకూ? చదువుకున్న జీతగాళ్ళు దొరకరా? చదువుకునే వాళ్ళందరూ ఉద్యోగం కోసమే చదువుకుంటారని అతని నమ్మకం. నిజానికి అతని జీవితంలో కోరే సుఖాలలో ఏ ఒక్కటీ చదువుతో లభించేది కాదు. చదువు ద్వారా సాధించేదీ కాదు.

అతనికి కాలక్షేపం కలిగించేవాళ్ళు గ్రామంలో కొందరుండేవాళ్ళు. కోటయ్య సుద్దులు పాడేవాడు. హనుమంతుగాడు కాంతయ్యకు బీడీలలో గంజాయి పెట్టి కాల్చడంలో గల ఆనందం నేర్పాడు. భద్రయ్య మూడుముక్కలాటలో సిద్ధహస్తుడు. అరఖు ఎంతైనా పట్టించేవాడు; తనతోపాటు తాగగలవాడు, "పన్నెంటు డక్కాల్లో" ఒక్కడు కూడా లేడని ప్రజ్ఞలు పలికేవాడు. బాలనాగమ్మ బుర్రకథ కంఠస్థంచేసి, ఎప్పుడే భాగం పాడమంటే ఆ భాగం పాడేవాడు.

చిన్నతనంనుంచీ కాంతయ్యకు మాయలపకీరు గొప్ప పాత్రగా కనిపించేది.

"పకీరులో ఒకటే మచ్చ, చినదొరా! బాలనాగమ్మను దగ్గిరుంచుకుని పన్నెండేళ్ళు ఎట్టా మనసు కట్టేసుకున్నాడు? నావల్లకాదు. తరవాత రావణాసురుడల్లే తల పగిలి చస్తే చచ్చాను. ముందు బాలనాగమ్మని చెరిచి పారేసేవాణ్ణే!" అనేవాడు భద్రయ్య. ఎప్పుడు మాయలపకీరు మాటొచ్చినా భద్రయ్య ఎంతో విచారంగా ఈ మాట అనేవాడు – చరిత్రలో ఒక నివారణీయమైన తప్పు జరిగిపోయినట్టుగా.

ఈ నాసిరకం మిత్రుల మధ్య కాంతయ్య, చుక్కల్లో సూరీడల్లే ప్రకాశించటంలో ఆనందం అనుభవించేవాడు. వీళ్ళతోబాటు అతనికి మరొకరకం స్నేహితుడు కూడా ఉండేవాడు. అతను పురాణం చదివే శాస్తుల్లుగారబ్బాయి సోమశేఖరం. సోమశేఖరం కాంతయ్యకన్న అయిదారేళ్ళు పెద్ద. శాస్త్రుల్లుగారిది చితికిపోయిన కుటుంబం. వాళ్ళు తరతరాలుగా నిరుపేదలు. కాని పేరుప్రఖ్యాతులుగల సంస్కృత పండితులు. కాని గ్రామం అంతా ఆదరించినప్పుడు బ్రాహ్మడైనవాణ్ని దారిద్ర్యం అంతగా బాధించదు. శాస్త్రుల్లుగారి సగం జీవితం దాకా అట్టే ఇబ్బంది లేకుండా జరిగిపోయింది. కాని శాస్త్రుల్లుగారి విధవ కుమార్తె ఎవరో సాయిబు కుర్రవాడితో లేచిపోయి, బస్తీలో పబ్లిగ్గా కాపరంపెట్టి, సాయిబు కుర్రాణ్ని వాడి తండ్రి ఇంటికి రాకుండా నిషేధించాక, సాని వృత్తిలోకి దిగి, తననుతాను పోషించుకోవడమేగాక వాణ్ని కూడా పోషించడం మొదలెట్టింది.

దాంతో గ్రామంలో శాస్త్రుల్లుగారి పరపతి పోయింది. ఆయనే ఒక బూబును తెచ్చి ఇంటో పెట్టుకున్నా ఆయన పరపతి అంతగా పోయివుండదేమో. ఊళ్ళో వాళ్ళను తప్పుపట్టనవసరం లేదు. వాళ్ళెవరూ పల్లెత్తుమాట అనకముందే ఆయన, "ఇక నేనీవూళ్ళో తలయెత్తుకు తిరగలేను" అనేశాడు. శాస్త్రుల్లుగారి భార్య తన కూతురికి పెట్టవలసిన శాపనార్థాలన్నీ పెట్టి మంచం ఎక్కింది. సోమశేఖరాన్ని ఎవరూ తద్దిన బ్రాహ్మణార్థాలక్కూడా పిలిచారు కాదు. వాడప్పటికే పంచకావ్యాలూ, నాటకాలూ, తర్క వ్యాకరణాలూ చదివి ఉన్నాడు. కాని పొట్టపోసుకోవటం మాటకొస్తే యానాది పోలిగాడికీ, సోమశేఖరానికీ తేడా లేదు.

ఆ దశలో సోమశేఖరం కాంతయ్యను ఆశ్రయించాడు. సోమన్నతో స్నేహం కలిసినదాకా కాంతయ్యకు కావ్యానందం తెలీదు. సోమన్న శృంగార సంబంధమైన శ్లోకాలు చదివేవాడు. వాటికి అర్థాలు చెప్పేవాడు. ఈ విధంగా పద్యాలుగో ఏటనే కాంతయ్యలో ఒక కొత్త తృష్ణ తలయెత్తింది.

జీవితంలో ఒక సుఖం ఉందని తెలిశాక దాన్ని అనుభవించకుండా మనిషి ఎంతకాలం ఉంటాడు? కాంతయ్య సోమన్నను తొందర చెయ్యసాగాడు. చివరకు సోమన్న మంగళగిరి తిరణాలకు పోతున్న మిషమీద కాంతయ్యను తీసుకొని బస్తీకి వెళ్ళాడు సోమన్న అక్క, పారిజాతం అని పేరు మార్చుకుని ఉంటున్న గొంది దొరికింది.

సోమన్నను చూచి అక్క నిర్ఘాంతపోయింది. తల్లిని గురించీ, తండ్రినిగురించీ అడిగింది.

"అమ్మకు ఏమీ నయంలేదు. ఎముకల గూడు. రోజూ నిన్ను తిట్టకుండా నిద్రపోదు" అన్నాడు తమ్ముడు.

"అయితే ఆవిడ తిట్లు దీవెనలన్నమాటే! సుఖంగా ఉన్నా!" నన్నది పారిజాతం.

ఆమె కాంతయ్యను కాస్సేపు చూసి, "వెంకణ్ణారాయణగారబ్బాయా ఏం?.... బాగా పెరిగాడు" అన్నది.

కాంతయ్య ఆమెను నఖశిఖ పర్యంతం పరీక్షిస్తున్నాడు. కాని ఆ అర్భకుడి మెదడులో ఏమి ఆరోచనలున్నాయో ఆమె ఊహించనైనా లేదు.

పారిజాతం వాళ్ళు వచ్చిన పని అడిగితే, "లోపలికి రా చెబుతాను" అంటూ సోమశేఖరం లోపలికి దారితీశాడు. ఇద్దరూ అయిదు నిమిషాలు లోపల ఏదో మాట్లాడు కున్నారు.

"భోజనం ఏ పూట కూళ్ళింట్లనో చేస్తాంలే" అంటూ సోమన్న బయటికి వచ్చాడు.

"ఏం నా చేతి తిండి తింటే కులం పోతుందా!" అంటూ అక్క అతని వెనకాలే వచ్చింది. ఈసారి ఆమె కాంతయ్యకేసి చూసిన చూపులో బోలెడంత ఆసక్తి వున్నది. "ఏం నాయనా, నా వంట తినటానికి నీక్కూడా అభ్యంతరమేనా!" అన్నదామె కాంతయ్యతో.

కాంతయ్య ఆశ్చర్యంగా "లేదే?" అన్నాడు.

వాళ్ళిద్దర్నీ కూర్చోబెట్టి పారిజాతం ఎక్కడికో వెళ్ళి, పదినిమిషాలలో తిరిగి వచ్చి, వంటచెయ్యటానికి రోపలికి వెళ్ళింది. మరి కాస్సేపటికి ఎవరో పిల్ల "పారెక్కా?" అంటూ వచ్చింది.

"కూర్చోవే కనకం. నువ్వొకసారి లోపలికి రారా" అని పారిజాతం లోపలి నుంచి కేకలు పెట్టింది. సోమన్న లేచి లోపలికి వెళ్ళాడు.

సోమన్న లేచి వెళ్ళగానే, కనకం మెల్లిగా కాంతయ్య దగ్గిరికి వచ్చి, అతను కూచున్న కుర్చీమీదికి వాలి, మొహంలో మొహంపెట్టి, "నీ పేరేంటి?" అని అడి గింది. ఆ మనిషి నోరు ఏదో వాసన కొట్టింది.

"నీకెందుకూ?" అని కాంతయ్య చీదరించుకున్నాడు. తాను పసందు చేఘ టానికే ఆ కనకాన్ని సోమన్న అక్క పిలిపించిందని కూడా అతనికి తట్టలేదు.

కాని అతని చీదరింపును కనకంలక్ష్యపెట్టలేదు. కావాలని చేత్తోలాగేసి పమిట జార్చేసింది. కాంతయ్యకు ఆ మనిషంటే చెప్పరాని అసహ్యం పుట్టుకొచ్చింది. అతను ఆమెను మోటుగా తోసేసి, కుర్చీలోంచి లేచి, అసలైన ప్రవరాఖ్యుడు లాగా లోపలకి వెళ్ళిపోయాడు.

"ఏమి టంటుంది కనకం?" అన్నది పారిజాతం కాంతయ్యను చూసి నవ్వుతూ. ఆమె వంకాయలు తరిగి నీళ్ళ గిన్నెలో వేస్తున్నది.

"దాని బొంద!" అన్నాడు కాంతయ్య కోపంగా.

వంటింటి గుమ్మం దగ్గిరికి వచ్చి నిలబడివున్న కనకం యీ మాట విని కూడా పూర్తిగా నిరాశచేసుకోక "ఏమిటి వీడు?" అన్నట్టుగా అభినయం చేసింది. "నువు వెళ్ళలే!" అన్నట్టుగా పారిజాతం సైగచేసింది.

"అయితే కనకం నీకు నచ్చలేదన్నమాట. ప్లీడరు అవధాని దానికోసం పడి చస్తాడు తెలుసా?" అన్నది పారిజాతం.

ఇంక రహస్యం ఏముందీ, "ఛీ ఛీ! వెకిలిముండ! ఐనా నేను నవ్వులాటగా అంటే వీడు నిజమనుకున్నాడు మేం ఊరికి పోతాం!" అన్నాడు కాంతయ్య.

అతని కంఠంలో ఏదో నిరాశ ఉన్నట్టు పారిజాతానికి తోచింది.

కాని సోమశేఖరానికి మాత్రం ప్రాణం లేచి వచ్చినట్టయింది.

"ఇప్పుడే పోదాం" అన్నాడతను ఆత్రంగా.

"ఇప్పుడే అంటే అన్నమన్నా తిన్నారా ? పొద్దునేగా ఇంతదూరం నడిచి వచ్చారూ ? రేపొద్దున పోదురుగాని. కాళ్ళ నెప్పులన్నా పోవాలా ?" అన్నది పారిజాతం.

"అవును, రేపొద్దున పోదాం" అన్నాడు కాంతయ్య ఉత్సాహంగా.

ఆ మధ్యాహ్నం రెండుగంటల వేళ సాయిబు వచ్చాడు. కుర్రాళ్ళిద్దర్నీ చూశాడు. ఎవరన్నట్టు తల ఎగరేశాడు.

"మా తమ్ముడూ, వాడి స్నేహితుడూనూ. ఇవాల్టికి బేరంలేదు. సరేనా?" అన్నది పారిజాతం అతనితో. అతను ఆమెతో కాస్సేపు సరసాలాడి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి ఆమె రహస్యంగా తన తమ్ముడితో "నీవు ముందు గదిలో చాపే సుకు పడుకో; మీ స్నేహితుడు లోపల పడుకుంటాడులే!" అన్నది.

సోమశేఖరం అర్థం చేసుకున్నాడు. కాని ఆశ్చర్యపోయాడు.

ఆ ఒక్క రాత్రిలో కాంతయ్య పారిజాతం దగ్గిర ప్రణయ విద్యలన్నీ కనీసం సిద్ధాంతరీత్యా నేర్చుకున్నాడు. ఇక నైపుణ్యం అనుభవంతోనూ అభ్యాసం తోనూ రావలసి ఉంది. దానిక్కూడా చాలా అవకాశాలు దొరికాయి. పెళ్ళికి ముందే అతను సుఖవ్యాధులు కూడా సంపాదించి కామశాస్త్రంలో ఒక చిన్న డిప్లొమా అందుకున్నాడు.

* * * *

మనుగుడుపులు పూర్తి అయాక, కాంతయ్య అత్తవారింటి నుంచి ఇంటికి వెళ్ళాక బస్తీకి వెళ్ళాడు. అక్కడ అతనొక వారం రోజులుండి, తరవాత ఇంటికి వెళ్ళాడు. అతనికి బస్తీ నచ్చింది. "బస్తీలో కాపరం పెట్టి బతికేనా?" అని తమ గ్రామంలో వాళ్ళు చాలామంది అనటం అతడు అనేక పర్యాయాలు విన్నాడు. అది

అర్థంలేని మాట. ఎంతో బీదవాళ్ళుకూడా బస్తీలో బతుకుతున్నారు. తనవంటి ధనిక కుడికిఅది ఎందుకు సాధ్యంకాదు?

బస్తీలో ఉన్న రోజుల్లో అతను తన భార్య పిన్నమ్మ లిద్దరి ఇళ్ళకూ లాంఛనంగా వెళ్ళి, ఒక్కొక్కపూట భోజనానిక్కూడా ఉండి, ఊరికి వెళ్ళిపోవాలనే మిష మీద మరి ఉండకుండా తప్పించుకున్నాడు.

ఆ తరవాత రెండు రోజులకు కోమటి గుమాస్తా ఇంటికొచ్చి "ఆ అబ్బాయి ఇంకా వెళ్ళిపోలేదే? ఉదయం పెద్దబజారులో చూశా"నని భార్యతో అన్నాడు.

ప్లీడరు గుమాస్తా ఇంకా నికరమైన వార్తలు తెచ్చాడు. "ఫలాని సందులో ఫలాని గుర్తులుగల ఇంట్లో మన పార్వతమ్మ మొగుడు మకాం పెట్టాడు!"

ఆడవాళ్ళు అందిస్తే అల్లుకుపోగలరు. ఆ కారణంచేతనే ఒక్కోసారి వాళ్ళు దివ్యదృష్టి గలవాళ్ళల్లే కనిపిస్తారు.

అక్కచెల్లెళ్ళిద్దరూ కూర్చొని ఘామున్నరసేపు మాట్లాడుకున్నారు. పెళ్ళప్పుడు వాళ్ళూ వీళ్ళు అనుకున్న చూచాయమాటలన్నీ బాగా ఫోకస్‌లోకి వచ్చాయి.

"ఇంత ఆస్తి ఉందిగదా అని పెద్దక్క దుడదుడా పిల్లనిచ్చి చేసింది. వాళ్ళది మొదటినుంచీ నీతీ జాతీలేని వంశం. కొడుక్కు పెళ్ళవుతుంటే ఆ తండ్రి తొంగి చూశాడూ? వొట్టి తాగుబోతులూ, ముండల ముఠాభోర్లూనూ. ఎందుకడుగు తావులే! ఏ చెట్టు కాకాయ! అట్లా అయినా కొంత మేలే. పిచ్చిచెట్టుకు కుక్కమూతి పిందె! చూస్తూండు తండ్రే నయమనిపిస్తాడు. ఆ ఆస్తే లేకపోతే వాడికి పిల్ల నెవరిస్తారే! చదువూ చట్టుబండలూ లేదుట. నాట్లప్పుడూ, కోతలప్పుడూ పొలాల్లోనే పడి ఏడుస్తాట్ట - మురికి ముండలతో సరాగాలాడుతూ! పిల్లముండ గతి ఎట్లా ఉందో? ముత్యమంటిదాన్ని తీసుకుపోయి అలుగ్గుడ్డలో చుట్టారు. మా ఆయన ఈ అబ్బాయిని చూస్తేనే - ఆ ఇంట్లో ఉన్నది వాళ్ళ ఊరివేనట! సాయిబుతో లేచొచ్చిందిట. వాడి కన్న రెట్టింపు వయస్సు!...."

ఈ విధంగా మాట్లాడుకుంటూ అక్కాచెల్లెళ్ళు చాలా ఆత్మసంతృప్తి పొందారు. ఈ ఆత్మసంతృప్తి పూర్తికావాలంటే, కాంతయ్యను గురించి తమకు తెలిసినదంతా పెద్దక్కయ్యకు చేరెయ్యాలి. లేకపోతే ఎట్లా? తను గొప్ప అల్లుణ్ణి తెచ్చానని మీనమ్మ మిడిసిపడుతున్నదేమో? ఎటువంటివాళ్ళకు మిడిసిపాటు పనికిరాదు.

అందుచేత తమ పెద్దక్కయొక్క యోగక్షేమాలు కోరినవారై శ్రావణ మాసం వచ్చిందాకా ఎట్లాగో ఓర్చుకుని, అప్పుడు పార్వతి చేసుకునే నోములుచూసే మిష మీద ఇద్దరూ సకుటుంబంగా తరలివచ్చారు. అక్కచెవుల్లో పొయ్యవలసిన విష మంతా పోశారు.

మీనమ్మ తాటాకు చప్పుళ్ళకు బెదిరే కుందేలుకాదు. చెల్లెళ్ళు చెప్పినదంతా విని, "ఈ కాలంలో ముప్పైతే వెధవలుకూడా ముండ నుంచుకుంటుండే జమీంద్దారు

బిడ్డ ముండలవెంట తిరగటం అబ్బురమా ఏం? మా వియ్యపురాలి కేం తెగులొచ్చింది? మొగుడు ఆవిడ మొహం ఏనాడనగా చూశాడో! ఆవిడ గవురవం ఆవిడ కుండనే వుంది. అది ఆవిడ మొగుడుంచుకున్న ముండలకు రమ్మంటే మాత్రం వస్తుందా? బస్తీల్లో నాగరికత బలిసి, ఆడవాళ్ళు మొగుళ్ళ కొంగులకు కట్టుబడి, ఆ మొగుడు ముండాకొడుకు పక్కన వున్నంతసేపే మనుషులల్లే వుండటం నేరుస్తున్నారు. అటు వంటివి నాకు నచ్చవు సుమా!" అని దులిపేసింది.

చెల్లెళ్ళు నిర్ఘాంతపోయారు.

"బస్తీని బొత్తిగా కొట్టిపారేస్తివే! ఇంకా నీ కూతురూ అల్లుడూ బస్తీలో కాపరం పెడితే బాగుంటుందనీ, పిల్లను మేం కనిపెట్టి ఉంటామనీ అందామను కుంటున్నాం!' అన్నది ప్లీడరు గుమాస్తా భార్య.

మీనమ్మ చెల్లెళ్ళకేసి చురచురా చూసి, "మా అల్లుడి తర్లో ఈ పుల్లేపు పెట్టింది మీరేనా ఏం?" అని అడిగింది.

"సీతోడు. మా దగ్గిర అసలా విషయమే రాలేదు.... మీ ఇంట్లో ఏమైనా వచ్చిందంటే? మీ ఇంట్లోనూ రాలేదు! అతనికే ఈ ఆలోచన వచ్చిందా ఏం?"

"గాలి కబురుగా తెలిసింది. వాళ్ళ ఊర్నించి ఎవరో ఈమధ్య వచ్చార్లే. నా అభిప్రాయం అడిగితే కొట్టిపారేశా!" అన్నది మీనమ్మ.

"మంచిపని చేశావు! ఓ వేళ బస్తీ కాపరమే పెడితే ఇక రాత్రింబగళ్ళు ఆ గొందిలోనే పడుంటాడు. పిల్లముండ చూస్తే ఇంట్లో బిక్కుబిక్కుమంటూ ఒకత్తే ఉండడం చాలా కష్టం. పల్లెటూళ్ళోమల్లే బలగం ఉంటుందా ఏమన్నానా?" అన్నారు మీనమ్మ చెల్లెళ్ళు.

"ఈ కారణాలన్నీ ఎవరిక్కావాలర్రా? అతన్ని కావలిస్తే బస్తీలోనే పడి యూడవనీ. నువూ, నేనూ ఆపగలమా యేం? కాని పిల్లది మాత్రం బస్తీ కాపరం చెయ్యదు. నాకు శక్తి వున్నంతమటుకు చెయ్యనివ్వను. నా శక్తికి మించితే ఏమో మరి" అన్నది మీనమ్మ.

* * * *

తన భర్త గంజాయీ, సారాయీ తాగుతాడనీ, స్త్రీలోలుడనీ, అస్తమానమూ పేకాట డబ్బు పెట్టి ఆడతాడనీ పార్వతికి కూడా తెలిసింది. తల్లి విలవిల లాడితే తానుకూడా విలవిల లాడేదేమో. కాని తల్లి రాయిలాగా ఉండటం చూసి తాను కూడా రాయిలాగే ఉండిపోయింది.

ఇతరుల అవినీతి గురించి విడ్డూరంగా చెప్పుకునేవాళ్ళు, తాము నీతిపరులు కాకపోవటం ఆమెకు ఆ యీడుకే ఆశ్చర్యంగా వుండేది. తన అత్తవారి ఊళ్ళో ఉండే చిన్నమ్మ ఎన్నడూ ఇతరుల రంకుపురాణాలు చెప్పగా ఆమె వినలేదు. గేదెను అమ్మాలమనో, ఆవును కొనబోతున్నామనో, ఉన్న గొడ్లు రెండూ ఒకేసారి ఎతెడి

పోయాయనో, ఈ యేడు మినుము సరిగా కాలేదనో - తమ సంసారానికి సంబంధించిన విషయాలే మాట్లాడేది.

మరొకందుకూడా పార్వతి జానకమ్మను మెచ్చుకున్నది. ఆవిడ తన పెళ్ళి అయాక మళ్ళీ తన అత్తవారింటి గడప తొక్కలేదుట. మరొకరయితే అంత కలిగిన వాళ్ళ బాంధవ్యాన్ని ఊరికే పోనివ్వరు! ఎంతగానో పూసుకు తిరుగుతారు. జానకమ్మగారికి ఆ ఆలోచనకూడా వచ్చినట్టులేదు.

పార్వతి పెళ్ళి అయిన ఏడాదికి ఆమె పెద్ద అన్న లిద్దరికీ ఒకే సారిగా సంబంధాలు కుదిరాయి. రెండూ బస్తీ సంబంధాలే. దగ్గిర దగ్గిర్లో రెండు ముహూర్తాలు లేవని, రెండు పెళ్ళిళ్ళూ ఒకే ముహూర్తానికి సత్రంలో చేసేశారు. వియ్యపరాలి బెట్టూ, అలకలూ ఏవీ లేకుండానే మీనమ్మ వియ్యాలవార్లని అదరగొట్టేసింది. పెళ్ళిళ్ళు చేయించిన పురోహితుడు, "మీనాక్షమ్మగారూ! మీనాక్షమ్మగారు!" అంటూ ఆవిడ చుట్టూ తిరిగి ప్రతిదానికీ అనుమతి పొందాడు.

పార్వతి తన తల్లి ధాటీ చూసి, మనిషి ఇతరులను బెదరగొట్టటానికి డబ్బే అవసరం లేదనుకున్నది. తన అత్తగారి క్కూడా మనుషులు భయపడతారు. కాని అది డబ్బుచూసి.

పెళ్ళికూతుళ్ళ తరపువాళ్ళు పార్వతిని చాలా మర్యాద చేశారు. అడుగులకు మడుగు లొత్తారనుకోవలిసిందే. అది తాను మెట్టిన చోటునుబట్టి అయివుంటుందని పార్వతి అనుకున్నది. తనను ఎవరుగాని అంత మర్యాద చేస్తారని ఆమె కలలో కూడా అనుకోలేదు. మర్యాద చేయించుకోవటంలో చాలా ఆనందం ఉన్నది, అర్హత మాట ఏమైనప్పటికీ.

కాంతయ్య క్కూడా అన్ని మర్యాదలూ అంతకు రెండింతలుగా జరిగేవే. కాని అతను ముహుర్తం కాగానే, పొరుగూళ్ళో పని ఉన్నదనీ, మర్నాడు సాయంకాలానికి తప్పక తిరిగివస్తాననీ చెప్పి వెళ్ళిపోయాడు. మరి రాలేదు.

అతను వెళ్ళిన పొరుగూరు ఆ వూళ్ళోనే ఒక గొందిలో ఉన్నదని పార్వతికి కూడా తెలుసు.

ఆ గొందిలో ఇంటిని గురించి తలుచుకున్నప్పుడల్లా పార్వతికి ఒక వింత భావం కలిగేది. అందులో ఏ వికారమూలేదు. నిర్వికారంగా ఉండటమే అందులోని వింత. పెళ్ళాం అయినదానికి మొగుడి తిరుగుళ్ళు చూసి దుఃఖమో, విచారమో, కోపమో, అసూయో కలగాలన్న సిద్ధాంతం పార్వతికి తెలుసును. కాని ఆమె ఎంత ప్రయత్నించినా అటువంటిదేమీ ఆమెలో తలఎత్తనేలేదు. ప్రస్తుతం ఆమె మనస్సు జీవితాన్ని గమనించటంలోనూ చూసినది అర్థం చేసుకోవటంలోనూ నిమగ్నమై ఉన్నది. జీవితం పూర్తిగా అయోమయంగానూ లేదు, కరతలామలకంగానూ లేదు. అది చాలా నింపాదిగా కొస్త కొస్తే అవగాహన అవుతున్నది.

ఒక్క విషయం పార్వతికి స్పష్టంగా తెలియవచ్చింది; జీవితాన్ని పూర్తిగా అర్థం చేసుకున్నట్లు మాట్లాడేవాళ్ళు నిజంగా యేమీ చేసుకోలేదు. ఇతర్లలో లోపాలు వెతికేవాళ్ళు తమలో లోపాలు లేనట్లు నటించి, చాలా హాస్యాస్పదంగా ప్రవర్తిస్తున్నారు. ఎవరూ "నీ మాటేమిటి?" అని మొహాన అనరు. ఎవరికి పట్టింది? ఒకరి లోట్లు మరొకరికి పట్టనప్పుడు మరొకరి లోట్లతో మనకేం పని?

మీనమ్మగారి ఆధ్వర్యాన ఒక ఇంట్లోవాళ్ళకే పరస్పర సంబంధాలు ఆట్టే లేవు. మగపిల్లలు ఒకరితో ఒకరు అనవసరంగా మాట్లాడుకోరాదు. ఆడపిల్లలతో అసలు మాట్లాడరాదు. పార్వతి ఎప్పుడన్నా తన మనసులో మాట తన చివరి అన్నతో చెప్పుకునేది. వాడు కూడా తల్లి దగ్గరలో లేనప్పుడు చెల్లెలితో మనసిచ్చి మాట్లాడేవాడు.

తమ బావమరిది ప్రవర్తన అన్నలందరికీ తెలిసే ఉండాలి. కాని అందరూ ఏమీ ఎరగనట్టే ప్రవర్తించేవారు. ఆఖరివాడు వెంకటేశ్వర్లు మాత్రమే సాహసించి ఒకసారి, "మీ ఆయన్ని గురించి చాలా అసహ్యంగా చెప్పుకుంటున్నారు. తెలుసా?" అన్నాడు.

పార్వతి తెలుసునని తల ఆడించింది.

ఆ తరువాత ఏమనాలో వెంకటేశ్వర్లుకు తోచలేదు.

"నిన్ను తీసుకుపోయి అటువంటి వాడికి కట్టారు." అన్నాడతను చివరకు.

"ఇప్పుడేం చేస్తాం?" అన్నది పార్వతి నిర్లిప్తంగా.

"నీకేమీ బాధగా లేదా?" అని వెంకటేశ్వర్లు ఆశ్చర్యంగా అడిగాడు.

"దేనికి బాధ? ఎవరికర్మ వాళ్ళది?"

అది శుద్ధ అబద్ధ మన్నట్టు వెంకటేశ్వర్లు తల అడ్డంగా తిప్పి, "గొంతుపిసికితే వాడు చావడు; పిసికించుకున్నవాడే చస్తా" డన్నాడు.

అన్నదమ్ములందరిలోకీ వెంకటేశ్వర్లే చురుకైనవాడు. పైనలుగురూ పాత కాలపు చదువులు చదివారు. వెంకటేశ్వర్లే మేనమామ దగ్గిర ఉంటూ వాళ్ళ ఊళ్ళో వున్న హైస్కూలులో చదువుతున్నాడు.

తన చెల్లెలి మనసులో ఏదన్నా కష్టం ఉంటే తాను కూడా పంచుకుందామని తప్ప వెంకటేశ్వర్లుకు మరో ఉద్దేశం లేదు. పార్వతి నిర్లిప్తత ప్రకటించింది. వెంకటేశ్వర్లుకు అందులో అంతగా నమ్మకం చిక్కలేదు. కాని చేసేదేమీ లేకపోయింది.

* * * *

పార్వతి రజస్వల అయిన రోజుల్లో పట్నంలో వెంకటనారాయణ ఆకస్మాత్తుగా చనిపోయాడు. పోయిన నాలుగో రోజుకుగాని వాళ్ళ గ్రామానికి కబురందలేదు. కబురందాకనైనా ఏం జబ్బుతో పోయాడో, ఎప్పుడు జబ్బు చేసిందో, అసలు జబ్బంటూ చేసిందో లేదో, హఠాన్మరణమో, బలవన్మరణమో ఏమీ తెలియదు.

వెంకటనారాయణ వ్యవహారాలన్నీ చూస్తూండే "మామయ్యగారు" కాంతయ్యను వెంటబెట్టుకుని పట్నం వెళ్ళి మూడోరోజుకు ఒక కుండతో తిరిగి వచ్చాడు. తెలిసిన వివరాలనుబట్టి వెంకటనారాయణ చావు సహజమైనది కాకపోవచ్చునని అందరూ అనుకున్నారు. రాత్రి పదింటికి వాంతి చేసుకున్నవాడు మరో అరగంట కల్లా పోయాడు. తెల్లవారుఝామునే దహనక్రియలు జరిగిపోయాయి. దహనక్రియల కయిన ఖర్చంతా జమీందారిణి పెట్టుకున్నది. ఆ హత్యను తరిచి చూచి నట్టయితే ఒక డిటెక్టివు నవల తయారు కావచ్చు. లేదా దాని వెనక అమితమైన తాగుడుతో చెడిపోయిన కార్జం తప్ప ఇంకేమీ రహస్యం లేకనూ పోవచ్చు. అవతల పంచమ జార్జి చక్రవర్తి పట్టాభిషేకం[1] చేసుకుంటున్న ఆ రోజుల్లో జరిగిన ఈ మరణాన్ని గురించి అంతలోతుగా ఎవరు ఆరాతీస్తారు? నిజంకన్న ఊహ రమ్యం. నిజానికి ఒకటే రంగు. ఊహకు రకరకాల రంగులు. అందుకే నిజంకన్న ఊహలు బాగా ప్రచారమవుతాయి. వెంకటనారాయణ ఎలా చచ్చిపోయా డన్నదాన్ని గురించి అయిదారు రకాల కథలు పుట్టి, రంగులు మారుతూ వ్యాప్తి చెందాయి. కల్పనకు చరిత్ర మౌనంగా బలి అయింది.

కాంతయ్య శాస్త్రప్రకారం తండ్రికి ఉత్తర క్రియలు చేశాడు. శ్యామలాంబ గారు ముండనం చేయించుకోనని ఊళ్ళో చిన్న తుఫాను లేవదీసింది.

కర్మ చెయ్యటానికి కాంతయ్య మటుకు గుండు చేయించుకుని చిన్న పిలక ఉంచుకున్నాడు.

మీనమ్మ తన కూతుర్ని మాత్రం వెంటబెట్టుకుని వియ్యపరాలిని పరామర్శించటానికి వచ్చింది. అందరూ ఏడ్చేటప్పుడు పార్వతి కూడా ఏడ్చింది. కాని ఆమె హృదయంలో ఏ విధమైన దుఃఖమూలేదు.

అత్తగారు జుట్టు ఉంచుకోవటం పార్వతి హర్షించింది. మొగుడు పోతే భార్య ఎందుకు తలగొరిగించుకోవాలో, విధవను మంగలి వాడెందుకు అంటుకోవచ్చునో ఆమెకు ఏమాత్రమూ అర్థం కాలేదు. కొన్ని కొన్ని పనులు అందరూ చేస్తున్నవే అయినా అర్థంకావు.

'నా మొగుడే చస్తే నేను గుండు చేయించుకోనే చేయించుకోను' అనుకున్నది పార్వతి. అలాంటి ఆలోచన వచ్చినందుకు ఆమె అంతరాత్మ ఏమాత్రమూ ఆక్షేపణ చెప్పలేదు. ఆమె కాంతయ్యను తన మొగుడికింద చూడటం ఇంకా ప్రారంభం కాలేదు. ఆ భావం ఏర్పడ్డాక తన వైఖరి ఎట్లా ఉంటుందో ఆమెకు తెలీదు.

తన అత్తగారి పుట్టింటివైపు బంధువులను కొందరిని పార్వతి ఈసారి బాగా

---

1. పంచమ జార్జి (1865 – 1936) పట్టాభిషేకం 1911లో జరిగింది. అదే ఏడాది భారతదేశానికి వచ్చారు. దర్బారు జరిగింది.

చూసింది. వాళ్ళు ఆమె పెళ్ళప్పుడు కూడా వచ్చారు. కాని పార్వతికి వాళ్ళ పరిచయం సరిగా కాలేదు.

వాళ్ళలో శ్యామలాంబ మేనల్లుడూ, అతని భార్యా ఉన్నారు. ఆ దంపతులు మరో ప్రపంచం నుండి దిగివచ్చిన వాళ్ళలాగా పార్వతికి కనిపించారు. భర్త పేరు నరసింహస్వామి. భార్యపేరు త్రివేణి. ఆమె తండ్రి కలకత్తాలో వుండేవాట్ట. ఆమె బియ్యేదాకా చదివిందనీ, పద్దెనిమిదోఏట ఆమెకు పెళ్ళి అయిందనీ, ఆమె బెంగాలీ భాషలో వ్యాసాలు రాస్తుందనీ వింటే పార్వతికి అంతా ఏదో కథలాగా ఉన్నది. నరసింహస్వామి తన భార్యను "వేణీ" అని పిలుస్తున్నందుకు చాటుగా అందరూ నవ్వుకున్నారు.

మొగుడు పెళ్ళాన్ని పేరుపెట్టి పిలవటం పార్వతికి కూడా విడ్డూరంగానే ఉన్నది. కాని అందుకు నవ్వాలని ఆమెకు తట్టలేదు. పైపెచ్చు నవ్వుతున్న వాళ్ళను చూస్తే ఆమెకు మండుకొచ్చింది.

ఈ విషయం ఆలోచించేటప్పుడే పార్వతికి దేని మంచిచెడ్డలైనా నిర్ణయించటానికి ఒక సూత్రం దొరికింది- దాన్ని ఆమె తన పన్నెండోఏట ఒకరు చెప్పకుండా కనిపెట్టింది. ఆ సూత్రం ఏమిటంటే; ఒక కొత్తమాదిరి పనిని ప్రపంచమంతా అనుసరిస్తే జీవితం కొంచెం బాగవుతుందా లేక మరింత అధ్వాన్న మవుతుందా? మాటవరసకు భర్తలందరూ తమ పెళ్ళాలను "ఏయ్, "ఇదుగో" అని పిలవకుండా పేర్లు పెట్టి పిలిస్తే జీవితం ఇంకొంచెం బాగుంటుందా, బాగుండదా? బాగుంటుందని పార్వతికి గట్టి నమ్మకం కుదిరింది. దాన్ని చూసి అందరూ నవ్వుతున్నారు!.... తనను తన మొగుడు ఈ జన్మలో పేరు పెట్టి పిలవడు! ఇంకో యాభైఏళ్ళకో వందేళ్ళకో అందరు మొగుళ్ళు తమ పెళ్ళాలను పేర్లు పెట్టి పిలవొచ్చు. కాని తనకా యోగ్యత రాసిపెట్టలేదని అప్పుడే తేలిపోయింది.

"నాకో కూతురు పుడితే దాన్ని మొగుడు పేరుపెట్టి పిలవాలని ఆంక్షపెడతాను. అందు కొప్పుకున్నవాడికే పిల్లనిస్తాను – అడుక్కునే వాడైనాసరే" అనుకున్నది పార్వతి.

ఏళ్ళు మీదపడి, అర్థశతాబ్దం అనుభవం గడించినవాళ్ళమే మనం తప్పుపట్టలేని ఒక కళను గాని, అభిప్రాయాన్ని గాని ఆదర్శప్రాయంగా ఉన్నదనుకుంటాం. అది అపోహే కావచ్చు. కాని అందులో ఎలాటి దోషమూ కనిపించనప్పుడు అది ఆదర్శం లాగా కనపడటంలో ఆశ్చర్యం లేదు.

పార్వతికి దాంపత్యమంటే ఏమిటో అంత బాగా తెలీదు; అనుభవం మొదలే లేదు. అయినా కూడా త్రివేణీ నరసింహస్వాములు ఆమెకు ఆదర్శదంపతులల్లే కనిపించారు. కారణం?

ఆమె చాలా దాంపత్యాలు చూసింది. కాపరానికి వచ్చిన కొత్తలో భార్య మొగుణ్ణి చూసినప్పుడల్లా చెప్పరానిదేదో జ్ఞాపకం వచ్చినట్టు ముసిముసి నవ్వులు

నవ్వుతూ సిగ్గుపడుతుంది. ఒకరిద్దరు పిల్లలు పుట్టాక మొగుడు పిలిచినప్పుడల్లా మొహం రాయల్లే చేసుకుని, ముక్కుతూ, మూలుగుతూ, గొణుగుతూ లేచి వెళ్ళి 'ఏమిటీ?' అని దెప్పినట్టుగా అడుగుతుంది.

ఈ అనుభవంతో చూస్తే త్రివేణి చాలా కొత్తతరహా భార్యగా కనిపించింది. ఆమె తన భర్త ఎటో పోతుంటే మోచెయ్యి పట్టుకుని ఆపటమూ, అతని చొక్కా మీద ఏ చీమో, పురుగో కనిపిస్తే తీసెయ్యటమూ లాటి స్వల్ప విషయాలు కొన్ని పార్వతి గమనించింది. ఇటువంటి పనులు సాధారణంగా భార్యలు అందరూ చూస్తుండగా చెయ్యరుగనక వాటిలో ఏదో అందమూ, అమితమైన అన్యోన్యమూ ఉన్నట్టు ఆమెకు అనిపించింది. త్రివేణికి అవి అలవాటైన చర్యలు మాత్రమే అయి వుండవచ్చునన్నది పార్వతి ఊహకు అతీతమయింది.

* * * *

పార్వతి రజస్వల అయిన దగ్గర్నుంచీ ఆడవాళ్ళు గర్భాదానం గురించి మాట్లాడుతూనే ఉన్నారు. సమర్తాడిన పిల్లకి మూడునెల్లలోపుగా గర్భాదానం చెయ్యాలి. కొందరు అంతకాలం కూడా వుంచరు. పదో ఏడు వెళుతూనే పెద్దమనిషై, పదకొండు నిండేలోపుగా బిడ్డతల్లులైనవాళ్ళు పార్వతి బంధువర్గంలోనే ఇద్దరున్నారు. గర్భాదానమంటే భయపడి, గదిలోకి బలవంతాన ఈడ్చుకుపోవలసి వచ్చినవాళ్ళను గురించి పార్వతి విన్నది. ఆమె వింటుండగా కొన్ని హాస్య సంభాషణలు కూడా చెప్పుకున్నారు. భాగవతుల వారమ్మాయి గర్భాదానం రాత్రి ముట్టయిందిట. అప్పటికాపిల్ల స్నానంచేసి పదిరోజులే అయింది. అయినా ముట్టు, ముట్టు అని ఎడంగా కూర్చోబెట్టారుట.

"గర్భాదాన పెళ్ళికొడుకు నోట కరకక్కాయి; ఉత్తపుణ్యానికి నాగా పెట్టేశారు. ముట్టూకాదు ముక్కుచెక్కలూకాదు!" అన్నది ఒక మాటకారి. అందరూ గొల్లున నవ్వారు. ఎవరో చెప్పాకగాని ఆ హాస్యం ఏమిటో పార్వతికి అర్థం కాలేదు. అర్థమైనాక కూడా అది వెకిలి హాస్యమనే ఆమె అనుకున్నది. ఇంతకంటేకూడా వెకిలిగా ఉన్న గర్భాదానం ఒకటి మాటకారి ఆవిడ చాలా కొద్దిమందికి అతి రహస్యంగా చెప్పింది. ఎవరో ఒక నెరజాణ అయిన ఒక అమ్మాయి, అనుభవంలేని తన మొగుణ్ణి గర్భాదానం రాత్రి అతి తేలికగా మోసం చేసిందిట. విన్నవాళ్ళు నోళ్ళు నొక్కుకుని నవ్వుకున్నారు.

"తరవాత అబ్బాయికి దారి తెలిసిందిలే. నలుగురు పిల్లల్ని కన్నాడు" అన్నది మాటకారి.

"ఛీ, ఊరుకో! పాడుమాటలూ నువ్వూనూ!" అన్నారు వినేవాళ్ళు, లోపల సంతోషిస్తూనే.

వెంకటనారాయణ చావుమూలంగా కాంతయ్య సంవత్సర సూతకం వెళ్ళినదాకా గర్భాదానం తలపెట్టలేదు. పార్వతి దాంపత్య జీవితంకోసం తహతహలాడి

పోవటంలేదు. అయినా ఈ సంవత్సర సూతకంలో గల లోకవంచన ఆమెకు అర్థమయింది. ఈ ఏడాదిపాటు తన మొగుడు బ్రహ్మచర్యం అవలంబించబోతున్నాడా? వట్టిమాట. మనిషి శరీరంమీద స్వభావసిద్ధంగా ఉన్న చర్మం కప్పుకాక బట్టల రూపంలో ఒక మాయకప్పుకూడా ఉన్నట్టుగా, మనుషుల ప్రవర్తనలో కూడా ఒక స్వభావసిద్ధమైన పొరా, దానిపైన ఒక మాయపొరా ఉన్నాయి. ఈ మాయ పొర లేకుండా ప్రపంచం నడవదు కాబోలు!

ఈ సంవత్సరం కాలంలో పార్వతికి చాలమంది సలహాలు కూడా ఇచ్చారు.

"నీ మొగుడు ముండలముఠాఖోరని ఏమి బెంగపడకు— మగవాళ్ళంతా ఇంతే. నువు కాపరానికి రాకమునుపు నీ మొగుడేం చేశాడన్నది నీ కనవసరం. కాని ఆ తరువాత ఆ మొగుణ్ణి కట్టేసుకునే నేర్పు నీలో ఉంది. రావమ్మ మొగుడు వెంకటకిష్టయ్యలేడూ. సల్లకుక్కను దారేపోనిచ్చేవాడుకాడు. అటువంటివాణ్ణి రావమ్మ తన గుప్పిట్లో పెట్టుకున్నది. ఇప్పుడా కిష్టయ్య రంభా ఊర్వసు లొచ్చినా కన్నెత్తి చూడడు. తెలుసా? అందాకా దేనికి? మీ అత్తగారికి మొగుణ్ణి కట్టేసుకునే నేర్పే ఉన్నట్లయితే, మీ మామగారు అట్లా ఇల్లు పట్టకుండా తిరిగి చివరకు చోటుగాని చోట బలవంతపు చావు చచ్చేవాడా? కనక, జాగ్రత్త! మొగుణ్ని ఎట్టా లోబరచుకుంటావో!"

మొగుణ్ని లోబరచుకోవటమనేది ఏదో కుట్రలాగా వినిపించింది పార్వతి చెవులకు. ఈ సలహాలు చెప్పేవాళ్ళు వాటిని తమ జీవితంలో అమలుచేశారన్న నమ్మకం ఆమెకు కలగలేదు. ఇటువంటి సలహాలు కూడా జీవితపు మాయపొరకు సంబంధించినవేనేమో!

కొంతమంది చిన్నకారువాళ్ళు పార్వతికి ఒక చిన్న 'టిప్' ఇచ్చారు. గర్భాదానంనాడు పెళ్ళామేది అడిగినా మొగుడు ఇచ్చేస్తాట్ట!

గర్భాదానపు పెళ్ళికొడుకును పార్వతి నాలుగు చేతులుగల విష్ణుమూర్తిగానూ, నాలుగు తలలుగల బ్రహ్మదేవుణ్నిగానూ ఊహించుకుని తనలో తాను నవ్వుకున్నది.

తీరా గర్భాదానం రోజు వచ్చాక పార్వతికి చాలా చీదర అనిపించింది. బ్రాహ్మలూ, తంతూ, ముత్తయిదువులూ, వెధవపాటలూ, సిగ్గుమాలిన పరాచకాలు- తానొక బలిపశువు ! ఎవరో అనగా విన్నది. వేటలో చావటం మేలా? బలిపశువుగా చావటం మేలా? వేటలోచస్తే త్వరగా ప్రాణం పోతుంది. బలిపశువుగా చస్తే ఉత్తమ లోకాలు కలుగుతాయి. అంచేత బలిపశువుగా చావటమే మేలు!

ఇదంతా నిజంకావచ్చు. కాని చిక్కెక్కడ వచ్చిందంటే ఈ గర్భాదానం తంతు యజ్ఞంలాగూ ఉన్నది. వేటలాగా కూడా ఉన్నది. రెండు రకాల చావూ ఎదట ఉన్నప్పుడు ఏది మంచిదనే సమస్య ఏమిటి?

గర్భాదానపు గదిలో కాంతయ్య మొరటుగా ప్రవర్తించలేదు కాని - చాలా అసహ్యంగా ప్రవర్తించాడు. ఆమెను కొన్ని కొన్ని పనులు చెయ్యమన్నాడు. పార్వతి చెయ్యననేసింది. అతను చిన్నబుచ్చుకున్నట్లు కనబడ్డాడు.

అకస్మాత్తుగా పార్వతి అతన్ని, "నన్ను పేరుపెట్టి పిలుస్తారా?" అని అడిగింది.

"అదేమిటి?" అన్నాడు కాంతయ్య నిర్ఘాంతపోయి.

"తెలుసుకోవాలని అడిగాను" అన్నది పార్వతి.

"నీ పేరు నాకు తెలుసు— పార్వతి"

"మీ పేరూ నాకు తెలుసు- కాంతయ్యగారు" ఆ "గారు" చేర్చకపోతే అసలే పడదడలాడుతున్న ఆమె గుండె బద్దలే అయ్యేదనిపించింది. ఆడది మొగుడిదగ్గిర ఒంటరిగా ఉన్నప్పుడుకూడా మొగుడిపేరు అనటానికి గుండె ధైర్యం కావాలి!

"నేను మిమ్మల్ని పేరుపెట్టి పిలవటం జరిగే పని కాదు. నన్ను మీరు, అందరూ వింటుండగా, పేరు పెట్టి పిలుస్తారా? చెప్పండి" అన్నదామె.

"నువు పిలవనప్పుడు నేనెందుకు పిలవాలి? నేనూ పిలవను" అన్నాడు కాంతయ్య.

"మీరు పిలవరని నాకు తెలుసు- అయినా అడిగాను" అన్నదామె.

* * * *

అత్తవారింట అడుగు పెట్టగానే పార్వతి ప్రపంచమంతా గుర్తించరాకుండా మారిపోయింది. వేరే యిల్లు, వేరే మనుషులు, వేరే చెట్లు, వేరే వాతావరణం, అపరిచితమైన పేర్లూ, సంభాషణలునూ. కొద్దికాలంపాటు ఇదంతా తనదేనని ఆమెకు నమ్మకం కుదరలేదు. తాను ఏదో పరాయిచోటికి అతిథిగా వచ్చానని పించింది. ఆ భావం పోయేదాకా ఆమె ఆరోచనలు తాను వదిలివచ్చిన చోటునూ, మనుషులనూ ఆశ్రయించుకు తిరిగాయి.... ఇప్పుడు అమ్మ ఏం చేస్తుంటుంది? సత్యనారాయణగారింట్లో చేరిన మనుషులు తనను గురించి ఏం మాట్లాడుకుంటూ ఉంటారు?

అయితే ఇటువంటి ఆలోచనలు క్రమంగా తగ్గిపోయాయి. ఇల్లు అలవాటవు తున్నది. గదిలో నుంచి వంటింటోకి వెళ్ళటానికి మధ్యగదిలోనుంచి ఎడమపక్కకు తిరిగే అలవాటుకు బదులు, నడవవెంబడి ఆమె కాళ్ళు అప్రయత్నంగా కుడి పక్కకు తిరిగిపోతున్నాయి. పుట్టింట స్నానాలగది అంటూలేదు. ఇప్పుడామె సొంత స్నానాల గదికి అలవాటు పోయింది.

అత్తవారింట మొదట్లో ఆమెకు అందరికన్న దగ్గిరవాడు మొగుడే. కాని త్వరలోనే మిగిలినవాళ్ళు అతనితో పోటీచేయసాగారు. పార్వతితో చాలా కఠినంగా

ప్రవర్తించడానికి ప్రయత్నించిన శ్యామలాంబ, అకస్మాత్తుగా ఎంతో ఇష్టంగా ప్రవర్తించసాగింది.

తనను ఎట్లా చూడాలో ఆవిడకు తెలియటం లేదనుకున్నది పార్వతి.

తమ ఇంట్లో ఎంతమంది నౌకర్లున్నదీ తెలుసుకోవటం పార్వతికి మొదట కష్టమయింది. ఊళ్ళో ఉన్న పేదకుటుంబాల వాళ్ళంతా తన అత్తవారి నౌకర్లలాగే కనబడ్డారు. ఎవరెవరో వచ్చి ఏదో పనిలో సహాయం చేసేవాళ్ళు. అసలైన నౌకర్లు కమతగాళ్ళు మాత్రమే. ఒక కమతగాడి భార్య ఇంటిచాకిరి అంతా చేసేది.

ఎంతమంది అయితే ఇంటికి వచ్చేవాళ్ళో అందరూ పార్వతిని చాల గౌరవంగా చూసేవాళ్ళు. ఇంచుమించు ప్రేమగా చూసేవాళ్ళని చెప్పవచ్చు.

మనిషి అంతరాత్మ ఒక ఎకౌంటెంటు లాంటిది. జమాఖర్చులు సమంగా లేకపోతే అది ఆందోళన చెందుతుంది. తనవల్ల ఏమీలాభం పొందకుండా వాళ్ళంతా తనను ప్రేమగా చూడటం పార్వతికి పట్టిచ్చినట్టుండేది. తన అంతరాత్మను తృప్తి పరచుకోవటాని కామె ఊళ్ళో అందరి కష్టసుఖాలూ కనుక్కోసాగింది. మొదట్లో ఆమె ఈ పని ఏమంత ఆసక్తితో చెయ్యలేదు. కాని రాను రాను ఆసక్తి దానంతట అదే ఏర్పడింది.

అందుకు వేరే కారణం ఏమీ అవసరంలేదు. ఊళ్ళో ఎన్నో కొంపల్లో గృహచ్ఛిద్రాలూ, అశాంతీ కలగటానికి కారణం తన భర్త కాంతయ్యే.

కాని పార్వతిని మౌనంగా ఆరాధించిన వ్యక్తి మరొక డున్నాడు. అతను సోమన్న. ఒక్కొక్క మనిషికి ఒక్కొక్క మనిషిలో దేవత్వం కనబడుతుంది. ఆ మనిషిముందు మిగిలిన వాళ్ళందరూ తోలుబొమ్మలల్లే ఉంటారు. సోమన్నకు పార్వతిని చూసిన క్షణంనుంచీ అదేభావం కలిగింది. కాంతయ్యను చూస్తే అతనికి ఘనమైన అభిప్రాయంలేదు. కాని కాంతయ్యకు భార్య అయినప్పటికీ పార్వతి దేవత్వానికి కళంకం రాదని అతని నమ్మకం. అటువంటి గంధర్వస్త్రీని తాను ప్రత్యక్షంగా చూస్తున్నానని సోమన్న మనస్ఫూర్తిగా నమ్మాడు. పార్వతి వంటిది రావటంతో తమ గ్రామం పవిత్రమయినట్టు అతను ఊహించుకున్నాడు.

అయితే ఇటువంటి ఆరాధన, ఆస్కార్‌వైల్డ్ కళలాగా,[1] పూర్తిగా నిరర్థకం. అది ఆరాధించేవాడి కేదో అవ్యక్తానందాన్ని చేకూర్చుతుంది. అంతకుమించి ఏమీ జరగదు.

పార్వతికి ఏదో జబ్బు పట్టుకున్నది. దాన్ని గురించి చాకలి రామిని తహ

---

1. ఆస్కార్‌వైల్డ్ (1854–1900) : ఐరిష్ కవి, నాటకకర్త, నవలా రచయిత, విమర్శకుడు. కళ కళకోసమే అని విశ్వసించిన శుద్ధ కళావాది, రూపవాది. నవలలోని సోమన్న నిరర్థకమైన ఆరాధనవంటిదే ఆస్కార్‌వైల్డ్ నిరర్థకమైన కళ.

స్యంగా అడిగింది.

రామి నవ్వి, "బట్టంటులేమ్మా! శానామంది కుంటుంది. మీ అత్తగారికి లేదూ?" అన్నది.

పార్వతి తరచి అడగక అంతటితో పోనిచ్చింది.

*　　*　　*　　*

కుదుపులేకుండా నడిచే బండిలో కదలిక తెలీదు. పార్వతికి నెలలూ, సంవత్సరాలూ తెలియకుండానే గడిచిపోతున్నాయి.

ఎప్పుడో యుద్ధం[2]వచ్చింది. "యుద్ధానికి వంద రూపాయలైన ఇయ్యమంటున్నారు. ఇయ్యక తప్పేట్టులేదు" అని మామయ్యగారు ఒకనాడు చెప్పి వెళ్ళాడు.

మీనమ్మగారికి పెద్ద జబ్బుచేసి, చచ్చి బతికింది.

కోమటిగుమాస్తా బాబాయికి పక్షవాతం వచ్చింది.

పార్వతి కడుపున ఇంకా నలుసు పడలేదు. అదొక లోటుగా శ్యామలాంబ ఎవరితోనో చెప్పటం పార్వతి విన్నది. శ్యామలాంబగారే కాపరానికి వచ్చిన ఆరేళ్ళకు సుపుత్రుణ్ణి కన్నది. ఆ సంగతి ఆమెకు జ్ఞాపకం ఉన్నట్టులేదు.

పార్వతికి తన భర్తమీద అసహ్యం ఒక్కసారిగా కలగలేదు. మైధునసుఖం పట్ల ఆమెకు వస్తుతహా జుగుప్సకాని ఏవగింపుగాని లేదు. కాంతయ్యే వాటిని ఆమెలో కలిగించాడు.

---

2. యుద్ధం : యిది జులై 28, 1914-నవంబరు 11, 1918 మధ్య జరిగిన మొదటి ప్రపంచ యుద్ధం. ఈ యుద్ధానికి తక్షణ కారణం బాల్కన్లలో తలెత్తిన జాతీయవాదం. సర్బియన్ జాతీయవాదులు ఆస్ట్రోహంగేయన్ సింహాసనానికి వారసుడైన ఆర్చిడ్యూక్‌ను చంపడం. ఈ యుద్ధబీజం యింగ్లండు, ఫ్రాన్సు, జపాను, అమెరికాలు మిత్రపక్షాలుగా ఒకపక్షం. అవతలి పక్షం జర్మనీ, ఆస్ట్రియా, హంగరీ, టర్కీలు. భారత ప్రజాభిప్రాయంతో నిమిత్తం లేకుండా బ్రిటిష్ ప్రభుత్వం ఈ సామ్రాజ్యవాద యుద్ధంలోకి భారతదేశాన్ని కూడా లాగింది. కాంగ్రెసు, బ్రిటిషు ప్రభుత్వాన్ని బలపరిచింది. ప్రభుత్వం యుద్ధనిధి వసూళ్ళను ఆస్తిపర వర్గాల నుంచి ఋణాల రూపంలో భారీగా దండింది. పాఠశాలల్లో యూనియన్ జాక్ అనే బ్రిటిష్ పతాకాలను అమ్మింది. ముడిసరుకులను బలవంతంగా ఇంగ్లండుకు తరలించింది. ఈ యుద్ధం తర్వాత ఈ యుద్ధకాలంలోనే యేర్పడిన ప్రప్రథమ సోషలిస్టు రాజ్యం, అందుకు కారణమైన **భావాలూ భారతదేశంలో** వామపక్షభావాల వ్యాప్తికీ, కమ్యూనిస్టుపార్టీ **ఆవిర్భావానికీ** కారణమయ్యాయి.

తాను స్త్రీని సంతృప్తిపరచటంలో నేర్పరిననీ, సాధారణంగా ఏ మగవాడూ ఆడదాన్ని పూర్తిగా సంతృప్తిపరచలేడనీ, మగవాడికన్న ఆడదానికి ఎనిమిదిరెట్లు కామం ఉంటుందనీ అతను అనేవాడు.

అతను తన "విజయాలను" పార్వతిదగ్గర ఎప్పుడూ చెప్పేవాడు.

"ఆడదానికీ, ఆడదానికీ తేడా ఏమిటి? మీ రీ అడ్డమైన వాళ్ళతోనూ ఎందుకు పోతారు?" అని ఆమె ఒకసారి భర్తనడిగింది.

"ఎవతె అయినా సవాలుచేస్తే జవాబు చెప్పకపోవడం మగసిరికి లోపం కాదా?" అన్నాడు కాంతయ్య.

కొన్ని నిజాలు అనుభవం లేకుండానే గ్రహించవచ్చు. పార్వతి కాంతయ్యను తప్ప మరొక పురుషుణ్ణి ఎరగనప్పటికీ అందరు భర్తలు తమ పెళ్ళాలతో అంత మొరటుగా ఉండరని ఆమె గ్రహించింది. అతనిలో కామం తప్ప ప్రేమలాటిది ఎన్నడూ చూడలేదు.

చాలాసార్లు పార్వతిలో, ఏ సహజప్రేమచేతనో భర్తమీద ప్రేమ ఉబికి వచ్చేది. కాని దానికి కాంతయ్య రోలీవిలవ ఇచ్చినట్టు కూడా కనిపించేవాడు కాడు. దాన్నిబట్టి అతనికి ప్రేమతో అవసరంలేదని కూడా పార్వతి ఊహించుకున్నది. ఆమెలోని ప్రేమ దీర్ఘరోగంతో బాధపడిన మనిషిలాగా ఏళ్ళతరబడి తీసుకుని, తీసుకుని మరీ చచ్చింది. ప్రేమ ఖాళీ చేసిన జాగాలో ద్వేషం ఎందుకు వచ్చి కూర్చుంటుందో మనస్తత్వం తెలిసినవాళ్ళు చెప్పాలి.

చిట్టచివరకు పార్వతి మనస్సులో ద్వేషంతప్ప ఏమీ మిగలలేదు. ఆమె అతన్ని దగ్గిరకు కూడా రానివ్వకపోవటం ప్రారంభించింది.

"నన్ను వేధించకండి. నేను మీక్కావలసిన ఆడదాన్ని కాను. మిమ్మల్ని సవాలుచేసేవాళ్ళు బోలెడంతమంది ఉన్నారు. వాళ్ళమీద మీ ప్రతాపం చూపించండి" అన్నదామె.

ఆమె ఈమాట అన్నరోజుకే గర్భవతి. అప్పటికింకా ఆ సంగతి బయట పడలేదు.

కోడలు గర్భిణిగా ఉన్నదని తెలిసి శ్యామలాంబ సంతోషించింది. ఊళ్ళో అందరూ కూడా సంతోషించారు. ప్రతిఒక్కరూ తననుచూసి వెకిలినవ్వులు నవ్వుతూ "పండంటి పిల్లాణ్ణికను తల్లీ!" అని, కోరికలాగానూ కాకుండా, ఆశీర్వాదంగానూ కాకుండా అంటుంటే పార్వతికి ఏదో చిరచిరగ ఉండేది. తను తల్లి కాబోతున్నా నన్న ఆనందం ఆమెను ముంచెత్తలేదు. పైపెచ్చు కాంతయ్య బీజం తన కడుపున పడినందుకు చాలా చీదరించుకున్నది.

కాని పార్వతి మనసుగురించి ఎవడు విచారించారు? ఆమెను అందలం ఎక్కించి, ఊరుకు ఊరంతా ఉత్సవం చేసుకున్నంతపని చేశారు. జున్నులూ, పళ్ళూ, తేనెలూ, భావన అల్లాలూ, భావన కరక్కాయలూ, మామిడితాండ్రలూ-

ఏమేమిటో తెచ్చి ఇచ్చారు. పార్వతి వాటిని ముట్టుకోలేదు. ఆమె పేరుచెప్పి మిగి లినవాళ్ళు తిన్నారు.

ఈ మహోత్సాహం మధ్యనే ఎవరో కాంతయ్యను కాలు విరగగొట్టారు.

రాత్రి ఏడున్నరా ఎనిమిది మధ్య వాములదొడ్డి దగ్గిర ఇది జరిగింది. అందరూ నిద్రపోయేలోపుగా ఊరంతా తెలిసింది. ఊరి మంగలి వచ్చిచూసి, ఏదో పసరురాచి కట్టుకట్టాడు. కాని జనరలు ఆస్పత్రికి తీసుకుపోవడం మంచి దన్నాడు. కాంతయ్య ఎడమకాలు చీలమండకు రెండుబెత్తెలు ఎగువగా విరిగింది. ఎముక సాంతం విరగలేదు. పాదం బాగా వంకరపోయింది.

ఎవరు కొట్టారు ?

ఎందుకు కొట్టారు ?

కాంతయ్యమీద చెయ్యి చేసుకోటానికి ఎంత గుండె నిబ్బరం కావాలి ? నిజం బయటపడితే వాడికి ఊళ్ళో మంచినీరు పుడుతుందా ?

కొంతమందికి వాస్తవ విషయాలు తృప్తి నివ్వవు. వాళ్ళు జరగనిది ఊహిం చుకుని, జరిగినట్టే ఉద్రేకం తెచ్చుకుంటారు? "ఆ దెబ్బే నెత్తిన పడినట్టయితే? ఇంకే మన్నా ఉందా ?"

కాని, "ఆ కొట్టేవెధవ నెత్తిమీద ఎందుకు కొట్టలేదో?" అని ఆశ్చర్యపడ్డ వాళ్ళుకూడా ఊళ్ళో ఒకరిద్దరు లేకపోలేదు. అయితే వాళ్ళు తమ ఆశ్చర్యాన్ని బయటికి చెప్పుకోలేదు.

కాంతయ్య గుంటూరు ఆస్పత్రికి పోయి కట్టు కట్టించుకుని, ఒక నెలపాటు మంచంలోనే ఉన్నాడు. కొట్టినవాడెవడో చెప్పమనీ, కేసు పెడదామనీ ఎంతో మంది అతన్ని ప్రోత్సహించారు. కాని కాంతయ్య అందుకు అనుకూలంగా ఉన్నట్లు కనబడలేదు. కొట్టినవాణ్ణి చీకట్లో తను చూడలేదన్నాడు. ఆ సంఘటనకు సంబంధించిన ప్రశ్నలకు సమాధానం చెప్పటమే అతనికి ఇష్టంలేకపోయింది.

కాంతయ్య దెబ్బతిన్ననాడు అతని ఇంట్లోవాళ్ళంతా అతను చచ్చినంత అట్టహాసం చేశారు. ఒక్క పార్వతి మాత్రం రాయిలాగా ఉండిపోయింది.ఆమెలో ఏ మేం వికారాలు కలిగాయోగాని పైకి ఒక్కటీ వ్యక్తంకాలేదు. ఆ రాత్రి ఆమె అన్నంమటుకు తినలేదు. ఆకలి లేదన్నది.

* * * *

కాంతయ్య కాలికి తగిలిన దెబ్బ ఆ గ్రామంయొక్క చరిత్రలో ఒక ప్రధాన ఘట్టం. రొచ్చుగుంటలాగా ఉన్న అక్కడి ఫ్యూడల్ వ్యవస్థలో పడిన మొదటి రాయి. ఆ ఒక్క రాయితో రొచ్చుగుంట కాస్తా ప్రవాహం అయిపోదు. అది వేరే విషయం.

తనను కాలు విరగ్గొట్టిన దెవరో కాంతయ్య ఎరుగును. ఆ మనిషి భార్య కొత్తగా కాపరానికి వచ్చింది. మొగుడు ఇంట్లో లేనప్పుడు కాంతయ్య వెళ్ళి

సరసాలాడాడు. అటువంటి మాటలు మాట్లాడితే భయపడే ఆడవాళ్ళున్నారు. ఇష్టపడే ఆడవాళ్ళున్నారు. కాని ఈ మనిషి మూడోరకం అయిపోయింది. ఆ రకం కాంతయ్య లిస్టులో లేదు. అందుచేత అతను పొరపడ్డాడు.

"తమవాంటి గొప్పోరికి నామీద మనసయిందా? ఏవదురుష్టం!" అన్నదామె వెటకారంగా.

"నీ అదృష్టం ఇప్పుడే ఏం చూశావు? రాత్రికి వాములదొడ్ల వెనక్కిరా!" అన్నాడు కాంతయ్య.

"వస్తానా, వస్తానా!" అన్నదామె. అంటే ఏమిటో కాంతయ్యకు సరిగా అర్థం కాలేదు.

అది రాలేదుగాని దాని మొగుడొచ్చాడు-ఇంత లావు దుడ్డుకర్ర పట్టుకుని.

"ఏంటి, బాబూ! సీకట్లో కాపేశారు? ఏ పిట్టకోసం?" అన్నాడు వాడు నవ్వుతూ, కర్ర నేలకేసి తాటిస్తూ.

కాంతయ్య నవ్వటానికి ప్రయత్నించాడుగాని నవ్వురాలేదు. అక్కణ్ణించి కదిలి వెళ్ళాలని పించింది.

"ఆగు!" అన్నాడు దుర్మార్గుడు.

కాంతయ్య ఆగలేదు! వెనకనుంచి తపీమని దెబ్బపడింది. ఎముక విరగటం కాంతయ్యకు తుపాకి పేలుడల్లే వినిపించింది.

"గ్యాపకం ఉంచుకో, ఈ దెబ్బ నీ నెత్తిమీద వేసినా నన్నడ్డే నాకొడు కెవడూలేడు. ఒళ్ళు దగ్గిరుంచుకు తిరుగు. నామీద కేసుగాని పెట్టావో నిన్నూ నీ వాళ్ళనూ బూడిద చేసేస్తా!"

కుప్పకూలిపోయి ఉన్న కాంతయ్య కీమాటలు అశరీరవాణి హెచ్చరికలాగా విన్పించాయి.

కాంతయ్య స్వతహాగా చాలా పిరికివాడు. అతను చేసే పనులలో సాహసా లేవైనా ఉంటే, అవి అతనికి అండగా ఉన్న సామాజిక వ్యవస్థ ఇచ్చినవే.

కాంతయ్య భీరువన్న సంగతి పార్వతి ఏనాడో కనిపెట్టింది. ఆ సంగతి ఆమెకు తెలిసినట్టుగా మరెవ్వరికీ తెలీదు. అందుచేతనే ఆమె తన భర్తను చూసి ఏనాడూ భయపడి ఎరగదు.

తనను కొట్టినవాడిమీద కేసు పెట్టటానికిగాని, మరో విధంగా పగ తీర్చుకో టానికిగాని కాంతయ్యకు దమ్ములేదు. ఫలానివాడు తనని కొట్టాడని చెప్పడానికైనా అతనికి ధైర్యంలేదు. ఆ మనిషి అతనికి సింహస్వప్నమైనాడు. చావగొట్టటానికి వచ్చినవాడు తనను నవ్వుతూ పలకరించటం జ్ఞాపకం వచ్చినప్పుడల్లా అతనికింకా ముచ్చెమటలు పోస్తూనే ఉన్నాయి.

మొగుడిచేత తనను కొట్టించిన మనిషికూడా కాంతయ్యకు ఒక మేలే చేసింది. అప్పటిదాకా అతనికి ఆడవాళ్ళంటే చాలా తేలికభావం ఉండేది. ఈ దెబ్బతో

అతనికి ఆడవాళ్ళ జాతిమీద కొంచెం భయభక్తులు పుట్టుకొచ్చాయి. అయితే ఇది సముద్రంలో కాకిరెట్ట. ఇటువంటి అనుభవాలు లక్షలసంఖ్యలో జరిగితేనేగాని మగ వాళ్ళకు స్త్రీ జాతిమీద నిజమైన గౌరవం ఏర్పడదు.

కాంతయ్యకు పుట్టిన అదురు ఎంతదాకా వెళ్ళిందంటే- అతనికి స్వగ్రామం వెళ్ళటానికి కూడా ధైర్యం చాలలేదు. 'వాడు' కనిపిస్తాడు. 'వాడిభార్య' కూడా కనిపించవచ్చు. ఎంత నామోషీ! పిరికిపందయినా అభిమానం ఉంటుందిగద!

* * * *

మీనమ్మ మనవణ్ణి కళ్ళచూచేదాకా బతికుండలేకపోయింది. వెనక చేసిన జబ్బే మళ్ళీ చేసి, ఈసారి మందులకు లొంగక ఆమెను తీసుకుపోయింది. ఆమెకు దిన వారాలు చేసి కొడుకులు శాశ్వతంగా బస్తీ కాపరం పెట్టేశారు.

పెద్దవాడు వీధిబడి పెట్టాడు. రెండోవాడు బట్టల కొట్టులో గుమాస్తాగా చేరాడు. మూడోవాడు మునిసిపాలిటీరో చేరాడు - నాలుగోవాడూ, అయిదోవాడూ చదువుకుంటున్నారు. అందరూ కలిసే ఉంటున్నారు.

పురుడు పోసుకోవటానికి పార్వతి అన్నల దగ్గిరికి వచ్చింది.

ఇప్పుడు వాళ్ళు జీవించే జీవితం పార్వతికి పూర్తిగా కొత్తది. వాళ్ళ స్వగ్రామంలో స్వగృహంలో ఉంటూ పల్లెజీవితం జీవించినంత కాలమూ అందులో పేదతనం ఉన్నదన్న భావం పార్వతికి కలగలేదు కాని ఈ బస్తీలో వాళ్ళు పేదగా జీవిస్తున్నారన్న భావం అనుక్షణమూ కలుగుతున్నది.

పెద్దన్న నడిపే వీధిబడిలో ఓ ఇరవైమంది కుర్రాళ్ళు చదువుతున్నారు. ఇద్దరు ముగ్గురుమాత్రమే నెలకో పావలా చొప్పున జీతం యిస్తారు. మిగిలినవాళ్ళు డబ్బులివ్వరు. అష్టమీ నవములూ, అమావాస్యా, పూర్ణిమా ఆటవిడుపు. ఆ రోజుల్లో విద్యార్థులు స్వయంపాకాలు తెచ్చియిస్తారు. అదీగాక అప్పుడప్పుడూ నాలుగువంకాయలో, ఒక సొరకాయో, గుమ్మడికాయో ఇస్తుంటారు.

ఇదంతా పార్వతికి "ముష్టి"గా కనబడేది.

బస్తీ జీవితమంటే తోటకూర దగ్గర్నుంచీ, మజ్జిగనీళ్ళ దగ్గర్నుంచీ కొనాలి. అన్నలు పొలంపనిచేసి ఇంటికొస్తే జబ్బుచేసినట్టుండేవాళ్ళు కారు. గుమాస్తాగిరిచేసి ఇంటికొస్తే తోటకూరకాడల్లాగా వాడిపోయి ఉంటున్నారు.

అన్నల భార్యలుకూడా ఇంటిపని ముక్కుతూ మూలుగుతూ చేస్తున్నట్టుగా కనిపించేది పార్వతికి.

అయినప్పటికీ ఆ పల్లెటూరి జీవితంకన్న ఇదే సార్థకమైన జీవితమేమో ననుకున్నది పార్వతి. తన మొగుడి జీవితంతో పోల్చితే తన పెద్దన్న వీధిబడి పెట్టుకు జీవించటం వెయ్యిరెట్లు పరువైనదిగా కనిపించింది. బస్తీజీవితం సార్థక్యం అఖరువాడు వెంకటేశ్వర్లులో గాని పూర్తిగా కనబడదు. వాడు పెద్దచదువు చదువుతాడు. పెద్ద ఉద్యోగం చేస్తాడు.

తాను జమీందార్ల కోడలనో, తోబుట్టువనో అన్నలు తనను అతిమర్యాద చెయ్యటం పార్వతికి నచ్చలేదు. అది అసహజంగా కనబడటం అట్లావుంది, వాళ్ళకూ తనకూ మధ్య చాలా ఎడం ఉన్నట్టు అనిపించింది.

ఏదో మాటల సందర్భంలో పెద్దన్న "అమ్మ బతికున్నంత కాలమూ బస్తీ కాపరం పెట్టనిచ్చిందికాదుగద. మా ముగ్గురికీ వానాకాలపు చదువులైపోయాయి. ఎట్లాగో వెంకడికి నాలుగుముక్కలు అబ్బాయి. పొలాలు పొలాలని చంకలు గుద్దు కోటమేగాని, ఏం పొలాలు.... ఆరుపుట్ల గింజలు పండించటానికి ముగ్గురమూ హూనమయ్యేవాళ్ళం. కరణాల పేచీలూ, మునసబుల దబాయింపులునూ. అడుగడుగునా తగాదాలూ, తలకాయలు పగలగొట్టు కోటాలూనూ — ఈ బస్తీలో ఎవడూ నీ జోలికి సొంటికీరాడు. శక్తి ఉండాలేగాని ఎంత పైకైనా రావచ్చు. మన ఊళ్ళో శంకరయ్య పురుషుడు పుట్టినన్నాళ్ళకు యజ్ఞం చేశాడన్నట్టు. ముప్పై ఏళ్ళుగా కూడబెట్టి కూడబెట్టి మూడెకరాలు కొంటే, అందరూ "ఓయబ్బో శంకరయ్య పెద్ద భూస్వామి అవుతున్నాడే!" నీ స్థాయి అంగుళం పెరిగితే ఏదేనా చేస్తారు. కాస్త పెరిగితే కళ్ళల్లో నిప్పులు పోసుకుంటారు. ధైర్యం చాలకుండా ఉందిగాని, ఆ నాలుగెకరాలూ అమ్మేసి ఎప్పుడో ఇక్కడ ఏదో వ్యాపారం పెట్టేస్తాము. చూస్తూఉండు" అన్నాడు.

తన తల్లి తన అన్నల జీవితాలను పల్లెటూళ్ళో బంధించి ఉంచటం తలుచుకుని పార్వతి చాలా నొచ్చుకున్నది. బస్తీలో పుట్టి పెరిగిన తన వదినెలు తనకన్న చదువుకున్నవాళ్ళనీ, సమర్థతగలవాళ్ళనీ పార్వతి నమ్మింది. వాళ్ళకు లేనిదల్లా తనకున్న డబ్బూ, హోదా. డబ్బూ, హోదా మనిషిని పెంచుతాయా? లేక తగ్గిస్తాయా ?

తన మాట ఏమైనా తన అన్నలు భార్యలపట్ల తన భర్తకన్న చాలా రెట్లు బాగా ప్రవర్తించుకుంటున్నారు. తానొక సామాన్యకుటుంబీకుడి భార్య అయితే జీవితం ఇంకా హాయిగా ఉండేదేమో ననుకుని పార్వతి చాలా విచారించింది.

* * *

పార్వతికి మగబిడ్డ పుట్టాడు. బారసాల చేసుకోవటానికి వచ్చిన కాంతయ్య "నాకు ముందే తెలుసు. మా వంశంలో ఆడపిల్లలు పుట్టరు" అన్నాడు.

ఒకవేళ తనకు ఆడపిల్లే పుట్టిఉంటే ఎంత తుఫానురేగేదో పార్వతి ఊహించుకున్నది.

పిల్లవాడికి తాతగారి పేరే పెట్టారు- చిన్న వెంకటనారాయణ.

పిల్లవాడి పోలికలు చూస్తూ, "తండ్రి ముక్కునుంచి ఊడిపడ్డాడు" అన్నారు. పార్వతి కెందుకో భయం వేసింది.

పిల్లవాడికి బొడ్డుకోసి, స్నానం చేయించి మంత్రసాని "ఇదుగోనమ్మా నీ కొడుకు" అన్న క్షణం నుంచీ పార్వతిలో మాతృత్వం పుట్టుకొచ్చింది. ఆ ఆనం

దానికి సాటి మరేదీ లేదు. దానికి అర్థంలేదు హద్దూ లేదు. తన బిడ్డ తన శరీరంలో శరీరం. కొంత కాలంపాటు ఆ బిడ్డకు తానే సమస్తం. ఆ బిడ్డ కష్టసుఖాలన్నిటికి తానే బాధ్యురాలు!

మాతృత్వంలో ఉన్న ఆనందాన్ని పార్వతి చాలా రహస్యంగా అనుభవించింది. దాన్ని ఎవరితో పంచుకుంటుంది? ఎట్లా పంచుకుంటుంది?

అయితే, పానకంలో పుడకలాగా, చూసినవాళ్ళంతా తండ్రి పోలిక అంటున్నారు. తన కొడుకు తన మొగుడిలాగా తయారవుతాడని తలుచుకుంటేనే ఆమెకు కంపరం పుట్టుకొచ్చింది.

నామకరణానికి శ్యామలాంబకూడా వచ్చింది. అవిడ మనవణ్ని చేతుల్లోకి తీసుకుని, ఏదో మంత్రం వేస్తున్నదానిలాగా వాడికేసి చాలాసేపు నిర్వికారంగా చూసి, దగ్గర ఉన్నవాళ్ళ కిచ్చేసింది. పిల్లవాడు అత్తగారి చేతుల్లో ఉన్నంతసేపూ పార్వతి ప్రాణం ఎందుకో విలవిల లాడుతూనే ఉన్నది. దానికి అర్థం లేదు. ఆవిడకైనా మనవడేగాని పరాయివాడు కాడు.

కాంతయ్య కొడుకును ఎత్తుకోలేదు. అతనికి చిన్నపిల్లలంటే అసహ్యంట.

''మనుషులంతా పదహారో ఏట పుట్టాలి.'' అన్నాడతను. ఈమాటే వాళ్ళ ఊళ్ళో అంటే చాలామంది హర్షించారు. చాలా రోజులపాటు చెప్పుకున్నారు. కాని ఈ బస్తీ మొద్దులు చిరునవ్వయినా నవ్వలేదు. ఒక మొద్దుమాత్రం ''తల్లులకు ఇబ్బంది'' అన్నాడు. దానికి మటుకు అందరూ నవ్వారు.

అందరూ కలిసి తనను పరాభవం చెయ్యటానికి కుట్ర పన్నారని కాంతయ్య కనిపెట్టేశాడు. అతను అనుకున్నదానికి తిరుగు ఉండటానికి వీల్లేదు.

''మీ వాళ్ళందరికీ నేను ఎందుకు అలుసయ్యానో తెలియకుండానే ఉంది. నేనిక్కడ ఇంకొక్కపూట కూడా ఉండను.'' అన్నాడతను భార్యతో.

''వెళ్ళిపోవాలనుంటే వెళ్ళండి. కాని మా వాళ్ళకు మీరు అలుసుకావటమేమిటి? వాళ్ళేంచేశారు?'' అన్నది పార్వతి ఆశ్చర్యంతో.

''కారణం లేకుండానే అంటానా? నన్ను వెర్రివాడికింద కట్టేశావా?'' అన్నాడు కాంతయ్య. అంతేగాని కారణం చెప్పలేదు. చెబితే అవతలవాళ్ళకు నచ్చకపోవచ్చునని అతనికి తెలుసు. అదీగాక తాను అనుకునేవాటికి కారణాలు చెప్పే అలవాటతని 'ఇంటా వంటా' లేదు.

అతను వెళ్ళిపోతానంటే బావమరుదులే తీవ్రంగా అభ్యంతరం చెప్పారు.

'నేనెందుకు వెళ్ళిపోతానంటున్నానో వాళ్ళకు తెలుసు—దొంగ వెధవలు!'' అనుకున్నాడు కాంతయ్య. తన అనుమానాన్ని మరింత రూఢిచేసుకుంటూ, 'వాళ్ళు చూపించిన మర్యాదలో పెళ్ళాంముండ నూరోవంతుకూడా చూపించలేదు. చూడు!' అని కూడా ఆ క్షణంలోనే అనుకున్నా డతను.

శ్యామలాంబ కొడుకుతోపాటు బయలుదేరలేదు. కాని అతను వెళ్ళిన మర్నాడే తానుకూడా ప్రయాణం కట్టింది. లాంఛనగా, "అప్పుడే వెళతారా! నాలుగు రోజులుండండి. అన్నప్పుడల్లా వస్తారా ఏమన్నానా?" అన్నారు.

కాని ఆవిడ వెళ్ళితీరా లన్నది. ఒక్క రోజు తాను లేకపోతే ఇల్లంతా ఒక కొలిక్కి వస్తుందన్నది. పిల్లవాడికి రెండోనెల రాకముందే కోడలిని బయలుదేరి వచ్చెయ్యమన్నది.

అత్తగారు వెళ్ళిపోయాక పార్వతికి సరిగా ఊపిరి సలిపింది. తన అత్త గారికీ, తన భర్త ఈ విధంగా తయారు కావటానికీ ఏదో సన్నిహిత సంబంధం ఉన్నదని పార్వతి మనసులోగట్టి నమ్మకం ఒకటి ఏర్పడిపోయింది. కాంతయ్య పైన తండ్రి ప్రభావం ఏమీలేదు. అతని దుర్గుణాలు తల్లి మప్పినవైనా అయి ఉండాలి, ప్రోత్సహించినవైనా అయిఉండాలి. ఆవిడ కొడుకును ఏనాడుగాని తప్పుపట్టగా పార్వతి వినలేదు.

తాను సాగనిచ్చేటట్టయితే ఆవిడ తన కొడుకునుకూడా అదే విధంగా తయారు చేయగలదు. ఆ పని జరగకుండా తాను ఏం చెయ్యాలి ? పార్వతికి ఇప్పటినుంచీ ఇదే ఆలోచన.

పార్వతి పిల్లవాడికి మూడోనెల సగపడినదాకా అత్తవారి ఊరికి ప్రయాణం కాలేదు. నెల వెళ్ళాక ఒక ఉత్తరం రాయించింది. పిల్లవాడు కాస్త బురబుర లాడుతున్నాడనీ, దొడ్డి నీళ్ళలాగా అవుతున్నదనీ, అందుచేత ప్రయాణం తల పెట్టలేదనీనూ.

ఈ లోపల మేనమామలు మేనల్లుడికి చాలా వేడుకలు చేశారు. వేంక టేశ్వర్లు ఆటలకూ్కడా పోకుండా అస్తమానమూ పిల్లాడితోనే ఆడుకునేవాడు.

"అబ్బలాల నన్నుచూచి నవ్వాడేవ్! అబ్బలాల నన్నెత్తుకోమంటున్నా డేవ్" అని వెంకటేశ్వర్లు పెట్టే కేకలకు ఇంటిల్లిపాదీ నవ్వుకునేవాళ్లు.

ఈ "అబ్బలాల" అన్నమాట ఏ భాషో, దానికి అర్థమేమిటో ఎవరికీ తెలీదు. శ్యామలాంబగారు తన మనవణ్ని తన మొగుడు పేరుపెట్టి ఎలా పిలుస్తుందీ? పిల్లేదు. అందుచేత ఆవిడ వాడికి "అబ్బలాల" అన్న మారుపేరు పెట్టేసింది. దాన్ని వెంకటేశ్వర్లు పట్టేసుకున్నాడు.

పార్వతి పిల్లవాణ్ణి తీసుకుని బయలుదేరేటప్పుడు వెంకటేశ్వర్లు కళ్ళనీళ్ళ పర్యంతమైనాడు.

"నీ డిక్కడుంటే నీకు చదువు సాగదు. ఈ రెండునెల్లూ నువు పుస్తకం పట్టుకున్న పాపాన పోయినావా? పరీక్షలయాక మా ఊరు రా? వేసవి శలవులంతా నీ అబ్బలాలతో ఆడుకుందువుగాని" అన్నది పార్వతి.

* * *

కొడుకు పుట్టాక కాంతయ్య జీవితంలో వడి హెచ్చింది. అతనిప్పుడు ఊళ్ళో అంతగా ఉండటంలేదు. హెచ్చుగా గుంటూరులో ఉంటున్నాడు. అక్కడ పెద్ద ఆటగాళ్ళున్నారు. క్లబ్బున్నది. టెన్నిస్‌లోగాని, బిలియర్డ్స్‌లోగాని మొనగాడనిపించుకుంటే, పెద్ద చదువులు లేకపోయినా పెద్దలతో భుజాలురాచుకు తిరగొచ్చు. క్లబ్బు మెంబర్లలో కొందరు జమీందార్లు కూడా ఉన్నారు. తనవంటి భూస్వాములు కారు—నిజమైన జమీందార్లు.

క్లబ్బులో కీర్తి సంపాదించాలంటే డబ్బు ధారాళంగా ఖర్చు చేయాలి. కాంతయ్య డబ్బు ధారాళంగా ఖర్చుచేశాడు. బిలియర్డ్స్‌లో అతనికి కొంత సహజ ప్రావీణ్యం ఉన్నట్టు కనబడింది. టెన్నిస్ కూడా బాగానే వచ్చింది. పేకాటలో వచ్చినప్పుడు డబ్బువచ్చేది. కాని పోయినప్పుడు రెట్టింపుగా పొయ్యేది. అందుచేత అతను మూడు నెల్ల కోసారీ, రెండు నెల్ల కోసారీ డబ్బుకోసం గ్రామం వస్తూండేవాడు.

"అబ్బాయి ఖర్చు చాలా జాస్తిగా ఉంటున్నది" అన్నాడు మామయ్యగారు ఆడవాళ్ళతో.

"ఖర్చు కానివ్వండి ఇప్పుడు ఖర్చు చెయ్యకపోతే వార్ధక్యంవచ్చాక చేస్తాడా?" అన్నది శ్యామలాంబగారు.

పార్వతికి ఆవిణ్ణిచూస్తే మండిపోయింది.

తన కొడుకు దిగజారిపోతున్నాడని శ్యామలాంబగారికి తెలుసు. అందుకు తన కోడలే కారణమని ఆవిడ అనుమానం. అత్తగారికి అటువంటి అనుమానం ఉన్నట్టు పార్వతికి అనుమానం. అంతా ముసుగులో గుద్దులాట. పైకి ఎవరూ ఏమీ అనరు. ఒకసారి శ్యామలాంబ మాటల సందర్భంలో "మొగుణ్ని ఖాతరుచెయ్యని ఆడది మొగుడికి దూరమే అవుతుంది." అని ప్రవచించింది. ఆ మాట తనకే తగులుతుందని కూడా ఆలోచించకుండా తనను మనసులో ఉంచుకునే ఆవిడ ఆ మాట అన్నదని పార్వతి ఊహించింది.

మరోసారి భర్త డబ్బుకోసం వచ్చినప్పుడు పార్వతి "ఏమండీ చాలాడబ్బు ఖర్చు చేస్తున్నారట. పోనీ ఆ బస్తీలోనే ఏదన్నా వ్యాపారం పెట్టరాదూ?" అన్నది.

"వ్యాపారమా! ఛీ ఛీ! ఇంతా బతికి ఇంటివెనక చచ్చినట్టు వ్యాపారంచేసే ఖర్మ నాకేం? మీ అన్నలను చేసుకోమను"-అన్నాడు కాంతయ్య.

అప్పటికి పార్వతి అన్నలు బియ్యం వ్యాపారం పెట్టారు. పొలం అమ్మవలసిన అవసరం కూడా రాలేదు. వాళ్ళ ఊళ్ళోవాళ్ళు కొందరు పంట కళ్ళాల్లోనే చవగ్గా అమ్మిన ధాన్యం తీసుకుని, మర పట్టించి, నెలా రెండునెల్లలోపుగా బాకీలు తీర్చారు. చిన్నగా ప్రారంభమైన వ్యాపారం త్వరలోనే అభివృద్ధిలోకి వచ్చింది. వెంకటేశ్వర్లు కాలేజీ చదువుకు వెళ్ళాడు.

తరతరాల ఆస్తిని తగలెయ్యటం కీర్తి ప్రదమనుకున్న కాంతయ్యకు తన బావమరుదులు వ్యాపారం చేసి ఆర్జించటం చాలా హేయంగా కనబడింది.

"మా అన్నలు వాళ్ళ పిల్లల భవిష్యత్తు ఆలోచిస్తున్నారు. మీరు కూడా మన పిల్లవాడి భవిష్యత్తు ఆలోచించండి" అన్నది పార్వతి.

"నేను కూడా గొప్పవాణ్ణి కావటానికే ప్రయత్నిస్తున్నాను. నా కొడుకు నన్ను చూసి గర్వపడటం నేర్చుకుంటే గొప్పవాడు కావటానికి మార్గాలు ఆలోచించకపోడు. టెన్నిస్‌లో టిల్టన్[1]నూ, బిలియర్డ్స్‌లో విండ్రమ్[2]నూ నేను ఎదిరించే రోజుకోసం ఎదురుచూస్తున్నా. ఆనాడే మనవాడి భవిష్యత్తుకు రాజబాట ఏర్పడుతుంది. అంతేగాని వ్యాపారం పేరుపెట్టి వాళ్ళనూ వీళ్ళనూ గొరిగి పిల్లలకిచ్చినంతమాత్రాన వాళ్ళకు భవిష్యత్తు ఏర్పడదు."

తన మొగుడిలో ఈ కొత్తతెలివి చూసి పార్వతి నిర్ఘాంతపోయింది. ఆమె కేమనటానికీ తోచలేదు.

శ్యామలాంబ కూడా కొడుకును డబ్బు ఖర్చుగురించి హెచ్చరించినట్టున్నది. మొత్తంమీద ఏమయినాగానీ, కాంతయ్య చీటికీ మాటికి డబ్బుకోసం ఊరికి రావటం మానేశాడు. పంటలు వచ్చే తరుణంలో వచ్చి వీలయినంత హెచ్చుమొత్తం పట్టుకుపోయ్యేవాడు. మళ్ళీ వచ్చేవాడు కాడు. వచ్చినా డబ్బు అడిగేవాడు కాడు.

అతను ఎడాపెడా అప్పులు చేస్తున్నట్టు తెలిసింది. పెద్ద వడ్డీల మీద మార్వాడీల దగ్గిర కూడా అప్పులు చేస్తున్నాట్ట.

"అప్పులెట్లా తీరుస్తాడో తెలీదు. ఇవతల మైనరు కొడుకున్నాడు. ఇచ్చేవాళ్ళు ఎట్లా ఇస్తున్నారో తెలీదు" అన్నాడు మామయ్యగారు.

అప్పులు ఎట్లా తీరుస్తాడనే సంశయం త్వరలోనే తీరింది. కాంతయ్య తన పొలాలు అమ్మటం ప్రారంభించాడు. ఒక ఏడు పదిహేనెకరాలు అమ్మాడు. ఇంకో ఏడు పాతిక ఎకరాలు అమ్మాడు.

"ఇట్లా జరుగుతుందని మేం ఏనాడో అనుకున్నాం" అన్నారు ఊళ్ళో వాళ్ళు.

---

1. టిల్టన్ (Sic) (1893-1953) : విలియం టాటెం టిల్డన్ అమెరికన్‌లాన్ టెన్నిస్ ఆటకాడు. 1920 వింబుల్‌డన్‌లో పురుషుల ఛాంపియన్‌షిప్ మొదటిసారిగా అమెరికాకు దక్కించినవాడు. 1920–30 మధ్య డేవీస్ కప్ పోటీల్లో పాల్గొన్నాడు. మంచి స్టయిల్‌కూ, గట్టి స్ట్రోక్‌కూ పేరుమోసిన వాడు. మంచి క్రీడావ్యాఖ్యాత కూడా.
2. విండ్రమ్ (Sic) : వాటర్ లిండ్రమ్ ఆస్ట్రేలియాకు చెందిన ప్రపంచ విఖ్యాత బిలియర్డ్ క్రీడాకారుడు. 1933 లో జో డేవిస్‌ను ఓడించాడు.

చినవెంకటనారాయణకు అయిదేళ్ళు నిండేసరికి వాడి తాతగారి ఆస్తిలో మూడోవంతు తరిగిపోయింది.

ఆ సమయంలోనే వెంకటేశ్వర్లు పెళ్ళి జరిగింది. వెంకటేశ్వర్లు అప్పటికి ఇరవై ఒకటి పూర్తి చేశాడు. ఆ లోపల పెళ్ళి చేద్దామని అన్న ప్రయత్నించినా చదువు పూర్తిచేసి ఉద్యోగంలో చేరితేగాని పెళ్ళి చేసుకోనన్నాడు. నిజానికి అత నింకా లా చదువు పూర్తిచెయ్యలేదు. కాని మంచి సంబంధం వచ్చింది. పిల్లతండ్రి లాయరు. ఆయనకు మగపిల్లలులేరు. ఇద్దరే ఆడపిల్లలు. పెద్దదానికి పన్నెండో ఏడు.

"పిల్ల పెళ్ళి గురించి నాదే అశ్రద్ధ అయిపోయింది. పిల్ల ఎక్కడ పెద్దమనిషి అయి కూర్చుంటుందో అని మా అమ్మ, నా భార్యా మహా యిదవుతున్నారు. లాంచ నాలను గురించి మీరేమీ విచారించవద్దు. దేవుడి దయవల్ల నేనింత సంపాదించాను. మీవాడు లా చదువుతున్నాడంటె నా ప్రాక్టీసు అందుకుంటాడన్న ఆశకూడా ఉంది. అందుచేత మీరు సరేనంటే నేను ఒడ్డున పడతాను" అని ఆయన ఉన్న సంగతి దాచ కుండా చెప్పేశాడు.

అన్నలు సరేసనే ధోరణిలో ఉన్నట్టు గమనించి వెంకటేశ్వర్లు కూడా సరే నన్నాడు. అతను పిల్లను చూశాడు; నచ్చింది. నచ్చకపోయినా చేసుకునేవాడే.

చిన్నన్న పెళ్ళికి పార్వతి పిల్లవాడితో సహా వచ్చింది ప్లీడరు మామయ్యా గారు పెళ్ళి మహావైభవంగా చేశాడు. పార్వతి మొహాన రోజుకో బంగారు కాసు అద్దారు.

ఈ సందర్భంలోనే పార్వతి తన అన్నలతో తన భర్త ఆస్తి అంతా ఎట్లా అలాములూ పలాములూ చేస్తున్నాడో చెప్పింది.

"అమ్మనీ, మనం ఏం చెయ్యగలం? పోయినది పోగా మిగిలినదే దక్కుడు" అన్నాడు పెద్దన్న వేదాంతిలాగా.

"నా కొడుక్కు అన్యాయం జరగడం నేను సహించలేను. అదీగాక ఇంకో విషయంకూడా నీకు చెప్పాలన్నయ్యా! నాకా ఊళ్ళో ఊపిరిసలపటం లేదు. ఆయన చూడబోతే యిక ఆ వూరితో తెగతెంపులు చేసుకున్నట్టే కనబడుతుంది. మా అత్తగారిమధ్య తనకేమీ పట్టనట్టూ, తనకు ఎవరితోనూ సంబంధం లేనట్టూ ప్రవర్తిస్తున్నది. పిల్లవాడికి బడికి వెళ్ళే ఈడొచ్చింది. ఆ ఊళ్ళో వాడికి చదు వొస్తుందని నాకు తోచదు. నేను అక్కణ్ణించి వచ్చేస్తే ఆ ఆస్తి ఏమైపొయ్యేది అజా పజా కూడా వుండదు. నేనా చిన్నదాన్ని నాకేమీ తెలీదు" అన్నది పార్వతి.

నిజానికామె ఈ రావటం రావటం ఇక్కడే ఉండిపోవటానికి నిశ్చయించు కున్నది.

ఆ సంగతి రూఢిగా చెప్పాక పెద్దన్న, "ప్లీడరు మామయ్యగారిని సలహా అడుగుదాం!" అన్నాడు. ప్లీడరు మామయ్యగారు లాయరుగా సలహా చెప్పాడు.

"ఉన్న ఆస్తిలో మీ భర్తగారు సగం వాటాదారు. ఆయన దాన్ని ఎట్లా తగలేసుకున్నా అడిగేవాళ్ళుండరు. కావలిస్తే మీ పిల్లవాడి భాగంకోసం దావా వెయ్యొచ్చు. అంతవరకూ దక్కించుకోవచ్చు. కాని అంతదూరం వెళ్ళేముందు కాస్త ముందూ వెనకా, మంచీ చెడ్డా ఆలోచించుకోవడం మంచిది."

మొగుడిమీద దావా వెయ్యటం అనేసరికి పార్వతి బెదిరిపోయింది. అత్త వారిల్లు వదిలేసి రావడంలో ఆమెకు తెగువా, సాహసమూ కనిపించలేదు. తాను ఏడాది పాటు తిరిగిరాకపోయినా ఎందుకు రాదని అడిగేపాటి ఆసక్తి గలవారెవరూ లేరక్కడ. మొగుడికి తన గొడవ అసలే పట్టలేదు. అందుచేత ఆమె, కనీసం ఎవరో ఒకరు రమ్మనేదాకా, అన్నలదగ్గిర నిశ్చింతగా ఉండిపోగలదు. డబ్బు కావాలన్నా "మామయ్యగారు" పంపిస్తాడు. కాని మొగుడిమీద దావావేసి రచ్చకెక్కటమా? తగినంత సాహసం లేదు.

"వ్యాజ్యాలూ, సాజ్యాలూ దేనికిలెండి?" అన్నది పార్వతి.

* * * *

"పెద్దన్నయ్యా! తమ్ముడి పెళ్ళిలో ఇచ్చినకాసులు అమ్మి డబ్బుపట్టుకురా! రెండు నెల్లనుంచీ వుంటున్నాను. ఖర్చుకు కావద్దూ? మనిషికి మనిషెత్తున్నారు" అన్నది పార్వతి.

"ఎందుకే, పిచ్చిదానా! నీ కాసు లమ్మకుండా జరగనంత దుస్థితిలో ఉన్నామా?" అన్నాడు పెద్దన్న. ఆయన అబ్బులాలగాడికి మంచిరోజు చూసి అక్షరాభ్యాసం చేసి అక్షరాలు దిద్దిస్తున్నాడు.

ఈ సంభాషణ జరిగిన వారంలోపునే ఊరినుంచి మామయ్యగారు వచ్చాడు. పార్వతి ఆశ్చర్యపోయి, "ఏమండీ మామయ్యగారూ, తలవనితలంపుగా వచ్చారే! అంతా కులాసాయేనా?" అని అడిగింది.

"నేను చిన్న కోర్టు పనుండి వచ్చాలే, నువ్వు మళ్ళీ తిరిగి రానేలేదేం?" అన్నాడాయన.

"మావాళ్ళంతా తొందరపెట్టి ఉంచేశారు. అయినా ఇంతలో అక్కడ మునిగిపోయిందేముందీ? ఆయన సంగతులేమైనా తెలుస్తున్నాయా?" అన్నది పార్వతి.

"తెలియకేం, తల్లీ? ఏం మునిగిందంటా వేమిటి? ఒక చెంప సర్వనాశనమై పోతూఉంటే! సగం ఆస్తి పోయినట్టే. మీ అత్తగారిని వొప్పించి నీ కొడుకు తరపున నోటీసు ఇప్పించా. నా కొడుక్కు నేను నోటీసివ్వటమేం టన్నది. నీ కొడుకు మంచికోరే ఇవ్వవమ్మా అని ప్రాధేయపడ్డా. మీరు చెప్పేది ఒక్క ముక్క నాకర్థం కావటం లేదంటూనే సంతకం పెట్టింది. నాకిప్పుడింకొక అనుమానం వచ్చిపడింది.

మీ అత్తగారికి కాస్త మతి చలించిందని. ఉన్నదానికి తోడు ఉపాకర్మ అన్నట్టవుతుంది" అన్నాడు మామయ్యగారు.

తన అత్తగారికి చిత్తచాంచల్యం కలిగినమాట నిజమే అయివుండాలనుకున్నది పార్వతి. ఆవిడ ప్రవర్తన మామూలుగా లేనట్టు కనపడిందేగాని, అది పిచ్చికి మొదటిమెట్టన్న అనుమానం పార్వతికి రాలేదు. ఆమె పూర్తి పిచ్చివాళ్ళను చూసిందిగాని, పిచ్చి ఎట్లా ఆరంభమయేది చూసి ఎరగదు.

మామయ్యగారు వెళ్ళిపోతూ, "మూడొందలు, నీకోసమే తెచ్చాను. వచ్చే యేడీపాటికి ఇదికూడా నీ చేతికి దక్కుతుందో దక్కదో" అని డబ్బు ఇచ్చి వెళ్ళాడు.

పార్వతి ఆ డబ్బు తన పెద్దన్న కిచ్చింది.

మామయ్యగారు వెళ్ళిన కొద్దిరోజులకే సోమశేఖరం పార్వతిని చూడటానికి వచ్చాడు. సోమశేఖరం ఎవరోకూడా పార్వతికి తెలియదు. ఆ దౌర్భాగ్యుడి కళ్ళకు పార్వతి ఇంకా శాపగ్రస్తురాలైన గంధర్వరాజకుమార్తెలాగే ఉన్నది.

"నన్ను నువ్వెరక్కపోవచ్చునమ్మా. నా పేరు సోమశేఖరం అంటారు. నేను మా కాంతయ్యగారి ఆశ్రితుల్లో ఒకణ్ణి ఇప్పుడు కాదులే. ఇప్పుడాయన నాబోటి వాళ్ళకు ఎక్కడ అందుతాడు? ఆయన ఏమో, పట్నంలో గుర్రప్పందాలేమో ! అందకుండా గాలిపటమల్లే ఎగిరి పైకి, ఇంకా పైకి పోతున్నాడు. మీ అత్తగారికి పిచ్చెత్తింది తెలుసుగా? ఆవిడేదో రిజిస్టరు నోటీసిచ్చిందట. అది అందుకుని గామాలు మీ ఆయన వారంరోజుల క్రిందట సుడిగాలల్లే వచ్చాడు. పిచ్చిదానిచేత రిజిస్టరుత్తరం రాయించినందుకు మేనేజరుగారిమీద ఎగిరిపడ్డాడు. తాను చేసిన అప్పులన్నీ పిల్లాడు పుట్టక మునుపు చేసినవనీ, వాటికింద ఆస్తంతా పోయినా అడగటానికెవరికీ హక్కులేదనీ అన్నాడు. పిచ్చి ఆవిణ్ణి వాళ్ళ పినతల్లి మొగుడుట ఎవరో వచ్చి వైద్యం చేయిస్తానని తీసుకుపొయ్యాడు. ఇంటికి తాళం పెట్టివున్నది. ఈ సంగతులు మీదాకా వచ్చాయోలేదో, చెప్పిపోదామని వచ్చా" అన్నాడు సోమన్న.

తాను చెప్పే దుర్వార్తలు విని శాపగ్రస్త గంధర్వ రాజకుమార్తె దుఃఖభారంతో కుప్పకూలిపోతుందనుకున్నాడు సోమన్న. కాని అవి ఆమెను అంటినట్టే కనిపించలేదు. ఆమెకోసం తలతీసి ఇవ్వటమో, నిప్పుల్లోకి దూకటమో, అటువంటిదే మరేదో చేయాలనిపించింది సోమన్నకు. కాని తనకు అంత అదృష్టం ఎక్కడ?

తలవంచుకుని కూర్చున్నవాడు కాస్తా చప్పున తలఎత్తి, "అబ్బులాల ఏడీ?" అన్నాడు.

పార్వతి కొడుకును పిలిపించింది. పిల్లవాడు పలకా, బలపమూ తీసుకుని వరండాలోకి వచ్చి, తల్లికేసి ప్రశ్నార్థకంగా చూశాడు.

సోమన్న పిల్లవాణ్ని దగ్గిరికి పిలిచి, మొహమూ, భుజాలూ నిమురుతూ, "పేదవాణ్ని నీకోసం ఏమీ తీసుకురాలేదు బాబూ!" అంటూ, పొంగివచ్చిన దుఃఖాన్ని తొక్కిపట్టటానికి మొహం చాలా వికారంగా చేసుకున్నాడు.

ఆ దుఃఖం పిల్లవాడిమీది మమకారంవల్ల వచ్చినది కాదు. దార్ద్ర్యం తెచ్చినది ఆ సంగతి పార్వతి అర్థం చేసుకున్నది.

సోమన్న వెళ్ళివస్తానంటే ఆమె "అదేమిటి? భోంచేసి వెళుదురుగాని" అన్నది.

"లేదులేమ్మా! భోజనం ఇంకోచోట చెప్పుకుని మరీ వచ్చాను" అన్నాడు సోమన్న. తన అక్క పేరు ఉచ్చరించటానిక్కూడా అతనికి సాహసం లేక పోయింది.

"ఉండండి" అని పార్వతి లోపలికివెళ్ళి పదిరూపాయలుతెచ్చి సోమన్న కివ్వబోయింది. ఆ డబ్బును చూసి, సోమన్న తాచుపామును చూసినట్టు బెదిరాడు; పార్వతి ఎంతో బలవంతంచేసిన మీదట డబ్బు తీసుకుంటూ, ఆ డబ్బును తాను ఖర్చు చెయ్యకుండా ఉన్నంతకాలమూ పార్వతికి దార్ద్ర్యం రాకుండా ఉంటుందని అనుకున్నాడు. ఆ విధంగా సంఘటనలను ముడిపెట్టటం అతనికి అలవాటే.

* * *

పార్వతి చెయ్యటానికి భయపడిన పనిని వెంకటేశ్వర్లూ, అతని మామగారూ కలిసి చేయించారు. కాంతయ్య చేసే అప్పులు చెల్లవనీ, అతని మైనరు కొడుకు ఆస్తి అమ్మటానికి అతనికి హక్కులేదనీ, ప్రకటన వేయించారు. మైనరు ఆస్తికి తండ్రి గార్డియనుగా ఉండటానికి తగడనీ, తల్లిని గార్డియనుగా నియమించవలసిందనీ కోర్టుకు అర్జీ పడేశారు.

పార్వతి మొగుడుమీద కోర్టుకెక్కటం సక్రమమేనని ఆమె బంధువర్గంలో ఒక్కరుకూడా అనలేరు. కాంతయ్య ప్రవర్తన తప్పని అందరూ ఒప్పుకున్నారు. అయినా పార్వతి అతడి అక్రమ ప్రవర్తనకు అవరోధాలు కలిగించరాదట.

"మాటవరసకు నువు కోర్టులో గెలిచి నీ కొడుకువంతు ఆస్తిమీద అధికారం సంపాదిస్తావే అనుకుందాం. నీ మొగుడు బుక్కాపకీరైపోయి వీధుల్లో ముష్టెత్తుకుంటే అదిమాత్రం నీకేం ఘనం?" అని వాళ్ళు వాదించారు.

తనను ఇంత నీచురాలిగా చేసి అదివరలో ఎవరూ ఎన్నడూ మాట్లాడలేదు. కోర్టు కెక్కటంచేతనే తాను అందరికీ లోకువయింది. వాళ్ళకు సమాధానం చెప్పటం కూడా ఆమెకెంతో బాధ అయింది.

"మొత్తం ఆస్తిమీద వచ్చే అయివేజంతా ఆయనే ఖర్చుచేస్తే నేను వద్దన్నానా? పిల్లవాడి భాగం అమ్మటానికి ఆయనకేం హక్కున్నది? ఇంకో తండ్రి అయితే, ఇంత ఆస్తి పెట్టుకుని, తన తదనంతరం కొడుక్కు మరింత చేసిఇవ్వడా? ఆయనవంతు ఆస్తి ఆయన ఏమన్నా చేసుకోనీ. పిల్లవాడి వంతైనా దక్కితే, హాని

మీద అయివేజంతా తానే అనుభవించనీ, నన్నూ, పిల్లవాణ్ని పస్తులు పడుకోబెట్టనీ-నాకభ్యంతరం లేదు. పిల్లవాడి ఆస్తికూడా తనే తెగనమ్మి మాతోబాటు ఆయనకూడా పస్తులు పడుకోవాలిసొస్తే అది సక్రమంగా ఉంటుందా? ఆయన మంచికే ఈ దావా వేస్తున్నానని ఎవరికీ తట్టదులాగుంది!" అన్నదామె.

ఆమె చెప్పేది ఎవరి తలకూ ఎక్కలేదు. పైపెచ్చు, మొగుడి మేలుకోరే తాను మొగుడిమీద దావా వేస్తున్నాననటం చాలా అఘాయిత్యంగా తోచింది. "ఇది విన్నారుటర్రా? పార్వతమ్మ మొగుణ్ణి ఉద్ధరించటానికే మొగుణ్ని కోర్టుకీడుస్తున్నదిట!" అని చెప్పుకున్నారు.

పార్వతిమీద అయినవాళ్ళలో చాలా విషప్రచారం జరిగింది. ఆమె చాలా బాధపడింది. తన మనసులో ఏదో ఒక భాగం చిట్టెలకట్టుకు పోతున్నట్టుగా ఆమెకు తోచింది.

ఇది మంచిదీ, ఇది చెడ్డదీ అని మనబుద్ధి ఎంత నమ్మకంగా చెప్పినా సంఘం దృష్టి బుద్ధికి వ్యతిరేకంగా ఉన్నప్పుడు సంఘజీవి సంఘర్షణకు గురికాక తప్పదు. ఈ మానసిక సంఘర్షణలోనుంచే సంస్కరణోద్యమాలూ, విప్లవాలూ పుట్టుకొస్తాయి.

తన మనసు రాయికాకుండా ఉండాలంటే పార్వతి, అయినవాళ్ళ అభిప్రాయాలకు తలఒగ్గి, తన భర్తను ఇష్టం వచ్చినట్టు చెయ్యనిస్తే చాలు. కాని ఆమె తన మనసు రాయి కావటానికే సిద్ధపడింది. ఆమె తన కొద్ది జీవితంలో గడచిన అనుభవం ఆమెకు ఆ దారే చూపింది.

ఉన్నట్టుండి ఒక రాత్రి ఝాము పొద్దుపోయాక కాంతయ్య దిగాడు. బావమరుదులు అతన్ని మామూలుగానే పలకరించి మర్యాదలు చేశారు; జీవిత నాటక పాత్రధారులు సంఘం డైరెక్షనుకు కట్టుబడక తప్పదు.

"పార్వతితో అవసరంగా మాట్లాడాలి. అన్నం తినేవచ్చా" అన్నాడు కాంతయ్య.

ఇద్దరికీ ఒక గది ఇచ్చారు.

ఆ రాత్రి పార్వతికి అగ్నిపరీక్ష. ఆమె మనసు అదివరకే రాయి అయి ఉండకపోతే ఆమె ఆ అగ్నిపరీక్షకు అరనిమిషం కూడా తట్టుకొని ఉండదు.

"నిన్నూ, పిల్లవాణ్ణి మన ఊరు తీసుకుపోవటానికి వచ్చాను. రేపే పోదాం" అన్నాడు కాంతయ్య.

"కొడుక్కు భాగం కొడుక్కు రాసియ్యండి. మా వెంకటేశ్వర్లన్నయ్య ఇక్కడే ఉన్నాడుగా—ఆ తరువాత మన ఊరికి పోదాం."

"మనం కలిసే ఉంటుంటగా మళ్ళీ భాగాలు పంచటం ఏమిటి?"

"మీరు మళ్ళీ మొదటి కొస్తున్నారు. ఆ ఏర్పాటు ఏనాడో చెడిపోయింది".

"పిల్లవాడికి రాసివ్వటానికి సగం ఆస్తి ఉండదు. నా అప్పులన్నీ తీరగా చాలా కొంచెం మిగులుతుంది. ఆ మిగిలిందికాస్తా వాడిపేర పెట్టించి, నన్ను తిండికి మాడ్చుదామనా?"

"మీ అప్పులు సక్రమమైనవి కావు. పిల్లవాడి ఆస్తిలో సెంటు భూమికూడా మీ బాకీలకింద అమ్మటానికి మీకు అధికారం లేదు. పిల్లవాడి వంతు వాడికి రాసి ఇచ్చాక నన్నూ వాణ్ణీ తిండికి మాడ్చండి. ఆ అయివేజులో కానీ అడిగితే నన్ను చెప్పుచ్చు కొట్టండి."

కాంతయ్య ఆమెమీద సమ్మోహనాస్త్రం ప్రయోగించాలని యత్నించాడు. ఆమెను బలాత్కారంగా కౌగిలించుకున్నాడు. ముద్దులు పెట్టుకున్నాడు. ఆమె శరీరం కరిగి జావ అయిపోయింది. కాని ఆమె తన మనస్సులోని రాయిని ఈ సమ్మోహనాస్త్ర ప్రభావం నుంచి కాపాడగలిగింది.

తిరిగి తెల్లవారుఝామున అతను "ప్రయాణానికి సిద్ధంకా" అన్నాడు.

"ఈ పూట పత్రాలు రాయించి సంతకాలు చెయ్యండి. సాయంత్రం బయలుదేరుదాం" అన్నది పార్వతి.

"నేను సంతకాలు చెయ్యకపోతే?" అన్నాడు కాంతయ్య.

"మీరు దురుద్దేశంతో నన్ను తీసుకుపోతున్నట్లేగా."

"తీసుకుపోయి నీ గొంతూ, పిల్లాడి గొంతూ నులిమేస్తాననా?"

"అటువంటి ఆలోచన నా బుర్రలో లేదు. మీ నోట రావటం చిత్రమే! ఆదో భయం కూడా పెట్టారు. ఇంకెలా వస్తాను?"

గెలిచి ఓడిపోయి కాంతయ్య వెళ్ళిపోయాడు.

* * * *

తెర మరుగున ఏం జరుగుతున్నదీ పార్వతికి తెలీదు. కోర్టు వ్యవహారాలు అనుభవం లేకా, చెప్పినా అర్థంకాకా, ఎంతకాలానికీ ఏ ఫలితమూ కనపడకా, తన ప్రయత్నమంతా బూడిదలో పోసిన పన్నీరయిందనీ, చివరకు తనకు కోర్టుకెక్కిన అపఖ్యాతి మాత్రమే మిగులుతుందనీ ఆమె అనుకున్నది. ఈ జీవితంలో ఎంత అనుభవం ఉండీ చాలదు. ప్రతి పొరపాటూ జీవితంలో ఒక్కసారి మాత్రమే చేసే అవకాశం వస్తుంది. ఆ అనుభవం జీవితంలో మరెన్నటికీ అక్కరకు రాదు. కాల్ల చక్రం వెనక్కు తిరుగదుగాని, తిరిగినట్టయితే ఆరోజు తన మొగుడు తనను తాను ఊరికి రమ్మన్నప్పుడు తాను తప్పక అతనివెంట వెళ్ళిపోతా ననుకున్నది.

అంటే అర్థమేమిటి? తానొక తప్పటడుగు వెయ్యనందుకు పార్వతి మన స్ఫూర్తిగా విచారించే స్థితికి దిగజారిపోయింది. ఇటువంటి విచారాలతోనే మనుషులు పతనమవుతారు.

ఒకటో రెండో యుగాలు గడిచా యనిపించేటంత కాలం జరిగాక, "చిన వెంకణ్ణారాయణ" హైస్కూలులోచేరి చదువుతుండగా, ఒక ప్లీడరుగారు ప్లీడరు

వేషంలో, నల్లకోటూ, తెల్ల తలపాగాతోసహా, చంకన కొన్ని కాగితాలు పెట్టుకుని ప్రత్యక్షమయ్యాడు.

చిన్న సభ జరిగింది. సభలో నలుగురన్నలతో బాటు పార్వతిని కూర్చోమన్నారు.

ఆయన కాంతయ్య ప్లీడరుట. ముందు పార్వతికేసి చూస్తూనే మాట్లాడాడు.

"అమ్మా మీది గొప్పవంశం. నేనా సంగతి జ్ఞాపకం చెయ్యనవసరంలేదు. మీ వంశంలో ఏనాడూ స్త్రీలు పురుషులమీద వ్యాజ్యాలు వేసినదిలేదు. ఒక్క విషయం మాటవరసకు మనవిచేస్తా. మీ అత్తగారు కోర్టుకు వెళ్ళివుంటే కోర్టువారు కళ్ళు మూసుకుని ఆస్తి బాధ్యతలన్నీ ఆమెకు అప్పగించి ఉందురు. ఆమెకు అలాంటి బలమైన కేసున్నది కాని ఆమె కోర్టుకు వెళ్ళలేదు. అది అలా ఉంచండి. మీ భర్త గారు అప్పులు చేసినమాట నిజమే. కాని ఆ వంశంలో ఎవరు అప్పులు చెయ్యలేదూ? అందరూ తమ రాబడికి మించి ఖర్చు చేసినవారే. మీ మామగారి ముత్తాతగారి హయాంలో మీ ఆస్తి రెండింత లుండేది. ఆయన అప్పలు అంతగా చెయ్యలేదుగాని చెరువులకిందా, దేవుడి మాన్యాలకిందా, రోడ్డుకోసమూ చాలా భూమి వదిలేశారు. ఆయన కొంత అప్పుకూడా చేశారు. ఒకతరంవారు చేసిన అప్పును మరోతరంవారు తీరుస్తూ వచ్చారు. మీ మామగారిని ఆయన తండ్రిగారు దత్తుచేసుకున్నారు. అయినా తండ్రిగారి అప్పులను ఆయన తీర్చారు. ఆయనగారి అప్పులను మీ భర్తగారు మీద వేసుకున్నారు. మీ భర్తగారు ఖర్చుచేసినందుకు మీకేమీ అభ్యంతరం లేదనీ, ఆయన ఆస్తి విక్రయించటమే మీకు అభ్యంతరమనీ విన్నాను. మరి కొంచెం ఆలోచించినట్టయితే మీ భర్తగారు తన కొడుక్కు ఆస్తినీ అప్పునూ వదలక తామే అప్పులు తీర్చటం చాలా తెలివైనపని అని గ్రహించి ఉందురు. మీ భర్తగారు ఈనాడుచేసిన అప్పులను మీ కుమారుడి హయాంలో తీర్చవలసివస్తే ఎకరం అమ్మేచోట మూడెకరాలు అమ్మవలసి వచ్చేది. అప్పుడేమయేది? తండ్రి చేసిన అప్పులను మీ అబ్బాయి ఎలా కాదనగలడు గనకా?"

వెంకటేశ్వర్లు అడ్డొచ్చి లీగల్ పాయింటు ఎత్తాడు. తండ్రి చేసిన అక్రమమైన అప్పులను కొడుకు తీర్చనవసరం లేదు, అన్నాడు.

ఆ పాయింటుకు తరువాత వస్తానన్నాడు ప్లీడరుగారు.

ఆయన అదే ధోరణిలో చాలాసేపు మాట్లాడాడు. ఆయన చెప్పేది తనకు అనుకూలంగా లేకపోయినా, పురాణాలు చదివేవాళ్ళు చెప్పే ధర్మపన్నాలుకన్నా లక్షరెట్లు విశ్వసనీయంగా పార్వతికి తోచింది. ఇటువంటి ప్లీడర్లు దేశమంతా తిరిగి ఉపన్యాసాలివ్వటం మొదలు పెడితే ప్రజలు తమ హక్కులన్నిటినీ వదులుకున్నా వదులుకోవచ్చు.

చివరకు వెంకటేశ్వర్లుకూ ఆ ప్లీడరుగారికి కొంత చర్చ జరిగింది. నీ కేసులో

తూట్లున్నాయంటే, నీ కేసులో ఇంకా పెద్దతూట్లున్నాయని ఇద్దరూ వాదించు కున్నారు.

ఆ చర్చకూడా ముగిశాక ప్లీడరుగారు కోర్టులు మహాచెడ్డవనీ, తనమటుకు వెయ్యికేసులు గెలిచినదానికన్నా ఒక్కకేసు రాజీచెయ్యటంలో ఎక్కువ ఆనందం ఉన్నదనీ, నిజానికి రాజీఅయిన కేసుల్లో తనకు రాబడి అట్టేఉండదనీ, తమ భార్యాభర్తల మధ్య రాజీచేసి, ఇంతపుణ్యం సంపాదించుకుందామనే వచ్చాననీ బయటపెట్టాడు.

ఆ రాజీ ప్రకారం పదెకరాల మాగాణి భూమీ, పన్నెండెకరాల మెరకా, రెండున్నర ఎకరాల మామిడితోటా కుర్రాడికి చెందుతుంది. అతను మైనరుగా ఉన్నంతకాలమూ పార్వతి గార్డియనుగా ఉంటుంది.

"చాలా అన్యాయం! దారుణం! తన సొంత కొడుకును ఇంత అన్యాయం చెయ్యగలవాడు తండ్రిననిపించు కోటానిక్కూడా అర్హుడు కాడు. నేనీమాట వకీలుగా అనటంలేదు. పిల్లవాడి మేనమామగా అనటంలేదు. అన్నంతినే మనిషిగా అంటు న్నాను" అన్నాడు వెంకటేశ్వర్లు.

పార్వతి తన బుల్లి అన్నను చూసి చాలా గర్వపడింది. నిజానికామె రాజీకి ఒప్పుకోడానికి సిద్ధంగానే ఉన్నది. ఆమెకు ఆస్తిదాహం లేదు. తన పుట్టింటివారు అయిదెకరాల మాగాణితో అందరూ బతికారు. ఒక పిల్ల వెధవ పదెకరాల మీద బతకలేకపోడు.

వెంకటేశ్వర్లు పార్వతిని లోపలికి తీసుకువెళ్ళి "ఏం చేద్దామంటావు?" అని అడిగాడు.

"నేనుమాత్రం ఏం చెప్పను? అసలు ఆస్తి ఏమీరాదని నేనేనాడో గుండె రాయి చేసుకున్నాను. రాజీపడకపోతే ఇంకా చాలా వస్తుందంటావా?" అన్నది పార్వతి.

"రావచ్చు, రాకపోవచ్చు. కాని రాజీపడితే నీ మొగుడికి హెచ్చులాభం. వ్యాజ్యం సాగిస్తే అతనికి చిల్లిగవ్వ చేతిలో మిగలకుండా చెయ్యొచ్చు" అన్నాడు వెంకటేశ్వర్లు.

"అయితే తప్పక రాజీపడు బాబూ, ఆయనను బుక్కాఫకీరునుచేసి నేను పొందే ఆనందం ఏముందీ? ఇదుగోచూడు, ఆయన ఏనాడు కావాలంటే ఆనాడు వచ్చి మాతో ఉండి పిల్లవాడి అయివేజు ఖర్చుచేసుకోవచ్చనికూడా చెప్పు ఆ ప్లీడరు గారితో" అన్నది పార్వతి.

"ఇంకానయం! చేసిన ఖర్చులు చాల్లేదా? అతనంతట అతను వచ్చి కాళ్ళ మీద పడితే ఇంతకూడు వేద్దువుగాని! అంతేగాని, కోర్టు కీడ్చినందుకు లెంపలేసు కుంటున్నానని మొగుడికి కబురు చేస్తానంటావా ఏం" అన్నాడు వెంకటేశ్వర్లు.

అతని ఆగ్రహం చూసి పార్వతి భయపడింది.

జీవితం ఎంత క్రూరమైంది! అది తప్పుచేయని వాళ్ళపట్లా, ఘోరాలు చేసిన వారిపట్లా సమంగా క్రూరంగా ఉండగలదు.

*   *   *   *

రాజీ జరిగింది. పత్రాలు చేతికివచ్చాయి. వెంకటేశ్వర్లు తన మేనల్లుడి వంతు వచ్చిన భూములు చూసుకుని, వాటికి పట్టాలు పుట్టించి, ఆ పొలాలు చేసే వాళ్ళచేత కవుళ్ళు కొత్తగా వ్రాయించి, చాలా శ్రమపడ్డాడు.

అతను ఆ ఊళ్ళో ఉండగానే ఒక బ్రాహ్మడు వచ్చి, "అయ్యా! నా పేరు సోమశేఖరం అంటారు. మామిడితోట అబ్బిలాల వంతుకింద వచ్చిందని విని చాలా సంతోషించాను. ఆ మామిడితోటలో చాలా అవాచ్యాలు జరిగాయి. దానికి నేను పుణ్యాహవాచనం చేసి, బతికున్నన్నాళ్ళూ దాని పోషణ చూస్తాను. అందులో ఒక ఒంటెనిట్రాడి గుడిసె వేసుకుని నన్ను ఉండనివ్వండి. చెట్టునకాసిన ప్రతి కాయా మీకే ముట్టేటట్టు చూస్తాను. అబ్బిలాల తండ్రిగారికీ తల్లిగారికీ నేను చాలా ఋణపడి ఉన్నాను. ఈ విధంగానైనా రుణం తీర్చుకోకపోతే నాకు కుక్కజన్మ తప్పదు" అన్నాడు.

ఈ సోమశేఖరం గురించి పార్వతి చెప్పగా వెంకటేశ్వర్లు విన్నాడు. అతను అప్పటికప్పుడు మామిడితోట కవులొకటిరాసి సోమన్నచేత సంతకం చేయించాడు. అతను ఏటా ఇరవై రూపాయలుగాని, ఆ విలువగల మామిడి కాయలుగాని ఇవ్వాలి. తోట కాపలా పూచి అతనిదే. తోటలో ఉండే డెబ్బైరెండు చెట్లలోనూ దేన్నీ అతడు కొట్టడానికి అధికారంలేదు.

కాగితంలో ఏమి రాసి ఉన్నది సోమన్న చదవకుండానే కళ్ళకద్దుకున్నాడు.

"చదివిచూడు, తరవాత సంతకంచేసి ఇయ్యి" అన్నాడు.

సోమన్న కలం తీసుకుని సంతకంచేస్తూ "చర్మం వొలిచి ఇయ్యమంటాని కూడా పార్వతమ్మగారికి హక్కువున్నది. అంత ఎక్కువేమీ ఉండదుగదా ఇందులో!" అన్నాడు.

వెంకటేశ్వర్లు తాను వచ్చినపని పూర్తిచేసుకుని తిరిగి వెళ్ళిపోయాడు.

## రెండవ భాగం

"పెద్దన్నయ్యా! నేనూ పిల్లవాడూ ఉండటానికి ఎక్కడన్నా ఒక చిన్న భాగం చూసి పెడతావా ఏం?" అన్నది పార్వతి.

"అదేవిటీ! వేరే ఉండటం దేనికీ?" అన్నాడు నాగభూషణం.

తన చెల్లెలి మనసులో ఇటువంటి ఆలోచన పుట్టి పెరుగుతున్న సంగతి అతనికి తెలుసు. ఇంట్లో అందరికీ తెలుసు.

పార్వతి తన మొగుడిమీద దావా వేసి, తన కొడుకు ఆస్తి వేరు పెట్టించు

కుని, దానికి తాను నిర్వాహకురాలు అయిన కొద్దిరోజులకే ఆమె పెద్దవదినెగారు సౌభాగ్యమ్మ, "ఇక పార్వతమ్మోదిన మనమధ్య ఎంతో కాలం ఉండదు" అని జోస్యం చెప్పేసింది. ఆవిడ వాక్శుద్ధిగల మనిషి. ఆమెనోట అన్నమాటలు అబద్ధం కావటం చాలా అరుదు.

వేరే ఉంటా ననగానే తనను అందరూ అపార్థం చేసుకుంటారని పార్వతికి తెలుసు.

"నువు మాత్రం చూడటం లేదా, అన్నయ్యా? ఇల్లు ఇరుకవుతున్నది. పుట్టే పిల్లలూ, ఎదిగే పిల్లలూనూ. వెంకటేశ్వర్లన్నయ్య కాపరంకూడా ఇందులోనే ఉంటే ఇంకెట్లా ఉండేదో ఆలోచించుకో; హోయి హాయిగా అత్తారింట కూర్చున్నాడు. నేనూ, పిల్లాడూ వెళితే ఇంకొంచెం తెరిపిస్తుంది ఇల్లు. నే నేమన్నా పోట్లాడి, అలిగిపోతున్నానా? మీ సహాయం లేకుండా నాకు జరుగుతుంది గనకనా? ఇల్లు దగ్గరలోనే చూడు" అన్నది పార్వతి.

తన అన్నలైనా, అందరూ కలిసి ఉండటంవల్ల కొన్ని ఇబ్బందులు పడు తున్నారని ఆమెకు తెలుసు. పెద్దాయన భార్య సౌభాగ్యమ్మకు వల్లమాలిన ఆచారం. తూర్పు తెల్లవారకముందె నెత్తినిండా నీళ్ళు పోసుకుని స్నానం చేసి అపరాహ్నం దాకా మడిలోనే ఉంటుంది.

"ఎందుకు వదినా, రోజల్లా ఈ మడీ?" అంటే "చిన్నప్పట్నించీ అయిన అలవాటు పోతుందా, నాయనా?" అనేది సౌభాగ్యమ్మ.

రెండో ఆయన భార్య వెంకమ్మ కాస్త మాటకారి. "నేను కూడా అక్కయ్యల్లే అర్ధరాత్రే లేచి నాలుగు బొక్కెన్లు నెత్తిన దిమ్మరించుకుని, మడిలో ఉండిపోతా న్రా, పిల్లలందరికి చెయ్యలేక చావుగా వుందీ!" అనేది. నిజానికి ఇంట్లో ఉన్న అయి దారుగురు పిల్లల పోషణా ఆవిడే చూసేది - పార్వతికొడుకు వెంకటనారాయణతో సహా.

వెంకమ్మ గొడ్డుచాకిరీ చేసేమాట నిజమేగాని, అది గొడ్డుచాకిరి లాగే ఉండేది. ఆమెకు ఆచారం లేనట్టే శుభ్రంకూడాలేదు. ఆవిడచేత నీళ్ళు పోయించుకు వస్తే వెంకటనారాయణ చెవులవెనకా, చంకల్లోనూ, గజ్జల్లోనూ మురికిపోయేదికాదు. 'నా పిల్లవాడికి నేను నీళ్ళు పోస్తాలే. నేను అన్నం పెడతాలే' అనటానికి పార్వతికి బిడియంగా ఉండేది. ఆమెను వదినెలు ఏ పనీ చెయ్యనిచ్చేవారుకారు. ఏ పనికైనా పార్వతి చెయ్యిచాస్తే చాలు, 'ఇంకా నయం?' అంటూ ఎవరో ఒకరు వచ్చి చేతిలో వస్తువు లాగేసుకునేవారు. ఆఖరుకు కూరలన్నా తరగనిచ్చేవారుకారు. మర్యాదే అనుకుంటే బాగానే ఉండేదిగాని, అటువంటి మర్యాదలవల్ల సంతృప్తి ఉండదు. అవతలివాణ్ణి నీతో సమంగా చూచుకోవటమే నిజమైన మర్యాద. ఈ సంగతి ఈనాటికీ ఎంతోమంది ఎరగరు. నలభై ఏళ్ళ క్రితం ఇటువంటి అభిప్రాయం ఎవరికీ ఉండేది కూడా కాదు.

ఈ సహజీవనంలో పార్వతికి మరీ అన్యాయంగా కనిపించింది, దంపతులకు వేరే వేరే పడకగదులు లేకపోవడం. మూడో అన్నకు పెళ్ళి అయి త్రిపురాంబ కాపరానికి వచ్చేదాకా ఈ పడకగదిలోటు ఎవరినీ బాధించినట్టు కనిపించలేదు. పెద్దవాళ్ళు నాగభూషణమూ, వెంకట్రామయ్యా పెళ్ళాలతో కాపరాలుచేస్తూ, పిల్లల్ని కంటున్నా వాళ్ళసంసారం వానప్రస్థంలాగే ఉండేది. మూడోవాడు పార్వతీశం తనకొక పడకగది కావాలని పట్టుబట్టాడు. ఉన్న మూడుగదుల్లోను ఒకటి అతనికి ఇచ్చివేయవలసి వచ్చింది. పార్వతీశం భార్య త్రిపురాంబ అంత కలివిడి మనిషి కాదు. రోజుకు పదహారుగంటలు గది నుంచి ఇవతలికి వచ్చేదికాదు.

రాత్రి భోజనాలయాక పార్వతీశం బాబాయీ, 'త్రిపుర' పిన్నీ ఆ గదిలోకి వెళ్ళి తలుపులు గడియపెట్టుకోవటం చూసి పిల్లలు వింత మొహాలు పెట్టేవాళ్ళు. 'పెట్టరామరి? పిల్లలు నలుగురూ నిద్రపోయేదాకా ఆగకూడదూ? అంత ఆత్రమేలా?' అనుకునేది పార్వతి.

నాలుగోవాడు దక్షిణామూర్తి చేసుకున్నావిడ, వర్ధనమ్మ - కునిష్టిది. పాపం ఆవిడకు ఎప్పుడూ ఏదో జబ్బు. పుట్టింటిదగ్గిరే ఉంటూ తన పినతండ్రిచేత వైద్యం చేయించుకునేది. ఆయన మంచి ప్రాక్టీసుగల డాక్టరు. కాస్త నయంకాగానే వచ్చి, వారం తిరిగేలోపుగా మళ్ళీ జబ్బుపడి పుట్టింటికి వెళ్ళిపోయేది వర్ధనమ్మ.

"ఏదన్నా ప్రాప్తం ఉండాల్రా? ఆవిడకు అత్తింటి బావి నీళ్ళు ప్రాప్తంలేవు" అనేది వెంకాయమ్మ. వెంకటేశ్వర్లుక్కూడా సొంతబావినీళ్ళు ప్రాప్తంలేకనే అత్తవారింట కాపరం పెట్టాడని ఆవిడ సిద్ధాంతం.

పార్వతికి అనుకున్నంత దగ్గిరలో ఇల్లు దొరకలేదు. మూడు వీధులవతల దొరికింది. శ్రీయుతులవారి డాబావెనక చిన్న పెంకుటిల్లు. ఇల్లంతా ఒకే గది. అందులో ఒక మూల తడికెలు పెట్టి వంటగది ఏర్పాటు చేసివున్నది. అద్దె మూడున్నర రూపాయలు. దాని పక్కనే ఉన్నది.

ఇల్లు ఏర్పాటు చేసుకోవటానికి పాత్రసామాగ్రి అంతా అన్నలిచ్చారు. ఇంటికి కావలసిన పదార్థాలన్నీ తెచ్చిపడేశారు.

మనిషికి స్వేచ్ఛకావాలి. ఇతరుల సహకారమూ కావాలి. ఈ రెంటికీ వైషమ్యం కలగకుండా జీవిస్తేనే మనిషికి సుఖం ఉన్నది. రెంటికీ ఘర్షణవచ్చి స్వేచ్ఛనో, సహకారాన్నో త్యాగం చేయవలసి వచ్చినప్పుడు చాలా బాధ కలుగుతుంది.

విడిగా వచ్చెయ్యటం పార్వతికి ఏదో విజయం సాధించినట్టుగా అనిపించింది. తాను చెయ్యగల పనులు ఇతరులు చెయ్యటమూ, అది తనకు నచ్చకపోవటమూ అంటూ ఇక ఉండదు. ఆఖరుకు వంటవిషయంలో కూడా తనకిప్పుడు పూర్తి స్వేచ్ఛ లభించింది. సౌభాగ్యమ్మ వంట ఏమీ బాగుండదు. 'ఏదైతేనేం? కడుపుకింత తినటానికి?' అన్న వేదాంతం ఆవిడనోట తరచు వినిపించేది. పార్వతి అంత

కాలంగా తమయింట ఉన్నప్పటికీ పార్వతికిష్టమైన వంటకాలేమిటో ఆ యిల్లాలు కనుక్కున్న పాపానపోలేదు. పెద్ద వాళ్ళమాట దేవుడెరుగు. చిన్నపిల్లలకైనా జిహ్వాచాపల్యం తీరేటట్టు ఏనాడూ వండిపెట్టలేదు. "వంటికి మంచిది తినండి" అంటూ ముప్పూటలా పాతచింతకాయ తొక్కు తెచ్చి పిల్లల కంచాల్లో వేసేది.

తాను అన్నల ఇంట్లో ఉన్నంతకాలమూ ఇటువంటి వేవీ పార్వతికి పట్ట లేదు. కాని ఇప్పుడు తనకు వేరే కాపరం ఏర్పాటయాక ఇవన్నీ ఆమె మనసులో పైకి తేలాయి. అన్నల దగ్గిర తన జీవితంలో ఎన్ని లొట్టలుండినదీ ఎంచసాగింది పార్వతి.

పార్వతి కిదొక రకమైన కొత్తజన్మ. ఈ జన్మలో ఆమెకు కొత్తగా అలవా టైనది తిండిపోతుతనం. రోజూ చూడవచ్చే వదినెలకు కూడాఆమె శరీరం లావెక్క టమూ, నునుపుతేలటమూ, రంగు రావటమూ స్పష్టంగా తెలియవచ్చింది.

"ఏమోనర్రా, మీరు నన్ను అందలమెక్కించి పనీపాట లేకుండా చేస్తిరి. ఇప్పుడు చచ్చినట్టు ఇంటి పనంతా చేసుకుంటున్నానేమో, తిన్నదికాస్త వంటపడు తున్నట్టున్నది" అన్నది పార్వతి వదినెలతో.

తిండి సుఖం తరవాత పార్వతికి కొత్తగా లభించిన ఆనందం, బంధువులు కానివాళ్ళతో సావాసం. ఇంటివాళ్ళు ఆమెకు మంచి స్నేహితులయారు. బంధు త్వంలో ఉండే ప్రతిబంధకాలు వంతులూ, సాధింపులూ, స్వార్థాలూ, బాధ్యతలూ ఎవరో నిర్ధారణచేసిన పట్టింపులూ - స్నేహంలో ఉండవు. స్నేహబంధాన్ని ఎంత దూరంగా ఎంతవదులుగా ఉంచుకోవాలనిపిస్తే ఉంచుకోవచ్చు. బంధువులచేత ఒక మంచి మాట అనిపించుకోవటం కంటె స్నేహితులచేత అనిపించుకోటం తేలిక అని పార్వతి అనుభవంద్వారా తెలుసుకున్నది.

భార్యాభర్తలు సాధారణంగా పరస్పర విరుద్ధంగా ఉంటారంటారు. కాని ఇంటాయనా, ఇంటావిడా కూడా వెదురుబద్దలల్లే సన్నగా, పొడుగ్గా కొంచెంగా వంగపడిపోయి ఉంటారు. ఇంటాయన శివరావుకు నలభై అయిదుకు తక్కువుండవు. ఇంటావిడ మాలక్ష్మమ్మకు నలభైకి ఎక్కువ ఉండవు. వాళ్ళకొక ఇరవై ఏళ్ళ కొడుకూ, పదేళ్ళ కూతురూ ఉన్నారు. వాళ్ళ మధ్యగాని, పిల్లతరవాతగాని ఆ దంపతులకు పిల్లలే కలగలేదు.

శ్రీయుతుల వారబ్బాయి పట్నంలో సైన్సు బియ్యే రెండో ఏడు చదువు తున్నాడు; శలవులకుమాత్రం వస్తుంటాడు. పార్వతి అద్దెకు వచ్చేసమయానికి ఆ అబ్బాయి, కృష్ణారావు శలవులకు వచ్చిఉన్నాడు. ఆ అబ్బాయిని చూడగానే పార్వ తికి, "మా పెద్దన్నయ్య కూతుర్ని ఈ అబ్బాయికి చేసుకుంటారేమో!" అన్న ఆలోచన మెరుపులాగా వచ్చింది. ఆడపిల్ల, సత్యవతికి సంబంధాలు చూస్తున్నట్టు న్నారు; ఆ పిల్ల ఆడపిల్లల స్కూల్లో చదువుతున్నది. ఇంటిదగ్గిర ఫిడేలు నేర్పిస్తు

న్నారు. రెండేళ్ళ నుంచీ నేర్చుకున్నదిట. సావిత్రి నాటకంలో[1] యముడు పాడే పాట, "పోబాల పొమ్మికన్" తనంతట తనే వాయించి వినిపించింది. ఆ పిల్ల వాయింపు బాగున్నదీ లేనిదీ తెలుసుకునేపాటి సంగీత పరిచయం పార్వతికి లేదు. ఆమెకు సంగీతం 'మోత' ఏదైనా బాగానే ఉంటుంది.

తనను చూసి ఇల్లుగలాయనా, ఆయన కొడుకుకూడా ఎటువంటి దారుణ వికారాలు అనుభవించినదీ పార్వతికి తెలీదు; తెలియవలసిన అవసరం కూడా ఏర్పడ లేదు.

తన వదినెలూ, వాళ్ల పిల్లలూ వస్తే పార్వతికి ఒక విధంగా సరదాగానూ ఉండేది, మరొక విధంగా ముళ్ళమీద ఉన్నట్టూ ఉండేది. వెంకాయమ్మ ఏదో ఒక కోతిమాట అని నవ్వించేది.

"అదిసరే — వట్టిగొడ్డుకు అరుపులెక్కువనీ," అంటూ ఆమె త్రిపురమ్మ నెలా నెలా నాగా పెట్టకుండా చిరిచాప తీసుకుని దూరంగా ఉండటం మీద ఒక విసురు విసిరింది. పార్వతి నవ్వలేక చచ్చింది. అవతలవాళ్ళు పొట్టలు పిసుక్కు నవ్వినా వెంకాయమ్మ చాలా సీరియస్‌గా ఉండి ఒక హాస్యం వెంట ఇంకోహాస్యం దొర్లించేది.

"ఆ మూణ్ణాళ్ళూ మీ పార్వతీశ వన్నయ్య పడేబాధ చూడలేక చస్తున్నాం. మనకేం నష్టం లేదనుకో. ఉత్తప్పుడావిడ చేస్తున్న ఇంటి పనేవుంది గనకా !— మాట వరసకి చెప్పా.... ఇప్పుడేవిటో తెలుసా? పవుడరు ! పాపం, నువ్వెప్పుడు వేరే పోతావా అని ప్రాణాలు బిగబట్టుక్కూచుంది గామాలు. నువ్వట్టా వీధిలోకి అడుగు పెట్టగానే ఓ ముద్దొచ్చే పవుడరుడబ్బా తెప్పించింది మొగుడిచేత. అది వేసుకోవటానికి పప్పు లేమిటి, పప్పూ? అదికూడా తెప్పించింది. దాంతో మొహానికి అస్తమానం పవుడరేసుకుంటూ ఉండటమే. మొహం కడగా, పవుడరు వెయ్యా మొహం కడగా, పవుడరు వెయ్యా! పగటి భాగోతుల వేషమనుకో! ...." ఈ విధంగా వెంకాయమ్మ కి ఇచ్చిన అలారం గడియారమల్లే కూర్చున్నంత సేపూ వాగుతూనే ఉండేది. ఆవిడ విసుర్లు నూటికి తొంభై తొమ్మిది పాళ్ళు తన తోడికోడలు త్రిపురాంబ మీదనే.

---

1. శ్రీరాముల సచ్చిదానందమూర్తి (1888 - 1954) మైలవరం కంపెనీ వారికోసం రాసిన నాటకం. 1915 లో వెలువడింది. యముడు పాడే పాట ఆ రోజులలో చాలా ప్రచారం పొందింది. 1933 లో ఈస్టిండియా వారు పి. పుల్లయ్య దర్శకత్వంలో సావిత్రిని తెరకు ఎక్కించారు. అందులో గగ్గయ్య యముడు. ఆయన పాడిన ఈ పాట మరింత ప్రచారం పొందింది.

ఎక్కడన్నా కూచిపూడి భాగోతమో, హరికథో, నాటకమో అయితే వెంకా టసుమ్మే వార్త తెచ్చేది. సాధారణంగా ఇద్దరూ కలిసే వెళ్ళేవాళ్ళు.

పార్వతికి రోజులు సుఖంగానే వెళ్ళిపోతున్నాయి. ఆవిడ జరిగిన కాలం గురించి ఎక్కువ ఆలోచించేది కాదు. కాని గడిచిన జీవితానుభవాలను ఆమె మరవ లేదు. కాకపోతే ఆ అనుభవాలను ఏవిధంగా భవిష్యత్తుకు ఉపయోగించుకోవాలో అది కూడా ఆమెకు స్పష్టంగా తెలియదు. వెనక్కి తిరిగిరాని ప్రయాణంలాటి జీవిత మార్గంలో ఎక్కడ ఏ గొడవలున్నదీ తెలిసి ఏం లాభం? గానుగెద్దు జీవితం అయితే వచ్చిన సమస్యలే మళ్ళీ వస్తాయి గనక అనుభవం బాగా ఉపయోగపడు తుంది. అందుకేనేమో చాలామంది తమకు తెలియకుండానే గానుగెద్దు జీవితం కోరుకుంటారు. అటువంటి జీవితంలో తాము గడించిన అనుభవంతో లోకాన్ని ఉద్ధరించ వచ్చునను కుంటారు. కాని మానవజాతి జరిపే మహాప్రస్థానంలో వీళ్ళ అనుభవ జ్ఞానానికి ఏమీ విలవ ఉండదు. అందుకు కావలసిన విజ్ఞానం అచ్చగా అనుభవం ద్వారా వచ్చేదికాదు.

* * *

వేరే యింటికి పోవటం పార్వతికి ఎంత బాగుందో ఆమె కొడుక్కి అంత బాగాలేదు. సుమారు ఏడేళ్ళ కితం ప్రారంభమయిన తన జీవితం వాడికి మరకల తెరలాగా వుంది. అందులో కొద్ది భాగమే అర్థమవుతున్నది. అందులో కంటి కింపైన మరకలు చూడగానే ఆహ్లాదం కలిగించేవి, అమ్మలాటివి కొన్ని ఉన్నాయి. వాటిలో మేనమామల ఇల్లూ, అక్కడి వాతావరణమూ, వాడి బావలూ, వదిన్లూ కూడా ఉన్నాయి. కొన్ని చీకటి మరకలూ, మురికి మరకలు కూడా ఉన్నమాట నిజమేగాని, పిల్లలు వాటిని అతిసులువుగా తమ మనస్సుల నుంచి గెంటిపారెయ్య గలరు.

ఈ కొత్త ఇంట్లో సందడి లేదు. ఆటల్లేవు. పాటల్లేవు. ఆ యింటి నుంచి ఎవరన్నా వచ్చినప్పుడు మాత్రం దీపాలు వెలిగినట్టుంటుంది. వాళ్ళు వెళ్ళిపోగానే అంతా జీబు జీబుగా అవుతుంది. ఆ తరువాత అమ్మకూడా ఎంచేతో అంత బాగు న్నట్టుండదు. అది మరీ ఘోరం.

"అమ్మా ఇవాళ బడికిపోను. మామయ్యగారింటి కెళ్ళి ఆడుకుంటా" అనేవాడు చిన వెంకటనారాయణ.

"ఆ వెధవల సావాసంతోనే నువ్విట్లా తయారయావు" అన్నది తల్లి చాలాసార్లు.

ఈమాట వాడికి మొదటిసారి చెంపపెట్టులాగా తగిలింది. అన్నం గిన్నెలో చెయ్యి పెడితే ఏ ఎలుకో తగిలినట్టుగా వాడు ఉలిక్కిపడ్డాడు. తన బావలమీద అమ్మకు అంత హీనమైన అభిప్రాయం ఉన్నట్టు వాడికి అంతదాకా చూచాయగా నైనా తెలీదు. దానికి తగ్గట్టు వాడికేమో వాళ్ళంటే చాలా యిష్టం కూడాను! ఆ

తరువాత వాడికి బావలు కలిసినప్పుడల్లా వాళ్ళని 'దగాపడిన తమ్ముళ్ళ' లాగా ఎంతో జాలిగా చూసేవాడు. వాళ్ళ అమ్మను ఆప్యాయంగా "అత్తయ్యా!" అని పిలుస్తుంటే వాడికి ఎవరో తన పీక నొక్కేస్తున్నట్టుగా ఉండేది. అందుకే కాబోలు వాడు పైకి, 'మా అమ్మకు మీరంటే చాలా అసయ్యం' అనలేకపోయేవాడు.

కాని పార్వతికి నిజంగానే తన మేనల్లుళ్ళంటే అంత మంచి అభిప్రాయం లేదు. ఆవిడ లెక్కన వాళ్ళ సరిగా పెరగడం లేదు. నిజం చెప్పాల్సివస్తే వాళ్ళ గాలికి పెరుగుతున్నారు. వాళ్ళను గురించి పెద్దవాళ్ళ పట్టించుకోరు. అయినా తన మేనల్లుళ్ళను తీర్చిదిద్దాలన్న ఉద్దేశం పార్వతికి ఏకోశానా లేదు. వాళ్లు ఎట్లా పెరిగితే తనకేం? తన కొడుకు వాళ్ళలాగా పెరగటానికి వీల్లేదు. తన కొడుకు మనసురోపడే ప్రతి ఆలోచనా వాడికి ముందు ముందు పనికిరావాలి. వాడి మనస్సు అడివల్లే తయారు కారాదు; తీర్చిదిద్దిన తోటలాగా ఉండాలి. అందులో ప్రతి అంగుళమూ తనకు అర్థమవుతూ ఉండాలి. అదే పార్వతి దృక్పథం.

కొత్త యింటికి మారిన రెండు వారాలకు స్కూళ్లు తెరిచారు. చిన వెంకట నారాయణ హైస్కూలు ఆట్టడుగు క్లాసులో ప్రవేశించాడు. వాణ్ణి నాగభూషణమే చేర్పించాడు స్కూల్లో.

స్కూల్లో చేరటంతో చినవెంకటనారాయణ జీవితం గొందిలో నుంచి పెద్ద వీధిలోకి వచ్చినట్టయింది. వాడు చేరినరోజునే ముగ్గురితో స్నేహం చేసుకున్నాడు. మనుషులకు కొత్తరకాల పేర్లుంటాయని ఇప్పుడిప్పుడే వాడికి తెలియవస్తున్నది. మొదట తనను నారాయణ అని పిలిచినవాళ్ళ 'బీవీయెన్' అని పిలవసాగారు. క్లాసులో బీజీకే,డీజీకే, ఎన్ జీకే-ముగ్గురూగోపాలకృష్ణమూర్తులే ఉన్నారు. ఎస్సెస్సార్, డీవీయెస్, జీయెల్పీ, పీయెస్సెన్ కూడా ఉన్నారు. అందరూ నారాయణ మిత్రులే. అయితే నారాయణకు ఏ ఇద్దరితోనూ ఒకే రకమైన బంధం లేదు. ఒకడు లెక్కల్లో ఫస్టు. ఒకడు బాగా పరిగెత్తుతాడు. ఒకడు డ్రాయింగు బాగా వేస్తాడు- డ్రాయింగు మేస్టర్ బ్లాక్‌బోర్డుమీద వేసే తెరిచిఉన్న పెట్టెబొమ్మలు కావు- బొచ్చుకుక్కలూ, ఎగిరే కాకులూ, కొమ్మనుంచి ఒకచేత్తో వేళ్ళాడే కోతులూ, ఏమేమిటో ఇట్టే వేసేస్తాడు. ఒక్కొక్కడిలోనూ ఒక్కొక్క విశేషం ఉంది. కొందరు అచ్చగా 'మంచితనం' కొద్దీ నారాయణకు స్నేహితులైనవాళ్లున్నారు.

వాడు ఇంటికి వస్తూనే తల్లికి తన స్నేహితులను గురించి ఎంతో ఉత్సాహంగా చెప్పబోయాడు. కొద్దిరోజులు విన్నాక, ఒకనాడు అమ్మ అకస్మాత్తుగా, "నువు ఏ అలగా వెధవలతో సావాసం చేస్తున్నావోనని నాకు భయంగా ఉంది" అన్నది.

నారాయణ మరోసారి నిర్ఘాంతపోయినాడు. తనకు ఇష్టమైన వాళ్ళను అలగా వాళ్ళకింద తల్లి ఎందుకంత తేలిగ్గా కొట్టిపారేస్తున్నదో వాడికి కొంచెం కూడా అర్థంకాలేదు. స్కూల్లోచేరి నెల తిరక్కుండానే నారాయణ ద్విపాత్రధారణ చేసే

ధోరణిలో పడ్డాడు. తన స్కూలు జీవితం వేరూ, ఇంట్లో జీవితం వేరూనూ. వాటిని వేరువేరు అరల్లో వుంచటమే మనస్సుకు హాయి.

క్రమంగా వాడికోసం స్నేహితులు యింటికి రావటం కూడా ప్రారంభించారు. అట్లా వచ్చినవాళ్ళను పార్వతి అతి జాగ్రత్తగా పరీక్షించేది; వాళ్లు స్పృశ్యులా? అస్పృశ్యులా? వాళ్ళతో స్నేహం తన కొడుక్కు లాభిస్తుందా? లాభించదా?

వాళ్లు వెళ్ళిపోయాక పార్వతి కొడుకును వాళ్ళ గురించి తరచి తరచి అడిగేది. మొదట్లో నారాయణ ఆ ప్రశ్నలకు ఆత్రంగా సమాధానాలు చెప్పేవాడు-అమ్మకూ్కడా వాళ్ళమీద అభిమానం కలిగిందనుకుని. అయితే ఇది పొరపాటని త్వరలోనే నారాయణకు తెలిసిపోయింది.

"బ్రాహ్మలైతే పోనీ అనుకోవచ్చు. సూదరాళ్ళను కూడా ఇంట్లోకి తెస్తా వేంరా?" అన్నది పార్వతి. ఆమె అత్తవారింట శూద్రులనేమాట ఎవరూ వాడేవాళ్లు కారు. 'సంసార్లు' అనేవాళ్లు. సంసారి ఇల్లాళ్ళూ. కమతగాళ్ళూ వాళ్ళ ఇల్లంతా తిరిగేవాళ్ళు ఒక్క వంటింట్లోకి వచ్చేవాళ్ళుకారేమో. ఈ సంగతులు పార్వతి మరిచి పోయిందనుకోవటానికిలేదు. పల్లెటూళ్ళలోకన్నా బస్తీలో ఆచారం జాస్తి అనుకోవటానికి అసలే వీల్లేదు. బస్తీకి వచ్చాక బ్రహ్మణ పార్వతికి శూద్రకులస్థులతో సంబంధాలు దూరమయా యనుకోవాలి. నిజానికి ఈ బస్తీలో తనకు 'అక్కా, వదినా'అని పిలిచే శూద్ర స్త్రీ లెవరున్నారు? తన జీవితంలో వాళ్ళేం భాగం పంచుకుంటున్నారు?

కాని నారాయణ విషయం అట్లాకాదు. వాడి క్లాసులో అన్ని కులాలవాళ్ళూ ఉన్నారు. ఒక రజాక్ కూడా ఉన్నాడు "అరె భాయ్!" అంటూ. నారాయణ వాళ్ళందర్నీ ఎట్లా ఎడం పెడతాడు?

నారాయణ గుండెల్లో రాయిపడ్డది. తన స్నేహితులు తనకోసం రావటం వాడి ప్రాణానికి రంగుమరకల్లో ఒకటి. చాలా కాంతివంతమైనది. మహా తియ్యనిది. బ్రాహ్మల్ని లోపలకు రానిచ్చి శూద్రుల్ని ఎండలో నిలబెట్టాలా? చందుగాయి పెట్టేలాగున్న ఈ ఇంటికి వసారాకూడా లేదు. నారాయణ ఏం చెయ్యాలి? ఈ ప్రశ్న వాడి కళ్ళ వేడిఆవిర్లు తెప్పించింది. ఇంత జటిలమైన సమస్యను మతస్థాపకులే పరిష్కరించ లేకపోతే, ఆ పసివెధవ పరిష్కరించగలడా? ఇతరుల మనస్సులో గుబులు పుట్టిస్తే తల్లితో చెప్పుకుని ఉపశమనం పొందవలసినవాడు. తల్లే గుబులు పుట్టిస్తే ఏం చేస్తాడు?

వాడు తన శక్తి పరిధిలో ఆలోచించాడు. పీబీజీ ఇంటికి ఎందరో వస్తారు. పీబీజీ అమ్మగాని నాన్నగాని ఏ నిషేధాలూ పెట్టినట్టు కనబడదు. వాళ్ళు అమ్మకన్న మంచివాళ్ళా? అమ్మను గురించి అంతమాట అనుకోవటం కష్టమే అయినా, మనుషులు పీబీజీ అమ్మానాన్నల్లాగా ఉండాలన్న నమ్మకం వాడిలో నిశ్చలంగా ఉన్నది.

ఏదయితే అదవుతుందని నారాయణ చూస్తూఊరుకోవటం లాభించింది. అమ్మ మళ్ళీ తన స్నేహితుల ప్రస్తావనే ఎత్తలేదు. వాళ్ళు వస్తూనే ఉన్నారు; పోతూనే ఉన్నారు. ఇక ఈ ప్రసక్తి రాదనే అనుకున్నాడు. కాని అకస్మాత్తుగా పొంచి ఉన్న శత్రువల్లే అది రానేవచ్చింది. "నువ్వు అడ్డమైన వాళ్ళనూ ఇంటికి చేర్చకుండా ఉండవుట్రా?" అన్నది అమ్మ మరోసారి, తలవని తలంపుగా.

"వాళ్ళను రావద్దని నువే చెప్పు" అన్నాడు నారాయణ. వాడి గుండెల్లో అగ్నిపర్వతం కుతకుత లాడుతున్నది; కాని మాట చాలా సౌమ్యంగా అన్నాడు. ఒక విధంగా వాడు తన తల్లిని బహిష్కరించటమే.

పార్వతి కొడుక్కేసి వింతగా చూసింది. వాడిమాటల్లో ఆమెకు ఏదో తిరుగుబాటు ధ్వనించింది. 'వాళ్ళను రావద్దని నువే చెప్పు - ఎట్లా చెబుతావో చూద్దాం.'

పార్వతి బుద్ధిగా ఆలోచించింది. నిజమే; స్నేహంగా ఇంటికి వచ్చేవాళ్ళను రావద్దని చెప్పడం కష్టమే. తనకోసం వచ్చే వాళ్ళందరూ తన కిష్టమైనవాళ్ళుకారు. అందుకని వాళ్ళను రావద్దని ఎట్లా చెబుతుంది? చిన్నపిల్లవాడు గనక వాడికి మాన మర్యాదలూ, పట్టింపులూ ఉండనవసరం లేదనుకోవడం తనదే పొరపాటు. వాడు పెరుగుతున్నాడు; అబిమానం నేర్చుకుంటున్నాడు; నేర్చుకోవలసిందే.

ఆమె మాటమార్చి కొంచెం కృత్రిమంగా నవ్వుతూ, "ఎప్పుడూవాళ్ళే నీకోసం వస్తారు; నువు వాళ్ళ ఇళ్ళకు పోవల్లేఉందే?" అన్నది.

"స్కూలునించి పావుగంట ఆలస్యంగావస్తే, ఇంతసేపేం చేస్తున్నావంటా వుగా?" అన్నాడు నారాయణ - ఇదికూడా తన జీవితానికి ఒక పీడ అనే భావిస్తూ వస్తున్నాడు. మిగిలిన పిల్లలకెవరికీ ఇటువంటి ఆంక్షలులేవు. తన స్నేహితులు చాలామంది రైలుకట్టకూ, కాలవకట్టకూ షికార్లుపోతారు. కాలవరో ఈతలు కొడ తారు, తనకు అట్లావెళ్ళే స్వేచ్ఛలేదని నారాయణకు మనసులో లేకపోలేదు. అది బయటపెట్టటానికి మంచి అవకాశం వచ్చింది.

"అవును. నువు గాడిద తిరుగుళ్ళు తిరగడానికి వీల్లేదు. నాతో ముందుగా చెప్పిపోతే నీ స్నేహితుల ఇళ్ళకు వెళ్ళొద్దంటానా?" అన్నది పార్వతి.

ఒక విధమైన రాజీ కుదిరింది. కుదిరిననాడే నారాయణ దీపాలు పెట్టిన అరగంటకు ఇంటికి వచ్చాడు.

"ఎక్కడికి వెళ్ళావురా?" అన్నది పార్వతి, పెద్ద ఘోరం జరిగినట్టు.

"చెరువుదగ్గిర కర్రాబిళ్ళ ఆట చూడబోయాను" అన్నాడు కొడుకు.

"చెరువుదగ్గిరా? చెరువులో పడిపోతే ఏం దిక్కు? కర్రాబిళ్ళా ఆటేమిటి? కన్నో కాలో పోతే?" అన్నది పార్వతి - రకరకాల విపత్తులు ఊహించుకొంటూ.

నారాయణ తల్లి కేసి వింతగా చూశాడు. ఆమె నవ్వులకు అంటున్నదేమో నని ఒక క్షణంపాటు అనుకున్నాడు; కాని నిజంగానే అంటున్నది.

'చెరువుచాయలకు పోరాదు క్రాబిళ్ళా ఆట చూడరాదు' అన్న రెండు ఆంక్షలు వాడి జీవితంలో కొత్తగా ప్రవేశించాయి. ఉన్న ఆంక్షలతోనే తన బతుకు అర్థంలేకుండా పోతున్నదని వాడు అనుకుంటున్నాడు. కొత్త ఆంక్షలు రావటంచేత పరిస్థితి బాగుపడుతున్నదేమీలేదు.

పార్వతికి ఒక విషయం తెలియలేదు. తను యదాలాపంగా పైకి అనుకునే ప్రతిమాటా తన కొడుక్కు కొంత కాలంపాటు శిలాక్షరంగా ఉంటుందని ఆమె ఊహించలేదు. నిజానికి ఆమె నోట వచ్చే మాటల్లో శిలాక్షరా లున్నాయి. ఏవి శిలాక్షరాలో, ఏవికావో తెలుసుకునేపాటి శక్తి ఆ అర్భకుడికి లేదు. తన కొడుకు చెరువు చాయలకు పోరాదనీ, క్రాబిళ్ళా ఆట చూడరాదనీ పార్వతి ఉద్దేశంకాదు; కాని అదే ఆమె ఉద్దేశమని కొడుకు అనుకున్నాడు. తల్లి మాటపాటించి, చెరువు చాయలకు పోకుండా ఉండాలో యీసారి అక్కడికి వెళ్ళి ఆటచూస్తే తల్లికి చెప్పకుండా ఉండాలో నారాయణ ఆ క్షణంలో నిర్ణయించుకోలేదు.

* * * *

సమస్య గొంతుమీద కూర్చుని, దానికి పరిష్కారం తెలియనప్పుడు మనిషి పడే బాధ ఇంతా అంతాకాదు. కొడుకును ఎట్లా అదుపు చెయ్యాలో పార్వతికి తెలియలేదు. నారాయణ స్కూలు నుంచి తిన్నగా ఇంటికి రావడం మానేశాడు. ఒక్కొరోజు వాడు ఇల్లుచేరేసరికి ఎనిమిది గంటలు కూడా అవుతున్నది. చీకటి పడిన దగ్గరనుంచి పార్వతిని రకరకాల భయాలు శూలాల్లాగా ఆవహించేవి. ఏ చెరువులోనో, ఏ రైలుకిందో పడ్డాడేమో! ఎవరన్నా ఎత్తుకుపోయారేమో? ఆ మధ్య ఎవడో ఒక ఉపాసకుడు ఎవరినో కుర్రాణ్ని అమ్మవారికి బలి యిచ్చాట్ట. అటువంటి రాక్షసులు కూడా ఉంటారు. ఎక్కడన్నా చెయ్యో కాలో విరుచుకుంటే ఎవరన్నా ఆస్పత్రికి చేర్చారేమో! (ఇటువంటి సంఘటన ఒకటి జరగటం పార్వతికి తెలుసు.) ఈ విధంగా పార్వతి భయంకరమైన ఆలోచనలు చేసేది. ఇట్లా ఆలోచించటం వల్ల ఆమెకు ఒకటే లాభం - దుర్వార్త ఏదైనా వినవలసి వస్తే అందుకు మనసు ముందే సంసిద్ధమై ఉంటుంది! ఆకస్మికంగా దుర్వార్త వినటం మనసుకు మరింత పెద్ద ఘాతం. పార్వతికింకో లాభం కూడా ఉన్నది; నారాయణ ఏ చెరువులోనో శవమై తేలకుండానూ, రైలుకిందపడి తుండాలు కాకుండానూ, విరిగిన చేతికీ, పగిలిన తలకూ, ఆస్పత్రికట్లు లేకుండానూ ఇంటికి గెంతుతూ తిరిగి వచ్చేసరికి భయం పరమానందంగా మారేది. దుర్వార్త భరించటం ఎంత కష్టమో, ఆనందం భరించడం కూడా అంతే కష్టం. అందుచేత తాను ముందు పొందిన భయానికంతకూ కసి తీర్చుకోటానికి ఆమె వాణ్ణి వీపు వాయగొట్టి, "ఇంతసేపు ఎక్కడున్నావురా వెధవా!" అని పళ్లు బిగించి అడిగేది.

"ఎక్కడున్నానూ? నాదగ్గిరే ఉన్నా!" అనేవాడు నారాయణ.

దీనికి అలవాటు పడుతుండగా, ఒకనాడు పార్వతి నెత్తిన పిడుగుపడ్డట్టయింది. నారాయణ జుట్టుచూస్తే తడిగా ఉన్నట్టు అనుమానం వేసింది; తాకిచూస్తే తడే. నారాయణ చెరువులో ఈత నేర్చుకుంటున్నాడు! ఎవడో పీయస్సార్ నేర్పుతున్నాట్ట! ఆ పీయస్సార్‌ను గొంతునులిపి ఆ చెరువులోనే పారేస్తేగాని పార్వతి కడుపుమంట చల్లారేట్టు కనబడలేదు.

"రేపటినుంచీ బడి వదలగానే ఇంటికి రాకపోయావో నా చేతిలో చచ్చావే?" అన్నది పార్వతి. తన మొగుడూ, మామగారూ ఎటువంటివాళ్ళో, తన కొడుకు శరీరంలో ఎలాంటి రక్తం ప్రవహిస్తూందో, దాన్ని అదుపులో ఉంచాలంటే తాను ఎంత పట్టుదల వహించాలో ఆమెకు తెలుసు.

నారాయణకి తల్లిని ధిక్కరించే ఉద్దేశంగాని, తల్లికి ఎదురుతిరిగే ఉద్దేశంగాని లేదు. వాడి మనోవైఖరిని పార్వతి ఎంత శ్రద్ధగా కనిపెడుతున్నదో అంతకు వెయ్యింతలుగా వాడు తల్లి ఆలోచనలను కనిపెడుతూనే ఉన్నాడు. ఆమె జానెడు ఇస్తేవాడు మూరెడు తీసుకుంటున్నాడు. ఆమె దౌర్బల్యమే ప్రస్తుతం వాడి బలం. ఆమె నిజమైన దార్ఢ్యం చూసినప్పుడు వాడామెమాట జవదాటటం లేదు. అందుచేత వాడు మర్నాటి నుంచీ బడినుంచి తిన్నగా ఇంటికి రాసాగాడు.

ఆ విధంగా వాడు, ఇంటివారమ్మాయి సత్యవతిచేసే సంగీత సాధనతో ఆకర్షించబడ్డాడు.

సత్యవతి సాయంకాలం పూట ఫిడేలుసాధన చేసేది. ఆ సమయంలో సంగీతం మేష్టరు వచ్చేవాడు. ఓ అరగంట గాత్రం పాట నేర్పేవాడు. తరువాత ఫిడేలు వాయించటం నేర్పేవాడు.

డాబానుంచి పాట వినబడగానే నారాయణ పరిగెత్తివెళ్ళాడు. పక్కవరండాలో చాపకు ఒక పక్క సంగీతం మేష్టరూ, ఇంకోపక్క సత్యవతీ ఎదురెదురుగా కూర్చుని వున్నారు. సత్యవతి ముందు ఫిడేలు పెట్టివున్నది. సత్యవతి బాసిపెట్టు వేసుక్కూర్చుని, ఎడమచేతిని మోకాలిమీద వెల్లికిలా పెట్టి, కుడిచేత్తో తొడమీద తాళంవేస్తూ, మేష్టరు చెప్పినది తాను మళ్ళీ అంటున్నది.

"శ్రీ యీా గణా పతీ - సే వింప రాయ్యా అరే"అని మేష్టరు పాడుతున్నాడు. సత్యవతి అట్లాగే అంటున్నది.

ఆ పిల్ల పాట ఆపకుండానే తల ఆడించి, నారాయణను కూర్చోమన్నది. నారాయణ నోరుతెరుచుకు వింటూ గోడవెంబడి జారి కూర్చున్నాడు.

మేష్టరుది బొంగురుగొంతు. సత్యవతిది అంతకన్న చాలానయం. అయినా మేష్టరు పాటలో వున్న ఏదో సత్యవతి పాటలో లేదు.

'మేష్టరుకు ధయిర్యం! ధయిర్యంగా పాడతాడు. సత్తెమ్మాయికి ఆ ధయిర్యం లేదు' అనుకున్నాడు నారాయణ.

వాడు బడి పంతుళ్ళ విషయంలో కూడా ఇదే నిర్ణయానికి వచ్చాడు. పిల్లలు చదివే పుస్తకమేగదా వాళ్ళూ చదువుతారు? కాని వాళ్ళకు తప్పులుపోవు. ఎందుచేత? పంతులైనవాడికి ధైర్యం ఉంటుంది. పిల్లలకంత ధైర్యం ఉండదు. క్లాసులోవున్న గుడ్డి వెధవలంతా కిరికిరి వెధవలే. ఎన్వీఆరున్నాడా? వాడికి పుస్తకాలంటే ఏమీ భయం లేదు. క్లాసులో ఇంకా చెప్పని లెక్కలన్నీ చేసేస్తాడు. ఇంగ్లీషు పుస్తకం ఈ చివరి నుంచి ఆ చివరకు ఎన్నిసార్లో చదివాడు.

ఒకసారి ఎన్వీఆరింటికెళ్ళాడు నారాయణ. వాడినాన్న వాడితో డికెన్సు[1] గురించి చెబుతున్నాడు. తరువాత ఎన్వీఆరును, "మీ నాన్న ఎవరిని గురించిరా చెబుతున్నాడు?" అని అడిగితే, డికెన్సు పుస్తకాలు రెండు తెచ్చి చూపించాడు.

"ఇవి నువ్వు చదవగలవా" అన్నాడు నారాయణ ఆశ్చర్యంగా.

"ఇప్పుడు చదవలేననుకో. ఇంకొన్నాళ్ళు పోయాకనైనా చదువక వదుల్తానా" అన్నాడు ఎన్వీఆర్. అదీ వాడి ధైర్యం. అందుకే ఇంగ్లీషులో వాడికెప్పుడూ ఫస్టు మార్కొస్తుంది—ధైర్యం.

సత్యవతికి ధైర్యం వుంటే అచ్చగా మేస్టరు పాడినట్టే పాడొచ్చు. ఇంకా బాగా కూడా పాడొచ్చు.

కొంతసేపు నోటిపాటయాక ఆ పాడినదే ఫిడేలుమీద సత్యవతి సాధనచేసింది. మేస్టరు వాయింపులో చాలా తప్పులు దిద్దాడు.

సత్యవతి వాయిస్తున్నంతసేపూ నారాయణ మనస్సులో పాడుకుంటూనే వున్నాడు. మేస్టరు లేవంగానే సత్యవతి విముక్తి పొందినదానల్లే అయిపోయింది. ఎంతో ఉత్సాహంగా ఫిడేలు పెట్టెలో పెట్టేసి పెట్టెమూసి దాని స్థానంలో పెట్టేసింది.

నారాయణ కిది ఆశ్చర్యంగా కనిపించింది. నేర్చుకున్నది తనకి బాగారాలేదు. బాగా వచ్చినదాకా వాయించగూడదూ? తనయితే ఫిడేలు అట్లా పెట్టేసేవాడా? కళలు అభ్యాసం చేసేవాళ్ళలో నూటికి తొంభైతొమ్మిదిమంది సత్యవతి లాటివాళ్ళే. వాళ్ళెన్నటికీ మొదటి తరగతిలోకిగాని, రెండో తరగతిలోకిగాని రారు. కాని నారాయణ, ఊడిన పళ్ళన్నీ సొంతం రాని వయసులోనే కళాకారులయ్యేవాళ్ళను తప్ప ఊహించలేక పోవటం విశేషం.

---

1. డికెన్స్ (1812-1870): చార్లెస్ డికెన్స్ విక్టోరియన్ రచయితల్లో ప్రముఖుడైన గొప్ప ఆంగ్ల నవలాకారుడు. ప్రపంచ ప్రఖ్యాతి పొందిన డికెన్స్ నవలలు: ఆలివర్ ట్విస్ట్ (1837-38): డేవిడ్ కాపర్‌ఫీల్డ్ (1849-50); ఎ టేల్ ఆఫ్ టు సిటీస్ (1859); గ్రేట్ ఎక్స్‌పెక్టేషన్స్ (1860-61).

మేస్టరు వెళ్ళాక నారాయణ సత్యవతిని, "అప్పుడే పెట్టేశావేం? ఇంకా సేపు వాయించకపోయావా?" అని అడిగాడు.

"ఇంకెంత సేపమ్మా - చేతులు పడిపోతున్నాయి. కొత్తపాట ప్రారంభించి నప్పుడు మరీ ఇబ్బందిగా ఉంటుంది....ఈ పాట ఏ రాగమో తెలుసా?" అన్నది సత్యవతి.

"నాకేం తెలుసూ? రాగాలంటే ఏమిటీ?" అన్నాడు నారాయణ అయోమ యంగా.

సత్యవతి తనకు తెలిసినంతా చెప్పింది. నారాయణ ఆసక్తిగా విన్నాడు. కాని సత్యవతి చెప్పినదాన్లో ముప్పాతిక భాగం వాడికేమీ అర్థం కాలేదు. వాడికి అర్థం కాకపోవటం సత్యవతికి ఉత్సాహాన్నిచ్చినట్టుంది.

"ఉండు చూపిస్తా" అంటూ ఆ పిల్ల ఫిడేలు బయటకి తీసి తనకు వచ్చిన రాగాలన్నీ ఆరోహణ అవరోహణలు వాయించి ఆ రాగాల పేర్లు చెప్పింది. నారా యణ నోరు తెరుచుకుని విన్నాడు. వాడు ఎంత శ్రద్ధగా విన్నాడంటే ఒక గంటసేపు వాడికి మిగతా ప్రపంచం ఏమీ తెలీదు.

చేతులు పడిపోతున్నాయన్న సత్యవతి దాదాపు గంటసేపు ఫిడేలుమీద ఉత్సా హంగా, ఏనాడో మరిచిపోయిన రాగాలన్నీ వాయించింది. ఆ పిల్ల రెండేళ్ళనుంచీ సంగీతం నేర్చుకుంటున్నదన్న మాటేగాని, ఆమె నేర్చుకునే సంగీతంలో ఎవరూ, ఎన్నడూ, ఎటువంటి ఆసక్తి చూపిన పాపాన పోలేదు. అటువంటి ఆసక్తి మొదటగా చూపినవాడు నారాయణే. నాలుగైదు నెలల క్రితం బెజవాడ వెళ్ళినప్పుడు, సత్యవతి మైలవరం కంపెనీ[1] వాళ్ళ సావిత్రి నాటకం చూసి, అందులో యముడు పాడే పాట పట్టుకుని, ఫిడేలు మీద వాయించటానికి ప్రయత్నించింది. "ఓసీ!" అన్నది వాళ్ళమ్మ. ఆవిడ తన మొగుణ్ణి పిలిచి తన కూతురి "యముడి పాట" వినమన్నది. ఆయన నిర్వికారంగా వినేసి, "ఎందుకిది? ఓ కృతా? తరంగమా?" అని వెళ్ళి తన పని చూసుకున్నాడు.

కాని అది మొదలు ఎవరన్నా ఇంటికొచ్చినప్పుడల్లా మాలక్ష్మమ్మ, "ఏదే,

1. మైలవరం కంపెనీ : మైలవరం జమీందారు శ్రీరాజా సూరానేని వెంకట పాపయ్యా రావు బహద్దూరు (20 శతాబ్ది పూర్వార్థం) పోషకత్వంలో 1913లో వెలసిన మైలవరం బాలభారతీ నాటక సమాజం. వేషధారణ, రంగాలంకరణ, ఫోకసింగ్ మొదలైన వ్యాపారసరళి పద్ధతులను 1918 ప్రాంతంలోనే ప్రవేశపెట్టిన సమాజం. యడవల్లి, ఉప్పులూరి సంజీవరావు నిడుముక్కల, అద్దంకి, పారుపల్లి, జొన్నవిత్తుల శేషగిరిరావు, దైతా గోపాలం మొదలయిన సుప్రసిద్ధ నటులు నెలజీతాలమీద పనిచేసే నటులుగా వుండేవారు.

అమ్మాయ్? ఆ యముడిపాట ఒకసారి వాయించూ? జ్ఞాపకం ఉందా?" అని కూతురి చేత ఎగ్జిబిషను పెట్టించేది.

పార్వతి అన్నానికి రమ్మని పిలిచినదాకా నారాయణ సంగీత గోష్ఠిలోనే ఉన్నాడు. అన్నం తిని "శ్రీగణపతిని సేవించరారే" అన్న కృతి పల్లవీ, అను పల్లవి చాలాసార్లు చిన్న గొంతులో పాడుకుంటూ నిద్రపోయాడు. నిద్రలోకూడా ఆ పాటే వాడి మనసునిండా సంచారం చేస్తున్నది. ముఖ్యంగా "రారే" దగ్గిర మెలిక తెగ ప్రతిధ్వనించింది వాడి బుర్రలో.

తరవాత, సత్యవతి సంగీతం నేర్చుకునేటప్పుడు దగ్గిర కూర్చోవటం నారాయణకు నిత్యకృత్య మయింది.

పదిరోజులు గడిచాక సత్యవతి వాయింపులో ఏదో అభివృద్ధి ఉన్నట్టు సంగీతం మేస్టరే కనిపెట్టి, "మధ్యకాస్త శ్రద్ధగా సాధన చేస్తున్నట్టున్నావే?" అన్నాడు.

నిజానికి సత్యవతి చేస్తున్న ప్రత్యేకసాధన ఏమీలేదు. నారాయణను శిష్యుణ్ణి చేసుకుని తానే ఒక గురువై, నారాయణ పరిభాషలో "ధైర్యం" సంపాదించుకుంటున్నది.

నారాయణ తనకు తెలీకుండా సంగీతంలో ప్రవేశం సంపాదిస్తున్నాడు.

ఆ రోజుల్లో ఊళ్ళోకి కూచిపూడి భాగవతులువచ్చి[1] ప్రదర్శనలు ఇవ్వ సాగారు. ఊళ్ళో ఉండే పెద్దకోమట్లు ఒకరి తరువాత ఒకరు ఆటలు ఏర్పాటు చేస్తున్నారు.

ఒకరోజు ఆటకు శ్రీయుతులవారంతా వెళుతుంటే పార్వతి వాళ్ళ వెంట తన కొడుకుతోసహా వెళ్ళింది. నారాయణ వీధిభాగవతం చూడటం అదే మొదలు. మొదట గొల్లభామ వేషం వచ్చింది. గొల్లభామకు ముద్దమాట. హాస్యగాడికీ గొల్లభామకూ జరిగిన సంభాషణ నారాయణకు కూడా బాగానే ఉన్నది. గొల్లభామ "అయ్యవారూ" అనటం బాగున్నది. "అయ్యవారూ, మేము గొల్లవారం" అని గొల్లభామ అంటే హాస్యగాడు - ఆదివారంనుంచీ శనివారందాకా వారాలన్నీ చెప్పి, "ఈ గొల్లవారం ఎన్నడూ వినలేదే" అనటం కూడా బాగుంది.

తరవాత తెరమీదిగా జడ వేసి భామవేషం వచ్చినప్పుడు నారాయణకు నిద్ర

---

1. కూచిపూడి భాగవతులు : కృష్ణాజిల్లా కూచిపూడికి చెంది వంశపారం పర్యంగా కళా ప్రదర్శనలు నిర్వహించే కళాకారుల బృందాలు. మౌలికంగా వీధిభాగవతులు, భారత, భాగవత, రామాయణాదుల నుండి కథల్ని తీసుకొని యక్షగాన రూపంలో భరతనాట్య శాస్త్ర సంప్రదాయాల్ని మేళవించే కళ వీళ్ళది. వీళ్ళ ప్రఖ్యాత ప్రదర్శనలు భామాకలాపం, గొల్లకలాపం.

వచ్చింది. తెరతీసేసి భామవేషం కనపడగానే కొంచెం నిద్రమత్తు వదిలింది. భామ వేషం వేసినాయన చాలా ముసలిగా ఉన్నాడు. పళ్ళు ఊడాయో, ఊడుతున్నాయో, ఏదో ఉంది.

"భామవేషానికి అలంకరణ అంతా కృష్ణ వేషం వేసినాయన చెయ్యాలిట" అన్నది మాలక్ష్మమ్మ పార్వతితో.

భామవేషాన్ని చూస్తున్న నారాయణకు, "ఈ మనిషికి ధైర్యం ఉన్నదీ. లేకపోతే అంత ముసలితనంలో అట్లా చెయ్యలేడు" అనిపించింది. ఆ తరవాత మళ్ళీ నారాయణకు నిద్ర ముంచుకొచ్చింది. ఈసారి వాడు తల్లికి చేరగిలబడి నోరు తెరుచుకుని నిద్రపోయాడు. సత్యవతి వాణ్ణి పొడిచి, "నిద్రపోతున్నావు!" అన్నది. నారాయణ పలకలేదు.

అట్లా నిద్రపోతున్నవాడికి కాస్తా మధ్యలో ఎవరో లేపినట్టయింది. అందరూ కలిసి దశావతారాల పాట[1] పాడుతున్నారు.

"మత్స్యరమున మరి అంబుధిలో...."

నారాయణకు నిద్రమత్తు క్షణంలో వదిలింది. అదేదో దేవలోకంలో గానంలాగున్నది. అటువంటి బృందగానం అంతగా మనస్సును ఊపేది వాడెన్నడూ వినలేదు.

ఆ తరువాత కొంతసేపటికి భామవేషం "బాలగోపాల" తరంగం[2] ప్రారంభించింది. ముసలివాళ్ళను కొంచెం విసుగెత్తించినా, చిన్నపిల్లల చెవులకు అమృతంలాగా ఉండి, సమ్మోహనాస్త్రంలాగా పనిచేసేది, మోహనరాగం. తరంగాలలోకి రాజులాటిపాట. నారాయణ ఆ తరంగంలో కరిగిపోతున్నట్టయ్యాడు.

* * *

కూచిపూడి భాగవతం గురించి మర్నాడల్లా చెప్పిందే మళ్ళా మళ్ళా చెప్పుకున్నారు. భామవేషం వేసుకున్న కీలుజడ బంగారందిట. తెరమీద జడవెయ్యటం ఊరిమీద సవాలుట. భరతశాస్త్రంలో భామవేషం వేసినాయన్ని మించేవాడెవడన్నా ఉంటే ఆ జడ కత్తిరించవచ్చుట. అట్లా కొన్ని సంవత్సరాలక్రితం ఒకాయన జడ కత్తిరించి, భామవేషం వేసినాయన్ని చిత్తుగా ఓడించి పంపేశాట్ట.

మర్నాడు సాయంకాలం అమ్మలక్కలు కొందరు చేరి చాలా కబుర్లు చెప్పుకున్నారు.

"కూచిపూడి భాగోతులు తలా ఒకయింటా భిక్ష చేస్తున్నారు. మా యింటి క్కూడా ఒకరిద్దర్ని ఒకపూట ఆహ్వానింతా మనుకుంటున్నాం" అన్నది ఒక అమ్మ.

1. దశావతారాల పాట : కూచిపూడి భాగవతుల ఒక ప్రదర్శన.
2. బాలగోపాల తరంగం : కూచిపూడి భాగవతులు ప్రదర్శించే, నారాయణ తీర్థుల బాలగోపాల తరంగాలు.

"మా యింటికూడా పిలుద్దునుగాని మా వారి కిటువంటివి గిట్టవు" అన్నదొక అక్క.

"ఆ హాస్యగాడు లేడూ? వాళ్ళది మా అత్తారూరే. అదే వీధి కూడానూ. ఆయన్ను కలుసుకుని ఆ మాట చెప్పాలి. ఓపూట భోజనానికి పిలిచినా పిలవొచ్చు" అన్నది ఇంకో అమ్మక్క.

"ఆయన సుంకరకొండాయివేషం[1] చూచితీరాలిట" అన్నది మరోఆవిడ.

"ఇవాళ గుడిదగ్గర మళ్ళీ ఆట ఉన్నదిట."

ఈ మాట వినగానే నారాయణకు ఎక్కడలేని ఉత్సాహమూ వచ్చింది. మళ్ళీ "బాలగోపాల" వినొచ్చు! ప్రపంచంలో అటువంటి పాట ఇంకోటిలేదు.

తనమాదిరిగానే వాళ్ళంతా కూడా "బాలగోపాల" తరంగం వినటానికి తహ తహ లాడుతున్నట్టు వాడు ఊహించుకున్నాడు. కాని ఒకావిడ, "నిన్ననే కాదుటర్రా చూశాం? ఇంకా చాలా ఆట లాడతారు" అనేసరికి వాడికి ఒళ్ళు మండుకొచ్చింది. 'మంచిపాట విని ఆనందించలేని మొద్దు' అని వా డావిణ్ణి మనసులో తిట్టు కున్నాడు.

"ఇవాళ 'దాదిని మంచం'[2] ఉంటుందన్నారర్రా!" అన్నది ఒకావిడ.

"సుంకర కొండడు కూడా ఉండొచ్చు" అన్నది మరోఆవిడ.

ఎవరూ ఎటూ తేల్చేలోపల సంగీతంమాష్టరొచ్చాడు. ఆడాళ్ళ మీటింగు ఆయిపోయింది.

సంగీతమాష్టారు పాఠం చెప్పి వెళ్ళిపోయాక నారాయణ సత్యవతిని, "బాలగోపాల వాయించగలవూ? నిన్నరాత్రి విన్నామే అది" అని అడిగాడు.

సత్యవతి ప్రయత్నించింది. అంత బాగా రాలేదు. అక్కడక్కడా నారా యణ అందించాడు.

"నాకన్న నువే బాగాపట్టుకున్నావే!" అన్నది సత్యవతి. నారాయణకు కొంచెం సిగ్గేసింది.

---

1. సుంకర కొండాయి వేషం : వీధి భాగవతంలోని ఒక పాత్ర. ఈ భాగ వతంలోని మిగతా పాత్రలు శ్రీకృష్ణుడు, సత్యభామ, గొల్లభామ.
2. దాదిని మంచం : కూచిపూడి భాగవతుల ఒక ప్రదర్శన. లీలావతీ విజయ గాధ అనే వీధిభాగవతంలోని ఏకపాత్రాభినయంవంటి దాదినమ్మ—లీలావతి పాత్రధారి – పందిరి పెట్టె మంచంలో పడుకొన్నట్లే భ్రాంతి కల్గిస్తూ మంచంతోసహా చేసే నృత్యం (వివరాలకు చూచండి : మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి. 'ఆంధ్ర నాటకరంగ చరిత్ర', 1969, పుటలు 152–155).

"అంతకు ముందింకేదో పాడాడబ్బా! అదికూడా బాగుంది. రైలు పరుగెత్తి నట్టు నడుస్తుంది" అన్నాడు నారాయణ.

"దశావతారాల పాటేనా?" అన్నది సత్యవతి.

నారాయణకు జ్ఞాపకం వచ్చింది. అందరూ కలసి 'మత్స్యావతారా?' అని గట్టిగా అరిచారు.

"అవునవును ; అదే, అదే" అన్నాడు వాడు.

"అదీ ఇదే రాగం, మోహన" అంటూ సత్యవతి మొదలు కొంచెం వాయించింది. నారాయణ ఆనందానికి మేరలేదు.

ఆ రాత్రి నారాయణ అన్నంతింటూ, "ఇవాళ కూడా ఆటచూద్దాం, ఏం?" అన్నాడు తల్లితో.

"పని లేకపోతేసరి, ఇదేం వేలంవెర్రా? నిన్ననేగా చూశాం" అన్నది పార్వతి. ఆమె సుంకర కొండాయి పార్ట్సువినాలని తహతహలాడుతూనే ఉన్నది. కాని పెద్దవాళ్ళు తమ తహతహలను పిల్లలకు తెలియనివ్వరాదు. అందువల్ల పిల్లలకు పెద్దవాళ్ళంటే మహా అలుసై పోతుంది.

నారాయణ తల అడ్డంగాతిప్పుతూ, "పోవలసిందే, పోవలసిందే!" అన్నాడు.

పార్వతికి నవ్వాగలేదు. పోవలసిందేననటానికి వెధవ తల అడ్డంగా తిప్పుతాడేం? ఆమె ఫక్కున నవ్వేసింది. నారాయణ మొహం విప్పారింది. ఆ నవ్వు అర్థం అమ్మ ఒప్పుకున్నట్టే - వాడు తల అడ్డంగా తిప్పటానికి అర్థం 'పోకుండా ఉండటానికి వీల్లేదు' అయినట్టు. ఈ పరిభాషల అర్థాలను తృణీకరించేది రాతి గుండెలు కలవాళ్ళు మాత్రమే. పార్వతిది రాతిగుండెకాదు. అందుచేత మాలక్ష్మమ్మగారికి పుల్లేపుపెట్టి వాళ్ళనుకూడా ఆటకు బయలుదేరతీసింది.

ఆనాడు నారాయణకు పూర్తి ఆశాభంగం. వాడు గొల్లభామా కలాపం దగ్గిరే నిద్రపోయాడు. సుంకరకొండాయిని చూడలేదు. ఆట అయేదాకా వాడు లేవనేలేదు. తల్లి వాణ్ణి లేపుకుని ఇంటికి వస్తూ "ఈ నిద్ర ఇంటిదగ్గిరేపోతే సరిపోయేదిగదరా!" అన్నది.

నారాయణ నిద్రమత్తుగా, "ఆ పాటలు పాడారా?" అన్నాడు. ఎవరూ జవాబు చెప్పలేదు.

ఇది జరిగాక పది రోజులకు శ్రీయుతులవారు భామవేషం వేసినాయన్నూ, గొల్లభామ వేసినాయన్నూ ఒకపూట "దేవతార్చన"కు పిలిచారు. గొల్లభామ వేసే అతనికింకా పెళ్ళికాలేదుట. సత్యవతిని ఇచ్చి చేస్తారా అని భామవేషం ఆయన శ్లాఘ్యంగా అడిగిచూశాడు.

మాలక్ష్మమ్మగారు బిగుసుకుపోయి బింకంగా "మా పిల్లకు సంబంధం కుదిరిందిలెండి !" అన్నది. ఆయన మరి ఆ ప్రస్తావన ఎత్తలేదు. ఆవిడ తన

ఆగ్రహమంతా తన యింటికివచ్చే అమ్మలక్కలదగ్గిర వెళ్ళబోసుకున్నది.

"వాళ్ళంతేనమ్మా. నిరుడే మయిందనుకున్నావ్ ! రథసప్తమి రోజుల్లో వీళ్ళు మా ఆడబిడ్డగారి ఊళ్ళో ఆటలాడారు. ఈ భామవేషం వేసినాయన శ్రీమన్నారాయణ పెళ్ళాందగ్గిర కాసులపేరు అరువు తీసుకున్నాడు. భామవేషం వేసి వేసికొనటానికని. పోనీగదా అని ఆ యిల్లాలు యిచ్చింది. ఆ కాసులపేరు మెళ్ళోవేసుకుని ఈయనగారు రథోత్సవానికి వెళ్ళాట్ట. ఆ తొక్కిడిలో కాసుల పేరు కాస్తా పారేసుకున్నాడు. పారేసుకున్నానన్నాడు. ఆరుసవర్ల కాసులపేరు! ఎట్లా? ఊళ్ళో డబ్బుగలవాళ్ళు నలుగురు చందాలువేసి ఆయనకు సమర్పించు కున్నారు. ఆ తరవాత పోయిన కాసులపేరు ఎవరికో దొరికిందట. వాళ్ళు తెచ్చి యిచ్చారుట? 'ఇదిగో తల్లీ ! నీ కాసులపేరు' అని ఆయన శ్రీమన్నారాయణ భార్యకు దాన్ని తిరిగియిచ్చాడు. నలుగురూ చందాలు వేసుకుని యిచ్చిన డబ్బు తిరిగి ఎట్లా?.... అట్లా అయింది" అన్నదొకావిడ.

"ఏమో నిజంగానే పోయి దొరికిందేమో! లేనిపోని నిందలు వేస్తే కళ్ళు పోతాయి." అన్నదింకో ఆవిడ.

అభిప్రాయభేదం వచ్చేటప్పటికి సంభాషణలో సారస్యం ఇగిరిపోయింది.

"ఈ కూచిపూడివాళ్ళ సంగతైతే నాకు తెలీదుగాని, నాటకాలవాళ్ళను మాత్రం నమ్మరాదర్రా ! మా పెద్దనాన్న కొడుకొకడున్నాడు. ఎవరో వేషాలేసే ఆయన మీది మోజుతో ఎకరాల కెకరాలమ్మి ఆయన కింద తగలేస్తున్నాడు. అటువంటి నటుడు మరి పుట్టట్ట ! గొప్ప నటుడేనేమో ! నేను చూశానా, పెట్టానా? వీధిభాగోతాలు చూస్తే ఇంతపుణ్యమూ, పురుషార్థమూనూ. నాటకాలెవరు చూస్తారు? దిక్కుమాలిన నాటకాలు! గొప్పనటులైనంత మాత్రాన ఇంతమోజేమిటి ? ఎక్కడో బొంబాయిలో పార్సీ నాటకా లాడతారుట. కలకత్తాలో ఇంకేవో నాటకాలుట. ఆ నటుణ్ణి వెంటేసుకుని మా అన్నయ్య తన సొంతఖర్చుతో ఇల్లు పట్టకుండా కలకత్తాకూ, బొంబాయికీ తిరగనా? ఎక్కడన్నా కద్దా? ఆ ఖర్చు పెట్టించే మనిషికి సిగ్గయినా ఉండొద్దా? ఎందుకుంటుంది? ఎగ్గూ, సిగ్గూ విడిచేసిన బాపతు!" అన్నది మరో ఆవిడ.

నాటకాలను తీసిపారెయ్యటం మాలక్ష్మమ్మ కిష్టంలేదు. ఆవిడ బెజవాడలో చాలా నాటకాలు చూసింది.

"నాటకాల అందం నాటకాల కున్నది. ఆ వేషాలెంత బాగుంటాయి. రాజు వేషం అంటే అచ్చు రాజుకిమల్లేనే ఉంటాడు. ఆ సంజీవరావుట — ఆడవేషం వేస్తాడు. అచ్చు ఆడదేనంటే ! ఆ గొంతూ మాటా - మనం మొగాడని చెప్పినా నమ్మలేం. పాట లెంతబాగుంటాయి ! సావిత్రి నాటకంలో యమధర్మరాజు ఎంత బాగుంటాడు! ఏదే, అమ్మాయ్? ఆ యముడిపాట జ్ఞాపకం వుందా, మరచి పోయావా?"

పార్వతికి ఊళ్ళో ఇద్దరు పినతల్లులున్నారు. ఆమె వాళ్ళతో అట్టే కలిసి మెలిసి ఉండేదికాదు. కారణం, మొగుడిమీద వ్యాజ్యం వేసిందనీ; మొగుణ్ణి వదిలేసిందనీ వాళ్ళు తనను అడ్డమైన వాళ్ళదగ్గిరా విమర్శించినట్టు ఆమెకు తెలిసి వచ్చింది. "మా అక్క కూతురని చెప్పుకోటానిక్కూడా నామర్దాగా ఉంది." అని ఒకావిడ అన్నదిట. "ఆస్తీ, పెత్తనమూ మనిషిని ఎంతకైనా తెస్తాయి." అని ఇంకో ఆవిడ అన్నదిట. పార్వతి జరిగినదానికి కొంచెం కూడా పశ్చాత్తాప పడదలచ నప్పుడు వాళ్ళ అభిప్రాయాలను ఎట్లా శిరసావహిస్తుందీ ?

నిజమే, పార్వతికి ఆస్తీ, యాజమాన్యమూ తృప్తికరంగానే ఉన్నాయి. ఇప్పుడు తన జీవితం తన చెప్పుచేతలలో ఉన్నది. తన పినతల్లులు తమ మొగుళ్ళను తమ చెప్పుచేతలలో ఉంచుకుని తృప్తి పడుతున్నారు. వాళ్ళు కూడా ఆస్తీ, హక్కూ ఉంటే వద్దంటారా? అవి లేనందువల్లే వాళ్ళు ఎంత బాధ్యత లేకుండా ఉంటున్నారు. వాళ్ళ పిల్లలకు చదువులూ, చట్టుబండలూ లేవు. ఒకావిడ కొడుకు బడికిపోతాడు గాని ప్రతిక్లాసూ మూడేళ్ళు తప్పుతాడు. ఇంకోఆవిడ కొడుకు బడికే పోడు. తన కొడుకును అట్లా బాధ్యతలేకుండా తను వదిలెయ్యగలదా ?

పార్వతి తనకు ఇటూ అటూ ఉన్న బంధువు లందర్నీ తిరగేసి చూసుకున్నది. తన వెంకటేశ్వర్లన్నయ్య తప్పిస్తే ఒక్కడూ పెద్దచదువు చదివినవాడు లేడు; ఒక్కడూ తన బతుకుతెరు వేమిటని ముందుగా ఆలోచించుకున్న పాపాన పోలేదు. తన మిగతా అన్నలు కూడానూ. వాళ్ళిప్పుడేదో వ్యాపారం చేసుకుని నాలుగు డబ్బులు సంపాదిస్తున్నారుగాని, చదువుసంధ్యలు అంతంత మాత్రమే. అవి ఉద్యోగాలకు పనికివచ్చేవి కావు. ఆస్తిపాస్తు లెంతకాలం నిలుస్తాయి? రెండు తరాలవాళ్ళు పంచుకుంటే ఎంత మాన్యమైనా తరిగిపోతుంది. ఈ కుటుంబాలలో ప్రతిఒక్కడూ చదువుకోవాలి. ఉద్యోగాలమీద ఆధారపడాలి. లేకపోతే అడుగంటిపోతారు. ఇదే పార్వతి జీవితంనుంచి నేర్చుకున్న పాఠం.

తనకు మనోబలమూ ధైర్యమూ ఇచ్చే నమ్మకాలన్నీ సరిఅయినవనీ, తనను అయోమయంలోపెట్టి, భయపెట్టేవన్నీ తప్పుడు నమ్మకాలనీ పార్వతి గట్టిగా నమ్మింది. "మనచేతిలో ఏమీలేదు! అంతా ఈశ్వర లీలావిలాసం! మనం నిమిత్త మాత్రులం!" అన్న వేదాంతం వింటే ఆమెకు కంపరం ఎత్తుకొచ్చేది. ఆ మాటలనే వాళ్ళు ఏ ప్రయత్నంగాని ఎట్లా చేస్తారో పార్వతికి అర్థమయేది కాదు. ఆ మాటలనే వాళ్ళకే ఆ నమ్మకం లేదని ఆమె తేల్చుకున్నది.

అయితే ఆమె విశ్వాసాలకు గొడ్డలిపెట్టులాటి సంఘటనలు కొన్ని జరిగాయి. ఒక నెల తేడాతో పినతల్లుల భర్తలూ పోయారు. ఒకాయన కాలూ, చెయ్యీ పడిపోయినవాడు. రెండో ఆయన పిడిరాయిలాగా తిరుగుతున్నవాడు. ఈ రెండు చావులూ మరిచేలోపల దక్షిణామూర్తి అన్నయ్య భార్య వర్ధనమ్మ కాస్తా పోయింది.

ఒక చెట్టుచుట్టూరా మూడు పిడుగులు పడటం అస్వాభావికం-కాని అసంభవం కాదు. రెంటికీ తేడా తెలియని పార్వతి, 'నేనొకణ్ణి ఉన్నాను' అని దేవుడు తనకు జ్ఞాపకం చేస్తాడనుకుంది. ఆమె మనస్సు వికలమై ఏవేవో వెర్రి అనుమానాలన్నీ తలఎత్తాయి. తనని తూలనాడినందుకే తన పినతల్లులను దేవుడు శిక్షించాడా? ఛీ ఛీ! నా గొప్పే చూసుకుంటున్నాను. వర్ధనమ్మోదిన ఎందుకు పోయింది? ఇవన్నీ నాకు మాత్రం శిక్షలుకావా? పిడిరాయివంటివాడు ఫెళ్ళున చస్తే ఎవరికే క్షణాన ఏం రాసిపెట్టుందో ఎట్లా చెప్పడం? నేను కాస్త అణగిమణగి ఉండటం నేర్చుకోవాలి!' అనుకున్నది పార్వతి.

ఆమె కింతకు పూర్వం చావుకూడా ఒక జీవితసత్యమేనన్న ఆలోచన అంతగా కలిగేదికాదు. కాని ఇప్పుడది కావాలన్నా మరుపురాకుండా ఉన్నది. తాను పోతే తన కొడుకు గతి ఏం కాను? వాడేపోతే తను ఎట్లా బతికివుంటుంది.

తన వల్ల కలిగిన మహాపరాధం ఏమిటో తెలియకుండానే పార్వతి పశ్చాత్తాపంతో దహించుకుపోయింది. పినతల్లుల ఇళ్ళకు వెళ్ళి, వాళ్ళతోపాటు ఏడ్చి, వాళ్ళ దుఃఖం పంచుకుని, వాళ్ళను ఓదార్చి, వాళ్ళ దుఃఖం కృత్రిమంగా ఉన్నదన్న అనుమానం వచ్చినప్పుడు తన మనస్సులోనే చెంపలు వేసుకుని, సాధ్యమైనంత ఆదర్శప్రాయంగా ప్రవర్తించటానికి ప్రయత్నించిం దామె.

భర్తలు పోవటంతో ఇద్దరు పినతల్లుల కాపరాలూ కొలిక్కి వచ్చాయి. వాళ్ళకు భర్తల సంపాదనలు తప్ప వేరే చెప్పుకోదగిన ఆధార మేమీ ఉన్నట్టులేదు. ఏమీ వెనక వేసుకున్నట్టులేదు- నగలతాలూకు బంగారం తప్పిస్తే.

అవ్యాజంగా వచ్చిపడిన పశ్చాత్తాపంలో పార్వతి పినతల్లుల కిద్దరికి ధన సహాయం చేసి "దేవుడా, గుర్తుంచుకో నన్ను. ఆడిపోసిన వాళ్ళను నేను నా శక్తి కొద్దీ ఆదుకుంటున్నాను" అని మనసులో అనుకున్నది.

మృత్యుశక్తిని జీవశక్తి జయిస్తుంది. పిడుగుపడి, చీకి మాడి, చచ్చినట్టు అయిపోయిన చెట్టు మళ్ళీ చిగుర్చుతుంది. పార్వతి గుండెలకు ఆవేశించిన అదురూ, చావు భయమూ కాస్త వెనకపడగానే ఆమె మనస్సులో చప్పున ఒక ఆలోచన మెరిసింది. సత్యవతిని దక్షిణామూర్తి అన్నయ్య చేసుకుంటే బాగానే ఉంటుంది-కాదూ?

అంతలోనే ఆమెకు గొల్లభామ వేషగాడి సంగతి జ్ఞాపకం వచ్చి, ఆ మాట పైకి రాకుండా తొక్కేసింది. తను నోరు చేసుకుని ఎందుకడగాలి? తన అన్న భార్య పోయినట్టు యింటివాళ్ళకు తెలుసు. అతనికి పిల్లాపిచూ లేనిసంగతి కూడా వాళ్ళెరుగుదురు. నిజానికి సత్యవతి కింతవరదాకా ఏ సంబంధమూ కుదరలేదు. పిల్లకు పదకొండోఏడు కూడా ప్రవేశించింది. వాళ్ళకు మటుకు తొందర ఉండదూ? మధ్య తనమాట ఖాళీకావటం దేనికి?

ఆలోచించినకొద్దీ, తాను నోరుమూసుకోవటమే మంచిదనటానికి మరికొన్ని కారణాలుకూడా కనపడ్డాయి పార్వతికి. శివరావుగారు తన అన్న సంబంధంకన్న మంచివే తోసిపారేసినట్టున్నది....వెదురుబద్దలాగా వుండే సత్యవతి తన అన్నకు నచ్చుతుందని ఏమిటి? ఏ విధముగా చూసినా తాను ఈ విషయం ప్రస్తావించక ఊరుకోవటమే బుద్ధికి లక్షణంగా కనిపించింది పార్వతికి.

ఈ దెబ్బలు తగిలిన రోజుల్లోనే పార్వతికి భర్త అనేవాడు దగ్గిరలేని లోటు బాగా అనిపించింది. ఏదన్నా మనసులోనిమాట చెప్పుకుందామన్నా తన కెవరు న్నారు? కొడుకు తప్ప. పార్వతి వాడితోనే చెప్పుకునేది—వాడికి తన మనస్సు అర్థ మవుతుందో, కాదో అని కూడా విచారించకుండా, నారాయణ తల్లిచేసే ఏకపక్ష సంభాషణలను నోరు తెరుచుకుని ఆలకించేవాడు. ఆమె మాటలలో అంతరార్థం వాడికి అర్థం కావటానికి ఒక్కొక్క సందర్భంలో పది పన్నెండేళ్ళు కూడా పట్టింది. కాని వాడా మాటలను మరిచిపోలేదు.

కాంతయ్యను గురించి వార్తలు తెలుస్తూనే ఉన్నాయి. అతనింకా ఆస్తి తగ లేస్తూనే ఉన్నాడు. తగలెయ్యటాని కింకా అతనికి ఆస్తి ఉన్నది. అదంతా పూర్తిగా క్షవరమైతే అప్పుడతను తన దగ్గిరికి వస్తాడన్న నమ్మకం ఒకటి అస్పష్టంగా ఆమె మనసులో లేకపోలేదు.

ఏటా వచ్చే ఫలసాయాన్ని 'మామయ్యగారు' ఏదో రూపంలో పార్వతికి చేర్చుతున్నాడు. మొత్తమంతా రొక్కంరూపంలో పార్వతి తీసుకోవటం లేదు. కొంత డబ్బు వడ్డీలమీద తిరుగుతున్నది. పార్వతిదగ్గర పత్రాలున్నాయి. ఒక వెయ్యి పార్వతి అన్నలు తమ వ్యాపారం నిమిత్తం అప్పుదీసుకుని, జాయింటుగా ప్రోనోటు రాసి ఇచ్చారు. పార్వతి పినతల్లుల భర్తలు పోయిన సందర్భంలో నాలుగువందల దాకా ఖర్చుచేసింది.

ప్రతి వేసవికీ సోమన్న ఒక యాభై మామిడిపళ్ళూ, పదిహేను రూపాయల రొక్కమూ పార్వతికి తెచ్చి ఇస్తాడు. పళ్ళు సగం తన కుంచుకుని మిగిలినవి పందారం చేసేది. కొద్దిగా ఇంటివాళ్ళకిచ్చేది. కొద్దిగా తన పినతల్లులకిచ్చేది. ఎక్కువగా తన అన్నల కిచ్చేది.

* * * *

ఆ వైశాఖమాసంలో సత్యవతికి పెళ్ళిచేశారు. కలిసిన సంబంధం కాదు. సత్యవతి అన్న కృష్ణారావు శలవులకు ఇంట్లోనే ఉన్నాడు. అతనంటే నారాయణకు ఈ సారి చాలా అసహ్యం ఏర్పడింది. ఆ కృష్ణారావు అమ్మకేసి చూసేచూపులు వాడికి ఏమి నచ్చలేదు. ఎవడో ముక్కూ మొహమూ తెలీనివాడు వచ్చి సత్యవతి మొగుడు కావటం కూడా వాడి బుద్ధికి అక్రమంగానే తోచింది.

కాని పెళ్ళిసందడి వాడికి చాలా బాగున్నది. ఎక్కడా ఆకాశం కనబడ కుండా ఆవరణ అంతటా పందిళ్ళు వేసేశారు. నారాయణ కళ్ళకూ, ముక్కులకూ,

చెవులకూ అంతులేనిపని. ఊదువత్తుల వాసనా, గంధం వాసనా కూడా వాడికి కొత్తే. పూలవాసన బొత్తిగా కొత్తకాదుగాని, దవనం మరువం వాసనలు కొత్తే. అన్ని కొత్త చీరెలను - అందులోనూ సిల్కు చీరెలను— ఒక్కచోట వాడెన్నడూ చూడలేదు.

పెళ్ళివారు రావటమూ, ఎదురుకోలూ, స్నాతకమూ, పెళ్ళికొడుకు పాంకోళ్ళూ, గొడుగూ వేసుకుని కాశీకి పోతానని బయలుదేరటమూ, కృష్ణారావు వచ్చి, "మా చెల్లెల్నిచ్చి పెళ్ళి చేస్తాం. కాశీకి వెళ్ళొద్దు" అనటమూ గమ్మత్తుగా ఉన్నాయి నారాయణకు. ఏమనాలో కృష్ణారావుకు తెలీలేదు. పురోహితుడు ఒక్కొక్కమాటే చెబుతుంటే అతను అన్నాడు. కృష్ణారావు చదువుకున్నాడు— దేనికి?

అయిదు రోజుల పెళ్ళితంతూ నారాయణ కళ్ళారా చూశాడు. పెళ్ళిపీటల మీద పెళ్ళికొడుకూ, పెళ్ళికూతురూ తలంబ్రాలు పోసుకోవటం వాడికి అసహ్యం అనిపించింది. మంత్రాలు చదివేటప్పుడూ, ముఖ్యంగా తాళి కట్టేటప్పుడూ సన్నాయి వాళ్ళు గట్టిగా వాయించటం వింటే వాడికి భయం వేసింది.

పెళ్ళితంతు లేనప్పుడు పెళ్ళి ఇంట్లో అందరూ హడావుడిగా తిరిగేవాళ్ళు. అటువంటి సమయాల్లో నారాయణ గాడిపొయ్యి దగ్గిరికి వెళ్ళేవాడు. గాడిపొయ్యిలో కట్టెలు మండటం ఎంతసేపు చూసినా ఆశ్చర్యంగా ఉంటుంది. అన్నం గుండిగకు గోతం వాసెనకట్టి వార్చటం అసహ్యం. ఒకమూల ఇద్దరు కూర్చుని లడ్డూలు చుట్టుతున్నారు, మాటా పలుకూ లేకుండా. వాళ్ళకు తినాలనిపించదుగామో అనుకున్నాడు నారాయణ.

పెళ్ళిలో పేచీలు లేకపోలేదు ఒకపూట పెళ్ళివారు విడిదికి పంపిన ఫలహారాలు తిప్పిపంపారుట. వాళ్ళు "అలిగారు." అలగటం అనేమాట పెళ్ళిజరిగినన్నాళ్ళూ వినిపిస్తూనే ఉన్నది. సత్యవతి అత్తగారు అలిగింది. ఆడబిడ్డలు అలిగారు. పెళ్ళికొడుకు అలగటానికి ఒక ప్రత్యేకమైన ఏర్పాటు కూడా జరిగింది. ఆ అలక తీర్చటానికిగాను శివరావుగారు అల్లుడికి ఒక బీయస్సీ సైకిలూ, ఒక వెస్టెండ్ రిస్టు వాచీ ఇచ్చారు.

ఆ కిందటిరోజు కాబోలు పెళ్ళివారు బ్రాహ్మణులకు సంభావన లిచ్చారు. అందరూ డబ్బులు పుచ్చుకుపోవటం నారాయణకు తమాషాగా ఉన్నది. ఒకాయన బిచ్చగాళ్ళల్లే ఉన్న బ్రాహ్మణులకు చిల్లరడబ్బులిచ్చి, "పదండి పదండి" అని బయటికి పంపిస్తున్నాడు. ఆయన పక్కనే నిలబడి చూస్తున్నాడు నారాయణ. ఆయన నారాయణ చేతిలోకూడా ఒక అణా పెట్టి, "పద" అంటూ వీధిలోకి నెట్టాడు.

నారాయణకు అర్థం కాలేదు. ఆ అణా తీసుకున్నందుకు తను మళ్ళా ఇంట్లోకి పోరాదా? వాడికి భయం వేసింది. వాడు వీధి వెంట కొంచెం దూరం వెళ్ళి తిరిగి వచ్చాడు. ఇంట్లోకి వెళ్ళటం చాలా అర్జంటనిపించింది. వాడికి. వాడు

తిరిగి వచ్చేసరికి వాకిలి దగ్గిర అణా ఇచ్చినాయన లేడు. నారాయణ పిల్లిలాగా లోపలికి ప్రవేశించి, ఒక్కపరుగున తల్లి దగ్గిరికి వెళ్ళి అణా చూపించాడు.

"ఎక్కడిదిరా?" అని అడిగింది పార్వతి.

"అందరికీ డబ్బులిచ్చాడే ఆయన యిచ్చాడు. ఇచ్చి వీధిలోకి తోశాడు" అన్నాడు నారాయణ.

"వెధవా, దొడ్డిసంభావన తీసుకున్నావా?" అన్నది పార్వతి కోపంగా.

"నేను తీసుకోలేదు; ఆయనే ఇచ్చాడు" అన్నాడు నారాయణ కీచుగా.

"పో, వెళ్ళి ఆ అణా వాళ్ళకిచ్చేసిరా!" అన్నది పార్వతి.

"నేనివ్వను" అన్నాడు నారాయణ.

"ఇట్లాతే" అన్నది పార్వతి.

నారాయణ తన అరిచేతి చెమటకు తడిసి వేడెక్కిన అణాకాసును తల్లి చేతిలో పెట్టాడు. అదే సమయంలో ఆవిడ నెవరో పిలిచారు.

పార్వతి దగ్గిరే ఉండిపోయింది అణా. ఆమె దాని మాటే మరిచింది.

పెళ్ళి అయిపోవస్తున్నకొద్దీ పోట్లాటలూ, సాధింపులూ జాస్తి అయ్యాయి. విడిదిలో దొంగతనం కూడా జరిగిందట. ఆ దొంగతనాన్ని కూడా శ్రీయుతులవారి తరఫువాళ్ళకే అంటగట్టాలని చూశారు పెళ్ళికొడుకు పక్షంవాళ్ళు. అదృష్టవశాన దొంగ దొరికినట్టుంది; ఆ గొడవ చప్పున చల్లారి ఊరుకున్నది.

పార్వతికి తన పెళ్ళి తాలూకు వివరాలు అట్టే జ్ఞాపకం లేవు. కాని ఆ పెళ్ళి యింత ఛిద్రంగా లేదు. పల్లెటూరి పెళ్ళి కావడంచేతనేమో! "బస్తీలో ఆడపెళ్ళివారు కావటం ఎంత హీనం! ఎంత అవమానం! ఎన్ని మాటలు పడాలి! ఛీ! ఛీ!" అనుకున్నదామె నారాయణ వింటూండగా· ఆ మాటే ఆమె చాలాకాలం పాటు ఎంతోమంది దగ్గిర అన్నది కూడా.

* * * *

ఒకనాడు నారాయణ బడికి వెళ్ళి గంటకల్లా తిరిగివచ్చాడు.

"అప్పుడే వచ్చావేంరా?" అని పార్వతి అడిగింది.

"బళ్ళోకి పిల్లల్ని పోనివ్వటంలేదు. పికెటింగు చేస్తున్నారు." అన్నాడు నారాయణ.

పార్వతి కేమీ అర్థం కాలేదు.

"బడి మూసేశారా?" అని ఆమె అడిగింది.

"లేదమ్మా, కొంతమంది పిల్లలు వెళ్ళినట్టున్నారు. మేష్టర్లు కూడా వెళ్ళారు. చాలామంది మానేశారు."

"నువు పోకపోయావా?"

"ఎట్లా పోవటం పెద్దపెద్దవాళ్ళంతా కేకలేస్తుంటే?"

"వాళ్ళకేం పోయేకాలం?"

"సహాయనిరాకరణంట."[1] అన్నాడు నారాయణ. ఇంతసేపటికి వాడి కామాట జ్ఞాపకం వచ్చింది. ఆ మాట చెబితే తల్లికి అర్థమవుతుం దనుకున్నాడు.

కాని పార్వతికి విషయం మరీంత అయోమయమయింది. తన కొడుకు చదువంతా ధ్వంసమైపోయినట్టుగా ఆమె బాధపడింది. తన అత్తవారి వంశంలో ఎవరికీ చదువంటదు. తాను ఎంత హైరానపడి ఏమి లాభం? తన కొడుకు ఏబ్రాసిగా తిరుగవలసినవాడే.

మర్నాడు కూడా నారాయణను "వాళ్ళు" బళ్ళోకి పోనివ్వలేదు. అయితే గుడ్డిలో మెల్లగా పార్వతికొక శుభవార్త తెలిసింది. మొదటిరోజు పాఠాలు జరగ లేదుట. ముప్పై, నలభైమంది ఉండవలసిన క్లాసుల్లో అయిదారుగురుకన్నా ఎక్కువ లేరుట. కొన్ని క్లాసులు పూర్తిగా ఖాళీట.

ఆ రోజు పార్వతి శివరావుగారితో మొట్టమొదటిసారిగా దీర్ఘ సంభాషణ చేసింది. ఆయన పార్వతికి దేశంయొక్క రాజకీయ పరిస్థితి కొంత విడమర్చి చెప్పాడు. స్కూళ్ళ దగ్గిర పికెటింగు చేసేవాళ్ళను ఆయన రౌడీమూక కింద జమకట్టలేదు.

పార్వతి స్థూలంగా కొన్ని విషయాలు తెలుసుకొన్నది. మన దేశంలో స్వేచ్ఛ లేదుట. బ్రిటిషువాళ్ళు మనని పరిపాలిస్తూ మన దేశాన్ని దోచుకుంటూ, మనని దారిద్ర్యంలోనూ అజ్ఞానంలోనూ ఉంచుతున్నారుట. అందుకని గాంధీ అనే ఆయన ఇంగ్లీషువాళ్ళను తరిమెయ్యటానికి ఒక ఉద్యమం ప్రారంభించాట్ట. సహాయనిరాకరణం. అంటే బ్రిటిషువాళ్ళ పరిపాలన సాగటానికి దేశంలోవాళ్లెవ్వరూ సహాయం చెయ్యరు. అప్పుడు ఇంగ్లీషువాళ్ళు మనని పాలించలేక, తట్టా బుట్టా తీసుకొని చక్కాపోతారు. ఆ తరువాత మనదేశాన్ని మనమే పాలించుకుని ఐశ్వర్యంతో తులతూగుతాం. ధర్మం నాలుగుపాదాలా నడుస్తుంది. ఈ ఇంగ్లీషు చదువులు పోయి, అందరూ చక్కగా సంస్కృతం చదువుకుంటారు. దేశంలో పేద సాదా అంటూ ఉండరు. రామరాజ్యం వచ్చేస్తుంది.

కనీసం అలా అని పార్వతి అర్థం చేసుకున్నది- కాని నమ్మలేకపోయింది.

---

1. సహాయ నిరాకరణ : 1920 మే 28 ఖిలాఫత్ కమిటీ సహాయ నిరాకరణను ఆమోదించింది. దాని ప్రేరణతో 1920 సెప్టెంబరు 4-9 తేదీలలో జరిగిన కలకత్తా కాంగ్రెసు ప్రత్యేక సమావేశంలో అహింసాత్మక సహాయ నిరాకరణోద్యమ తీర్మానం గాంధీజీ సూచించారు. కొద్ది మెజారిటీతో ఆమోదించబడింది. లజపతిరాయ్, చిత్తరంజన్‌దాస్ వంటివారు వ్యతిరేకించారు. 1920 డిసెంబరులో జరిగిన నాగపూరు సమావేశంలో అత్యధికులు బలపరిచారు. ఈ సమావేశంనుంచే "గాంధీయిజం" కాంగ్రెసు అధికార భావజాలమైంది.

"మనని మనమే పాలించుకోవటం" అంటే ఏమిటి ? పాలించటానికో రాజంటూ ఉండొద్దూ? సీమరాజు మనని పాలిస్తున్నాడు. ఆ రాజు కాకపోతే యింకో రాజుండొద్దూ?

"ఈ గాంధీగారు మనకు రాజౌతాడంటారా?" అని పార్వతి అడిగింది.

శివరావు నవ్వి, "రాజంటే పేరుకే రాజు. ఆ సీమరాజు తన దేశాన్ని కూడా పాలించడు. సీమను పాలించడు. పార్లమెంటని ఉన్నది. అందులో ప్రజలు ఎన్నుకున్న వాళ్ళుండి శాసనాలూ అవీ చేస్తారు. ఆ శాసనాల ప్రకారం జరుగుతుంది. మన దేశంలో కూడా అటువంటి పరిపాలనవస్తే దేశం బాగుపడిపోతుంది." అన్నాడు.

పార్వతికి అర్థం కాలేదుగాని, ఆమె తరిచి అడగలేదు. రాజుల్ని ఎన్నుకోవటం ఏమిటో ఆమెకు అంతుచిక్కలేదు. అయినా త్వరలోనే పికెటింగు అయిపోయింది. స్కూలు మళ్ళీ మామూలుగా నడుస్తున్నది. రెండు రోజులెందుకు రాలేదని నారాయణను మేస్టరు అడగలేదుట. అంతా అయిపోయింది లెమ్మనుకుంది పార్వతి.

కాని ఏమీ అయిపోలేదు.

ఒకరోజు వెంకటేశ్వర్లు వచ్చాడు. అతని మామగారు గాంధీ ఉద్యమంలో చేరాట్ట. ఆయన ప్రాక్టీసు మానేశాట్ట - నిక్షేపంగా నెలకు నాలుగు వందలు వచ్చే ప్రాక్టీసు. అదంతా ఇప్పుడు వెంకటేశ్వర్లుకే వచ్చిందిట. వెంకటేశ్వర్లు కూడా ఉద్యమంలో దిగుతానంటే, మామగారు తొందరపడవద్దని సలహా ఇచ్చాట్ట.

అంతకన్న విచిత్రమైన వార్త ఏమంటే—కాంతయ్య తన మల్లుమంచెలన్నీ తగలేసి, ఖద్దరుగట్టి, గాంధీ ఉద్యమంలో చేరాట్ట....మీటింగుల్లో మాట్లాడుతున్నాట్ట. ఎరెస్టు అవుతాడనుకుంటున్నారుట.

"ఎరస్టయితే ఏమవుతుంది?" అన్నది పార్వతి.

"ఏమవుతుందీ? జైల్లో పెడతారు!" అన్నాడు వెంకటేశ్వర్లు.

తన భర్తకున్న దుర్గుణాలకు శిక్ష పడుతుందికాబోలు అనుకున్నది పార్వతి. ఆమెకు భర్తమీద జాలివేసింది. దుర్గుణాలున్న వాళ్ళు ప్రపంచంలో ఎంతమంది లేరు? ఈయన్నే తీసుకుపోయి ఎందుకు జైల్లో వెయ్యాలి?

నిజంగా తన మొగుడు జైలుకుపోతే, తనకూ తనకొడుక్కూ ఎంత అప్రతిష్ఠ! తనను అందరూ ఏ దొంగాడి పెళ్ళాన్నో చూసినట్టు చూడరూ?

"చిన్నన్నయ్యా, నువు ప్లీడరువుగా? ఆయన జైలుకు పోకుండా చూడలేవూ?" అన్నది పార్వతి.

"గాంధీ ఉద్యమంలో చేరినవాళ్ళను ప్రభుత్వం జైల్లో పెట్టకుండా ఎందుకుంటుందీ?"

"ఈ సంగతి ఆయనకు తెలీదేమో? ఎంత అప్రదిష్ట!" అన్నది పార్వతి.

"అదా నీ బెంగ? ప్రతిష్టకోసమే మీ ఆయన జైలుకు పోతాడు. ఈ ఉద్యమంలో జైలుకు పోవటం కీర్తి-తెలుసా? దాన్ని ఇప్పుడు జైలని ఎవరూ అనటం లేదు. శ్రీకృష్ణజన్మస్థానమంటున్నారు." అన్నాడు వెంకటేశ్వర్లు.

శివరావు చెప్పిన విషయాలు చాలా చెప్పాడు వెంకటేశ్వర్లు. ఢాకాలో సాలె వాళ్ళు సన్నని వలిపాలు నేసేవాళ్ళట. ఎన్నోగజాల నిడివిగల గుడ్డ నిప్పుపెట్టెలో ఇమిడేదిట. ఇంగ్లీషువాళ్ళు వాళ్ళ వేళ్ళు నరికించేశారుట.

"ద్రోణాచార్లు ఏకలవ్యుడి బొటనవేలు నరికినట్టుగానా?" అన్నది పార్వతి.

"ఏకలవ్యుడు తానై బొటనవేలు నరుక్కున్నాడు. వీళ్ళు బలవంతాన నరికేశారు" అన్నాడు వెంకటేశ్వర్లు.

ఎక్కడో పంజాబులో డయ్యరనే[1] దొర జనాన్ని ఒక బందిలిదొడ్డిలాటి దానిలో పెట్టి కాల్పులు చేయించి చంపేశాట్ట.

"ఈ బ్రిటిషు పరిపాలకులు మనుషులుకారు. పిశాచాలు.... వీళ్ళ పీడ వదిలితే గాని దేశం బాగుపడదు. గాంధీగారు తమాషా ఎత్తే వేశాడు. సత్యాగ్రహ సహాయ నిరాకరణం. విదేశీ వస్తువులు కొనకు-రాటం పెట్టి నీ బట్టలు నువ్వే వడుకో్కు. విదేశీ బట్టలకింద మనం కోట్లకొద్దీ ఖర్చుచేస్తున్నాం. అదంతా ఇంగ్లండుకు పోతున్నది. ఏటా అయిదుకోట్ల రూపాయలు ఇంగ్లండుకు పోతున్నాయి. దాన్ని ఆపామంటే పదేళ్ళలో యాభైకోట్లు మనకు ఆదా అవుతాయి. ఆ డబ్బు కోసమేగద వాళ్ళు మన దేశాన్ని జలగల్లాగా పట్టుకున్నారు." అన్నాడు వెంకటేశ్వర్లు.

"అయితే ఈ గాంధీ ఉద్యమం రైటేనంటావు?" అన్నది పార్వతి.

"చూడాలి. తన ఉద్యమం సరిగాసాగితే ఏడాదికల్లా స్వరాజ్యం వస్తుందంటున్నాడు గాంధీగారు."

చిన్నన్న ఈ ధోరణి చాలా చెప్పినమీదట తన భర్తలో కల్గిన మార్పు మంచిదేనేమోననీ, ఇకముందు తామంతా మళ్ళీ కలిసి ఉండవచ్చునేమోననీ పార్వతి ఆశపడింది. తన మొగుడు పూర్తిగా మారిపోయి ఇంకోమనిషి అయితే ఎంత బాగుండును?

---

1. డయ్యర్ : 1919 ఏప్రిల్ 13వ తేదీ అమృత్‌సర్‌లోని జలియన్‌వాలా బాగ్‌లో సభలో పాల్గొన్న వేలాది ప్రజలపై అమానుష హత్యాకాండ జరిపిన నరహంతకుడు. అప్పటి పంజాబు గవర్నరు ఓడ్వయర్‌తో కలిసి జనరల్ డయ్యర్ చెయ్యని ఘోరాలులేవు. బ్రిటిష్ పార్లమెంటులోని లార్డ్స్‌సభ దయ్యర్ హత్యాకాండను సమర్థించింది. తన శాషన సేవలకు 20,000 పౌండ్ల బహుమతిని కూడా పొందాడు.

ఇట్లా అనుకోవటం పతివ్రతాధర్మంకాదని పార్వతికి తట్టలేదు. అయితే అది ప్రస్తుతం. ఆమె తన భర్తలాటివాడుకాని ఒక మహాపురుషుణ్ని మనస్సులో ఎప్పుడూ ప్రేమిస్తూనే ఉన్నది.

వెంకటేశ్వర్లు తన మామగారిలాగా ఉద్యమంలో చేరి, ఉపన్యాసాలిచ్చి, జైలుకు పోవటానికి సిద్ధంగా లేకపోయినా, ఉద్యమంపట్ల చాలా అభిమానంగానే ఉన్నాడు. అతను పార్వతిని ఒప్పించి ఒక రాటమూ, ఇన్ని ఏకులూ తెచ్చి పెట్టాడు. తానే పార్వతికి దారం తీయడమూ, పురి వెయ్యటమూ మొదలైనవి నేర్పాడు.

తనకు నూలు తియ్యటం ఎన్నటికీ రాదని మొదట్లో పార్వతి నిస్పృహ చెందింది. కాని త్వరలోనే ఆమెకు దారం తీసే ఒడుపు కొంచెం కొంచెంగా తెలిసి రాసాగింది.

నారాయణకూడా దారం తీస్తానని రాటం ముందు కూర్చుని, ఆరంభంలోనే ఏకంతా కదురుకు చుట్టుకుపోనిచ్చాడు.

కొన్నాళ్ళపాటు రాటం ఒక వినోదమయింది. శివరావుగారి భార్యా, సత్యవతీ కూడా పార్వతీవాళ్ళ రాటంమీద దారం తీశారు. ఏకులన్నీ అయిపోయాయి. తీసిన దారం ఎందుకూ పనికివచ్చేదికాదు. ఆ తరవాత మళ్ళీ ఏకులు తెచ్చేవాళ్ళులేక రాటం మూలపడింది. అసలే కాస్తచోటు, అందులో ఈ రాటం ఒకటి ప్రతిదానికి అడ్డం రాసాగింది. దాన్ని అటునుంచి ఇటూ, ఇటునుంచి అటూ జరపలేక పార్వతి చాలా యాతనపడింది. తరవాత దాన్ని ఎవరో అరువు పట్టుకెళ్ళి మళ్ళీ ఇవ్వలేదు.

పార్వతి మొగుడూ, వెంకటేశ్వర్లు మామగారూ కూడా జైలుకువెళ్ళారు. భర్త జైలుకు వెళ్ళాడన్న, మాటవిన్న పూట పార్వతి అన్నం తినలేదు. దాన్ని విచారం అని కూడా అనలేం. ఆమెకు అన్నం చూస్తే అసహ్యం వేసింది. జైలుకు పోవటంలో గౌరవం ఉందని ఎంతమంది చెప్పినా ఆమెకు అది చాలా హీనంగానూ, గౌరవహీనంగానూ మాత్రమే కనబడింది. ఆమె జైల్లో ఉండేవాళ్ళను ఒక సాయంకాలం చూసింది. ఘోరం! ఎవరన్నా కోరి జైలుకెలా పోతారో ఆమె ఊహించలేకపోయింది. ఆఖరుకు దొంగలు కూడా కోరి జైలుకుపోరు. జైలు ఎంత చండాలమంటే, అవకాశం దొరికితే దొంగలు జైలునుంచి పారిపోతారుట.

పార్వతి కింకో దిగులుకూడా పట్టుకున్నది. జైల్లో పెట్టిన వాళ్ళను పోలీసులు చావగొడతారట. తన భర్తా, వెంకటేశ్వర్లు మామగారూ పోలీసులచే దెబ్బలు తింటారా? ఏం ప్రారబ్ధం! ఆలోచిస్తున్నకొద్దీ ఆమె మతి పోతున్నట్టయింది.

నిజానికి పార్వతి జీవితంలో ఉండే పైశాచికత్వంలో ఆవగింజంత భాగం కూడా ఎరగదు. రోడ్డుమీద నిరాయుధులపైన పోలీసులు బూట్లచప్పుడు భయంకర

రంగా చేసికుంటూ వచ్చిపడి లాఠీలతో చావమోదటం లాంటి దృశ్యాల నామె చూడ వలసి ఉన్నది.

కసీ, కక్షా ఉన్న మనుషులే ఒకరినొకరు చావగొట్టుకోవటం చాలా అసహ్యమని పార్వతి నమ్మకం. మరీ తక్కువరకం మనుషులే అలాటి పనులు చేస్తారని ఆమె అనుకునేది. అటువంటిది పోలీసులు తాము ఎరగనివాళ్ళను పసి పిల్లలనైనా కాదు, ఈడొచ్చినవాళ్ళను క్రూరలతో బాదటం ఆమెకు ఊహాతీతంగా ఉండేది.

ఈమాటే అంటే పెద్దన్న, "పోలీసులు రాజకీయ ఖైదీలను కొట్టరు. మామూలు నేరస్తులను కొడతారు. అదైనా వాళ్ళచే నిజం చెప్పించటానికి కొడ తారు" అన్నాడు.

"ఏ నేరస్తులైతే మాత్రం ఏళ్ళొచ్చినవాళ్ళను కొట్టటమేమిటి అన్నయ్యా! అసహ్యంకాదూ?" అన్నది పార్వతి మొండిగా.

"పోలీసులున్నదే అందుకూ! వాళ్ళకు అట్లా కొట్టటం నేర్పుతారు. పోలీసు శిక్షణలో అదొక భాగం అనుకో" అన్నాడు నాగభూషణం.

ఎవరేం చెప్పినా జీవితంలో అశాంతి హెచ్చిపోతున్నట్లు కనబడింది పార్వతికి. వెనుకటి రోజుల్లోనే ప్రాణానికి హాయి ఉండేది. ఏం గాంధీగారో, ఏం ఉద్యమమో పత్రికల్లో రోజూ అరెస్టుల వార్తలేట.

* * * *

ఏ నదికీ "మామూలు" ప్రవాహం అంటూ ఉండదు. వర్షాకాలంలో నది పొంగివచ్చినది మొదలు ఎండాకాలంలో ఎండిపోయి మడుగులు కట్టేదాకా నదీ ప్రవాహం క్షణక్షణమూ మారుతూనే ఉంటుంది. అయినా ప్రతినదికీ ఒక "మామూలు" ప్రవాహం ఉన్నట్టు మనం ఊహించుకుంటాం. ఆ "మామూలు" కన్న హెచ్చు ప్రవాహం ఉన్నా, తక్కువ ప్రవాహం ఉన్నా విశేషంగా చెప్పు కుంటాం.

ఇటువంటి అపోహే మనకు కాలప్రవాహం గురించికూడా ఉన్నది. ఒక ప్పుడు రోజులు మహాగడ్డుగా ఉన్నట్టుంటాయి; ఒకప్పుడు చాలా ఉద్రిక్తంగా గడు స్తాయి; ఒకప్పుడు కాలం బరువెక్కినట్టుంటుంది; మరొకప్పుడు అది రెక్కలు కట్టు కుని పరిగెత్తుతుంది. ఇటువంటి ఒడుదుడుకులు లేనప్పుడు రోజులు "మామూలు"గా వెళ్ళిపోతున్నట్టు మనకు తోస్తుంది.

ఇళ్ళూ, వాకిళ్ళూ, సంసారాలూ, స్నేహితులూ, స్వేచ్ఛాజీవితమూ-అన్నీ విడిచేసి జైలుకు పోయినవాడికి కొంతకాలంపాటు ప్రతిదీ 'అనుకూలంగా'నే ఉంటుంది. తరవాత ఆ జైలుజీవితమే "మామూలు" అవుతుంది. తిరిగి విడుదల అయ్యేరోజు దగ్గిరపడేసరికి కాలానికి రెక్కలు వచ్చినట్టవుతుంది. విడుదల అనం తరం కొద్దికాలంపాటు జీవితం దేగలాగా ఎగురుతుంది. జైల్లో వ్యర్థమైన అయిదారు

చెల్లూ, అయిదారు రోజుల్లో కలసివచ్చి నట్టనిపిస్తుంది. మీటింగులు, ఊరేగింపులు, వారినీ వీరినీ కలవటాలు, కబుర్లు - ప్రతిక్షణానికి ఒక గంట విలువవస్తుంది. ఆ తరవాత జీవితం మళ్ళీ మామూలవుతుంది.

కొద్దిమందికి 'మామూలు' జీవితం నచ్చదు. వాళ్ళకు ప్రతిక్షణమూ ఏదో విశేషం కావాలి. కాని పార్వతికి కావలసింది కాలం 'మామూలు'గా గడపటం. అరెస్టుల హడావుడి వెనకపడ్డాక జీవితం మామూలు స్థితికి వచ్చి, ఆమె మనస్సు కాస్త తేరుకున్నది.

నిజానికి మామూలుగా గడిచిపోయే కాలం, నిద్రలో గడిచిపోయే ఘడియల్లాగా, తెలియకుండా గడుస్తుంది. ఒక రోజల్లేనే ఇంకోరోజూ ఉంటే, నూరురోజులైనా ఒకరోజుకిందనే జమ. ఒడుదొడుకులు లేకుండా వుంటే, జీవితమంతా ఒకే రోజులాగా గడిచిపోయినా పార్వతికి అభ్యంతరం లేదు. కాని అది సాధ్యంకాదు.

'నాయకులు' జైళ్ళనుండి తిరిగివచ్చారు. మీటింగులు జరుగుతున్నాయి. ఇవి 'గాంధీ' మీటింగులు కావు. వీటిలో ఉపన్యాసాలిచ్చిన వాళ్ళను అరెస్టు చెయ్యరు.

ఊళ్ళో మీటింగయింది; నలుగురు 'నాయకులు' జైలునుంచి తిరిగివచ్చిన వాళ్ళు మాట్లాడుతున్నారు. వాళ్ళలో కాంతయ్యకూడా ఉన్నాడని పార్వతి విన్నది.

"మీవారు మీటింగులో మాట్లాడతారట; నువు వెళతావుటమ్మా?" అని ఇంటి వాళ్ళ మాలక్ష్మమ్మ అడిగేసరికి, పార్వతికి తనమీద పిడుగులాటిదేదో పడ్డట్టయింది.

"నాకేమీ తెలీదండీ. మీటింగులకు పోవటం నా కలవాటు లేదు" అన్నదామె.

మాలక్ష్మమ్మ కాస్సేపు మాట్లాడి వెళ్ళాక నారాయణ చాలా బిడియంగా, "అమ్మా? - నాన్నా?" అన్నాడు.

వాడినోట "నాన్న" అనే మాట కొంచెం ఎబ్బెట్టుగా విన్పించింది గాని అందులో ఏదో కొంత మమకారం లేకపోలేదు.

నారాయణ కొంచెం ఆలోచించి తల అడ్డంగా తిప్పాడు. వాడు నాన్నను పూర్తిగా మరిచిపోలేదుగాని, వాడి మనస్సులో తండ్రి రూపం బాగా మసకపడి పోయింది. ఒకసారి వీధిలో ఎవరినో చూసి తననాన్న అనుకున్నాడు. తీరా పరకాయించి చూస్తే కాదు. కాని అది మొదలు తన నాన్నను జ్ఞాపకం చేసుకోవటానికి ప్రయత్నించి నప్పుడల్లా ఆ వీధిలోని మనిషి కవళికలు కొన్ని అడ్డుతగిలేవి. ఆ తరవాత స్కూల్లో రామ్మూర్తిమేస్టరు గారిని చూసి నారాయణ, 'మా నాన్నకూ ఈయనకూ చాలా పోలిక ఉన్న'దనుకొన్నాడు. రామ్మూర్తి మేస్టరు రోజూ కనిపించేవాడు. చివరకు నారాయణ తన నాన్నను గుర్తుకు తెచ్చుకోవాలనుకున్నప్పుడల్లా రామ్మూర్తి మేస్టరుగారి మొహం తప్ప ఇంకేమీ గుర్తుకొచ్చేది కాదు.

పార్వతి మీటింగుకు వెళదామని ఏ కోశానా అనుకోలేదు. తాను వెళ్ళుతుందని ఎవరన్నా అనుకుంటే ఆమెకు ఆశ్చర్యం కూడా కలిగింది. లోకమంతా

ఏకమై, తన భర్తకు జరిగే గౌరవం తనుచూసి తరించాలని కుట్ర పన్నుతున్నట్టు కూడా ఆమెకు తోచింది.

కొంచెం ఆలోచించుకుంటే తనకు తన భర్త కళ్ళపడే సాహసం లేదేమోనన్న అనుమానం కూడా ఆమెకు కలిగింది.

'ఓవేళ నేను పిరికిదాన్నే నేమో!.... అయితే అయింది. నేను మాత్రం ఆ మీటింగుకు పోను. ఆడవాళ్ళు మీటింగులకు వెళ్ళటం ఏమిటసలు?' అనుకున్నది పార్వతి.

ఇంటివాళ్ళంతా మీటింగుకు బయలుదేరారు. పార్వతమ్మ మొగుడు ఎట్లా ఉంటాడో చూడాలన్నదే వాళ్ళు వెళ్ళటానికి కారణమయి ఉంటుందని పార్వతి సంశయించింది.

తన అన్నదమ్ము లందరూకూడా వెళుతున్నారు. వాళ్ళ పెళ్ళాలు మాత్రం వెళ్ళటంలేదు. ఆడవాళ్ళు మీటింగుకు వెళ్ళే ఆనవాయితీ వాళ్ళలో ఎవరికీ లేదు.

మేనమామ వచ్చి, "నువుకూడా వస్తున్నావుట్రా!" అని అడిగితే, నారాయణ తల్లికేసి చూశాడు. వాడికి వెళ్ళాలని ఉన్నదో లేదో పార్వతి ఊహించలేక పోయింది. వాడు తన నుంచి అనుమతి కోరుతున్నాడో, తన ఆదేశం కోసమే చూస్తున్నాడో పార్వతికి తెలియలేదు.

"ఎందుకు వాడుకూడా?.... ఏమో వాడిష్టం" అన్నది పార్వతి తనమీద ఏ బాధ్యత ఉంచుకోకుండా.

నారాయణ పెద్ద మేనమామకేసి చూశాడు. నిజానికి వాడు ఎటూ తేల్చుకో లేకుండా ఉన్నాడు. తన తండ్రి ఒక నిషిద్ధవస్తువన్న భావం వాడిలో లేకపోలేదు. కాని, అంత నిషిద్ధవస్తువు కానిపక్షంలో తండ్రిని చూడాలని వాడికి లేకపోలేదు. అందరు పిల్లలూ తమ నాన్నల నడిగి డబ్బులు తెచ్చుకుంటారు; నాన్నలు కోప్పడ తారనీ, కొడతారనీ భయపడతారు; ఎన్నో విధాల నాన్నల నీడన బతుకుతున్నట్టు మాట్లాడతారు; నాన్నలు పోయినవాళ్ళు తప్ప. అయితే తనలాగా నాన్న ఉండి కూడా నాన్నతో సంబంధం లేకుండా బతుకుతున్న కుర్రాడు ఒక్కడు కూడా నారాయణకు తెలీదు.

"ఫరవాలేదులే, మా వెంటరా? మీ నాన్నను చూద్దుగాని; ఇప్పుడు మీనాన్న గొప్ప దేశభక్తుడు - ఏమనుకున్నావో?" అన్నాడు నాగభూషణం.

మామల వెంట మీటింగుకు బయలుదేరటానికి చొక్కా వేసుకుంటున్నప్పుడు నారాయణకు ఒక వింత భావం కలిగింది - "వెళ్ళొద్దు వెళ్ళొద్దు!" అని తన తల్లి మనసు తనతో చెబుతున్నట్టుగా. అది వాడి భ్రమే కావచ్చు. కాని ఆ మాటలు మటుకు వాడి తలలో స్పష్టంగా వినిపించాయి. చొక్కా తలమీదికి లాక్కున్న నారాయణ అల్లాగే ఉండిపోయాడు, ఏం చెయ్యాలో తెలియనట్టు.

"ఏమిట్రా? చొక్కా తొడుక్కో, బయల్దేరదాం." అన్నాడు నాగభూషణం.

నారాయణ చొక్కాలోనుంచి తల బయటికి రానిచ్చి, తల్లికేసి చూశాడు. పార్వతి వాడికేసి చూడటంలేదు.

నారాయణ మేనమామల వెంట మీటింగుకు బయలుదేరాడు. తల్లి మాటలు మరేవీ వాడి తలలో వినిపించలేదు సరికదా, ఆమె వాలకం చూస్తే వాడు వెళ్ళటం ఆమె కేమీ అభ్యంతరం లేనట్టుగానే కనబడింది.

మీటింగు క్లబ్బు ఆవరణలో ఏర్పాటుచేశారు. కొద్ది మంది పోలీసులు చుట్టు పక్కల రోడ్డుమీద నిలబడి ఉన్నారు.

దేశభక్తులు ఒక కారులో వచ్చారు.

"అడుగో మీనాన్న!" అని మామ అంటుండగానే నారాయణ తన తండ్రిని పోల్చుకున్నాడు.

నిజానికి కాంతయ్య చాలా మారిపోయాడు; ఖద్దరు కట్టుకుని, గాంధిటోపీ పెట్టుకుంటే ఎవరో లాగున్నాడు. అయినా నారాయణ గుర్తుపట్టాడు. ఒక విషయం మాత్రం వాడికి స్పష్టమయింది - రామ్మూర్తి మేస్టరుగారికీ, తన తండ్రికీ ఏమీ పోలికలేదు. ఆ పోలిక తను సృష్టించినదే.

కాంతయ్య తన బావమరుదులను గుర్తించినట్టు తల ఎగరేశాడు.

మీటింగులో అందరూ మాట్లాడారు. కాంతయ్య ఆటే మాట్లాడలేదు. మాట్లాడిన దానిలో సొంతం కూడా ఏమీలేదు. అందరూ అనేదే.... ఈ ఉద్యమం ఎట్లా రూపొంద బోయేదీ తెలిసినవాడు దేశంలో ఒక్కడే ఉన్నాడు - మహాత్మాగాంధి. ఆయన చెయ్యమన్నది చెయ్యటమే "మా" విధి. జైళ్ళకు వెళ్ళిరావడంవల్ల స్వరాజ్యం వస్తుందా అని కొందరు అనుమానిస్తున్నారు. ఆయనది శుద్ధమైన వాక్కు. సంశయించే వాళ్ళ మాటంటారా? 'సంశయాత్మా వినశ్యతి' అని భగవద్గీతలో కృష్ణపరమాత్మ చెప్పనే చెప్పాడు....

మీటింగు అయిన తరువాత బావమరుదులు కాంతయ్యను సమీపించారు.

"చిన్న వెంకన్నారాయణ." అంటూ పార్వతీశం కాంతయ్యకు నారాయణను చూపాడు.

"ఏం చదువుతున్నావురా?" అన్నాడు కాంతయ్య తన కొడుకును.

"అయిదో క్లాసు." అన్నాడు నారాయణ.

"వడ్డీ లెక్కలు గట్టగలవా? అవి నేర్చుకో, బాగుపడిపోతావు" అన్నాడు కాంతయ్య.

నారాయణకు తన తండ్రి మాటల్లో ఏదో చేదు ధ్వనించింది. వాడేమీ జవాబు చెప్పలేదు.

"దక్షిణామూర్తి భార్య పోయింది. తెలుసుగా?" అన్నాడు నాగభూషణం.

"జాతస్యహి ధ్రువం మృత్యుః" అన్నాడు కాంతయ్య.

అతను జైల్లో లక్ష్మీనారాయణ శాస్త్రుల్లు దగ్గిర భగవద్గీత కొంత వంటపట్టించు కున్నాడు. దేశభక్తికి భగవద్గీత మద్దతు కొంత ఉండటం అవసరమని కాంతయ్య భావించినట్టు కనబడుతుంది.

"ఇంకా ఉంటారా?" అన్నాడు పార్వతీశం కాంతయ్యతో.

"లేదు రేపు జాతీయ కళాశాలలో[1] మీటింగున్నది. గోపాలకృష్ణయ్య[2] అక్కడ తనను తప్పకుండా కలుసుకోమని రాశాడు" అన్నాడు కాంతయ్య, బహుశా దుగ్గిరాల గోపాల కృష్ణయ్య అని అనే వాళ్ళు అర్థం చేసుకుంటారని.

మేనమామలు నారాయణను తన చెల్లెలిదగ్గిర దిగబెడుతూ జరిగినదంతా చెప్పారు.

"మీ ఆయన ఇప్పుడు సంస్కృతం మాట్లాడేస్తున్నాడు—భగవద్గీత అప్ప చెప్పినట్టున్నాడు," అన్నారు వాళ్ళు.

"పోనీ, చాలా పాపాలు పరిహారం కావాలిమరి." అన్నది పార్వతి.

"నీ కొడుకును వడ్డీలెక్కలు నేర్చుకోమని సలహా యిచ్చాడు-దేనికో?"

"నేను పొలం మీద వచ్చే డబ్బు వడ్డీలకిస్తున్నానని వెటకారం! వాళ్ళకు ఏడు తరాలుగా డబ్బు తగలెయ్యటం తప్ప ఇంకేమీలేదుగా! వీడు ముష్టెత్తుకున్న ట్టయితే వాళ్ళ వంశమర్యాద నిలబడేదేమో! అట్లా జరుగకుండా నేను రాహువల్లే అడ్డుపడితినిగా?" అన్నది పార్వతి.

"అదా సంగతి?" అన్నారు అన్నలు.

వాళ్ళు వెళ్ళాక మాలక్ష్మమ్మ వచ్చింది.

"మీవారిని చూశానమ్మోవ్! ఎవరినీ అడగవలసిన పనికూడా లేకపోయింది. అచ్చు మీ నారాయణే!" అన్నదావిడ.

---

1. జాతీయ కళాశాల : జాతి పునర్నిర్మాణ లక్ష్యంతో, జాతీయ దృక్పథంతో జాతీయోద్యమ కార్యక్రమాల్లో భాగంగా ఏలూరులో 1921లో ఏర్పాటైన జాతీయ కళాశాల కావచ్చు. రాట్నం వడకడం, నేత, మృదంగం, హిందీ భాషాభ్యాసం, జాతీయ దృక్పథం నుంచి చరిత్ర బోధన మొదలైనవి జాతీయ కళాశాలల లక్ష్యాలు. నాగపూరు సమావేశంలో వీటి యేర్పాటు జరగాలని తీర్మానించడమైనది. 1921 జూన్ నాటికి 44 జాతీయ పాఠ శాలలు వెలిశాయి. వీటిలోని విద్యార్థుల సంఖ్య 2729.

2. గోపాలకృష్ణయ్య (1889-1928) : ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాల కృష్ణయ్య. చీరాల పేరాల సత్యాగ్రహ సారధి రామదండు నిర్మాత. సాధన పత్రిక సంస్థాపకుడు. పండితుడు, కవి, మంచి వక్త, గాయకుడు. రాజకీయాలకు హిందూమత చైతన్యం జోడించిన ఆదర్శవాది.

'అదొక్కటే నాకు మిగిలివున్న బెంగ!' అనుకున్నది పార్వతి.

చాలాకాలంగా ఆమె తన భర్తను ద్వేషించటంలేదు. భర్తమీద వ్యాజ్యం వేసినందుకు పశ్చాత్తాపపడినదానిలాగా ఆమె సాధ్యమైనంతవరకు భర్తను గురించి వీలయినంత మంచిగానే జ్ఞాపకం చేసుకుంటూ వస్తున్నది. కాని ఇవాళ ఆమె హృదయంలో భర్తపట్ల ద్వేషం తప్ప ఇంకేమీలేదు. కారణం ఆమెకే అంతు చిక్కలేదు.

కాంతయ్య ఈ వూరికివచ్చి మీటింగులో పాల్గొనటమే ఆమె మనశ్శాంతిని ఎంతో పాడుచేసింది. ఆ మనిషిలో మానవత్వంలేదని తాను వెనక అన్నది. మళ్ళీ అక్షరాలా రుజువయింది. ఇంత కాలమయాక కొడుకు కనిపిస్తే మరొక డైతే కాస్త ఆప్యాయంగా మాట్లాడి దగ్గిరికి తీసుకోరూ? తాను చేసినది ద్రోహమే కావచ్చు. అమాయకుడు పసివాడు - వాడు ఏంద్రోహం చేశాడూ? 'ఛీ, ఏం మనిషి?' అనుకున్నది పార్వతి.

తన భర్తమూలకంగా ఆమెకు అతను ప్రవేశించిన ఉద్యమం మీద కూడా అసహ్యం కలిగింది.

ఇటువంటిది ప్రతి ఉద్యమానికీ తప్పనిసరిగా జరుగుతుందని తోస్తుంది. ఉద్యమం యొక్క స్వరూపాన్ని చాలామంది అర్థం చేసుకోలేరు. ఆ ఉద్యమంలో చేరినవాళ్ళ స్వభావం తమకు బాగా తెలిసినపుడు ఆ స్వభావాన్నే ఆ ఉద్యమానికి అంటగట్టుతారు. అదివరకే సంఘంలో గౌరవం సంపాదించుకున్న వాళ్ళు ఉద్యమంలో చేరితే ఉద్యమానికి ప్రతిష్ట వస్తుంది. నాసిరకం వాళ్ళు ఉద్యమంలో చేరి దానికి న్యాయంగా దక్కవలసిన కీర్తికి కూడా కనీసం కొంతకాలం అడ్డుపడగల్గుతారు.

* * * *

కాలం మళ్ళా మామూలుగా వెళ్ళసాగింది. దక్షిణామూర్తికి మళ్ళీ పెళ్ళయింది. పిల్ల తరఫువాళ్ళు చాలా బీదవాళ్ళు. గుళ్ళో పెళ్ళి చేశారు. నాగభూషణానికి మూడోసారి కూడా పిల్లవాడే పుట్టాడు. వెంకటేశ్వర్లుకు ఆడపిల్ల తరువాత మళ్ళా పిల్లలు లేరు. వెంకట్రామన్నయ్యకు మగపిల్లవాడి తర్వాత ఆడపిల్ల పుట్టింది. జానికమ్మగారు ఏదో జ్వరంవచ్చి పోయింది. పండుముత్తయిదువు చావు. తన అత్తగారుకూడా పోయినట్టు పార్వతి విన్నది.

ఈ విధమైన సంఘటనలేవీ కాలంయొక్క, "మామూలు" తనానికి అడ్డం రాలేదు. జగన్నాటకంలో పాత్రధారులూ, ప్రేక్షకులూ నిశ్శబ్దంగా మారిపోతూ ఉంటారు. కాని నాటకమేమొ సాగిపోతూనే ఉంటుంది. రంగస్థలంమీద పెద్ద పెద్ద మార్పులే వస్తుంటాయి. కాని అదేనాటకం.

భగవద్గీత ప్రభావం తన భర్తమీద ఎట్లా పనిచేస్తున్నదీ ఊహించలేక పోయింది. తిలక్ స్వరాజ్య నిధి[1] అని ఒకటి దేశమంతటా పోగుచేశారుట.

అందులో కాంతయ్య చాలా కాజేశాడని ఎవరో చూచాయగా అన్నారు. అతను మాత్రం అస్తమానమూ పేకాటలో వేలకువేలు సంపాదిస్తూ, పోగొట్టుకుంటూ కాలక్షేపం చేస్తున్నాట్ట. తీరిక ఉన్న సమయాలలో సంఘసంస్కరణకు పాటు పడుతున్నాట్ట. అంటే వితంతువులకు వివాహాలు చేయించటమూ, మాలపల్లెలకు వెళ్ళి గాంధీ బోధలు చెయ్యటమూ వగైరా.

ఎవరో ఒక వితంతువును పెళ్ళి చేస్తానని ఇంటినుంచి రహస్యంగా తెచ్చి, తానే ఉంచుకున్నాట్ట. ఆమె చాలా నగకట్టుతో వచ్చిందని చెప్పుకున్నారు.

"తాళి కట్టుకున్న పెళ్ళాం తన్నితగిలేస్తే మగముండాకొడుకైనవాడు నెత్తిన చేతులు పెట్టుకుని కూర్చుంటాడా ఏం?" అని తన పినతల్లులు వ్యాఖ్యానించినట్టు పార్వతికి తెలియవచ్చింది.

క్లిష్టసమయంలో తాను వాళ్ళను ఆదుకున్నందుకు వాళ్ళు ఆజన్మాంతం తనకు కృతజ్ఞత చూపాలని పార్వతి ఏనాడూ కోరలేదు. కాని వాళ్ళకు తనపైన ఈః పగా, కసీ చూసి ఆమెకు ఆశ్చర్యంగా ఉండేది. తమ రక్తం పంచుకుని పుట్టినదై ఉండి అంతో ఇంతో లోటు లేకుండా బ్రతుకుతున్నదన్న కడుపుమంట తప్ప మరేమి కావటానికి అవకాశంలేదు. వాళ్ళను గురించి ఊహలు చెయ్యటం కూడా పార్వతికి చాలా అసహ్యంగా ఉండేది.

దక్షిణామూర్తి రెండో భార్యకు కూడా తనంటే ఏదో తక్కువ భావం ఉన్నట్టు పెళ్ళి సమయంలో పార్వతి కనిపెట్టింది. ఆ పిల్ల తన అత్తగారివైపువారు ఎవరేమి అడిగినా వెంటనే జవాబు చెప్పేది. కాని పార్వతి పలకరిస్తే బెల్లంకొట్టిన రాయిలాగా అయిపోయి, "నన్నెందుకు మాట్లాడిస్తావు!" అన్నట్టు చూసేది.

'ఇటువంటి కనకదుర్గలు వెయ్యిమంది విమర్శించినా నేను నా జీవితం గురించి పశ్చాత్తాపపడతాననేది కల్ల!' అనుకున్నది పార్వతి.

నిజానికి పార్వతిని రోజూ చూసేవాళ్ళూ, ఆమెతో దగ్గిర సంబంధాలు పెట్టుకున్నవాళ్ళూ ఆమెను గౌరవంగానే చూస్తున్నారు. దూరదూరంగా ఉండే వాళ్ళలో కొందరే ఆమెను వెలివేసినట్టు చూడటమూ చెడిపోయినదానికింద జమ కట్టెయ్యటమూ చేస్తున్నారు. మొదటిరకం వాళ్ళు తనకేమీ కాకపోయినా వాళ్ళే ఆత్మీయులల్లే కనిపించారు. రెండోరకంవాళ్ళు ఎంత దగ్గిరవాళ్ళయినా తనకు కానివాళ్ళల్లేనే ఆమె బుద్ధికి తోచారు. తన భర్త చేసే అప్రభంశపు పనులను తన మీద ఈర్ష్యతో మెచ్చుకునేవాళ్ళు తనకు పినతల్లులే అయితేనేంగాక, పరాయివాళ్ళ కన్న కూడా తనకు దూరమే.

1. తిలక్ స్వరాజ్యనిధి : గాంధీజీ జాతీయోద్యమ కార్యక్రమంగా ముందుంచిన సహాయ నిరాకరణోద్యమంలో భాగంగా కోటి రూపాయల తిలక్ నిధి వసూలుకు నాగపూరు కాంగ్రెసు (1920) పిలుపు నిచ్చింది.

తన జీవితం తన భర్త జీవితంకన్న హీనంగా ఉన్నదా? దేవుడే చెబితే మాత్రం ఆ మాట ఎట్లా నమ్మటం? తన తప్పేదన్నా ఉంటే, అది తన భర్త కుళ్ళు జీవితం అడుగున తానుకూడా కుళ్ళకపోవటమే అవాలి.

కాకపోయినా ఇతరు లనేమాటలను తన జీవిత సమస్యలకింద పరిగణించ కుండా ఉండటం పార్వతి ఏనాడో నేర్చుకున్నది. ఇతరులు తనను ఉద్ధరించరు; ఉద్ధరించనవసరం కూడా లేదు. పెళ్ళి అయి అత్తవారింటికి వెళ్ళాక తనకు చిన్న రాణీలాగా జరిగింది. ఇవాళ ఆ పరిస్థితి పోయింది- ఆ రాణీతనపు నిబ్బరమూ, నిక్కూ, ఆమెలో కొంతవరకు దిగబడిపోయాయి. ఆర్థికంగా తను ఈ అందరి కన్నా మంచి స్థితిలోనే ఉన్నది. తనకు వీసమెత్తు ఉపకారం చెయ్యనివాళ్ళూ, తనను ఆడిపోస్తూనే సిగ్గులేకుండా తన సహాయం పొందేవాళ్ళూ తనను మెచ్చుకో గలందు లకు తాను సాము గరిడీలు చెయ్యవలసిన అవసరమేమిటి?

అదీగాక తనకు తన సమస్యలుండనే ఉన్నాయి. ఒకనాడు నారాయణ జ్వరంతో తూలుతూ ఇంటికొచ్చి స్కూలు బట్టలు విప్పకుండా పడుకున్నాడు. ఒళ్ళు ముట్టుకుచూస్తే వేడి పేల్చేస్తున్నది. పార్వతి స్వయంగా వెళ్ళి నాటు వైద్యుణ్ణి పిలుచుకువచ్చింది. ఆయన కస్తూరిమాత్రలు కాబోలు వేశాడు. జ్వరం తగ్గలేదు. జ్వరంతో పడివున్న నారాయణకు ఏ బాధా లేకపోయినా, పార్వతి నాలుగురోజుల పాటు మానసికంగా యమబాధ అనుభవించింది. ఆమెకు తిండి లేదు. నిద్ర లేదు. తన ఆయుర్దాయం తన కొడుక్కియ్యమని దేవుడికి వందసార్లు దణ్ణాలు పెట్టుకున్నది.

అయిదోరోజు నారాయణ ఒంటినిండా పొక్కులు చూపాయి. మశూచిక మేమోనని భయపడింది. మాలక్ష్మమ్మగారు వచ్చి చూచి, "ఇది అమ్మవారు కాదమ్మా, చిన్న అమ్మవారు–తడపర." అనేసరికి పార్వతికి సగం ప్రాణం లేచి వచ్చింది.

"అయితేం? అమ్మవారు వచ్చినదానికన్నా చాలా జాగ్రత్తగా ఉండాలి! ముఖ్యంగా పొంగు జారాక చాలా కఠిన పథ్యం చెయ్యాలి" అన్నది మాలక్ష్మమ్మ. అయినా పార్వతి భయపడలేదు.

పొంగు కనిపించి మూడో రోజుకే అణిగిపోయింది.

"పొంగు జారిపోయింది. నీళ్ళు పోసెయ్యొచ్చు" అన్నది మాలక్ష్మమ్మ.

"జ్వరం ఇంకా ఉన్నదండీ!" అన్నది పార్వతి.

"జ్వరందేముంది? అదే తగ్గిపోతుంది" అన్నది మాలక్ష్మమ్మ.

పార్వతి అనుమానిస్తూనే నారాయణకు నీళ్ళు పోసేసింది. ఆ తరువాత వాడి పరిస్థితి మరింత హీనమైనట్టు కనబడింది.

పార్వతి భయం మళ్ళీ ఎక్కింది. ఆమె నాటువైద్యుణ్ణి పిలుచుకువచ్చింది. నాటువైద్యుడు వచ్చి, "వాతప్రకోపం! వేడికి పెట్టాలె!" అన్నాడు.

ఆసలే జ్వరంగా ఉంటే వేడికి పెట్టాలంటారేమిటని పార్వతికి అనుమానం వేసింది. ఇంకో వైద్యుణ్ని పిలిస్తే బాగుండును. పక్కవీధిలోనే ఒక కాంపౌండరు వైద్యుడున్నాడు. శివరావుగారు ఆయన్ని పిలుచుకొచ్చాడు. ఆ వైద్యుడు వచ్చి, నారాయణను చూసి, జరిగినది విని, పార్వతిని నానా చీవాట్లూ పెట్టాడు.

"పొక్కులన్నీ మాడి అలా నల్లబడిపోతే పొంగు జారిందని ఎలా అనుకున్నారమ్మా! పైన స్నానం కూడా చేయించారా? చిన్న రోగాలకూ, పెద్దరోగాలకూ అన్నిటికీ మీరే వైద్యులయితే, మేమంతా కష్టపడి వైద్యం నేర్చుకునేదెందుకు? ఈ స్టెతోస్కోపులు మెళ్ళో వేసుకుతిరిగే దెందుకు?" అంటూ చాలాసేపు లెక్చరు దంచాడు.

డాక్టరు తిట్టినకొద్దీ పార్వతికి ధైర్యం వచ్చింది. తన కొడుకును బతికించ గలడు గనకనే అన్ని మాట లంటున్నాడు.

శివరావుగారే డాక్టరువెంట వెళ్ళి సీసాలో మిక్శ్చర్ తెచ్చాడు. మొత్తంమీద దాంతోనే నారాయణ బయటపడ్డాడు. తరవాత వాడు నెలరోజులపాటు నేతిచుక్క కూడా లేకుండా పాత ఉసిరికాయ పచ్చడి అన్నం తిని, ప్రపంచంలో ఉసిరికాయ పచ్చడంత రుచికరమైన పదార్థం మరొకటి లేదనుకున్నాడు. నారాయణ ఏనాడూ తిండిపుష్టి గలవాడు కాడు కాని ఆ ఉసిరికాయ పచ్చడితో వాడు ఆవురావురని పెద్ద పెద్ద వాయలు కలిపి తినేస్తుంటే పార్వతికి ఎంతో ఆనందం కలిగి తానే చచ్చిబతికా ననుకున్నది.

* * * *

ఇరుకు కొట్లాలాంటి బతుకులు బతికే ఆడవాళ్ళకు బయట ప్రపంచం గురించి ఏమన్నా తెలియాలంటే తమలోతాము గాలి కబుర్లూ నిజమైన కబుర్లూ చెప్పుకోవటం తప్ప మరో మార్గంలేదు. శివరావుగారింటికి ఆంధ్రపత్రిక[1] వస్తుంది. కాని ఆడవాళ్ళు పత్రికలు చదివే అలవాటు లేదు. మగవాళ్ళు ఏదన్నా చదివి వినిపిస్తే వినొచ్చు.

కొంతమంది ఆడవాళ్ళలాగా బయటపడేది కాదుగాని, పార్వతికి కూడా కబుర్లు వినటం సరదాగానే ఉండేది. మనుషుల మంచి చెడ్డలను గురించీ కష్టసుఖాలను గురించీ నిర్లిప్తంగా తెలుసుకోవాలంటే కథలైనా చదవాలి. కబుర్లయినా వినాలి. "భక్త విజయం" తప్ప పార్వతికి కథలపుస్తక మేదీ దొరకలేదు. అందులో కథలైనా కబుర్లంత వాస్తవంగా లేవు. అందరు భక్తులూ మహత్తుగలవాళ్ళే. పురాణాలైనా అంతే. భాగవతంలో కృష్ణుడు చూడరాదా? దేవుడు కాకపోతే ఎవరో ఒకరు చావ

---

1. ఆంధ్రపత్రిక : 1908 లో కాశీనాథుని నాగేశ్వరరావు (1876 - 1938) స్థాపించిన దినపత్రిక.

చితకతన్నేసి ఉండేవాళ్ళు. అటువంటి కథలు కబుర్ల స్థానం ఎల్లా ఆక్రమించుకునేట్టు?

ఫలానివారి కోడలు రంకు మరిగింది. పట్టుబడినప్పుడల్లా చావగొట్టేవాళ్ళు. ఒకసారికాదు, రెండుసార్లుకాదు, నెలకు ఒకటి రెండుసార్లు వాళ్ళింట ఈ రభస ఉండనే ఉండేది. చుట్టుపక్కలవాళ్ళు వినోదంగా చెప్పుకునేవారు.

పార్వతికి ఈ ఏర్పాటు అర్థం కాలేదు. అది మొగుడితో సరిగా ఉండలేక పోతే ఏ మిండగాడితోనైనా ఎందుకు లేచిపోదు? దానికి దెబ్బలు లక్ష్యంలేదని రుజువైనాక కూడా వదిలేసి ఊరుకోక ఎందుకు చావగొడతారు? ఈ ప్రశ్నలకు సమాధానం పార్వతి ఎరగదుగానీ, అటువంటి సమాధానం లేకపోలేదు. అది మిండగాడితో ఎందుకు లేచిపోదంటే తనకింత పిండాకూడు పెట్టే మిండగాడు లేడుగనక. వాళ్ళు దాన్ని మళ్ళీ మళ్ళీ ఎందుకు కొడతారంటే దాని బుద్ధి మార్చటానికికాదు, తమ పరువు నిలబెట్టుకునేటందుకు. ఎందుకు ఇంట్లో నుంచి దాన్ని గెంటెయ్యరంటే, అది ఇంటెడు చాకిరీ గొడ్డులాగా చేస్తుందిగనక!

ఇంకెవరి ఇంట్లోనో ఆడపెత్తనం. ఇంటివద్ద తన కొడుకునూ కోడలినీ సంసార సుఖం అనుభవించనివ్వదు. కారణం తెలీదు. కొడుకూ కోడలు ఏదన్నా మాట్లాడుకోవాలంటే చాలా రహస్యంగా, తప్పు చేస్తున్న వాళ్ళలాగా మాట్లాడుకోవాలి. ఆవిడ చూసిందంటే ఇద్దర్నీ సాయంత్రందాకా శాపనార్థాలు పెడుతూనే ఉంటుంది. కొడుకేమీ మాట్లాడ్డు. తన సంపాదన డబ్బులు తెచ్చి తల్లి చేతుల్లో పోస్తాడు. తనకు కానీ కావాలంటే తల్లినడిగి, ఆవిడ సమ్మతిమీద యిస్తే తీసుకుంటాడు—లేకపోతే ఆ కానీఖర్చు మానుకుంటాడు.

మనుషుల్లో ఇటువంటి రకాలను చూస్తుంటే పార్వతికి ఆశ్చర్యంగా వుండేది. తాను కూడా అట్లాగే ప్రవర్తిస్తానేమోనని తోచినప్పుడు భయంవేసేది. కొడుకుమీదా, ఇంటిమీదా, ఇంత అధికారం చలాయించే వితంతువు ఆస్తిపరురాలని పార్వతికి తెలుసుగాని ఆస్తి ఉండటానికి, ఆవిడ ప్రవర్తనకూ సంబంధం వున్నదని పార్వతి ఎరుగదు. సంఘంలో ఆడది హీనంగా ఉండటానికి ప్రధాన కారణం ఆడదానికి ఆస్తిహక్కులు లేకపోవటమన్నది కూడా ఆమెకు తెలీదు. పైపెచ్చు పార్వతి ఆడవాళ్ళు మగవాళ్ళకు లోబడి ఉండాలన్న ప్రాథమిక సూత్రాన్ని ఏనాడూ శంకించలేదు- తాను తన భర్తకు లోబడి ఉండకపోయినానూ. పార్వతి ఏ సాహసం చేసినా తన కొడుకు కోసం చేసింది. తన కోసం కాదు. ఈనాడు స్త్రీలకు పురుషులతో సమంగా గౌరవమర్యాదలుండాలని వాదించే స్త్రీలకే, ఆ గౌరవమర్యాదలు ఆస్తిహక్కులతోగాని రావని స్పష్టంగా తెలియనప్పుడు, పార్వతికి తెలియనందునకు ఎట్లా తప్పుపట్టటం?

వాళ్ళను గురించీ వీళ్ళను గురించీ స్కాండల్స్ మాట్లాడుకోవటం ఒకఎత్తూ, మనవాళ్ళ మూలానే నలుగురి నోళ్ళా నానేపరిస్థితి ఏర్పడటం మరోఎత్తూనూ.

పార్వతి అన్నలు సహజీవనం చేసే పరిస్థితులు అకస్మాత్తుగా అంతమైపోయాయి. దక్షిణామూర్తి రెండో భార్య - ముక్కుపచ్చలింకా పూర్తిగా ఆరనిపిల్ల — కాపరానికి వచ్చిన నెలలోపలే కొంపలో ముసలం తెచ్చిపెట్టింది. ముందు ఆడవాళ్ళ మధ్య పోట్లాట సాగింది. అన్నదమ్ములు చీలి, ఎవరి కాపరాలు వారు వేరే పెట్టుకున్న తరవాత కూడా ఆ రంధి పూర్తిగా అణగలేదు.

నాగభూషణం పార్వతి దగ్గిరికి వచ్చి, "ఆడదాని మొగమే ఎరగనివాడల్లే మన దక్షాయి ఆ పెళ్ళాంచేతిలో కీలుబొమ్మ కావటం చూస్తే ఆశ్చర్యంగా ఉంది." అన్నాడు.

దక్షిణామూర్తి వచ్చి "ఎందుకో అందరూ చేరి దీనిమీద పట్టించారు. వీళ్ళ చూడబోతే ఒక్కొక్కరికీ దాని వయసుకు రెట్టింపుంది!" అన్నాడు.

వెంకాయమ్మ వచ్చి, "అది మీ దక్షిణామూర్తి అన్నయ్యను అప్పడం తిన్నట్టు తినేస్తుంది చూస్తూవుండు. నే నాయన్ని తప్పు పట్టను. అది జగజంత! అమ్మో! తలలు మార్చే శక్తి ఉంది దానికి! ఆడమాయలపకీరు! దాని ముందు మనం వట్టి వెర్రిబాగులవాళ్ళం. ఇక మీ దక్షిణామూర్తి అన్నయ్య మనవాడుకాడు. దాని వాడు. దాని తరుపువాళ్ళవాడు." అన్నది.

దక్షిణామూర్తి వేరే కాపరం పెడతాననటం వ్యవధిగా, పార్వతీశం కూడా తాసూ ఇదే అనుకుంటున్నా నన్నాడు. నాగభూషణమూ, వెంకట్రామయ్యా మాత్రం విడిపోలేదు.

ఈ కుటుంబం విచ్ఛేదం అయాక పార్వతి తన పెద్దన్నల ఇంటికి తరచు వెళ్ళి రాసాగింది. వాళ్ళుకూడా తరచు వస్తూ పోతూ ఉండసాగారు. ఈ రాకపోకలు పార్వతికి మనశ్శాంతి నిచ్చాయి.

ఆ యేడే నారాయణ ఫస్టుఫారం పూర్తిచేసి, పరీక్షలు ముగిసినాక, వేసవి సెలవులకు పార్వతినీ, నారాయణనూ వెంకటేశ్వర్లు బెజవాడ తీసుకుపోయాడు. అతనూ మామగారూ ఒక యింట్లోనే ఉంటున్నారుగాని వేరే వేరే భాగాలలో ఉంటున్నారు.

వెంకటేశ్వర్లు భార్య లక్ష్మి కాపరానికి వచ్చినదాకా చదువుతూనే ఉన్నది. ఆమె రోజూ ఆంధ్రపత్రిక చదివేది. ఆమె దగ్గిర చాలా తెలుగు పుస్తకాలుండేవి- కందుకూరి వీరేశలింగం పంతులు[1] గారివీ, పానుగంటివారి "సాక్షి"[2], చిలకమర్తి[3]

---

1. కంధుకూరి వీరేశలింగం (1848-1919) : తెలుగు సంస్కారం ఆధునిక యుగంలో అడుగుపెట్టడానికి, తెలుగు సాహిత్యంలో కొన్ని ఆధునిక ప్రక్రియలు ఆవిర్భవించడానికి దోహదం చేసిన సంస్కర్త, పాత్రికేయుడు, రచయిత. ఆంధ్రజాతి పునర్వికాస పిత. తెలుగులో మొట్టమొదటి సాంఘిక

వారి ప్రహసనాలూ, నవలలూ, ఇంకేవో వుండేవి.

"ఎన్ని పనులున్నా నాకు ఓ గంటసేపన్నా ఏదో ఒకటి చదవకపోతే తోచదు వదినా" అన్నది లక్ష్మి. ఆమె ఇప్పుడు "స్వరాజ్యలక్ష్మి" అని సంతకం చేస్తున్నది.

మొత్తం మీద ఇంటి వాతావరణమంతా గాంధీ ఉద్యమ ప్రభావంతో నిండి వున్నది. పక్కదుప్పట్లనుంచీ అంతా ఖద్దరే. గాంధీపటం ఒకటి వున్నది. నెత్తిన తెల్లగుడ్డ ఒకటి పెట్టుకుని గాంధీ ఏదో బట్టలకొట్టువాడల్లే ఉన్నాడుగాని "మహాత్మ" ఉల్లే లేదు. కాని ఆయన్ను అందరూ గాంధీమహాత్ము డంటున్నారు.

లక్ష్మి చదివే పుస్తకాలూ, అవలంబించే రాజకీయాలూ పార్వతికి పట్టలేదు గాని, ఇల్లు పెట్టుకునే పద్ధతి బాగా నచ్చింది.

లక్ష్మికిప్పు డిద్దరు పిల్లలు. పెద్దవాడికి అయిదోయేడు. పిల్లకు రెండోయేడు ప్రవేశించింది. పిల్లలను గురించి లక్ష్మి ఎక్కువ పట్టించుకున్నట్టు కనబడలేదు. పిల్లవాడు పొద్దుటిపూట తన నోరు తానే కడుక్కుంటాడు. (పార్వతి నారాయణకు ఏడాది కిందటిదాకా పళ్ళు తోమేది.)

"పసివాడికి పళ్ళుతోముకోవటం చాతవుతుందా?" అన్నది పార్వతి.

"చాతకాకపోతే నేర్చుకుంటాడు. ఇప్పుడేం? ఏడాదినుంచీ వాడే పళ్ళుతోము కుంటున్నాడు. స్నానం చేసేటప్పుడు వాడే ఒళ్ళు తోముకుంటున్నాడు. వాడిబట్టలు వాడే వేసుకుంటున్నాడు. కొంతకాలంపాటు పైనించి కనిపెట్టి చూసేదాన్ని. వాడికి చాతయిందని నమ్మకం కుదిరాక చూడటం కూడా మానేశాను" అన్నది లక్ష్మి.

పార్వతి తృప్తిపడలేదు. లక్ష్మికి నిర్లక్ష్యమో, ఒళ్ళు బరువో అయివుండాలను కున్నది. ఒళ్ళు బరువు మనిషి లక్షణాలేవీ లేవుమరి; నిర్లక్ష్యమే కావాలి.

---

నవల "రాజశేఖర చరిత్ర" (1878) రచయిత.

2. సాక్షి : ప్రఖ్యాత నాటకకర్త, కవి, రచయిత పానుగంటి లక్ష్మీనరసింహా రావు (1865-1940) స్పెక్టేటర్ ప్రేరణతో రాసిన ఆరు సంపుటాల వ్యాసాలు. చలోక్తులతో, చమత్కారాలతో, ఉపమానాలతో, వ్యంగ్యంతో సమకాలిక జీవితంపై విసిరిన విసుర్లతో నిండిన వ్యాసాలు. సాక్షి వ్యాసాల్లో జంఘాల శాస్త్రి అపూర్వ పాత్ర.

3. చిలకమర్తి లక్ష్మీనరసింహం (1867–1946) : అనేక ప్రహసనాలూ, నాటకాలూ, నవలలు, జీవిత చరిత్రలు రాశారు. వీటిలో 'గణపతి' నవలా, 'గయోపాఖ్యానం' నాటకమూ సుప్రసిద్ధాలు. బ్రహ్మసమాజం, హితకారిణీ సమాజాలలో వుండి సాంఘిక సేవలు నిర్వర్తించారు.

ఎండలు ముదురుతున్న కొద్దీ బెజవాడ దుర్భరమవుతున్నది. అయినా పార్వతికి అక్కడి నుంచి కదలబుద్ధికాలేదు. నారాయణకు ఎండ అంటే ఏమిటో కూడా తెలిసినట్టులేదు.

తలవని తలంపుగా ఒకనాడు సోమన్న వచ్చాడు.

"మీ ఊరెళ్ళి, ఇక్కడ ఉన్నారంటే వస్తున్నా. కొంపమీది కొచ్చింది. కాంతయ్య కిందటి శనివారం ఎవరినో తెచ్చి తోటంతా చూపించాడు. ఆయన వాలకం చూస్తే దాన్ని అమ్మేసేట్టున్నది. ఈ మాట చెప్పటానికే వచ్చాను" అన్నాడతను.

"ఎట్లా అమ్ముతారు? అది పిల్లవాడి వంతు వచ్చిందిగా!" అన్నది పార్వతి.

"అవతల పెద్దమనిషి కొనేవాళ్ళు నమ్మేస్తారు. పొలాలకు చూసినట్టు దస్తావేజులు చూస్తారా ఏమన్నా? కొనేస్తారు. ఆ తరవాత మనం కోర్టుకెళ్ళాలి. చేతులు కాలాక ఆకులు పట్టుకోవటమే ననుకో" అన్నాడు సోమన్న.

పార్వతికి విరక్తి, ఏసుగూ కలిగాయి.

"ఏమన్నా చేసుకోని! కావలిస్తే అమ్ముకోమను! వెధవ తోట! ఆ మామిడి పళ్ళతోనే బతికిపోతామా" అన్నదామె.

సోమన్న కళ్ళు పెద్దవి చేశాడు.

"అమ్మా, తల్లీ! ఆ మాట అనకు! ఆ తోటలో నేను గూడు కట్టుకుని ఇన్నాళ్ళూ హాయిగా ఉంటున్నాను. ఆ తోటకు నేను ఎంతో సేవ చేశాను. ఖాళీల్లో కూరా, నారా పెంచుతున్నాను. ఆ తోటకాస్తా మీ చేతిలోనుంచి పోయిందో నేను దిక్కులేని పక్షినైపోతాను. మీ అన్నగారున్నారుగా! ఒక నోటీసు తగిలిస్తే కొన వచ్చినవాళ్లు సంశేపించుకుంటారు" అన్నాడు సోమన్న.

తోట పోవటానికైనా సిద్ధపడిన పార్వతి సోమన్న ఆవేదనకు కరిగి నీరై పోయింది. సోమన్న నోటీసియ్యమన్నాడు. కాని కొనేవాళ్ళెవరో తెలీదు. ఇస్తే కాంతయ్య కివ్వాలి-తోటను అమ్మజూపుతున్నావుట. నీకు అమ్మే హక్కులేదు అని.

అంతకన్న భర్తకు ఉత్తరమే రాయించటం మంచిదనుకున్నది పార్వతి.

"చిన్నన్నయ్యా! మా ఆయనకొక ఉత్తరం రాయి. ఆయన తోట అమ్మే ప్రయత్నంలో ఉన్నాట్ట. అటువంటి హీనమైన పనులు చెయ్యవద్దను. డబ్బు కావలిస్తే ఉన్నంతలో నేనే ఇస్తానని చెప్పు. ఎంత డబ్బూ చాలని మనిషికి డబ్బంటే ఎంత ఈసడింపు!" అన్నది పార్వతి వెంకటేశ్వర్లుతో.

"నువ్వెందుకు డబ్బివ్వటం? నీకేమైనా మతిపోయిందా ఏం?" అన్నాడు వెంకటేశ్వర్లు.

"ఆయనకు అట్లాగైనా బుద్ధివస్తుందేమోననీ!" అన్నది పార్వతి, ఏమనటానికి తోచక.

నిజానికి పార్వతి తన భర్తమీద ఈ ఒక్క విజయం సాధించాలని మహా ఆరాటపడుతున్నది. తన భర్త ఆస్తి అంతా క్షవరం కావాలనీ, అతను మార్గాంతరం లేక తన పంచ చేరాలనీ, మరో మనిషి అయి అతను తనతో అందరిలాగా కాపరం చెయ్యాలనీ ఆమె చాలా కలలుకన్నది.

కాని కాంతయ్య తత్వం పార్వతికి పూర్తిగా తెలీదు. అతనిలో చాలా అతిశయం ఉన్నది. అది ఆత్మగౌరవం కూడా కాదు. పచ్చి దురభిమానం. అతను పూర్తిగా నీచుడనడానికిగూడా లేదు. అయితే తన భార్య విషయంలో ఎంత నైచ్యానికైనా పాల్పడగలడు; అతని అంతరాత్మ అడ్డురాదు.

వెంకటేశ్వర్లు కాంతయ్యకు ఉత్తరం రాశాడు. కాని పార్వతి రాయమన్నట్టు రాయలేదు; "మీరు డబ్బు ఇబ్బందిలో ఉన్నారని తెలిసింది. మీ ఆస్తి అమ్మజూపుతున్నట్టు వినికిడి. మరొకరికీ మరొకరికీ అమ్మేబదులు, ఏదోకాడికి మీ అబ్బాయికే అమ్మినట్టయితే ఆస్తి ఆస్తిలోనే ఉన్నట్టవుతుంది"- ఈ ధోరణిలో రాశాడు.

ఈ ఉత్తరానికి సమాధానం వస్తుందని వెంకటేశ్వర్లు అనుకోలేదు. రాలేదు కూడా. ఉత్తరం మహిమ అవునో కాదోగాని, తోట అమ్మటం మట్టుకు జరగలేదు. తన భర్త ఏ రోజున ఏ ఎత్తు వేస్తాడోనని పార్వతికి పీచు పీచుమంటున్నది.

"నేను చెప్పినట్టుగా ఆయనకు రాశావా ? జవాబేమైనా వచ్చిందా?" అని ఆమె వెంకటేశ్వర్లును రెండుమూడుసార్లు అడిగింది.

ఒకరోజు మధ్యాహ్నం ఎండ మరీ జాస్తిగా ఉండి పార్వతి విసురుకుంటూ పడుకుని స్వల్పంగా మగతలో పడింది. దాన్ని నిద్ర అనటానిక్కూడా లేదు. అన్ని చప్పుళ్ళూ వినిపిస్తూనే ఉన్నాయి. విసనకర్ర పట్టుకున్న చెయ్యి ఆడుతూనే ఉన్నది. తన భర్త గబగబా లోపలికి రావటం ఆమెకు కనిపించింది. చప్పున కళ్ళు తెరిచి, పార్వతి లేచి కూర్చున్నది. ఎవరూ లేరు.

ఆ రాత్రి ఎనిమిదీ తొమ్మిదీ మధ్య గుంటూరులో కాంతయ్య పోయాడు.

ఈ వార్త మర్నాడు సాయంకాలందాకా పార్వతికి తెలియనేలేదు. తెలియగానే వెంకటేశ్వర్లు పార్వతినీ, నారాయణనూ వెంటబెట్టుకుని రైల్లో గుంటూరు వెళ్ళాడు. అప్పటికి అంతా అయిపోయింది.

రెండోసారి వితంతువయిన కాంతయ్య రెండోభార్య వీళ్ళతో మాట్లాడను కూడా లేదు. ఆమె నిస్సహాయురాలుగా ఉన్నట్లు కనబడలేదు. వెంకటేశ్వర్లూ, పార్వతీ, నారాయణా తిరుగుబండికి బెజవాడ వచ్చేశారు.

భర్త పోయినందుకు పార్వతి గుండె బాగా బరువెక్కిపోయినమాట నిజమే గాని, ఆమె అందరూ చూసేటట్టుగా ఏడవలేదు. ఎవరూ చూడకుండా రాత్రివేళ చాలాసార్లు ఏడ్చిందిగాని, అది భర్తపోయాడని కాదు. అతి హేయమైన వైధవ్యం తన క్కూడా సంప్రాప్తమయిందని.

చచ్చిపోయినవాడికి కర్మ చెయ్యాలి. నారాయణమీద కర్తృత్వంవేసి, ఎవరో ఒకరిచేత కర్మ చేయిస్తానన్నాడు వెంకటేశ్వర్లు — పార్వతి కోరితే. "నా మటుకు నాకు వీటిలో నమ్మకం లేదు. ఇదంతా బ్రాహ్మల బతుకుతెరువు" అన్నా డతను.

పార్వతి ఏమనటానికీ తోచలేదు. ఆమెకు ఇటువంటి కర్మకాండలో పూర్తి విశ్వాసం ఉన్నది. కాకపోయినా ఇప్పటికే లోకం దృష్టిలో తాను భర్త పట్ల చాలా అపచారం చేసిఉన్నది. కర్మచెయ్యకా, తద్దినాలు పెట్టకా ఊరుకుంటే ఇది మరింత తీరని అపచారమవుతుంది.

"కర్మచేస్తేనే బాగుంటుందేమో!" అన్నదామె.

మొత్తానికి కర్మ జరిగింది. కాంతయ్య తండ్రి తాతలు పిండాలు తిని ఎంత కాలమయిందో తెలీదు. కాంతయ్య తద్దినాలు పెట్టినట్టులేదు. కాని ఇప్పుడు కాంతయ్యతో బాటు అతని పితృ పితామహ ప్రపితామహులకు పిండాలు ముట్టాయి.

పార్వతికి పట్టుకున్నది తద్దినాలూ, అపకర్మలూ కావు. తనకూ, తన భర్తకూ మధ్య తేల్చుకోవలసినది బోలెడంత ఉన్నది. తమలాగా దాంపత్యం గడిపినవాళ్ళ మధ్య పెరిగిన దస్తరం ఏ ఒకరి చావుతోనో గంగపాలవుతుందా? ఎంత అన్యాయం. ఈ చచ్చిపోయినవాడి ఆత్మ ఎన్నింటికో సంజాయిషీ చెప్పుకోవలసి ఉంది. ఇప్పుడా సంజాయిషీ ఎవరిస్తారు? తాను మొగుడున్న వితంతువులాగా ఎందుకు జీవించవలసి వచ్చిందో, తాను చేసిన ఏ మహాపాపానికిది శిక్షో ఎవరు చెబుతారు?

తన అత్తగారిలాగే పార్వతికూడా ముండనం చేయించుకోవటానికి నిరాకరించింది. అందువల్ల తన అందానికి లోటవుతుందని కాదు; నారాయణ ప్రాణం విలవిలలాడుతుందని. తన తల్లి తండ్రి పోయిన పదో రోజున ముండనం చేయించుకుని ముసుగేసుకుంటే తమ ప్రాణాలు ఎట్లాకొట్టుకుపోయాయో పార్వతి అన్నలు చాలా సార్లు చెప్పారు.

కాంతయ్య ఆస్తిని గురించి కూడా పెద్ద సమస్య ఏమీ మిగలలేదు. అతను తన ఆస్తి అంతా అదివరకే అమ్మేశాడు. ఇల్లు అమ్మలేదుగాని తాకట్టుపెట్టి అప్పు చేశాడు.

తన భర్తకు పార్వతి శాస్త్రోక్తంగా మాసికాలూ, తద్దినాలూ పెడుతూ వచ్చింది.

కొంతసేపు అతి వేగంగా పరిగెత్తిన కాలం మళ్ళీ మామూలు నడక ప్రారంభించింది.

# మూడవ భాగం

నారాయణ హైస్కూలు చదువు పూర్తిచేసి కాలేజీ ప్రవేశిస్తూనే పెద్ద వాడయాడు. మొదటి సంగతి, బాగా పొడుగెదిగాడు. రెండో సంగతి వాడికి అనేక జీవిత విషయాలను గురించి స్వతంత్రంగా ఆలోచించాలన్న తహతహ నానాటికీ జాస్తి అవుతున్నది.

జీవితం రహదారి ప్రయాణం కాదు—అనేక లక్షలమందిరో ఏ ఒకడికో తప్ప నారాయణవంటి వాడికి అవి కాస్త విశాలమైన కాలిబాట లనుకోవచ్చు. పొయ్యే దారిలో నుంచి అనేక ఇతర బాటలు చీలిపోతుంటాయి. కాని వాటి అన్నిటి వెంబడి పోవటం ఎవరికీ సాధ్యం కాదు. పరిస్థితులు అనుకూలించక కొన్ని పెద్ద పెద్ద చీలుడుదార్లనే విసర్జించవలసివస్తుంది. ("అవి మనబోటివాళ్ళకు కాదు") అయితే ప్రతి మధ్యతరగతివాడూ—ముఖ్యంగా తన భవిష్యత్తును తాను వెతుక్కుంటున్నా నను కునేవాడు—ఎప్పటికైనా ఓ చిన్న రహదారిని పట్టుకుంటాననే ఆశతోనే ముందుకు సాగుతాడు. శ్రమజీవులు యిరుకుదారుల్లోనుంచి ఏనాటికీ బయటపడలేరు. వారు కష్టజీవిత ప్రయాణానికి తల ఒగ్గేసి ఊరుకుంటారు.

నారాయణ తాను వదిలేసిన దారులు ఎరుగును. చిన్నప్పుడు తన జీవితంలో సంగీతానికి పెద్దపీట వెయ్యాలనుకున్నాడు. కాని ఆ ఆలోచన దక్కలేదు. "అమ్మా నేనుకూడా ఫిడేలు వాయించడం నేర్చుకోనా?" అని నారాయణ ఒకసారి అంటే, "ఇంకా నయం!" అని ఒక్కముక్కలో కొట్టిపారేసింది. కనీసం పాడటమైనా అభ్యాసం చేద్దామనుకున్నాడు. అది మాత్రం నేర్చుకోకుండా ఎట్లా వస్తుంది?

ఫోర్తుఫారం చదివేటప్పుడు నారాయణకు కవిత్వంలో ఆసక్తి పుట్టింది. వాడి స్నేహితుల్లో ఒకడు కవికొడుకు; వాళ్ళ నాన్న రాసిన పద్యాలు భారతి[1]లో పడ్డాయి. ఆయన కుర్రవాళ్ళను కవిత్వం రాయమని ప్రోత్సహిస్తూండేవాడు. తిరుపతి వెంకట కవులను[2] గురించి, వాళ్ళ అవధానాలను గురించీ ఆయన తెగ చెప్పేవాడు. సమస్యా పూరణం చాలా గమ్మత్తుగా వుండేది నారాయణకు. "గరుడుడు గణపతికి తండ్రి కావలెనుమ్మా", "మంచాలన్ బిగియించె గుంజలకు అమ్మా బిందియన్

1. భారతి : 1924లో కాశీనాధుని నాగేశ్వరరావు స్థాపించిన సాహిత్య మాస పత్రిక.
2. తిరుపతి వెంకట కవులు : జంటకవులు. దివాకర్ల తిరుపతిశాస్త్రి (1872-1920), చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి (1870 - 1950) పద్యశిల్పాన్ని ప్రజాస్వామికం చేయడానికి ప్రయత్నించిన అవధానులు, శతాధిక గ్రంథ కర్తలు, కవులు, నాటక కర్తలు, అనువాదకులు, నవ్య సంప్రదాయ వాదులకు మూలపురుషులు.

తేగదే", "కాకరపూవులు పూచి నిమ్మకాయలు కాచున్." ఇటువంటి సమస్యలు కవులు తెలివిగా పూరించారు. పూర్వకాలంలో కూడా సమస్యాపూరణం ఉండేదిట. "కుంజరయూధంబు దోమకుత్తుక జొచ్చెన్", "రవి గాంచనిచో కవిగాంచునేకదా" మొదలైన సమస్యలు కృష్ణదేవరాయలు కాలానివట.

ఈ కవిగారి ఇంటికి వెళుతూ వస్తూఉండిన కాలంలో అనేక డజన్ల చాటువులూ, పద్యాలూ, శ్లోకాలూ....నారాయణ కంఠస్థమైనాయి. ఒకసారి అర్థం తెలిస్తే సంస్కృత శ్లోకాలెంత బాగుండేవి!

నారాయణ సులక్షణసారం[1] కొనుక్కొచ్చి, "యమాతారాజభానస" మర్మం తెలుసుకుని, సూర్యగణాలూ, ఇంద్రగణాలూ అర్థం చేసుకుని, పద్యాలు రాయటానికి ప్రయత్నించిన రోజులున్నాయి.

కాని తన కవిత్వం సంగతి తెలిసి వెంకటేశ్వర్లు మామయ్య నవ్వేశాడు.

"కవిత్వమంటే చందస్సుట్రా? పిచ్చివాడా? ఇట్లా యెన్ని పద్యాలురాస్తే ఒక యెంకిపాట[2] కాను? పాతపద్ధతిలో చూసినా సత్య హరిశ్చంద్రీయం[3] పద్యాలు చూడు; అందులో కవిత్వం ఉంది. పానుగంటివారి[4] పద్యాలు చూడు; వాటిల్లో చందస్సేఉంది, కవిత్వం లేదు. గణాలూ యతిప్రాసలూ ఉన్నంత మాత్రాన కవిత్వం కాదు. కాకపోయినా కుర్రకుంకవు. నీ కప్పుడే కవిహృదయం ఎక్కణ్నుంచి వస్తుంది? పిచ్చిపిచ్చి వేషాలకుపోక, క్లాసులో బాగా మార్కులు తెచ్చుకో!" అన్నాడు మామయ్య. అంతే! ఆ రాస్తా బందయిపోయింది.

"వీడు పాఠాలు చదవటంమాని పద్యాలు రాస్తున్నాడూ? ఇంకా నయం నాకు తెలిస్తే నేను చివాట్లు పెట్టి వుండేదాన్ని" అంటూ అమ్మ పెట్టవలసిన చివాట్లన్నీ పెట్టింది. పద్యాలు రాసుకునేవాళ్ళు అడుక్కుతింటారన్నది. (ఆ సంగతి ఆమెకెట్లా తెలిసిందో నారాయణకు ఎన్నటికీ అంతుచిక్కలేదు.)

తరవాత నారాయణకు పట్టుకున్నది స్పోర్ట్సు పిచ్చి. క్లబ్బులో టెన్నిస్ ఫ్రండ్లీ మాచ్ జరుగుతున్నదంటే ఒకనాడు స్కూలునుంచి అటేవెళ్ళాడు. నారు

1. సులక్షణసారం : వెల్లంకి తాతంభట్టు రాసిన ఛందోలక్షణ గ్రంథం (సుమారు క్రి. శ. 1600.)
2. ఎంకిపాట : నండూరి వెంకట సుబ్బారావు (1884-1957) వర్గ మాండలికంలో రాసిన పాటలు. ప్రథమముద్రణ 1925 యెంకిపాటలు కాల్పనికావేశానికీ, భావుకతకూ పెట్టినపేరు.
3. సత్యహరిశ్చంద్రీయం : ఎంతో ప్రజాదరణ పొందిన బలిజేపల్లి లక్ష్మీకాంత కవి (1881-1953) రాశిన నాటకం. 1912 లో వెలువడింది.
4. పానుగంటి పద్యాలు : చూడు పుట. 74

మంచి నారాయణమూర్తి, రామస్వామి సింగిల్స్ ఆడారు. నారుమంచి ఆటచూస్తూంటే ఏదో పాట కచేరీలాగుంది - ఆ స్టయిలు మరెవరికీ రాదు.

"నారుమంచి గవర్నరు విల్లింగ్డన్ కోర్టులో ఆడేవాట్ట?" అన్నాడు పక్కనున్న క్లాస్‌మేట్.

రామస్వామి స్ట్రోక్ చాలా పవర్‌ఫుల్. కాని బద్ధకస్తుడులాగా కనబడ్డాడు. పరిగెత్తవలసివస్తే, "గుడ్‌బాల్" అని అవతలివాడికి పాయింటిచ్చేసేవాడు.

ఈ ఆట చూసినప్పటినుంచీ నారాయణకు టెన్నిస్ ఛాంపియన్ కావాలని! కాని ఎట్లా? రాకెట్ కొనటానికైనా అమ్మ డబ్బివ్వదు. తెలిసికూడా అడిగి చూశాడు. అనుకున్నంతా అయ్యింది.

"పిటీ" ఏమిటంటే తాను చెయ్యలేకుండా వున్న పనులన్నీ తనబోటివాళ్ళు చేసేస్తున్నారు. కేశవరావు టెన్నిస్ ఆడతాడు. నారాయణ వాళ్ళింటికెళ్ళి కేశవరావు రాకెట్ తీసుకొని, పాత టెన్నిస్ బంతిని గోడకేసి కొడుతూ ఆడుకునేవాడు.

అటు తరవాత నారాయణను ఆకర్షించినది నాటకాల్లో వేషం వెయ్యటం. వాడు స్కూల్ ఫైనల్ చదువుతుండగా ఫిఫ్తుఫారం క్లాసు టీచరుల్లో ఒకాయన పిల్లలచేత నాటకం ఆడించాడు. వీరేశలింగంగారి ప్రహసనం. అందులో నారాయణకు ఒక వేషం ఇచ్చారు-ఆడవేషం.

ఆ నాటకం ఆడాక ఊళ్ళోవున్న యంగ్‌మెన్స్ డ్రామెటిక్ కంపెనీవాళ్ళు నారాయణను తమ ట్రూపులో చేరమన్నారు. నారాయణే ఒప్పుకోలేదు. నాటకాలాడే వాళ్ళల్లో చిల్లరమూకమీద వాడికే అంత మంచి అభిప్రాయంలేదు. కాని నటించాలన్న తహతహ ఉన్నది. స్థానం నరసింహారావల్లేనో[1], బళ్ళారి రాఘవాచారల్లేనో[2], మాధవపెద్ది వెంకట్రామయ్యల్లేనో[3] పెద్ద నటుడనిపించుకుంటే కీర్తి వున్నదిగాని, లేకపోతే లేదు. నటించందే పేరురాదు. పేరువస్తేగాని నటుడు కావటానికి అమ్మగాని, మామయ్యలుగాని ఒప్పుకోరు.

---

1. స్థానం నరసింహారావు : (1902-1971) స్త్రీ పాత్రధారణకు పేరుపొందిన ప్రఖ్యాత రంగస్థల నటుడు. దాదాపు 42 సంవత్సరాలుపాటు 3000 సార్లు రంగస్థలంమీద స్త్రీ పాత్రలు ధరించారు.
2. బళ్లారి రాఘవాచార్యులు : (1880-1946) అగ్రశ్రేణికి చెందిన భారతీయ రంగస్థల నటుల్లో ఒకరు. ఆంగ్లనాటక రంగస్థలంమీద షేక్స్‌పియర్ నాటకాలాడి ప్రశంసలు పొందిన కళాకారుడు. బహుభాషావేత్త, రచయిత.
3. మాధవపెద్ది వెంకట్రామయ్య : ( ? — 1957) ప్రఖ్యాత రంగస్థల నటుడు. తెనాలి రామవిలాససభ నటుల్లో ఒకరు. టాకీల్లో కూడా నటించారు. మాగోఖలే, కొ.కులకు బంధువు.

ఈ విషయం ఒక క్లాసుమేటుతో నారాయణ చర్చించాడు - వాడు కాస్త తెలివిగానే చెప్పాడు - యింకెందుకూ పనికిరాని సజ్జు నాటకాలలో చేరి నటులకు అపఖ్యాతి తెచ్చారు. గుంటూరు ఫస్టు కంపెనీ[1] వున్నది. అందులో అందరూ చదువుకున్న వాళ్ళే మెంబర్లు-ఉద్యోగాలు చేసుకుంటున్నారు. నాటకాలు కూడా ఆడతారు. అందులో హరిప్రసాదరావు[2]గారున్నారు. ఆయనకు ఎంత పెద్ద పేరు. అల్లాగే యడవల్లి సూర్యనారాయణ[3]గారున్నారు. బాగా చదువుకున్నవాడు. పెద్ద పేరు. ఆయనను మెచ్చుకునేవాళ్ళలో పండితులు కూడ వున్నారు.

నారాయణ ఆలోచించాడు. తనకు అటువంటి నటుల జాబితాలో చేరే అవకాశం ఉంది. తనకు ఉద్యోగం చేస్తేగాని గడవదన్న సమస్యలేదు. చదువుకుంటున్నాడు. నటనమీద తన బుద్ధిని కేంద్రీకరించి, అవసరమైతే నటనమీద మంచి పుస్తకాలు చదివి నటుడిగా కొంత కీర్తి సంపాదించవచ్చు. కాని ఈమాట ఎవరు ఆమోదిస్తారు? అమ్మ కస్టిపేడు తీసుకుంటుంది. నారాయణ ఆ విషయం ఆలోచించటం మానేశాడు.

ఇలా పదహారేళ్ళు నిండకముందే చాలా జీవితమార్గాలను దారిలో విడిచిపుచ్చడం జరిగింది. తాను ప్రస్తుతం నడిచే మార్గం కన్న అవన్నీ కూడా విశాలమైనవి, రహదారికి చేర్చేవీనూ అన్నభావం నారాయణలోనుంచి పోలేదు. అలాంటప్పుడు ఎపడుగాని, "నా ఖర్మ!" అనుకోవటం తప్ప చెయ్యగలిగినదిలేదు.

ఇందువల్ల అప్పుడప్పుడూ కలుగుతూ వచ్చిన నిస్పృహలతో కొంతకాలం సతమతమై తరువాత రెండు నిట్టూర్పులు విడిచి ఊరుకున్నాడుగాని, ఒక్క విషయం వాణ్ణి విడవకుండా బాధించింది. అది స్వేచ్ఛా సమస్య. నారాయణ స్వేచ్ఛకు ప్రబల శత్రువు మరెవరో కాదు-పార్వతి. పిల్లినోట పడకుండా చిలకను పంజరంలో పెట్టినట్టుగా పార్వతి తన కొడుకును లోకస్పర్శతో చెడిపోయి, వాడి

1. గుంటూరు ఫస్టు కంపెనీ : 1882-1912 మధ్యకాలంలో ప్రశస్తి పొందిన గుంటూరు నాటకసమాజం.
2. హరిప్రసాదరావు : ( ? — 1936) కూచిపూడి భాగవతుల వంశానికి చెందిన ప్రఖ్యాత గాయకుడైన రంగస్థల నటుడు. గుంటూరు ఫస్టు కంపెనీ సంస్థాపకుల్లో ఒకరు.
3. యడవల్లి సూర్యనారాయణ : (1888-1939) 1912-1915 మధ్య ప్రశస్తి పొందిన గుంటూరు అమెచ్యూర్ డ్రమెటిక్ క్లబ్ సంస్థాపకుల్లో ఒకరు. ప్రఖ్యాత గాయకుడైన రంగస్థల నటుడు తొలి తెలుగు చలన చిత్రాల్లో నటించారు. కపిలవాయి రామనాథశాస్త్రికి పద్యపఠనం నేర్పిన గురువు.

తండ్రిలాగా కాకుండా వుండేందుకుగాను వాడికోసం కనబడని కత్తెరబోనులు తయారుచేసి ఉంచింది.

నారాయణ ఇంటికి ఆలస్యంగా రాకూడదు. వస్తే ఎక్కడికి వెళ్ళాడో, ఎవరితో వెళ్ళాడో ఆమెకు చెప్పాలి. వాడెవరితో స్నేహం చేస్తున్నాడో వాళ్ళందరి పుట్టు పూర్వోత్తరాలూ తనకు చెప్పాలి. ఫలాని సత్యమే ఉన్నాడు. వాళ్ళింటో ఎవ రెవరుంటారు? వాళ్ళ ఇల్లెట్లా ఉంటుంది? వాళ్ళ నాన్నకేం ఉద్యోగం! ఎన్నేళ్ళ వాడు? ఎటువంటివాడు?

పార్వతి నారాయణకు చాలా ఆంక్షలు పెట్టింది. ఎవరింటో ఏం పెట్టినా నారాయణ తినరాదు. అడ్డమైనవాళ్ళతోనూ స్నేహం చెయ్యరాదు ఎవరికీ చిల్లర డబ్బులు అప్పియ్యరాదు.

అనేక సంవత్సరాలుగా తల్లి, ప్రపంచంగురించి చేస్తున్న ప్రచారం వింటుంటే నారాయణకు తెలిసివచ్చిందేమంటే-ప్రపంచం అస్పృశ్యులతో నిండివుంది; అందరూ కుళ్ళుమనుషులు, కుళ్ళుతిళ్ళు తింటారు; అందరూ దొంగలు; అప్పు తీసుకున్న డబ్బులు ఎగేస్తారు; అందరూ వంచకులు; నారాయణ అందరిచేతా టోపీ పడేవాడు.

ఎటువంటి వాతావరణంలో పెరిగి, ఏవిధమైన జీవితానుభవంతో తన తల్లి ఇటువంటి విశ్వాసాలు అలవరుచుకున్నదో నారాయణకు కాస్తకూడా తెలీదు. కాని వాడి అనుభవం దృష్ట్యా ఆవిడ భావాలన్నీ తప్పులు. అంతమాత్రంచేత వాడు తల్లిని ద్వేషించలేదు. కాకపోతే "అమ్మ" అనే భావంలో ఇమిడి ఉండవలసిన మాధుర్యంలో అంతో ఇంతో వగరు కలిసింది.

"ఆడపెత్తనం" అనే మాట కూడా వాడికి పచ్చివెలక్కాయ అయింది. ఆడ దాని నిర్వాహకంకింద బతకటంలో ఏదో న్యూనత ఉన్నదన్న భావం వాడికి బయటి నుంచే వచ్చింది. దాన్ని వాడు విమర్శించి మానుకునేటందుకు కూడా అవకాశం లేనంత బలంగా ఆ భావం వాడితలలో పాతుకుపోయింది. తన ఈడు వాళ్ళందరూ తండ్రుల సంరక్షణలోనే ఉంటున్నారు. ఎక్కడన్నా తండ్రిలేని వాళ్ళున్నా పిన తండ్రులో, పెత్తండ్రులో ఉండి వాళ్ళ చదువు సంధ్యలు చూస్తున్నారు.

తన చదువుల గురించి తన తల్లికేం తెలుసును? తన జీతం వివరాలడుగు తుంది. లాబ్ చార్జెస్, లైబ్రరీ ఫీజ్-ఏమిటవి? పిల్లలందరూ కడుతున్నారా? నీ ఒక్కడి దగ్గిరే లాగుతున్నారా, పసివాణ్ని చేసి? సైన్సు తీసుకోనివాళ్ళకు లాబ్ చార్జెస్ ఉండవా? అయితే నువు సైన్సెందుకు తీసుకున్నావూ? డబ్బుదండుగ కాదూ? నువుకూడా ఇంటరు పాసైనావనే అంటారుగాని, అంతకన్న పెద్దగా ఏమీ అన రుగా ?

వీటికి నారాయణ ఏం చెబుతాడు? తల్లి అటువంటి ప్రశ్నలేస్తుంటే తాను ఆముదం తాగిన మొహం పెడుతున్నట్టు నారాయణకు తెలుసు? తన గొంతు. విసా

రంగా మారుతున్న సంగతి వాడెరుగును. కాని ఏం చేస్తాడు?

పార్వతి మాత్రం ఏం చేస్తుంది? కాపరం ఈదుకొస్తున్నది తానుగాని, నారాయణ కాదుగా? తన కొడుక్కు అచ్చుపోసి ఎట్లా వదిలేస్తుంది? వాడి చదువు పూర్తిఅయి, వాడు మేజరై, తన వ్యవహారాలు తాను చూసుకోవచ్చేనాటికి తాను చేతులు కడిగేసుకూర్చోవచ్చు. ఏదన్నా సలహా అడిగితే, తనకు తెలిస్తే చెబుతుంది; లేకపోతేలేదు. అంతదాకా తాను తనకొడుకు వ్యవహారాలు, అర్థమైనంత వరకే ఆయెను తెలుసుకోక తప్పదు. అడక్కా తప్పదు. వాడు విసుక్కుంటున్నాడని పార్వతికి తెలుసు. అది వాడిలో అంత మంచిలక్షణం కాదు!

మొత్తంమీద, ఎవరితప్పు లేకుండానే చాలావరకు పరిస్థితుల కారణంగా, జీవిత విధానాలమధ్య ఏమాత్రమూ పొంతన లేకపోవటంవల్ల, తల్లి కొడుకుల పారస్పర్యములో కొంత కాఠిన్యం సన్నగా ప్రవేశించినమాట నిజం. కొడుకు ఎదుగుతున్నకొద్దీ వాణ్ని నిగ్రహించవలసిన అవసరం కూడా జాస్తి అవుతున్నట్లు పార్వతికి తూడిగా తోచింది.

మూడేళ్ళక్రితం ఆమె నారాయణకు వడకపోగు వేయించింది. అప్పటినుంచీ వాడిచేత తండ్రి తద్దినాలు పెట్టిస్తున్నది. కిందటేడు తద్దినంనాడు వాడు ఉదయం పూట మస్తుగా కాఫీ హోటల్లో తిని వచ్చాడు. ఆ సంగతి తనకు తెలిసి, "ఏంపనిరా ఇదీ?" అంటే, "మనయింట తద్దినం పెట్టించే ఆయన కూడా ఆ కాఫీ హోటల్లోనే తిన్నాడు" అన్నాడు నారాయణ.

"శ్రాద్ధం! అంటే శ్రద్ధగా పెట్టాలి ఇంత అశ్రద్ధగా తద్దినం పెట్టకపోతేనేం?" అన్నది పార్వతి.

"పోనీ. మానేద్దాం" అన్నాడు వాడు నిర్లక్ష్యంగా.

పార్వతి వాణ్ని చాచి చెంప పగల గొట్టింది. నారాయణ తనకేసి చాలా కోపంగా చూశాడు. అట్లా చూసినందుకు రెండో చెంప కూడా పగల గొడదామనుకుంది గాని, నిగ్రహించుకున్నది. ఆమెకు ఆ క్షణంలో వాడి ముఖం చూడలేనంత అసహ్యం పుట్టింది.

"ఈ యీడుకే తద్దినాలు మానేద్దామన్నవాడు, ఇంకా నాలుగేళ్ళు పొయ్యాక ఏం చెయ్యడు? ఇటువంటి బుద్ధులన్నీ రక్తంలో వస్తాయి కాబోలు! శిక్షణ అంతా వృథాయేనేమో!".... అనుకున్నది పార్వతి.

తాను శిక్షణ అనుకున్నది సక్రమమైనది కాకపోవచ్చునని ఆమెకు తట్టలేదు.

నారాయణది కూడా తెలిసీతెలియని వయసు. మనసులో కొన్ని కొన్ని స్వతంత్ర భావాలు తలెత్తుతాయి. కాని వాటిని దాచుకునే నేర్పు తెలీదు. వాడు కాలేజీలో చేరే ముందు హాస్టలులో చేరటం గురించి కలలు కన్నాడు. తన తల్లికూడా తనవెంట గుంటూరు వచ్చి ఉండబోతున్నదని వాడికి చాలా ఆలస్యంగా తెలిసింది.

"ఏమిటి? నువు కూడా నాతో గుంటూరు వస్తావా? ఇక్కడుండవూ ?" అనేశాడు నారాయణ ఆశ్చర్యంగా.

పార్వతి షాక్ తిన్నది. ఆమెకు కోప్పడాలన్న ఆలోచన కూడా వెంటనే కలగలేదు.

"నేను లేకపోతే నీకు తిండీ తిప్పలూ ఎట్లా?" అన్న దామె.

"హోటళ్ళూ, హాస్టలూ అవీ ఉంటాయిగా మల్లుగా?"

"నిన్ను హోటల్లో ఉంచి నేనిక్కడ ఒంటరిగా ఉండమనా నీ ఉద్దేశం? ఉన్న ఇద్దరమూ చెరోచోట ఉందాం?" అన్నది పార్వతి.

నారాయణ ఈ విషయం ఆలోచించలేదు. వాడి మనసునిండా హాస్టలు జీవితాలూ, స్నేహితులతో స్వేచ్ఛగా తిరగటమూ ఉండటంచేత ఈ ఆలోచనకు చోటు లేకపోయింది.

తననుంచి తన కొడుకు విముక్తి కోరుతున్నాడని పార్వతికి తెలిసిపోయి చాలా బాధపడింది.

"నేను వాడికెట్లా బరువైనాను? పుట్టినది మొదలు ఈనాటిదాకా కంటికి రెప్పలాగా కాపాడుతూ వస్తున్నానే! వాడికి నేనంటే ఎందుకు వెగటు?" ఈ ధోరణిలో ఆలోచించుకుంటూ పార్వతి మహా కుమిలింది. నారాయణక్కూడా తను అక్కర్లేకపోతే తన జీవితం ఎడారితప్ప మరోటికాదు. తన గతి ముందు ఏం కానున్నది!

ఈ నిరాశనుంచి బయటపడటానికి ఆమెకు ఒక్కటే ఆధారం దొరికింది - తనకు కొడుకుమీద ఉన్న అధికారం. బొట్టికాయ వెధవ. వాడు ఏమనుకుంటే తనకేం? ఇంకో అయిదారేళ్ళపాటు వాడు తన చెప్పుచేతలలో ఉండితీరవలసిందే. తోక ఝాడించడానికి వీల్లేదు. ఆ తరవాతా? ఏం కావలసివుంటే అదే అవుతుంది.

* * * *

ఇంటరు మొదటి సంవత్సరం జరుగుతూండగా నారాయణకు పదహారు నిండాయి. వాడికి పదిహేడు వెళ్ళేలోగా పెళ్ళి చేసెయ్యాలని పార్వతి నిశ్చయించుకున్నది. తన మేనగోడళ్ళలో కాస్త ఈడయినది నాగభూషణం కూతురు కమల ఒకతే, కాని దాని కింకా ఎనిమిదో ఏడే.

"నాకప్పుడే పెళ్ళేమిటి? ఇంకా నాలుగేళ్ళు చదువు పెట్టుకొని!" అన్నాడు నారాయణ.

"చదువు పూర్తి అయేదాకా పెళ్ళి చేసుకోవుటా? ఎక్కడైనా ఉందీ? గడ్డాలూ, మీసాలూ వచ్చాక ముద్దుముద్దుగా పల్లకీలో ఊరేగుతావా?" అన్నది పార్వతి. కాని ఇంకో రెండేళ్ళాగితే కమలకు పదేళ్ళు వస్తాయి. అది బాగానే ఉందిగాని, కమల బాగుండదు. పళ్ళెత్తు. జుట్టూలేదు. అన్నలకు ఆగ్రహం రాకుండా

ఉంటే పై సంబంధమే చేసుకోవాలని ఉన్నది పార్వతికి. తనకు రాబోయే కోడలు అందంగా ఉండాలి. తనను చూచి గర్వపడేదిగా ఉండాలి.

"పిల్లవాడికి పెళ్ళిచేసే ఆలోచనలో ఉన్నారా?" అని వాళ్ళూ, వాళ్ళూ వాకబు చేస్తున్నారు.

పార్వతి తన పెద్దన్నయ్యకు చేతనైనంత లౌక్యంగా ఒక ఉత్తరం రాసింది. "పిల్లవాడికి ఈయేడు పెళ్ళిచేస్తే బాగుంటుందనుకుంటున్నాను. ఏవేవో సంబంధాలు కూడా వస్తున్నాయి. మేనగోడల్ని వదులుకుని పరాయి సంబంధం చూడాలంటే అదీ అంతగా మనస్కరించటంలేదు. కాని కమల చూడబోతే ఇంకా పసిది. దానికన్న మూడేళ్ళు పెద్ద పిల్లయినా నారాయణకు ఈడేనాయె. ఏంచేస్తే బాగుంటుందో మీరంతా ఆలోచించి సలహా ఇవ్వవలెను. నాకు మీరు కాక ఇంకెవరున్నారు? నేనా ఇటువంటి పెద్దపనులు మీదవేసుకుని చెయ్యటానికి శక్తిగల దాన్ని కాకపోతిని...."

నాగభూషణం కుండపగలేసి జవాబు రాసేశాడు; "కమలకు ఇప్పుడప్పుడే పెళ్ళి తలపెట్టే ఆలోచన లేదు. దానికోసం నారాయణను ఆపివుంచడం అనవసరం. పెళ్ళిగురించి నీకేమీ విచారం వద్దు. నిన్ను కూర్చోబెట్టి అన్నిపనులూ మేమే చేసిపెడతాం."

పార్వతి మనస్సు తేలికన పడింది.

ఇప్పుడు పార్వతీ, నారాయణా ఉంటున్నది రైలుపేటలో. రెండుభాగాల ఇల్లు. రెండో భాగంలోనూ అద్దెలవాళ్ళే ఉన్నారు. ఇంటివాళ్ళకు అగ్రహారంలో మరో ఇల్లున్నది; నెలనెలా వచ్చి అద్దె పుచ్చుకుపోతారు.

పక్కభాగంలో ఉన్న కనకరత్తమ్మగారు, తన మనవరాలిని నారాయణకు చేసుకోమని తెగ పోరాడుతున్నది. ఇంట్లో ప్రవేశించి నెల వెళ్ళినప్పటినుంచీ, ఆవిడ రెండోకూతురి పెద్దకూతురుట. వయస్సెంతంటే, ఒకసారి తొమ్మిదన్నది. మరి తొమ్మిదోఏటనే పెళ్ళి చేస్తారా అంటే, తొమ్మిది వెళ్ళి పది సగపడిందన్నది.

నాగభూషణం నుంచి ఉత్తరం వచ్చాక మళ్ళీ కనకరత్తమ్మగారు ఈ విషయం ఎత్తినప్పుడు, "పోనీండి పిన్నిగారూ! మీరింతగా అడుగుతున్నారు గనక ఒకసారి మీ మనవరాల్ని చూద్దామనే నాకూ వుంది. కాని, చూస్తున్నారుగా? నేనెక్కడికీ కదలటానికిలేదు?" అన్నది.

"నువు కదలటం దేనికమ్మా, నేను పిల్లదాన్ని పిలిపిస్తాగా!" అన్నది కనకమ్మగారు.

తరవాత రెండు వారాలకు కాబోలు కనకమ్మ మనుమరాలు వచ్చింది. బారీపిల్ల. కనీసం పన్నెండోఏడు జరుగుతూ ఉండాలి. కాపరం చేస్తున్న పిల్లలా గున్నది. అందచందాలు అంతంతమాత్రమే.

"మావాడికి పిల్ల నచ్చినట్టు లేదండీ." అన్నది పార్వతి నీళ్ళు నములుతూ.

కనకమ్మగారు అటువంటిమాట వస్తుందని అనుకున్నట్టే వుంది.

"పోనీలేమ్మా ! దానికేం?" అన్నదామె నిర్లిప్తంగా.

పిల్ల ఎట్లా వచ్చిందో అట్లాగే వెళ్ళిపోయింది.

తరవాత పార్వతికి పిల్లల్ని చూసేపని కాస్త జాస్తి అయింది. అరండల్ పేటలో ఇద్దరి పిల్లల్ని చూసింది. కొత్తపేటలో ఒక పిల్లను చూసింది. ఏ సంగతీ కబురు చేస్తానని వచ్చేసింది. ఆమెకు ఏ పిల్లా నచ్చలేదు. లోకంలో ఉన్న అనాకారి పిల్లలందర్నీ తన కొడుక్కు ఇవ్వజూపుతున్నారని పార్వతికి కాస్త రోషంకూడా వచ్చింది.

నిజానికి సంబంధాలు చూసేవాళ్ళు ఏ మాత్రమూ విచక్షణాజ్ఞానం ఉన్నట్టు కనబడదు. మంచి నిదర్శనం కనకమ్మగారే. తన మనవరాలిని చూస్తే పార్వతి చేసుకోదని ఆవిడకు రూఢిగా తెలుసు. తెలిసికూడా పార్వతిని కాల్చుకు తిన్నది. కష్టపడి మనుమరాలిని ఇరవై మైళ్ళదూరంనుంచి తెప్పించింది. పార్వతికి నచ్చకపోతే ఆవిడకు ఆశాభంగం కలిగినట్టుకూడా లేదు.

'పెళ్ళి దైవాధీనం ! ప్రయత్నించి చూద్దాం. ఎవరికి ఎవరితో పెళ్ళి రాసి పెట్టి వుందో ఎట్లా తెలుస్తుందీ?' అన్న మనస్తత్వం ప్రదర్శిస్తారు పెళ్ళి ప్రయత్నాలు చేసేవాళ్ళు. ఆ మాట అని అంతా విధికి వదిలెయ్యరు. ఎంతసేపూ పైకే చూస్తారు గాని కిందిచూపు చూడరు. అంతవరకూ వాళ్ళ పురుష ప్రయత్నంలో నమ్మకం ఉన్నది !

పార్వతికే ఒక పెళ్ళి కావలసిన కూతురుంటే అట్లాగే ప్రవర్తించేదేమో, కాని పెళ్ళికొడుకు తల్లి కావటంతో ఆమెకు సంబంధాలు వెతికేవాళ్ళ పద్ధతులు చూసి చిరాకెత్తింది!

"నువ్వెందుకు కష్టపడి సంబంధాలు చూస్తున్నావు? నేనిప్పుడప్పుడే పెళ్ళి చేసుకోను. ఈ పద్ధతులు మారితీరాలి. నాగరికతగల ఏ జాతిలోనూ ఇంత చిన్న తనంలో పెళ్ళిళ్ళు చెయ్యరు." అన్నాడు నారాయణ తల్లితో.

"అర్థంలేకుండా మాట్లాడకు. నువ్వు ఏ పాతికేళ్ళకో పెళ్ళి చేసుకుంటే నీకు ఇరవయేళ్ళ పిల్ల దొరుకుతుందా ఏం? మొగుడూ పెళ్ళాలమధ్య అయిదేళ్ళ కంటే తేడా ఉంటే అసహ్యం!" అన్నది పార్వతి.

తల్లీ కొడుకులమధ్య ఈ సంఘర్షణకు ఫలితం ఏమీలేదు. పార్వతికి నచ్చిన పిల్ల అక్కడ సిద్ధంగా లేదు.

* * * *

దాదాపు పదేళ్ళపాటు నిద్రపోయిన జాతీయోద్యమం మళ్ళీ రాజుకున్నది.

ఉప్పుసత్యాగ్రహం[1] – శాసనోల్లంఘనం[2] సత్యాగ్రహం అన్నారు గాంధీగారు. సహాయ నిరాకరణోద్యమంనాటికి నారాయణ మరీ చిన్నవాడు. కాని ఈసారి వాడికి బాగానే అర్థమయింది. గాంధీలో నమ్మకంకూడా కుదిరింది. కాని ఈ ఉద్యమంతో స్వరాజ్యం ఎట్లా వస్తుందో, ఉప్పు తయారుచేసి అరెస్టుకావటానికీ, ఇంగ్లీషువాళ్ళు దేశం విడిచిపెట్టి పోవటానికీ మధ్యజరిగే తంతు ఏమిటో వాడికి సరిగా అర్థం కాలేదు. కాని భారీ ఎత్తున జరిగేది ఏదన్నా పరమార్థమే అవుతుంది. ఉప్పు సత్యాగ్రహం కూడా అంతే.

జాన్సన్ అనే ట్యూటరొకడు కాలేజీలో ఉండేవాడు. అతను "గాంధీ" గురించి ఎప్పుడూ వ్యతిరేకంగా మాట్లాడుతూండేవాడు.

"ఇది రాజకీయోద్యమమా? చరిత్రలో ఎక్కడా ఇటువంటి ఉద్యమాలు ఫలించలేదు. ఇదొక రకమైన ప్రాపగాండా. సత్యాగ్రహం ప్రపంచం దృష్టిని ఆకర్షిస్తుందనీ, ప్రపంచం వచ్చి ఇండియాను ఆదుకుని విముక్తి కలిగిస్తుందనీ గాంధీ నమ్మకం. అదేమీ జరగదు. ఎవరూ మీకు సాయం చెయ్యరు" అనేవాడు జాన్సన్ అనే పేరు గల భారతీయ క్రైస్తవుడు.

స్టూడెంట్సుకు జాన్సనందే మంట.

"ఎక్కడాలేని ఉద్యమం నడపటమే గాంధీలో గొప్పతనం" అన్నారు వాళ్ళు.

జాన్సనంటే నారాయణకు కొంచెం ఇష్టం. అతని కాంపోజిషన్సును జాన్సన్ మెచ్చుకొని, మిగిలిన వాళ్ళను అట్లా రాయటం నేర్చుకోమనేవాడు. ప్రశంస ఊరికేపోదు. నారాయణ జాన్సన్‌తో స్నేహంగానూ, చనువుగానూ ఉండేవాడు.

---

1. ఉప్పుసత్యాగ్రహం : 1930 మార్చి 12 వ తేదీ ఉప్పుచట్టానికి వ్యతిరేకంగా సముద్రతీరంలో ఉప్పు తయారు చేయడానికి గాంధీజీ జరిపిన దండి యాత్రతో మొదలైన జాతీయోద్యమ కార్యక్రమం. గాంధీజీ 78 మంది శిష్యులతో సబర్మతీ ఆశ్రమంనుండి సముద్రతీరంలోవున్న దండికి మార్చి 12వ తేదీ బయలుదేరి ఏప్రిల్ 6వ తేదీకి చేరి ఉప్పు పోగుచేశారు. విదేశీవస్త్ర బహిష్కరణ, మద్యపాన నిషేధం, పికెటింగ్, హర్తాళ్ళు యీ కార్యక్రమానికి తోడయ్యాయి. లక్ష మంది ప్రజలు యీ కార్యక్రమానికి మద్దతు యిచ్చారు. పోలీసులు దారుణ దమనవిధానాన్ని చేపట్టారు.
2. శాసనోల్లంఘనం 1930 ఫిబ్రవరిలో సబర్మతి ఆశ్రమంలో జరిగిన కాంగ్రెసు కార్యవర్గ సమావేశంలో "అహింసను పరమధర్మంగా నమ్మిన వాళ్ళతోనే శాసనోల్లంఘనం ప్రారంభించబడి సాగుతుంది" అని నిర్ణయించడమైంది. ఈ సందర్భంగా నిర్ణయించబడిన రాజకీయ కార్యక్రమమే, ఉప్పు సత్యాగ్రహం.

అయినా ఉప్పుసత్యాగ్రహం గురించి జాన్సన్ అట్లా మాట్లాడటం నారాయణకు నచ్చలేదు. వాడు జాన్సన్‌ను విడిగా పట్టుకుని ఈ విషయం కొంత వాదించాడు.

"నిరాయుధులు బలవంతుల మీద తిరుగుబాటు బహిరంగంగా చెయ్యాలంటే సత్యాగ్రహంకన్న మంచి పద్ధతి ఏముంటుంది? హింసతో మనం ఇంగ్లీషువాళ్ళను ఎన్ని వేలసంవత్సరాలకైనా పంపగలమా?" అని నారాయణ జాన్సన్‌ను అడిగాడు.

"నో, నో, మైడియర్ ఫెలో! అహింసతోనూ నువ్వు శత్రువులను జయించలేవు. మీ ఘాంధీ అహింస నాకు ఆడ్‌గా కనిపిస్తుంది. ఆయన అహింసావాదినంటాడు. మిలిటరీ పరిభాషే వాడతాడు. ఈ ఉద్యమంనుంచి ఏమి ఆశిస్తున్నావని కరెస్పాండెంట్సు అడిగితే, ప్రతి వాలంటీరు తలలోనూ ఒక తుపాకీగుండు అన్నాడు. రాజకీయాలలోకి మతాన్ని ప్రవేశపెట్టాడు. ఘాంధీ రాజకీయాలు మతాన్ని దాటిపోవు. చూస్తూండు నాకు స్వాతంత్ర్యం అక్కర్లేదనుకోకు. యేసు స్వేచ్ఛావాది. బ్రిటిషువాళ్ళ రాజకీయాలు క్రిస్టియానిటీకి అతీతంగానే ఉంటున్నాయి. జాతీయోద్యమంకూడా మతానికి అతీతంగానే ఉంటున్నది. గారడీవాళ్ళు పాటలు పాడి జనాన్ని పోగుచేసి తరవాత గారడీ చేసినట్టు ఘాంధీగారు భజనలుచేసి జనాన్ని పోగుచేసి రాజకీయ ప్రచారం చేస్తున్నాడు. నువ్వేన్నయినా చెప్పు, నాకిది నచ్చలేదు" అన్నాడు జాన్సన్.

ఇటువంటి మహోద్యమాన్ని జాన్సన్ ఆ లెవెల్‌లో విమర్శించడం నారాయణకూ నచ్చలేదు. కాని అతనితో నారాయణ తగాదా పడదలచలేదు. జాన్సన్ అన్నముక్కలేవో చిత్తశుద్ధితో అన్నవేగాని కపటంగా అన్నవి కావు.

మీటింగులు—అరెస్టులు—లాఠీచార్జీలు — బీభత్సవం. మళ్ళీ ఉద్యమం నిలిచిపోయింది.

ఇంటరు పూర్తి చేశాక నారాయణకు మళ్ళీ సమస్య ఏర్పడింది. వాడు బియ్యేలో కెమిస్ట్రీ తీసుకుందా మనుకున్నాడు. కెమిస్ట్రీకోసం ఏ మద్రాసో, విజయనగరమో వెళ్ళాలి.

"ఎక్కడికో పోవడమేమిటి? ఇక్కడ బియ్యే లేదూ?" అన్నది పార్వతి.

"ఉందిగాని కెమిస్ట్రీ సబ్జెక్టు లేదు" అన్నాడు నారాయణ.

"ఇక్కడేదుంటే అదే తీసుకో!" అన్నది పార్వతి.

కొడుకు చదువుపట్ల అంత శ్రద్ధఉన్న పార్వతికి ఆ చదువు గురించి ఏమీ తెలీదు. నారాయణ నవ్వి, "ఏదో ఒకటి తీసుకోవట మేమిటమ్మా ? తీసుకునే దానిలో నాకు ఇంటరెస్టుండొద్దూ? అది నాకు ముందు ముందు పనికిరావద్దూ ?" అన్నాడు.

"నీ సరదాకోసం చదువుతావుట్రా? ఇక్కడ బియ్యే చదివే వాళ్ళంతా మట్టి కొట్టుకుపొయ్యేవాళ్ళేనా?" అన్నది పార్వతి.

పార్వతికున్న భయాలలో ఒకటి నారాయణ చెప్పిన 'ఇంటరెస్టు.' నారాయణే గాని, మరొకరేగాని ఆత్మ సంతృప్తికోసం చేసేదంతా శుద్ధదండగ అనీ, ఇష్టం లేకుండా బలవంతాన చేసే పనులే అచ్చివచ్చేవనీ, జీవితంలో ఆనందకరమైన వన్నీ హానికరమైనవేనని పార్వతి విశ్వాసం. తన కొడుకును ఇష్టమైన పనులే చెయ్యనిస్తే వాడీపాటికి ఫిడేలు గీక్కుంటూ కూర్చునేవాడు! ఇంకా నయం! వాడా కెమిస్ట్రీ తీసుకోవటానికి ఎంతమాత్రమూ వీల్లేదు.

తల్లి ఈసారి గావుపట్టుమీద ఉన్నదని గ్రహించి ఆవిడ మనసు మార్చటం తనవల్ల కాదనుకుని నారాయణ వెంకటేశ్వర్లు మామయ్యనాశ్రయించాడు. నారాయణ వల్ల సాధ్యంకానిపని వెంకటేశ్వర్లు చేశాడు.

"చూడు పార్వతీ. నీ కొడుకును వేడుకకోసం చదివించటం లేదుగద? వాడు చదివి ఏదన్నా పెద్ద ఉద్యోగం సంపాదించాలనే నీ ఉద్దేశం? బియ్యే అయినంత మాత్రాన ఏమీ ప్రయోజనం లేదు. ఇప్పుడు వాడు కావలిస్తే మెడిసినుకో, ఇంజనీరింగుకో పోవచ్చు. కాని వాడికవి ఇష్టంలేదంటున్నాడు. కెమిస్ట్రీ చదువుతానన్నాడు. కెమిస్ట్రీ తీసుకుని బియ్యే పాసై, ఏ కాశీకో వెళ్ళి ఇండస్ట్రియల్ కెమిస్ట్రీ తీసుకుంటే వందలు సంపాదించగలుగుతాడు. లేదా ఎమ్మేస్సీ చదివినా ఎక్కడన్నా లెక్చరరుపని దొరుకుతుంది. కెమిస్ట్రీ గ్రాడ్యుయేట్లు చాలా తక్కువ. నిజానికి నీకి చదువుల సంగతి ఏం తెలుసు?" అన్నాడు వెంకటేశ్వర్లు.

పార్వతి కాస్త తగ్గింది. ముందు నారాయణ విజయనగరం వెళ్ళి, కాలేజీలో చేరి, ఇల్లు మాట్లాడేటట్టూ, తరవాత పార్వతి వెళ్ళేటట్టూ ఏర్పాటు జరిగింది. నారాయణ ఒంటరిగా వెళ్ళవలసిన అవసరం కూడా లేకపోయింది. అతనితోపాటు ఇంటరు పాసయిన విద్యార్థులలో ఇద్దరు మెడిసిన్ చదవటానికి విశాఖపట్నం వెడుతున్నారు. ఒకడు ఫిజిక్సు చదవటానికి విజయనగరమే వెళుతున్నాడు. అందరూ కలిసి ఒకే రైల్లో బయలుదేరారు.

ఇద్దరూ వాల్తేరులో దిగిపోయారు. నారాయణా, అతని మిత్రుడు ప్రకాశరావూ విజయనగరంలో దిగారు. విజయనగరంలో దిగేసరికి సాయంకాలమయింది. ఇద్దరూ ఒంటెద్దుబండెక్కి ఊళ్ళోకి బయలుదేరారు. ఊరు రైలుస్టేషన్‌కు దూరమే.

ప్రకాశరావుతో హైస్కూల్లో చదివిన వాళ్ళిద్దరు ఇంటరు కూడా విజయనగరంలోనే చదివారుట. వాళ్ళొకరూములో ఉంటున్నారు. ముందు అక్కడికి వెళ్ళి పడటానికి ప్రకాశరావు ఏర్పాటుచేశాడు. ఆ రూము అయ్యకోనేటిగట్టున ఉన్నది. అయ్యకోనేరనగానే నారాయణకు కన్యాశుల్కం[1] జ్ఞాపకం వచ్చింది.

ప్రకాశరావు స్నేహితులు నారాయణను కూడా తమ మిత్రుడిలాగే చూసు

---

1. కన్యాశుల్కం : గురజాడ అప్పారావు పంతులు (1862-1915) రాసిన ఆధునిక తెలుగు మహానాటకం. మొదటి ముద్రణ 1897.

కున్నారు. నారాయణ ఎన్నడూ ఇల్లు పదలినవాడు కాకపోయినా, వాడికి ఇది పరాయిచోటనిపించలేదు.

రైలు దిగినవాళ్ళు శుభ్రంగా రైలుమని పోయేట్టు స్నానాలు చేసేసరికి చీకటి పడనేపడింది. నలుగురూ కలిసి హోటలుకు బయల్దేరారు.

కాలేజీలోనూ, హాస్టల్లోనూకూడా నారాయణకు సీటు దొరికింది. వాడు మేన మామకు ఉతరం రాశాడు.

"విజయనగరం క్షేమంగాచేరాను. ప్రస్తుతం హోటల్లో తింటున్నాను. ఇక్కడ అందరూ నూనె వేసుకుంటారు. హోటలు భోజనం ఏమీ బాగాలేదు. రేపటినుంచి హాస్టలుభోజనం. హాస్టల్లో చేరినందుకు అమ్మకు కోపం వస్తుందేమో? హోటలు మెతుకులు నోట్లోకి పోనందున హాస్టల్లో చేరానని అమ్మతోచెప్పు. కాలేజీలో ఇంకా రెండు మూడు రోజులకుగాని క్లాసులు ప్రారంభం కావనుకుంటాను. విజయ నగరం వద్దామనుకున్నప్పుడు నాకు జ్ఞాపకంరాలేదు గాని ఇది గురజాడ అప్పారావు గారి ఊరు. అయ్య కోనేరు చూశాను. కస్పా చూశాను. అప్పారావు[1] గారిల్లు కూడా చూశాను. ఇవన్నీ చూస్తుంటే నాకేదో గర్వంగావుంది. కోటమీదిగానే కాలేజీకి పోవాలి. అది పూసపాటి విజయరామరాజు కాలంలో కట్టిన కోటట. బుస్సీ దొర కట్టించాట్ట. ఈ విజయనగరంలో ఎక్కడా నాలుగు రోడ్లకూడలి లేదని విన్నాను. నేను చూసినంతలో నాకు కనిపించలేదు. కాలేజీ అవతల పెద్ద చెరువొకటి ఉన్నది. దాని వాసన దుర్భరం. కాలేజీలోకి ఘుమాయిస్తూ వుంటుంది. ఈ వాసన రెండేళ్ళ పాటు ఎల్లాభరిస్తానో తెలీదు. విజయనగరం దోమలు ప్రసిద్ధి గలవిట. వాటి తడాఖా రోజూ చూస్తూనే వున్నాను. ఒక నరసారావుపేట కాంప్‌కాట్ కొనుక్కోమని అందరూ సలహా ఇస్తున్నారు. ఇక్కడి భాష కుదించినట్టుగా తమాషాగా వుంటుంది. మనం ఒకసారి కన్యాశుల్కం నాటకం చూశాం. జ్ఞాపకం వుందా? అందులో వాళ్ళు ఇట్లా మాట్లాడలేదు. కన్యాశుల్కంలో ఉండే మాటలు ఇక్కడివాళ్ళే పలకాలి మన వాళ్ళవల్ల కాదు. ఇక్కడ నాకు దిక్కులు తారుమారుగా వున్నాయి. సూర్యుడు పడమట ఉదయిస్తున్నట్టుగా కనబడుతున్నది. వెంటతెచ్చిన డబ్బు జీతాలుకట్టడానికీ దానికేచాలింది. కొద్దిగా మిగిలింది కూడా. డబ్బు అవసరమైతే రాస్తాను. నేను కులాసాగా ఉన్నాననీ, వీలుచూచుకొని ఇల్లు అద్దెకు మాట్లాడతాననీ అమ్మకు చెప్పు. అన్నట్టు మరిచాను—ఇక్కడ డబ్బులెక్క కూడా మనకు వింతగానే ఉంటుంది. పరకా, ముచ్చోకా అంటారు. పరకంటే అర్థణా. ఇద్దరంకలిసి హోటల్లో టిఫిను తింటే బేడాపరక అయింది. పుంజీలు అనే మాట వాడతారు. పుంజీ అంటే నాలుగుట. బెండకాయలూ దొండకాయలూ కూడా ఇక్కడ ఎంచి అమ్ముతారుట. తూచి అమ్మరుట. హోటలుకు బయలుదేరటానికి నా స్నేహితులు నాకోసం కాచుకుని

1. గురజాడ అప్పారావుగారిల్లు.

వున్నారు. ఇక ఉత్తరం ముగిస్తాను. రేపే హాస్టలులో చేరుతున్నాను గనక పైన యిచ్చిన హాస్టలు ఎడ్రెసుకు జవాబు వ్రాయి."

వెంకటేశ్వర్లు ఈ ఉత్తరంలో కొన్ని భాగాలు మాత్రమే పార్వతికి చదివి వినిపించాడు.

"ముఖ్యమైన విషయాలేమీ రాయడేం? అక్కడ మంచినీళ్ళు దొరుకుతాయా? ఉప్పులా? వీడి కర్మగాలి హోటల్లో తినడమేమిటి? నూనె తింటే రోగంరాదూ! ఇల్లు చూస్తున్నాడుట్నా? వాడికి వంకాయ బజ్జీలంటే ఇష్టం. మెంతి మజ్జిగ తగని ఇష్టం. మినప్పచ్చడి ఇష్టం. ఇవన్నీ హోటల్లో వీడికెవరుచేసి పెడతారూ?" అన్నది పార్వతి విసుక్కుంటూ.

"తొందరపడతావేం? ఇప్పుడేగా కాలేజీలో చేరాడూ? హాస్టల్లో తింటాడుల్లే. ఆ భోజనం బాగుంటుంది." అని వెంకటేశ్వర్లు సర్దిచెప్పాడు.

"ఆ దిక్కుమాలిన నూనె తినవద్దనిచెప్పు. కావలిస్తే మంచి నెయ్యి కొనుక్కుపెట్టుకుని చేతిమీదికైనా వేసుకోమను. వాడేనాడూ ఇంటితిండితప్ప, దిక్కుమాలిన హోటలు తిళ్ళు తినిఎరగడు. నా వంటకు బాగా అలవాటుపడ్డాడు. ఇంకోరింటికిపోతే వాడికి ముద్దదిగదు. నాకు తెలుసుగా? ఇంత కందిసున్నీ, పచ్చళ్ళూ పంపిద్దాం. అవన్నా వేసుకుంటాడు." అంటూ పార్వతి చాలాసేపు మాట్లాడింది.

* * * *

విజయనగరం వచ్చిన నెలరోజులపాటు నారాయణ ఆరోగ్యం బాగానే వున్నది. ఈ లోపల వాడు ఒక శని ఆదివారాలు విశాఖపట్నం వెళ్ళి అక్కడి మిత్రులతో గడిపి, విశాఖపట్నమంతా చూసి తిరిగి వచ్చాడు. ఆ తరవాత జ్వరం పట్టుకున్నది. ఒకరోజు కాలేజీకి వెళ్ళిన కాస్సేపటికల్లా చలిపుట్టుకొచ్చింది. ఒక పిరియడ్ ఎలాగో భరించి హాస్టలుకు వచ్చిపడ్డాడు. ఇంటికి వచ్చాక జ్వరం పేల్చేసింది. సాయంకాలానికి జ్వరం తగ్గిపోయి చెమటపట్టింది. ఆ రోజంతా మాడాడు. మర్నాటికి మామూలుగానే ఉన్నది. జ్వరం మాట పూర్తిగా మరిచాడు. ఆ మర్నాడు ఉదయం భోజనంచేసిన కాస్సేపటికి మళ్ళీ చలిముంచుకొచ్చింది. అన్నం తినటంవల్ల వచ్చిందనుకున్నాడు—మళ్ళీ సాయంకాలానికి చెమటపట్టి జ్వరం జారిపోయింది.

వారంరోజుల్లు ఈ విధంగా రోజువిడిచి రోజు జ్వరం వస్తున్నా, నారాయణ దాన్ని గురించి ఎవరితోనూ చెప్పలేదు. శనివారం తిరిగి వచ్చేసరికి విశాఖపట్నం నుంచి మెడిసన్ చదివే మిత్రులువచ్చి అతడి స్థితిచూసి "మలేరియా" అన్నారు. వాళ్ళు నారాయణను కస్బాలో ఉండే ఒక యువకడాక్టరు దగ్గరికి తీసుకుపోయి చూపించారు.

"ఇంజెక్షన్ ఇవ్వనా? ఓరల్ ట్రీట్‌మెంట్ చెయ్యనా? ఇంజెక్షన్ నాకంత యిష్టంలేదు. కాని అది త్వరగా పనిచేస్తుంది" అన్నాడు డాక్టరు.

"ఇంజక్షనే ఇవ్వండి" అన్నాడు నారాయణ.

డాక్టరు ఒక్క ఇంజెక్షనిచ్చాడు. దాంతో నారాయణకు మళ్ళీ మలేరియా ఎటాక్ రాలేదు. ఇంజెక్షనివ్వటానికి డాక్టర్ ఎందుకు సంకోచించాడో తెలీదు. దాని వల్ల సైడ్ ఎఫెక్ట్సుకూడా ఏమీ కలగలేదు. ఒక్క ఇంజెక్షన్‌తో తన మలేరియా పోగొట్టిన డాక్టరును నారాయణ ఏళ్ళ తరబడి జ్ఞాపకం పెట్టుకున్నాడు. ఆ డాక్టరు నారాయణను అప్పుడే మరిచిపోయి ఉండాలి.

మెడికో మిత్రులు నారాయణకు ఒక దోమతెర కొనిపెట్టి, దాన్ని వాడు రోజూ వేసుకునేటట్టు ప్రమాణం చేయించి మరీ వెళ్ళిపోయారు.

తాను మలేరియాతో పదిరోజులు తీసుకున్నట్లూ, చిక్కి సగమైనట్టూ నారాయణ ఇంటికి రాయలేదు; ఇంటినుంచి వచ్చిన కందిపొడి, నిమ్మకాయ ఊరగాయా, ఆవకాయా తన మిత్రులకు పంచిపెట్టి వారం రోజుల్లో అయిపోగొట్టాడు.

"ఇల్లు ఎప్పుడు తీసుకుంటాడు? ఆ మాట రాయడేం?" అని పార్వతి గిల గిల లాడింది.

"ఇంతలో ఇల్లెందుకూ? దసరా శలవుల్లో వాడే వస్తున్నాడుగా?" అన్నాడు వెంకటేశ్వర్లు.

దసరాశలవులకు వచ్చేనాటికి నారాయణ 'కారాపట్టి' అలవాటు చేసుకున్నాడు. మొదట రెండుమూడు సార్లు తల తిరిగి, ఒళ్ళంతా చెమటలుపోసి, గుండెదడవచ్చి, చాలా గొడవ చేసింది. ఈ వికారాలను జయించాలన్న పౌరుషంతో నారాయణ కారామసాలా అలవాటు చేసేసుకున్నాడు. వాణ్ణి ఆకర్షించినది కారా రుచి కాదు.... వాసన.

ఉప్పుచెక్క దొరకదుగాని కారాకిల్లీ బెజవాడలో కూడ దొరుకుతుంది. ఇంటికి పోయే దారినే కారాకిల్లీ వేసి మరీ వెళ్ళాడు. అర్ధరాత్రి రావలసిన బండి తెల్లవారి బెజవాడ చేరింది. కారణం నెల్లిమర్ల వరదలు[1], జూట్‌ఫ్యాక్టరీ మునిగి పోయిందని చెప్పుకున్నారు.

పార్వతి కొడుకును చూస్తూనే, "అయ్యయ్యో! చిక్కి సగమయాడు." అన్నది. నిజంగా తన కొడుకు చిక్కి సగమైనప్పుడామె వాణ్ణి చూడనేలేదు. ఇప్పుడు పూడుకుని మామూలు మనిషి అయ్యాడు. క్వినైన్ ఫలితంగా కాస్త బలిశాడేమో కూడానూ. కాని అట్లా అనిపించకపోతే మాతృహృదయమే కాదు.

---

1. నెల్లిమర్ల వరదలు : 1931లో వచ్చాయి. చాలా వంతెనలు కూలాయి. "నెల్లిమర్ల జూట్‌మిల్స్" కూడా మునిగింది.

"ఆ వాసనేమిట్రా?" అన్నది పార్వతి. కొడుకు ఒకటి రెండుసార్లు అవతలికి వెళ్ళి ఉమ్మటం చూసి.

"కారాకిల్లీ లేమ్మా!" అన్నాడు నారాయణ.

'మంచివాళ్ళు' కారాకిల్లీ వేసుకోరని పార్వతి కేదో అనుమానం తగిలింది.

"అది చుట్టా, బీడి వంటిది కాదూ!" అన్నదామె.

"ఛీ, ఛీ! బెంగాల్లో ఆడవాళ్ళుకూడా వేస్తారు" అన్నాడు నారాయణ.

"నేను వేసుకోవచ్చా?"

"అలవాటు లేకపోతే తల తిరుగుతుంది."

"నీ కిప్పుడు తల తిరుగుతుందీ?"

"లేదు "

"ఇంకేం? అలవాటయిందన్న మాట!"

పార్వతి గుండెరో రాయిపడింది. నారాయణలో తండ్రి లక్షణాలు ఒక్కొక్కటే బయలు పడుతున్నాయి. మూడునెల్ల పాటు తను దగ్గిర లేకపోయేటప్పటికి ఇదేదో దిక్కుమాలిన అలవాటు చేసుకున్నాడు. ఇంకెన్ని దురభ్యాసాలు నేర్చుకున్నాడో?

"ఛీ, ఛీ ! ఆ కిల్లీ మానేస్తావా ? లేదా ? ఈసారి వేసుకో చెబుతాను!" అన్నది పార్వతి.

"కారాకిల్లీలో ఏముందమ్మా ? ఆడవాళ్ళు కూడా వేసుకుంటా రంటుంటేనూ!" అన్నాడు నారాయణ.

"ఆడవాళ్ళు ఏం చేస్తారో నాకెందుకు? గుంటూరులో ఆ రెడ్డి పెళ్ళాం చుట్ట కాల్చేది. అందుకని చుట్ట కాలుస్తావా ఏమిటీ? వల్లగాదు!"

"విజయనగరంలో అప్పలమ్మలు చుట్టనిప్పు నోట్లోకి పెట్టుకుని కాలుస్తారు" అన్నాడు నారాయణ.

"అందుకనే నే చెప్పేది. నువు ఆ దిక్కుమాలిన కారాకిల్లీ వెయ్యటానికి వీల్లేదు." అన్నది పార్వతి, మాట మారనివ్వకుండా.

"సరే పోనీ మానేస్తాను. ఇదేమన్నా తాగుడా ఏం?" అన్నాడు నారాయణ.

పార్వతి ఆరాటం ఆగిపోయింది.

"నే పంపిన పచ్చళ్ళు అవీ అయిపోయాయా? మిగిలాయా?" అని అడిగిందామె.

"వచ్చేముందే అన్నీ పూర్తి చేసేశాను." అని నారాయణ తొణకకుండా అబద్ధమాడాడు.

"వాటిని వాళ్ళకూ వీళ్ళకూ పందారం చెయ్యలేదుగద?"

"లేదు, అంతా నేనే తినేశాను."

నారాయణ తిరిగి వెళ్ళేలోగా పార్వతి వాడి కిష్టమైన వంటకాలు - వాడి కిష్టమని తను అనుకుంటున్నవి—అన్నీ మళ్ళీ మళ్ళీ చేసి పెట్టింది. వెళ్ళిపొయ్యే ముందు తన కొడుకును చూసుకుని, "ఎట్లాగైనా ఇంటితిండి ఇంటితిండే! చక్కగా ఒళ్ళు చేశాడు.... నువ్వు వెళ్ళగానే ఇల్లు చూడాలిసుమా? లేకపోతే మళ్ళీ చిక్కి సగమై వస్తావు! మరిచిపోకు. అశ్రద్ధ చెయ్యకు" అని హెచ్చరించింది.

* * * *

"బుల్లెన్నయా! వీడక్కడ చదవటం లేదని నా అనుమానం. వెంట ఒక్క క్లాసుపుస్తకమన్నా తెచ్చుకున్నాడేమో చూచావా? ఇక్కడున్న రెండువారాలూ ఎవరో గురజాడ, వీరేశలింగమనీ, ద్వారం నాయుడు[1] గారనీ, ఎవరో నారాయణభొట్లు[2] గారా?- దాసుగారా ఎవరైతేనేం లే? ఇవేతప్ప వాడికి మరోధ్యాసలేదు. ఆ ద్వారం నాయుడుగారు ఫిడేలు వాయిస్తారటగా? వీడికి చిన్నతనం నుంచీ ఫిడేలు నేర్చుకోవాలని. నేను కేకలేస్తే అడగటం మానేశాడు. చదువూ సంధ్యా లేకుండా ఆ నాయుడుగారి దగ్గిర ఫిడేలు నేర్చుకుంటున్నాడేమో! మనకు నిజం తెలిసేదెట్లా? వీడసలు ఇల్లెందుకు తీసుకోడూ?" అని పార్వతి వెంకటేశ్వర్లును ఊదరబెట్టింది.

వెంకటేశ్వర్లు నవ్వాడు.

"ఇంతకాలమూ వాణ్ని నువ్వేగదా పెంచావు? వాణ్ని ఆ పాటి నమ్మలేకపోతే ఎట్లా?" అన్నాడతను.

"వాడు నా చెప్పుచేతుల్లో ఉంటున్నాడనీ, నామాటంటే వాడికి లక్ష్యమనీ ఒక్కనాటి కనుకోకు. నాలు గింగిలీషుముక్కలు నేర్చి తనకే అన్నీ తెలుసుననీ, నాకేమీ తెలీదనీ అనుకుంటున్నాడు. నీ మాటన్నా వింటాడేమో. కాస్త గట్టిగా రాద్దూ, ఇల్లు చూడమనీ!"

కాలేజికి తిరిగి పోకముందు నారాయణ వెంకటేశ్వర్లుతో ఈ ఇంటిని గురించి మాట్లాడాడు; "చూడు మామయ్యా? ఇల్లు తీసుకుంటే ఇక నాకు చదువు సాగదు; కూరలు తేవాలి, సరుకులు తేవాలి- బోలెడన్ని పనులుంటాయి. హాస్టల్లో

---

1. ద్వారం వెంకటస్వామి నాయుడు (1893-?) అగ్రశ్రేణి వాయులీన సంగీత విద్వాంసుడు. చాలాకాలం విజయనగరం సంగీత కళాశాల ప్రిన్సిపాలుగా పనిచేశారు.

2. నారాయణదాసు. (1864-1945) : ఆదిభట్ల నారాయణదాసు. హరికథా పితామహుడు. వాగ్గేయకారుడు. సంస్కృతాంధ్ర పారశీక భాషల్లో పండితుడు. అనేక గ్రంథాలు రాశారు. అనువాదకులు కూడా. విజయనగరం సంగీత కళాశాలలో 1919 నుండి 36 వరకు ప్రిన్సిపాలుగా ఉన్నారు.

నాకు ఇద్దరు కెమిస్ట్రీ వాళ్ళున్నారు. ఇంగ్లీషమాటేమైనా సబ్జెక్టు మేమంతా కలిసి చదువుకుంటున్నాం. అట్లా చదవడం ముగ్గురికీ లాభిస్తుంది. హోటలు తిండిలాగా కాదు. హాస్టలు భోజనం బాగుంటున్నది. నెలకు పందొమ్మిదీ, ఇరవయ్యో అవు తున్నదనుకో. మేం ఇల్లు తీసుకుంటే మాత్రం ఆపాటికాదూ?"

తన మేనల్లుడి వాదన అంతా నిజమే అయినా, వాడు నిజంగా కోరు తున్నది తల్లి నుంచి స్వేచ్ఛ అని వెంకటేశ్వర్లు అర్థం చేసుకున్నాడు. పార్వతి నారాయణను మరీ బొట్టికాయల్లే చూస్తున్నది. అట్లా కూడదంటే నొచ్చుకుంటుంది.

"చూడమ్మాయ్! విజయనగరంలో కాపురం పెట్టాలని నీకు మహా ఉబలా టంగా ఉందిగాని, పెట్టిన మర్నాటినుంచీ ఎందుకు పెట్టానా అని విచారిస్తావు. విజయనగరం దరిదాపుల్లో ఉందనుకుంటున్నావాయేం ? చెన్నపట్నంకన్నా దూరం. దేశంగాని దేశం అనుకో. హాస్టల్లో ఉంటే నారాయణకు చెయ్యి బెణికినా కాలు బెణికినా నలభైమంది విద్యార్థులున్నారు చూసుకోవటానికి. ఏ జ్వరమో తగిలి వాడు పడకేస్తే నువు ఒంటరిదానివి ఏంచేస్తావు ? ఆ విజయనగరం వట్టి ఘోషావూరుట. వీధిలోకి ఆడపురుగన్నది రాదుట - చుట్టలు తిప్పి నోట్లో పెట్టు కుని కాల్చే అప్పలమ్మలుతప్ప. ఓ పనిమనిషిని పెట్టుకుందామన్నా వాళ్ళనే పెట్టుకోవాలి. వాడికి చక్కగా వారంవారం ఒళ్ళుపట్టి, గంగాళం నీళ్లు తలంటి పోస్తారుట. సుఖంగా ఉన్న ప్రాణిని ఎందుకు కష్టపెడుతావు? నువ్వెందుకు కష్టాలు కొనితెచ్చుకుంటావు? ఈ రెండేళ్ళూ ఇలాగే జరగనీ. వాడైనా హాస్టల్లో ఉంటున్నాడుగానీ విడిగా గది తీసుకోలేదు. హాస్టల్లో చచ్చినట్టు చదువుకోవాలి. వార్డెను రోజూ గదులన్నీ తణిఖీచేస్తాడు. వెర్రివెర్రి వేషాలు వెయ్యనివ్వరు. వీడు చదువుకోకుండా ఫిడేలు వాయిస్తూవుంటే హాస్టల్లో సీ టెవరిస్తారు? నువు అనవ సరంగా హైరానాపడకు."

వెంకటేశ్వర్లు చెప్పినది సబబుగానే ఉన్నదిగాని, తాను అనుకున్న కార్య క్రమం అమలు జరగటంలేదన్న అసంతృప్తి ఏమాత్రం తగ్గలేదు. పార్వతి కొంచెంసేపు ఆలోచించి, లాలూచీగా, "అయితే వాడు ఇల్లు తీసుకోనని నీతో అన్నాడా?" అని అడిగింది.

"వాడు నాతో అట్లా అనలేదుగాని, ఇల్లు వెతకటానికి తనకు టైము లేకుండా ఉన్నదనీ, ప్రాక్టికల్స్‌లో వెనకపడ్డాననీ అన్నాడు. శెలవుల్లో చూసి ఉండవచ్చుగాని కాలేజీ మూసినవెంటనే బయలుదేరివచ్చాడు. వాడు హాస్టల్లో ఉంటేనే బాగుంటుందన్నది నా ఉద్దేశమే. ఏ గదిలోనో ఉంటుంటే నేనే చెప్పే వాణ్ని నిన్ను కూడా వెళ్ళమని" అన్నాడు వెంకటేశ్వర్లు.

తాను విజయనగరం వెళ్ళి కొడుక్కు స్వయంగా పోషణ చెయ్యటానికి

ఉండే అభ్యంతరాల నన్నిటిని తోసిరాజనేమార్గం ఏదైనా ఉందా అని పార్వతి తల వాచిపోయేదాకా ఆలోచించింది.

కాని ఆలోచనంతా వృథా అయింది. పార్వతికి కొత్త సమస్య వచ్చి పడింది. రెండేళ్ళ క్రితం ఏ అమెరికాలోనో ప్రారంభమైన ఆర్థికకాటకం[1] మన దేశానిక్కూడా వచ్చింది. ధరలు పడిపోతున్నాయి. రూపాయి విలువ అపారంగా పెరిగిపోతున్నది. ఎకరం రెండున్నరవేలు చేసి అమ్మిన మాగాణి భూములను వెయ్యి రూపాయలకు కొనేవాళ్ళులేరు. బాకీలు చేసినవాళ్లు పేజారెత్తిపోతున్నారు. బాకీదార్లు కంగారెత్తిపోతున్నారు.

'మామయ్యగారు' ఉత్తరం రాశాడు. "నీ బాకీలు నువు వసూలు చేసుకో వటం మంచిది. ధరలు ఇంకా పడిపోతున్నాయంటున్నారు. కొన్నాళ్లుపోతే నీ దగ్గిర ఉన్న ప్రామిసరీ నోట్లు నెయ్యి కరగబెట్టు కోవటానికి మాత్రమే పనికి వస్తాయి." అని.

"నిజమే సుమా! నాకు తట్టనేలేదు డబ్బు బిగిసిపోయింది. అప్పులు పుట్టటం లేదు. కోర్టునిండా బాకీదార్ల కేసులే. ఆ ముసలాయన ఋణం నువు తీర్చుకో లేవు" అన్నాడు వెంకటేశ్వర్లు.

పార్వతి తనకు రావలసిన బాకీల నోట్లన్నీ తెచ్చి అన్నముందు పెట్టింది. అందులో నాలుగైదు చెల్లులున్న కాగితాలు కూడా ఉన్నాయి. కొంచెం అటూ ఇటూగా నాలుగువేల రూపాయలు వడ్డీమీద తిరుగుతున్నాయి. అన్నిబాకీలు వసూలు చేస్తే ఆరువేల రూపాయలదాకా వస్తాయి. అందులో పెద్దన్నలు ఇవ్వవలసిందే కొంచెం ఎక్కువగా రెండువేలున్నది.

---

1. ఆర్థిక కాటకం : 1929–1934 మధ్య ప్రపంచవ్యాప్తంగా వచ్చిన ఆర్థిక మాంద్యం. మన వ్యావసాయిక ఆర్థిక జీవితాన్ని తలకిందులు చేసిన పెట్టుబడిదారీవ్యవస్థ సంక్షోభం. తెలుగు దేశంలో యీ "ఆర్థిక ప్రళయం" వల్ల దానికి "వెనుకవున్న పైశాచిక ఆర్థిక సూత్రాల ప్రభావం" వల్ల రూపాయి విలువ అపారంగా పెరిగిపోయింది. డబ్బు మాయమైంది. ధరలు పడిపోయాయి. ఋణగ్రస్తుల ఆస్తులు తక్కువ ధరలకు బాకీదార్ల హక్కుభుక్తమయ్యాయి. కౌలుదార్లు, చిన్నరైతులు దివాళాతీశారు. పన్నులభారం హెచ్చింది. గ్రామీణ ప్రాంత విద్యార్థుల చదువులు ఆగిపోయాయి. నిరుద్యోగ సైన్యం పెరిగింది. కుటుంబరావు రాసిన చదువు, అరుణోదయం, వారసత్వం, గడ్డురోజులు నవలల్లో, పానకంలో పీచు, రక్తస్పర్శవంటి కొన్ని కథల్లో ఈ ఆర్థిక కాటక వాతావరణ చిత్రణ కన్పిస్తుంది.

బాకీలు రావేమోనన్న భయం పట్టుకున్నది పార్వతికి. ఆమెకు విజయ నగరం వెళ్ళేధ్యాస పూర్తిగా పోయింది. ముందు పైకం వసూలు, పార్వతికి తట్టిన ఉపమానం. ముళ్ళకంచె మీదినుంచి బట్టతీసుకొనటం; ఆరేసిన ప్రతిబట్టకూ తాను మూడు నాలుగు బట్టలు తీసుకోబోతున్న సంగతి పార్వతికి తెలీదు. రోజులు బాగా లేవు. కుబేరుడి ఖజానాల్లాంటి బ్యాంకులు అమెరికాలో దివాలా ఎత్తేశాయని వెంకటే శ్వర్లు చెప్పాడు; తాను ఆందోళన చెందటానికి తగినకారణం ఉన్నదని పార్వతి నమ్మింది.

తెనాల్లో ఒకరికి పార్వతి రెండువేలు అప్పులు పెట్టింది. అది మూడు వేల యింది. అప్పు తీసుకున్న పెద్దమనిషి వచ్చాడు. ఆయన మొహంచూస్తే తన తండ్రినో, తల్లినో అప్పుడే దహనం చేసివచ్చినట్టుగా ఉన్నాడు.

"పార్వతమ్మగారూ! నేను మీకు ఋణపడిఉన్నాను. మీ బాకీ తీర్చే మార్గం ఏదీ కనిపించదు. నాకు నాజరుపేటలో ఆరువందల గజాల ఆవరణా, పెంకుటిల్లూ ఉన్నది. అది మీ పేర రిజిష్టరు చేసేస్తాను; నన్ను ఋణ విముక్తుణ్ణి చెయ్యండి. ఇందువల్ల నేనే నష్టపోతానో మీరే నష్టపోతారో ఆ ఈశ్వరుడికే తెలియాలి. ముష్టె త్తుకునైనా బతుకుతానుగాని, ఋణగ్రస్తుడుగా చావటం నా కిష్టంలేదు" అన్నాడు.

పార్వతి చెవులకు ఆ మాటల్లో ఏ విధమైన ఆర్తనాదమూ వినిపించలేదు; లాంఛనంగా అనేమాటల్లాగే ఉన్నాయి. ఆమె వెంకటేశ్వర్లును వెంటేసుకుని తెనాలి వెళ్ళి, నాజరుపేటలో ఉన్న ఆ ఇల్లు చూసింది. ఇల్లుగలాయన వింటూండగానే వెంకటేశ్వర్లు, "రెండు మూడేళ్ళ క్రితం అయిదారు వేలుచేసే ఇల్లే?" అన్నాడు.

ఆ మాట పార్వతికి పట్టిచ్చినట్టయ్యింది. మూడువేల బాకీకింద ఇచ్చేస్తా నన్న ఇంటిధర రెట్టింపుచేసి ఇల్లుగలవాడిదగ్గరే చెప్పటమేమిటి? ఎందుకు ప్లీడరు పని చేస్తున్నాడు మళ్ళీ! కొంచెం కూడా లౌక్యం తెలీదు?

"అవును బాబూ! ఆ ధైర్యంతోనే అప్పులు చేశాం. అదివరకల్లా డబ్బు శాశ్వతమూ, మనిషి అశాశ్వతమూ, అనుకునేవాళ్ళం; ఇప్పుడు డబ్బుకూడా అశాశ్వ తమై పోయింది" పెద్దమనిషి.

ఇల్లు రాయించుకోవచ్చునని పార్వతికి వెంకటేశ్వర్లు సలహా ఇచ్చాడు.

"బేరం చెయ్యకుండానే? పైన ఓ అయిదొందలియ్యమందాం. ఒత్తిడి చేస్తే ఇస్తాడేమో! ఇస్తే మనకు చేదా?" అన్నది పార్వతి.

"నన్నడిగితే మనమే ఓ అయిదు వందలు ఆయనకు ఎదురియ్యొచ్చు" అన్నాడు వెంకటేశ్వర్లు.

అతని వైఖరి పార్వతికి ఏ మాత్రమూ నచ్చలేదు.

"నా పక్షాన మాట్లాడుతున్నావా? ఆయన పక్షాన మాట్లాడుతున్నావా?" అని ఆమె అన్న నడిగింది.

"ఎవరి పక్షాన మాట్లాడటం లేదు. రెండువేలు అప్పుపెట్టి ఏడెనిమిది వేలు ఆనాడు ఖరీదుచేసే స్థలమూ ఇల్లూ పుచ్చుకుంటున్నావు. ఆ పిచ్చివాడు ఆనాడే ఈ యింటిని అమ్మివుంటే తన ఖర్చు గడుపుకోగా, మిగిలింది అప్పులకిచ్చి ఇటువంటి ఇళ్ళు మూడు కొనివుండేవాడు. అది నువు అర్థంచేసుకుంటే ఆయన్ని ఒత్తిడిచేసి మరో అయిదు వందలు రాబట్టాలని చూడవు" అన్నాడు వెంకటేశ్వర్లు.

అతడన్నమాట కొంచెంకూడా పార్వతికి అర్థంకాలేదు. కాని అతని గొంతులో "తనపక్షం" ఏమాత్రమూ ధ్వనించటం లేదు. తన సొంత అన్న తన పగవాడల్లే ఎందుకు మాట్లాడుతున్నాడో ఆమెకు కొంచెంకూడా అర్థంకాలేదు.

పార్వతి దయాదాక్షిణ్యాలు లేని మనిషి అనటానికి వీల్లేదు. కాని పరిస్థితి అర్థం చేసుకుని ఎవరిపైనగాని దయచూపించటానికి కొంత మేధాశక్తి కావాలి. జాలీ, కోపమూ, ప్రేమా మొదలైనవి 'హృదయానికి' సంబంధించిన ఉద్రేకాలనీ, వాటికి మనస్సుతోనూ, బుద్ధితోనూ ఏమీ సంబంధం లేదనీ చాలా మంది-బాగా తెలిసినవాళ్ళ మనుకునేవాళ్ళు సైతం - అపోహపడతారు. అది అపోహే.

తను మాట్లాడినకొద్దీ వెంకటేశ్వర్లు మరీ ఇదైపోతున్నట్టు తోచి పార్వతి ఇల్లు రాయించుకోటానికి ఒప్పుకున్నది. వెంకటేశ్వర్లు స్టాంపు కాగితాలు కొని తన గుమాస్తా చేత క్రయపత్రం రాయించాడు. పదహారోతేదీన రిజిస్ట్రేషను. ఆ రాత్రే ఇల్లుగలాయన భార్య ఆ అమ్ముడయిన ఇంటిబావిలోనే పడి చచ్చిపోయింది. "ఈ ఇంట్లో నుంచి నేను పోను. పోతే నా శవం పోవలసిందే" అని ఆమె అదివరకే మొగుడి దగ్గిర శపథం చేసిందట.

పార్వతికి మాత్రం ఇది చాలా అమంగళంగానూ, తన మీది కసికొద్దీ చేసిన పనిగానూ తోచింది. ఆమె ఆ చచ్చిన మనిషిని తన మనసులో చాలా తూలనాడింది.

మొత్తంమీద పార్వతికి రావలసిన బాకీ లన్నిటినీ నిష్కర్షగా, వడ్డీలోనైనా ఒక్కదమ్మిడీ తగ్గించకుండా వసూలు చెయ్యగలిగింది. అన్నలు మాత్రం కొద్దిగా చెల్లువేశారు.

ధరలు ఇంకా పడిపోతూనే ఉన్నాయి. అవి ఎక్కడా ఆగేటట్టు లేవు. ధరలు పడటంచేతనే పార్వతి అన్నలకు బియ్యం వ్యాపారంలో నష్టం వచ్చింది. కొన్నధర అమ్మేనాటికి ఉండటంలేదు.

నారాయణకు డబ్బుకాటకం గురించి దాదాపు ఏమీ తెలీదు. తానెరిగిన విద్యార్థులు కొందరు జీతాలు కట్టలేక చదువులు మానుకుని వెళ్ళటం వాడికి

తెలుసు. వాళ్ళ తండ్రులు, అప్పుపుట్టక వాళ్ళకు డబ్బు పంపలేదని విన్నాడు. ఈ అప్పుపుట్టకపోడమనే దానివెనుక ఒక పెద్ద ప్రపంచ ఆర్థికసంక్షోభం ఉన్నట్టు వాడికి తెలీదు. తానూ, తన తల్లీ ఆర్థికంగా ఏమీ దెబ్బతినలేదు. తనకు నెలనెలా డబ్బు వస్తూనే ఉన్నది. అంతేగాదు, తెనాల్లో ఒక ఇల్లు కొన్నట్టు తల్లి రాసింది.

మొదటి సంవత్సరం పరీక్షలు పూర్తి అయి, నారాయణ తిరిగి రాగానే తల్లీ కొడుకులు తెనాలి వెళ్ళి, కొత్త ఇంటికి చిన్నచిన్న మరమ్మత్తులు చేయించారు. ఇంటికి సున్నం కొట్టించారు. ఇంటిని ఎవరికో అద్దెకిచ్చి బెజవాడకు తిరిగివచ్చారు.

ఇప్పుడిప్పుడు నారాయణ ఆడపిల్లను "పెళ్ళి" దృష్టితో చూస్తున్నాడు. ఎక్కడన్నా ఒక పిల్లను చూసినప్పుడు, "నాకు అటువంటిపిల్లతో పెళ్ళి అయితే బాగుండును!" అనిపించేది. మరుక్షణమే "ఎందుకవుతుంది? కాదు!" అనిపించేది. స్వతహాగా నారాయణ కొంచెం 'ట్రాజిక్‌మూడ్' మనిషి. తన పద్దెనిమిదిన్నర ఏళ్ళ జీవితంలోనే ఎన్నో మంచి అవకాశాలు చెయ్యిజారిపోయినట్టు వాడికి అని పించేది. భవిష్యత్తులో కూడా తనకు ఏదీ బాగా కలిసిరాదు అనుకునేవాడు.

పెళ్ళి ఈడు పిల్లల్ని వాడు పెళ్ళిదృష్టితో చూసేవాడేమోగాని, వయసు వచ్చిన ఆడవాళ్ళను మరొక దృష్టితో చూస్తూ వచ్చాడు. వాళ్ళలో కొంత కొంత మంది వాడి మెదడులోని అడుగుపొరలను దారుణంగా మథించి విడిచిపెట్టేవాళ్ళు.

నాజరుపేటలో ఇల్లు అద్దెకు మాట్లాడుకున్నవాళ్ళు ఇల్లు చూడటానికి వచ్చి నప్పుడు వాళ్ళవెంట ఒక పదిహేను పదహారేళ్ళ అమ్మాయి ఉన్నది. బంగారం రంగు-కారునలుపు వెంట్రుకలు. ఎంతో అందమైన కళ్ళు, చిన్నమూతి, నారా యణ కళ్ళకు అప్సరసలాగా కనబడింది. వాడి నాడీవేగం హెచ్చింది. శ్వాస కొంచెంసేపు సరిగా ఆడలేదు. ఆ అమ్మాయిని మరిచిపోవటం నారాయణకు చాలా కష్టమయింది. వాడు అందుకోసం ప్రయత్నించాడనికాదు; వాడి మనస్సు ఇతర విషయాలమీదికి పోవటానికే ప్రయత్నించింది. కాని వాడు దాన్ని మళ్ళీ మళ్ళీ ఆ అమ్మాయిమీదికి మళ్ళిస్తూ వచ్చాడు. ఇటువంటి విషయాలలో మనస్సును తప్పు పట్టి లాభంలేదు. తప్పంతా ఆ మనస్సుకు కళ్లెంవేసి లాగే బుద్ధిది. మనస్సు స్వేచ్ఛాజీవి; బుద్ధి నియంత.

"నేనెందుకా అమ్మాయిని గురించి ఆలోచించటం ! ఆ పిల్ల కేనాడో పెళ్ళి అయిఉంటుంది. నా మొహానికా! అటువంటిది దొరకటం కల్లోమాట" అను కున్నాడు నారాయణ. కన్యాశుల్కంలో బుచ్చెమ్మ[1]ను గురించి గిరీశం[2] స్వగతం జ్ఞాపకం తెచ్చుకుంటే తన స్థితికి సరిపోయినట్టున్నది.

1. బుచ్చమ్మ : గురజాడ కన్యాశుల్కం నాటకంలోని బాలవితంతువు.
2. గిరీశం : కన్యాశుల్కంలోని అజరామరమైన పాత్ర.

నారాయణ ఈ మాట అనుకున్న కాస్సేపటికి, ఆ అమ్మాయి వితంతువని వాడికి తెలిసింది. "వాళ్ళది మనశాఖకాదు.... పాపం, పెళ్ళయిన మూడునెల్లకే మొగుడు పోయాట్ట....తండ్రి చచ్చినా మళ్ళీ పెళ్ళి చెయ్యననేశాడు....సంస్కృతం చదివిస్తున్నాట్ట.... పాపం, అటువంటి పిల్లను చూసినప్పుడు వెధవముండల పెళ్ళిళ్ళు చేసినా తప్పులేదనిపిస్తుంది. చక్కనిచుక్క చిదిపి దీపం పెట్టొచ్చు.... ఆ మాత్రం పిల్ల దొరికితే నారాయణకు ఏనాడో పెళ్ళిచేసి ఉండకపోయానా?" అని పార్వతి వెంకటేశ్వర్లు భార్యతో చెబుతున్నది.

డామిట్, నిజంగా బుచ్చమ్మేనన్నమాట! కాని తాను గిరీశం ఏ కోశానా కాడు. షేక్స్పియర్[1] చెప్పినట్టు, "అయ్, దేర్జ్ ది రబ్!"

ఇంకేమీ చెయ్యలేక నారాయణ పగటికలలు కంటున్నాడు. ఇప్పుడుకాదు. బియ్యే పూర్తి అవుతూనే తను ఎవరికీ చెప్పకుండా వెళ్ళి– తన ఇల్లేగా? వండర్. ఆ అమ్మాయి తన ఇంట్లోనే ఉంటున్నది!- వెళ్ళి అద్దెకుండే ఆ లక్ష్మీకాంతం గారితో "అయ్యా, మీ అమ్మాయిని సంస్కృతపు ఉప్పుపాతర్లో ఊరెయ్యకండి. నేను కళ్ళకద్దుకుని పెళ్ళాడేస్తాను, ప్రెషస్‌గా చూసుకుంటాను" అంటాడు. ఆ లక్ష్మీకాంతం ఒప్పుకోడూ, ఆ అమ్మాయికి- పేరేమిటో?– లవ్‌లెటర్స్ రాసేస్తాడు. లేవదీసుకుపోతాడు. ప్రపంచమంతటా లేవదీసుకుపోటాలు ఉంటూనే వున్నాయి. కాని అన్నీ డిజర్వింగ్ కేసులు కాకపోవచ్చు. ఇది చాలా డిజర్వింగ్ కేస్; సందేహం లేదు.

మనసు ఎంత ప్రగల్భాలు పలుకుతున్నా మరొకవంక ఏడుస్తున్నది - తన అశక్తత తలుచుకుని.

నెల గడిచింది.

---

1. షేక్స్పియర్, విలియం (1564–1616): ప్రపంచ విఖ్యాతి ఆంగ్ల నాటక కర్త, ప్రయోక్త, కవి. ఎలిజబెత్ యుగ సంఘ చైతన్యాన్ని, ప్రధానంగా కులీన వర్గ చైతన్యాన్ని చిత్రించిన రచయిత. భూస్వామ్య భావుకత్వంతో ధనస్వామ్య ప్రాదుర్భావ దశలోని వైరుధ్యాలను – దాని విజయాలనూ, విషాదాలనూ, నైచ్యాలనూ-చిత్రించిన రచయిత. ఇతివృత్త నిర్మాణంలో, దాని నాటకీకరణలో, పాత్ర స్వభావ చిత్రణలో అనన్యమైన ప్రతిభాశాలి, ఆయన ప్రముఖ మోదాంత నాటకాలు; మచ్ ఎడో ఎబౌట్ నథింగ్. యాజ్ యులైక్ యిట్ (ట్వెల్త్‌నైట్) (1598–1600): విషాదాంత నాటకాలు: హామ్లెట్ (1598–1601) ఒథెల్లో (1604–1605), కింగ్‌లియర్, మాక్‌బెత్ (1605–1606).

"ఆ లక్ష్మీకాంతంగారు అద్దె మనియార్డరు చేస్తానన్నారు; చెయ్యనేలేదు. అడుగురోనే హంసపాదు" అన్నది పార్వతి ఒకనాడు.

"నేను వెళ్ళి వసూలు చేసుకురానా అమ్మా?" అందామనుకున్నాడు నారాయణ. కాని ఆ మాట అనటాన్కికూడా వాడికి సాహసం చాలలేదు. 'ఒరే. నారాయణా! నువ్వు వట్టి చవటవి! చలికాళ్ళ పెద్దమ్మవి! గిరీశం ఎక్కడ? నువ్వెక్కడ! డఫర్!' అని వాడు తనను తాను తిట్టుకున్నాడు.

పోనీ పార్వతన్నా వాణ్ణి పంపలేదు. ఉత్తరం రాసింది ఉత్తరం పోస్టుచేసిన మర్నాడే పన్నెండు రూపాయల మనియార్డరూ వచ్చింది.

నారాయణ ఆ అమ్మాయి మూలంగా పొందిన ఆవేదన చాలావరకు తగ్గినట్టు కనబడిన సమయంలో ఆ ఆవేదన నుంచి మెరుపులాటి ఐడియా ఒకటి తలలో తళుక్కుమన్నది.

ఒక బాల వితంతువుమీద కథరాస్తే ఎట్లా ఉంటుంది?

ఈ మెరుపులాటి ఆలోచన వెంట మబ్బుల్లాగా అనుమానాలు కమ్ముకొచ్చాయి. తనకు కథలు చదవటం తెలుసుగాని, రాయటం ఏం తెలుసు? కథలు రాసేవాళ్ళూ, కవిత్వం రాసేవాళ్ళూ, పాటకచేరీలు చేసేవాళ్ళూ, నాటకాలలో వేషాలు వేసేవాళ్ళూ, ఇతర కళాకారులూ అంటే నారాయణకు గౌరవమే. కాని ఆ పనుల్లో తాను ఏది చేద్దామనుకున్నా, నడివీధిలోకి నగ్నంగా వెళ్ళేవాడికి కలిగే భావంకలిగేది; ఎందుకో వాడికే తెలీదు. మామూలు మనిషి జీవితంలో ఏదో ప్రైవసీ ఉంది. కళాకారుల జీవితంరో అదిలేదు. కళాకారుడు కావటానిక్కూడా ఒక విధమైన 'ధైర్యం' కావాలి. ఆ ధైర్యానికి కళాకారులు కానివాళ్ళంతా అర్థంచేసుకుంటారు. మెచ్చుకుంటారు. ఐతే సమర్థతలేని కళాకారులను చూస్తే వాళ్ళది 'ధైర్యం' అనిపించదు 'సాహసం' అనిపిస్తుంది.

నారాయణ ఒక నాటకంలో ఒక నటుణ్ని చూశాడు. పాపం ఆ అబ్బికి పాటరాదు; కాని పద్యాలు పాడాడు. అతన్ని ఏడిపించటానికి ఎవరో ఒక పద్యానికి వన్సుమోరు కొట్టారు. ఆ మానవుడు మళ్ళీ పాడాడు. అది ధైర్యమా? కాదు సాహసం.

నారాయణకు కథలు రాయటం చాతకాదు ఎన్నడూ రాయలేదు. అందుచేత రాయాలంటే సాహసించాలి. సాహసించటానికి తనకు ధైర్యం ఉందా అని తనని తాను ప్రశ్నించుకున్నాడు.

"రాసి చూస్తాం, తప్పేం? రాయగానే పత్రికకు పంపించాలని ఎక్కడుంది?" అనుకున్నాడు నారాయణ.

నారాయణ తాను రాయదలచుకున్న కథ గురించి ఆలోచించటానికి ఎంతో ప్రయత్నించాడు. ఎంత ఆలోచించినా రెండు మూడు అంశాలే తలలో స్పష్టంగా మెదిలాయి. సినిమాస్టారు సులోచన అంత అందమైన అమ్మాయి. బాలవితంతువు. తండ్రి మళ్ళీ పెళ్ళి చెయ్యడు. భగవద్గీత పారాయణం చేస్తూ కూర్చోమంటాడు. (సంస్కృతం భగవద్గీతగా ఎట్లా మారిందో నారాయణకు తెలీదు! కాని తన తండ్రి కాంగ్రెసులో చేరాక భగవద్గీత చదివాడని వాడకి తెలుసు) ఆ అమ్మాయి హీరోయిన్ అవుతుంది కాబోలు: ఒకబ్బాయిని - తమయింటి పై అంతస్థులో ఉండే ఇంటివారబ్బాయిని (నాజరు పేట ఇల్లు మేడకాదు) ప్రేమిస్తుంది. ఆ అబ్బాయి హీరో - కథలో నిర్వహించే పాత్ర ఏమీ ఉండేటట్టు కనబడలేదు. పెళ్ళికి పిల్ల తండ్రి ఒప్పుకోడు. అసలాయన్ని ఎవరన్నా అడుగుతారో లేదో ఇంకా స్పష్టంకాలేదు. అది రాసేటప్పుడు తేలాలి; మధ్యలో జరిగే కథకింకా అలంకారం ఏర్పడలేదు. చివరమాత్రం స్పష్టంగా వుంది; ఆ అమ్మాయి బావిలోపడి చచ్చిపోయింది. అవును; అదే బావిలో!

ఈ కథ విషాదాంతం అయితీరాలన్న విషయం ఒకటి మటుకు నారాయణకు స్పష్టంగా తెలుసు. దాన్ని సుఖాంతం చేస్తే తనకు ద్రోహం చుట్టుకుంటుందని నారాయణకు గట్టినమ్మకం. (నిజానికి రచనా ద్రోహమనేది ఉన్నది. అనేకమంది రచయితలు దాన్ని చేస్తూంటారు. అయితే అటువంటిది ఒకటి వుందని రచయితలు సాధారణంగా గుర్తించరు. ఒక్క రచనకూడా చెయ్యకముందే నారాయణ దాన్ని గుర్తించి ఉండటం విశేషం).

చివరకు నారాయణ తెగబడి రాయటానికి పూనుకున్నాడు. కొత్తగా దొంగ తనమో, రంకుతనమో చెయ్యబొయ్యేవాడి పాట్లన్నీ నారాయణ పడ్డాడు. చేతులు వణికాయి; ఒళ్ళంతా చెమట పట్టింది. గుండె దడదడలాడుతున్నది. ఒక ఎక్సర సైజు పుస్తకము కలము తీసుకుని మూలగదిలో చేరి తలుపు గడియ పెట్టేశాడు. వణుకుతున్న చేతులతో, వంకరపోయే అక్షరాలతో రచన ప్రారంభించాడు. బుర్ర మొదటి వాక్యానికే వేడెక్కింది. నెత్తిమీద జుట్టు లేచి నిలబడుతున్నట్టు తోచి, దాన్ని మాటిమాటికీ చేత్తో వెనక్కు పడుకోబెడుతున్నాడు.

మూడు గంటల అనంతరం అయిదో పేజీ సగం కూడా నిండకముందే కథ అయిపోయింది.

తిరిగి చదువుకుంటే కథ నానాగొడవగా ఉన్నది. కథానాయకుడికి పేరు పెట్టడం మరచిపోయాడు. వాడు ఏమీ చెయ్యడు, కథలో ఉండటం తప్ప. కథ నిండా ఆశ్చర్యార్థకాలు జాస్తిగా వున్నాయి. కాని అవి అవసరమే ననిపించింది నారాయణకు. వెనక ఎవరో అన్నారు. పంక్చుయేషన్ మార్క్సు లేకుండా

నన్నయభట్టు[1] ఎంత మంచి వచనం, ఎంత సరళంగా రాశాడో చూడమని. కాని నన్నయభట్టల్లే రాస్తే ఈనాడు ఎవరు చదువుతారు? ఆ వాదాన్ని నారాయణ ఆనాడే కొట్టేశాడు. అరసున్నాలు పెట్టకపోతే చదివేవాళ్ళకు అర్థం కాదనుకునేవాళ్ళు చాలా మంది ఉండటం నారాయణకు తెలుసు. అరసున్నాలకన్న ఆశ్చర్యార్థకాలు పాపిష్టివని వాడికి తోచలేదు.

రచన నిండా స్పెల్లింగు తప్పులున్నాయి. వాటిని దిద్దటమా, మొత్తం తిరిగి రాయటమా అన్నది మొదటిసమస్య. దాని కింకో సమస్య అడ్డుతగిలింది, రాసినది మర్యాదగా చించెయ్యటమా, లేక ధైర్యంగా ఏ పత్రికకన్నా పంపటమా? కొంచెం సేపు గుంజాటన పడ్డాక మర్యాదను ధైర్యం జయించింది. ఈ గుంజాటన ఫలితం ఎట్లా ఉండబోయేదీ తనకుముందే తెలిసినట్టుగా నారాయణ తప్పులన్నీ దిద్దేసి, చివరకు పేరు రాసి పత్రికకు పంపించాలని ఆ తరువాత నిర్ణయించుకున్నాడు. నిర్ణయించుకున్నాక తన పేరుకింద తన హాస్టలు ఎడ్రస్ రాశాడు. ఆరోజే అది మద్రాసు నుంచి వెలువడే ఒక పక్షపత్రికకు[2] వెళ్ళిపోయింది. దాన్ని పోస్టుచేసినప్పటినుంచీ ఆ కథ "ఆ అమ్మాయికి" అందుతుందా అందదా అన్న అనుమానం నారాయణను బాధించింది. ఆ అమ్మాయికి అందితే ఆ 'లక్ష్మీకాంతం' గారికీ అందుతుందనీ, అది తన కథేనని ఆ అమ్మాయి అర్థంచేసుకుంటే ఆమె తండ్రికూడా అర్థం చేసుకుంటాడనీ నారాయణకు తట్టలేదు. వాడి మనసులో ఆ అమ్మాయి వేరే లోకంలో ఉన్నది కథలో ఉన్న కథనాయికకూడా అట్లాగే ఉన్నది. ఆమె ఎవరి జీవితంలోనూ పాల్గొనదు; ఆమె జీవితంలో ఎవరూ పాల్గొనరు.

అసలు కథే అచ్చు కాకపోవచ్చునన్న ఆలోచన నారాయణకు చాలా ఆలస్యంగా గాని తట్టలేదు. అదే నిజమయింది. నారాయణ తొలి కళాఖండం బుట్ట దాఖలై పోయింది....

బియ్యే పూర్తి కాగానే పార్వతి తన కొడుక్కు సంబంధం చూసింది. చెరుకు పల్లి వారమ్మాయి. పిల్ల చామనచాయగా ఉంటుంది. కాని కుదిరికైనది. నొక్కుల జుట్టు, వెంట్రుకలు స్ప్రింగుల్లాగ ముడుచుకోవటం చేత జడ పొట్టిగా ఉంటుంది. కాని వెంట్రుక సాగదీసి చూస్తే పొడుగే. కట్నాలూ లాంచనాలూ

---

1. నన్నయభట్టు (11 వ శతాబ్ది). నన్నయభట్టు వచనమే కాదు ఆయన మార్గంలో నడిచిన కావ్య వచనంలో 19 వ శతాబ్ది దాకా విరామ చిహ్నాలుండేవికాదు.

2. మద్రాసు నుండి వెలువడ్డ పక్షపత్రిక చిత్రగుప్త కావచ్చు.

అన్నీ కలుపుకుని రెండువేలిస్తామన్నారు. పిల్లపేరు సావిత్రి. వయసు పన్నెండు నిండుతున్నాయి.

పరీక్షలు పూర్తి అయి నారాయణ ఇంటికి రాగానే పార్వతి ఈ శుభవార్త చెవిని వేసింది. నారాయణ ముభావంగా "ఆఁహాఁ?" అన్నాడు.

"పిల్లను చూసుకురావు మరీ?" అన్నది తల్లి.

"ఏముంది చూడటానికీ? నువు చూశావుగా?" అన్నాడు కొడుకు.

"అదేమిట్రా? చేసుకోబొయ్యేదాన్ని చూచుకోరూ?"

"నేను కాబోయే పెళ్ళాన్ని చూచుకోవటం కన్నా, నువు కాబోయే కోడలిని చూచుకోవటం ముఖ్యమేమో?"

"రెండూ అవసరమే ననుకో."

"రెంటికీ కుదరకపోతేనో?"

ఈ సవాళ్ళు చూసి పార్వతికి మండిపోయింది.

"ఏమిటీ డొంకతిరుగుడువాదం? నీకు పెళ్ళి అక్కర్లేకపోతే చెప్పు. వాళ్ళతో చెప్పేస్తాను."

నారాయణ నవ్వాడు.

"నా మాట నీ కర్థంకావటంలేదు. నా పెళ్ళి నా కిష్టమైనట్టయినా జరగాలి. నీ యిష్టప్రకారమైనా జరగాలి. నేనయితే పదహారు పదిహేడేళ్ళకు తక్కువైన పిల్లను చేసుకోను. దానికి నువ్వొప్పుకోవు. ఇంకెందుకూ? నీకు నచ్చినదాన్ని కట్టబెట్టు. చేసుకుంటా."

పార్వతికి ఎందుకో తన పెళ్ళి జ్ఞాపకం వచ్చింది. తనను తన అత్తగారు వరించి చేసుకున్నది. తన భర్త వరించలేదు. అతనికి అంద రాడవాళ్ళూ ఒకటే. తక్కువరకం ఆడవాళ్ళంటే కాస్త ఎక్కువ యిష్టం - కాని అది వేరే సంగతి. అసలు సంగతేమంటే, తనను తన భర్త సుఖపెట్టనప్పుడు తన అత్తగారు నిస్సహాయురాలై చూస్తూ ఉండిపోయింది.

"పోనీరా, నేను అడ్డంరాను. నీకు కావలసిన పిల్లను నువే చేసుకో" అంటూ పార్వతి అస్త్రసన్యాసం చేసింది.

నారాయణ చిత్తయినాడు. తనకు కావలసిన పిల్ల ఏదీ? ఆ పిల్లను తాను పెళ్ళాడటం సాధ్యమా? తన తీర్మానాలకూ, సాంఘిక వాతావరణానికీ మధ్య పెద్ద అగాధం ఉంటూండగా తన యిష్టప్రకారం ఎట్లా జరుగుతుంది.

"నాక్కావలసిన పిల్ల అనేమాట ఎత్తకు. అటువంటి పిల్ల అంటూవుంటే నేను చేసుకోనూలేను. నువ్వు చెయ్యా లేవూ?" అన్నాడు వాడు.

"నీ మనసులో ఎవరో ఉన్నట్టుంది. చెప్పు, సాధ్యమైతే ప్రయత్నిద్దాం." అన్నది పార్వతి. బొత్తిగా కూడని సంబంధం చేసుకుంటానని వాడంటే ఇచ్చిన మాట వెనక్కు తీసుకునేటందుకు లక్షమార్గాలు దొరుకుతాయని ఆమె ధైర్యం.

"మనింటో అద్దెకుంటున్న లక్ష్మీకాంతయ్య కూతురికి మళ్ళీ పెళ్ళి చేశారా?" అన్నాడు నారాయణ, మరేదో మాట్లాడుకున్నట్టుగా.

'అటుందా నీ దృష్టి?' అన్నట్టుగా పార్వతి చాలా చిన్న నవ్వొకటి నవ్వి, "ఆ పిల్ల సంగతే అడిగావూ? ఆ మధ్య ఏదో పాడు పని చేసిందట- తండ్రి దానికి తల గొరిగించి ముసుగు తగిలించాడు." అన్నది.

నారాయణ గుండెలో మంచుగడ్డ పెట్టినట్టయింది. ఎంతోకాలంగా తన మనసులో పెంచుకున్న ప్రేమలాంటిది ఒక్కసారిగా చచ్చిపూరుకున్నది. పైకి మాత్రం "ఆయనదే తప్పు. ఏనాడో ఆ అమ్మాయికి పెళ్ళిచేయవలసింది." అన్నాడు.

వాడి మనసులో ఎన్నో ఆలోచనలు శరవేగంతో పరిగెత్తుతున్నాయి. ఆ అమ్మాయికి తల గొరిగించి ముసుగేసారని తనతల్లి కెందుకు అంత సంతోషం? సాటి ఆడదేగాక, తానూ వితంతువే కదా? తనకు ముసుగు వేసేవాళ్ళెవ్వరూ లేరనా, తను పాడుపనులేవీ చెయ్యలేదనా ఈ అహంకారం? లోకవిధానానికి బానిసలై నడిచేవాళ్ళకు పెడదారి తొక్కి శిక్ష పొందిన వాళ్ళంటే ఎంత తేలిక భావమో.

తల్లి వైఖరి చూసి నారాయణ హర్షించలేకపోయినాడు. ఆమెలో ఒక విధమైన క్రూరత్వం వాడికి యిదివరకే చాలాసార్లు కనబడింది. మనుషులు మూడు రకాలు: కొందరు సూర్యుడిలాంటివాళ్ళు- తమ సొంత తేజస్సుతో యితరులకు ప్రాణం పోస్తారు; కొందరు చంద్రుడిలాంటివాళ్ళు- తమకు స్వయంగా ప్రకాశం లేకపోయినా, అరువు తెచ్చుకున్న ప్రకాశాన్ని యితరులకు అందించి, ఆహ్లాదం కలిగిస్తారు; కొందరు అచ్చమైన చీకటిలాటివాళ్ళు — అంగుళం ఎడాన్ని ఆమడ దూరంలాగా అయేటట్టు చేస్తారు. తన తల్లి — కొన్ని విషయాలలో చీకటిలాగా ప్రవర్తిస్తుంది. ఆమె వృద్ధిక్షయాలు గల చంద్రుడనుకుంటేనేగాని వాడి అంతరాత్మ శాంతించలేదు.

"అట్లా బెల్లంకొట్టిన రాయిలాగా అయిపోయావేం? నే నడిగినదాని కేం చెప్పావు?" అన్నది పార్వతి, కొడుకు పరధ్యానం ఇంతలో విడదని గ్రహించి.

నారాయణ ఉలిక్కిపడి, "ఏమడిగావు?" అన్నాడు.

"అదే, ఆ చెరుకుపల్లివారి సంబంధం గురించి?"

"నీ యిష్టమని చెబితిని గదమ్మా!"

"చెప్పావులే. నువ్వెళ్ళి చూసిరావూ? మనిద్దరమూ పోయొద్దామా?"

"నేను చూడక్కర్లేదు. నువు చూశావుగా? నీలో నాకు నమ్మకముంది."

"అయితే చూడవా?"

"అనవసరం."

నారాయణ పిల్లను చూడననటంలో తనమీది నమ్మకం కన్న, గాంధీగారి సత్యాగ్రహమూ, సహాయనిరాకరణమూ కనిపించాయి పార్వతికి. దానితోబాటే ఎట్లాగైనా వాడికి సావిత్రిని చూపించాలనే పట్టుదలా కలిగింది ఆమెకు. ఆమె వెళ్ళి వెంకటేశ్వర్లు సహాయం అర్థించింది.

"దుగ్గిరాల వెళ్ళి ఆ అమ్మాయిని చూసుకు రారాదుట్రా? నువు నీ తల్లి అడుగులకు మడుగులొత్తి ఏ కొయ్యగుంజకు తాళి కట్టమన్నా కడతావనుకో, వాళ్ళకు నిన్ను చూడాలని ఉండదూ? ఆ పిల్ల నిన్ను చూసి, "ఎబ్బే, నాకింత అందమైన మొగుడొద్దు అనుకుంటే?" అన్నాడు వెంకటేశ్వర్లు వెటకారమూ, హాస్యమూ మిళితం చేసి.

నారాయణ తన తల్లినీ, వెంకటేశ్వర్లు భార్య స్వరాజ్యలక్ష్మినీ వెంటపెట్టుకుని పాసెంజరులో బయలుదేరాడు. ఈ ప్రయాణం నారాయణకు అవాస్తవంగా తోచింది. వాడి మనస్సు కృష్ణలాగా యిసుక ఎడారి అయివున్నది. వాడింకా లక్ష్మీకాంతయ్య కూతుర్ని గురించే ఆలోచిస్తున్నాడు. ఆ పిల్ల ఏదో చెడ్డగా ప్రవర్తించిందన్న తరవాత అతనిలో ఏర్పడిన గాఢ మమకారం పూర్తిగా పోయింది. కాని ఒక విధమైన సామాజిక సానుభూతి పోలేదు. తనకు ధైర్యసాహసాలుంటే ఆ పిల్లను తానే పెళ్ళాడగలిగి వుండేవాడేమో. నిజమే ఆ పిల్ల మైనరు. తాను లేవదీసుకుపోతే జైల్లో పెడతారు. జైలునుంచి కొంతకాలానికైనా బయటకి రావచ్చు. ఉద్యమంలో ఎన్ని లక్షలమంది జైలుకు పోలేదు. బయటికి రాలేదు? అందుక్కూడా తను ఒడబడివుంటే ఆ పిల్లకు జీవితమంతా ముసుగు తప్పేది. ఒక మనిషి జీవితాన్ని ఉద్ధరించటానికి జైలుకు పోవటం అపవిత్రమా? న్యూనమా? తాను పెళ్ళాడాక ఆ తండ్రి ఆమెకు తల గొరిగించి మూల కూర్చోబెట్టగలుగునా?

నిజంగా పిరికివాళ్ళెంత సంఘద్రోహులు! తను ఎంత పిరికివాడు!

ఆ అమ్మాయి తనను ప్రేమించక పోవచ్చునని వాడికి తట్టింది. కాని వాణ్ణి యిప్పుడు బాధించినది ప్రేమ కానేకాదు. తానొక పిల్లను చూడబోతున్నాడు. తనకు పిల్ల నచ్చకపోయినా ఆ మాట పైకి అనగూడదని ముందే నిశ్చయించుకున్నాడు. ఆ పిల్లకు తను నచ్చకపోతే తప్ప ఈ పెళ్ళి జరిగితీరుతుంది. ఈ పిల్ల తనను ప్రేమిస్తుందన్న నమ్మకం ఏమైనా ఉందా? ఏమిటో?

చెరుకుపల్లివారు బాగా కలిగినవారల్లే ఉన్నారు. పసుపు వర్తకం చేస్తారుట. వారికి లంకంత డాబాఇల్లున్నది. అదేదో సత్రంలాగుందిగాని ఇల్లులాగా లేదు. చాలా గదులున్నాయి. అయితే కొన్నింట్లో సరుకులు మాత్రమే ఉన్నాయి. ఇంట్లోకి పోగానే పసుపు వాసన.

పిల్ల తండ్రి సుబ్బారాయుడూ, తల్లి శేషమ్మా మంచి మర్యాదస్తులుగా కనబడ్డారు. వాళ్ళ మర్యాద కృత్రిమంగా కనబడలేదు.

సుబ్బారాయుడు నారాయణతో చనువుగా చాలా సేపు మాట్లాడాడు. కాని ఏమి ప్రశ్నలు వెయ్యలేదు. నారాయణ గురించి ఆయన తెలుసుకునేదంతా అది వరకే తెలుసుకున్నాడు. తెలిసిన విషయాలు అతని నోటనే చెప్పించటానికి ప్రయత్నించలేదు. బెజవాడ ఎండలను గురించీ, తెనాలి శీతపైత్యపు నీళ్ళను గురించీ, దుగ్గిరాల లాకు గురించీ, పసుపుధర పడిపోవడం గురించీ మాట్లాడాడు. గొల్లపూడి వారు తనకు దగ్గిర బంధువులేనని చెప్పాడు. ఆయన కబుర్లు ఆట్టే పట్టించుకోకుండా 'ఊ' కొడుతూ ఉండిపోయాడు నారాయణ.

కొంచెం సేపటికి సావిత్రిని తెచ్చారు. ఆ పిల్లను చూస్తూనే నారాయణకు ఏదో విచిత్రమైన భావం కలిగింది – తనకు చాలా కాలంగా తెలిసిన పిల్లే అయినట్టు, ఆ భావానికి ఆధారం ఏమీ కనిపించలేదు. ఆమె టైప్ మనుషులను అతను లోగడ చాలాసార్లు చూసి ఉండాలి.

సావిత్రి సిగ్గుపడలేదు. అది కూడా నారాయణకు ఎబ్బెట్టుగా కనబడలేదు.

సుబ్బారాయుడిలాగా కాక పార్వతి, ఆ పిల్ల చేత మాట్లాడించటానికి, తనకు తెలిసిన విషయాలే అడిగి ఆ పిల్లచేత సమాధానాలు చెప్పించుకోసాగింది. నారాయణ చూసి చూసి, "ఆ అమ్మాయికి నత్తి అదీ ఏమీలేదు!" అన్నాడు తల్లితో.

సందర్భశుద్ధి అదీ లేకుండా అన్నట్టుగా ఉన్న ఆ మాటకు ఎవ్వరూ నవ్వలేదు; కాని సావిత్రి అతనికేసి చూసి, చిన్నగా నవ్వి, కళ్ళు పక్కకు తిప్పుకున్నది. అది పార్వతికి ఏమాత్రమూ నచ్చలేదు. పెళ్ళిచూపులకు పిల్లను తెచ్చే వాళ్ళు బాగా అలంకరించి, నగలూ అవీ పెట్టి, ఉన్నంతలో మంచి బట్టలు వేసి తెస్తారు. సావిత్రి జడ అయినా మళ్ళీ వేసుకోకుండా కట్టుబట్టలతో ఎదటికి వచ్చింది. పిల్లకు కొంచెం కూడా సిగ్గులేదు. పైపెచ్చు పెళ్ళికొడుకు ముఖంలోకి చూసి నవ్వడం!

సాయంకాలం పాసెంజరులో ఇంటికి తిరిగి వచ్చేటప్పుడు పార్వతి తన పతివేగారితో ఈమాటే అన్నది. మళ్ళీ మళ్ళీ అన్నది.

"అట్లా అయితే ఈ సంబంధం మనకొద్దు" అన్నాడు నారాయణ.

"నువు నోరుమూసుకుంటావా? సంబంధం చేసుకోవాలో, మానుకోవాలో నిర్ణయించుకోటానికీ, పెద్దదాన్ని నేనేడిస్తినిగా?" అని పార్వతి కొడుకును మందలించింది. ఆ ఊపులోనే కొడుకును నాలుగూ పెట్టేసింది; "ఏం మాట్లాడాలో తెలీకపోతే నోరుమూసుక్కూచోలేవూ? అధిక ప్రసంగం దేనికి? నిన్ను వాళ్ళంతా వెర్రివెధవ క్రింద కట్టెయ్యటానికా? ఆ అమ్మాయికి నత్తిలేదేమిట్రా? నీ మొహం! నత్తి ఉందని ఎవరన్నారురా?" అని ఆమె కొడుకును నిగ్గదీసింది.

"ఆఁ హాఁ. నువు తెలిసిన విషయాలే గుచ్చి గుచ్చి అడుగుతుంటే ఆ అమ్మాయికి నత్తి ఉన్నదనుకున్నావేమో ననుకున్నా. ఆ అమ్మాయి నాన్న నాతో అంతసేపు మాట్లాడాడుగాని, ఒక్క ప్రశ్న వెయ్యలేదు. నీ ప్రశ్నలు చూసి నన్ను వెర్రిదాని వనుకుంటారేమోనని నేనూ భయపడి, సంకురుమయ్యను నాకేసి తిప్పుకున్నా" అన్నాడు నారాయణ.

పార్వతికి కోపం రెచ్చిపోయింది.

"తెలిసిన విషయాలైనా అడిగి మాట్లాడిస్తారు పెళ్ళికూతుర్ని: అది రివాజు. చదవకముందు వరావరా అన్నాట్ట. చదివాక వడావడా అన్నాట్ట. నువు బియ్యే చదివి గాడిదకన్న అన్యాయంగా తయారయావు; అందుకే తెలీని విషయాలు మాట్లాడక నోరుమూసుకోమనేది" అన్నదామె. రైలుపెట్టెలో వాళ్ళంతా తిరిగి చూసేటంతగా గొంతెత్తి.

స్వరాజ్యలక్ష్మి ఇద్దరినీ సర్దవలసి వచ్చింది.

ఆ రాత్రి వెంకటేశ్వర్లు ఇంటికి వస్తూనే, "ఏం చేసుకొచ్చారు?....పిల్ల నచ్చిందిట్రా?" అని అడిగాడు.

"ఇందులో నాదేమీ లేదుగా? అమ్మకు నచ్చలేదు" అన్నాడు నారాయణ.

"ఇతని మాటేమోగాని, అమ్మాయికి మనవాడు నచ్చాడండోయ్! ఇతన్ని చూసి నవ్వింది. చెప్పవేమోయ్?" అన్నది లక్ష్మి.

"నే నందరికీ వేళాకోళమైపోయాను. అమ్మమాత్రం నన్ను చూస్తే భగ్గుమంటున్నది" అన్నాడు నారాయణ.

"అందరూ నిన్ను చూసి నవ్వుతుంటే నాకు భగ్గుమనదు మరీ?" అన్నది పార్వతి.

సంబంధం నిశ్చయమేనని మర్నాడు తన మేనమామ చెరుకుపల్లిపరికి రాసినట్టు నారాయణకు వాసన తగిలింది.

నాలుగైదు రోజుల్లోపల సుబ్బారాయుడు వచ్చి పై మాసంలో ముహూర్తం పెట్టుకువెళ్ళాడు.

వెంటనే పార్వతి కొడుకుని వెంటబెట్టుకుని తెనాలి బయలుదేరింది. ఇంటికి సున్నాలు కొట్టించాలి. గడపలకు లక్క వేయించాలి. గృహప్రవేశం అందులోనే, ఆ నాలుగు రోజులూ అద్దెవాళ్ళు ఏదో ఒక గదిలో సర్దుకోవాలి.

నారాయణ లక్ష్మీకాంతయ్యగా రమ్మాయిని ఈసారి చూసినప్పుడు వాడిలో ఏ చలనమూ కలగలేదు. ఆ పిల్లా, ఈపిల్లా ఒకటికాదు. అదీగాక ఇప్పుడు వాడి మనస్సులో శుక్రగ్రహమంత కాంతితో సావిత్రి ప్రవేశిస్తున్నది. సావిత్రిని మనసులో పెట్టుకోవటానికి ధైర్యసాహసాలు అవసరం లేదు.

"నా జీవితమంతా ప్రవాహం వెంట కొట్టుకుపోవటంగానే ఉంది" అనుకున్నాడు నారాయణ.

* * * *

పెళ్ళి హడావుడి తగ్గాక నారాయణ పై చదువు ప్రస్తావన వచ్చింది. ఏం చదివితే బాగుంటుందో పార్వతికి తెలీదుగాని, ఏదో ఒకటి చదివి కొడుకు ఏదో గొప్ప ఉద్యోగం చెయ్యాలన్న ఆశ మాత్రం ఉన్నది. ట్రెయినింగుగాని, లా గాని చదవమని వెంకటేశ్వర్లు సలహా ఇచ్చాడు.

ఏదీ చదవననేశాడు నారాయణ. నిరుద్యోగమే పురుషలక్షణ మన్నాడు వాడు. ఎందుకు ఉద్యోగం చెయ్యటం? తనకింత తినటానికున్నది. ప్రపంచాన్ని ఉద్ధరించాలంటే నౌకరీయే చెయ్యక్కర్లేదు. ఆ మాటకువస్తే ఎమ్మే పాసై ఒకరిని ఉద్ధరించేది లేదు. ఎల్టీ చదివి బడివంతులు పనిచెయ్యటంకన్న హీనం మరోటి ఉండదు.

"అట్టాఅయితే మనం ఇక్కడెందుకూ? పోయి సొంతఇంట్లోనే పడి ఉందాం పద" అన్నది పార్వతి.

నారాయణ సరే నన్నాడు. అద్దెకున్నవాళ్ళను ఖాళీ చేయించి, పార్వతీ, నారాయణా స్వగృహంలోకి అడుగుపెట్టారు.

సొంత ఇంటికి రాగానే పార్వతికి కొత్తకొత్త సరదాలు పుట్టుకొచ్చాయి. ఇంటివెనక బోలెడంత ఖాళీఉంది. అందులో ఒక రెండుగదుల ఇల్లు కట్టించింది. మిగిలిన దొడ్డినిండా మొక్కలు పెట్టించింది. బావిదగ్గిర అరటిమొక్కలూ, కొంచెం ఎడంగా ఒక కరివేపమొక్క, మరోపక్క బాదంమొక్కా, పెట్టించింది. ఇంటిముందు నాలుగు మల్లెఅంట్లూ, ఒక మందారఅంటూ పెట్టింది. ఒక చిన్న మడిలో బంతినార్లూ, మరో చిన్నమడిలో నాలుగు చంద్రకాంత విత్తనాలూ పెట్టింది. దొడ్లో ఒక కొబ్బరిచెట్టు కూడా ఉంటే బాగుండునన్నుకున్నది గాని, అది వెంటనే దొరకలేదు.

నారాయణ మాత్రం కథకుడు కావటానికి నిశ్చయించాడు. తనకు అందులో ప్రత్యేక ప్రావీణ్యం ఉన్నదనికాదు–కథలు రాయటంద్వారా తన జీవితానుభవం సార్థకమవుతుందని. తనకు సహజంగా అలవడని విద్య సాధించాలంటే హెచ్చు శ్రమపడవలసివస్తుందనికూడా వాడికి తెలుసు. శ్రమపడటానికే నిశ్చయించాడు.

కథావస్తువు గురించికూడా వాడు ఒక నిర్ణయానికి వచ్చాడు. జీవితానికి కేంద్రం ఆడది; సాహిత్యానికికూడా ఆడదే కేంద్రం కావాలి. ప్రస్తుత సమాజంలో మగవాడు ఆడదాన్ని కట్టేసి ఉంచుతున్నాడన్న విషయం నారాయణ ఏమాత్రమూ సందేహించలేదు. చదువు విషయంలో, ఆస్తిపాస్తుల విషయంలో, ఆచారాలలో ఆడదాన్ని అణగ తొక్కటమైతే జరిగిందిగాని, ఆ ఆడదాన్ని వెనకపడనిచ్చి మగవాడు ఎంత ముందుకుపోగలడు? ఏం ముందుకువచ్చాడు ? తల్లులుగానూ, పెళ్ళాలుగానూ ఆడవాళ్ళు మగవాళ్ళమీద వాళ్ళ ప్రభావం చూపకుండా ఉండరు. ఆడవాళ్ళ అజ్ఞానమూ, అసహాయత్వమూ, మూఢనమ్మకాలూ మగవాణ్ణి బాధించకుండా ఉన్నాయా? బాధిస్తూనే ఉన్నాయి. మగవాడు అలా నష్టపోనన్నా నష్టపోతాడుగాని, ఆడదాన్ని ముందుకు రానివ్వడు. బ్రిటిషువాళ్ళు ఇండియాకు ఏం చేశారో, మగవాళ్ళు ఆడవాళ్ళకు అదే చేస్తున్నారు. ఇదైనా మధ్యతరగతిలోనే, పాటకపు జనం ఇంత అన్యాయంగా లేరు. పైతరగతివాళ్ళ సంగతి నారాయణకు తెలీదు. విజయనగరంలో గొప్ప గొప్పవాళ్ళను గురించి కొన్ని కొన్ని విషయాలు విన్నమీదట వాళ్ళు సమాజానికి చెందినవాళ్ళుకానే కారని వాడికి నమ్మకం కుదిరింది.

పురాణకాలంలో మగవాళ్ళు శౌర్యప్రతాపాలు ప్రదర్శించి ఆడవాళ్ళకన్న ప్రముఖస్థానం సంపాదించుకున్నారు. ప్రబంధాల్లో ఆడది అచ్చగా భోగవస్తువై కూర్చుంది. సాహిత్యంవల్ల ఈకాలానికి ఏం ప్రయోజనం? ఈ కాలపు సాహిత్యంలో కూడా ఆడదాని అధోగతి వాస్తవంగా చిత్రించటం జరగటంలేదు. చలం[1]గారి కథలలో మగవాళ్ళను పశువులుగా చిత్రించటమూ, ఆడదానికి స్వేచ్ఛ

---

1. గుడిపాటి వెంకటచలం (1894–1979) : స్త్రీ పురుష ప్రేమను 'కుళ్ళు ఫ్యూడల్ చాతుర్వర్ణ్య సంస్కారం'నుంచీ పితృస్వామిక దురహంకారం నుంచీ, వైవాహిక ధర్మాల అమానుషత్వం నుంచీ వ్యక్తి విముక్తి కోరిన రచయిత. తన కథలతో, నవలతో, మ్యూజింగ్స్‌తో లేఖలతో, ప్రేమ లేఖలతో సాధ్యమైనంత అనంతసుఖ పారవశ్యానికి" కళ్ళు తెరిపించిన రచయిత, వీరేశలింగ యుగ సంస్కరణ భావాలూ, అర్థమత భావాల్నూ, కాల్పనిక యుగ వ్యక్తివాద, అజ్ఞేయవాద, విగ్రహ విధ్వంసక భావాలూ

యిచ్చి వదిలెయ్యమనటమూ జాస్తిగా ఉన్నదిగాని, ఆడది మగవాణ్ణి అందుకునేటం దుకు సంఘంలో ఎటువంటి మార్పులు జరగాలో స్పష్టంగా లేదు. టాగూరు[1] నవలలో గోరా[2] అన్నట్టు సంఘానికి ఎడంగా నిలబడి సామాన్య ప్రజలను హీనంగాచూసే వాడు తన సంస్కారానికి తాను మురిసిపోవచ్చుగాని, సంఘానికి చిన్న మెత్తు ఉపకారం చెయ్యలేడు.

సమర్థుడైన మగవాడితో సమంగా చదువూ, వివేకమూ సరైన దృక్పథమూ గల ఆడ పాత్రను సృష్టించి, అటువంటి పాత్రలవల్ల - భర్తకూ, పిల్లలకు ఎంత లాభమో చూపిస్తూ ఒక కథ రాయాలని నారాయణకు గాఢమైన కోరిక కలిగింది. కాని అటువంటి ఆదర్శ పాత్రను సృష్టించాలంటే బాగా చదువుకున్న

---

వీటి సంకీర్ణ సమ్మిశ్రమంతో జీవిత సత్యాలను చెప్పకపోయినా జీవితంలోని అసత్యాలను కాల్పనిక విప్లవ భావుకతతో ఖండించి ఒంటరివాడుగా జీవించిన రచయిత. జలపాతంలాంటి వచన శైలితో తెలుగు వచన రచనలో ఒక బాణీ యేర్పరచుకున్న రచయిత. ఆయన ప్రముఖ రచనలు : నవలలు- మైదానం, బ్రాహ్మణీకం, అరుణ, అమీనా, నాటకాలు, నాటికలు- పురూరవ ఊర్వశి, చిత్రాంగి,, యముడిముందు చలం; కథా సంపుటాలు- ఓ పువ్వు పూసింది. స్టేషన్‌పంపు, ఆరాత్రి; వ్యాసాలు- ఆనందం, విషాదం, మ్యూజింగ్స్ స్త్రీ, బిడ్డల శిక్షణ.

1. రవీంద్రనాథ టాగోర్ (1861-1941) : 'విశ్వకవి'గా గణుతికెక్కిన జాతీయకవి 'విశ్వభారతి' (1924) స్థాపకుడు,. కథకుడు,. నవలాకారుడు, నాటకకర్త, నటుడు, గాయకుడు, చిత్రకారుడు. గీతాంజలి (1912) రచనకు 1913లో నోబుల్ బహుమతి పొందిన మొదటి భారతీయ రచయిత. బాలక్, సాధన, వంగదర్శన్ పత్రికలకు సంపాదకత్వం వహించారు. ఇప్పటి జాతీయగీతకర్త. హిట్లర్ జకోస్లోవేకియాపై దండెత్తినప్పుడు, చైనాపై జపాన్ దురాక్రమణ సాగించినప్పుడు ఖండించటం ద్వారా ఆయన అంతర్జాతీయతత్వం వెల్లడయింది. సోవియట్ యూనియన్ విద్యా విధానంలో, సామాజిక సంక్షేమంలో సాధించిన విజయాలను మెచ్చుకున్నారు. ఆయన కవిత్వంలో సత్యశివ సౌందర్య కేంద్రకమైన మార్మికత, అర్థమత భావాలూ, కల్పనా సాహిత్యంలో కాల్పనికావేశంతో కూడిన సాంస్కృతిక పునరుజ్జీవన భావాలు కనిపిస్తాయి.

2. గోరా : రవీంద్రుని గోరా నవలలోని నాయకుడు. ఈ నవల బ్రహ్మసమాజ మతస్థులు ఒక ప్రత్యేక కులంగా ఏర్పడడాన్ని విమర్శిస్తుంది.

ఆడవాళ్ళను ఒకరిద్దరినైనా తెలిసి ఉండడం అవసరమని వాడికి అనిపించింది. దేన్ని గాని గాలిపోగుచేసి సృష్టించటం వాడికి కొంచెం కూడా ఇష్టంలేదు.

నారాయణ కింకొక విషయం కూడా స్పష్టంగా తెలుసు. తాను క్రొత్తగా చెప్పేది ఏమీవుండదు. వీరేశలింగంగారి వంటి సంఘ సంస్కర్తలు సంఘం మరమ్మత్తు కోరి చెయ్యదగిన ప్రచారమంతా ఇదివరకే చేసేశారు. కాని ప్రచారం ద్వారా సాధ్యం కానిది సాహిత్యం ద్వారా సాధ్యం కావాలి. ఆ మాటకువస్తే మతాలను స్థాపించిన వాళ్ళందరూ మానవుడు అవలంబించదగిన ధర్మాలు ఏనాడో చెప్పేశారు. కాని ఆ ధర్మాలు అమలు జరగటంలేదు.

కారణం సాహిత్యం సరయినది లేకపోవటమే ననుకున్నాడు.

నారాయణ ఈసారి ముచ్చెమటలూ, భయమూ, ఉద్రేకమూ లేకుండా తాపీగా కూర్చుని కథ రాశాడు. అది కూడా ఒక బాల వితంతువు కథే. తానున్న ఇంట్లో వైభవంగా పెళ్ళవుతుంటే పళ్ళూడిన ముత్తయిదువుల దగ్గిరనుంచీ పట్టు చీరెలు ఫెళఫెళలాడిస్తూ, పసుపు కుంకుమలు పెట్టుకుని తిరుగుతూంటే, అటుకేసి వెళ్ళటానిక్కూడా నోచుకోని బాలవితంతువుకు మనస్సు ఎట్లా వుంటుంది? అదే ఇతివృత్తం.

ఈ కథ ఒక మాసపత్రికలో అచ్చయింది. చదివినవాళ్ళు ఏమనుకున్నారో నారాయణకు తెలీదు. తెలుసుకోవాలన్న దుగ్ధకూడ వాడికి లేకపోయింది.

వాడు రాసిన రెండో కథ అప్పులపాలై డిప్రెషనులో ఆస్తిఅంతా పోగొట్టుకుని వీధిలో నిలబడ్డ సంసారం గురించి. వడ్డీకోసం అప్పులిచ్చే వాళ్ళను చేపలు పట్టేవాళ్ళతోనూ, జలగలతోనూ పోల్చాడు.నారాయణ ఆ కథలో. తన తండ్రి తనను వడ్డీ లెక్కలు నేర్చుకోమన్న సంగతి ఆ కథలో రాసేటప్పుడు వాడికి జ్ఞాపకంలేదు. కథ పోస్టు చేశాక జ్ఞాపకం వచ్చింది. వడ్డీవ్యాపారం ద్వేషించేవరకూ తన తండ్రిలో ఏదో మంచి ఉండి ఉండాలనుకున్నాడు నారాయణ. వడ్డీవ్యాపారం ఎంత సంఘ విద్రోహకరమైనది! ఆ వ్యాపారం చేసేవాళ్ళను మనుషులల్లే ఎట్లా చూడటం? అవతలవాళ్ళు ఏ వర్తకమో చేసుకునేవాళ్ళయితే వాళ్ళ లాభంలో వాటా తీసుకున్నా తప్పులేదు. కాని తిండికిలేకా ఆడపిల్లల పెళ్ళిళ్ళకూ అప్పులు చేసేవాళ్ల తీసుకున్న డబ్బుమీద ఏం లాభం చేసుకుంటారు? వాళ్ళకున్న ఆస్తి కాజేసే ఉద్దేశం తప్ప అప్పు పెట్టేవాళ్ళకింకో ఉద్దేశం ఏముంటుంది? ఏ ఆస్తీలేని వాళ్ళ కెవరూ అప్పు పెట్టరేం?

ఈ కథకూడా అచ్చయింది. ఆ కథ పడిన పత్రికే పార్వతి చూసింది.

"ఈ పత్రికలోది నీ పేరేనుట్రా?" అని పార్వతి అడిగింది.

"అవును ఈమధ్య అటువంటి పనికూడా చేస్తున్నా" అన్నాడా నారాయణ.

పుత్రవాత్సల్యంకొద్దీ పార్వతి ఆ కథ చదివి గందరగోళం పడింది. చిన్న పంచాయతీ జరుగుతుందని నారాయణకు తెలుసు; దానికి సిద్ధంగా ఉన్నాడు.

"అయితే నాకు తెలీకడుగుతాను. మన దగ్గిర డబ్బు మూలుగుతుంటే అవసరంలో ఉన్నవాళ్ళకు అప్పు పెట్టి సహాయపడటం తప్పా?" అన్నది పార్వతి.

"ఎందుకమ్మా ఒక్కగుక్కలో అన్ని అబద్ధాలూ! అవసరం ఉన్నవాళ్ళకందరికీ సహాయం చేసేవాళ్ళెవరున్నారు? అట్లా చేసేవాళ్లు దానధర్మాలు చేస్తారు. అప్పులు పెట్టరు. అప్పులు పెట్టేవాళ్లు వడ్డీతోసహా అసలు రాబట్టుకునే ఆశతోనే అప్పు పెడతారు. బాకీ వసూలు కాకపోతే కోర్టుకు పోతారు. ఆస్తులకు జప్తులు తెస్తారు. 'ఎద్దుపుండు కాకికిరుచి' అన్నట్టు అవతలివాళ్ళ అగచాట్ల మీద వీళ్లు ఆస్తులు పేరుస్తారు. రాసేదేమిటో తెలిసే రాస్తున్నా ననుకోరాదూ!" అన్నాడు నారాయణ, అట్టే వాదించటం ఇష్టంలేనట్టు స్పష్టంచేస్తూ.

పార్వతి కాసేపు ఆలోచించి "నీ కిప్పుడున్న ఆస్తి వడ్డీలమీద వచ్చినదే. ఆ సంగతయినా తెలుసా?" అన్నది.

"తెలియబట్టేగదా ఆ విషయం ఆలోచించవలసి వచ్చింది. మనం చేస్తూన్నాం గనక ప్రతిపనీ మంచిపని కావాలని ఎక్కడున్నదీ?"

"మొత్తానికి ఆ తండ్రి కొడుకు ననిపించుకున్నావు!"

"ఆ మాటంటే నేను అవమానంతో కుంగిపోయి వడ్డీవ్యాపారం చాలా ధర్మమైన దనుకుంటాననా? నేనిప్పుడే చెబుతున్నాను; నేనీ జన్మలో ఇంకొకరి కోసం సిగ్గుపడతాననుకోవటం కల్లోమాట. నేను చేసేపనులు సిగ్గుపడాల్సినవైతే సిగ్గుపడతాను. గర్వపడదగినవైతే గర్వపడతాను. నీకు తెలీదేమో! నువ్వు వడ్డీలమీద డబ్బు సంపాదించినందుకు నేను సిగ్గుపడేటట్టు చెయ్యాలని మన బంధువులే ప్రయత్నించారు. ఆ పప్పులు నాదగ్గిర ఉడకవని చెప్పా. అటువంటి పనే నువ్వూ చెయ్యకు" అన్నాడు నారాయణ.

నారాయణ ఎట్లా తయారవుతున్నాడో, తనకెందుకింత అర్థం కాకుండా పోతున్నాడో పార్వతికి అర్థం కావటంలేదు. డబ్బున్న వాళ్ళందరూ అవసరమైన వాళ్ళకు డబ్బిస్తారు; అది మహాపాపమా? మహాపాపమని ఈ బొట్టికాయ చెబితే తను తమ్మాలా? తను భయపడ్డట్టుగానే వీడు తండ్రి లాగా తయారవుతాడేమో!

ఈ కథ అచ్చయాక నారాయణకు ఎక్కడో కృష్ణా జిల్లా నుంచి ఎవరో కుర్రవాడు ఉత్తరం రాశాడు. ఆ ఉత్తరాన్ని పత్రికవాళ్లు నారాయణ ఎడ్రసుకు రీడైరెక్టు చేశారు. "మీ కథ చదివి నా ప్రాణం లేచివచ్చింది. కాని అందులో

ఉన్న నిజాన్ని కాదనలేను. మా నాన్న వడ్డీ వ్యాపారంలో పెద్ద చెయ్యి. చుట్టు పక్కల గ్రామాలలో నాలుగైదు సంసారాలు నాశనం చేశాడు. ఆ ఆస్తిమీదనే నే నాధారపడి ఉన్నాను. నైతికంగా పరిస్థితి ఏమిటి? నా తండ్రిచేసిన ఈ పాపంలో నేను భాగస్వామినిగా వుండకుండా ఏం చేయగలను! మీ జవాబుకోసం ఎదురుచూస్తు న్నాను. తప్పక జవాబు రాస్తారుగదా!" అని ఉత్తరం అడిగింది.

ఒక్క కథ రాసినంతమాత్రాన ఇటువంటి బాధ్యత తనమీద పడుతుందని నారాయణ కలలోకూడా అనుకోలేదు. ఆ మనిషికి జవాబు రాయవలసి వచ్చిందన్న ఆవేదనలో తన కథ కనీసం ఒక పాఠకుడి మీదనన్నా పనిచేసిందని గర్వపడటం కూడా నారాయణ మరిచాడు. కాని రాయటం మొదలుపెట్టినాక వాడు కుండపగ లేసి ఉన్నమాట రాసేశాడు: "నేనూ వడ్డీడబ్బుమీదే బతుకుతున్నాను. నా తలమీది చూరు నా బాకీదారునుంచి ఒడుచుకున్నదే. ఈ పాపిష్టి సమస్యకు పరిష్కారం ఏమిటో నాకూ తెలీదు. సమాజం ఆమోదించే దురభ్యాసాలను వ్యక్తులం సంస్కరించ లేం! సమాజమే సంస్కరించాలి."

ఆ తరువాత రాసిన కథలో నారాయణ దేశభక్తులలో ఒక రకం మీద విరుచుకుపడ్డాడు. గాంధీగారి ఉద్యమాలలో చేరిన నాసిరకం వాళ్ళు దేశభక్తుల జాబితాలలో చేరటం నారాయణకు తెలుసు. అటువంటి వాళ్ళను గురించి నారాయణ చాలా విన్నాడు. ఇటువంటివాళ్ళ మూలంగానే ఉద్యమం వృధా అయిపోయి పరిస్థితి ఎప్పటిలాగే ఉన్నదని నారాయణ అనుకున్నాడు. రౌండుటేబిలు సమావేశం[1]లో బ్రిటిషువాళ్ళు మన వాళ్ళను గాడిదెలను చేసినట్టు వాడు అర్థం చేసుకున్నాడు.

పత్రికవాళ్ళు అట్లా అర్థంచేసుకోలేదు. నారాయణ విమర్శించినది దొంగదేశభక్తులనని వాళ్ళు అనుకోలేదు- ఉద్యమాన్నే అనుకున్నారు; కథ తిరిగి వచ్చింది.

---

1. రౌండు టేబులు సమావేశం : బ్రిటన్‌లో కొత్తగా యేర్పాటైన లేబర్ ప్రభుత్వం భారతదేశ రాజకీయ సమస్యను చర్చల ద్వారా పరిష్కరించుకోవచ్చునని లండన్‌లో 1929 లో వివిధ రాజకీయపక్షాల ప్రతినిధుల మధ్య సమావేశం ఏర్పాటు చేయాలని సూచించింది. సైమన్ కమిషన్ నివేదికపట్ల అసంతృప్తి చెందిన కాంగ్రెసు నాయకత్వం యీ సూచనను తిరస్కరించింది. 1930 నవంబరు 12వ తేదీన లండన్‌లో యేర్పాటయిన మొదటి రౌండు టేబుల్ సమావేశానికి వివిధ సంస్థానాధీశులు, ముస్లిం లీగు, హిందూ మహాసభ, అంబేద్కర్ నాయకత్వంలోని అస్పృశ్యుల ఫెడరేషన్ ప్రతినిధులు హాజరయ్యారు. గాంధీ ఇర్విన్ ఒడంబడిక 1931 మార్చి 5వ తేదీ జరిగాక, రెండవ సమావేశానికి గాంధీజీ హాజరయ్యారు. శాసనోల్లంఘనోద్యమాన్ని తాత్కాలికంగా ఆపుచేయించి హాజరయ్యారు.

వస్తేవచ్చిం దనుకున్నాడు నారాయణ. అసలే వక్రంగా ఉన్న సమాజంలో నిజం సూటిగా ప్రచారం ఎట్లా అవుతుంది?

* * * *

పెళ్ళయిన రెండున్నర యేళ్ళకుగాని సావిత్రికి భర్తతో పునస్సంధానం కలగలేదు. ఈ లోపల ఇంచుమించు ప్రతి పండుగకూ నారాయణ అత్తవారింటికి వెళ్ళి వస్తూనేవున్నాడు.

సుబ్బారాయుడిగారి పిల్లల్లో సావిత్రే పెద్దది. తరవాత ఇద్దరు మగపిల్లలున్నారు పెద్దవాడిపేరు గోవిందశాస్త్రి- తాతగారిపేరుట. రెండోవాడి పేరు నాగేశ్వరశాస్త్రి - ఇంకో తాతగారి పేరు.

సావిత్రి పెళ్ళయినది మొదలూ మొగుడి ఎదటికి వచ్చేది— అవసరమైనప్పుడు మాట్లాడేదికూడా. సేవచేసేది-తువాలు అందించటమూ, మంచినీళ్ళు పట్టుకు రావటమూ, స్నానంచేశాక బట్టలివ్వటము లాంటివి. రెండోసారో, మూడోసారో నారాయణ వచ్చినప్పుడు సావిత్రి తనంతటతానే "అత్తయ్య కులాసాగా ఉన్నారా?" అని అడిగింది.

గోవిందుడూ నాగులూ బావగారితో చాలా చనువుగా ఉండేవాళ్ళు; నారాయణ వెంట రోజూ కాలవదగ్గిరికి షికారు వెళ్ళేవాళ్ళు. నారాయణ కేదన్నా కావలసివచ్చినప్పుడూ వాళ్ళిద్దరూ దూకేవాళ్ళు - నేనంటే నేనని పోట్లాడునే వాళ్ళు. సావిత్రి ఇద్దరి నెత్తినా మొట్టి మొగుడికి కావలసిన మంచినీళ్ళో, వక్కపొడో తానే తీసుకుపోయేది. ఇదొకఆట—నారాయణకు చూడముచ్చటగా ఉండేది.

మొత్తంమీద అత్తవారింటి వాతావరణం నారాయణకు కొత్త - బాగుందనిపించేది. మనుషులు ఏ పనిచేసినా కొంత స్వతంత్రంగా చేసేవాళ్ళు. ఎనిమిదేళ్ళున్నాయో లేదో నాగులు ఈ యింట్లో అనుభవించే స్వాతంత్ర్యాన్ని నారాయణ ఈ వయసులో తన సొంత ఇంట్లో అమలుచెయ్యాలంటే తల్లితో ఘర్షణపడక తప్పదు. ఇది చాలా అన్యాయం. అత్తవారింటికి వచ్చాక నారాయణకు వెళ్ళిపోబుద్ధి ఆయేదికాదు: తాను చిన్నప్పుడు చదువుకున్న చాటుశ్లోకాలలో "సారం శ్వశుర మందిరం"[1] అన్న శ్లోకాలు జ్ఞాపకం వచ్చి నారాయణ నవ్వుకునేవాడు.

---

1. సారంశ్వశుర మందిరమ్ : అసారే ఖలు సంసారే
సారం శ్వశుర మందిరమ్
హిమాలయే హరశ్శేతే
హరిశ్శేతే సుధాంబుధే
— ఒక ప్రసిద్ధ సంస్కృత చాటువు

దానికి తగ్గట్టే అతను ప్రయాణం కట్టినప్పుడల్లా సుబ్బారాయుడుగారు "అక్కడేంపని మించిపోతున్నదోయి? నువ్వు వెళ్ళాక పిల్లలు చెరోమూలా కూర్చుంటారు దిగులుగా. నాల్గురోజులుండి పోవచ్చులే. మీ అమ్మగారికొక కార్డు ముక్క రాసి పడెయ్యి" అనేవాడు. అసలు దిగులు ఆయనకే. ఆయనకు చాలా విషయాలమీద మాట్లాడడానికి చాలా చాలా ఉన్నది. ఆ విషయాలు ఇంట్లో ఎవరికీ పట్టవు. నారాయణకు పట్టేదీ లేనిదీ సుబ్బారాయుడికైతే తెలీదుగాని, నారాయణ శ్రద్ధగా వింటాడు— అంతేచాలు.

అత్తవారింట్లో ఉండే సమయంలోనే నారాయణ వీరేశలింగంగారి స్వీయ చరిత్ర చదివాడు. ఆ పుస్తకం చదివినదాకా నారాయణ అనుకోవటం వీరేశ లింగంగారు కేవలమూ వెధవముండల పెళ్ళిళ్ళు చేయించాడనే. ఆయన ఇంకా చాలాచేశాడు. వీరేశలింగంగారు నాటకాలు రాసేపద్ధతి నారాయణకు అంతగా నచ్చకపోయినా, స్వీయచరిత్ర చదివాక వాడికి వీరేశలింగం గారిమీద గౌరవం చాలా హెచ్చింది. సంఘానికి ఆ విధంగా కుక్క కాపలా కాయాలంటే చాలా శక్తి కావాలి. అటువంటివాడు అనేక కోట్లమందిలో ఒకడుంటాడేమో.

ఎలాంటి తంతూలేకుండానే సావిత్రి నారాయణ పక్కలోకి వచ్చింది. ఆసారి వచ్చినప్పుడు నారాయణ తన పెళ్ళాం ఒంటరిగా దొరికినప్పుడల్లా దగ్గరికి తీసుకోవాలని ప్రయత్నించాడు. మంచిరోజు చూశారోలేదో కూడా తెలీదు. ఒక రాత్రి నారాయణకు విడిగా గదిలో పక్కవేశారు. రాత్రి అందరూ పడుకున్నాక సావిత్రి గదిలోకి వచ్చింది. వస్తుందని నారాయణ అనుకుంటూనే ఉన్నాడు.

నారాయణ ఇంటికి తిరిగిరాగానే పార్వతి అంకిళ్ళు నొక్కుకుని, తన నోరు తనే మూసుకుని, "నెలరోజులేమిట్రా? ఇక్కడ నేనుబిక్కు బిక్కుమంటూ ఒంటరి దాన్ని—ఎంత భయం! కాకపోయినా అట్లా నెలలతరబడి అత్తవారింట్లో కూర్చుంటే వాళ్ళకు అలుసైపోవూ?" అన్నది.

"అలుసైనట్టుగా కనబడలేదు. ఎన్నిసార్లు ప్రయాణం కట్టినా, 'వెళ్ళి ఏం చేస్తావులే. నాలుగురోజులుండు,' అంటూ బలవంతం చేశారు." అన్నాడు నారాయణ.

"నీకు ఉద్యోగమూ, సద్యోగమూలేదని ఎత్తిపొడిచారు. అది నీమీది అపేక్ష అనుకున్నావు కాబోలు. పిచ్చికుంకపు!.... అయితే నిన్ను ఉండిపొమ్మని బలవంతంచేసింది ఎవరు? నీ పెళ్ళామేనా యేం?" అన్నది పార్వతి, లౌక్యంగా రహస్యం బయటికి లాగుతున్నాననుకుని.

"మామగారూ, అత్తగారూ, బావమరుదులూ దగ్గిర్నుంచీ అంతా బలవంతం చేసినవాళ్ళే."

తన కొడుక్కు వియ్యాలవారు పెళ్ళాన్ని ఎరవేసి ఉంటారని పార్వతి పసిగట్టి, "అయితే గర్భాదానం మాట ఎత్తారా? ఎప్పుడు చేస్తారుటా? పిల్ల పెద్ద మనిషై ఏడాది అయింది కూడానూ. అసలే ఆలస్యంగా అయింది. మేమంతా పన్నెండో ఏటనే సమర్తాడి కూర్చుంటిమి. అయిన మూణ్ణెల్లకే అత్తవారింటికి తరిమే శారు. ఇప్పుడివన్నీ కొత్త పద్ధతులు వచ్చిపడ్డాయి. నేను ఒంటిదాన్ని. చాకిరీ చేసుకోలేకుండా ఉన్నాను. అదెప్పుడు తోడువస్తుందా అని చూస్తున్నాను." అన్నది.

"నేను గర్భాదానాలూ అవీ చేసుకోను. కావలిస్తే కోడలును పంపమని ఓ ఉత్తరము రాయి; పంపేస్తారు." అన్నాడు నారాయణ.

"మళ్ళీ నేనెందుకూ? ఆ రాసేదేదో నువేరాయి" అన్నది పార్వతి.

"దీపావళి వస్తున్నదిగా? అప్పుడు మనని ఎట్లాగూ పిలుస్తారు. వచ్చేటప్పుడు నువు కోడలును చంకపెట్టుకురా!"

"నేనే దాన్ని చంక నెక్కించుకుంటానో, నువ్వే ఎక్కించుకుంటావో తర వాత చూద్దాంలే" అని పార్వతి ఒక విసురు విసిరింది.

* * * *

నారాయణ దీపావళికి అత్తవారింటికి వెళ్ళి, పదిరోజులుండి, భార్యతో సహా దిగాడు. సావిత్రి తనవెంట తెచ్చుకున్న మూడు పెట్టెలూ వాటినిండా ఉన్న బట్టలూ, గ్లాసులూ ఇతర వస్తువులూ చూసి పార్వతి ఆశ్చర్యపోయింది. ఇంకా మంచమూ, కుర్చీసామానూ, వంటపాత్రలూ, బిందెలూ పడవమీద వస్తున్నాయిట.

"నాకు తెలీటంలేదు. మన మేమన్నా మఠంలో ఉంటున్నామా, చెట్టుకింద కాపరం చేస్తున్నామా? ఇంత సామానూ సరంజమా పంపట మేమిటి?" అన్నది పార్వతి.

"సావిత్రి క్కావలసినవి ఉంచుకుంటుంది. మన కక్కర్లేనివి ఎవరికన్నా ఇద్దాంలే, అమ్మా!" అన్నాడు నారాయణ.

పెళ్ళాంపేరు చెప్పేస్తున్నాడు! పెళ్ళాన్ని పేరుపెట్టే పిలుస్తున్నాడని పార్వతి తెలుసుకోవడానికి ఎన్నో క్షణాలు పట్టలేదు.

వియ్యాలవారు ఇంతెడు సామానూ పంపటం పార్వతికి అవమానమనిపించినా ఇంటినిండా సామాను సర్దేశాక ఇల్లు ఎంతోబాగుంది. నాలుగేళ్ళదాకా సావిత్రికి బట్టల కొరత లేదు. ఈ లోపల వాళ్ళు మళ్ళీ పెట్టకపోరు. దీపావళికి అల్లుడికి జరీ అంచు బట్టలు పెట్టారు. పురుగెరటానికి పార్వతి చేసిన ప్రయత్నాలు ఫలించ లేదనే చెప్పాలి.

అభావం నుంచి అసంతృప్తి ఏర్పడుతుందని మనం సాధారణంగా అను కుంటాం. చీకటిలాగా, అజ్ఞానంలాగా అసంతృప్తికూడా ఒక సహజస్థితి. అది బయట పడగలందులకు అస్తమానమూ మార్గాలు వెతుకుతూంటుంది— కడవలో నీళ్ళు చిల్లికోసం వెతికినట్టు. అందుచేత పార్వతిలో తప్పులెంచాలన్న బుద్ధి స్థిరంగా ఉండేది; తప్పులు మాత్రం అప్పుడప్పుడూ దొరికేవి. దేనికైనా తప్పుపట్టి, తన లోని అసంతృప్తియొక్క పీడనాన్ని కొంత తగ్గించుకున్నాక, ఆమెకు కొంత తృప్తి కలిగేది.

తప్పులు వెతికేవాడికి జీవితంలో కుప్పతెప్పలుగా దొరుకుతాయి. దేనికి క్షామం ఉన్నా తప్పులకు క్షామం లేదు.

తన కొడుకు చీటికి మాటికీ, "సా—త్రీ, సా—త్రీ" అని పిలుస్తుంటే పార్వతికి మండుకొచ్చింది. పెళ్ళాంపేరు రామనామజపం అయింది! నిన్నటిదాకా తనను అడిగినవన్నీ ఇప్పుడు పెళ్ళాన్ని అడుగుతున్నాడు! ఇంట్లోకి అడుగుపెట్టి ఇరవై నిమిషాలు కాకుండానే ఈ బొట్టికాయ వచ్చి తన గద్దెమీద ఎక్కి కూర్చుంది. అప్పుడే తనకు వార్ధక్యం వచ్చేసిందా? ఇక తను ఒక మూల కూర్చుని, కృష్ణా, రామా అనుకోవలసిందే? ఎంత ఘోరం! ఎంత అన్యాయం!

పార్వతి ఇంకో విషయం కనిపెట్టి తికమకపడింది. నారాయణా సావిత్రీ మాట్లాడుకుంటుంటే తనకు సగానికి సగం అర్థంకావటంలేదు. వాళ్ళు నవ్వితే ఎందుకు నవ్వారో తెలీదు.

"ఎందుకు వాడట్లా నవ్వుతున్నాడూ?" అని పార్వతి కోడలును అడిగింది.

"ఏమీలేదు లెండత్తయ్యా? ఆయనకు కాస్త పిచ్చి!" అన్నది సావిత్రి, తానెం దుకు నవ్వుతున్నదీ చెప్పకుండా.

"బాగానే ఉంది!" అన్నది పార్వతి అసమ్మతి సూచిస్తూ.

మొత్తంమీద తన కొడుకూ కోడలూ ఒక జట్టయి, తనను వెలివేశారన్న భావం పార్వతిలో అంతకంతకూ హెచ్చిందిగాని, తగ్గలేదు. నారాయణ పెళ్ళాం చేతిలో కీలుబొమ్మ అయినాడనీ, తన కోడలు తన కొడుకును పమిటకొంగున అప్పుడే ముడేసుకున్నదనీ పార్వతికి గట్టి అనుమానం కలిగింది. అందులో తన కేదో అవమానం ఉన్నదనిపించింది; గాని ఆ అవమానం ఎటువంటిదో పార్వతికి అంత స్పష్టంగా అర్థంకాలేదు.

ఇన్నాళ్ళూ నారాయణ జీవితానికి తా నొక్కతే ఆడదిగా ఉన్నది. తన స్థానాన్ని కోడలు పంచుకున్నా బాధేమరి; అటువంటప్పుడు పూర్తిగా దానికిస్తే ఇంకెంత బాధ! కోడలు రావటానికి చాలా ముందుగానే నారాయణకు తనతో ఉండిన బంధం నామమాత్ర మయిందని పార్వతికి స్పష్టంగా తెలియలేదు.

నారాయణా, సావిత్రీ ఒక తరంవాళ్ళు. ఒకరి ప్రభావం ఒకరిమీద ఉంటుంది. తల్లీ కొడుకులమధ్య అది సాధ్యంకాదు. పార్వతి తన కొడుకుమీద తన ప్రభావం ఉండా లని విశ్వప్రయత్నం చేసిందిగాని కొడుకునుంచి తాను నేర్చుకునేది కూడా ఉంటుం దని కలలో కూడా అనుకోలేదు. ఎక్కడో తప్ప సాధారణంగా ఆ మాట అనుకో లేదు. ఎక్కడో తప్ప సాధారణంగా ఆ మాట అనుకోదు; అటువంటిది ఒకటి ఉంటుందని కూడా నమ్మదు.

పార్వతి తన దాంపత్య జీవితాన్ని స్మరించి ఉండవలసింది. ఆమె ఒకప్పుడు జీవితాన్ని వెయ్యికళ్ళతో పరిశీలించి, ఎన్నో విషయాలు గమనించి భవిష్యత్తుకు దాచి ఉంచుకున్నది. కాని ఆమెకు ఆ అలవాటు క్రమంగా పోయింది. భర్తనుంచి విడి పోయాక లోకంతీరు గమనించటం బొత్తిగా మానేసి, తాను జీవితం నుంచి నేర్చుకు నేది ఏమీలేనట్టే ప్రవర్తించింది.

తన దాంపత్యం తన కొడుకు దాంపత్యంలాగుంటే తాను జీవితంలో ఇంకా సుఖపడేది కాదా? కాని పార్వతి అట్లా అనుకోలేదు. భార్యాభర్తలు మరీ పూసుకు పూసుకు తిరగరాదనే ఆమె విశ్వాసం. మగవాళ్ళ ప్రపంచం వేరు. ఆడవాళ్ళ ప్రపంచం వేరు. ఈ రెండూ రాత్రిపూట పడకగదిలో, రహస్యంగా మాత్రమే ఏకంకావాలి. అంతేగాని, ఇదేమిటి? తన కొడుకు కోడళ్ళ ప్రవర్తన వెకిలిగా కన బడింది పార్వతికి.

నారాయణ పొద్దుటిపూట గడ్డం గీకోడు. రోజు విడిచి రోజు రాత్రిపూట గీకొంటున్నాడు! వాడు గడ్డం గీకోవటం పార్వతి ప్రత్యక్షంగా చూడలేదు. ఒకరోజు ఉదయం వాడు బద్ధకంగా నిద్రలేచి గదిలోనుంచి బయటికి రావటం పార్వతి చూసింది. నిన్న మాసివున్న గడ్డం ఈ ఉదయం నున్నగా వున్నది. ఆ తరవాత పార్వతి నారాయణ గడ్డంమీద నిఘా ఉంచి, వాడు రాత్రిపూట గడ్డం గీక్కుంటున్నట్టు రుజువు చేసుకున్నది.

కోడలు ఇంటిపనులు చెయ్యదని పార్వతి తప్పుపట్టటానికి లేదు. చాతగాని పనులుంటే నేర్చుకోవటానిక్కూడా సావిత్రి సిద్ధమే. కాని అవతల మొగుడి పని ఉంటే ఇవతల ఇంటిపని చెయ్యదు. తప్పు పట్టటానికేమో వీల్లేదు. కొత్తగా కాపరా నికి వచ్చిన పిల్లతో, "నువు మొగుడంటే మరీ అంత శ్రద్ధగా ఉండకు" అని ఎట్లా చెప్పటం? తోమేతోమే చెంబు అవతలపెట్టి, మొగుడు పిలిచాడని సావిత్రి పరిగెత్తి నప్పుడల్లా పార్వతికి కారం రాచినట్టు ఉంటూనే ఉన్నది.

వాడేదో కథలూ, గడ్డలూ రాస్తున్నాడుగా? వాడు రాసింది ప్రతిదీ సావిత్రి చదువుతుంది. ఆ తరువాత ఇద్దరూ చాలాసేపు ఏమిటో మాట్లాడుకుంటారు. వాడి రాతసంగతి తన కెందుకూ? సావిత్రితో వచ్చిన చిక్కే అది -- మొగుడి సంగతి

ప్రతిదీ కావాలి. ఇప్పుడు పెళ్ళానికి అన్నీ నివేదించుకునే ఈ వెధవ తను రెండు ప్రశ్నలు వేసేసరికల్లా విసుక్కునేవాడు. ఇప్పుడా?- అయిదారేళ్ళ క్రితమే! అందుకే అన్నారు - పెళ్ళాం బెల్లమూ, తల్లి దయ్యమూ అని.

అన్నింటికన్నా ఘోరం - మొగుడు ఒక్క క్షణంపాటు ఒంటరిగా దొరికితే చాలు, మీదికి ఎగబడుతుంది. సావిత్రి నారాయణను వెనుకనుంచి వాటేసుకుని, బలవంతాన తల వెనక్కు విరిచి, చెంప ముద్దు పెట్టుకోవటం పార్వతి కళ్ళారా చూసింది.

"దానికి మదపిచ్చేమో!" అనుకున్న దామె.

ఈ మాట అనుకుంటే సావిత్రి ప్రవర్తన కొంతవరకు పార్వతికి అర్థమైనట్లు అనిపించింది. మదపిచ్చి వేరు. ప్రేమ వేరు.

తన కోడలుది మదపిచ్చేగాని నిజమైన ప్రేమ కాదనుకునేందుకు పార్వతికి ఒకసారి దాఖలా దొరికింది.

ఒక రోజు నారాయణకు పెద్దపెట్టున జ్వరం పెట్టుకొచ్చింది. మధ్యాహ్నం అన్నంతిని పడుకున్నవాడు రెండు గంటలవేళ జ్వరంతో లేచాడు. చాలా తపన పడ్డాడు.

"అన్నంతిని నిద్రపోతే జ్వరం వస్తుందిరా!" అన్నది పార్వతి.

"రోజూ మధ్యాహ్నంపూట నిద్రపోవటం లేదటమ్మా?" అని నారాయణ విసుక్కున్నాడు.

పార్వతి సావిత్రిని ఇవతలికి పిలిచి, "దోషగుణం లాటిది కాదు గదా!" అన్నది.

"అంటే?" అన్నది సావిత్రి.

పార్వతి చెప్పింది. సావిత్రి విరగబడి నవ్వి, కాదన్నది.

నారాయణ మందేసుకోనని మొండికెత్తాడు. మూడు రోజులు జ్వరం అట్లాగే ఉన్నది. సావిత్రికి చీమకుట్టినట్టయినా ఉన్నట్టు కనబడలేదు. పార్వతి ప్రాణాలు విల విల లాడుతున్నాయి. నారాయణకు ఏమాత్రం అస్వస్థత చేసినా పార్వతికి కాళ్ళు వణుకుతాయి. ఇప్పటికింకా ఆమె మారలేదు. 'తల్లిపేగు' అట్లాగే ఉంటుందని ఆమె తనను తాను మెచ్చుకుని, "ఇది రాయి! అంతఃకరణలేని కోడలు నాకూ, పెళ్ళాం వాడికీ దాపరించింది! దీని అపేక్ష అడుక్కు తిన్నట్లే ఉన్నది" అని కోడలును తిట్టుకున్నది.

సావిత్రికి చీమకుట్టినట్టు లేకపోగా, మొగుడితో మామూలు మనిషితో మాట్లాడి నట్టు మాట్లాడేది.

పార్వతి కింకో భయంకరమైన ఆలోచన వచ్చింది; సావిత్రి మొగుడికి మందు పెట్టిందేమో! మందులు తిన్నవాళ్ళకు రకరకాల రోగాలొస్తాయిట. వెనక ఆ అవధానులు గారి మనవరాలి మొగుడికి మందులు పెట్టారు. చివరకు వాడికి పిచ్చెక్కిపోయింది!.... చివరకు తన కొడుక్కీ గతి పట్టిందా అనుకున్నది పార్వతి- మందులు పెట్టినదన్న మాట ఇంకా రుజువు కావలసి ఉన్నదన్న సంగతి మరిచిపోయి.

నాలుగోనాడు నారాయణ జ్వరం పోయింది. తల్లి పథ్యంగా తినమంటే వినక, అన్నీ వేసుకుతిన్నాడు. రోగం తిరగబెట్టుతుందని పార్వతి గట్టిగా నమ్మింది. కాని అట్లా జరగలేదు. పార్వతి కేమాత్రమో ఆశాభంగం కూడా అయింది కాని కొడుక్కెవరూ మందు పెట్టలేదన్న సంతృప్తిలో అది అంతగా పైకి రాలేదు.

తరవాత కొద్ది రోజులకు నారాయణ మాటల సందర్భంలో, "జబ్బుగా ఉన్న వాణ్ణి న్యూసెన్స్ చెయ్యగూడదు. చీటికీ మాటికీ వచ్చి 'ఎట్లా ఉంది? తల నొప్పా? లేదూ? దాహంగా ఉందా? మంచినీళ్ళివ్వనా? వద్దూ? ఏమన్నా తాగుతావా? ధారకం లేకుండా ఎట్లా ఉంటావూ? కాళ్ళు తీపులా? లేవూ? ఈ విధంగా తగులు కుంటే రోగికి ఎట్లా ఉంటుంది? దిక్కుమొహం లేసుకుని మనుషులు దగ్గిరికి వచ్చి పలకరిస్తుంటే, 'ఇంక ఈ రోగం నయంగాదల్లే ఉంది!' అని పిరికి గుండెవాడు దడుచుకున్నా దడుచుకోవచ్చు" అని పెద్ద ఉపన్యాసం ఇచ్చాడు.

అదంతా తనమీదేనని పార్వతికి తెలుసు. లోపల్లోపల ఉడుక్కున్నది. ఇదంతా వాడు తన భార్యను సమర్థించటానికే అంటున్నాడని పార్వతి నమ్మకం. ఎందుచేతనంటే, నారాయణ ఒకప్పుడు—అంటే అయిదారేళ్ళవాడై ఉండగా—కాస్త జబ్బుచేస్తే చాలు, తల్లిని తన మంచానికి కట్టేసుకుని, రెండు నిముషాలు అవతలికి వెళ్ళితే చాలు, చెప్పివెళ్ళినాసరే, "అమ్మా! అమ్మా! ఎంతసేపటికీ రావేం?" అని కేకలు పెట్టేవాడు. తన కొడుకింకా అట్లాగే ఉన్నాడని పార్వతికి భ్రమలేదుగాని, అట్లాగే ఉండకపోవటం వాడి తప్పేననీ, వాడిలా మారటానికి చాలావరకు కారణం తన కోడలేననీ నమ్మకం మటుకున్నది.

సంఘంలో వర్గాలమధ్య ఉండే గోడలను పోలినవి తరాల మధ్య కూడా ఉంటాయి. పై తరంవాళ్ళు కిందతరం వాళ్ళను అర్థంచేసుకోటానికి ప్రయత్నిస్తారు గానీ ఆ ప్రయత్నం ఫలించదు. కిందితరం వాళ్ళు పై తరాలను అర్థంచేసుకునేందుకు చెప్పుకో దగిన ప్రయత్నం చెయ్యరు. అది వాళ్ళకి చాలా అనవసరంగా తోస్తుంది. కాలం ఎప్పుడూ ముందుకే పోవటం అందుకు కారణం కావచ్చు.

అయినా చిన్నవాళ్ళు కాలానికి ఎదురీదవలసిన అవసరం ఉన్నది. పార్వతి మనస్సు ఎట్లా పనిచేసేదీ అర్థం చేసుకుని నారాయణ విసుక్కునేవాడే గాని, తను దూరమయాక ఆవిడ జీవితంలో ఎంత ఒంటరితనం అనుభవిస్తున్నదో అర్థం చేసుకోలేదు.

దానికి ఒక కారణం నారాయణ మనస్సు కథకుడు కావటంమీద లగ్నమై ఉన్నది. ఏ కళ సాధనచేసేవాడైనా ఒకేసారి రెండు ప్రపంచాలలో జీవించాలి. వాస్తవ ప్రపంచాన్ని వదులుకుంటే కళాసాధన నేలవిడిచిన సాము అవుతుంది; కళలో నిమగ్నుడవుతూ ఉండకపోతే అది స్వాధీనానికి రాదు. ఈ రెండు ప్రపంచాలలో ఏ ఒకదానితోనూ పార్వతికి తగిన స్థానం లేకపోవటం ఆమె ప్రారబ్ధం.

## నాల్గవ భాగం

కొంతకాలంగా నారాయణకు ఏదో ఆరాటమూ, అశాంతి పట్టుకున్నది. ఏవో కథలు రాస్తున్నాడు. తన కథలను కొందరు పాఠకులు సీరియస్‌గా తీసుకుంటున్నమాటా నిజమే. ఒక విధంగా సాహిత్యమంతా కూడా అరణ్యారోదనమే అనుకోవచ్చు. ఆ అరణ్యమైనా కొత్తగా నిర్జనమైనది కాకుండా ఉంటే రోదనాన్ని ఆలకించేవాళ్ళు ఏం చేస్తారన్నది రోదించేవాడి ప్రమేయం కాదుగద. అందుచేత తనది నిర్జనారణ్య రోదనం కాదన్నంతవరకు నారాయణకు దూఢిగా తెలుసు అతను రచయితగా తనస్థాయిని ఏనాడో నిర్ణయించుకున్నాడు. అతను చాలా చిన్న పరిమితిని దాటిపోదలచలేదు. ఏ వీరేశలింగం పంతులుగారి లాగానో సామాజిక జీవితాన్నంతా ఆపోశనపట్టి, జనంలోని విశ్వాసాలను కూకటివేళ్ళతో కదిలించే ఆశయం తన తలకు మించినది. తన కథలలోని నాయకులను ఉత్తమ కళాకారులుగానూ, గొప్ప సాహితీపరులుగాను, ప్రతిభాసంపన్నులయిన చిత్రకారులుగాను ఆకాశమంతెత్తుండే మహోన్నతాశయాలు గలవాళ్ళు గానూ, ఆఖరుకు యూనివర్శిటీ ఫస్టుగా వచ్చే బియ్యేలుగానూ చిత్రించే ఉద్దేశం అతనికి లేదు. మామూలు మనుషులు, మామూలు జీవితం, మనుషులు చేసే చిన్న చిన్న పొరపాట్లు. జీవితం నుంచి సాధించలేకపోయే చిన్న చిన్న సుఖాలు— ఇవే అతను తన కథల్లో పెట్టేవాడు. చిన్న కారణాల నుంచి పెద్ద దుష్పరిణామాలు కలుగుతాయన్నది అతను పైకి చెప్పని నీతి. ఆ నీతిని అతను జీవితం నుంచి నేర్చుకున్నాడు.

ఇదంతా బాగానే ఉన్నది గాని అతనికి జీవితం చాలా ఇరుకనిపిస్తున్నది. మురికిగుంటలో ఇరుక్కుపోయానన్న భావం అతన్ని విడవకుండా బాధించింది. అతను బందరులో జరిగిన నవ్యసాహిత్య పరిషత్తు[1] కు వెళ్ళి అనేక మంది రచ

1. బందరులో నవ్యసాహిత్య పరిషత్తు వార్షిక సమావేశం జరిగింది 1938.

యితలనూ, పండితులనూ కలుసుకున్నాక ప్రాణం లేచివచ్చినట్టయింది. అదివరకు పేర్లు మాత్రమే తెలిసినవారెందరో అక్కడ ప్రత్యక్షంగా కనిపించారు. వాళ్ళందరూ తన పేరు ఎరిగినట్టే కనబడ్డారు. కొందరు తన కథలను కొన్నింటిని చదివారు కూడా. అందరూ తనని వాళ్ళవాడుగా చూసుకున్నారు.

"నిజానికి వీళ్ళంతా నా బంధువులే" అనుకున్నాడు నారాయణ. సాహితీ పరుల మధ్య ఒకవిధమైన వర్గ బంధుత్వం ఉంటుందని అప్పటిదాక అతనికి తెలీదు. అక్కడ మూడురోజులు అతనికి చాలా ఆనందంగా గడిచాయి. పెన్నిధి సంపాదించుకున్నవాడంత గర్వంతో అతను ఇంటికి తిరిగి వచ్చాడు. ఏటా సాహిత్య పరిషత్తు అక్కడ సమావేశమవుతుంది. తాను వీరందరినీ చూడవచ్చు.

బందరునుంచి తిరిగి వచ్చాక తన జీవితం మరింత మురికి ఇరుకుగుంట అనిపించింది. తెనాలి వచ్చేదారిలో వెంకటేశ్వర్లు మామయ్య ఇంటికి వెళ్ళి ఒకపూట ఉన్నాడు. ఒక బెజవాడ రచయిత ఆ పూటల్లా తనతోనే ఉన్నాడు.

మాటల సందర్భంలో వెంకటేశ్వర్లు తనకు హైకోర్టులో ఏదో పనివున్నదనీ మద్రాసు వెళతాననీ అన్నప్పుడు నారాయణ తానుకూడ వస్తానన్నాడు.

"వస్తే రా! ఏం తెనాల్లో నీకు పొద్దుపోతున్నట్టులేదే!" అన్నాడు వెంకటేశ్వర్లు నవ్వి.

"ఆ మాట మెల్లిగా అంటున్నావా?" అన్నాడు నారాయణ.

"ఒరే, నీతో అదివరకే అన్నాను. నువు చెవిన పెట్టలేదు. తినటానికింత ఉన్నదికదా అని నువు ఉద్యోగం చేయకుండా ఉండవలసిన పనేమిటి? ఉద్యోగం పురుషలక్షణం. డబ్బుకన్నా కూడా మనిషికొక రొటీన్ పని ఉండటం అవసరం. నాతో పట్నం రా; నీకేదన్నా ఉద్యోగం దొరుకుతుందేమో చూద్దాం!" అన్నాడు వెంకటేశ్వర్లు మామయ్య.

నారాయణ బుర్రా మామూలుగా అంధకారంలో ఉంటుందో ఏమిటోగాని, అందులో ఉన్నట్టుండి ఒక్కొక్క మెరుపు మెరిసి, ఒక్కొక్క కొత్త విషయం ద్యోతకమవుతూ ఉంటుంది. అతను రైల్లో తెనాలి వస్తుండగా ఒక మెరుపు మెరిసింది. చాలా కాలం క్రితం తనకెవరో కుర్రాడు ఉత్తరం రాస్తూ ఒక ప్రశ్న వేస్తే, తనకు సమాధానం తెలియదని తాను జవాబిచ్చాడు. ఇదే సమాధానం! తన తల్లి వడ్డీలమీద పేర్చిన ఆస్తి అనుభవిస్తూ కూర్చోక, ఏనాడో ఉద్యోగం సంపాదించుకుని, తన ఆర్జనతో కాలక్షేపం చెయ్యవలసింది! ఇన్నాళ్ళూ ఈ మాటే తట్టలేదు.

---

అధ్యక్షులు బుర్రా శేషగిరిరావు. వ్యావహారిక భాషోద్యమం, నవ్యసాహిత్య ప్రచారం ఈ సాహితీ సంస్థ ధ్యేయాలు. [illegible]

ఇంటికి వచ్చాక నారాయణకు మద్రాసు వెళ్ళాలనే తహతహ జాస్తి అయింది. బయలుదేరేటప్పుడు ఉత్తరం రాస్తానన్న వెంకటేశ్వర్లు దగ్గరనుంచి దాదాపు నెలదాకా ఉత్తరం లేదు. 'మామతో కాకపోతే తానే మద్రాసు బయలుదేరి పోరాదా? తనకు తోడు కావాలా'? అనుకున్నాడు నారాయణ. కాని అట్టా పోబుద్ధి కాలేదు. 'ఎందుకొచ్చిన హైరాన? కాలం వెళ్ళమారిపోతూనే ఉన్నదిగదా!' అనిపించింది.

ఇంతలో వెంకటేశ్వర్లు దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది; "ఎల్లుండి రాత్రి మెయిల్‌లో నేను మద్రాసుకు బయలుదేరుతున్నాను. నువు అదే బండికి స్టేషన్కు వచ్చి, టిక్కెట్టు కొని, సిద్ధంగా ఉండు."

ఆ విధంగా నారాయణ మొట్టమొదటిసారి మద్రాసు వచ్చాడు. పట్నంలో తిరుగుతుంటేనే అతనికి ఊపిరి సుఖంగా ఆడుతున్నట్టున్నది. వెల్స్[1] రాసిన ఒక ఫాంటసీలోలాగా ప్రపంచంలో అన్నీ పెద్ద నగరాలే ఉంచి, చిన్న గ్రామాలనూ చిన్న పెద్ద బస్తీలనూ ఎత్తిపారేస్తే బాగుంటుందేమో ననుకున్నాడతను. వందమైళ్ళకొక మద్రాసులాటిదుంటే పల్లెటూళ్ళతో పనిఉండదు. రైలు ప్రతి అయిదారు మైళ్ళకూ ఆగనవసరం లేదు. నగరాల మధ్య రోడ్లువేసి, పొలాలలో పనులు చేసే వాళ్ళను బస్సులే చేరవెయ్యొచ్చు; అందరికీ జీవితం హాయిగా ఉంటుంది.

హైకోర్టులో వెంకటేశ్వర్లుకి పనిఉన్నమాట నిజమేగాని, ఇంకో పని కూడా ఉన్నది. లా కాలేజీలో ఎవరో కుర్రాడు చదువుతున్నాట్ట; తన కూతురికి సంబంధం చూడటమే ఆ పని.

లా కాలేజీకి ఎదురుగా ఉండే ఒక ఇరుకువీధిలో ఒక హోటల్లో ఇద్దరూ దిగారు. అరవ హోటలు; చిన్నదైనా శుభ్రంగా ఉన్నది; భోజనంకూడా శుచిగా ఉన్నది. వెంకటేశ్వర్లుకు భోజనాల అరవం వచ్చును.

వెంకటేశ్వర్లు తన పనిమీద కొంతా, నారాయణకు ఊరు చూపించడానికి చాలా ప్రాంతాలు తిరిగాడు. పత్రికాఫీసుక్కూడా వెళ్ళాడు. అక్కడ వెంకటేశ్వర్లుతో చదువుకున్నతను రిపోర్టరుగా పనిచేస్తున్నాడు. అందులో నారాయణకు

---

1. వెల్స్ (1866-1946) : హెచ్. డి. వెల్స్ ప్రసిద్ధ ఆంగ్ల నవలా రచయిత. చరిత్రకారుడు. కింది మధ్య తరగతి జీవితాల్లో కలుగుతున్న మార్పులనూ, ఘర్షణలనూ చిత్రించిన నవలాకారుడు. విజ్ఞాన కల్పనా సాహిత్య స్రష్ట. వెల్స్ రాసిన ప్రఖ్యాత నవలలు : 'ది టైమ్ మెషీన్', 'ది వండర్‌ఫుల్ విజిట్' (1895); 'ది ఫస్ట్ మ్యాన్ ఆన్ ది మూన్' (1901); చరిత్ర గ్రంథం : 'షార్ట్ హిస్టరీ ఆఫ్ ది వరల్డ్' (1922)

సబెడిటరుపని సంపాదించాలని వెంకటేశ్వర్లు ప్రయత్నం. నారాయణను ఒక అప్లికేషను రాయమనీ, ఎడ్రసు ఇవ్వమనీ, వేకేన్సీ ఉంటే కబురుచేస్తామనీ పత్రికల వాళ్ళు అన్నారు.

తరవాత లా కాలేజీ స్టూడెంటును చూశారు. కుర్రాడు చలాకీగానూ, అందంగానూ ఉన్నాడు. ఆ కుర్రాడు నారాయణ రాసిన కథలు దాదాపు అన్నీ చదివాట్ట. అతన్ని చాలా ఆసక్తితో చూశాడు. అతని పేరు రామక్రిష్ణరావు.

వెంకటేశ్వర్లు అతనితో చుట్టరికం కలిపి, తాను వచ్చినపని చెప్పాడు. రామక్రిష్ణరావు పెత్తండ్రి అల్లుడు వెంకటేశ్వర్లుకు స్నేహితుడు. రామక్రిష్ణరావు రెండో మేనత్త అత్తవారివైపు వాళ్ళకూ వెంకటేశ్వర్లు అత్తవారికీ దగ్గిర చుట్టరికం ఉన్నది.

"మా అమ్మాయి ఈయేడే పెద్దమనిషయింది. దానికి వచ్చే వైశాఖంలో పెళ్ళి చేద్దామనుకుంటున్నాను. ఎట్లాగూ మద్రాసు వచ్చానుగదా అని నిన్నుకూడా కలిశాను. మీ నాన్నగారితో మాట్లాడాను. నీకు పిల్లనచ్చితే తనకేమీ అభ్యంతరం లేదన్నారు. అందుచేత నీకెప్పుడు వీలుంటే అప్పుడు పిల్లను చూడవచ్చు. ముందుగా చెప్పి రానవసరం కూడా లేదు." అన్నాడు వెంకటేశ్వర్లు.

"సరేలెండి." అన్నాడు రామక్రిష్ణ.

అతనికి తన పెళ్ళికన్న నారాయణ ఏం రాస్తున్నాడో, ఏం రాయబోతున్నాడో తెలుసుకోవాలన్న ఆదుర్దా జాస్తిగా ఉన్నట్టు కనబడింది.

మేనమామతోబాటు తిరుగుబండిలో ఎక్కి కూర్చున్నాక, నారాయణకు మద్రాసులో ఏమీ జరిగినట్టేలేదు. తన ప్రయాణం పూర్తిగా నిరుపయోగమైన వినోదయాత్ర కింద జమ అయినట్టనిపించిందతనికి. జీవితంలో కొన్ని కొన్ని పనులు ఎట్లా జరిగేదీ నారాయణకు కొంచెంకూడా తెలీదు.

* * * *

నారాయణ తిరిగి మురికిగుంట జీవితానికి సమాధానపడుతున్న సమయంలో పత్రికవాళ్ళు ఇంటర్వ్యూకు రమ్మని ఉత్తరం రాశారు. వెళ్ళటానికి మూడురోజులు పైమున్నది.

అప్పటిదాకా పార్వతికి తన కొడుకు మద్రాసులో ఉద్యోగ ప్రయత్నం చేసినట్టు తెలీదు. తల్లి అభ్యంతరం చెబుతుందనో, లేక నిజంగా తనకు ఉద్యోగం అవుతుందని నమ్మకం లేకనో నారాయణ ఆ విషయం తల్లితో చెప్పలేదు. పెళ్ళాంతో చెప్పాడుగాని, శతవిధాల ఉద్యోగం దొరకదనే చెప్పాడు. అతను ఆడవాళ్ళతో హెచ్చుగా మాట్లాడినది రామక్రిష్ణ గురించి. ఆడవాళ్ళకు పెళ్ళికబురు వింటే కలిగే సంతోషం మరి దేనివల్లా కలగదు. అందుచేత వాళ్ళు ఆ కుర్రాణ్ణి గురించి గుచ్చి

గుచ్చి అడిగారు. ఆ అబ్బాయికి ఎన్నేళ్ళుంటాయి? ఎంతమంది అన్నదమ్ములు? ఎంత ఆస్తి? కట్నంమీద ఏపాటి ఆశ ఉన్నది?

అన్నిటికీ నారాయణ, "నాకు తెలీదు." అని సమాధానం చెప్పవలసివచ్చింది.

"ఏమైనా పెళ్ళి అన్నాక జాతకాలు చూసుకునిచేస్తే మంచిది." అన్నది. పార్వతి.

"అవీ నమ్మటానికి లేదత్తయ్యా!" అన్నది సావిత్రి.

"నీకూ, నీ మొగుడికి ఎందులోనూ నమ్మకం లేదుగా!" అన్నది పార్వతి; తన కేదో వ్యక్తిగతమైన అవమానం జరిగినట్టు.

"అని కాదత్తయ్యా జాతకాలు మార్చి చూపిస్తారు" అన్నది సావిత్రి.

పార్వతి మాట మార్చేసింది....

"ఉద్యోగమా? పట్నంలోనా? ఏమిస్తారో?" అని పార్వతి కొడుకు నడిగింది, పత్రికవాళ్ళు రమ్మన్నట్టు తెలిశాక.

"ఏ యాభై తోనో ప్రారంభిస్తారేమో? ఎంతైతేనేం? ఈ రోజుల్లో రూపాయికి ఇద్దరు బియ్యేలు." అన్నాడు నారాయణ.

"అయితే వెళ్ళటం నీ కిష్టమేనన్నమాట?" జీతం నచ్చినట్టు మాట్లాడుతున్నాడుగా మరీ!

"వెళదామనే ఉంది. ఈ ఊళ్ళో ఏముంది-గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోటం తప్ప?" అన్నాడు నారాయణ.

"నీకేంఖర్మ కాలిందిరా. ఉద్యోగం చెయ్యటానికి? హాయిగా ఇంటిపట్టున ఉండి, కాలుమీద కాలేసుకూర్చుని ఉన్నది పెట్టుకు తినక?" అన్నది పార్వతి.

కొడుకు ఉద్యోగంచేస్తే తనకు మరింత దూరమైపోతాడనీ, తనకు వాడిపైన ఇప్పుడున్న అధికారంకూడా ఉండదనీ ఆమెకు తెలుసు.

"అదే వచ్చినచిక్కు- ఈ కాలుమీద కాలేసుకూచోటమే విసుగ్గా వుంది. సొంతాన ఏదన్నా పని కల్పించుకుందామన్నా ఇక్కడ ఎటువంటి అవకాశమూ కనబడదు" అన్నాడు నారాయణ.

ఒకప్పుడు పార్వతి తన కొడుకు ఏదన్నా ఉద్యోగం చెయ్యాలని కలలు కన్నదే. కాని ఇప్పుడామెకే అది అభ్యంతర మయింది. పైగా ఆవిడ ఉద్దేశంలో ఉద్యోగమంటే ఏ తాలూకాఫీసులోనో, కలెక్టరాఫీసులోనో పనిచెయ్యటం. స్కూలు మేస్టరు పని అయినా ఆమెకు ఒకప్పుడు గౌరవమే; ఇప్పుడు దేనిమీదా గౌరవం లేదు.

ఒక్క ఉద్యోగం విషయంలోనే కాదు; ఇంకా అనేక విషయాలలో ఆమె అభిప్రాయాలు ఉత్తరంనుంచి దక్షిణానికి మారాయి. ఒకప్పుడామె తన కొడుకును

గురించి వాడు తండ్రిలాగా అవుతున్నాడని భయపడింది. కాని ఈ మధ్య ఆమెకు భర్తమీద గౌరవం హెచ్చుతున్నది. నారాయణలో తండ్రిగుణాలు కొన్ని లేనందుకు ఆమె విచారిస్తున్నది. తనభర్త - మిగతా విషయాలెట్లా ఉన్నా మగపురుషుడు; ఆడదాని కొంగుపట్టుకు తిరిగినవాడు కాడు; ఆడదాన్ని నెత్తికెక్కించుకున్నవాడు కాడు. తన ఎత్తు ధనంపోసినా ఉద్యోగం చేసిఉండడు; మహారాజులాగా గాంధీ గారి మాటవిని జైలుకెళ్ళాడు! మగసిరిగల మనిషి! వీడేమిటో కథలు రాస్తాడు. ఉద్యోగం చేస్తానంటాడు! ఎక్కడో మద్రాసు పోతాట్ట-నాలుగు డబ్బులకోసం, చిప్ప చేతబట్టుకుని!

నారాయణ మద్రాసువెళ్ళే ప్రయత్నంలో ఉండటంచూసి పార్వతి, "అయితే ఈ వూరూపేరూ లేని ఉద్యోగం చెయ్యటానికే నిశ్చయించుకున్నావుట్రా?" అని అడిగింది.

"వాళ్లు ఉద్యోగం ఇస్తామని రాయలేదమ్మా. ఇంటర్వ్యూకు రమ్మన్నారు. తీరా వాళ్ళు ఉద్యోగం ఇవ్వం పొమ్మనవచ్చు." అన్నాడు నారాయణ, తల్లిమనసుకు కొంతైనా తృప్తిగా ఉంటుందని.

పార్వతి ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవిచేసి, వాళ్ళచేత ఆ మాట అనిపించుకునే టందుకా నువు వెళ్ళేది?" అన్నది.

నారాయణ ఇరుకునపడ్డాడు.

"కాదు, ఒకవేళ ఉద్యోగం ఇస్తామంటే చేద్దామనే."

"ఆ మాట చెప్పవేం? నీ కింకా ఉద్యోగం భ్రమ తీరలేదన్నమాట."

తల్లి తన విషయాలలో ఇట్లా శాసించయత్నించటం నారాయణకు నచ్చలేదు.

"చూడమ్మా? నెలకు యాభై రూపాయలంటే అయిదువేల రూపాయలమీద నెలనెలా వడ్డీ వసూలుచెయ్యటంతో సమానం. మన ఇంటికి పన్నెండు రూపాయలు అద్దె ఇచ్చేవాళ్ళు గద. ఇటువంటి ఇళ్ళు నాలుగు వున్నట్టన్నమాట. ఉద్యోగాన్ని తేలిగ్గా తీసిపారెయ్యకు. పోలీసు సబిన్స్పెక్టరు జీతంతో సమానం." అన్నాడు నారాయణ.

"చెప్పాను. తరవాత నీ ఇష్టం" అన్నది పార్వతి - నారాయణ ఉద్యోగం చేసేది చేసేదే అన్నట్టుగా....

పత్రికలవాళ్ళు నారాయణను జూనియరు రిపోర్టరుగా వేసుకున్నారు. అతను వచ్చేనెల మొదటితేదీన జాయినవుతానని చెప్పి తిరిగివచ్చి తన భార్యనూ, తల్లినీ ప్రయాణానికి సిద్ధం కమ్మన్నాడు.

"ఇంతపని చేస్తావని నాకు తెలుసు. సొంత ఇల్లు పెట్టుకుని నన్ను అద్దె ఇంట్లో చచ్చేటట్టు చేద్దామని చూస్తున్నావు నువు!...."

కొడుకు ఉద్యోగం సంపాదించుకొచ్చాడన్న అక్కసుకొద్దీ పార్వతి అఘాయిత్యంగా మాట్లాడింది. ఇక మాట్లాడటాని కేమీ లేకపోయేసరికి, "కావాలంటే నువ్వూ అదీ వెళ్ళండి. కృష్ణా రామా అంటూ నేను ఈ ఇంట్లోనే ఉంటాను. వంటిల్లు నాకింద ఉంచుకుని మిగతా ఇల్లు అద్దెకిస్తాను. దిక్కుదిక్కుమంటూ ఇంట్లో ఒక్కతెనూ ఎట్లా ఉంటాను?" అన్నది.

నారాయణ ఆవిడ సూచనకు అభ్యంతరం చెప్పలేదు. "నువు మా వెంట వచ్చి తీరాలి!" అని కొడుకు అనలేదని పార్వతి బాధపడింది.

రెండు ట్రంకుపెట్టెలూ, రెండు పక్కచుట్టలూ తీసుకుని నారాయణ సావిత్రితో సహా రైలెక్కాడు. ఇంటికి అద్దెకు వచ్చేవాళ్ళను తానే చూసుకుంటాను లెమ్మని పార్వతి అన్నది.

బయలుదేరేముందు నారాయణ వెంకటేశ్వర్లుకూ, మద్రాసులో రామకృష్ణకూ ఉత్తరాలు రాశాడు. రామక్రిష్ణ రైలుకు వచ్చాడు. అతను నారాయణనూ, సావిత్రినీ తన గదికే తీసుకుపోయాడు - అద్దెఇల్లు దొరికినదాకా, తనదగ్గిర టిఫిన్ కారియరు న్నది. అందులో హోటలు నుంచి రెండు భోజనాలు పట్టుకొస్తే ముగ్గురికీ ఎక్కితొక్కి సరిపోయింది.

రామకృష్ణ స్నానానికి వెళ్ళినప్పుడు సావిత్రి, "పిల్లవాడు బాగానే ఉన్నాడండి. మిమ్మల్ని చిన్నప్పటినుంచీ ఎరిగినట్టుగా మసులుతున్నాడే" అన్నది. నారాయణ నవ్వాడు.

నారాయణ ట్రిప్లికేన్‌లోనే పదిరూపాయలకొక విశాలమైనగది తీసుకున్నాడు. ఆఫీసుకు దగ్గిర. ఆ వీధిలోనే భోజనహోటలున్నది. నెలకు తొమ్మిది రూపాయలిస్తే కారియరు భోజనం పంపిస్తారు. ఇద్దరికీ హాయిగా సరిపోతుంది. అరవభోజనంతో చవిచస్తే, బుట్టలో తెచ్చుకున్న ఊరగాయలూ, కందిసున్నీ, ఊరమిరపకాయలూ ఉన్నాయి.

* * * *

గది దొరకగానే నారాయణ తల్లికీ, చిన్న మేనమామకూ ఉత్తరాలు రాశాడు. వెంకటేశ్వర్లుకు రాసిన ఉత్తరంలో తన తల్లి సంగతి అప్పుడప్పుడూ రాస్తూండమని రాశాడు. ఆ ఉత్తరం రాసేటప్పుడే అతనికి ఒక ఐడియా బుర్రలో మెరిసింది; "నేను ఆఫీసుకు పోతే సావిత్రి ఒంటరిగా ఉంటున్నది. సీతను తోడు పంపరాదా? రామకృష్ణ తరచు కనిపిస్తూనే ఉన్నాడు. అతను సీతను చూడటానికి వీలవుతుంది. ఎప్పుడు విసుగెత్తితే అప్పుడు సీత తిరిగి వెళ్ళిపోవచ్చు." అని రాశాడు.

"నీ ఉద్దేశం బాగానే ఉన్నది. నాకు తీరిక బొత్తిగా లేదు. ఇక్కడినుండి

మద్రాసుకు తరచు ఎవరో ఒకరు వస్తూంటారు. ఎరిగినవాళ్ళ వెంట పంపిస్తాను." అని వెంకటేశ్వర్లు రాశాడు.

పదిహేను పదహారు రోజుల అవతల సీత వచ్చింది. ముందుగా నారాయణకు టెలిగ్రాం వచ్చింది—రేపు ఉదయం సీత చేరుతున్నదని.

సీతను రిసీవు చేసుకోవటానికి నారాయణతోబాటు రామక్రిష్ణ కూడవచ్చాడు. జుట్టంతా రేగి, బట్టలన్నీ నలిగిఉన్న సీత రామకృష్ణ కళ్ళకు రంజలాగా కనబడింది. రామక్రిష్ణ కళ్ళు సీత ముఖంమీదే ఉండటం నారాయణ గమనించాడు. పాపం, సీతకు రామక్రిష్ణ ఎవరో కూడా తెలీదు.

వాళ్ళు ట్రాంమీద మౌంట్‌రోడ్డుచేరి, అక్కడ హోటల్లో కాఫీ తాగాక, రామక్రిష్ణ మర్నాడు ఆదివారం – ఊరంతా తిరిగే ప్రోగ్రాం ఏర్పాటుచేసి, సెలవు పుచ్చుకున్నాడు. తరవాత నారాయణ సీతను ట్రిప్లికేను బస్సులోకి ఎక్కించి. "ఎట్లా ఉన్నాడే ఆ అబ్బాయి?" అని అడిగాడు.

"ఎవరతనూ? మన బంధువా?" అని అడిగింది సీత.

"బంధువు కాబోయేవాడు. మీనాన్న ఇతన్నే నీకు చూస్తున్నది."

సీత కంగారుపడింది. "ఆ మాట చెప్పకూడదా బావా?" అన్నది.

"చెప్పకపోతే ఏమయింది?" అన్నాడు నారాయణ.

"చూడు. ఈ అవతారం. ఎట్లా ఉన్నానో?"

"ఒహో, అయితే అతనికళ్ళకు షోక్ షోగ్గా కనపడాలని ఉందన్నమాట. రేపు వస్తాడుగా. అప్పుడు షోకు చేసుకుందువుగానిలే!" అన్నాడు నారాయణ.

మర్నాడు ఉదయం రామకృష్ణ దుర్ముహూర్తంలాగా మరీ పెందలాడే వచ్చి కూర్చున్నాడు - చర్చికి వెళ్ళే క్రిస్టియనల్లే తనకున్న మంచి దుస్తులు వేసుకుని, అతను ఒక గంటపాటు గదిముందు వరండాలో వెయిట్ చెయ్యవలసి వచ్చింది.

సీత చాలా శ్రద్ధగా డ్రెస్ చేసుకున్నది. జుట్టు దువ్వుకోవటమూ, బొట్టూ, కాటుకా, తన బట్టలూ- బాగున్నాయోలేదో, సావిత్రక్కను విడివిడిగా అడిగి మరీ తెలుసుకున్నది. సావిత్రి సీతను చూసి నవ్వక – ఎంతో సహాయం చేసింది. ఈనాటి సినిమా మేకప్‌మాన్ పెద్దస్టారును తయారుచేసినంత శ్రద్ధగా.

పూర్తిగాముస్తాబై ఇవతలికి వచ్చిన సీతను, రామక్రిష్ణ దాదాపు గుర్తించలేదు. నిన్న తాను చూసిన అమ్మాయికి అక్కో, చెల్లెలో అన్నట్టున్నది. ఈ పిల్ల ఎంత అందంగా ఉన్నప్పటికీ, నిన్న జుట్టురేగి నలిగినట్టున్న పిల్ల బొమ్మ అతని మనసు నుంచి చెరిగిపోలేదు.

ఆరోజు వాళ్ళు నలుగురూ టూరిస్టులల్లే తిరిగారు. బస్సులో మౌంటురోడ్డు కొచ్చి మంచిహోటల్లో ఫామిలీరూమ్‌లో చేరి బాగా టిఫిను పట్టించారు. తరువాత రామక్రిష్ణ నాలుగు ట్రాం బైరాగి టిక్కెట్లు కొన్నాడు. వాటితో రోజల్లా ట్రాముల మీద తిరగొచ్చు. సాయంకాలం రద్దీగా ఉంటుందని ఉదయమే బీచ్‌కి వెళ్ళారు. బీచివెంబడి శాంతోం నుంచి ట్రిప్లికేను దాకా నడిచారు.

ట్రిప్లికేన్ హైరోడ్డునుంచి పీపుల్స్ పార్కుకు వెళ్ళారు. మధ్యాహ్నందాకా జంతువులను చూసి మూర్‌మార్కెట్ చేరి, జార్జిటవునుకు వెళ్ళి అక్కడ మోడరన్ లాడ్జిలో భోజనం చేశారు. నారాయణ పోట్లాడిన మీదట రామక్రిష్ణ భోజనం టిక్కెట్లు కూడా తానేకొనే ప్రయత్నం మానేశాడు. భోజనాలయాక హైకోర్టు చెట్లక్రింద ఓ గంటసేపు కూర్చుని మళ్ళీ బయలుదేరారు. మ్యూజియం చూశారు. సాయంకాలం 6-15 ఆటకు బాగా ముందుగానే ఎల్ఫిన్‌స్టన్ సినిమాదగ్గిర హాజరయారు. అక్కడ ఐస్ క్రీం బార్‌లో రామక్రిష్ణ అందరికీ ఐస్‌క్రీం పెట్టించాడు- సినిమా టిక్కెట్లు నారాయణను కొననిచ్చే షరతుమీద. సినిమాహాలులో తనూ సీతా మధ్య కూర్చుంటే తనప్రక్కన తన మొగుడూ, సీతపక్కన రామక్రిష్ణ కూర్చునేటట్టుగా సావిత్రి ఏర్పాటు చేసింది.

ఆ రోజు వాళ్ళ నలుగురికీ పదిరోజుల పెట్టుగా గడిచిపోయింది. ఆ రోజు వాళ్ళు తిరిగిన ప్రాంతాలు సీతకెంత కొత్తో, సావిత్రికి కూడ అంత కొత్తే.

"మనబైరాగి టిక్కట్లపని అయిపోయింది. గుడ్‌నైట్" అని రామక్రిష్ణ గుడ్‌బై చెప్పి వెళ్ళిపోయాడు.

ఇంటికివచ్చి బట్టలు మార్చుకునేటప్పుడు సావిత్రి సీతతో, "ఏమిటంటాడా అబ్బాయి నీతో?" అన్నది.

"నాతో ఏమీ అనలేదే?" అన్నది సీత బిత్తరపోయి.

"సినిమా మధ్యలో మీరేదో గుసగుసలాడుకొన్నారే?" అన్నది సావిత్రి సీరియస్‌గా.

"చూడు బావా, నీ పెళ్ళాం!" అని సీత వరండాలో ఉన్న నారాయణను కేక పెట్టింది.

నారాయణ అనవసరంగా కారియరు భోజనం తెచ్చాడుగాని అది చెల్లలేదు.

* * *

రెండు వారాలుండి సీత గ్రాండ్‌ట్రంక్ ఎక్స్‌ప్రెస్‌లో ఒంటరిగానే వెళ్ళిపోయింది. దాదాపు ప్రతిరోజూ రామక్రిష్ణ వచ్చాడు — అయిదారు సినిమాలు చూశారు.

సీతను మద్రాసు తెప్పించాలని నారాయణకు తట్టటం రామక్రిష్ణ జీవితంలో కలకాలం జ్ఞాపకం వుండే సన్నివేశానికి కారణమైంది. అట్లా అవుతుందని నారాయణ ఊహించలేదు. మొదటిరోజు రామక్రిష్ణ సీతతో గుసగుస లాడాడన్నది సావిత్రి కల్పనేగాని ఆ తరవాత వాళ్ళిద్దరూ స్వేచ్ఛగానే మాట్లాడుకున్నారు. రామక్రిష్ణ సీతకు చాలా కబుర్లు చెప్పాడు.

సీత ఉండగానే సావిత్రికి రావలసిన నెల రాలేదు. ఆ తరవాత రెండోనెల లోనే వేవిళ్ళు ప్రారంభమయాయి.

సీత పెళ్ళికి నారాయణా సావిత్రీ వెళ్ళేసమయానికి సావిత్రికి నాలుగోనెల. గర్భం. అప్పుడే పార్వతికి ఆ వార్త తెలియటం కూడాను.

"నెలతప్పగానే నాకు రాయగూడదూ? నేను సంతోషించే దాన్నేగాని దిష్టి పెట్టనుగా?" అని ఆమె కొడుకును దెప్పింది.

"డాక్టరు పరీక్షించి కడుపేనని చెప్పేదాకా మాకే నమ్మకంలేదుగా? ఆ తరవాత పెళ్ళికి రానేవస్తిమి" అన్నాడు నారాయణ.

"మా కాలంలో మేం కడుపులైతే డాక్టరుచేత చెప్పించుకుని ఎరగం నాయనా! అయినా ఎవడా కడుపులు పరీక్షించే డాక్టరు?" అన్నది పార్వతి. తన కొడుకు ఎంతకు దిగజారాడా అని ఆశ్చర్యపోతూ.

"మగడాక్టరు కాదు. ఆడ డాక్టరే" అన్నాడు నారాయణ.

"దాన్ని మళ్ళీ తీసుకుపోతావా?" అని పార్వతి అడిగింది.

"పుట్టింటి దగ్గర దించుదామనుకుంటున్నా" అన్నాడు నారాయణ.

"ఇప్పటినించీనా?"

"ఇంకో రెండునెల్లకు మళ్ళీ తీసుకురావద్దూ?"

"నీకెవడు చెప్పగలరులే" అన్న ముఖం పెట్టింది పార్వతి. తన కొడుకు ఒక్క ఆలోచన సరిగా చెయ్యలేడనీ, వాడుచేసే ఒక్కపనీ సవ్యంగా ఉండదనీ ఆవిడ మళ్ళీ మళ్ళీ ఋజువుచేసుకుంటున్నది.

"రెండురోజులు ఇంటికొచ్చి మరీవెళ్ళు" అన్నదామె.

"నేను మళ్ళీ సోమవారానికి పనికెళ్ళాలి....చూస్తా" నన్నాడు నారాయణ.

నారాయణ శుక్రవారంనుంచి ఆదివారం సాయంకాలందాకా దుగ్గిరాల్లో అత్తవారింటే గడిపి మద్రాసుకు తిరిగి వెళ్ళిపోయాడు. తెనాలి రాడని ముందే అంచనా వేసుకున్న పార్వతి తన కొడుకును గురించి అనుకునేదంతా రైటేనని తృప్తిపడింది.

ఆశ్వీజమాసంలో సావిత్రి కన్నది; ఆడపిల్ల.

"మా వంశంలో ఏనాడూలేదు. మొట్టమొదటే ఆడపిల్ల పుట్టటం అటువేపు పోలిక" అన్నది పార్వతి అద్దెకున్నవాళ్ళతో.

కడుపులోమాట చెప్పుకునేందుకు పార్వతికిప్పు డెవరూలేదు. ఆవిడ పెద్దన్న లిద్దరూ వ్యాపారం దెబ్బతిన్నాక నిజాముకు వెళ్ళిపోయారు. వాళ్ళ సమాచారమే లేదు. తనకొడుకు తండ్రికి తద్దినాలు పెట్టటం మానేశాడనీ, తాను వాడికోసం పడినపాట్లన్నీ గంగపాలయాయనీ, తన కోడలూ వియ్యాలవారూ వాణ్ణి బుట్టలో వేసుకున్నారనీ, వాళ్ళమాట వినే వాడు పొట్టచేతబట్టుకుని పట్నం వెళ్ళాడనీ, 'కలిగి ఖర్మం, లేక దరిద్రం' అంటే ఇల్లానే ఉంటుందని పార్వతి తన ఇంట అద్దెకున్నవాళ్ళతో చెప్పుకునేది. సాధారణంగా ఒకరిని గురించి చెడుగా మాట్లాడు కోవటమే నిజమైన కాలక్షేపం. ఇతరులను మెచ్చుకుంటూ మాట్లాడుకోవటం భజనలాగా ఉండి బోరు కొడుతుంది. అందుచేత ఇంటివాళ్ళు ప్రోత్సాహం యిచ్చి పార్వతిని ఇంకా మాట్లాడించేవాళ్ళు. గాయత్రీ మంత్ర మయేది, నీలాపనింద అయేది పునశ్చరణ చేసినందుకు దాని ప్రభావం ఉండితీరుతుంది. కొత్త సాక్ష్యాధారాలు అవసరం లేకుండానే పార్వతి దృష్టిలో నారాయణ ఆరోజు కారోజు దిగనాసిల్లి పోసాగాడు.

నారాయణ పట్నంనుంచి ఇంటికివచ్చి తల్లిని వెంటబెట్టుకు దుగ్గిరాలకు వెళ్ళాడు బారసాలకు. అది బారసాలలాగా జరగలేదు; పెళ్ళి జరిగినంత ఆర్భాటంగా జరిగింది. నారాయణ వైపువాళ్ళూ, సావిత్రివైపు వాళ్ళూ నలభై మందిదాకా వచ్చారు. రామక్రిష్ణా సీతకూడా వచ్చారు.

వియ్యాలవారింట పార్వతి చాలా బెట్టుగానూ, ముభావంగానూ ఉందామను కున్నది. కాని అక్కడి వాతావరణంలో అది సాధ్యం కాలేదు. నారాయణను అత్తవారు అంత గౌరవంగా చూస్తున్నారని పార్వతి ఊహించలేదు. వాళ్ళ కమతగాడి తీరుగా ఉంటున్నాడనుకున్నది. తొలికానుపుకు ఆడపిల్ల పుట్టినందుకు అందరూ అంత సంబరపడతారనికూడా అనుకోలేదు. ఆడపిల్లపుడితే నలుగురూ సానునయం గానూ, సరిపెట్టుకు పొయ్యేటట్టూ మాట్లాడటం పార్వతికి తెలుసుగాని, ఇట్లా చంకలు గుద్దుకోవటం పార్వతికి ఎక్కడా చూసినట్టు జ్ఞాపకంలేదు. ప్రపంచం మారుతున్నది; ఆ సంగతి పార్వతికి తెలీదు.

అందరూ చంటిదాన్ని "పార్వతమ్మ" అన్నారు. నాయనమ్మ ముక్కునుంచి ఊడిపడిందన్నారు. ఎంత వొద్దనుకున్నా పార్వతి మనసులో గర్వం పాలు పొంగి నట్టు పొంగింది.

రామక్రిష్ణ ఆ పసిగుడ్డుకు ఫోటోలు తీశాడు.

అక్కడున్న నాలుగురోజులూ పార్వతికి ప్రపంచంలో ఉన్నట్టుగానే ఉన్నది.

* * *

బుల్లి పార్వతిని తీసుకుని సావిత్రి వచ్చేసరికి రామక్రిష్ణ పట్నంలో ఏదో ఉద్యోగం సంపాదించి సీతనుకూడా తెచ్చాడు. రెండు కుటుంబాలూ కలిసే ఉండ గలందులకు త్యాగరాయ నగరులో కాస్త విశాలమైన ఇల్లు తీసుకున్నారు. అద్దె నలభై రూపాయలు.

"ఇంక సాంబారునీళ్ళూ, మజ్జిగ పచ్చడీ, చప్పిడికూరలూ తినటానికి వీల్లేదు. వంట పెట్టాలిసిందే." అన్నది సావిత్రి.

మామూలు పిల్లలకన్న బుల్లి పార్వతి చాలా ఆరోగ్యకరమైన పిల్ల. దానికి తోడు శిశుపోషణమీద డాక్టరు అచ్చమాంబ[1] రాసిన పుస్తకమూ, మరికొన్ని పుస్తకాలూ తెచ్చి పడేశాడు.

ఒక నెల గడిచాక వెంకటేశ్వర్లు మామయ్య కూతురికి, అల్లుడికీ ఉత్తరాలు రాస్తూ ఆ కవరులోనే నారాయణక్కూడా ఒక ఉత్తరం పెట్టాడు.

"ఈ మధ్య తెనాలి వెళ్ళాను. అమ్మ కులాసాగానే ఉన్నది. డబ్బు చాలా చేర్చినట్టున్నది. 'మామయ్యగారు' పోయాక తనడబ్బు అప్పులమీద తిప్పేవాళ్ళు లేక దొంగలు పడతారేమోనని భయపడుతున్నది. అవసరమైనది మాత్రం దగ్గిర ఉంచుకోమనీ, మిగిలినది బాంకులో వేసుకోమని చెప్పాను. బ్యాంకులో వెయ్యి రూపాయలు వేయించి వచ్చాను. అసలు సంగతేమంటే, ఆవిడ మనవరాలిని చూడాలని మహా ఇదవుతున్నట్టున్నది. నీ దగ్గిరే ఉంచుకుంటే బాగుంటుందేమో?" అని వెంకటేశ్వర్లు రాశాడు.

తల్లిని తీసుకురావటంలో కష్టసుఖాలను గురించి నారాయణ మిగిలిన వాళ్ళతో సంప్రతించాడు.

"న్యాయంగా అమ్మ మనవెంట ఉండవలసిన మనిషే. ఆవిడను ఒంటరిగా ఉండనిచ్చినందుకు ప్రపంచం నన్ను కర్కోటకు డనుకున్నా ఆశ్చర్యంలేదు. కాని ఏం చెయ్యాలి? ఆవిడకు పొలాలు, ఇల్లూ విడిచిపెట్టటం ఇష్టంలేదు. ఆవిడ వచ్చి

---

1. డాక్టరు అచ్చమాంబ (1906– 1960) కొమర్రాజు వెంకట లక్ష్మణరావుగారి కుమార్తె. 1924 నుంచి జాతీయోద్యమంలో పాల్గొన్నారు. 1943–48 కాలంలో కమ్యూనిస్టుపార్టీ సభ్యురాలు, తర్వాత కాంగ్రెసులో చేరారు. వివిధ మహిళా సంఘాల్లో చురుగ్గా పాల్గొన్నారు. మదరాసు, విజయవాడల్లో నర్సింగ్ హోమ్‌లు నిర్వహించారు. 1957 ఎన్నికల్లో పార్లమెంటు సభ్యురాలయ్యారు. వీరి రచన 'ప్రసూతి – శిశుపోషణ' ప్రాచుర్యం పొందింది.

మడీ, ఆచారమూ, తద్దినాలూ అంటూ కూర్చుంటే నాకూ చిరాకే. ఇద్దరమూ చెరో యుగంలోనూ బతుకుతున్నాం. అందుచేత అవిడ మానాన ఆవిడా, నా మానాన నేనూ బతకటమే సరయిన ఏర్పాటు. కాని ఆ మాట అని ఎవరిని ఒప్పిస్తావో ఒప్పించూ !" అన్నాడు నారాయణ.

"నన్నే ఒప్పించలేరు! .... ఏమిటండీ చాదస్తం కాకపోతేనూ ! కన్నతల్లి కోసం తద్దినాలు పెడితే తప్పా? తద్దినాలు పెట్టరాదనేది కూడా ఒక మతమూ ఏం? మీరు మానినందుకు నేను తప్పుపట్టటంలేదు. ఇంకోరికోసం - అందులోనూ తల్లి కోసం—నమ్మకంలేని పనులు చేస్తే ఏం? ఏడాది కోరోజు వస్తుంది తద్దినం. దాని కోసం తల్లిని వెలేస్తానన్న మనిషిని మిమ్మల్ని ఒక్కర్ని చూశాను. ఏమన్నా చెప్పండి. మీకు ఆపేక్షలు తక్కువ!" అంటూ సావిత్రి ఉపన్యాసం దంచేసింది.

"సరే నేను వెళ్ళి అవిణ్ణి తెస్తాను" అన్నాడు నారాయణ. ఆ రోజే తల్లికి ఉత్తరం రాసేశాడు – శనివారం రాత్రికి వస్తున్నానని, ఆదివారం రాత్రి బండికి తనవెంట బయలుదేరటానికి మూటాముల్లే సర్దుకుని సిద్ధంగా ఉండమనీ, సావిత్రి ఆవిడకోసం కలవరిస్తున్నదనీ, చంటిది "అమ్మమ్మ" అంటున్నదనీ.

పార్వతి కొడుకు ఉత్తరం చూచుకుని లోపల సంతోషించింది; కొంత సామాను సర్దుకున్నది కూడాను. అయితే ఆసంగతి నారాయణకు కనిపించకుండా, తాను ప్రయాణానికి సిద్ధంగా లేనట్టే అనిపించేటట్టు జాగ్రత్త పడింది. నారాయణ మోసపోయాడు.

"ఇదేమిటమ్మా? ఏమి సర్దుకోలేదేం ఇంకా? రాత్రికి ప్రయాణమని రాస్తి నిగా?" అన్నాడతను.

రాశావులే, అయినా నేనిప్పు డక్కడి కెందుకురా?" అన్నది తల్లి.

"ఎందు కేమిటమ్మా ? మేమంతా అక్కడ ఉన్నాంగనకా!"

"మీ రున్నారులే—ఏనాటినుంచో నాకిక్కడ బాగానే వుంది. ఏదో కాలం శాంతంగా వెళ్ళిపోతున్నది. ఎవరెక్కడుంటేనేం? సుఖంగా ఉంటే అంతేచాలు.. వెనకటిరోజులూ, ఆ ఆపేక్షలూ, ఆ కలిసికట్లూ ఇహ చూడం. అన్నయ్యలు మన్యంపట్టిపోయారు— ఒకరికొకళ్ళు కాకుండా విసిరేసినట్టయిపోయాం." అంటూ పార్వతి వేదాంతంలో పడింది.

"అసలు జీవితమే అట్లా ఉందిలే. మనచేతిలో ఉన్నంతవరకైనా కలిసి కట్టుగా వుండొచ్చుగా, అదివరకంటే ఒకేఒక గదిలో ఉండి హోటలు మెతుకులు తిన్నాం. ఇప్పుడిల్లంటూ ఉన్నది. సావిత్రి వంట పెట్టింది. అందరమూ ఓకేచోట వుండొచ్చు" అన్నాడు నారాయణ.

"నే నక్కడ మీకు పానకంలో పుడకల్లే తయారవుతానేమో?" అన్నది పార్వతి. కొడుకు తనను కాళ్ళావేళ్ళాపడి బతిమాలి, 'నువు రాకపోతే అక్కడ మాకు జరగదు. వచ్చితీరాలిసిందే. నీకన్న మాకు ఎక్కువెవరు?' అన్న భాష మాట్లాడితే పార్వతి సంతోషించి ఉండేది.

కాని నారాయణకు ఆ భాష రాదు. ఏమయినా తనకు వెళ్ళాలనే ఉన్నది గనుక బలవంతాన మొదలుపెట్టినట్టు సర్దటం మొదలుపెట్టింది. అంతా పావుగంట పట్టలేదు.

ఆ రాత్రి బండికి ఇద్దరూ పట్నం బయలుదేరారు. పార్వతి వంటిల్లు తన కిందనే ఉంచుకుని, తాళం పెట్టేసుకుంది.

* * * *

పార్వతి రాకతో అందరి కష్టాలూ ఆరంభమయాయి. సావిత్రి ఊహించినట్టు పార్వతి మడి పెట్టింది. అయితే అందువల్ల ఎవరికీ పెద్ద నష్టం కలగలేదు. ఎందుకంటే వంట పనంతా పార్వతే మీద వేసుకున్నది.

కాని ఇతర కష్టాలు అనుకోకుండా వచ్చిపడ్డాయి. ముఖ్యంగా చంటిపిల్ల విషయంలో. పార్వతి లెక్కన వాళ్ళకు పిల్లను పెంచటం ఏమీ చాతకాదు. పిల్లలకు రోజూ ఆముదం పెట్టాలి. ఉగ్గు పొయ్యాలి.

"ఆముదమా? దాని పేరైనా స్మరించటానికి వీల్లేదు" అన్నాడు నారాయణ.

"పిల్లకింత పౌడరు పామగానే సరిపోయిందా! ఆముదం బొట్టన పెట్టకపోతే విరేచనం ఎట్లా అవుతుంది? ఉగ్గు పొయ్యకపోతే తాగినపాలు ఎట్లా అరుగుతాయి?" అని పార్వతి సవాలు చేసింది. చంటిపిల్లలున్న ఇంట్లో ఉండవలసిన వస్తువు ఒకటి కూడా లేదు. ఆఖరుకు వాంపోచలన్నా లేవు.

"అవన్నీ పాతకాలపు పద్ధతులమ్మా. ఈనాడు పిల్లలను పెంచేటందుకు చాలా మంచి పుస్తకాలూ అవీ వున్నాయి" అన్నాడు నారాయణ.

"పుస్తకాలు చూసి పిల్లల్ని పెంచుతార్రటా? మనింట్లో అద్దెకున్నవారి కోడలు పత్రికల్లో చూసి వంటకాలు తయారు చేస్తుందిలే. నోట్లో పెట్టుకోలేం. అలాగే ఉంది ఇదీనూ" అన్నది పార్వతి.

పిల్లకు తానే నీళ్ళు పోస్తానని పార్వతి చీర ఎగగట్టి సిద్ధమయేది. మామూలుగా సీత సహాయంతో సావిత్రే పిల్లకు నీళ్ళు పోసేది. కాని పార్వతి వచ్చాక ఆ ఏర్పాటు మార్చేసింది.

"ఏం చెయ్యనండీ? అత్తయ్య నీళ్ళు పోస్తే పిల్ల ఒళ్ళంతా జిడ్డు జిడ్డుగా వుంటున్నది. దానికి నీళ్ళు పోస్తానంటే వినరు. వద్దంటే కోపం వస్తుందేమో! ఎంత పౌడరు వేసినా, సాయంత్రానికల్లా పిల్ల ఒళ్ళు ఏదో మెతక వాసన" అన్నది సావిత్రి మొగుడితో.

నారాయణ మాత్రం ఏమనగలడూ?

పార్వతికి మధ్యాహ్నం నుంచీ పని ఉండదు. నిద్రపోతున్న పిల్లను ఉయ్యాల తొట్టి నుంచి ఎత్తి ఒళ్ళో పడుకోబెట్టుకుంటుంది. అది లేచి ఏడుస్తుంది. పిల్ల కాస్త గీమంటే చాలు, పాలు పట్టమంటుంది పార్వతి.

"పాలుపట్టి గంట కాలేదత్తయ్యా! ఇంకా మూడు గంటలదాకా పాలు పట్ట గూడదు" అన్నది సావిత్రి.

"అట్లా అని పుస్తకంలో రాశారేమిటి?" అని పార్వతి వెటకారంగా అడుగు తుంది.

సావిత్రి వెటకారం లక్ష్యపెట్టక, "అవునత్తయ్యా!" అంటుంది.

"అదేం చోద్యమమ్మా! మా కాలంలో మే మెరగం" అంటుంది పార్వతి.

ఇటువంటి విషయాలు సావిత్రి చెపితే నారాయణ దులిపేసుకున్నాడుగాని, తన తల్లి పిల్లకు ఎత్తుమరిగిస్తున్నదనీ, పిల్ల మొహంలో మొహంపెట్టి దీర్ఘ సంభాషణలు చేస్తుందంటేనూ సహించలేకపోయాడు.

ఈసారి తల్లి పిల్ల ముఖంలో ముఖంపెట్టి పెద్దగా నవ్వుతున్నప్పుడు "కాస్త మొహం ఎడంగా పెట్టమ్మా. మన ఊపిరీ, గాలీ పిల్ల పీల్చటం మంచిదికాదు. అట్లాగే పిల్లలకు రోగాలు వచ్చేది" అన్నాడు నారాయణ.

పార్వతికి చాలా కోపం వచ్చింది. ఆ రోజల్లా ఆవిడ పిల్ల చాయలకు రాలేదు. సావిత్రి ఆ మాటంటే, "అది ఒక విధంగా మంచిదేలే" అన్నాడు నారాయణ.

కాని సావిత్రి రాయిలాగా ఉండలేక పోయింది. అత్తగారి అలక పోగొట్టటానికి ఏదో మిషమీద తన చేతుల్లో ఉన్న బిడ్డను పార్వతి కివ్వబోయింది.

"ఒద్దులే తల్లీ! నేను ముట్టుకుంటే దానికి రోగాలొస్తాయిటగా. కాకపోయినా వాడు పెద్ద పొరపాటు చేశాడు. పిల్ల అమ్మమ్మ అంటుంటే నాయనమ్మను తీసుకు రావడమేమిటి? అమ్మమ్మలు ముట్టుకుంటే పిల్లలకు రోగాలు రావని పుస్తకంలో రాసివుందేమో మరి." అంటూ పార్వతి దాడి సాగించింది.

ఆ దాడికి తట్టుకోలేక దిగజారిపోయి, "ఆయన మాటలు పట్టించుకుంటా రేమిటత్తయ్యా? ఆయన సంగతి మీకు తెలీదా?" అంటూ అత్తగారి పక్షమయి పోయింది సావిత్రి.

ఆ అపజయంతో మళ్ళీ అన్ని సమస్యలూ మొదటికొచ్చాయి. పార్వతి తన కోడలిచే చంటిపిల్లకు ఆముదమూ, ఉగ్గూ, ఏడిచినప్పుడల్లా పాలు పోయించటం మినహా మిగిలినవన్నీ చేసింది. పిల్ల ఒంటికిరాసిన ఆముదం వదలకుండా నీళ్ళు పోసింది. పిల్లకు ఎత్తు మప్పింది. మొహంలోమొహం పెట్టి రోజూ గంటల తరబడి ముద్దుచేసింది.

సావిత్రి నారాయణతో విషయం మళ్ళీ మొదటికొచ్చిందని చెప్పిందిగాని, అందుకు కారణం తానేనని మటుకు చెప్పలేదు.

పార్వతి కొడుకుమీద చెలాయించిన అధికారానికి ఎన్నోరెట్లు మేనగోడలి మీద చలాయించబోయింది. అయితే సీత పార్వతి అధికారాన్ని కొంచెం కూడా ఖాతరు చెయ్యలేదు. పార్వతి ఏమన్నా అడిగితే చేసేదికాదు. ఆమెతో మాట్లాడినప్పుడల్లా పుల్లవిరిచినట్లు మాట్లాడేది.

పార్వతి తన మేనగోడలి మొరటు ప్రవర్తన సహించటమే తేలికగా ఉండేది. సీత అనేదేదో బడబడా అనేస్తుంది- మొహాన్నే – లోపల ఏమి దాచుకోదు. సావిత్రి పైకి ఎంత మంచిగావున్నా, లోపల ఏదో కుళ్ళు దాచివుంచుకున్నదన్న అనుమానం పార్వతికి ఉండనే వుండేది.

సీత సావిత్రి పడుతున్న అవస్థ గ్రహించి, పార్వతికి రాహువల్లే అడ్డుపడింది. పిల్లకు ఆవిడ నీళ్ళు పొయ్యటానికి ఎంతమాత్రమూ వీల్లేదన్నది; పిల్లని అయిదు నిమిషాలు మించి ఎత్తుకోవటానికి వీల్లేదన్నది; అది గీమన్నప్పుడల్లా పాలు పట్టడానికి వీల్లేదన్నది. చీటికీ మాటికీ పిల్లను తొట్టెలో పెట్టి గంటల తరబడి ఊపటానికి వీల్లేదన్నది.

"ఓసి నీ-! నీకే ఓ నలుసు పుడితే నన్ను దాన్ని ఛాయలక్కూడా రానిచ్చేట్టు లేవే!" అన్నది పార్వతి.

'అట్లా సీతకిమల్లే మాట్లాడే స్వతంత్రం నాక్కూడాఉంటే బాగుండును గద !' అనుకున్నది సావిత్రి. సావిత్రి అనుకోవటం వింతకాదు; కోడలికి అత్తదగ్గిర అంతచనువుండే అవకాశంలేదు. సీతను చూచి నారాయణ కూడా 'అది మాట్లాడినప్పుడు అమ్మతో నేనెందుకు మాట్లాడలేనూ? తల్లిగదా ఆవిడ దగ్గిర నాకు చనువెందుకు లేకుండాపోవాలి? నేనా చనువును ఏ విధంగా పోగొట్టుకున్నానూ?, అని చాలాసార్లు అనుకున్నాడు.

ఈ ప్రశ్నకు సమాధానం తెలియటానికి కొంతకాలం పట్టింది. తెలిసినాక ఓ కథ రాశాడు. అది అతని మంచి కథల్లో ఒకటిగా ఇప్పటికి చెప్పుకుంటారు. ఆ కథ సూచించే విషయం ఏమిటంటే, తప్పును సహించడంకంటె ప్రతిఘటించటం తప్పు. చేసినవాడి దృష్టినుంచి కూడా మంచిదే. దౌష్ట్యాన్ని ప్రతిఘటిం

చకు' అన్న టాల్‌స్టాయ్! సూత్రానికిది వ్యతిరేకం, అయితే ఇది గాంధీయిజాన్ని ఇంకొంచెం ముందుకు తీసుకుపోతుంది. బ్రిటిషువారి అక్రమ పరిపాలనకు విరుద్ధంగా భారతీయులు సత్యాగ్రహం చెయ్యటం సమర్థనీయం అన్నది అటుంచి, సత్యాగ్రహం చెయ్యకపోవటం నేరమే అవుతుంది.

* * * *

"మనకు కావలసిన దేదో ఇక్కడ లేదు." అని ఖచ్చితంగా తోచినప్పుడు మనుష్యులు ఉన్నచోటూ ఉన్న జీవితమూ విడిచి ఎక్కడైనా వెళ్ళిపోతారు. బైరాగుల్లో కలుస్తారు. సన్యాసం పుచ్చుకుంటారు. దేశంపట్టిపోతారు. ఏదో ఒకటి చేస్తారు.

మద్రాసులో తనకేమీ లేదన్న నమ్మకం పార్వతికి క్రమంగా కలిగింది. ఉండి ఏమిటి ప్రయోజనం? వాళ్లు తనను అర్థం చేసుకోరు; తాను వాళ్ళను అర్థం చేసుకోలేదు. వాళ్ళ భాషవేరు. తన పద్ధతులూ, భావాలూ వాళ్ళకి బాధ కలిగిస్తున్నా యని తెలిసి ఆమె కొంతకాలం ఆనందం అనుభవించిందిగాని, ఆ ఆనందం ఎక్కువ కాలం దక్కలేదు. ఆమె మనస్తత్వం అందుకు అనుకూలమైనది కాదు.

పట్నం వచ్చాక ఆమె మనస్సులో ఎన్నడూలేని గాయం ఒకటి ఏర్పడి మానకుండా వున్నది. రెండు భార్యాభర్తల జంటలు రోజూ అనుభవించే సుఖం తనకు ఏనాడూ లేకపోయిందన్న విచారం ఆమెకు పట్టుకున్నది. అటువంటి

---

1. టాల్‌స్తాయి [1820–1910) : కౌంట్‌లియో తాల్‌స్తోయ్. విశ్వవిఖ్యాతి పొందిన రష్యన్ నవలాకారుడు. ఆలోచనాశీలి, ఉపదేశకుడు. 1861 – 1904 దశలోని పెట్టుబడిదారీ వ్యవస్థ క్రమ వికాసాన్ని, రైతాంగ వినాశనాన్ని చిత్రించిన రచయిత. 'యుద్ధము–శాంతి', అనాకెరెనినా,' 'కోసక్కులు' అనేవి ప్రఖ్యాత రచనలు. లెనిన్ మాటల్లో : "రష్యాలో బూర్జువా విప్లవం సమీపిస్తూ వుండిన కాలంలో కోట్లాది రష్యన్ రైతులలో ఉద్భవించిన భావాలకూ, అనుభూతులకూ వక్తగా తాల్‌స్తోయ్ గొప్పవాడు. తాల్‌స్తోయ్ అపూర్వుడు, యెందుకంటే మొత్తంగా చూస్తే ఆయన భావాల వెరసి మొత్తం మన విప్లవపు నిర్దిష్ట లక్షణాలను రైతు బూర్జువా విప్లవంగా వ్యక్తం చేయడం తటస్థిస్తున్నది. ఈదృష్ట్యా తాల్‌స్తోయ్ భావాలలోని వైరుధ్యాలు నిజంగా మన విప్లవంలో రైతాంగం ఏ విరుద్ధ పరిస్థితులలో తమ చారిత్రక పాత్రను నిర్వహించవలసి వచ్చిందో ఆ విరుద్ధ పరిస్థితుల దర్పణమే." (వి.ఐ. లెనిన్, సాహిత్యం మీద వ్యాసాలు, పుట. 14).

సుఖాన్ని ఆమె పూర్తిగా మరిచిపోయింది. ఆ సుఖంమీదే తనకు దృష్టి నిలిచి నట్టయితే తన భర్తలో ఇతర అవలక్షణాలు పాటించకుండా ఎంత సుఖమైనా అత నితో తాను పొందివుండేదే. 'నీకు సుఖపడటం చాతకాదు' అని తన భర్త తనను ఎన్నిసార్లు ఎత్తి పొడవలేదు? కామేచ్ఛ తీర్చేవాడు ఎటువంటివాడైతేనేమి? తాను తన యౌవనమంతా ఎందుకు వృధా పోనిచ్చినట్టు? అందువల్ల ఏం సాధించినట్టు? రాత్రి ఎనిమిది దాటి నప్పటినుంచీ సావిత్రి, సీత పడకగదికోసమే వేచి వున్నట్టుగా వుం టారు. వాళ్ళ చూపుల్లోనూ, గొంతుల్లోనూ సూక్ష్మంగా ఏదో ఆవేశం కనిపిస్తుంది. తాను అటువంటి ఆవేశం ఏనాడూ ఎరగదు తస తప్పా? తన చుట్టూ వుండినవాళ్ళ తప్పా? దేవుడి తప్పా? పూర్వ జన్మలో చేసుకున్న పాపానికి ఫలితమా? ఏదో ఒక సిద్ధాంతమైతే సరిపెట్టుకోవచ్చు; కాని మనిషికి కలిగే మంచి చెడ్డలను గురించి సవాలక్ష సిద్ధాంతాలు.

ఆమెకు చౌకబారు రంకుతనాలంటే తగని అసహ్యం. ఆ అసహ్యానికి బీజాలు ఆమె మనస్సులో పసితనంలోనే నాటుకున్నాయి. అదీగాక అభిమానవతి, రంకుచేసి దొరికిపోవటంకన్న ఆవిడ దృష్టిలో చావు మేలు. తన పరువుమీదఆమెకు అంతులేని అభిమానమున్నది. నిజానికి ఆమె గొప్ప ఖ్యాతిగలది కాదు. ఆ మాటకువస్తే ఎంతో ఖ్యాతి సంపాదించుకున్న వాళ్ళే పరువు తక్కువ పనులు చేస్తారు. నిజంగా పరు వును గురించి తాపత్రయపడేవాళ్ళు పేరు ప్రతిష్టలు లేని వాళ్ళే. అందులో విడ్డూర మేమీ లేదు. పేదవాడే డబ్బును పొదుపుగా వాడుకుంటాడు.

పార్వతి ఏ రాత్రీ సరిగా నిద్రపోయేదికాదు. పడుకుంటే రకరకాల ఊహాలు వచ్చేవి. ఆహోరాత్రాలు మైధున సుఖంలో మునిగి తేలటం గురించి ఊహించుకునేది ఇటువంటి ఊహాలు మనస్సులో మాత్రమే ఉంచుకోవాలని ఆమె అనుమానం. కాని అవి పౌరాణికమైన ఊహాలని ఆమెకు తెలీదు. శివపార్వతులు ఒకప్పుడు వెయ్యి 'దివ్య' సంవత్సరాలపాటు సంగమం సాగించిన కథ ఆమెకు తెలీదు.

ఆమెకు అనేకసార్లు ఒక భయంకరమైన కోరిక కలుగుతూ వచ్చింది. తాను వేశ్యఅయి పుట్టితే బాగుండేదని. సేవాధర్మంలో సతీ సమస్య లేదు; శరీర సుఖం ఎంతైనా ఉంది. ఎంత గొప్ప కాంబినేషన్. వేశ్యలకు సుఖవ్యాధులుంటాయని ఆక్షే పించేఆవకాశం కూడా పార్వతికి లేదు. తన భర్త తనకూ తగిలించాడొక జబ్బు. వేశ్య జన్మ కన్న తనవంటి బ్రాహ్మణస్త్రీ ఏ విధంగా ఉత్తమమైనది? ఉత్తమమైనదన్న నమ్మకం పార్వతికి ఉన్నదిగాని, దాన్ని రుజువుచెయ్యటం చాలా కష్టమైంది....

పట్నంలో మరీ మాలకూడుగా ఉన్నది. ఇంటికి ఎవరెవరో వస్తారు. టిఫిన్లు తింటారు. కాఫీలు తాగుతారు. వెళ్ళిపోతారు. వాళ్ళు ఏ కులమో, ఏ మతమో తెలీదు.

మనుషులను చూస్తే ఏమీ తెలీదు. బ్రాహ్మలని చెప్పినా నమ్మదగినట్టుగా ఉంటారు కొందరు; తీరా విచారిస్తే సాయిబులో,అంటరానివాళ్ళో. ఇంగిలీషులో మాట్లాడుతుంటే కులం ఏదయిందీ అసలు తెలుసుకోలేం. అందుకేనేమో, తన చిన్నతనంలో ఒక శాస్త్రుల్లుగారు; ఇంగిలీ షొచ్చి వర్ణసంకరం తెచ్చి పెట్టిందనే వాడు....పోనీ, ఈ మహాపట్నంలో అందరూ పైకులాలవాళ్ళల్లే ఉన్నారనుకుందామంటే అదీలేదు. ఆ మధ్య ఎవరో శేషయ్యట. రెండుమూడుసార్లు వచ్చాడు. చూడగానే అంటరానివాళ్ళ కన్న అధ్వాన్నం అనిపించేటట్టున్నాడు. అచ్చమైన బ్రాహ్మట్ట! మరో ఆయన అచ్చు యాయవారపు బ్రాహ్మడల్లే ఉన్నాడు- ఏ కులమో నారాయణక్కూడా తెలీదు; ఎవరి కులం మాట అడిగినా వాడికి ఒకటే చిరాకు! ఆ మనిషి బ్రాహ్మణుడు మాత్రం కాదుట.... మొత్తంమీద ఈ పట్నంలో డబ్బున్నవాళ్ళూ, లేనివాళ్లూ తెలిసినంత బాగా కులాలు తెలీవు. పార్వతి కిదేమీ నచ్చలేదు. అంతా మాలకూడే! నారాయణా, రామకృష్ణా కూడా జంధ్యాలు తీసిపారేశారు; కులభ్రష్టులు. చిన్నతనంలో ఇటువంటి వాళ్ళను వెలేసే వాళ్ళు! ఇట్లా చేస్తున్నా వాళ్ళనెవరూ ఏమీ అనకపోవటం ఆశ్చర్యం! ఇదేగామాలు మోరకలి అంటే! ఎవరెట్లా పోతే తనకేం! ఇంటిపట్టున ఒంటరిగా ఉన్నప్పుడే తనకు సుఖంగా వున్నది. రాను మొర్రో అంటుంటే నారాయణ పట్టి బలవంతాన తనను ఈడ్చుకొచ్చాడు;

ప్రయాణం కట్టటానికి పార్వతికి మంచి అవకాశం దొరికింది. తన పెద న్నయ్య కొడుక్కి పెళ్ళి అవుతున్నది సికిందరాబాదులో. శుభలేఖతోబాటు నారా యణకు కార్డు కూడా వచ్చింది.

"వాళ్ళందరిని చూసి ఎన్నో యుగాలయినట్టుంది. పెళ్ళికి వెళతారా! మీరు కూడా రావచ్చు." అన్నది పార్వతి కొడుకుతో.

"మేం ఎక్కడ వస్తాంలే. కావలిస్తే నువ్వెళ్ళిరా." అన్నాడు నారాయణ.

నాగభూషణం వాళ్ళు ఎక్కడో నల్లగొండ ప్రాంతంలో ఉంటున్నారు. బస్సు మీదకూడా ప్రయాణం చెయ్యాలి. పెళ్ళి ఇంకా వారం రోజులుందనగానే పార్వతిని నారాయణ పెద్ద మేనమామయింట దిగబెట్టి వచ్చాడు.

పెళ్ళి అయినాక పార్వతి తిన్నగా తన యింటికే వెళ్ళిపోయింది. మళ్ళీ పట్నం రాలేదు.

జీవిత వేగానికి తట్టుకోలేని వాళ్ళు కాలం ఆగిపోతే బాగుండుననుకుంటారు. మంచో, చెడో, ఉన్న వ్యవస్థ ఇకనుంచీ మార్పులేకుండా ఇట్లాగే సాగిపోతేనేగాని తమకు మనశ్శాంతి వెతుక్కునే అవకాశం దొరకదు అనుకుంటారు- బస్సు నుంచి దిగిపోదలిచినవాడు అది ఆగటం కోసం చూసినట్టు. కాని జీవితం తెరమీది బొమ్మ లాగా, ప్రతిక్షణమూ మారుతూనే ఉంటుంది; ఏ మాత్రం నిలిచిపోయినా అది సినిమా కాదు— జీవితమూ కాదు.

పార్వతిలాటి పాతకాలపు మనిషి జీవితంలో కలిగే మార్పులే తనకు మన శ్శాంతి లేకుండా చేస్తున్నాయనుకోవటం స్వాభావికం. కాని సావిత్రికి కూడా అటు వంటి భావం కలగటం ఆశ్చర్యం. ఆమె కాలంతోబాటు కదిలే శక్తి ప్రదర్శించింది. మొగుడికి కొంచెం వెనకగా పరుగులు తీసింది. పాత ఆచారాలను తోసేసింది. కులాలను దాటి ఆలోచించగలిగింది. అన్నీ చేయగలిగిందిగాని యీ కమ్యూనిజం[1] ఏమిటో అర్థం చేసుకోలేక పోయింది. ఇది ఆమె ప్రాణానికి పచ్చి వెలక్కాయ అయికూర్చుంది.

ఈ పచ్చి వెలక్కాయను యింట్లోకి తెచ్చినవాడు రామకృష్ణ. కలరా క్రిములు తాగే నీటి ద్వారా శరీరంలోకి ప్రవేశించినట్టుగా కమ్యూనిజం పుస్తకాల రూపంలో యింట్లోకి అడుగు పెట్టింది.[2] మగవాళ్ళిద్దరూ వాటిని చదివేవాళ్ళు; చదివినదానికన్న ఎక్కువసేపు చర్చించుకునేవాళ్ళు- ఈ పుస్తకాలు వచ్చినదాకా నారాయణకూ రామ క్రిష్ణకూ ఓ విధమైన గురుశిష్య సంబంధం ఉండేది. ఇప్పుడది తారుమారయింది. 'గురువు శిష్యుడాయె, శిష్యుడు గురువాయె' అన్నట్టుగా. సందేహాలు లేవదీయటం నారాయణవంతూ, వాటిని తీర్చటం రామక్రిష్ణ వంతూ అయింది.

---

1. కమ్యూనిజం : మార్క్స్ ప్రతిపాదించిన సిద్ధాంతం (చూడు. కార్ల్‌మార్క్స్, పంచ రత్నాలు కథానిక) పెట్టుబడిదారీ వ్యవస్థను కూలదోశాక చరిత్ర క్రమంలో ముందుగా సోషలిజం వస్తుంది. ఈ దశలో ఉత్పత్తి సాధనాలు సంఘటిత వర్గమైన కార్మిక వర్గం చేతుల్లో ఉంటాయి. ఈ శ్రామిక వర్గ నియంతృత్వం లాభం కోసం కాదు, దోపిడీ కోసం కాదు- ప్రణాళికాబద్ధమైన భవిష్యత్సమాజ నిర్మాణంకోసం. తర్వాతిదశే కమ్యూనిజం. ఇది వర్గరహిత సమాజ దశ. రాజ్యాంగం రద్దయిపోయే దశ. సామూహిక ప్రయోజనమే శ్రమకు ప్రోదకశక్తి. శ్రమ ఫలితం అవసరాలను బట్టి అందరికీ వుంటుంది. చరిత్ర పరిణామంలో అత్యున్నతమైన మానవతా విలువలు సమకూరే సమాజం కమ్యూనిస్టు సమాజం.
2. ఈ వాక్యాన్ని కమ్యూనిస్టు ప్రణాళిక (1848)లోని యీ క్రింది వాక్యాల నేపథ్యంలో చూడండి :

మొదట్లో సావిత్రి ఈ కమ్యూనిజం గురించి అంతగా భయపడలేదు. అదేమిటో తాను కూడా తెలుసుకుందామని ఆత్రపడింది కూడాను. కాని రామక్రిష్ణ చెప్పిన విషయాలు కొన్ని వింటే సావిత్రికి ఏ మాత్రమూ నచ్చలేదు. అవి ఆమెలో అనుమానాలనూ, అశాంతినీ రేకెత్తించాయి. జీవితమంతా దోపిడీమయమనీ, పోరాటంతో కూడుకున్నదనీ రామక్రిష్ణ తేల్చాడు. ఇంగ్లీషువాళ్ళు మనదేశాన్ని దోపిడీ చేస్తున్నారంటే అర్థంఉన్నది. ఫ్యాక్టరీలవాళ్ళు కూలీలను దోచడం ఏమిటి? ఆ బీద సన్నాసుల దగ్గిర దోచుకునేటందుకేమున్నది? ప్రపంచ రాజకీయాలన్నీ కమ్యూనిజమును చావగొట్టటానికి అదే ప్రధాన లక్ష్యంగా పెట్టుకుని పనిచేస్తున్నాయట? 'చేసేవి శివపూజలూ, దూరేవి దొమ్మరగుడిసెలూ' అన్నట్లు ప్రజాస్వామ్యాన్ని సమర్థించే దేశాలన్నీ చేరి, డిక్టేటరై కూర్చున్న హిట్లరును[1] ఎగదోస్తున్నాయట.

నారాయణా, రామక్రిష్ణ చెప్పే మాటలు చూస్తే కొన్నివేల యేళ్ళుగా మానవ జీవితమంతా తప్పుతోవనే పోతున్నది. మతాలన్నీ నల్లమందు మాత్రలు. కళలన్నీ ఉన్నవాళ్ళు లేనివాళ్ళను దోచుకునే సంస్కారాన్ని బలపరిచినవే. ఒక్క కులవ్యవస్థే కాదు, వర్గ వ్యవస్థకూడా పోవాలి. యుద్ధాలూ, సేనలూ, పోలీసులూ యివన్నీ ధనిక వర్గం వాళ్ళకోసం ఏర్పాటయినవే. ధనికులూ, దరిద్రులూ అన్న తేడా పోవాలి. దాని కోసం విప్లవం జరగాలి. భూస్వాములుండరాదు. భూములు దున్నేవాళ్ళ సొత్తు కావాలి; ఫ్యాక్టరీలు దేశం సొత్తు కావాలి.

"ఇదంతా నిజంగా జరుగుతుందని మీరు నమ్ముతున్నారా?" అని సావిత్రి నమ్మలేకుండా అడిగింది.

---

"యూరప్‌ను ఒక భూతం ఆవహించింది- అది కమ్యూనిజం అనే భూతం. ఈ భూతాన్ని ఉచ్చాటన చేయడానికి అటు పోపూ యిటు జారూ, అటు మెటర్నిక్ యిటు గిజో, అటు ఫ్రెంచి రాడికల్ పార్టీవాళ్ళూ, యిటు జర్మన్ గూఢచారులూ - పురాతన యూరప్‌లోని అధికార శక్తులన్నీ-ఒక పవిత్ర కూటమిగా యేర్పడినాయి.

అధికారంలో వున్న పార్టీచేత కమ్యూనిస్టులని తిట్లు తినని ప్రతిపక్ష పార్టీ యెక్కడైనా వుందా? ప్రతిపక్షంలో వున్న పార్టీ అదే తిట్లను తనకంటె పురోగాములైన ఇతర ప్రతిపక్ష పార్టీలమీదా, ప్రగతి వ్యతిరేకులైన తన శత్రువులమీదా విసరకుండా ఎక్కడైనా వుందా?"

1. హిట్లరు (1888-1945); అడాల్ఫ్ హిట్లరు. జర్మనీ నాజీ నియంత. నేషనల్ సోషలిస్టు జర్మన్ వర్కర్స్ పార్టీ (1933) నిర్మాత. ఈ పార్టీ సభ్యులు నాజీలు. నాజీల జాతి దురహంకార తత్వం నాజీజం.

"జరుగుతుంది—కాని విప్లవం రాకుండా జరగదు. నరబలి ఎంతోకావాలి!" అన్నాడు నారాయణ.

"మేం నమ్మటమేమిటి? రష్యాలో జరిగింది." అన్నాడు రామక్రిష్ణ.

విప్లవం అంటే ఏమిటో ఇద్దరూ సావిత్రికి వర్ణించి చెప్పారు.

సావిత్రి గాభరా పడింది. వాళ్ళిద్దరికీ ఓ విధమైన రక్తదాహం పట్టుకున్నట్టుగా ఆమెకు తోచింది. వాళ్ళ మాటలు నమ్మలేకపోయింది. తనను ఏడిపించటానికి అట్లా మాట్లాడుతున్నారనుకున్నది. అయితే ఈ అనుమానం ఎంతోకాలం నిలవలేదు.

ధర్మరాజు క్షత్రియుడు, యుద్ధాలు చెయ్యటం క్షత్రియధర్మం, అయి కూడా ధర్మరాజు, "తినజాలను నెత్తురుకూడు, మాధవా!" అన్నాడు. అటువంటప్పుడు వీళ్ళు వర్గపోరాటమనీ, ధనికవర్గాన్ని నిర్మూలించటమనీ యింత తేలికగా ఎటా మాట్లాడుతున్నారు. వీళ్లు రాక్షసులా? క్రూరులా? ప్రేమించటమూ, దయ చూపించటమూ చాతకానివాళ్ళా? కాదే! తప్పు వాళ్ళదికాదు. కమ్యూనిజముది — కొందరు నీచదేవతలను ఉపాసనచేసి, రహస్యంగా నరబలులిస్తారట. కమ్యూనిజం అటువంటి నీచోపాసన అవుతుంది కాబోలు.

నారాయణ తన భార్య మనసు ఎట్లా పనిచేస్తున్నదీ శ్రద్ధగా గమనిస్తున్నాడు. పీడితవర్గానికి శత్రువులైనవాళ్ళు విప్లవసిద్ధాంతాన్ని వ్యతిరేకించటం సహజం; దాన్ని గురించి చేసేదేమీలేదు. ఏమి చెయ్యనవసరంలేదు కూడా: దానికి ప్రతిఘటనే మందు. కాని విప్లవ సిద్ధాంతాన్ని చేపట్టవలసినవాళ్ళే వ్యతిరేకించటం గడ్డు సమస్య. వ్యక్తులుగా వాళ్ళు ఒకంతట కదలరు: వర్గానికి వర్గమే కదలాలి. కృషి అంతా అందుకే జరగవలసి వున్నది.

కమ్యూనిస్టు సిద్ధాంతంలో రక్తదాహం ఉన్నదని సావిత్రి అనుకుంటున్నది. వర్గవ్యవస్థ నిలబడి వుండటానికి ఎంత నరబలి జరుగుతున్నదో, ఎన్ని దారుణాలు జరుగుతున్నాయో, ఎంత దారిద్ర్యమూ, అజ్ఞానమూ, అనారోగ్యమూ పోషించి పెంపొందించబడుతున్నాయో సావిత్రికి ఎలా తెలియచెప్పటం? అప్పటికీ, నారాయణ చెప్పిచూశాడు. "ఒకవంక ప్రజలు ప్రపంచమంతటా తిండిలేక మాడి చస్తుంటే అమ్ముడు పోని ఆహారాన్ని సముద్రంలో పోశారుగాని ఆకలిగా ఉన్న వాళ్ళకు ఇవ్వలేదు.

మన గ్రామాల్లో మాలవాళ్ళను ఎట్లాచూస్తున్నాం! శోషవచ్చి ప్రాణం పోతున్నా, నూతుల్లోనుంచి నీరు తీసుకోనివ్వం. రాక్షసులకన్న అన్యాయంగా ప్రవర్తిస్తున్నాం. వాళ్ళ (మనమీద రాక్షసత్వం చూపనుకూడా అక్కర్లేదు. మన మాటకు ఎదురు చెప్పినా సహించం. వర్గాలున్న సమాజంలో దయాదాక్షిణ్యా

లంటూ ఉండవు! అదివట్టిభ్రమ. ఫ్యాక్టరీలు తీసుకో, ఈ మధ్య ఒక బొంబాయి మిల్లులో సమ్మె[1] జరిగింది; సమ్మెవల్ల ఫ్యాక్టరీ యజమానులకు రెండున్నర లక్షలు నష్టం వచ్చిందట. అంటే పనివాళ్ళు సమ్మె చేయకపోతే వాళ్ళ శ్రమవల్ల యజమాన్లు రెండున్నర లక్షలు జేబుల్లో వేసుకునేవాళ్ళన్నమాట ! అంత సత్తా గల పనివాళ్ళు తిండీ, బట్టా, ఇల్లూ, వాకిలీ లేకుండా ఉండటమేం? ఫ్యాక్టరీ యజమానులు నాలుగేళ్ళకోసారి కొత్త ఫ్యాక్టరీలు కొనడమేం? పనివాళ్ళు సమ్మె చేసినప్పుడు రోజుకూలీ మూడింతలిచ్చి పైవాళ్ళచేత పని చేయించాలని చూశారుట! సమ్మె జరిగింది రోజుకూలీ ఒక బేడా పెంచలేదని! పత్రికలన్నీ సమ్మె చేసిన వాళ్ళను తిట్టాయి. ఎందుకు? రోజు కూలీ చాలనివాళ్ళు పదిహేను రోజులు ఆ కూలిడబ్బులుకూడా లేకుండా సమ్మెచెయ్యటం ఏమీ తెలికపని కాదు. వెనక కోట్లున్నా, మిల్లువాళ్ళకు రెండున్నర లక్షలు నష్టం వచ్చిందని ఏడిచేది ఆ పత్రికలే. ఇదంతా ఏమిటంటావు?''

ఈ ధోరణిలో నారాయణ మాట్లాడేవాడు కాని సావిత్రికి అంతా అయోమయంగా ఉండేది. అతను సంబంధంలేని విషయాలన్నిటినీ కలగాపులగంచేసి మాట్లాడుతున్నాడని ఆమెకు తోచేది. పల్లెల్లో మాలవాళ్ళకూ, ఫ్యాక్టరీల్లో సమ్మెలకూ, రక్తపాతంతో విప్లవం తీసుకురావటానికి ఏమిటి సంబంధం? నిజంగా సంబంధం వుండే పక్షంలో తన మొగుడివంటివాళ్ళు కోరుతున్నది అది మరేదో ప్రపంచం; ఈ ప్రపంచానికీ దానికీ సంబంధం లేదు....

ఈ రోజుల్లోనే యుద్ధం[2] వచ్చింది. హిట్లరుకూ రష్యాకూ మధ్యకాదు-వాళ్ళకూ వాళ్ళకూ మధ్య ఏదో ఒప్పందం కూడా జరిగిందిట. హిట్లరును ఏ దేశాల వాళ్ళయితే బలపరిచారని నారాయణా, రామక్రిష్ణా అంటూ వచ్చారో, ఆ దేశాలవాళ్ళే హిట్లరుమీద యుద్ధం ప్రకటించారు.

“వీళ్ళు చెబుతున్నదంతా తప్పు!” అనుకున్నది సావిత్రి.

సీత అయినా సావిత్రితో కలిసిరాదు. లోతుగా ఆలోచించే మనిషి కాదు. “డబ్బున్న వాళ్ళందరినీ నరికెయ్యాలిసిందే” అనేది సీత ఆకతాయిగా. సీతతో మాట్లాడి లాభం లేదు.

---

1. బొంబాయి మిల్లు సమ్మె : పారిశ్రామిక వివాదాల చట్టానికి వ్యతిరేకంగా తొమ్మిదివేల మంది బొంబాయి కార్మికులు 1935 నవంబరులో చేసిన సమ్మె.

2. యుద్ధం : సెప్టెంబరు 1. 1939 మే 9, 1946 మధ్య జరిగిన రెండో ప్రపంచయుద్ధం. ఈ యుద్ధకాలంలో మనదేశంలోని కార్మికవర్గం చైతన్య పూరితమైంది — జాతీయోద్యమం తీవ్రతరమైంది.

ఏమైనా పాపం సావిత్రి తన భర్త చెప్పేదాంట్లో ఏదో నిజం వున్నదని నమ్మటానికే ప్రయత్నించేది. కొందరికి కొన్ని విషయాలు అర్థంచేసుకునేకన్న నమ్మటమే తేలిక. సావిత్రి ఎటూగాని స్థితిలో వున్నది. అర్థం చేసుకోనూలేదు. గుడ్డిగా నమ్మనూలేదు.

* * * *

యుద్ధం మహా భయంకరమైనది. జీవితానికి సంబంధించిన మిగతా అన్ని విషయాలకన్నా వాస్తవమైనది. బొడ్డుకోసి పేరు పెట్టినది లగాయతూ చచ్చి స్మశానం చేరేవరకూ మనిషిచేసే ప్రతిపనిలోనూ, పొందే ప్రతి అనుభూతిలోనూ ఎంతోకొంత కల్పనా, భ్రమా, ఆత్మవంచనా, నటనా, మర్యాదా, ఆనవాయితీ మొదలైనవి వున్నాయి—యుద్ధంలో లేవు. అందులో ప్రతి నలుసూ పచ్చినిజం - అనుకోటాలు లేవు. యుద్ధం సమర్థతతో సాగినా, అసమర్థతతో సాగినా, ఒక పక్షానికి ఉట్టుడియంగా ఒక విజయం లభించినా, విజయం లభించవలసిన పరిస్థితిలో అపజయమే కలిగినా అంతా యథార్థమే. సరిచేయటానికేమీలేదు. ఉప సంహరించటానికేమీలేదు - చావగా మిగిలిన సేనలు తప్ప. 'సారీ' అంటే వినే వాళ్ళులేరు.

అయినాకూడా నారాయణకు యుద్ధం మరొకవిధంగా చూస్తే అవాస్తవంగానూ ఒక పీడకలలాగానూ కనబడింది. ఇది ఒక భావ సంఘర్షణ తాలూకు భయంకరమైన నీడ మాత్రమే. వాస్తవమైనది భావసంఘర్షణ. దాని స్వభావం వేరు. ప్రమాణంవేరు. మానవుడు భావంకోసం పోరాడటమూ, జీవించటమూ, చావటమూ చాలా స్వాభావికమైన విషయమే. అచ్చగా జ్ఞానేంద్రియాల పరిధిలోనే జీవిస్తున్నామనుకునేవాళ్ళను కూడా తరిచి చూచినట్టయితే, భావాలకోసం జీవిస్తున్నట్టు స్పష్టమవుతుంది.

కాని యుద్ధం రాకుండా చూడటానికి శాయశక్తులా ప్రయత్నించిన రష్యా విజయంకోసం అత్యధికమైన త్యాగాలుచేసి, దారుణమైన నష్టానికి గురి అవుతున్నది. ఒక దశాబ్దంపాటు హిట్లరును, పాముకు పాలుపోసి పెంచిన విధంగా ఎగదోసిన వాళ్ళు రష్యా నిర్మూలన కోసం ఎదురుచూస్తూ సెకండ్ ఫ్రంట్ ఏర్పాటు చెయ్యకుండా ఉన్నారు. ఈ యుద్ధంలో స్టాలిన్[1]తోబాటు, కరుడుగట్టిన సామ్రాజ్యవాది చర్చిల్[2] కూడా ఒక మహానాయకుడు! జపానువాళ్ళ సాయంతో కమ్యూనిస్టులను

1. స్టాలిన్ (1879-1953); రెండో ప్రపంచ యుద్ధంలో జర్మనీ సవాలుకు బదులు చెప్పిన మహాయోధుడు లెనిన్ అనంతరం దాదాపు 30 ఏళ్ళు రష్యా అధినేత.
2. చర్చిల్ (1874-?) : విన్‌స్టన్ చర్చిల్ బ్రిటిష్ రాజనీతిజ్ఞుడు. రెండో ప్రపంచ యుద్ధకాలంలో ప్రధాని, రక్షణ మంత్రి.

వేటాడిన జంగ్హై షేక్[1]ను కూడా ఊరేగించారు! స్వాతంత్ర్యోద్యమాన్ని లాఠీలతో అణచిపెట్టాలని చూసిన బ్రిటిషువాళ్ళు భారతీయులకు దేశభక్తి ప్రబోధాలు చెయ్యటానికి ఉపక్రమించారు! ఏనాడో పంచతంత్రంలో చిత్రించిన నక్కలూ —రుద్రాక్ష పిల్లులూ పెద్ద పెట్టున మళ్ళీ తయారయాయి!

నారాయణ ఈ అవకతవకలను గమనించాడేగాని, వీటినుంచి ఎటువంటి విష పరిణామాలు కలిగేది ఊహించలేకపోయాడు. జర్మనీ ఓటమి[2]తో కథ సుఖాంతమైనట్టు కనబడింది. ట్రూమన్[3] జపాను నగరాలమీద ఆటంబాంబులు వేయించినప్పుడు అతని రక్తం ఉడికినమాట నిజమేగాని, అది అమెరికా సాగించబోయే నరభక్షణ కార్యక్రమానికి జేగంట అని అతను ఊహించలేదు. న్యూరెన్‌బర్గ్[4]లో ఫాసిస్టు అవశేషాలకు సమాధి జరిగిందనుకున్నాడు గాని, ఫాసిజం[5] అమెరికాకు వలస పోతున్నదని తెలుసుకోలేదు.

---

1. జంగ్హై షేక్ (1886-?) చైనా కొమిటాంగ్ పార్టీనాయకుడు. సన్యట్‌సేన్ మరణం (1927) తర్వాత దక్షిణ సైన్యానికి సర్వసైన్యాధ్యక్షుడై ఉత్తర చైనాపై దండెత్తాడు. 1927 లో కమ్యూనిస్టుల నుంచీ విడిపోయి నాంకింగ్‌లో ప్రభుత్వాన్ని ఏర్పరిచాడు. 1927-1936 మధ్య కమ్యూనిస్టులకు వ్యతిరేకంగా అంతర్యుద్ధాన్ని ప్రోత్సహించాడు. రెండు చైనాలు ఏర్పడ్డానికి కారకుడు.

2. జర్మనీ ఓటమి : 1945 మే 9 వ తేదీ జర్మనీ లొంగిపోయింది.

3. ట్రూమన్ (1884-?) : హారీ ఎస్. ట్రూమన్ అమెరికా 33 వ అధ్యక్షుడు. 1945 ఆగస్టు 6 వ తేదీ మొట్టమొదటి అణుబాంబును హిరోషిమాపై వేయడానికి అనుమతి యిచ్చినవాడు.

4. న్యూరెన్‌బర్గ్ : 'ఫాసిస్టు అవశేషాల సమాధి' కోసం విచారణం. 1945 నవంబరు 20 - అక్టోబరు 1, 1946 మధ్యకాలంలో దొరికిన ప్రముఖ నాజీ యుద్ధ నేరస్తులను అంతర్జాతీయ సైనిక ట్రిబ్యునల్ ముందు విచారణ కావించారు. ఫాసిస్టు జర్మనీకి చెందిన అత్యున్నత ప్రభుత్వ అధికారుల నేరాలనూ, సైనికాధికారుల నేరాలనూ విచారించారు. ఈ నేరాలు కావించిన వాళ్ళు ట్రిబ్యునల్ ముందు విచారించబడ్డారు. ఐక్యరాజ్య సమితి సర్వసభ్య సమావేశం 1946 డిశంబరు 11 వ తేదీ శిక్షలను ఆమోదించే తీర్మానం చేసింది. చరిత్రలో యిది మొట్టమొదటి అంతర్జాతీయ నేర విచారణ.

5. ఫాసిజం : పెట్టుబడిదారీ విధాన సార్వత్రిక సంక్షోభ దశలో, పెట్టుబడి

యుద్ధరంగంలో ఎందరో బలి అయినట్లే, యుద్ధరంగానికి దూరంగా ఎన్నో మానవ సంబంధాలు విచ్ఛిత్తి అయిపోయాయి. యుద్ధం నిలిచిందిగాని భావ యుద్ధం నిలవలేదు. వెంకటేశ్వర్లు కమ్యూనిస్టు వ్యతిరేకిగా తయారయాడు. రామకృష్ణ "వీర కమ్యూనిస్టు"గా తయారయ్యాడు. వాళ్ళిద్దరూ ఒకరినొకరు కవ్వించుకోకుండా మాట్లాడలేని పరిస్థితి ఏర్పడింది.

నారాయణను ఆఫీసులో ముప్పాతికమంది "రష్యా ఏజెంటు" కింద జమకట్టేశారు. కాని మరికొందరు అతనికి ఆప్తు లయ్యారు. భావసంబంధం చుట్టరికం కన్నా, మామూలు స్నేహంకన్నా దృఢమైనదన్న సంగతి నారాయణకు ఇంత కాలానికి తెలియవచ్చింది. గాంధీగారి ఉద్యమాలప్పుడు కూడా ఎలాటి సంబంధాలూ లేని వాళ్ళు "భాయి-భాయి" అయిపోయారు. కాని సోషలిస్టు-కమ్యూనిస్టు-మార్క్సిస్టు భావాలంత బలంగా గాంధీగారి ఉద్యమాలు మనుష్యులను అతకలేదేమోనని నారాయణకు అనిపించింది.

లేదు. నారాయణ అనుకున్నట్టుగా కథ ముగియలేదు. జగన్నాటకంలో మరికొన్ని కంపుకొట్టే అధ్యాయాలూ, అంకాలూ ప్రారంభమవుతున్నాయి. బ్రిటిషు వాళ్ళు పన్నిన ఉచ్చుల్లోకి కాంగ్రెసువాళ్ళు చేతులూ కాళ్ళూ దూర్చి, దేశ విభజనకు సమ్మతించి, అధికారపీఠాన్ని అలంకరించారు. వేటపోతులు తెగాయి. రక్తం యేర్లు కట్టి ప్రవహించింది. పాతిక సంవత్సరాలకు భారతీయుల తలసరి ఆదాయం రెండింతలు కావటానికి పథకాలు ఆలోచించిన మేధావులూ, వాళ్ళ ఏజెంట్లూ కోటలో పాగా వేశారు. నారాయణ అనేక దుష్పరిణామాలు రానున్నట్టు అంచనా వేశాడు. ఆ దుష్పరిణామాలు అతను అనుకున్నంత దారుణంగానూ, అంత శీఘ్రంగానూ రాక పోవటం అతనికి కొంత మనశ్శాంతి నివ్వటానికి మాత్రమే తోడ్పడింది.

* * * *

---

దారీ దేశాల్లో తలఎత్తినట్టి, సామ్రాజ్యవాద బూర్జువావర్గంలోకెల్లా అభివృద్ధి నిరోధకమైనట్టి, దురాక్రమణతత్వం గలిగిన శక్తుల ప్రయోజనాలను వ్యక్తం చేస్తున్నట్టి ఒక రాజకీయ ధోరణి. ఉగ్రమైన జాత్యహంకారం, మానవ వంశ వివక్ష, కమ్యూనిస్టు వ్యతిరేకత, ప్రజాతంత్ర స్వేచ్ఛల నిర్మూలన, పౌరుల వ్యక్తిగత జీవితంపైనా, మొత్తంగా పౌరజీవితంపైనా ఖచ్చితమైన నియంత్రణ, వాగాడంబరం, యుద్ధోన్మాదం - యివి ఫాసిజం ప్రధాన లక్షణాలు. తొట్టతొలి ఫాసిస్టు ప్రభుత్వం 1922లో ఇటలీలో నెలకొల్పబడింది. ఫాసిస్టులు 1933లో జర్మనీలోనూ, 1939లో స్పెయిన్‌లోనూ అధికారంలోకి వచ్చారు. 1945లో సోవియట్ యూనియన్ అపార త్యాగాల ఫలితంగా, హిట్లర్ ఫాసిజం ఓడిపోయింది.

ఢిల్లీ కోటమీదనుంచి బ్రిటిషువాళ్ళ[1] జెండా దిగిపోయి ఎంతోకాలం కాకుం డానే నాటు ఫాసిస్టులు గాంధీని హత్య[2]చేశారు. హంతకుణ్ణి అభినందించినవాళ్ళలో నారాయణకు బాగా తెలిసినవాళ్లున్నారు. గాడ్సేను శిక్షిస్తే గాంధీమహాత్ముడి ఆత్మ ఆక్రోశిస్తుందంటూ పత్రికకు వచ్చిన ఉత్తరాలు కొన్ని అచ్చయ్యాయి. పత్రికలో అన్నిరకాల అభిప్రాయాలకూ చోటివ్వాలిగద! అటువంటిదేమీ లేదని, కొన్ని రకాల అభిప్రాయాలకు కొన్ని పత్రికలు సూదిమొన మోపినంత చోటుకూడా ఇవ్వవనీ నారాయణకు తెలుసు.

గాంధీ హత్య జరిగిన కొద్దిరోజులకే నారాయణ ఉద్యోగం మానేసి, ప్రెస్సొకటి కొన్నాడు. అట్టే పెద్దప్రెస్సు కాదు. ఒక సిలండరు మిషనూ, ఒక ట్రెడిలూ ఉన్నాయి. అయిదారు కేసుల టైపూ, ఒక పాత కటింగ్ మిషనూ ఉన్నాయి. ప్రెస్సు మీద పెద్దలాభాలు వస్తాయని నారాయణ ఆశించలేదు. అతని ఉద్దేశం ఎప్పటికైనా ఒక మంచి వారపత్రిక పెట్టి నడపాలని.

అయితే నారాయణ అనుకున్నట్టు జరగలేదు. వారపత్రిక పెట్టడం అనేక కారణాలవల్ల జరగలేదు. కాని ప్రెస్సుమీద డబ్బు బాగానే వచ్చింది. బుక్‌వర్క్ నారాయణ శక్తికిమించి వచ్చిపడింది. పనివాళ్లు మంచివాళ్ళే. వాళ్ళకూ నారాయణకూ ఎన్నడూ పేచీ వచ్చేదికాదు. వాళ్ళలో పార్థసారధి కొంత చైతన్యంగల పనివాడు. నారాయణతో ఎప్పుడూ రాజకీయాలు మాట్లాడేవాడు.

నారాయణ ప్రెస్సుకొన్న సమయంలోనే రామక్రిష్ణ ఎగ్మూరులో ఒక ఇల్లు అమ్మకాని కొస్తే కొన్నాడు. వాళ్లు వేరే వెళ్ళిపోయారు.

ఒకప్పుడు నారాయణకు కాలవేగంలో హెచ్చుతగ్గులు తన జీవితంలోనే తెలియ వచ్చేవి. ఇప్పు డవి బాహ్యజీవితంలోనే కనిపిస్తున్నాయి. అతని గృహ జీవితం చాలా ప్రశాంతంగా ఉన్నది. బుల్లి పార్వతి తరవాత సావిత్రి తిరిగి గర్భ వతి కాలేదు. పిల్ల కాన్వెంటుకు పోయి చదువుకుంటున్నది. నారాయణ మధ్యాహ్నం భోజనానికి వచ్చి తిరిగిమూడింటికి బయలుదేరి వెళ్ళిపోతాడు. ఒంటరిగా ఉన్నప్పుడు సావిత్రి ఏ పుస్తకమన్నా చదువుతుంది. లేకపోతే పత్రికలు తిరగేస్తుంది. బుద్ధిపుడితే సినిమాకు పోతారు. దాదాపు ప్రతి ఆదివారమూ రామక్రిష్ణా, సీతా వస్తారు. సీత అప్పుడే ఇద్దరు పిల్లల తల్లి, ఇద్దరూ మగపిల్లలే.

---

1. 1947 ఆగస్టు 14 అర్ధరాత్రి 12 గంటలకు బ్రిటిష్‌వాళ్ళ జెండా దిగి పోయింది. ముందురోజే పాకిస్తాన్ ఏర్పడింది.

2. గాంధీ హత్య : 1948 జనవరి 30 హిందూమతోన్మాది గాడ్సే హత్య కావించాడు.

సాధారణంగా ఆదివారంనాడే నారాయణ ఇల్లు సందడిగా ఉంటుంది. ఆ రోజే అతన్ని చూడవచ్చేవాళ్ళు జాస్తిగా ఉంటారు. ఆ రోజే సావిత్రికి పనికూడా జాస్తి-టిఫినులు చెయ్యటమూ, కాఫీలు కాయటమూను. అడపాదడపా ఎవరో ఒకరికి జబ్బుచేస్తుంది. కాని వాటికి పార్వతి హయాంలో ఉండిన ప్రాముఖ్యం సావిత్రి హయాంలో లేదు. నూటికి తొంభై రోగాలు చూస్తూ ఊరుకున్నా కూడా వాటికవే నయమవుతాయని నారాయణ ఎక్కడో చదివాడు. సావిత్రి ఆ సంగతి ఎరిగినట్టే ప్రవర్తిస్తుంది. ఆమెకు కొన్ని ప్రాథమిక సూత్రాలు తెలుసు- ముఖ్యంగా, జబ్బుచేసిన మనిషికి ఎప్పుడు తిండిబెట్టాలి, ఎప్పుడు ఎండ బెట్టాలన్నది.

జీవితోద్యోగమంతా ఇప్పుడు నారాయణకు ఇంటి వెలపలే కనిపిస్తుంది. నిజాము రాజ్యం కాంగ్రెసు నాయకులకు లొంగిరాలేదు. అక్కడ రజాకారు ఉద్యమం[1] సాగింది. పాకిస్తాను నుంచి ఆయుధాలు దిగుతున్నాయి. నాగభూషణమూ వెంకట్రామయ్యా కుటుంబాలతో సహా పారిపోయి వచ్చి, తాత్కాలికంగా పార్వతి ఇంట దిగారు. పార్వతి అద్దెకున్న వాళ్ళచేత ఇల్లు ఖాళీ చేయించింది, అన్నల కోసం.

పోలీసు చర్య[2]; కమ్యూనిస్టులు తెలంగాణాలో సాగించిన పోరాటం[3];

---

1. రజాకారు ఉద్యమం: లాయక్ అలీ మంత్రివర్గం ఏర్పడ్డాక నైజాం ప్రభుత్వం, ఇత్తెహాదుల్ ముస్లిమిన్ శాంతిభద్రతల రక్షణ పేరుతో ఏర్పాటు చేసిన అర్ధసైనిక సంస్థ. ఖాసిం రజ్వీ నాయకత్వంలో, పాకిస్తాన్ నుంచీ అందిన ఆయుధాలతో రజాకార్లూ, నిజాం సైనికులూ, భూస్వామ్య నిరంకుశ వర్గాలవాళ్లూ గ్రామాల్లో బీభత్సం సృష్టించారు. కమ్యూనిస్టు నాయకత్వంలో యీ రజాకార్ల దాడిని ప్రజలు ఎదుర్కొన్నారు.
2. పోలీసు చర్య : 1948 సెప్టెంబరు 13 వ తేదీ భారత ప్రభుత్వం సాయుధ దళాలతో హైదరాబాదు సంస్థానంలో ప్రవేశించి అయిదు రోజుల్లో నైజాం అధికారాన్ని అంతం చేసింది. ఈ చర్యే పోలీసు చర్య. ఈ దశలో భారత సైన్యానికీ తెలంగాణా ఉద్యమానికి ఘర్షణలు లేవు. దరిమిలా తెలంగాణా పోరాటంలో పాల్గొన్న రైతులమీద కూడా సైన్యం పోరాటం సాగింది. 1949 లో భారతదేశంలో విలీనాన్ని అంగీకరిస్తూ నిజాం ఒప్పందంపై సంతకం చేశాడు.
3. తెలంగాణా పోరాటం : 1946 జులై 4, జనగాం తాలూకా, కడవెండి గ్రామంలో, దొడ్డి కొమరయ్యను విసునూరు దేశముఖు, గూండా మస్కీన్ బలితీసుకున్నారు. ప్రజల కోపాగ్ని బద్దలైంది. తెలంగాణా సాయుధ పోరాటం మొదలైంది.

తరువాత కమ్యూనిస్టుల వేట[1]; కాటూరు, యలమర్రు[2] గ్రామాల్లో పోలీసుల అత్యాచారాలు; కాశ్మీరులో కుంపటి.[3]

---

నాటినుండి, తెలంగాణా పోరాట విరమణ జరిగిన 1951 అక్టోబరు 21 వరకు ఈ పోరాటక్రమంలో, 4 వేల కమ్యూనిస్టు కార్యకర్తలు, వీరులు మరణించారు. 10 వేల మంది జైళ్ళకు గురి అయ్యారు. 50 వేల మంది పోలీసుస్టేషన్ల చుట్టూ సంవత్సరాల తరబడి తిరగవలసి వచ్చింది.

నల్గొండ, వరంగల్, ఖమ్మం జిల్లాల్లోని 3 వేల గ్రామాలు విముక్తి చెంది గ్రామ రాజ్యం స్థాపించుకున్నాయి. 10 లక్షల ఎకరాల భూమి రైతులకు పంపకం జరిగింది. దాదాపు ఒకటిన్నర సంవత్సరాలు యీ గ్రామాలు తమనుతామే పరిపాలించుకున్నాయి.

1. కమ్యూనిస్టుల వేట : 1948 సెప్టెంబరు 28 న కమ్యూనిస్టుపార్టీ నిషేధం తర్వాత 1951 చివరి దాకా సాగింది.

2. కాటూరు, యలమర్రు అత్యాచారాలు : 1949 జూలై 16 న కృష్ణాజిల్లాలోని కాటూరు గ్రామాన్ని 300 మంది పోలీసులు చుట్టుముట్టారు. 400 మంది స్త్రీ పురుషుల్ని వివస్త్రల్ని చేసి వూరేగించారు. ఇలాంటి ఘటనలు పాముల్లంక, పెద ముక్తేవి మొదలయిన మరికొన్ని గ్రామాల్లోనూ జరిగాయి.

   1949 జూలై 14 తేది ఉదయం 400 మంది మలబారు పోలీసులు ఎలమర్రు గ్రామాన్ని చుట్టు ముట్టారు. కమ్యూనిస్టులయినా కాకపోయినా గ్రామస్తుల్ని లాఠీలతో మోది వివస్త్రల్ని చేశారు. చేతులయినా అడ్డం పెట్టుకోనీయకుండా లాఠీలతో మోదుతూ ఊరేగించి, గాంధీవిగ్రహం ముందు మోకరిల్ల జేశారు. కాంగ్రెసుకి జై అనిపించారు. స్త్రీలని కూడా వివస్త్రలని చేయ ప్రయత్నించారుగాని వారు ఎదురు తిరగడం, గ్రామ పెద్దలు కలగజేసుకోవటం ఫలితంగా ఆ పని చెయ్యలేదు- ఇది జలియన్ వాలాబాగ్ దురంతాన్ని మించిన అమానుషత్వంగా ప్రజలు భావించారు. (చూ. పి. సుందరయ్య, 'తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటం— గుణపాఠాలు')

3. కాశ్మీరులో కుంపటి : బ్రిటిష్ వలస ప్రభువులు దిగి పోతూపోతూ భారత-పాకిస్తాన్ దేశాల నెత్తుటిమీద పెట్టిన కుంపటి. కాశ్మీరులో సెప్టెంబరు 1947 — డిశంబరు 31, 1947 మధ్య జరిగిన ఘటనలే యిందుకు సాక్ష్యం

ఇంకా దూరం పోతే కొరియాలో అంతర్జాతీయ జెండా కింద అమెరికనుల నరమేధం.[1] అన్ని ఖండాలలోనూ నెగళ్ళమంటలు. చీనాలో మరో పెద్ద కమ్యూనిస్టు రాజ్యం.[2] చీనావాళ్ళు కొరియాలో అమెరికనుల మాడు పగల గొట్టటం.

హిందీ—చీనీ భాయి—భాయి."

"బోలెడంత సందడి! ఇంకా ఎన్నో సందళ్ళ-సినిమా సందడి, సినిమా తారల సందడి, సినిమా పత్రికల సందడి, బాలట్లు. "ఈ సంవత్సరపు ఉత్తమ నటుడు, ఉత్తమ నటి." డిటెక్టివ్ పుస్తకాల సందడి, ఇంగ్లీషు డిటెక్టివ్ పుస్తకాలకు ఎక్కడలేని గిరాకీ, తెలుగు పాకెట్ పుస్తకాల ప్రజాసాహిత్యం బళ్ళకొద్దీ, అటు నుంచి ప్రజా నాట్యమండలి[3] వాళ్ళ సినిమా ప్రవేశం. చిత్రాల చలామణిలో కొత్త రికార్డులు, పుస్తకాలమీద డబ్బు చేసుకోవటంలో కొత్త రికార్డులు, డిటెక్టివ్-రచనలు చేసే వాళ్ళలో తారలు. మధ్యలో మోసం - దగా - దురన్యాయం!

కిల్లీకొట్లవాళ్ళు అణాకూ బేడాకూ ఉత్తమ డిటెక్టివ్ సాహిత్యాన్ని అరువిచ్చి ఉత్తమ డిటెక్టివ్ సాహితీపరులమీద పెద్దదెబ్బ తీశారు. పదిహేను ఇరవయ్యేసి వేల కాపీలు అమ్మవలసిన పుస్తకాల సేల్సు మూడువేలకూ, అయిదు వేలకూ దిగి పోయాయి. దీనికి విరుగుడు లేదా? పుస్తకాలు సీల్ చేసి పంపండి. సీలులేని కాపీలను కొనకండి; ప్రతి కిల్లీకొట్టూ ఒక చిన్న సర్క్యులేటెడ్ లైబ్రరీ అయి పోయింది. ఈ కిల్లీకొట్లవాళ్ళని జైల్లో పెట్టటానికి ఉందేమో లాయర్లను సలహా అడగండి.

1. నరమేధం : 1950 జూన్ 25 కొరియా యుద్ధం ప్రారంభమైంది అమెరికా ఐక్యరాజ్యసమితి జెండాకింద దక్షిణ కొరియాకు అన్నివిధాలా సాయం చేసింది. నరమేధం సాగించింది. ఐక్యరాజ్యసమితి సైన్యాల్లో సగంపైగా అమెరికన్లే. ఉత్తరకొరియా సోషలిస్టు దేశాల సహాయంతో, ప్రపంచంలోని అభ్యుదయకర శక్తుల సహాయంతో అమెరికన్ల మాడు పగల గొట్టింది. చైనా ప్రత్యక్ష సైనిక సహాయంచేసి అమెరికాకు బుద్ధి చెప్పింది. 1953 జూలై 27న అమెరికా దిగిరాక తప్పలేదు. కొరియన్ ప్రజాసైన్యం, ఐక్యరాజ్యసమితి సైన్యం మధ్య ఒప్పందం కుదిరింది.

2. చైనాలో 1949 చైనా ప్రజాతంత్ర రిపబ్లిక్ యేర్పడింది.

3. ప్రజా నాట్యమండలి (1940-48): ప్రజల్లో సామ్యవాద భావాల వ్యాప్తి కోసం సకల ప్రజా కళారూపాలనూ చేపట్టిన ప్రజా కళాసంస్థ.

అరణ్యరోదనం. ఒకప్పుడు నారాయణ ఇంకొక అరణ్యరోదనం విన్నాడు. సాహిత్యంమీద ఎట్లా బతకటం? లైబ్రరీవాళ్ళు ఒక్కొక్క కాపీ కొంటే, దాన్ని యాభై మంది చదువుతారు. ఏ సాహిత్య గ్రంథము గట్టిగా వెయ్యికాపీలు అమ్మకుండా ఉంది. లైబ్రరీలే లేకపోతే కనీసం పదివేలు అమ్మును!

ఇప్పుడది వెనకబడింది. ఇప్పుడు సాహిత్య గ్రంథములను ఎవరూ కొనటం లేదు. లైబ్రరీలే కొంటున్నాయి.

కిళ్లీ కొట్లద్వారానే డిటెక్టివ్ పుస్తకాలు వేలకొలది అమ్మింది. ఆ కిళ్లీకొట్లే ఈనాడు డిటెక్టివ్ రచయితల పాలిటి శత్రువులై కూర్చున్నాయి. ఓడలు బళ్ళు, బళ్ళు ఓడలు కావటం ఇదే మరి.

డిటెక్టివు పుస్తకాలమీద వాటిని రాసినవాళ్ళు డబ్బు చేసుకున్నారంటే, ఆశ్చర్యం లేదు. డిటెక్టివు పుస్తకాల తాకిడితో నారాయణ ప్రెస్ అహోరాత్రులు అవిరామంగా పనిచేసింది. అట్లా సంపాదించిన డబ్బుతో నారాయణ తన ప్రెస్‌ను చాలా పెంచాడు. కాని, పెరుగుట విరుగుటకొరకే అన్నట్టు ప్రెస్సు పెద్దయాక డిటెక్టివు పుస్తకాల గిరాకీ చప్పున పడిపోయింది.

నిజానికి అతను ఏదన్నా పత్రిక పెట్టాలంటే ఇదే కారణం. కాని ఈలోపుగా వారపత్రిక అమ్మకాలు ఆకాశానికి లేచిపోయినాయి. సిలండరు మెషిను పెట్టుకుని రోటరీలతో ఎట్లా పోటీ చెయ్యటం - బ్లాకుమేకింగ్ అయినా లేకుండా? నారాయణ వారపత్రిక పెట్టే ఆలోచనను కట్టిపెట్టాడు. ఏమీ చెయ్యకపోయినా అతనికి నష్టమేమీలేదు. నెలకు ఏడెనిమిది వందల రూపాయలు ప్రెస్సుమీద వస్తూనే ఉన్నవి.

అతనికి ఎప్పుడైనా మనసులో ముల్లులాగ తగిలేది తల్లి గురించే. ఆవిడ పెద్దదైపోతున్నది, అదృష్టవశాత్తూ ఆరోగ్యం అంతగా దెబ్బతినలేదు. కాని ఒళ్ళు మరీ వచ్చింది. ఆవిడ సామాన్యంగా ఉత్తరం రాయదు. ఉన్నచోట ఆవిడ సుఖంగా ఉన్నదని తెలిస్తే నారాయణకు ఏ విచారమూ లేదు.

బంధువుల ఇళ్ళలో అక్కరలేవైనా అయినప్పుడు పిలిచేవాళ్ళు. కాని నారాయణ ఎప్పుడో తప్ప వెళ్ళేవాడు కాడు. దారితప్పి వెళ్ళితే తప్పక పశ్చాత్తాప పడేవాడు. బంధువులందరూ కూడబలుక్కున్నట్టుగా ఒకేవిధంగా మాట్లాడేవాళ్ళు.

"నువు మీ అమ్మను అట్లా వెలివేశా వెందుకూ? అయిన వాళ్ళం ఇక్కడ ఇంతమందిమి ఉంటిమిగదా. మమ్మల్ని చూడాలనిపించదా! నువ్వక్కడ బాగా డబ్బు చేసుకుంటూనే ఉండవచ్చు. కాని మనిషికి డబ్బొక్కటేనా?"

ఇటువంటి మాటలు నారాయణకు విచిత్రంగా వినిపించేవి. ఒక మనిషి ఇంకో మనిషిని ఎట్లా వెలివేస్తాడు? అట్లా ఎవరినన్నా వెలివేస్తే, తానా మనిషికి వెలికావటమేగ్గా? "నువు మీ అమ్మకు ఎందుకు వెలి అయావు!" అని ఒక్కరూ అడగరు. ఒక మనిషిని వెలివెయ్యటానికి అవతల ఒక సంఘం ఉండాలి. అటు

వంటి సంఘం తన బంధువర్గంలో ఎక్కడా కనపడలేదు. అందరూ ఎవరి బతుకులు వాళ్ళు బతుకుతున్నారు. ఒకరినొకరు ఆదుకోవటమనేది వాళ్ళమధ్య ఏమీ ఉన్నటులేదు. "పాపం రత్తయ్య కుటుంబం చాలా కష్టాలు పడుతున్నారు. ఒక్కోపూట తిండికూడా ఉండటంలేదు." అని ఎంతో జాలిగా చెప్పేవాడు. ఆ రత్తయ్యకు ఓ మానెడు బియ్యం ఇచ్చినట్టుకూడా చెప్పాడు.

తన బంధువులకు తనమీద ఏపాటి నిజంగా అపేక్ష ఉన్నదీ నారాయణకు తెలీదు. కాని వాళ్ళను అడపా దడపా చూడాలని తనకులేని తహ తహ వాళ్ళకు తనను చూడాలని ఉన్నట్టు నారాయణ నమ్మలేకపోయాడు. తనకు అపేక్షలూ, అంతఃకరణలూ లేవని తప్పు పట్టటానికి వాళ్ళకు అవకాశం చిక్కింది. దాన్ని వాళ్ళు ఉపయోగించుకుంటున్నారు. నిజంగా అపేక్షలూ, అభిమానాలూ ఉండేవాళ్ళు అయితే వాళ్ళు తమ ఎదుట ఉన్నవాళ్ళతో అస్తమానమూ పేచీలు పడరు. ప్రతివాడూ మిగిలిన వాళ్ళను గురించి ఏదో నసపెట్టేవాడే!

చివరకు పార్వతికీ, అన్నలకూ కూడా పడలేదు. వాళ్ళు నిజాము నుంచి వచ్చి తమ ఇంటనే ఉంటున్న కాలంలో ఒకసారి నారాయణ ఇంటికి వెళ్ళాడు. చిన్నప్పుడు తనను ఎత్తుకొని మోసి మురిసిన మేనమామలను అతను గుర్తించలేకపోయాడు. వాళ్ళు తమ కష్టాలను గంటలతరబడి చెప్పుకున్నారు. చెప్పిందే మళ్ళీ మళ్ళీ చెప్పారు. తెలంగాణాలో కమ్యూనిస్టులు చేసిన "రాక్షస కృత్యాలను" వాళ్ళు మహా భయంకరంగా వర్ణించారు; వాళ్ళ కష్టాలకు కమ్యూనిస్టులు కూడా కారణమే. కాంగ్రెసువాళ్ళు నిజాము నవాబును అట్లా రెచ్చగొట్టి ఉండకూడదు.

ఈ మాటలన్న మేనమామలు తరువాత తిరిగివెళ్ళి కాంగ్రెసు కొమ్ము కాస్తారని నారాయణ కలలో కూడా అనుకుని వుండడు.

తన తల్లిని తనదగ్గిర వచ్చి ఉండమని నారాయణ చాలాసార్లు అడిగాడు. తల్లికి రాసినవి కొద్ది ఉత్తరాలే అయినా ప్రతి ఉత్తరంలోనూ ఆమాట అన్నాడు.

"ఎందుకులేరా! ఇక్కడ నాకు పిలిస్తే పలికేవాళ్ళున్నారు. ఇంట్లో ఏమీ తోచనప్పుడు వెళ్ళటానికి ఎన్నో కొంపలు; అక్కడ ఏముందీ? ఏం కావలసినా నిన్నూ, నీ పెళ్ళాన్నీ బాధపెట్టాలి. ఎక్కడికీ పోవటానికుండదు. ఇట్లాగే వెళ్ళమారిపోనీ!" అనేది పార్వతమ్మ.

నారాయణ తన తల్లిలో ఇప్పుడిప్పుడు ఒక తేడా గమనిస్తున్నాడు. అదివరకల్లా సమస్యలు తెచ్చిపెట్టటం ఆవిడ వంతుగా ఉండేది. ఆ సమస్యలకు సులభ పరిష్కారం ఉండేది కాదు. నారాయణ ఇరుకున పడ్డట్టు అయేవాడు. ఇప్పుడు నారాయణ తన అంతరాత్మను తృప్తిపరచుకోవటానికి ఒక్క సమస్య తెచ్చిపెట్టుకోవటమూ, తల్లి ఆ సమస్య ఏర్పడకుండా చూడటమూ అవుతున్నది. పార్వతమ్మ మాటలలో పూర్వంలేని వేదాంతం ఏదో ఉంటున్నది. అదివరకులాగా ఆవిడ తన కొడుకును వలవేసి పట్టుకోవటానికి ఎటువంటి ప్రయత్నమూ

చెయ్యటంలేదు. ఆమె అటువంటి ప్రయత్నం చేసిఉంటే నారాయణకు తల్లిమీద సానుభూతి ఉండేదికాదు; కాని ఇప్పుడు అతని అంతరాత్మ మరింత బాధపడ సాగింది.

ముంచుకొచ్చే ముసలితనంలో తల్లి దిక్కులేనిదానల్లె ఒంటరిగా ఉండట మేమిటి? రోగం వచ్చినా, రొష్టు వచ్చినా ఎవరో వచ్చి చెయ్యటం ఏం బాగుంటుంది?

కిందటిసారి తల్లిని చూసినప్పుడు నారాయణ, ఆవిణ్ని తన దగ్గిరికి వచ్చి ఉండమని పిలుస్తూ ఆమాటే అన్నాడు.

పార్వతి నవ్వి, "నలుగురూ ఏమనుకుంటారనిట్రా నీ బెంగా? ఇదెప్పట్నుంచి? ఎవరేమనుకున్నా నీకు లక్ష్యం లేదనుకుంటున్నానే, ఇన్నాళ్ళూ!" అన్నది.

నారాయణ ఆట కట్టయిపోయింది.

* * * *

నిజానికిప్పుడు పార్వతి మనస్సులో లోతైన విచారాలేవీ లేవు. మనసు డొల్లగా వున్నప్పుడే ఇతరులపట్ల అసంతృప్తి జాస్తిగా ఉంటుంది. ముప్పై ఏళ్ళు వచ్చినదాకా పార్వతి మనసు నిండుగానే ఉన్నది. భర్తతో తనకు ఏ మాత్రమూ సహించరాని దాంపత్యజీవనం గడిపింది; భర్తకు దూరంగా వచ్చేసి పుట్టింటివాళ్ళ అంద చేరింది - అప్పుడు కూడా పార్వతి మనస్సు నిండుగానూ, నిబ్బరంగానూ ఉన్నది. తన మనస్సులో కొడుక్కు పెద్ద ఆవరణ కేటాయించింది. అందులో నుంచి నారాయణ క్రమంగా బయటికి వెళ్ళిపోవటంతో ఆమె మనసు డొల్లకానారం భించింది.

పార్వతి జీవితంలో పొందిన బాధ యావత్తూ నారాయణమూలాన కలిగి నదే. వాడు తన జీవితాన్ని, తన ప్రేమనూ, తన తపస్సునూ వ్యర్థం చేశాడు; వాటిని అవమానించాడు; వాటికి ద్రోహం చేశాడు. బుద్ధిపూర్వకంగా చేశాడా, తెలీక చేశాడా అన్నది పార్వతమ్మకు పట్టలేదు. ఆవిడ తనను గురించే ఆలో చించుకుని బాధపడింది. ఒక ఏడుకాదు, రెండేళ్ళు కాదు. ఇరవై ఏళ్ళు - గిలగిలా కొట్టుకున్నది. కొడుకు పట్ల తనకుగల భావంలో చిన్న చిన్న ద్వేషాలు - పులి మజ్జిగలో పురుగుల్లాగా పుట్టుకురావటం కూడా ఆమె గుర్తించలేదు. అవి ఆమెలో కలిగిన ప్రతిక్రియాశక్తులు. అవి ఆమెకు తన పుత్రప్రేమయొక్క సహజ పరి ణామాలుగా కనపడ్డాయి. పెద్దవాళ్ళు పిల్లల తప్పులకు దండించడంలో ప్రేమ ఉండదని ఎవరనగలరు?

పార్వతమ్మ తన మనసులోని డొల్లను డబ్బుతో నింపాలని చూసింది; అది కూడా స్వాభావికమేనేమో. డబ్బుతో చాలా ఖాళీ జాగాలను నింపవచ్చు. మనిషి యొక్క పరిస్థితిని బట్టి కొద్దిపాటి డబ్బయినా కొలవరానంత ఆనందాన్ని ఇస్తుంది. పొట్టిగా బిచ్చవాడు కానివాడికూడా రోడ్డుమీద ఒక పావలాకాసు దొరికితే, వణుకు పుట్టించే చలిలో చలిమంట దగ్గిర కూర్చుంటే కలిగేటంత తృప్తి చాలా సేపు కలు

గుతుంది. అయితే డబ్బుతో వచ్చే చిక్కేమిటంటే, నిషా వస్తువల్లే, అది పోయిన కొద్దీ పెద్ద డోసులు కావాలి. ఒకదశలో బాంకు వడ్డీ రూపాయిపావలావస్తే తన్మయత్వం చెందేవాడు, కొన్నాళ్ళయాక పాతిక రూపాయల వడ్డీకి కూడా అనుభవం అయింది.

చిట్టచివరకు పార్వతికి వేదాంతం దొరికింది. ఇంట్లో అద్దెకుంటున్న ఆంజనేయులుగారు పెద్ద వేదాంతి. ఇంట్లో ఉండేది నలుగురూ - ఆయన, భార్యా, కొడుకూ, కోడలూనూ. ఆయన మిగిలిన వాళ్ళకు అంటడు. మిగిలిన ముగ్గురూ సాధారణంగా ఆయన లేనట్టే ప్రవర్తిస్తారు. ఆయనను పలకరించరు. ఆయన మాట్లాడేది వినిపించుకోరు. ఆయనతో ఏదీ సంప్రతించరు. ఈ పద్ధతి ఆంజనేయులు గారికి ఏ మాత్రమూ అభ్యంతరం ఉన్నట్టు కనిపించలేదు. ఆయన కూడా వాళ్ల లేనట్లే ఉంటాడు.

ఆంజనేయులుగా రబ్బాయి సీతాపతి స్కూల్లో మేష్టరుపని చేస్తున్నాడు. పొలాలమీద తృణమో పణమో వస్తుందల్లే వుంది. ఆ అబ్బాయికి తల్లి అంటే ఎంత గురి! ఆవిడకు వాడంటే ఎంత నమ్మకం! వాళ్ళ కోడలు కూడా చాలా బుద్ధిమంతురాలు. ఎప్పుడూ మాట్లాడినట్లే ఉండదు. అత్తగారు గీసిన గిరి దాటదు. అత్తాకోడళ్ళ వైరం వీళ్ళలో కంచు కాగడాలువేసి చూసినా కనిపించదు.

ఆంజనేయులుగారి మాటలు మిగిలినవాళ్ళ కెందుకు పట్టవో పార్వతికి అర్థం కాలేదు. వారానికి ఆయన ఒక్కముక్కే అన్నా, అది పార్వతికి పరమ సత్యంగా ఉండేది.

"జన్మంటే ఏమిటి? గాఢాంధకారంలో ఒంటరిగా ప్రయాణించి వస్తాం. నాలుగు రోజులపాటు నలుగురిలోనూ కలిసివున్నట్టు భ్రమపడతాం. మాయ అనేది జీవాత్మకూ పరమాత్మకూ మధ్య తెరలాగా వున్నదంటారుగాని, నన్నడిగితే ఒక జీవాత్మకూ మరో జీవాత్మకూ మధ్య తేడా ఈ తెర ఉండనే వున్నది. ఒకరి జీవాత్మ ఏం చేస్తున్నదీ ఇంకొకరి జీవాత్మకు అంతు చిక్కదు. అది తెలియరాని దేవరహస్యం. వీడు మంచివాడనీ, వాడు చెడ్డవాడనీ, వీడు మంచిపని చేశాడనీ, వాడు చెడ్డపని చేశాడనీ, వీడు అయినవాడనీ, వాడు కానివాడనీ మనం భ్రమ పడతాం. నిజానికి, పరమాత్మ ఎంత నిర్వికారమో, జీవాత్మ కూడా అంత నిర్వికారమే. పైకి దేవత్వం కనబడితే అడుగున దాని ప్రమాణంలో రాక్షసత్వం వుంటుంది. పైకి రాక్షసత్వం కనబడితే కనబడకుండా అంత దేవత్వమూ వుంటుంది. కాని మాయాజీవితంలో మునిగి తేలే మనకు కనపడేదే లెక్కలోకి వస్తుంది. చూడరాదా? పౌర్ణమినాడు ఎంత పెద్ద చంద్రుడుంటాడో అమావాస్యనాడూ అంత పెద్ద చంద్రుడుంటాడు. కాని మనకు ఆనాడు చంద్రుడు లేనట్లే లెక్క! ఎంచేతా? మనం ఆ చంద్రుడి కాంతికే విలువ ఇస్తాం గనక! అది మన స్వార్థం. ఇవన్నీ పాక్షికమైన అంచనాలు. వాటితో జీవించినంతకాలమూ మనకు నిజంతో పని

ఉండదు. అసలైన సత్యం ఈ మానవజన్మకు తెలియటమే కష్టం. తెలిసినా ఉప యోగపడటం అసాధ్యం. అందుచేత మాయలో పుట్టినవాళ్ళం మాయలో జీవించక తప్పదు. ఇక మన చేతిలోవున్న దేమిటయ్యా అంటే, మాయ అని తెలుసు కుంటూ గుర్తుంచుకుంటూ జీవించటం...." ఈ ధోరణిలో ఆంజనేయులుగారు మాటాడేవాడు. అదేం చిత్రమో, ఆయన నోటిమాట పార్వతి తలకు సూటిగా ఎక్కేది. ఒక్కొక్కళ్లు గంటసేపు మాట్లాడి వెళ్ళినా వాళ్ళు మాటాడిన ముక్కలు మూడు నాలుగు మించి జ్ఞాపకం ఉండవు. ఆంజనేయులుగారు చెప్పే మాటలు మరుద్దామన్నా పార్వతికి సాధ్యమయ్యేది కాదు.

పార్వతి ఆయనను అప్పుడప్పుడూ అనుమానాలు అడిగేది.

"నాయనగారూ, కిందటి జన్మలో చేసుకున్న కర్మకు ఫలం ఈ జన్మలో కలుగుతుందని నమ్మవచ్చునా?" అని ఆమె ఒకసారి అడిగింది. ఆంజనేయులుగారు చిన్నగా నవ్వి, "తల్లీ, ఏ కర్మ ఫలం ఎంతకాలం ఉంటుందో ఎవరు చెప్పగలరు? అరగనిది తిన్నదోషం ఒక్క అజీర్ణం మాత్రతో పోతున్నది. గాయాలూ, బొబ్బలూ తెచ్చుకుంటే కొంతకాలానికి మానుతున్నాయి. స్వర్గమూ, నరకమూ ఉన్నాయంటు న్నారు. చేసిన పాపాలకూ, పుణ్యానికీ ప్రతిఫలం అక్కడే ముట్టేట్టుంటే మళ్ళీ పునర్జన్మ దేనికి కలుగుతున్నట్టూ? ఈ జన్మలో మనం చేసేదంతా పూర్వజన్మ కర్మ ప్రేరణతో జరిగే మాటుంటే ఈ జన్మలో మనం చేసేదానికి మరో జన్మలో అనుభవించటం ఎట్లా జరుగుతుందీ? కర్మసిద్ధాంతమే ఇంత అయోమయంగా ఉంటే, ఇందులోకి దేవుణ్ణి ఒకణ్ణి ప్రవేశపెట్టారు; వాడు చేసే దేమిటీ?" అన్నాడు.

పార్వతి నిర్ఘాంతపోయి, "అయితే దేవుడు లేడంటారా?" అన్నది. "లేడనీ, ఉన్నాడనీ మదనపడటం దేనికి తల్లీ? నేనీ విషయం ఆలోచించి తేల్చిన దేమి టంటే, మనమే దేవుడుకాని పక్షంలో బయట ఎక్కడా దేవుడు లేడనే! వాణ్ణి సర్వాంతర్యామి అన్నారుగద! మనలోనూ ఉండే ఉండాలి. సర్వసాక్షి అన్నారుగద! మనం సాక్షులంకదూ? నా మనస్సులో ఉండే ఆలోచనలు నీకు తెలియక పోవచ్చు నాకు తెలుసునే! అందరికీ అన్నీ తెలియకపోవచ్చు కాని సాక్షిత్వం లేకుండా ఏ ఒకటీ జరగదు. ఎవరింట్లోనో రేడియో పాడుతుంటుంది. రేడియో మనకు కనిపిం చకపోయినా పాటకు గాలి సాక్షిగా ఉండనే ఉన్నది. అంతా భగవంతుడే గుళ్ళో ఉండే రాయికి గల సాక్షిత్వంకన్న మనలో ఉండే సాక్షిత్వం హెచ్చు." అన్నారు ఆంజనేయులుగారు.

మరోసారి పార్వతి పునర్జన్మ గురించి అడిగింది.

"పునర్జన్మ గురించి నే నే విచారమూ పడను. మనం ప్రత్యక్షంగా అనేక పునర్జన్మలు చూస్తున్నాం. భూమిమీద పడిన విత్తు చీకి, విత్తు జన్మ చాలించి, చెట్టు జన్మ ఎత్తుతున్నది. సీతాకోకచిలుకలు గుడ్లు పెడుతున్నాయి. అవి కొంతకాలం పెరిగి నశించగా, వాటి నుంచి మళ్ళీ సీతాకోకచిలుకలు పుట్టుకొస్తున్నాయి. జడ

పదార్థాలకు కూడా జన్మ పరంపర ఉంటున్నది గద! నీరు ఎండకు ఇగిరి పైకిపోయి, మేఘమై, కొంతకాలం పైనేతిరిగి, చివరకు నీరుగా అవతరిస్తుంది. అంతదాకా దేని కమ్మా? మనం ఒక్క జీవితంలోనే ఎన్నో జన్మలెత్తటంలేదూ?

నా కిప్పు డరవై అయిదోఏడు జరుగుతున్నదనుకో. వెనక్కి తిరిగి చూసుకుంటూనా ఎన్నో జన్మలు గడిచినట్టనిపిస్తుంది. ఒకదానికి ఇంకోదానికి సంబంధం లేదు. నేను పుట్టిననాటికి ఈ ప్రాంతాల రైలుగూడా లేదు. కార్లు లేవు, బస్సులులేవు. ఇవాళ చెవుల్లో రేడియోలమోతా, నెత్తిన విమానాలమోతా, సినిమాలూ, రేపు ఆకాశంలో మనుషులు విహరిస్తా రంటున్నారు. రజస్వల అయిన పిల్లలకి పెళ్ళిళ్ళు చేస్తున్నారు. ప్రపంచంలో ఎన్నో మార్పులు. ధర్మంలో ఎన్నో మార్పులు; మారే శరీరంలో మారని ఆత్మల్లాగా మనం అట్లాగే వున్నాం." అంటూ ఆంజనేయులు గారు ఓ విధమైన స్వగతం చదివాడు.

ఆయన చెప్పేవి కొన్నికొన్ని పార్వతికి అర్థమయేవికూడా కావు. ఒకసారి వెంకటేశ్వర్లు వచ్చినప్పుడు ఆంజనేయులుగారు అతనితో చాలా 'వేదాంతం' మాట్లాడాడు. పార్వతికి అది అంతుచిక్కలేదు.

'నేను' అన్నది అన్ని భ్రమలలోకీ గొప్ప భ్రమ అనీ, అసలు వ్యక్తి అనేది సృష్టిలోనే లేదనీ, ఒక పేరు పెట్టటానికి వీలైన సమిష్టికి మనం వ్యక్తిత్వం అంటగట్టుతున్నామని ఆంజనేయులుగారు వాదించాడు.

"ఆ మాట ఎట్లా అనగలరు?" అని వెంకటేశ్వర్లు ఆక్షేపించాడు. "ఎందుకనలేం? మీ యిష్టం వచ్చిన ఏ వ్యక్తినన్నా చెప్పండి, అది సమిష్టి అనీ, అందులో చేరినవాటన్నిటికీ వేరే వ్యక్తిత్వం ఉన్నదనీ, అవి మళ్ళీ సమిష్టులేననీ నేను రుజువుచేస్తాను. ఒక మనిషిని తీసుకోండి. వాడిలో వ్యక్తిత్వం ఎక్కడున్నది? వాడి శరీరంలో ఎన్ని ధాతువులు! ఎన్ని కోట్ల జీవకణాలు! తమ పని తాము చేసుకుంటూ పోయే గుండెకాయ, ఊపిరితిత్తులు, గ్రంధులు, రక్త ప్రవాహం, మెదడు, నరాలు! వాటి జీవితాలు వాటికున్నాయి. శరీరం ఓ పెద్ద ప్రపంచం. అందులో ఎన్నో జీవరాసులు– వాటి వాటి ప్రత్యేక జీవితాలు! కొన్ని కొద్ది క్షణాలు మాత్రమే బతుకుతాయి; కొన్ని ఈ ప్రపంచం ఉన్నంతకాలమూ ఉంటాయి. మాటవరసకు చెబుతా, భూదేవి అంటూ ఒకతె నిజంగా ఉందేమో! ఉండి తానొక వ్యక్తిననుకుంటున్నదేమో!.... ఉంటే మనకు కనిపించదా అనకండి. మన శరీరంలో ఉండే రక్త కణాలకు మనం కనిపించం. అవి నివసించే ప్రపంచం ఒక వ్యక్తి అన్నది వాటికి ఊహించరాని విషయం! ఇంకో చిత్రం చూశారో, లేదో– మన లోపలవున్న సమిష్టత్వం మనకు చాలటం లేదు; బయటినుంచి సమిష్టిత్వాన్ని వెతుక్కుంటున్నాం. పదిమంది చేరి తమ వ్యక్తిత్వాలను కలగలుపుకున్నప్పుడే మనకు ఆనందమూ, ప్రయోజనమూ ఉంటున్నది. వ్యక్తిత్వాన్ని సమిష్టిలో లీనం చెయ్యటానికి నా చిన్నతనంలో భజనలు చేసేవాళ్ళు. పురాణాల్లు వినేవాళ్ళు, తోలుబొమ్మలాటలు చూసే

వాళ్ళు, ఉత్సవాలు చేసేవాళ్ళు, తరవాత ఉద్యమాలు వచ్చాయి. ఈనాడు ఈ సిని మాలు అవీ అందుకే ఉపయోగపడుతున్నాయి. కళలకున్న ప్రయోజనం కూడా అదే– వ్యక్తులను ఒక సమిష్టిగా రూపొందించటం .... నన్నడిగితే, నిజమైన వ్యక్తిత్వం అన్నది పరమాత్మకు మాత్రమే. ఆ పరమాత్మ కూడా వ్యక్తిత్వంలో తృప్తిచెందలేక సమిష్టిత్వాన్ని ఆశ్రయించవలసి వచ్చింది. ఆ కారణంచేతనే ఈ సృష్టి అంతా నడుస్తున్నది" అన్నాడు ఆంజనేయులుగారు.

వెంకటేశ్వర్లు పార్వతమ్మతో, "ఆయన చెప్పేది వేదాంతమవునో కాదోగాని అది ఒకరికి చెరుపు చేసేది మాత్రం కాదు" అన్నాడు.

*　　*　　*　　*

పార్వతి ఆరోగ్యం క్రమంగా క్షీణిస్తున్నది. ఆమెకు ఆయాసం జాస్తి అవుతున్నది. ఏమాత్రం కదలటానికీ ఓపిక లేకుండా వున్నది. అద్దెకున్నవాళ్ళ కోడలు పాపం, కొన్ని పనులు చేసి పెడుతున్నది.

ఏ వైద్యుడి సలహా అయినా తీసుకుని మందు పుచ్చుకునే ఆలోచన పార్వతికి ఏ మాత్రమూ నచ్చలేదు.

"ఒళ్ళు, పాపం పెరిగినట్టు పెరిగిపోయింది. ఆయాసం ఉండకేంజేస్తుంది?" అని ఆవిడ సరిపెట్టుకునేది.

వైద్యుడికి చెప్పనంతమాత్రాన సలహాలకేమీ లోటు రాలేదు. కొందరు తిండి మానెయ్యమన్నారు. కొందరు తొట్టి స్నానాలు చేసి, పచ్చికూరలు తిన మన్నారు. ఇటువంటి రోగాలకు రంగుసీసాల నీళ్ళు చాలా అద్భుతంగా పని చేస్తాయన్నారు. కొందరు గుండెలకు అమృతాంజనం రాయమని కూడా సలహా ఇచ్చారు. ఏ జాతి విజ్ఞానరహితమై అర్థంలేని నమ్మకాల ఆధారంతో కాలక్షేపం చేస్తుందో ఆ జాతిలో అన్ని రకాల అజ్ఞానాన్నీ అందరూ ప్రదర్శిస్తారు. వైద్యం డాక్టర్లకే తెలుసుననీ, సంగీతం విద్వాంసులకే తెలుసుననీ అటువంటి జాతి అను కోదు. ప్లీడర్లతోపాటు చెట్టుకింద ప్లీడర్లూ, వైద్యులతోపాటు చిట్కావైద్యులూ, వేదాంతులతోపాటు గంజాయి తాగేవాళ్ళూ, దేవతలతోపాటు గ్రామదేవతలూ, పిల్లలను పెంచటం చాతకాని తల్లులూ, పెళ్ళాలతో కాపురం చెయ్యటం చాతకాని భర్తలూ, విషయంతో పరిచయంలేని విమర్శలూ అటువంటి జాతిలో జాస్తిగా ఉంటాయి.

చివరకు పార్వతి మంచాన పడింది.

ఆంజనేయులుగారు నారాయణకు టెలిగ్రామిచ్చాడు, వెంటనే బయలుదేరి రమ్మని. మర్నాటికల్లా నారాయణా, పిల్లలూ, సావిత్రీ, సీతా, ఆవిడ పిల్లలూ దిగారు. రామక్రిష్ణ వెంటనే బయలుదేరలేకపోయాడు.

పార్వతి నారాయణను తన మంచంమీద కూర్చోమని, కొడుకు చేతులూ, వీపూ నిమిరింది.

"ఇక్కడ ఇన్నాళ్ళు వైద్యం లేకుండా ఎందుకున్నావు? మాతో వచ్చెయ్యి. నీకు మంచి వైద్యం చేయిస్తాను." అన్నాడు నారాయణ.

"ఎందుకురా? నన్ను ఈ సారికి చావకుండా బతికిస్తానంటావు! అంతేనా, ఇంకోసారి చద్దువుగానిలే అంటావు! ఎప్పుడయితేనేంరా? ఎన్నాళ్ళు బతికినా నేను చేసేదేమీలేదు. నాయనా! ఎప్పుడు మాత్రం ఏం చేశాను? ఏమీ లేదు. పదేళ్ళుగా చావు ఎప్పుడొచ్చినా సిద్ధంగానే ఉన్నాను. నాకు ఈ ఆయాసం తప్ప వేరేబాధ ఏమీలేదు. నాకు ఒక్కటే విచారం, నాయనా! నిన్ను ఎట్లా పెంచాలో చాతకాక దూరం చేసుకున్నా.... మన అద్దెకున్న వాళ్ళబ్బాయి- ఆ తల్లీ కొడుకులు ఎంత ప్రేమగా ఉంటారు! వాళ్ళను చూస్తే ముచ్చటేస్తుంది!...." అన్నది పార్వతమ్మ.

ఆవిడ జీవితానుభవం వడగట్టితే చివరకు తేలిన నిగ్గు ఆ రెండుముక్కలే.

నారాయణ డాక్టరును తీసుకొచ్చాడు. డాక్టరేవో ఇంజక్షన్లనిచ్చాడు. కాని అవేవీ పనిచేసినట్టు లేదు. నారాయణ వచ్చిన నాలుగోరోజు రాత్రి పార్వతి ప్రశాంతంగానూ శాశ్వతంగానూ కన్నుమూసింది.

ప్రచురణ : జనవరి, 1970 ఎమెస్కో : మద్రాసు

# సవతి తల్లి

## 1

తులసికోట దగ్గర అంట్లుతోమేది తోమిపెట్టిన గిన్నెలమీద నీళ్ళు ప్రోక్షించి వాటిని పుల్లతో తిరగవేసి మళ్ళీ ప్రోక్షించి అప్పుడు వాటిని తన పవిత్ర బ్రాహ్మణ పూర్వ సువాసినీ హస్తంతో తాకి, వాటిలో మరిన్ని నీళ్ళుపోసి తొలిచి శుచి చేసుకొంటున్న వెంకమ్మకు, తన పెద్దమనవడి ఏడుపు వినిపించింది. యాభై ఎనిమి దేళ్ళు వెళ్ళబుచ్చి ఆచారంతోనూ, ఉపవాసాలతోనూ, నియమాలతోనూ కృశించి ఉన్న ఆవిడ శరీరానికి, విద్యుత్తు తగిలినట్టుకాగా వెంకమ్మగారు, పిల్లల ఆర్తనాదం విన్న కోడిలాగ, చేస్తున్న పని మధ్యలోనే వదిలేసి, గబగబా మనవణ్ణి రక్షించటానికి పోయింది.

దాసుగదిలో దాసూ, అతని పెద్దకొడుకు గోపీ కనిపించేసరికి ఆవిడ ఆగ్రహం పట్టలేకపోయింది.

"అయిందీ? తెల్లారిందీ? వాణ్ణి చెండుకుతినటం మొదలు పెట్టావు? ఒక్కసారి వాడిగొంతు పిసికి పారెయ్యరా! ఈ రంపపుకోత చూడలేక చస్తున్నానూ!" అన్నది వెంకమ్మ తనకొడుకైన దాసుతో.

దాసు మాట్లాడలేదు. మాట్లాడినా ఆవిడ వినదు. విన్నా ఆవిడకు అర్థంకాదు. అర్థమైనా ఆవిడ దాసు చెప్పేది ఒప్పుకోదు. అదీగాక ఆవిడకు చేతినిండా పని. ఎందుకంటే నాయనమ్మ కనిపించగానే గోపీ శ్రుతి మరింత హెచ్చిస్తాడు. దాంతో వెంకమ్మగారి "కన్నకడుపును కన్నకడుపు" వక్కలైపోయి, మిగతా ప్రపంచమంతా మరిచి మనవణ్ణి ఊరడించబోతోంది. తన భార్యపోయిన ఈ రెండున్నర ఏళ్ళనుంచీ దాసు ఈ దృశ్యం రోజూ, ఒక్కొక్క రోజు రెండుమూడుసార్లుకూడా చూస్తున్నాడు. కనక అతని కిదంతా పరిపాటే.

వెంకమ్మ చేతులుచాచి మనవడి దగ్గరికి పరుగెత్తుతూ "నాతండ్రే! నా బంగారమే! నే చచ్చిపోయినానే! ఏడవకు, నానా, ఏడవకు! నీకు పప్పుండలు కొనిపెడతాగా? పిప్పరమెంటు బిళ్ళలు కొనిపెడతాగా?" అని ఊరడించసాగింది.

గోపీ ఆవిణ్ణి చేతికి అందుబాటులోకి రానిచ్చి, నెత్తిన రెండు చేతులతోనూ పెడీ పెడీకొడుతూ, ఆ దరువుకు సరిగా కాళ్ళతో నృత్యంచేస్తూ, గొంతు ఇంకా

హెచ్చించి ఏడుస్తూ, "నా కిప్పుడే కొనిపెట్టూ! నాకు నాన్నచేత రూపాయిప్పిచ్చూ! నాకు రూపాయి కావాలి!" అని రోదించాడు.

మనవడికి కావలసిందేదో ఇప్పుడు వెంకమ్మ కర్థమయింది. కనక ఆవిడ తన కొడుక్కేసి తిరిగి, "తల్లిలేని వెధవ నెందుకేడిపిస్తావురా? వాడి చేతికి ఒక్క రూపాయివ్వరా!.... ఏం, నాన్నా? మళ్ళీ రూపాయి నాన్నకియ్యి! ఏం?" అని రాజీ చెయ్యటానికి ప్రయత్నించింది.

"నువు కావలిస్తే వాణ్ణి ముద్దుచేసి పాడుచేసుకో. నేను వాడికి రూపాయలూ, అర్థరూపాయలూ ఇవ్వను. కిందటిసారి నే వద్దు అంటూంటే వాడిచేతికి రూపాయి నోటిచ్చావు. అడగగానే ఇవ్వనందుకు వాడు దాన్ని ముక్కలుచేసి పారేశాడు" అన్నాడు దాసు.

"ఎప్పుడో నా పుటకలకి ఒక రూపాయినోటు చించాడని ఎన్నిసార్లు చెప్తావురా, తల్లిలేని వెధవనూ! వెధవ రూపాయి! ఎన్ని రూపాయలు ఖర్చవు తున్నయ్యో!"

దాసు తల్లికేసి కళ్ళు పెద్దవిచేసి ఆశ్చర్యంతో చూశాడు. ఎంత ఆశ్చర్య పడకుండా ఉందామన్నా వెంకమ్మ ఉన్నట్టుండి దాసు చెవులు నమ్మలేని మాట ఏదో ఒకటి అంటుంది.

"ఖర్చా? రూపాయినోట్లు చించేసుకోవటమూ ఒకటేనా? నే నెవరనుకుంటు న్నావు? జమీందారు ననుకుంటున్నావా? నేను ఎంత మంచిగా, ఎన్నిసార్లు చెప్పినా నువు అర్థంచేసుకోకుండా ఉన్నావు. వాడు నా మనీపర్సుకోసం ఈసారి ఎగపడితే మక్కెలు విరగతంతాను. ఆ పని చెయ్యకపోబట్టే వాడట్లా గొంతుచించుకు ఏడుస్తు న్నాడు" అన్నాడు దాసు.

"పోనీరా, తల్లిలేని వెధవ! ఇంకోసారి అడగడులే. ఈ ఒక్కసారికి ఇయ్యి! ఒక్కరూపాయియ్యి.... ఏం నాన్నా? నోటు చించవుగదూ!" అన్నది వెంకమ్మ.

ఏడుపు మానేసి తండ్రి నాయనమ్మల సంభాషణ అతి శ్రద్ధగా ఆలకిస్తున్న గోపీ ఈ ప్రశ్నకు సమాధానం చెప్పలేదు సరికదా, సరేనని తల అయినా ఆడించ లేదు.

"చించనని వాడెందుకు చెబుతాడూ? నువ్వు వాడికి ఎన్ని వాగ్దానాలన్నా చేస్తావు. వాడు నీకు ఒక్క వాగ్దానం చెయ్యగా, నేనెన్నడూ చూడలేదు. అట్లావుంది మీ ఇద్దరిమధ్యా బలపరాక్రమాలు. నీ అసమర్థత ప్రతిక్షణమూ చూస్తుం డటం చేత వాడు అందరూ తనకు బలాదూరే ననుకుంటునాడు.... మాటిమాటికీ తల్లిలేని వెధవంటావెందుకూ— పది తల్లుల పెట్టుగా నువ్వుంటివిగా?" అన్నాడు దాసు.

"అయితే వాడిమొహాన ఆ రూపాయి కొట్టవుట్రా?" అన్నది వెంకమ్మ మళ్ళీ రౌద్రం తెచ్చుకుంటూ.

"నేను అర్థంలేని పన్లుచేస్తే కోప్పడాల్సినదానివి. నన్ను పిచ్చిపన్లు చెయ్యమంటా వేమిటమ్మా? పిల్లల్ని గారాబం చెయ్యటానికైనా హద్దూ పద్దూ ఉంటి" అంటూ దాసు అవతలికి వెళ్ళబోయినాడు.

"మా నాన్నగా! ఏడవకు. వెధవ రూపాయి నేనిస్తాలే. చిన్న వెధవ్ని ఎట్లా రంపపుకోత కోస్తున్నాడో! ఎందు కనుకోవడం. నీ గీత అట్టా రాసి పెట్టి ఉంది. నీ రాతే బాగుంటే నీ తల్లే బతికుండేది. నీ కష్టాలు చూడడానికే నాకింకా అయుర్దాయం యిచ్చాడు భగవంతుడు" అని మనవణ్ణి ఓదార్పుతున్న తల్లికేసి దాసు వింతమృగాన్ని చూసినట్టు చూసి, ఒక ముక్కుముక్కి అవతలికి వెళ్ళిపోయినాడు.

## 2

దాసు ఒకప్పుడు చాలా చురుకూ, దురుసుకూడా అయినవాడు. కాని పెళ్ళయి భార్య కాపరానికొచ్చి సంసార భారం మీదపడ్డ తర్వాత అతని దురుసుతనం చాలా తగ్గింది. ఉన్న ఊళ్ళోనే బడి పంతులుగిరీ సంపాదించటంతో క్రమంగా సాత్విక స్వభావం కూడా అలవడింది. అతనికిప్పుడు ఏ విధమైన సంఘర్షణ అన్నా ఏవగింపే.

చనిపోయిన దాసు భార్య అదొక రకం మనిషి. ఆమెకు అతిశయం జాస్తి. మనుషులంతా పురుగులన్న భావాన్ని ఆమె ఏదో విధంగా ప్రకటిస్తూ ఉండేది! డబ్బో, అందమో, తెలివితేటలో చూసుకున్న అతిశయమైతే సహించలేకపోయినా అర్థం చేసుకోవచ్చు. కాని మంగళాంబ అతిశయానికి ఎటువంటి ఆధారమూ లేదు. ఆమెకు ప్రపంచ జ్ఞానం దాదాపు ఏమీలేదు. ఆమె పుట్టింటివారు ఏనాడన్నా బాగా బతికారేమో గాని, దాసు పెళ్ళి అయేనాటికి పరమ దరిద్రులు. మంగళాంబకు భగవంతుడు కాస్త తెల్లతోలిచ్చాడు గాని, అందచందాలంటూ ఇవ్వలేదు. అయినా ఆమె ఎవరిలో ఏ విశేషం ఉందని తన ఎదురుగా ఎవరనుకున్నా, తడుపుకోకుండా, "ఏడిచారు! ఇటువంటి వాళ్ళను లక్షాతొంభైమందిని చూశాం!" అనేది.

మంగళాంబ కాపరానికి వచ్చిన తరవాత మొట్టమొదటిసారిగా దాసు తన తల్లిలో మార్పు గమనించాడు. ఆ మార్పు అతనికి నచ్చకపోయినా దానికి కారణం తన భార్యే అయివుంటుందని ఊహించి ఊరుకున్నాడు.

అత్తాకోడళ్ళకు నిత్యమూ జరిగే కీచులాట గోపి పుట్టిన తర్వాత ఘర్షణగా పరిణమించింది. అప్పుడు కూడా దాసు వాళ్ళమధ్య జోక్యం కలిగించుకోలేదు. వెంకమ్మ నలుగురు పిల్లల్ని కని పెంచినదైనా, మనవణ్ణి తన సొంతం చేసుకోవడా

నికి, వాడి పనులన్నీ తానే చెయ్యటానికి చంటిపిల్లలాగా ఉబలాట పడసాగింది. మంగళాంబ ఈ విషయంలో అత్తగార్కి ఆవగింజంత సందు కూడా ఇవ్వదలచ లేదు. ఎప్పుడూ పిల్లవాణ్ని అంటిపెట్టుక్కూచుని ఇంటిపని యావత్తూ ఎగగొట్టేది. అత్తగారు కోడల్ని పిల్లవాణ్ణి అంటిపెట్టుకున్నందుకు తిట్టలేక, ఇంటిపని చెయ్యలేదని తిట్టిపోసేది.

మంగళాంబ రెండో పిల్లవాణ్ని కన్న నెలరోజులకే చావటంతో, వెంకమ్మలో మరొక పరివర్తన వచ్చింది. ఈ పరివర్తనకు ఆధారమేమిటో దాసు బొత్తిగా ఊహించలేక పోయినాడు. అతనికి దయ్యాల్లో నమ్మకం వుంటే తన భార్య దయ్యమై తన తల్లిని ఆవహించిందనుకుని వుండేవాడే. వెంకమ్మ ఏ విచిత్ర మానసిక పరిణామంవల్లనో, ఏ తెలియరాని ప్రభావంచేతనో ఒక్కొక్కసారి అచ్చంగా మంగళాంబలాగా ప్రవర్తించేది. ఆమెలాగే మాటాడేది.

తన తల్లి మనస్తత్వం పూర్తిగా అర్థమైనట్టు దాసు ఎన్నడూ భావించలేక పోయినాడు. కాని ఆవిడ పెంపకంలో కొన్ని ప్రధాన లక్షణాలను మాత్రం అతను అర్థంచేసుకో గలిగాడు.

తన మనవడికి తనమీద ఏ మాత్రమూ గౌరవం లేకుండా చేసుకునేందుకు ఏయే పనులు చెయ్యాలో, ఏయే మాటలనాలో అవల్లా చేసేది; అనేది. అచ్చగా తనతో పోతే బాగుండును; గోపీకి తన తండ్రిమీదగాని ఇతర మానవుల మీదగాని ఈషణ్మాత్రమైన గురీ, నమ్మకమూ, గౌరవమూ లేకుండా చెయ్యటానికి ఆవిడ సర్వశక్తులూ ధారపోసింది. తను తప్ప మిగిలిన అందరూ గోపీకి అన్యాయమో, అపకారమో, హింసో చెయ్యటానికి సిద్ధంగా ఉన్నారన్న భావం ఆమె వాడికి కలిగించేది. వాడు ఇంకా ఏడవకముందే ఏడుస్తాడేమోనని విలవిల్లాడిపోయి నోటికి వచ్చిన వాగ్దానాలన్నీ చేసేది. దీని ఫలితంగా వాడు తప్పక ఏడిచేవాడు. తీరా వాడు ఏడుపు ప్రారంభించినాక, ఆవిడకు పూర్తిగా మతిపోయేది. ఆ యేడుపుకు ఎన్ని కారణాలూహించవచ్చో అన్నీ ఊహించేది—తానే కారణమన్నది మినహాగా! వాడిచేత ఏడుపు మానిపించటానికి ఎన్ని అగచాట్లన్నా పడేది.

నాయనమ్మ దౌర్బల్యం కనిపెట్టిన గోపీ ఆవిణ్ణి హిరణ్యాక్ష వరాలడిగేవాడు. వాడి ఏడుపు మానిపించటానికి మడి గట్టుకున్నది కాస్తా మైలపడేది. వాడు పారెయ్యమంటే తరుగుతున్న కూరలు అవతల పారేసేది. వండే అన్నం గంజి గుంటలోకి వంచేసేది. "నాన్న ఇంట్లో నుండి వెళ్ళిపోవాలి" అని ఒక్కోసారి గోపీ ఏడిచేవాడు. ఏ పనో చూచుకుంటున్న దాసును కాసేపు ఎటన్నా వెళ్ళిరమ్మని ఆవిడ బ్రతిమాలేది!

తల్లి మరీ అర్థంలేని కోరికలు కోరినపుడు దాసు విననట్టు నటించేవాడు. కాని ఆవిడ గోపీ ఏడుపు మానిపించటానికి వస్తువులు తానై పారేసినా, వాణ్ణి పారెయ్యనిచ్చినా ఊరుకునేవాడు కాడు.

"ఏమిటీ ముద్దు? నాకర్థం కావటంలేదు. అన్నీ డబ్బుపోస్తే వచ్చినవేనా?" అనే వాడు దాసు.

"ఓరి నీ డబ్బు దగ్ధమైపోనూ! చిన్న వెధవ, తల్లిలేని వెధవ, ప్రాణం కడబట్టేట్టు ఏడుస్తుంటే, డబ్బు డబ్బంటా వేమిరా?" అనేది వెంకమ్మ. దాసు నిర్ఘాంతపొయ్యేవాడు.

అదేం చిత్రమో గోపీ ఏడిచేటప్పుడు అది నిజమైన దుఃఖం అవునో కాదో, వాడికంట నీరున్నదో లేదోకూడా, వెంకమ్మ చూడలేకపోయేది. 'వాడి దగ్గిర ఆవిడ మెదడు లేనిదేకాక, గుడ్డిది కూడాను' అనుకునేవాడు దాసు.

గోపీ రాక్షసులమధ్య వున్న నిస్సహాయుడనీ, వాడికి తను ఒక్కత్తే రక్షకురాలననీ వెంకమ్మ భ్రమ. ఈ భ్రమకు ఆధారం ఏమీలేదు. గోపీ ఆవిడ ఊహించిన దానికన్న చాలారెట్లు మానసిక శక్తిగలవాడే. కనకనే వాడు ఆవిణ్ని చెవులకు పిడకలు కట్టి ఆడించేవాడు. ఆ సంగతి వెంకమ్మకు మాత్రమే తెలీదు. వెంకమ్మ అజ్ఞానాన్ని గోపీ పూర్తిగా వినియోగపరుచుకుంటూనే ఉండేవాడు.

తన తల్లిని గురించి దాసు అర్థం చేసుకోలేకపోయిన అనేక అంశాల్లో ఒకటేమిటంటే, వెంకమ్మ తన మనవఁడి చేత నానా మాటలూ పడటమేగాక తన్నులు కూడా తింటూఉండేది. వాడావిణ్ని గర్భశత్రువల్లే హింసించేవాడు. 'ఆవిడ ఇవన్నీ ఎందుకు సహిస్తుంది? ఎన్నాళ్ళు సహిస్తుంది? అకస్మాత్తుగా ఆవిడ సహనం అడుగంటితే వాడి గతేం కాను!' అని దాసు అనుకునేవాడు.

గోపీ, నాయనమ్మ ధర్మమా అంటూ సర్వస్వతంత్రుడు. వాడు కొండమీది కోతి కావాలంటే, నాయనమ్మ చేతిలో ఉన్నంతవరకు సాగేది. వాడి కిష్టం లేకపోతే మొహం కడుక్కునేవాడుకాదు, నీళ్ళు పోసుకునేవాడు కాడు. మాసిన గుడ్డలు మారుస్తానంటే నేలమీద పొర్లిగింతలు పెడుతూ, కాళ్ళు తన్నుకుంటూ ఏడిచి, ఉన్నగుడ్డలు మరింత మాపుకునేవాడు. వెంకమ్మ ఏ పనులు చెయ్యటం తప్పంటుందో ఆ పనులన్నీ వాడు విధిగాచేసి, ఆవిడమీద తన ఆధిక్యత ధ్రువపరుచుకునేవాడు. వాడట్లా చేసినప్పుడల్లా వెంకమ్మకు పరమానందమయ్యేది.

గోపీది కేవలం గృహసమస్య కాదు. వాడు ఇరుగు పొరుగువాళ్ళ ఇళ్ళకు వెళ్ళేవాడు. అక్కడ కూడా ఇంట్లో చేసినట్టే చేసేవాడు. పొరుగింటి పిల్లల్ని తన్ని యాగీలూ, పితూరీలూ తెచ్చేవాడు. మనవఁడి మీద ఏ పొరుగింటివాళ్ళు చాడీలు చెప్పినా ముసలావిడకు ఆగకుండా ఆనందం పొంగివచ్చి, "హోరి, అల్లరి వెధవా!" అని మనవఁడికేసి మెరిసే కళ్ళతో చూస్తూ బోసినోటికి గుడ్డ అడ్డం పెట్టుకునేది. అనవసరంగా ఇంట్లో గొంతెత్తిఏడిచే గోపీ, పొరుగింటి వాళ్ళెవరన్నా తన్నితే కిక్కురుమనేవాడు కాడు.

వెంకమ్మ తననూ, తన అన్ననూ, అక్కనూ, చెల్లెల్నీ ఎట్లా పెంచిందో దాసు ఎరుగును. ఆవిడ తన పిల్లల్ని చాలా భయభక్తులతో పెంచింది. అందర్నీ

చచ్చేట్టు కొట్టేది. గిరిగీసి గిరిలో కూచోపెట్టేది. అటువంటిది మనవడి విషయంలో ఇంత అన్యాయంగా ఎందుకు మారిందో దాసుకు అర్థంకాలేదు. ఆవిడ తనమీద కాస్త అపేక్ష చూపించి ఉన్నట్లయితే ఈ వృద్ధాప్యంలో మనవడికి బానిస అయ్యే గీత ఆవిడకు పట్టేదికాదేమో అని కూడా దాసు అనుకున్నాడు.

దాసు ఏమంత కలవాడు కాకపోయినా సొంత ఇంట్లో కాపరం చేస్తూ, ఉన్న ఊళ్ళో ఉద్యోగంచేస్తూ నెలకు నూటయాభై తెచ్చుకుని అందులో తృణమో పణమో వెనక వేసుకుంటున్నాడు. తన జీవితాన్ని నాలుగు వేలకు బీమా చేసుకున్నాడు. అది గాక ప్రావిడెంటు ఫండు కడుతున్నాడు. ఇంతలో అతనికి తగిలే పెద్ద ఖర్చేమీ లేదు. ఈ విధంగా అతని జీవితం ఒకదారి పట్టినప్పటికి తల్లిలేని తనపిల్లల సమస్య అతనికొక మనోవ్యాధిగా పట్టుకున్నది. ఈ సమస్య గురించి తాను ఏమీ చెయ్యటం లేదే, చెయ్యలేని స్థితిలో ఉన్నానే అన్న ఆవేదన సర్వకాల సర్వావస్థలలోనూ అతన్ని వెన్నంటి ఉంటూ, జ్వరపీడితుడి నాలుక చేదులాగా అతనికి జీవితంలో ఏ రుచీ లేకుండా చేసేసింది.

దాసు తన ఇద్దరు పిల్లల్ని చూసుకుని, "వీళ్ళు నా పిల్లలు" అన్న ఆనందం పొందలేకపొయ్యేవాడు. రెండోవాడు సత్యం విషయమై తానెన్నడూ అంతే బాధపడలేదు. వాడు పుడుతూనే తల్లి పోవడం ఒక కారణం కావచ్చు. అదీకాక వాడు బతికి బట్ట కడతాడన్న ఆశ దాసు ఎన్నడూ భావించలేదు. నెల రోజులు గుడ్డుగా ఉన్నప్పటినుంచీ వాడు డబ్బాలమీద పెరిగి, ఎన్నడూ రోగిష్టి గానే ఉంటూ వస్తున్నాడు. చిన్న పిల్లలకు వచ్చే రోగాలన్నీ వాడికి వచ్చాయి. లోక ధర్మాన్ని పాటించి దాసు వాడికి మందులిప్పిస్తూ వస్తున్నాడేగాని సత్యం ఎన్నడూ పూర్తి ఆరోగ్యంతో లేనే లేడు. ఇప్పుడు కూడా వాడు దాసు కళ్ళకు, రేపో ఎల్లుండో, వచ్చే మాసంలోనో, పై సంవత్సరంలోనో చావటానికి సిద్ధంగా ఉన్నట్లు కనబడేవాడుగాని, నిండు ప్రాణిగా కనిపించేవాడేకాడు. తియ్యకుండా జలుబూ, బానలాంటి పొట్ట, ఊచలవలె ఉన్న కాళ్ళూ చేతులూ, కళా కాంతిలేని ముఖమూ పెట్టుకుని సత్యం రెండేళ్ళ అర్థం వెళ్ళబుచ్చాడే గాని వాడి కిప్పటికీ నడకరాదు. మాటలు రావు. ఏడిస్తే కూనారిలాగా బలహీనంగా ఏడుస్తాడు. లేక పోతే అదీలేదు. గంటల తరబడి కూర్చున్న చోటు నుంచి కదలడు. కదలినా చాలా కొద్దిదూరం దేకుతూ జరిగి మళ్ళీ కూచుండి పోతాడు.

వెంకమ్మ పెంపకం క్రింద వాడు గాలికి పెరగడంచూసి వెంకమ్మ ఆశ్చ ర్యపడక పోయినా దాసు మాత్రం కొన్ని వేలసార్లు ఆశ్చర్యపడ్డాడు. ఆవిడ సత్యాన్ని పెంచిన పెంపకంలో నైపుణ్యం అట్టే లేదు. వాడు ఏడిచినప్పుడల్లా పాలు పట్టేది. వాంతులుగాని, తెల్లవిరోచనాలుగాని వస్తే రసం వేసేది. పెద్ద పెట్టున జ్వరం వచ్చినా దగ్గు వచ్చినా దాసుకి తెలిసిన వైద్యుణ్ణి పిలిచేవాడు. డాక్టరు మందులు పోసి పైరోగ లక్షణాలు తగ్గించేవాడు. గాని సత్యాన్ని

మామూలు పిల్లవాడల్లేచేసే వైద్యుడు ఇంతవరకు పుట్టనేలేదు. సత్యానికి అన్న ప్రాశన చేసిన తరువాత వెంకమ్మ వాడు ఏడవ కుండానే పొట్ట తడివి చూపి, వాడి కాకలి అయినట్లు తన దివ్యచక్షువుకు కనిపించినప్పుడల్లా అన్నమో, పంచ దారబిళ్ళలో, బాదంకాయ బిస్కట్లో, ఏమీ లేకపోతే విభూది గడ్డలో పెట్టేది. సత్యం దేకటం మొదలు పెట్టిన తరువాత నేలమీద ఏది దొరికితే అది ఏరి నోట పెట్టుకునేవాడు.

సత్యాన్ని పెంచటంలో తన తెలివితేటలన్నీ ఉపయోగించానని వెంకమ్మ మనస్ఫూర్తిగా నమ్మేది. తాను నమ్మటమేకాక అందరికి ఆ మాటే గర్వంగా చెప్పుకునేది.

"అమ్మ తల్లీ, వాడి తల్లి చనిపోయిన తరవాత ఆ నెర్నాళ్ళ గుడ్డును ఎంత జాగ్రత్తగా పెంచానో నాకు తెలుసు ఆ పరమాత్ముడికి తెలుసు ! లేకపోతే ఏనాడో పోవలసిన వాడేగా?" అనేది వెంకమ్మ అవకాశం దొరికినప్పుడల్లా అందరితోటీనూ.

ఏమైనా సత్యం విషయం దాసుకు చింతలేదు. వెంకమ్మకు అంతకన్నా చింతలేదు. వాడు బ్రతుకుతాడన్న ఆశలేదు. కనుక దాసు నిర్లిప్తుడుగా ఉండే వాడు. గొంతెత్తి ఏడవడు, కనుక వెంకమ్మ నిశ్చింతగా ఉండేది. ఇద్దరికీ గోపి దగ్గిరే ఎక్కడలేని వేదనానూ.

దాసు గోపి విషయంలో కూడా నిర్లిప్తత వహించుదామనుకునే వాడుగాని సాధ్యమయేదిగాదు. గోపి తనకళ్ళ ఎదుట మానసికంగా మట్టికొట్టుకు పోతుండటం దాసుకు కనిపిస్తూ ఉంది. తన తల్లి వాడిపట్ల ఎటువంటి అత్యాచారం చేస్తున్నదీ దాసు అర్థం చేసుకోగలిగేవాడు. అదీకాక గోపి విషయం కొన్నాళ్ళు కొన్ని ఆశలు పెట్టుకుని ఉన్నాడు. కొన్నాళ్ళపాటు వాడి అచ్చట్లూ ముచ్చట్లు చూశాడు. ఆనం దించాడు. వాడి శరీర మానసిక శక్తులు దిన దిన ప్రవర్ధమానమై వికాసం పొందటం గమనించాడు. అటువంటి ఏపుగా పెరిగే మొక్కను తన తల్లి మెలి పెట్టేసింది. తాను చాతగాని దద్దమ్మలాగా చూస్తూ ఊరుకోవలసి వచ్చింది. ఈ తన అసమర్థతను నిరాకరించకుండా ఉండలేక పోయినాడు దాసు.

## 3

పిల్లవాడి కాలేజీ చదువుకని దాసు అక్కగారు భాగ్యమ్మ వచ్చింది. ఆవిడ దాసుకన్న అయిదారేళ్ళు పెద్ద. ఎక్కడో రైలూ, బస్సూ, రహదారీ లేని మారు మూల పల్లెటూరిచ్చారు. ఆవిడకొక కూతురు, కొడుకూ కలిగారు. కొంతకాలం క్రిందట భర్త పోయినాడు. క్రిందటేడే ఆవిడ మరిది వేరుపడ్డాడు. భాగ్యమ్మ కొడుకు రంగయ్య స్కూలు చదువంతా హోటలు తిండితినే చదివాడు. మరిది

వేరుపడినాక పిల్లవాడు దగ్గరలేనప్పుడు తను ఇంకా ఆ పల్లెటూళ్ళో దేనికని భాగ్యమ్మ తన అల్లుడిదగ్గిరో, తమ్ముడి దగ్గిరో ఉండటానికి నిర్ణయించింది.

అసలు రహస్య మేమిటంటే భాగ్యమ్మ మొగుడు విలాసంగా తిరిగి అసలే అంతంత మాత్రంగాఉన్న ఆస్తిలో సగానికి సగం తగలేశాడు. భాగ్యమ్మ మరిది ఉద్యోగంచేస్తూ సంపాదిస్తూ ఆదుకోవటంచేత రంగయ్య స్కూలు చదువు ఏదో విధంగా సాగింది. ఇప్పుడేమో హైస్కూలు చదువును మించిన కాలేజీ చదువు వచ్చింది. అక్కడికి భాగ్యమ్మ మరిది సహాయం లభిస్తుందేమో అని ఒక రాయి విసిరి చూసింది. కాని ప్రయోజనం కలుగలేదు.

"ఏమయ్యా మరిదీ? పిల్లవాణ్ణి కాలేజీలో చేర్చమంటావా?" అన్నదావిడ.

"బోలెడంత ఖర్చవుతుందమ్మా వదినా, ఎక్కణ్నుంచి తెచ్చి పెడతావు ? అసలే ఉన్నది తిండికి చాలీచాలని స్థితిలో ! ఎక్కడన్నా పిల్లవాణ్ణి ఉద్యోగంలో ప్రవేశ పెట్టిచూడు" అన్నాడు మరిది.

భాగ్యమ్మకు సలహా అవమానకరంగా తోచింది. తన మరిది బియ్యే ప్యాసయినాడు. ఇటు తన అన్నా, తమ్ముడూ కూడా బియ్యేలే.

"ఏం? మధ్య నా కొడుక్కు మెట్రిక్యులేషనుతో చదువెందుకుకాపాలి?" అనుకున్నది భాగ్యమ్మ. చదువు చెప్పించే తాహతు తనకులేదని ఆవిడకు తెలీక కాదు. తనకు చేతకాని పనులు ఎవరిచేతన్నా చేయించటం భాగ్యమ్మకు అలవాటే. ఆవిడకి వైధవ్యం సంప్రాప్తించక పూర్వం ఎప్పుడన్నా పూలజడ వేసుకోవాలని బుద్ధిపుట్టినపుడు తన తోటికోడలుతో ఆప్యాయంగా మాట్లాడి ఆవిడచేత వేయించుకునేది. మిగతాప్పుడంతా ఆవిడకా తోడికోడలంటే చెప్పరాని అసహ్యం. కాని ఆవిడ పూలజడ వెయ్యటంలో మాత్రం సాటిలేనిది. ఎట్లా మరీ? అందుకని భాగ్యమ్మ మిగతా సమయాల్లో తోడికోడలంటే ఎడ మొగం పెడ మొగంగా వున్నా, పూలజడ వేయించుకోవలసి వచ్చినప్పుడు మాత్రం ఎంతోఆప్యాయంగా, ఎంతో ప్రేమాభిమానాలతో తోడికోడల్ని పలకరించేది.

తన కొడుకు కాలేజీ చదువుకయ్యేది ఎవరిచేత పెట్టించాలా అని ఆలోచన కలిగినప్పుడే భాగ్యమ్మకు దాసు స్ఫురించాడు. అయినా ఆవిడ తన అల్లుడికి కూడా ఒక "ఛాన్సు" యిద్దామని ఆలోచించక తప్పలేదు. అయితే అన్ని విధాలా అల్లుడుకన్న దాసే మెరుగనిపించింది. అల్లుణ్ణి ఉబ్బేయటం కష్టం. ఆ అబ్బాయికి సిగ్గో ఏమిటో, తనతో ఎన్నడూ మాట్లాడలేదు. ఏది కావలసినా, పెళ్ళాంతోనే చెబుతాడు. పైగా అతనికి నిలకడగా ఒక ఊళ్ళో ఉండే ఉద్యోగం కాదాయె. చీటికి మాటికి బదిలీ. నాలుగు రాళ్ళు తెస్తున్నాడు. ఇంతో అంతో పై సంపాదనా ఉన్నది గాని, తన వాళ్ళను కాదని అత్తగారివేపువాళ్ళకి మేపే ధైర్యసాహసాలు లేవు.

దాసుతో ఈ చిక్కులేవి లేవు. స్వతంత్రంగా ఏదన్నా అడగొచ్చు. ధర్మం ఆలోచించాలి; తను రావటంవల్ల దాసుకెంతో లాభం కూడానూ. తల్లి

పెద్దదయింది కదా ఒక్కత్తె ఎంతకాలం పనిచేస్తుంది; తను కొంత పనిచేసి పెట్టవచ్చు. దాసు పెళ్ళాం లేనేలేదాయె. ఆవిడ బ్రతికుంటే తినేతిండి తను తింటుందిగాని అంతకంటె ఎక్కువ తినదుకదా. పెళ్ళానికైతే చీరెలూ, పూలూ, నగలూ కొనాలి. తన కవేవీ అక్కర్లేదాయె. అందుచేత తను వెళ్ళటం దాసుకెంతో మేలు. వాడు మేస్టరుకూడానాయె. పిల్లవాడి చదువుకు చూస్తూచూస్తూ అభ్యంతరం ఏమని చెప్పగలడూ? పిల్లవాడు నెలనెలా మామకు ఉత్తరం రాసి డబ్బు తెప్పించు కుంటాడు. తన ప్రమేయమే ఉండదు. తను నోరుచేసుకుని అడగనే అవసరం లేదు.

"ఒరే దాసూ, నా పిల్లవాడు చదువుకోవాలని నాకొక్కదానికి తప్ప ఇంకె వ్వరికి లేదురా! వాడు మెట్రిక్యులేషన్ పాసయినాడని అందరికీ ఏడుపేగద: నువు బాగా చదువుకున్న వాడివి గనుక, అందులోను పిల్లలకు చదువు చెప్పే వాడివి కనక దాని విలువ నీకు తెలుస్తుంది మరి!" ఈ ముక్కలతో తమ్ముణ్ని ఉబ్బెయ్యటానికి భాగ్యమ్మ చాలా వందలసార్లు 'రిహార్సు' చేసుకుని మరీ వచ్చింది తమ్ముడింటికి.

అయితే దాసు పసివాడు కాడు. తన అక్క భాగ్యమ్మ అప్రయత్నంగా అనేమాటలేవో, వల్లెపెట్టే మాటలేవో అతనికి తెలిసిపోతూనే ఉండేది. కాని పైకి ఏమీ విమర్శించక పోవటంవల్ల, దాసును బుట్టలో వేసే పద్ధతులు తనకు తెలిసినట్లు మరెవరికి తెలియవని భాగ్యమ్మ భ్రమపడుతూ వుండేది. రంగయ్య కాలేజీ చదువు ఖర్చు తనచేత పెట్టించడానికి, తను ఇక్కడే ఉండిపోవడానికి అక్కగారు తలపెట్టిందని దాసు గ్రహించాడు. రంగయ్య జీతం ఖర్చు భరించటానికి దాసు కభ్యంతరం లేదు. కాని భాగ్యమ్మ తన ఇంట్లో ఉండటం దాసు కభ్యంతరమే. అయితే ఆ మాట పైకి అనటానికి లేదు. అక్కకు తిండి పెట్ట టానికి ఏడిచే పిసినికొట్టు కాడు దాసు. కాని ఎక్కడో గుంటూరులో ఉన్న కాలేజీలో కొడుక్కు చదువు చెప్పించటానికని తన అక్క మారుమూల పల్లెటూరు నుంచి వచ్చి మధ్య ఈ ఊళ్ళో తన యింట తిష్టవేయట మేమిటి? భాగ్యమ్మకున్నవి రెండు ఆశయాలు. ఒకటి కొడుక్కు అయ్యే చదువు ఖర్చు దాసుచేత పెట్టించటమూ, తన భారం తమ్ముడిపైన వెయ్యటమూనూ. ఈ రెండూ ఒకే ఆశయంక్రింద లోకానికి ప్రదర్శించాలనీ, ప్రదర్శిస్తున్నాననీ భాగ్యమ్మ ఉద్దేశ్యం. ఆవిణ్ని భరించటం కంటె ఆవిడ తలపెట్టే ఈ వంచనను సహించటం దాసుకు దుస్సహంగా ఉండేది. నిజానికి దాసు తన మేనల్లుడి హోటల్ ఖర్చులు పెట్టుకోలేడు. వాడు రోజూ సీజన్ టిక్కెట్టుమీద గుంటూరు వెళ్ళి రావలసిందే. కాని భాగ్యమ్మ ఇక్కడ లేకపోయినా వాడాపని చేయవచ్చును. తాను దగ్గిర ఉండి చూచుకోకపోతే వాడికి సరిగా జరుగుతుందో లేదో అన్న అనుమానం ఉంటేనే భాగ్యమ్మ ఇక్కడ తిష్టవెయ్యాలి: ఆవిడకు అటువంటి దుర్బుద్ధీ, దురాలోచనా ఉండటం కూడా దాసు భరించలేడు. అయినా

దాసు చేసేదేమి లేదు. తన సొంత తోబుట్టువును, నువ్వు మా యింట్లో ఉండటానికి వీలులేదు అని ఎట్లా అనటం?

# 4

కాలేజీలో చేర్చటానికి రంగయ్యను వెంటబెట్టుకొని దాసు గుంటూరు వెళ్ళాడు. దాసు తన కాలేజీ చదువంతా ఆ కాలేజీలోనే చదివాడు. ఏదన్నా బాధ కలిగినా బిడ్డకు తల్లి మొహం చూడగానే తనకు కలిగిన బాధయొక్క ప్రమాణం, ఒక్కసారిగా భూతద్దంతో చూసినట్లయి దుఃఖం పొంగిపొరలినట్లు ఇన్నేళ్ళకు ఈ కాలేజీ మొహం చూడగానే దాసుకు, ఈ మధ్య కాలంలో లోపించిన ఆనందం పెద్ద ప్రమాణంలా అతనికి తోచింది. ఏమంటే ఈ కాలేజీ వదిలే సమయానికి అతనికి ఇరవై నిండలేదు. అప్పటికింకా పెళ్ళాం కాపురానికి రాలేదు. కుటుంబ భారం పైన పడలేదు. ఉద్యోగపు కాడి మెడ ఎక్కలేదు. ఈ కాలేజీ ఆవరణలో అతను మిల్టన్,[1] షేక్స్‌ఫియర్, కార్లయిల్,[2] రస్కిన్[3] మొదలయిన గొప్ప

---

1. మిల్టన్ (1608-1674): జాన్ మిల్టన్ ప్రఖ్యాత ఆంగ్లకవి. ఒడంబడిక సిద్ధాంతం కింద దుష్ట పాలకుల్ని వురితీసే హక్కు ప్రజలకుందని భావించాడు. రిపబ్లికన్ తరహా ప్రభుత్వాన్ని కోరాడు. చర్చిపై విరుచుక పడ్డాడు. విడాకుల్ని సమర్థించాడు: విద్యావిషయాల్లో సంస్కరణను కోరాడు బైబిల్‌నుంచీ, దాని క్రైస్తవ, యూదు వ్యాఖ్యల నుంచీ, యితిహాసాలనుంచీ, కాల్పనిక యుగ యితివృత్త పాఠాంతరాల నుంచీ స్ఫూర్తి పొంది 'పారడైజ్ లాస్ట్' (1667) రచించాడు. యితర ప్రసిద్ధ రచనలు: 'పారడైజ్ రిగెయిన్డ్,' శాంసన్ అగొనిస్టెస్ (1671).
2. కార్లయిల్ (1795-1881): థామస్ కార్లయిల్ స్కాటిష్ వ్యాసరచయిత. చరిత్రకారుడు, ఆలోచనాశీలి 'ఫ్రెంచి విప్లవం' రచయితగా ప్రఖ్యాతుడు. వర్తమానంలోనూ, భవిష్యత్తులోనూ మార్గదర్శకంగా వుండేందుకు గతాన్ని నమోదుచేసేది, వ్యాఖ్యానించేది చరిత్ర అని కార్లయిల్ స్థూల దృక్పథం.
3. రస్కిన్ (1819-1900): జాన్ రస్కిన్ ఆంగ్ల కళా విమర్శకుడు. గొప్ప వచన రచయితగా ప్రసిద్ధుడు. యధాస్థితివాద కాల్పనిక దృక్పథం నుంచీ ధనస్వామ్య సమాజాన్ని, దాని నైతిక భ్రష్టతనూ, మత్స్యన్యాయాన్నీ విమర్శించినవాడు. ఆయన ముఖ్య రచనలు: మాడరన్ పెయింటర్స్, అయిదు సంపుటాలు (1843-60), ది స్టోన్ ఆఫ్ వెనిస్, మూడు సంపుటాలు (1851-53), లెక్చర్స్ ఆన్ ఆర్ట్ (1870).

తచయితల పరిచయం చేసుకున్నాడు. వారి భావాలూ, భాషా అతని బుద్ధిలో రక్తపు కాలువలలో కలసి ప్రవహించి ఏదో చైతన్యం కలిగించాయి. అతని చిత్త వృత్తి ఎన్నడూ నేలనంటక ఆ ఆకాశాన ఆదర్శ మేఘాలమీద పరుగెత్తింది. జీవితపు కుళ్ళు తాలూకు దుర్గంధం అంతగా అతనికి సోకలేదు.

పదిహేనేళ్ళకు మళ్ళా ఈ కాలేజీ ఆవరణలో నిలబడి అన్నీ చూస్తుంటే ప్రతి దృశ్యమూ తనను నిరసిస్తున్నట్లు కనిపించింది. ఆ గోడలూ, గదులూ, బల్లలూ మెట్లూ, ఆవరణ పచ్చిక కూడా ఒకప్పుడు తనతో స్నేహంగా ఉండేవి. ఇప్పుడవి తనను గుర్తుపట్టడం లేదనుకున్నాడు దాసు. "ఎవరు నువ్వు? ఇక్కడ నీకేం పని?" అని ఆ కాలేజీ తనను నిశ్శబ్దంగా ప్రశ్నిస్తున్నది.

'నేను దయ్యాన్నై ఈ కాలేజీకి తిరిగి వచ్చాను. దయ్యం కావడానికి మనిషి చచ్చిపోవాలా? పదిహేనేళ్ళ క్రితం ఈ కాలేజీ తనదల్లే తిరిగి, ఇక్కడ ఉండే విద్యార్థులూ, లెక్చరర్లూ తనవాళ్ళే నన్నట్టుగా తిరిగిన దాసు ఇప్పుడెక్కడున్నాడు? లేడు. నేనా దాసు తాలూకు భూతాన్ని—కాదు ఆ దాసే నా పాలిటి భూతం' అనుకున్నాడు దాసు.

అక్కడక్కడా కొందరు లెక్చరర్లు కనిపించారు. అనేక మంది విద్యార్థులు కనిపించారు. కానీ అన్నీ కొత్త మొహాలే. వాళ్ళు తనకూ కారు, తను వాళ్ళకూ కాడు.

"ఏంరోయి దాసూ ఇదేమిటి?"

తన నెవరో దయ్యం పలకరించినట్లుగా అయి దాసు వెనక్కు తిరిగిచూశాడు. తనవేపే వస్తూ లెక్చరరు వేషంలో ఉన్న మనిషి కనిపించాడు. ఆ మనిషిని దాసు గుర్తుపట్టలేదు. అతను దగ్గిరికి వచ్చి, "గుర్తుపట్టలేదురా? చలపతిని" అన్నాడు.

మరుక్షణం దాసు చలపతిని గుర్తించాడు. సామాన్యంగా అందరికీ మొహాన్ని బట్టే పూర్వపరిచితుడి పేరు జ్ఞాపకం వస్తుంది. ఏ కారణం చేతనో దాసు చలపతి మొహాన్ని పేరు వినేదాకా గుర్తించలేకపోయినాడు.

చలపతీ, దాసూ ఈ కాలేజీలోనే కలిసి చదువుకున్నారు. కాలేజీ వదిలేసినాక మళ్ళా ఒకరి మొహం ఒకరు చూసుకోలేదు. ఈ మధ్యకాలంలో చలపతి బాగా లావెక్కాడు. ముందు పళ్ళు అరిగిపోయాయి. మీసాలు సగానికి సగం మెరిసిపోయాయి.

"ఇక్కడికెట్లా వచ్చావు?" అన్నాడు దాసు.

"అది నేను నిన్నడగాలిసిన ప్రశ్న. నిన్నటి నుంచీ నేనిక్కడ ఉండే రైటు సంపాదించుకున్నా. నాకిక్కడ ఉద్యోగమయింది. నువ్వేమిటిట్లా వచ్చావు? వీడు మీ అబ్బాయా?" అన్నాడు చలపతి.

"లేదు. వీడు నా మేనల్లుడు. కాలేజీలో చేర్పిద్దామని వచ్చా" అన్నాడు దాసు.

"ఓ చిత్రం చెప్పనా? నీకు జ్ఞాపకముందా? కిందటిసారి మనం కలుసుకున్నప్పుడు దాదాపు ఈ వరండాలోనే ఇక్కడే కలుసుకున్నాం. చిత్రంగాలేదూ?" అన్నాడు చలపతి.

తానూ చలపతీ క్రిందటిసారి ఎక్కడ నిలబడి మాట్లాడిందీ దాసుకుమాత్రం జ్ఞాపకం లేదు. చలపతి "కోస్తు"న్నాడని కూడా దాసుకు అనుమానం కలిగింది. కాని నిరపాయకరమైన కోత కనక అభ్యంతరం లేదు.

చలపతి రంగయ్యకేసి చూస్తూ "మేనల్లుడేం? ఇచ్చి చెయ్యటానికి కూతుర్ని సిద్ధం చేశావా?" అన్నాడు. అతనీ ప్రశ్న సరదాకు అడిగినట్లు అడిగినా, పెళ్ళి చెయ్యవలసిన ఈడొచ్చిన చెల్లెలు తన గొంతుమీద ఉండటంవల్లా ఇప్పటికి రెండేళ్ళ నుండి ఆ పిల్ల పెళ్ళి చెయ్యటం తనకు సాధ్యం కాకుండా ఉండటం చేతా, అవకాశం దొరికినప్పుడల్లా ఇతరుల పెళ్ళిళ్ళ గురించి మాట్లాడేవాడు. ప్రతి ఆడపిల్లకూ ఒకే మేనరికం సిద్ధంగా ఉంటే జీవితం ఇంత దుర్భరం కాకపోనని చలపతి దృఢవిశ్వాసం. వివాహాల విషయంలో రక్తస్పర్శ కూడదని ఒకప్పుడు తానుకూడా విశ్వసించినవాడే. అయినా కొంత లోకానుభవం కలిగిన మీదట ఎంత సన్నిహితులై ఉంటే సంసారం అంత ప్రశాంతంగా ఉంటుందన్న నమ్మకం చలపతికి కుదిరింది.

"లేదు. ఉన్న పిల్లలిద్దరూ మగపిల్లలే. ఎందుకు బాబూ ఆడపిల్లలూ? అదృష్టవశాత్తు నేను తప్పించుకున్నానులే" అన్నాడు దాసు.

"అప్పడే ఏమయిందీ? ఇంకా అరడజను పిల్లలు పుట్టుకురావచ్చు. ముసలివాడివా ముతక వాడివా?" అన్నాడు చలపతి.

"అదికాదు మూడేళ్లు కావస్తున్నది—నా భార్య చనిపోయింది."

ఈ మాట వినగానే చలపతి మెదడులో మెరిసిన మెరుపు దాసు ఊహించలేదు.

"మరి మళ్ళీ పెళ్ళిచేసుకోలా?" అన్నాడు చలపతి.

"ఇంకా ఎందుకు? ౩౫ సంవత్సరాలు మీదపడితే" అన్నాడు దాసు.

"ముప్పయ్యయిదే మునిల్రటా? దాని దుంపతెగా! దానికేంగాని ఇప్పుడేం చేస్తున్నావు?"

"ఏదో మా ఊళ్ళోనే పంతులుగిరీ వెలిగిస్తున్నా, కిందటేడే సెకండసిస్టంటయినా" అన్నాడు దాసు చెప్పుకోకుండా ఉండలేక.

"ఇంకేం? అయినా నీకు ఉద్యోగం లేకపోతే మాత్రమేం? నా మాదిరిగా రెక్కలుమీద ఆధారపడ్డవాడివా ఏమన్నానా? హాయిగా కాలుమీద కాలేసుకూర్చుంటే మట్టుకు నిన్నడిగేవాడెవడు? అదుగో టైమయింది. నేను క్లాసు తీసుకోవాలి.

మీవాణ్ణి చేర్పించేసి నాకు కనిపిస్తావుకదూ? ఎన్నో ఏళ్ళకు కలిశాం. ఎన్నో విష యాలు మాట్లాడుకోవాలి" అంటూ చలపతి వెళ్ళిపోయాడు.

# 5

ఆ రాత్రి తాను గుంటూరులోనే ఉండిపోతానని దాసు కలలోకూడ అనుకో లేదు. సాయంకాలానికి తప్పక తిరిగి వస్తానని ఇంట్లో తల్లికీ, అక్కకూ చెప్పి వచ్చాడు. రంగయ్యకు కాలేజీలో సీటు దొరికింది. కనక ఉండవలసిన అవసరంకూడా ఏమీ లేదు. కాని చలపతి పోనిస్తేనా?

"నువు ఇవాళ మా యింట్లో ఉండి మరీ వెళ్ళాలి. నీ కోసం నీ భార్య కనిపెట్టుకునే మాటుంటే[1] నేనూ బలవంతం చెయ్యను. రేపు ఉదయం పదికిగద నీకు డ్యూటీ? తెల్లవారుజాము బండిలో నిన్ను పంపించే భారం నాది. ఇన్నేళ్ళకు మళ్ళా కనపడి నా ఆతిథ్యం నిరాకరించటం భావ్యంకాదు. నేనే మీ ఊరువచ్చి వుంటే వెళ్ళనిచ్చి వుందువా?" అని చలపతి గట్టిగా బలవంతం చేశాడు.

చలపతి అన్న మాటల్లోనూ, ప్రకటించిన ఆత్మీయతలోనూ తప్పుపట్టేందు కేమీ లేదు. చిన్ననాటి స్నేహితులు ఒకరిపట్ల ఒకరు అటువంటి భావాలు కలిగి ఉండటంకన్న కావలసిందేమిటి? కాని చలపతి మాటలు దాసుకు కించెత్తయినా ఆనందం కలిగించకపోగా, అవ్యక్తమైన ఆందోళన కూడా కలిగించాయి. దానికి కారణం దాసు ఒక్కడే తెలుసుకోగలడు.

చిక్కేమిటంటే, ఇంకొకరి చెవులకు ఎంతో స్నేహార్ద్రంగా వినిపించే చలపతి ఆహ్వానం, దాసు చెవులకు చాలా కృత్రిమంగానూ, కపటంగా కాకపోయినా అస్వా భావికంగానూ ధ్వనించింది. చలపతీ దాసూ స్నేహితులేగాని, చలపతి ఇప్పుడు నటిస్తున్నంత ఆప్తమిత్రులేంకారు. చలపతి దాసును "ఒరే"అని సంబోధించేవాడంటే, తనతో మాట్లాడటానికి ఒప్పుకున్న సహాధ్యాయులందరినీ "ఒరే" అనే సంబోధించే వాడు. దాసుకు చలపతికన్న దగ్గర స్నేహితులు చాలామంది వుండేవాళ్ళు. చలపతికి దాసుకన్న పూసుకుతిరిగేవాళ్ళింకా ఎక్కువమంది ఉండేవాళ్ళు. చలపతీ దాసూ కలిసి ఒక జోడు యెన్నడూ కాలేరు. "నేను మీ ఊరువస్తే నన్ను పోనిస్తావా?" అని చలపతి అన్న తరువాత దాసు నోరు కట్టుబడ్డదన్న మాటేగాని, బహుశా చలపతికి తాను ఆతిథ్యం యిచ్చి వుండేవాడిని కానని దాసుకు తెలుసు.

చలపతి తమ స్నేహాన్ని ఉన్నదానికన్న ఎక్కువ చేస్తున్నాడని తెలిసికూడా దాసు, అతనికి ఆరోపించేటందుకు దురుద్దేశాలేమి కనిపించని కారణంచేత, మొహ

---

1. నాల్గవ అధ్యాయం చివర్లో తన భార్య చనిపోయి మూడేళ్ళు కావస్తున్నదని చలపతితో దాసు చెప్పాడు.

మాటపడి చలపతి కోరికను మన్నించి ఆ రోజు వాళ్ళ అతిథిగా ఉండిపోయినాడు. అందువల్ల తనకు కలిగిన నష్టమేమీలేదు.

సాయంత్రం పెందలాడే స్నేహితులిద్దరూ చలపతి ఇల్లు చేరారు. వాళ్ళ ఇంటో అడుగు పెట్టుతూనే దాసు తన స్నేహితుని పిల్లలిద్దర్నీ చూసి భరించరాని అసూయకు గురి అయినాడు. ఇద్దరూ ఆడపిల్లలే. అయితేనేం? చక్కగా తలలు దువ్వుకుని, రిబ్బనులు పెట్టుకొని, మొహానికి స్నో పౌడర్లు వేసుకుని బొట్టుపెట్టుకుని అందమైన దుస్తులు ధరించి బొమ్మలల్లే ఉన్నారు. ఒక పిల్ల వరండాలో కొయ్య గుర్రం మీద ముందుకూ వెనక్కూ వూగుతున్నది. రెండో పిల్ల ట్రైసైకిల్ ఎక్కి గుర్రం చుట్టూ తిరుగుతూ ఆడుతున్నది. మొదటి పిల్లకు నాలుగో ఏడుంటుంది. రెండోపిల్లకు ఆరేడేళ్ళు ఉండవచ్చు. సంసార సుఖం మూర్తీభవించినట్టు కనిపించారు ఆ పిల్లలిద్దరూ. ఎందుకంటే మహాకవి వాక్యం లాగా వాళ్ళిద్దరూ, ప్రత్యక్షంగా కనిపించే విషయాలుగాక ఇంకా ఎన్నో సంగతులు స్ఫురింపచేశారు. ఆ పిల్లలు ఆనందంగా, అందంగా, ఆరోగ్యంగా ఉన్నారంటే అది కేవలం పూర్వజన్మ సుకృతం వల్లనే అయివుండదుగా! ఒకవేళ అయినా ఆ పూర్వజన్మ సుకృతం చలపతి భార్య రూపంలో వాళ్ళను కనిపించమంటూ జరుగుతున్నదిగా? ఆవిడ తన ఈ పిల్లలకు ఎటువంటి ఆనందమైన వాతావరణం కలిగిస్తే వీళ్ళు ఇట్లా చూడముచ్చటగా ఉన్నారో దాసు ఊహించుకున్నాడు.

"వీళ్ళు నా ఇద్దరు కూతుళ్ళూనూ, పెద్దది జానకి, మా అమ్మ పేరు. రెండోది శకుంతల. శకుంతల అనే పేరు పాత పేర్లలో నాజూకైంది. ఏమంటావు? మా ఆవిడ కొత్తరకం పేర్లు పెట్టమంటుంది. పాత పేర్లలో ఎంతో అందమైనవి ఉన్నాయి" అని చలపతి చెబుతూ దాసును తన గదిలోకి తీసుకుపోయినాడు.

"అన్నయ్యా, కాఫీ కావాలా?" అని ఇంట్లోనుంచి చలపతి చెల్లెలు రాజ్యం కేకేసింది.

"ఇస్తే ఎందుకక్కర్లేదే? ఇద్దరం ఉన్నాం, త్వరగాచేసి పట్రా" అన్నాడు చలపతి.

కాఫీ వచ్చేదాకా చలపతి మాట్లాడుతూనే ఉన్నాడు. తన పెళ్ళిని గురించీ, తన అత్తవారిని గురించీ, తను చేసిన ఉద్యోగాలను గురించీ, సినిమాలను గురించీ కూడా చలపతి విరామం లేకుండా చెప్పుకుపోసాగాడు. ఇదీ దాసుకు మేలే అయింది. చలపతితో తన స్వంత విషయాలు మాట్లాడాలన్న ఇచ్ఛ ఎంత తెచ్చిపెట్టుకుందామన్నా దాసుకు కలగలేదు.

పావుగంట సేపట్లో రాజ్యం రెండు వెండి లోటాల్తో కాఫీ తెచ్చి ఇచ్చింది.

"ఇది మా చెల్లెలు రాజ్యం. ఇంటరు పాసై చదువు చాలించి కూర్చుంది. పెళ్ళి చెయ్యాలి. ఇరవై ఒకటి వెళుతుంది. కాని మనస్సు సరిపెట్టుకునే సంబంధం ఒకటీ రాలేదు. సంకురమయ్య కట్నాల మీదిగా పోతున్నాడు. బక్కవాళ్ళం. వేలకు వేలు ఎక్కణ్ణుంచి తేగలం? ఇంకో సంవత్సరం చూసి పెళ్ళి చెయ్యకపోతే ఏ నర్సుగానో, పంతులమ్మగానో పంపిస్తా. పెళ్ళికాని మగవాళ్లుండగా పెళ్ళికాని ఆడవాళ్ళెందుకు ఉండగూడదూ? ఏమంటావ్?" అన్నాడు చలపతి.

దాసు రాజ్యాన్ని ఎగాదిగా చూశాడు. ఆ పిల్ల ఏమంత ఆకర్షవంతంగా లేదు. ఏ పత్రిక తిరగవేసినా అందమైన సినిమా తారలు కనిపించే ఈ కాలంలో. కుర్రాళ్ళు అందగత్తెల్ని తప్ప చేసుకోరేమోనని దాసు ఊహించుకున్నాడు.

"పంచదారగాని డికాషన్‌గాని కావాలేమో చూడన్నయ్యా? మీకండీ?" అని అడిగింది రాజ్యం.

దాసు తనకేమీ అక్కర్లేదన్నాడు. చలపతి మాత్రం డికాషన్ వేయించుకుని, తరువాత అది జాస్తిఅయిందని పాలుతెప్పించుకుని, రెంటి మధ్యా చక్కెర తక్కువ కావటంచేత చక్కెర కూడా వేసుకున్నాడు.

"ఇంత ఆర్భాటం చెయ్యకపోతే ఇంకొంచెం కాఫీ పొయ్యమనగూడదూ?" అన్నది రాజ్యం. చలపతి నవ్వి ఊరుకున్నాడు.

"మీ కింకొంచెం కాఫీ పట్టానండీ?" అని అడిగితే అక్కర్లేదన్నాడు దాసు.

"మొహమాట పడుతున్నట్టున్నారు" అన్నది రాజ్యం.

"లేదు, లేదు" అన్నాడు దాసు.

"కాఫీ రుచించలేదేమో?"

"కాఫీకేం? చాలా బాగుంది" అన్నాడు దాసు.

"అయితే కొంచెం తెస్తా" అంటూ రాజ్యం లోపలికి వెళ్ళింది.

దాసుకొక అనుమానం కలిగింది. పెళ్ళాలదగ్గర ధాష్టీకం చెయ్యగల మగాళ్లు పరస్త్రీల దగ్గర— ముఖ్యంగా కాస్త చదువుకున్న వాళ్ళ దగ్గర, నోరు కట్టుపడి వాజలల్లే ఎందుకవుతారు? తాను రాజ్యంతో మాట్లాడినవి మూడేమాటలు. కాని ఈకాస్త సంభాషణలోనూ తనవంతు బలహీనంగానూ, ఆమెవంతు దృఢంగానూ ఉన్నట్టు దాసుకు తోచింది. అతను మారు మాటాడకుండా ఆమె మళ్ళా తెచ్చిఇచ్చిన కాఫీ తాగాడు.

## 6

దాసు రాత్రికి భోజనాని కుంటున్నాడని ఇంట్లో చెప్పి చలపతి దాసుతో

సహా గుర్రబ్బండి యెక్కి 'రెబెకా'[1] సినిమా చూడడానికి బయలుదేరాడు.

చలపతి అదివరకే లోపలికి వెళ్ళి, దానుకు రాజ్యాన్ని ఇవ్వటం గురించి ఆలోచించండని ఆడవాళ్ళతో చెప్పి ఉండటంచేత, వంట ఇంటో చలపతి తల్లీ, భార్యా, రాజ్యం చిన్న మీటింగు చేశారు.

"ఏఁవే అమ్మాయ్? నువు చూశావుగా, ఎట్లా ఉన్నాడూ?" అన్నది రాజ్యం తల్లి.

"ఏమో, నాకేమీ తెలియలా. ఆయనకు నలభై ఏళ్ళన్నా ఉండవూ?" అన్నది రాజ్యం చప్పచప్పని గొంతుతో.

"ఛీ పాపం! మీ అన్నయ్యతో కలిసి చదువుకున్నాట్ట! నన్నడిగితే మీ అన్నయ్యకన్న చూడటానికి చిన్నగానే కనిపిస్తాడు" అన్నది చలపతి భార్య.

"ఏమిటో! ఈ రోజుల్లో ఇట్లా ఉందిగాని, మా చిన్నతనంలో ముప్పయేళ్ళ వాడికి మూడేళ్ళ చిన్నదాన్నిచ్చి చేసేవారు" అన్నది రాజ్యం తల్లి.

"ఆడవాళ్ళా కాలంలో అంత దిక్కులేని పశువులన్నమాట.... ఈయనకు రెండో పెళ్ళేకాక ఇద్దరు పిల్లలు కూడాటగా? ముసలి మొగుణ్ణి చేసుకోవటం ఒకెత్తూ, సవిత్తల్లి అనిపించుకోటం ఒక ఎత్తూనూ" అన్నది రాజ్యం.

చలపతి భార్య ఏమాత్రమో సాధింపు గొంతు పెట్టి "పోనిస్తూ తల్లీ, కొండ మీద కోతికావాలని అందరికీ ఉంటుంది. కాని మన తాహతూ, మనకున్న లొట్టలూ కూడా కాస్త చూసుకోవాలా? మంచి సంబంధం తీసుకురావాలని కాదూ, మీ అన్నయ్య యీ మూడేళ్ళ నుంచీ నానా హైరాన పడుతున్నది? మనదాకా రాకుండా ఆయన యెన్ని సంబంధాలు తిప్పికొట్టలేదు? ఆయనకి సంబంధం మంచిదని తోచబట్టేగద మనతో చెప్పారు" అన్నది.

ఆ తరువాత రాజ్యం ఈ విషయంలో నోరు విప్పలేదు. కాని ఈ సంబంధం ఆమె కిష్టంలేదు. తన పెళ్ళి విషయమై తన అన్న అన్యాయం చేస్తున్నాడని ఆమె నమ్మకం. ఆయన సరియైన ప్రయత్నం చెయ్యలేదు; చేస్తే యింతకన్న మంచి సంబంధం రాకపోదు. తన వదినగారు చెప్పటానికేం? పెళ్ళిళ్ళు తాహతుకూ, లోటుపాట్లకూ తగినట్టు తూకంగా ఎక్కడా జరగటం లేదు. ఎంతో అందమైన భర్తలకు కోతుల్లాంటి పెళ్ళాలు దొరుకుతున్నారు. కట్నాలివ్వలేని వాళ్ళకు కూడా నిక్షేపమంటి మొగుళ్లు దొరుకుతున్నారు. రెండో పెళ్ళివాణ్ణి చేసుకోటానికి తన ఖర్మేం కాలింది? తనను చూస్తే తన వదినెకి ఓర్చలేనితనం. తను పెద్ద చదువు చదువుకుంటున్నందుకెంత ఏడుచుకున్నదీ? 'ఎందుకీ చదువు? పొయ్యిదగ్గర వంట చెయ్య

---

1. రెబెకా : హాలీవుడ్ థ్రిల్లర్స్ దర్శకుడు ఆల్ఫ్రెడ్ హిచ్‌కాక్ దర్శకత్వంలో 1940 లో వెలువడిన చిత్రం. డాఫ్నే ద మారియా నవల ఆధారం. ఇతివృత్తం మనస్తత్వ రహస్య బోధన ప్రధానం.

టానికీ, పిల్లల్ని కనటానికి ఇంత డబ్బు ధారపోసి చదువుకోకపోతేనేం?' అని ఆవిడ ఎన్నిసార్లు ఉపన్యాసాలివ్వలేదు. ఇప్పుడు తనకు మంచి సంబంధం దొరకటం కూడా ఆవిడకిష్టం లేదు. ఆవిడమాత్రం తనకన్న నాలుగేళ్లు పెద్దవాణ్ణి చేసుకుందిగా? తనకు పధ్నాలుగేళ్లు పెద్దవాడు మొగుడైతే ఆవిడదేం పోయిందీ?

తెలివితేటలూ, చదువుసంధ్యలూ, కాస్త ప్రపంచజ్ఞానమూ, ఆలోచనాశక్తి ఉండటంచేత రాజ్యం ఈ విధంగా ఆలోచించగలిగిందేగాని, ఆమె తిరుగుబాటు చెయ్యటానికి ఏ మాత్రమూ సంసిద్ధంగా లేదు. హక్కులను తెలుసుకునే శక్తి వున్నంత మాత్రాన వాటికోసం పోరాడే శక్తి ఉన్నట్టుకాదు. మధ్యతరగతిలో చాలామందికి, తాము అన్యాయానికి గురి అవుతున్నామని తెలుసుకోవడమూ, తమ్ము చూసి తాము జాలిపడటమూ ఒక పరమార్థం.

రాజ్యం ఆ స్థితిలోనే ఉంది. నిజంగా తన అన్నా, వదినే, తల్లీ కలిసి ఒక బర్రె గుంజను పెళ్ళాడమంటే, ఆమె తనకు జరిగే ఘోర అన్యాయాన్ని నివారించే శక్తి భూప్రపంచంలో ఎక్కడా లేదుగదా అన్న 'గొప్ప'తో సంతృప్తిపడి వాళ్ళ నిర్ణయాన్ని శిరసావహించ సిద్ధంగా ఉన్నది.

మంచి సాహిత్యం అంతో ఇంతో చదివి వున్నది కనక రాజ్యానికి ఆత్మవిమర్శన చేసుకోటానికి ప్రయత్నించే అలవాటున్నది. ఆత్మవిమర్శన చేసుకోవాలని బుద్ధిపుట్టినప్పుడు తన పెళ్ళిని గురించి వాస్తవిక దృష్టితో ఆలోచించటానికి ప్రయత్నించేది. ఈ దృష్టితో చూస్తే తన అన్న పెళ్ళికి యెక్కువ ఖర్చు చెయ్యలేడు. 'చౌకబారు' పెళ్ళి తన నుదుట రాసిపెట్టి వున్నదనుకోవలసిందే. అయితే కట్నం తీసుకోమనే సంస్కారుల్లో యెంతో మంచి యువకులుండవచ్చు. కాని అది నూటికి కోటికి జరిగే సంఘటన. అంత అదృష్టం తన కుంటుందను కోరాదు— దానంతట కలిగితే సంతోషించాలే గాని, అదృష్టం ఏ మాత్రమూ లేదు అపూర్వ వ్యక్తులలో తాను ఒకతెననీ రాజ్యానికి 'గర్వం'.

ఇవాళ రాజ్యానికి ఆత్మవిమర్శ చేసుకోబుద్ధి పుట్టింది. పరిస్థితులతో సంఘర్షణ పెట్టుకోదలచిన వాళ్లు సాధారణంగా ఆత్మవిమర్శనకు పూనుకోరు. పరిస్థితులతో రాజీ పడేవారే తరచు దానికి సిద్ధపడతారు. కనీసం రాజ్యం అలవాటు అంతే. ఇదే దాసు నవయువకుడై వుండి, ఏ బడిపంతులో కాక, కళాకారుడో, నటుడో అయివుండి, అతన్ని పెళ్ళాడే అవకాశం తనకు — అందుబాటులోకి వచ్చి వుంటే రాజ్యం, 'నేనతని భార్య కాదగుదునా?" అని ఆత్మవిచారణలో పడేది కాదని మనం భావించుకోవచ్చు.

రాజ్యం ఈ సంబంధంలో వున్న కష్టనిష్ఠురాలు బేరీజు వేసుకున్నది ముందు. దాసు కనీసం ముప్పైఐదేళ్ళ వాడు. ఒక భార్యతో కనీసం పదేళ్ళు కాపరం చేసినవాడు. ఇద్దరు పిల్లలున్నారు. తన సంసారం ఈ ఇద్దరు సవతిపిల్ల

లతోనూ ప్రారంభ మవుతుంది. ఇదిగాక అత్తగారొకతె ఉన్నది ! కోరంటికం ఉంటుంది.

వీటన్నిటికీ తన మనస్సును సమాధాన పెట్టుకోవటం సాధ్యమా అని రాజ్యం ఆలోచించింది. ప్రయత్నిస్తే అసాధ్యమేముంటుంది గనకా? అందులోనూ భావ ప్రపంచంలో ! తనకూ దాసుకూ పధ్నాలుగేళ్ళ తేడా వుంటేనేం ? 'టాల్‌స్టాయ్'[1] కంటే ఆయన భార్య పద్దెనిమిదేళ్ళు చిన్నది. ఇటీవల చార్లీచాప్లిన్[2] చేసుకున్న భార్య అతనికంటే ఏనలభైయేళ్ళో చిన్నది. ఈ దాసు ప్రఖ్యాత పురుషుడైతే, ఇతని పేరూ, ఫోటో పత్రికల్లో పడితే పోనీ అనుకోవచ్చు. కాని ఈ బడిపంతులు అనామకుడు. అదే వచ్చిన చిక్కు!.... కొంచెం వయసు ముదిరిన వాడు, చిన్న పెళ్ళాన్ని కాస్త గారాబంగా చూస్తాడంటారు. ఇంకో చిత్రమేమి టంటే, తనతో కాలేజీలో చదివిన అమ్మాయిలు కాలేజీ లెక్చరర్లమీద మనస్సు పోయినట్టు బహిరంగంగా చెప్పేవాళ్ళు. తను చెప్పేది కాదుగాని తనకూ్కూడా, వయసుతో ప్రమేయం లేకుండా అనేకసార్లు నడివయసువాళ్ళమీద మనస్సు పోయింది— ఈ దాసుకంటె పెద్దవాళ్ళమీదనే. అటువంటప్పుడు పెళ్ళిచేసుకోవట మనగానే గొంతు పట్టుకుంటుందేం?

ఈ సందేహానికి రాజ్యం రెండు సమాధానాలు చెప్పుకున్నది. ఆడదాని మనస్సు ఉట్టిపుణ్యానికి ఏ ముసలి వాడిమీదికో పోదు. వయస్సును లెక్కలోకి రానీయకుండాచేసే శృంగార కారణం ఏదన్నా ఉండాలి—అందమో, తెలివితేటలో, గొప్పతనమో. రెండో సంగతేమిటంటే, తను ఏదో కథలో చదివినట్టు, ప్రేమించ టానికి పనికివచ్చే వాళ్ళంతా పెండ్లాడటానికి పనికిరావలసిన అవసరం లేదు.

---

1. టాల్‌స్టాయి : చూ. పుట. 133. ఈ సందర్భంగా ఆయన భార్య సోఫీ అంద్రియేవ్ నాబెర్స్ ప్రస్తావన.

2. చార్లీచాప్లిన్ (1869–1975): ప్రపంచ విఖ్యాత చలనచిత్రనటుడు, మూకాభినయవేత్త, ప్రౌఢన్యాసరు, దర్శకుడు, చాప్లిన్ సినిమాల్లో హాస్య కరుణ రసాలు సమ్మిళితమైన నిశితసమాజ విమర్శ వుంటుంది. "చాప్లిన్ చిత్రాల ద్వారా సాంఘిక వ్యవస్థను విమర్శించుతాడే కాని ప్రపంచానికి రాజకీయ ప్రణాళిక లివ్వడని" ఒకచోట కొడవటిగంటి కుటుంబరావు రాశారు. 1925-47 మధ్య "కిడ్", "గోల్డ్‌రష్", "సర్కస్", "సిటీలైట్స్", "మోడరన్‌టైమ్స్", "గ్రేట్ డిక్టేటర్", "మాన్షుర్‌వెర్డ్" సుప్రసిద్ధ చలన చిత్రాలు తీశాడు. ఇందులో ఎక్కువ భాగం మూకీలే. కమ్యూనిస్టుల సానుభూతి పరుడనే నెపంతో అమెరికన్ ప్రభుత్వం చాప్లిన్‌ను వేధించింది. చార్లీచాప్లిన్ నాల్గవ భార్య ఊనా ఓనీల్ కావచ్చు.

సర్కస్‌లో హారిజాంటల్ బార్‌మీద మొగ్గలు వేసేవాళ్ళమీద మనస్సు పోతుంది. కాని వాళ్ళని పెళ్ళాడతారా....?

అకస్మాత్తుగా రాజ్యాని కొక విషయం తట్టింది— దాసు అందగాడు. ఈ విషయం తను మొదట అతన్ని చూసినప్పుడే గ్రహించింది. కాని తన అన్న పెళ్ళి ప్రస్తావన తెచ్చిన క్షణంనుంచీ ఆ సంగతి మరిచిపోయింది. ఈ దాసుకన్న అందమైనవాళ్ళు, తాను చూసినవాళ్ళు ఎందరున్నారా అని లెక్కవేయ నారంభించింది. తనను పెళ్ళిచేసుకోదగిన స్థితిలో ఉన్నవాళ్ళు ఒక్కరూ జ్ఞాపకానికి రాలేదు.

అతనికి పిల్లలున్నారంటే ఉండనీ, తనకు పిల్లలంటే ఇష్టం. పిల్లలకు తనంటే ఇష్టం. తన అన్నకూతుళ్ళను రోజల్లా పోషణ చెయ్యటంలా? వాళ్ళకు తను తల్లి అయిందా ? తనమీద పిల్లలకు ఎక్కువ ఇష్టమని తన వదినెగారు ఏడుచుకోవటంలా? వీలుచిక్కినప్పుడల్లా వదినెగారు సూటిపోటి మాటలని కోరంటికం పెట్టటంలా? తాను మళ్ళీ ఇదంతా అన్నతో అన్నదనీ, ఒకవేళ అన్నా మొగుణ్ణి తన గుప్పిట్లో పెట్టుకున్నారనీ దిలాసా చూసుకునా!

దాసును పెళ్ళాడటంవల్ల తన జీవిత సమస్య ఒకటి తేలిపోయి, తన అన్నకు భారం తీరిపోవటమేగాక తన జీవితంలో కోరతగని మార్పులేవీ రావని రాజ్యం తేల్చేసుకుంది.

# 7

"రెబెకా" చూసి దాసూ, చలపతీ ఇంటికి బయలుదేరారు. దాసుతో మాట్లాడవలసినది చాలా వుండటంచేత చలపతి బండి ప్రమేయం ఎత్తలేదు. ఈ "రెబెకా" చిత్రం పునాదిమీదే చలపతి తన తంత్రం నిర్మించాడు. అది అతనికి దైవికంగా దొరికింది. రెండురోజులక్రితం తాను ఆ సినిమా చూశాడు. కాని ఆ విషయం దాసుతో చెప్పలేదు. చెబితే పాచిక పారదు.

"ఒరే దాసూ, ఈ పిక్చరుచూస్తే నాకో ఆలోచన తోస్తున్నది" అన్నాడు చలపతి.

పిక్చరు చూస్తూండగా ఆ ఆలోచన దాసుకూ తోచింది. కాని అతను "ఏమిటది?" అన్నాడు.

"నేను మా రాజ్యం పెళ్ళికి ఇన్నాళ్ళు ఇన్ని కష్టాలు పడ్డానుగాని, యోగ్యుడైన రెండోపెళ్ళి వాడి కివ్వొచ్చునని తట్టలేదు సుమా!" అన్నాడు చలపతి.

చలపతి మాటలో దాసుకు విశ్వాసం అణుమాత్రమూ లేదు. అయినా పైకి "చూస్తూ చూస్తూ నిక్షేపంలాంటి పిల్లను రెండోపెళ్ళివాడి కెందుకూ ఇవ్వటం ?" అన్నాడు.

"ఏం ఇస్తే? కొంప (మునిగి) పోతుందా ఏమిటి ? మనం ఈ దిక్కు-మాలిన చదువు చదివి కొత్త మూఢవిశ్వాసాలు నేర్చాం— ఇంగ్లీషువాళ్ళకూ్కడా లేనివి. ఇప్పుడు చూసిన పిక్చర్లో రెండో పెళ్ళివాడికి, చిన్నపిల్లకూ ఎటువంటి ప్రేమ చూపారో చూడు!" అన్నాడు చలపతి.

"పుస్తకాల్లో రాయటానికీ సినిమాల్లో చూపటానికీ ఏంలే ? నువే ఆడదానివై వుంటే నీకంటే రెట్టింపు వయసు వాణ్ణి చేసుకుంటావా?" అన్నాడు దాసు.

"అట్లా చెప్పకు మరి, నా పదిహేడోయేట నేను సరిగా నాకు రెట్టింపువయసు దాన్ని ప్రేమించా."

"అప్పుడామెను నీకు పెళ్ళిచేస్తే తెలిసేదే ఆ ప్రేమ ఏమిటో" అన్నాడు దాసు కాస్తయినా కలిసిరాకుండా.

"మనం ఇప్పుడు చేసే పెళ్ళిళ్ళకన్న భ్రమతో కూడుకున్న ప్రేమ వివాహాలే నయం. కొన్నాళ్ళయినా ఆ భ్రమ నిజమైన ఆనందం ఇస్తుంది" అన్నాడు చలపతి కేవలం వాదన కోసం.

"పోనిస్తూ, మనం ఇప్పుడు ఎవరికి ప్రేమ వివాహం చెయ్యగూచున్నాం?" అన్నాడు దాసు.

ఇద్దరూ కాసేపు మౌనంగా నడిచారు.

"అందుకని?" అన్నాడు చలపతి తనలో అనుకుంటున్న మాటలు ఆకస్మికంగా దాసుకు వ్యక్తంచేస్తూ. "నీకూ రాజ్యానికి పెళ్ళిచేస్తే దివ్యంగా ఉంటుందేమో అని ఆలోచిస్తున్నా!"

చలపతి మనసులో ఉండే ఈ ఆలోచనను అదివరకే ఊహించిన దాసు మర్యాదకోసం "నాకూ మీ చెల్లెలికీనా!" అని ఆశ్చర్యం నటించాడు. చలపతి నటన దాసును నమ్మించలేదు గాని, దాసు నటన చలపతిని నమ్మించింది; దాసుకు ఆట్టే ఆలోచించే వ్యవధి ఇవ్వకుండా ఊదరపెట్టేసి, ఇప్పుడే సరేననిపిద్దామన్న ఉద్దేశంతో చలపతి రాజ్యం గుణగణాలు ఏకరువు పెట్టసాగాడు.

"ఒరే నువు మా రాజ్యాన్ని బాగా ఎరగవుగాని, కొన్ని విషయాలలో అది అద్భుతమైన మనిషి. చదువుకున్నదైనా దానికి ఇంటి పనులన్నీ యెంతో బాగా తెలుసు. వంటచేస్తుందీ అద్భుతం. బహుశ ఈ పూట అదే చేస్తుందేమోలే నువే చూద్దువుగాని. అసలు విషయమేమిటంటే మా ఇద్దరు పిల్లల్నీ అదే సాకటం. వాళ్ళకెన్ని షోకులు చేస్తుందో, ఎంత నీట్‌గా ఉంచుతుందో. వాళ్ళకోసం ఎంత శ్రమపడుతుందో చెప్పలేను. నా భార్య వొట్టి దఫర్. అది చూసుకోవడమైతే పిల్లలు ఎట్లా ఉండేవాళ్ళో. ఎప్పుడైనా రాజ్యం రెండురోజులు ఊళ్ళో లేకపోతే పిల్లలు వ్రాసిలల్లే తయారవుతారు. తిండి కూడా తినరు. పిల్లలుగల ఇంట్లో నిజంగా రాజ్యంలాంటి మనిషి ఉండి తీరాలన్నమాట. అది పెళ్ళయి కాపరానికి పోతే మా పిల్లల్ని కూడా దానివెంట పంపాలేమోనని బెంగగా కూడా ఉంది.

ఎన్ని సంబంధాలు వచ్చినా నేను ఇష్టపడలేదుగాని నువు చేసుకునేట్టుంటే దాన్ని ఈ క్షణం ఇచ్చెయ్యటానికి సిద్ధంగా ఉన్నాననుకో. ఏమంటావు? తొందరలేదు. ఆలోచించు" అన్నాడు చలపతి.

దాసు వెంటనే సమాధానం చెప్పలేదు. అతను ఆలోచిస్తున్నాడు. తన భార్యపోయిందని తెలియగానే చలపతికి ఆలోచన కలిగింది. అందుకే ఈ ఆప్యాయతా, ఈ స్నేహభావమూ, ఆతిధ్యమూ, ఈ సినిమా సందర్శనమూనూ. దానికేమీ సందేహం లేదు. చలపతి ప్రవర్తన కంతటికీ ఇప్పుడు అర్థం తెలుస్తున్నది.... ఆ క్షణంలో దాసు పట్టుకోలేకపోయినాడు గాని, చలపతి అన్న మాటక్కూడా ఇప్పుడర్థం తెలుస్తున్నది. 'ఉద్యోగం చెయ్యకపోతే మాత్రమేం? నీకు బోలెడంత రాబడి ఉన్నది' అనే అర్థం వచ్చేట్టు చలపతి అన్నాడు. నిజానికి తన ఆస్తిపాస్తులను గురించి చలపతికేం తెలుసూ! తాను కాలేజీలో చదివేటప్పుడు ఆస్థిపాస్తులను గురించి తాను ఆప్తస్నేహితుల దగ్గిర కూడా మాట్లాడి ఎరగడు. నిజంగా తన కేపాటి ఉన్నదో తెలుసుకోగలందులకు చలపతి ఆ మాట అని ఉంటాడు. దాసు అట్లా బయటపడేవాడు కాడు.... చలపతిని చూచిన మరుక్షణానే తన భార్య పోయిన సంగతి ఎందుకు చెప్పవలసివచ్చిందో దాసుకు ఎంత ప్రయత్నించినా జ్ఞాపకం రాలేదు. ఒకసారి చదివిన పుస్తకంలోనుంచి డజన్లకొద్దీ వాక్యాలు ఏకరువు పెట్టగల తనకు మనుషుల నోటిమాటలు జ్ఞాపకం రాకపోవటం ఆశ్చర్యంగా ఉండటమేకాక, ఒక్కొసారి ఇబ్బందిగా కూడా ఉండేది. తన తల్లి ఎన్నో చిత్రవిచిత్రమైన మాటలు అంటుంది. కాని 'నువు ఇట్లా అన్నావు' అని ఆవిడకు వప్పజెప్పటానికి దాసుకు శక్తి లేకపోయేది.

తల్లి జ్ఞాపకం రాగానే దాసుకు పిల్లలు జ్ఞాపకం వచ్చారు. వాళ్ళను ఈ రాజ్యం మనుషులల్లే—కనీసం సగం మనుషులల్లే చేస్తుందేమో! తన కొంపలో తన పక్షం ఉండే ఆడ దిక్కంటూ ఉంటే పిల్లలింత పాడుగారు. ఈ రాజ్యం తనను ఇష్టపడి చేసుకుంటే తన పక్షం అవుతుంది. మగవాడు, తనవల్ల ఏమీకాదు. తాను ఆలోచించలేదుగాని, మళ్ళా పెళ్ళాడటం ఏమంత చెడ్డ ఆలోచనకాదు....

"నేను మళ్ళీ పెళ్ళి చేసుకోవటం గురించి ఆలోచించనేలేదు. తాపీగా కూచుని ఆలోచించాలి. ఈ రెండు మూడేళ్ళలో బ్రహ్మచర్యానికి అలవాటు పడ్డానేమో....అయినా ముందు మీ చెల్లెలు అభిప్రాయం ఒకటి తెలుసుకోవాలిగా?" అన్నాడు దాసు.

"అయ్యో, దాని ఇష్టంలేకుండా ఎట్లా? దాని పూర్తి ఇష్టంతోటే ఏ సంబంధం చేసినా? ఇదివరకు తిరగగొట్టిన సంబంధాల్లో నూటికి తొంభైతొమ్మిది దానికిష్టం లేక తిరగగొట్టినవే" అన్నాడు చలపతి.

చలపతి ఆడే పచ్చి అబద్ధాలకు దాసు లోలోపల విసుక్కున్నాడు.

"పీడి చెల్లెలు కూడా ఇటువంటిదే అయితే చచ్చానే" అనుకున్నాడు దాసు.

# 8

"నానమ్మోయ్. నానొచ్చాడు" అంటూ వరండాలో ఉన్న గోపి తలవాకిట తండ్రిని చూస్తూనే ఒక కేక పెట్టాడు. వాడంతకు పూర్వమే ఏ పాత గుడ్డనో పేలికలుగా చించి వాటిని ముళ్ళు వేస్తున్నాడు. వాటితో వాడేం చేద్దామనుకున్నాడో వాడికే స్పష్టంగా తెలియదు. తండ్రిని చూస్తూనే వాడా పేలికలను అవతల పారేసి పరుగెత్తుకుంటూ తండ్రికి ఎదురువెళ్ళి ఈగముసిరినట్టు ముసిరి, దాసు "ఊరుకోరా, ఉండరా" అంటుంటే వినిపించకుండా, లాల్చీ జేబులో చెయ్యిపెట్టి మనీపర్సు తీశాడు.

ఈ నరకం నుంచి ఒక్కరోజు మాత్రమే దాసుకు విశ్రాంతి. మళ్ళీ నరకంలో అడుగు పెట్టాననుకుంటూ దాసు కొడుకు చేతిలో పర్సు బలవంతాన లాక్కుని, దానికోసం జోరీగలాగా మీదికివచ్చే సుపుత్రుణ్ని ఒక్క విదిలింపు విదిలించాడు.

కూతవేటు దూరంలో తన నాయనమ్మ ఉండగా తండ్రి తనను ఇంత తృణీకార భావంతో చూడటం భరించలేక గోపీ, "ఓమ్మో, ఓరిబాబో" అంటూ శోకాలు పెడుతూ నేలమీద పడి పొర్లిగింతలు పెట్టసాగాడు. గజేంద్రుడి మొర ఆలకించిన శ్రీమహావిష్ణువులాగా, తులసికోట దగ్గిర కూచుని రాలిన బాదమాకులు విస్తళ్ళు కుడుతున్న వెంకమ్మగారు నెత్తిమీది ముసుగు సవరించుకుంటూ ఆదరా బాదరావచ్చి తన ముద్దుల మనుమడు నేలమీదపడి పొర్లిగింతలు పెడుతున్న భయంకరమైన దృశ్యం చూసింది. ఆవిడ గుండె తల్లడిల్లిపోయింది.

"ఇంకా ఇంట్లో అడుగు పెట్టకముందే వాణ్ని చంపేస్తున్నావట్రా ? నీకీ దుర్బుద్ధి ఎప్పుడు పోతుందిరా? వాణ్ని ప్రాణాలతో ఉండనీవా ఏమిటి?" అని ఆవిడ తన కొడుకు నడిగి, సమాధానం కోసం ఆగకుండా "నా తండ్రే! నేచచ్చిపోయి నానే! ఏం కావాలో నాయనమ్మకు చెప్పమ్మా?" అంటూ చేతులు చాచింది. మనవడు దగ్గిరికి రానిచ్చి, చచ్చే తన్నొకటి తన్ని మళ్ళీ శోకాలు మొదలు పెట్టాడు.

ఈ సమయానికి భాగ్యమ్మ కూడా బావి దగ్గిర్నుంచి వచ్చింది. ఆవిడ తమ్ముణ్ని చూడగానే ఆగి "ఏరా? వాణ్ని చేర్చుకున్నారటగా?" అంది.

"ఆ! వాడు సాయంకాలం ఇంటికి రాలా?" అన్నాడు దాసు.

"సాయంకాలం రానూ వచ్చాడు, మళ్ళీ ఈ పూట వెళ్ళనూ వెళ్లాడు. ఇక్కడా అక్కడా కూడా నడవాలటగా పాపం!" అన్నది భాగ్యమ్మ.

"నడవనీ అరిగిపోడులే" అన్నాడు దాసు.

ఈ సమాధానం భాగ్యమ్మకు పూర్తిగా అసంతృప్తి కలిగించింది. అందుకని ఆవిడ మరింత ఉత్సాహంతో మేనల్లుడికేసి పరిగెత్తి, అప్పుడే వాణ్ని చూసినట్టుగా,

"అయ్యో! ఇదేమిటి? మా నాన్నే? ఎందుకురా ఏడుస్తున్నావూ? లే, లే!" అంటూ వెళ్ళి తానుకూడా ఒక గాడిదతన్ను తిన్నది.

తన తల్లీ, అక్కగారూ గోపీచేత తన్నులు తినటం చూసిన తర్వాత కళ్లు కాస్త చల్లబడి దాసు లోపలికి అడుగు పెట్టాడు. అక్కడ తనరెండో కొడుకు సత్యం ఒక పక్కగా కూచుని తాపీగా వీభూదిపండు తింటూ ఉండటం, కంటపడ గానే దాసుకు మండిపోయింది. సత్యం మూతీ, గడ్డమూ తెల్లగా ఉన్నాయి. బుగ్గలూ తెల్లగా ఉన్నాయి.

దాసు గట్టిగా కేకలు పెడుతూ "వీడికి విభూది పండిచ్చిన వాళ్ళెవరు? ఇంకోచోట చింతమొద్దుల కుండేపాటి జ్ఞానమైనా ఈ ఇంట్లో మనుషులకు లేకపోతే ఎట్లా?" అన్నాడు. ఈ మాట చెవిని పడగానే భాగ్యమ్మ అదృశ్యమయింది. వెంకమ్మ మాత్రం లోపలికి వచ్చింది.

"ఏమిట్రా పాపం, తల్లిలేని వెధవను ఏడిపిస్తావూ? నీ డబ్బుల సంచి వాడికో క్షణం ఇచ్చేద్దూ! ఈ లోపల తింటాడా ఏం?"

"నే నివ్వను. ఇటువంటి ముద్దులు నా దగ్గిర వాడికన్నా ఎక్కువగా కుడ వొద్దని నీ కెన్నోసార్లు చెప్పాను. లాభం లేకుండా ఉంది" అన్నాడు దాసు.

"ఏమిట్రోయ్, పడుతున్నాగదా అని అనరానిమాటా, అనే మాటా ఆలోచించ కుండా నోటికొచ్చినట్లు మాట్లాడుతున్నావే. ముద్దులు కుడవట మేమిటి?" అంది వెంకమ్మ రౌద్రంగా.

"నా దగ్గర అంత అభిమానం ఉన్నదానివి వాడిచేత గాడిదతన్ను లెట్లా తింటావో నా కర్థంకాలేదు" అన్నాడు దాసు.

"అదంతా నా యిష్టం. నువ్వేం చెప్పనక్కరలేదు. నువ్వేమనుకొంటున్నావో. వాడు పరాయివాడు కాదు. డబ్బంతా నువ్వే సంపాయిస్తున్నా వనుకుంటున్నావు. పుట్టినప్పటినుంచీ నువ్వే సంపాదించావా? వాడికి కాస్సేపు డబ్బులు ఇవ్వరా అంటే గింజుకుంటావేం? అయ్యో, తల్లిలేని పిల్లవాడే అని అందరికీ ఉందిగాని, నీకు లేదేం? వాడు నీకేం శత్రుత్వం చేశాడూ?" అన్నది వెంకమ్మ.

తల్లి ధాటీగా మాటాడటం విని ఎటునుంచో భాగ్యమ్మ కూడా వచ్చింది.

"నాకు స్కూలువేళ అవుతున్నది. ఈ సవాళ్ళన్నిటికీ సమాధానం చెప్పటా నికి నాకు వ్యవధి లేదు. వాణ్ణి చీటికిమాటికి తల్లిలేని వెధవ అనకు. వాడికి తల్లి రాబోతున్నది. నేను పెళ్ళి చేసుకుంటున్నా మళ్ళీ" అంటూ దాసు తువాలు తీసుకుని బావి దగ్గరికి చరచరా వెళ్ళిపోయినాడు.

"ఏమిటేమిటీ? ఎవర్రా? చెప్పేది సొంతం చెప్పరా!" అని తల్లీ, అక్కా అనే మాటలను దాసు వినిపించుకోలేదు.

తల్లీ కూతుళ్ళిద్దరూ ఒకరిమొహం ఒకరు చూసుకున్నారు.

"ఇంకేం?" అన్నది వెంకమ్మ. "అందుకనే కొడుకు మొహంచూసే వాడికివాళ అంత పడకుండా పోయింది!"

"అవునుగానీ, వాడు నిన్నపోయి ఇవాళొచ్చాడుగదా, ఈలోగా సంబంధం ఎప్పుడు చూశాడో" అన్నది భాగ్యమ్మ, తల్లిమాట వినిపించుకోకుండా.

"ఎవరో ఆ మహాతల్లి. ఇంకా మూడుముళ్ళూ పడకముందే తండ్రి కొడుకు లను వేరుచేసినట్టున్నది" అన్నది తల్లి, కూతురి ఆలోచన లక్ష్యపెట్టకుండా.

"ఏమో ఈ ఆలోచన ఎంతకాలంనుంచి ఉందో! ఒకరితో చెబుతాడా పెడ తాడా?" అన్నది భాగ్యమ్మ తనలోతాను మాటాడుకుంటూ.

తన తల్లినీ, అక్కనూ ఒక గంతు వేయించటానికని దాసు ఈ మాట అనే వరకూ అతని మనస్సులో గుంజాటన సాగుతూనే ఉన్నది. రాజ్యాన్ని పెళ్ళిచేసు కోవటం విషయం అతను ఏ నిర్ణయానికీ రాలేకపోయినాడు. తిరిగి ఇంటికి వచ్చి తన పిల్లల్ని చూసేసరికి, కనీసం వాళ్ళకోసమన్నా రాజ్యాన్ని చేసుకుంటె బాగుండు ననిపించింది. కాని అప్పటికీ అతను పూర్తి నిర్ణయానికి రాలేదు. ఆఖరుకు ఎవరో తననోట ఆమాట పలికించినట్లయి, తల్లితో మళ్ళీ పెళ్ళి చేసుకోబోతున్నానని అనె య్యటం జరిగిన అనంతరం దాసు మనసు రాజ్యాన్ని పెళ్ళాడటానికి రూఢి చేసుకున్నది.

ఐతే ఇంకా ఒక చిన్న అడ్డంకి ఉండనే ఉన్నది— రాజ్యం తన అభిప్రా యాన్ని చలపతిద్వారా దాసుకు తెలియజేయవలసి ఉన్నది. ఎవరు చూశారు? చల పతి దగ్గర్నుంచి మళ్ళీ ఈ ప్రస్తావనే రాకపోవచ్చు. వస్తుందని దాసు అంతరాత్మకు తెలుసుగాని, వచ్చేదాకా రాదని అనుకోవటమే మంచిది. అందుచేతనే అతను తల్లీ అక్కా ఎన్నిసార్లు గుచ్చి గుచ్చి అడిగినా తాను చేసుకోబోయే పిల్లను గురించి ఒక్క విషయం కూడా బయటపెట్టక, "చెప్పే సమయంవస్తే నేనే చెబుతాగా?" అని తప్పించుకున్నాడు.

చివరకు ఆ సమయం రానే వచ్చింది. చలపతి దగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది. అందులోనే రాజ్యం దాసుకు స్వయంగా లేఖ రాసింది. ఆమె రాసిన లేఖను దాసు బాలాసార్లు చదువుకున్నాడు.

రాజ్యం ఇంగ్లీషులో ఈ విధంగా రాసింది.

ప్రియమైన దాసుగారూ,

మా అన్నకూ మీకూ జరిగిన సంభాషణ గురించి మా అన్న నాతో చెప్పాడు. నేను చాలా దీర్ఘంగా ఆలోచించి మా అన్న సూచనకు ఒప్పుకున్నాను. ఇది నేను బుద్ధిపూర్వకంగా ఇచ్చిన అంగీకారమే. నాకు ఒత్తిడి లేదు. మీ అభిప్రాయం మాకు తెలియజేయండి."

చాలా చిన్న ఉత్తరం. దాసు అవసరానికి పనికివచ్చే విషయం మాత్రమే అందులో ఉంది. ఈ ఉత్తరంతో పోలిస్తే చలపతి చాలా సోది రాశాడు. ఆనాడు

సినిమా చూసి వస్తుండగా తనకు తట్టిన ఆలోచన గురించి ఒక చెల్లెలికి తాను ఎట్లా చెప్పిందీ, ఆమెకు అంతకుపూర్వమే దాసు భార్యపోయిందని విని ఎంత విచారం కలిగిందీ, ముఖ్యంగా దాసు పిల్లల్ని తల్లిలేని పిల్లల్ని తలుచుకుని ఆమె ఎంత పరితపించిందీ, తాను సూచించటమే వ్యవధిగా ఆమె ఎట్లా పెళ్ళికి ఒప్పుకున్నదీ చలపతి చాటభారతం రాశాడు. రెండు ఉత్తరాల్లోనూ గల తేడా చూసుకొని రాజ్యం అన్న వంటిది కానందుకు దాసు చాలా సంతోషించాడు.

ఈ విషయంలో చలపతి మనసు ఎట్లా పనిచేసిందీ దాసు చూసినట్లు ఊహించగలిగాడు. కాని రాజ్యం మనస్సు ఎట్లా పనిచేసిందీ అతనికి కొంచెమైనా ఆచూకీ దొరకలేదు. రాజ్యం ఎట్టి జంజాటనా పడకుండా తనను పెళ్ళాడటానికి ఒప్పేసుకుందని దాసు నమ్మాడు. వెనక్కు తిరిగి చూసుకుంటే తనను మొదటిసారి చూసిన క్షణం నుంచీ రాజ్యానికి తనమీద ఏదో అభిమానం ఉన్నట్టే దాసుకు తట్టింది. ఆమెమీద అతనికి ఏదో ఒకవిధమైన మమకారం ఏర్పడింది. తనకన్న చాలా చిన్నదై వుండికూడా తనను పెళ్ళాడటానికి ఒప్పుకున్నందుకు ఆమెపై అతనికి కృతజ్ఞత కూడా కలిగింది. దుర్ఘటమైన సమస్య పరిష్కరించుకొనటానికై ఆమె తనను పెళ్ళాడటానికి ఒప్పుకున్న సంగతి అతనికి తట్టనైనాలేదు. తనకన్న ఆమెకు మంచి సంబంధాలు తప్పక రావచ్చునని అతను అనుకున్నాడు. అందుచేత ఆమె తనను పెళ్ళాడటానికి ఒప్పుకోటంలో ఏదో త్యాగం ఉన్నటు అతనికి తోచింది.

## 9

"మళ్ళీ పెళ్ళి చేసుకోబోతున్నాను" అని దాసు అన్నది లగాయతు వంటింటో తల్లీ కూతుళ్ళకు చాలా చర్చలు జరిగాయి.

"ఈ మూడేళ్ళూ ఎంతమంది చెప్పినా, ఎన్ని సంబంధాలు వచ్చినా పెళ్ళి చేసుకోనన్నవాడు అకస్మాత్తుగా ఎవరికీ చెప్పకుండా ఎందుకు సంబంధం కుదుర్చుకున్నట్టా?" అని తల్లి ఆశ్చర్యపడింది.

"ఏమోతల్లీ! నిక్షేపంలాంటి కొంపలోకి ఏ పెద్దమ్మను ప్రవేశబెట్టబోతున్నాడో?" అన్నది కూతురు.

"అవునే? పీడూ మర్యాదకల సంబంధం చేసుకో దలచినవాడైతే, ఎవరికీ చెప్పకుండా ఎందుకు రాయల్లే కూచున్నాడూ?"

"అదే నేనూ చూస్తున్నా. పిల్ల వెధవముండేమో!"

"మన శాఖ కాదేమో."

"మన శాఖ కాకపోతే పీడాబాయిలే—ఏ శూద్రదిదో కాకుండావుంటే అంతే చాలు."

"సూర్యనారాయణల్లే ఏ భోగందాన్నో చేసుకోవటం లేదుగదా?"

"చేసుకున్నాడో, వాడికి పట్టినగతే వీడికీ పడుతుంది. పురుగులుపడి పోతాడు."

"నువ్వేన్నన్నా చెప్పు. వీడేదో దిక్కుమాలిన సంబంధం ఆలోచించే పెట్టాడు."

"అసలేమీ లేదేమో. మన్ని ఉడికించటానికి అట్లా అన్నాడేమో."

"ఇంతమాత్రానికే ఉడుకుతారా ఏం? ఏ పాకీ ముండనన్నా చేసుకోనీ ఎవరికాక్కావాలి? ఇష్టముంటే కొంపలో ఉంటాం, లేకపోతే జానెడు పొట్టకు ఎంత కావాలి?"

రాజ్యం దగ్గర్నుంచి ఉత్తరాలు వచ్చాక దాసు తల్లికీ, అప్పకీ తాను చేసుకునే పిల్లను గురించి కొన్ని వివరాలు చెప్పాడు. మిగిలిన వివరాలు వాళ్ళకు రంగయ్య ద్వారా తెలిశాయి. ఎందుకంటే చలపతి రంగయ్యను ఒకనాడు తన ఇంటికి తీసుకు వెళ్ళాడు. రంగయ్య రాజ్యాన్ని గురించి అమ్మమ్మకూ, అమ్మకూ చెప్పాడు.

"నువు చూశావుట్రా ఆ అమ్మాయిని?" అన్నది భాగ్యమ్మ.

"చూశానమ్మా" అన్నాడు రంగయ్య.

"ఎట్లా ఉంటుంది?"

"భలే బాగుంటుంది." ఏ ఆడదైనా చాలా బాగుందనే వయసులో ఉన్నాడు రంగయ్య.

"ఎన్నేళ్ళుంటై?"

"ఏమో నాకు తెలీదు. ఇరవైయేళ్ళుండొచ్చు."

"వాళ్ళు బాగా బతికినవాళ్ళేనా?"

"వాళ్ళిల్లు చాలా బాగుంటుంది. వాళ్ళ పిల్లలు ఇంకా బాగుంటారు. ఎప్పుడూ ఆడపిల్లలతో ఆడుకుంటుంది".

"పిల్లలెవర్రా? దానికి పిల్లలున్నారా ఏం?"

"మేష్టరుగారి పిల్లలమ్మా?"

"సంగీతం పాడుతుందా?"

"ఏమో, నేను వినలా. ఇంటర్మీడియట్ పాసయిందిట."

"ఏడవకపోయిందీ! చదువుకున్న ముండకన్నా సానిముండ మేలు."

దాసు చేసుకోబోయే మనిషిని గురించి వెంకమ్మా, భాగ్యమ్మా తనివిదీరా వైన వైనాలుగా, తమ భావచాతుర్యమంతా వినియోగించి తమలో తాము మాట్లాడుకోవటము అయిన తరువాత ఇరుగు పొరుగు అమ్మలక్కలతో చెప్పుకోవలసిన అవసరం ఏర్పడింది. ఇంత కవిత్వం ప్రజల్లో పడకుండా ఉండటం న్యాయమా మరి?

దాసు స్కూల్లోవుండే సమయాల్లో ఇంట్లో మీటింగులు జరిగేవి. తీసిన కొద్దీ పాతర పెరిగినట్లు, దాసు పెళ్ళినిగురించి చెప్పుకుపోతున్నకొద్దీ అది ప్రపంచ విలయమంతదిగా పరిణమించినట్టయింది.

"చూశావుటమ్మా, సుబ్బమ్మక్కా ? ఇట్లా పెళ్ళిచేసుకోబోతున్నానని మాట మాత్రం వాడన్లేదుగదా.... పిల్ల ఎవరో, వాళ్ళ సాంప్రదాయ మేమిటో, అది ఇంత కాలం ఎందుకు పెళ్ళి కాకుండా ఉందో, వాళ్ళు వీణ్ణి ఎట్లా బుట్టలో వేసుకొని ఈ సంబంధానికి ఒప్పించారో, వాడికళ్ళలో ఏం కారంచల్లారో వాడికేమందు పెట్టారో ఆ పరమాత్మకు తెలియాలిసిందేగాని మనకు తెలియదుగదా! నాకు తెలీక అడుగుతున్నా, కన్న చచ్చిందాన్ని. నేనింకా బతికే ఉంటినిగదా, తనతోబుట్టింది ఇంట్లోనే ఉందిగదా మా ఇద్దరికీ కాకపోతేమానె ఒక్కరికన్నా పిల్లను చూపించుకుని మంచీ చెడ్డా కనుక్కోమనరటమ్మా.... పెళ్ళికూతురి కిరవైయేళ్ళట. పాతికేళ్ళే ఉన్నయ్యో, ముప్పయ్యే ఉన్నయ్యో? ఉన్నవయసెవరన్నా చెప్పుకుంటారా ఏం?

పెళ్ళి అయివుంటే ఆరుగురు పిల్లలతల్లి కావలసినదన్నా మాట. మా భాగ్యం నిక్షేపంగా పన్నెండో ఏట పిల్లను కన్లా? ఎన్నెమ్మ పొట్టన బెట్టుకుందిగానీ? ఇంకోటి చూశా! మేం పెళ్ళికిరావటం వాడికిష్టంలా? 'పెళ్ళెప్పుడ్రా' అంటే 'ఎప్పు డైతే మీకేం పోనిస్తూ' అన్నాడు. అదేమిట్రా అంటే, ఏదో వీలైన రోజు చూసి తను ఒక్కడూ వెళ్ళి పెళ్ళి అయిందంటే అయిందనిపిస్తాట. లేకపోతే వాళ్ళకు ఖర్చయి పోతుందిటమ్మోవ్. చూశావా వాళ్ళంటే ఎంత తీపో. కట్నాలూ, లాంచనాలూ ఏమిట్రా అంటే దయ్యం పట్టినట్లు నవ్వాడు.... ఇంతకూ వాడి పెళ్ళి ఎందుకు తల పెట్టాడో నాకుమట్టుకు తెలీదు? ఆ పిల్లలిద్దర్నీ నాకు కాకుండా చెయ్యాలని! తల్లి లేని పిల్లలుగదా అని వాళ్ళకు చచ్చిచెడి నానా చాకిరీచేస్తుంటే పరాయి వాడళ్ళే కళ్ళలో నిప్పులు పోసుకుంటాడుగద ! నాకు పిల్లల్ని పెంచటం చాత కాదుట. నేను పిల్లల్ని చెడగొడుతున్నానుట ........ విన్నావుటమ్మా తన్నెవరు పెంచారని వాడి ఉద్దేశం. ఇన్నేళ్ల బ్రతికి ఇంటి వెనకాల చచ్చినట్లు, ఈనాటికి వాడిచేత పిల్లల్ని పెంచటం చేతకాదనే మాటపడ్డా. ఆలా అయింది చివరకు నా బ్రతుకు........! ఎందుకూ స్పష్టంగా చెప్పేశాడుగా! తనకు పెళ్లాం లేక పోయినా యిబ్బంది లేదుటగాని వాళ్ళకి అవసరంగా తల్లి కావాలిట. ఎవరన్నా వింటే నోటితో నవ్వుతారూ? ఇంతకూ ఆ పిల్లల గీత బాగాలేదు. ఉంటే వాళ్ళమ్మ పోనేపోదు. అది పుణ్యాత్మురాలే. దాటిపోయింది. అటువంటి కోడలు అందరికీ దొరకదమ్మోవ్ ! ఎన్నడన్నా కోడలల్లే ఉందా ! నాకెంత కీర్తి తెచ్చింది ? కోడల్ని గారాబం చేస్తారా అని నన్నందరూ కోప్పడేవాళ్ళు. అటువంటి కోడల్ని గారాబం చేస్తే ఏం, నెత్తినెక్కించుకుంటే ఏం?"

వెంకమ్మ చెప్పేదాన్లో అభూతకల్పనా, కవిత్వమూ చాలా ఉందని వినే వాళ్ళకు తెలుసు. అయితే మటుకేం? చెప్పేదానికి ఊకొట్టడమూ, పరామర్శించ

టమూ, చాటుకు వెళ్ళి నవ్వుకోవటమూ వాళ్ళ కర్తవ్యం. వాళ్ళాపనే చేశారు. వెంకమ్మ కవిత్వం ఇంకిపోతున్నట్టు తోచినప్పుడు ఆవిణ్ని ఎగదోసే మాటలుకూడా వేసి, ఆవిడచేత "పలికించారు." ఈ వేడుక చాలారోజులుసాగి, రాజ్యం పెళ్ళిచేసుకుని దాసు ఇంటికి కాపరానికి రావటంతో అకస్మాత్తుగా అంతమయింది.

# 10

దాసుకూ, రాజ్యానికీ, పెళ్ళి నిశ్శబ్దంగా, నిరాడంబరంగా జరిగిపోయింది. దాసు ఈ వివాహం నుంచి ప్రత్యేకమైన ఆనందం ఏమీ వాంఛించలేదు. కనుక అతనిలో పెద్దమార్పేమీ కలగలేదు. రాజ్యాన్ని చేసుకుందామని నిశ్చయించి, ఆ నిశ్చయాన్ని బయులుపెట్టిన తర్వాత ఆమె తన సొంతమైన భావం అతనికి ఏర్పడిపోయింది. అదొక కొత్త అనుభవమల్లే అతనికి తోచలేదు. ఆమె అతనిలో బలమైన ఉద్రేకం ఏదీ రేకెత్తించలేదు. ఏ సినిమాహాలు దగ్గిరో, రైళ్లోనో కనిపించి అతనికి ఉద్రేకం కలిగించిన స్త్రీలెందరో ఉన్నారు. రాజ్యాన్ని తనదిగా భావించటంవల్ల అతనిలో కలిగిన ఉద్రేకం అందులో సహస్రాంశం లేదు.

కాని రాజ్యంలో చాలా మార్పు కలిగింది. దాసును పెళ్ళాడటం నిశ్చయం కాగానే ఆమె మనస్తత్వంలోనే చాలా మార్పు కలిగింది. ఒక అద్దె ఇల్లు వదిలి మరొక అద్దె యింటికి పోయిన వాళ్ళకు పాత యింటి వివరాలు గతంలో లీనమైనట్టు తోచే విధంగా రాజ్యం, యీ వివాహం స్థిరం కాగానే తాను పెళ్ళిని గురించి పెట్టుకుని ఉండిన భావాలూ, ఆశయాలూ, ఆదర్శాలూ ఒక్కసారిగా గతంలో జీర్ణించిపోయాయి. జీవిత వాస్తవం వాటిని రూపులేకుండా మింగేసింది. ప్రపంచంలో ఉన్న యిన్ని కోట్ల మగవాళ్ళలో ఈ దాసు ఒక్కడే తన భర్త. మిగిలినవాళ్ళంతా తనకు సంబంధంలేనివాళ్ళు. తన అన్న, వదినే, దూరపు బంధువులు. ఇకముందు వాళ్ళు అనుకునేవి, అనేవి, చేసేవి తనను బాధించవు. పిల్లల్ని గురించి మాత్రమే రాజ్యం విచారపడింది. వాళ్ళు అంత సులువుగా గతంలోకి వెళ్ళిపోయేట్టు కనబడలేదు. వాళ్ళు తనకు జ్ఞాపకం రాకుండా వుండరు. వాళ్ళేం చేస్తుంటారో, ఎట్లా ఉంటారో అన్న విచారం కలగకుండా ఉండదు.

దాసుతో తన సంసారం ఎలా వుండేదీ రాజ్యం ఊహించుకోలేకపోయింది. ఆమె దగ్గిరిగా చూసిన దాంపత్యం తన అన్నా వదినెలది ఒకటే. అందులో తనకు ఆకర్షవంతమైన విషయమేమీ కనిపించలేదు. చలపతి ఒక్కొక్కప్పుడు తన భార్యను మనిషిగానే భావించనట్టుంటాడు. ఆవిడతో చెప్పకుండా తన యిష్టం వచ్చిన పనులు చేస్తాడు. ఆవిడ తనంతట తాను ఏదన్నా సలహా చెప్పబోతే నోరు మూసేస్తాడు. ఇతర వేళల పెళ్ళానికి దాసుడల్లే ఉంటాడు. ఆవిడ ఎన్ని అబద్ధాలాడినా నమ్ముతాడు. ఆవిడ చెప్పినదానికల్లా తల ఆడిస్తాడు. ఎప్పు

తన్నా చలపతి పెళ్ళాన్ని చచ్చేట్టు కొప్పడతాడుకూడానూ. ఇప్పుడు నయం, రాజ్యం చిన్నతనంలో కొట్టేవాడు కూడానూ.

మొత్తంమీద రాజ్యానికి అన్న కాపరం నచ్చలేదు. ఆ మొగుడు పెళ్ళాలకు ఒకరిమీద ఒకరికి తగినంత గౌరవం లేదు. ఒకరి మానసిక జీవితంతో రెండో వాళ్ళకు సంబంధం లేదు. అయినా వాళ్ళు సుఖంగా, ఆదర్శంగా కాపురం చేస్తున్నట్టే లోకం అనుకుంటున్నది.

తన అన్నమీద తన వదినకున్న దానికన్న తనకు దాసుమీద ఎక్కువ గౌరవం వున్నట్లు రాజ్యలక్ష్మి ఊహించింది. దాసు మంచివాడు. అమితంగా మాట్లాడడు. మనుషుల్ని తీసికట్టుగా చూడడు. ఎప్పుడూ తన విషయమే చూసుకునేవాడల్లే కనపడడు. పుస్తకాల్లో చెప్పినట్టుగా, తాను దాసును విడిచి ఒక్క క్షణం ఉండలేక పోవటం జరక్కపోవచ్చునుగాని అతన్ని మోసంచేసి, అతనితో అబద్ధాలాడవలసిన అవసరం తనకుండదని రాజ్యం నమ్మింది. తనకు దాసు ఇంట్లో యిప్పటికన్న ఎక్కువ స్వతంత్రం ఉంటుంది. చలపతి ఇల్లు పరాయి ఇల్లని అప్పుడప్పుడూ తెలియజేస్తూంటుంది తన వదినె- ఆవిడకు చలపతి యింటిమీద ఉన్న అధికారం తనకు దాసు ఇంటిమీద ఉండదా?

దాసు పెళ్ళికి చలపతివేపు బంధువులు ఇద్దరో ముగ్గురో వచ్చారు. అందరూ కూడా చలపతినీ, రాజ్యాన్ని అభినందించారు. రాజ్యం మేనమామ మటుకు 'నీకోసం విచారిస్తున్నాను' అని రాజ్యానికి టెలిగ్రాం ఇచ్చాడు. దీన్ని దాసుకు తెలీకుండా చలపతి దాచిపెట్టాడు. ఉదయం పదినుంచి పన్నెండు లోపల పెళ్ళి అయిపోయింది. భోజనాలయిన తర్వాత నూతన వధూవరులు ముందుగదిలో కూర్చుని మాటలాడుకున్నారు. ముఖ్యంగా తమ తమ బంధువుల్ని గురించి చెప్పుకున్నారు. రాజ్యం తన మామ ఇచ్చిన టెలిగ్రాం గురించి చెప్పింది.

"మంచివాడు, మనసులో ఉన్నమాట అన్నాడు!" అన్నాడు దాసు.

"మాటలతో ఏమవుతుంది? తను ఇన్నేళ్ళు చూస్తూ ఊరుకున్నాడుగాని నాకు సంబంధం ఒకటీ చూడలేదే?" అన్నది రాజ్యం.

దాసు కొంచెం ఆలోచించి, "పెళ్ళి అయి మొగుడు పెళ్ళాల్లో ఎవరో ఒకరు పోయేదాకా ఆ దాంపత్యం గురించి ఎవరూ ఏమీ చెప్పటానికి లేదు. పెళ్ళిళ్ళను గురించి ఆదర్శాలు జాస్తి అయినకొద్దీ పెళ్ళిళ్ళు అధ్వాన్నంగా ఉంటున్నాయి" అన్నాడు.

"పెళ్ళి చేసుకునేవాళ్ళు ఒకరిమీద ఒకరికి ఇష్టం ఉండి చేసుకుంటే ఏ చిక్కూ ఉండదు" అన్నది రాజ్యం.

"మగవాళ్ళ ప్రపంచానికీ, ఆడవాళ్ళ ప్రపంచానికీ మధ్య ఒక అగాధం ఉండగా ఏం చూసి ఇష్టపడతారు. ఈ కాలం కుర్రాళ్లు ఆడదాని ఫాషన్లు చూసి ముచ్చటపడాల్సిందే. సంఘంలో మగవాళ్ళకూ చదువులోనూ బుద్ధులలోనూ ఇంత వ్యత్యాసం

ఉండగా ప్రేమ వివాహాలు సాధ్యం కాదు. ఇంచుమించు సగం పెళ్ళిళ్లు నీ పెళ్ళి లాగే, ఎదుటున్నవాడు పెళ్ళికొడుకన్న లెక్కలో జరుగుతాయి. ప్రస్తుతం ఇంతే. నీ అదృష్టం బాగుందా సుఖపడతావు. లేదూ కనపడే లక్షలాది ఆడవాళ్ళలో నువ్వొకతెవి."

జీవితంలో ఆనందం ఉండవచ్చునన్న భ్రమ దాసులో కాస్తయినా ఉన్నట్టు కనపడలేదు.

"మీరు కొంతకాలం సంసారం ఈదారు గనుక విరక్తిగా మాటలాడుతున్నారు. కొత్తగా పెళ్ళి అయ్యే వాళ్ళకు ఏదో ఆనందించాలని ఉండదూ?" అన్నది రాజ్యం.

దాసు నవ్వాడు.

"ఆనందం కావాలంటే కష్టపడి సృష్టించుకోవాలిగాని, దానంతటదే అది ఎప్పుడన్నా వస్తుందా? అందులోనూ భ్రమలవల్ల కలిగే ఆనందం ఎంతకాలం ఉంటుంది? నీ ఆనందానికి తోడుపడే వాళ్ళకన్న, అడ్డం తగిలేవాళ్ళెక్కువ. విరక్తి కలక్క ఏం జేస్తుంది?"

"మిగిలినవాళ్ళు ఎట్లావున్నా చేసుకున్న భార్యాభర్తలు ఒకళ్ళకొకరు ఆనందం యివ్వగలిగితే—"

రాజ్యం ఆ వాక్యం పూర్తి చెయ్యలేదు.

"నువు ప్రణయకథలు చదివి చెడిపోయినావు. అందులో ప్రేమించిన జంటలకు వేరే త్రిశంకుస్వర్గం కల్పిస్తారు కథకులు. కాని అటువంటి త్రిశంకు స్వర్గాలు జీవితంలో ఎక్కడున్నాయి? ప్రపంచంలో భార్యాభర్తల సంబంధం ఒకటేనా? తల్లులూ, తండ్రులూ, తమ్ముళ్ళూ, అక్కచెల్లెళ్ళూ, పిల్లలూ, ఇరుగు పొరుగులూ, ఆఖరుకు నౌకర్లూ, యజమానులూ ఉన్నారు. మొగుడు పెళ్ళాలు చాల మంచి వాళ్ళే అయినా, ఈ పెళ్ళాలందరూ సుఖపడనిస్తారా?"

దాసు ఇంత నిరాశావాది అని రాజ్యం ఊహించలేదు. అతను జీవితంలో బాధపడ్డవాడల్లే కనిపించడు పైకి.

"మీరెన్నడూ సుఖపడలేదా? మీ మొదటి భార్యతో అయినా?" అన్నది రాజ్యం సాహసించి.

"సుఖపడకేం? చాలా సుఖపడ్డాను. ఇష్టమైన పుస్తకాలు చదివితే ఆనందంగా వుంటుంది. కష్టపడి ఏదన్నా సాధిస్తే ఆనందం ఉంటుంది. జీవితాన్ని అర్థం చేసుకోవటంలో కూడా ఆనందం ఉంది. ముఖ్యంగా మనుషుల్ని బాగా అర్థం చేసుకోగలరా?" అన్నది రాజ్యం (Sic).[1]

---

1. రాజ్యం ప్రశ్నకు రాజ్యం సమాధానం. రాజ్యం ప్రశ్నకు దాసు "సుఖపడకేం? చాలా సుఖపడ్డాను" అన్న తర్వాత కొంత భాగం పోయింది.

దాసు నవ్వాడు. "మనుషుల్ని గురించి సామాన్యంగా పొరపాటు పడను" అన్నాడు.

"నేనెరిగిన మనిషి నెవర్ని గురించన్నా చెప్పండి."

"మీ అన్నను గురించి నేనేమనుకుంటున్నానో తెలుసుకోవాలని ఉందా?"

"పోనీ, ఆయనను గురించే చెప్పండి" అన్నది రాజ్యం.

"ఈ పెళ్ళికి నిన్ను బలవంతాన వప్పించలేదుగదా?" అన్నాడు దాసు.

"ఎబ్బే లేదు. నేను మీకు రాశానే?" అన్నది రాజ్యం.

"అందుకే అనుమానం కలిగింది" అన్నాడు దాసు.

రాజ్యం ఆ విషయం అంతటితో పోనిచ్చింది.

కాస్సేపుండి దాసు, "నీకు ముందుగా తెలియటం మంచిది. మా ఇల్లు భూలోకనరకం."

దాసు ఏమీ దాచకుండా తన తల్లినిగురించీ, అక్కను గురించీ, పిల్లల్ని గురించీ రాజ్యంతో చెప్పేశాడు. అతనట్లా చెప్పటం స్నేహపూర్వకమైన చర్య. మనసులో ఉన్న మాటలు చెప్పుకోటానికి దాసుకు ఆప్తులెవరూ లేరు. చాలా ఏళ్ళకు రాజ్యం దొరికింది. తన మనసును బాధించే విషయాలు చెప్పుకోటం వల్ల మనస్సుకు సుఖం కలగటమే కాక రాజ్యం ఈ విషయాలన్నీ విన్నంత మాత్రాన్నే ఆప్తురాలైనట్టుగా దాసుకు తోచింది.

అయితే రాజ్యం అచ్చగా ఆప్తురాలల్లే, ఆప్తుల కష్టాలు పంచుకుని సానుభూతి పొందేదానల్లే, ఈ విషయాలు వినలేదు. కొంత స్వార్థంతో, ఈ విషయాలు తనకు కూడా సంబంధించబోతున్నాయన్న భావంతోనే విన్నది.

# 11

రాజ్యం అత్తవారింట అడుగు పెట్టింది. అత్తగారినీ, వదినెగారినీ చూసింది. ఈ ఇంట్లో తనకు ఏ అధికారమూ లేకుండా చెయ్యటానికి వాళ్ళు ప్రయత్నిస్తారని ఆమె కనుగొన్నది. ఆమె జీవితంలో ఎన్నడూ ఎవరితోనూ సంఘర్షణపడి ఎరగదు. ఎప్పుడూ పరిస్థితులకు తల ఒగ్గుతూనే వచ్చింది. కాని వెంకమ్మనూ, భాగ్యమ్మనూ చూడగానే రాజ్యానికి 'వీళ్ళ పెత్తనం నేను ఒప్పుకోను. వీళ్ళు నా దారికి రావలసిందేగాని, వాళ్ళ దారికి నేను చచ్చినా రాను' అనిపించింది. ఈ భావం రాజ్యానికి ఎంతో ఉత్సాహాన్నిచ్చింది.

రాజ్యానికి ఇటువంటి ఆలోచన కలగటానికి కారణాలు చాలా ఉన్నాయి. ఆమె చదువుకున్న పిల్ల. చదువువల్ల ఇంకేమీ అబ్బకపోయినా చదువులేని వాళ్ళ మీద తృణీకార భావం ఒక్కటి తప్పనిసరిగా అబ్బింది. అదికాక ఆమె ఆదివరలో ఇతరుల నిర్ణయాలకు తల ఒగ్గిందంటే ఇటువంటి పురాతన వ్యక్తులకెన్నడూ తలఒగ్గ

లేదు. ఈ వెంకమ్మ, భాగ్యమ్మలవంటి మనుష్యుల అభిప్రాయాలను ఆమె యెన్నడూ ఖాతరు చెయ్యలేదు. ఇంకొక విషయమేమంటే ఇదివరకలా తాను అవివాహిత కనకనూ, తన వివాహం ఇతరులు చెయ్యవలసిందే కనుకనూ రాజ్యాన్ని ఒకవిధమైన అసమర్థతా భావం వెంటాడుతూ వచ్చింది. పెళ్ళి అయిపోవడంతో ఆమెలో కలిగిన మానసిక పరివర్తన, ఈ అసమర్థతా భావం తుడిచి పెట్టుకు పోయింది. ఇప్పుడిక తను ఎవరికీ తల ఒగ్గనక్కర్లేదు. రెండో పెళ్ళివాణ్ణి పెళ్ళాడి తన అసమర్థతకు పరిహారం ఇచ్చుకున్నది. ఇక తను ఎవరికీ వెరవ నవసరం లేదు. ఇప్పుడు తనకున్న బాధ్యత యావత్తూ తన భర్తకే. అదృష్టవశాత్తూ అతను అదివరకే తన పక్షమై ఉన్నాడు. ఒకవేళ అతను తన తల్లినిగురించీ, అక్కనుగురించీ తన భావాలు బయటపెట్టి ఉండకపోయినా అతను తన పక్షం ఉండడని ఆమెకు సందేహం కలిగి ఉండేదికాదు. అటువంటి సందేహానికి అవకాశం ఏదీ?

వెంకమ్మా, భాగ్యమ్మా కూడా కొత్త పెళ్ళికూతుర్ని ఆప్టే పలకరించటానికి ప్రయత్నించక బెట్టుగా ఉన్నారు. వాళ్ళ దృష్టినుంచి రాజ్యం ఎటువంటి అర్హతా లేని మనిషి. "ముండను తెచ్చినట్టు తెచ్చాడు. పెళ్ళాన్ని తెచ్చినట్టు తేలేదు" అని వాళ్ళు అదివరకే అనుకుంటున్నారు. దాసు పెళ్ళి తాము చూడలేదు. తోడుగుడ్డ కూడా లేకుండా రాజ్యం కాపరానికి వచ్చింది. అటువంటి మనిషిదగ్గిర లాంచనాలూ, మర్యాదలూ అవసరంలేదు. ఒకవేళ రాజ్యం తమపట్ల వినయవిధేయతలు కనబరిచి, కాళ్ళావేళ్ళాపడి కొంతకాలం తపస్సుచేస్తే వాళ్ళిద్దరూ అనుగ్రహించి, కనికరించి ఆమె తప్పులు మన్నించే వాళ్ళేమో. కాని రాజ్యం అటువంటి ప్రయత్నంలో ఉన్నట్టు కనపడలేదు.

"ఆవిడ మా అమ్మ, యీవిడ మా అక్కయ్య, వాడూ, వాడూ నా పిల్లలు" అని రాజ్యానికి దాసు పరిచయం చేశాడు.

రాజ్యం అందరికేసి ధైర్యంగా చూసింది. ఎవరూ మాట్లాడలేదు.

"నేను స్నానంచేసి బట్టలు మార్చుకోవాలి" అని రాజ్యం అందర్నీ ఉద్దేశించి చెప్పి తన పడక గదిలోకి వెళ్ళిపోయింది. ఆమె తనక్కపెట్టెలూ పక్కచుట్టా అందు లోనే పెట్టించుకున్నది.

తర్వాత కొంతసేపటికి రాజ్యం ఇవతలికి వచ్చి భాగ్యమ్మను చూసి, "ఏమండీ వదినగారూ— నా కిల్లంతా ఒకసారి చూపిస్తారా?" అన్నది.

"చూపించటానికేముంది. మహారాజుగా చూడు. సావిడీ, పంచా, నట్టిల్లూ, వంటయిల్లూ, దొడ్డీ, స్నానాలగదీ - ఇందులో గుర్తుపట్టనిదేముంది. పడకటిల్లు చూతనే చూశావుగా?" అన్నది భాగ్యమ్మ.

రాజ్యం స్నానం చేసివచ్చి తన గదిలో ప్రవేశించింది. ఆమె బయటికి వచ్చిన జాడలేదు.

"ఏమిటి దీని ఉద్దేశం? టింగురంగా అని పోయి గదిలో కూచున్నది. పనీ పాడు చెయ్యదా ఏం? మనం కాచి పోస్తామనుకుంటున్నదా? తనకోసం మొగుడు వంటలక్కను, పనిదాన్నీ పెట్టాడను కుంటున్నదీ గామాలు?" అని తల్లీ కూతుళ్ళు తమలో తాము రుస రుస లాడుకున్నారు.

ఆ పూట దాసు అన్నం తినబోతూ రాజ్యాన్ని కూడా తనతోబాటు భోజనానికి పిలిచాడు. ఇద్దరూ కలిసి అన్నం తిన్నారు. తర్వాత దాసు స్కూలుకు వెళ్ళాడు. రాజ్యం వెళ్ళి గదిలో కూర్చున్నది.

మధ్యాహ్నం దాసు ఇంటికి వస్తాడనగా వెంకమ్మ "అన్నట్టు చంటివాడేడే?" అని కూతురినీ అడిగింది.

"ఏమో నేను చూడలేదే?" అన్నది భాగ్యమ్మ.

ఇద్దరూ చేరి ఇంటి కప్పెగిరిపోయేట్టు "ఒరే నాన్నా చిన్నాడా? సత్యం?" అని కేకలు పెట్టారు.

రాజ్యం తనగది వాకిట్లోకివచ్చి నిలబడింది. ఆమె చంకలో ఉన్నాడు సత్యం.

తల్లీ కూతుళ్ళకు ఏమనాలో తెలియలేదు.

"పిల్లవాడికోసం జామున్నర నుంచీ వెతుకుతుంటే దగ్గిర పెట్టుకుని మాట మాత్రం చెప్పకూడదూ?" అన్నది వెంకమ్మ.

"ఇప్పుడేగా వెతుక్కుంటున్నారూ?" అన్నది రాజ్యం.

"ఇప్పుడు వెతుక్కోవడ మేమిటీ? జామున్నర క్రింద ననగా వాడికి అన్నం వేళయితేనూ?" అన్నది వెంకమ్మ. ఆవిడ జామున్నర లెక్క తెమలేది కాదు.

"పదిగంటలకు వాళ్ళ నాన్నగారితోపాటు తిన్నాడుగా? ఒంటిగంట కల్లా మళ్ళీ అన్నమా?"

"ఇవాళంటే ఇవాళొచ్చావు. నీకు తెలుసాయేం వాడెప్పు డెప్పుడు తినేది" అన్నది అత్తగారు.

"తెలియదు గాని పది గంటలకు అన్నం తిన్న పిల్లవాడు మళ్ళా ఒంటిగంట కల్లా తినక్కరలేదని తెలుసు. మీరన్నట్టు జామున్నర కిందటే వాటికి తిండివేళ అయితే ఆకలికి ఏడవడేం?" అన్నది రాజ్యం.

"నీతో అధిక ప్రసంగం చెయ్యటానికి నాకు తీరికలేదు. పిల్లవాణ్ణి ఇలా ఇచ్చెయ్యి" అన్నది అత్తగారు.

"వాడికి కావలసింది నే చూస్తాను లెండి. మీకు పిల్లల్ని పెంచటం గురించి సరిగా తెలిసినట్టు లేదు. వాడి పొట్ట చూడండి. ఎలా బానల్లే ఉందో! రొమ్ములేమో ఎందుకు పోయాయి. నా వల్లకాకపోతే పెద్దవారు మీరున్నారు. సలహా అడుగుతాను" అన్నది రాజ్యం వెటకారంగా.

వెంకమ్మ నిర్ఘాంతపోయింది. ఆవిడ ఘాటుగా ఏమనాలో అని ఆలోచిస్తుండగా దాసు వచ్చాడు.

కోడలిమీద ముంచుకొచ్చే కోపాన్ని వెంకమ్మ కొడుకుమీద వెళ్ళగక్కింది.

"ఇదేమిట్రా? ఇట్లా దాపరించిందీ? పిల్లవాణ్ణి గదిలో పెట్టి దాచి ఇవ్వమంటే ఇవ్వదేం? మూడేళ్ళ వాణ్ని నా డొక్కలో పెట్టి పెంచింది దీని వాత పెట్టటానికట్రా? మంచిపనే!" అన్నది వెంకమ్మ మొహం కండలూడ బెరుక్కుంటూ.

దాసు, పెళ్ళాం చంకలోవున్న తన రెండోకొడుకు వంక ఒకసారి చూసి "వాడికేం లోటువచ్చిందిప్పుడూ! మూతంతా వీభూది రంగులేదు అది తప్పిస్తే జుట్టు దువ్వినట్టుంది. మొహం తుడిచి కాస్త శుభ్రంగా ఉంచినట్టుంది. అందుకేనా నీకు మంటా?" అన్నాడు.

"వాడికి అన్నం పెట్టక్కరలేదుట! వాడి పొట్టకు అప్పుడే దిష్టి పెట్టింది మహాతల్లి." అన్నది వెంకమ్మ.

"నన్నే అన్నదానివి నా పెళ్ళాన్ననవూ? నీ లెక్కలో నా పిల్లలకు సవతి తల్లనేగా? ఇక నాతో చెప్పి ఏం లాభం? నువు బాధపడక వూరుకో. దానికి పిల్లల పెంపకం బాగానే తెలుసు" అన్నాడు దాసు.

"నాకు పిల్లల పెంపకం చాతకాదని అదివరకే అన్నావుగా? ఇంట్లో అడుగుపెడుతూనే దానిచేత కూడా అనిపించావూ! ఇంకేం?" అన్నది వెంకమ్మ.

"నా చేత ఎవరూ అనిపించలేదు సుమండీ! అసలే పొట్టచెడివున్న పిల్లవాడికి గంటకోసారి అన్నం పెట్టాలంటే మీకు పిల్లల పెంపకం తెలీదని నేనే తెలుసుకున్నా. వెనకటి కెవరో నా పేరెట్లా తెలిసిందని అడిగినట్టుంది మీ రనేమాట" అన్నది రాజ్యం.

రాజ్యం మంచి తెగువమీరి ఉండటం కనిపెట్టాడు దాసు. కాని ఆమెను అదుపులో ఉంచదలచలేదు. తన సహాయం కోరకుండా రాజ్యం తన తల్లిని వంచుకు రావటమే అతనికి కావాలి.

ఆమె చిన్నమెత్తు పనికి తోడు రావటంలేదని, వెంకమ్మ కొడుక్కు ఫిర్యాదు చేసింది.

"రోజల్లా ఆ గదిలో కూచునుంటే దాని ఉద్దేశ్యం ఏమిటనీ?" అన్నది తల్లి "నేను వంటలక్క ననుకుంటున్నదా? ఏమిటీ రాణీవాసం? నా కర్మం కాకుండా ఉందే!"

దాసు భార్యకేసి చూశాడు.

"నేను చేసేపని ఏదన్నా వుంటే చెప్పరాదా? దీనికి పంచాయితీ లెందుకూ? నేను గదిలో ఊరికే కూచోలేదు. పిల్లవాడికి చొక్కాలు కుడుతున్నా. ఇందులో ఒకరు వంటలక్కేమిటి? ఒకరు పనిమనిషేమిటి? నాకూ వంట చెయ్యటం చాతనవును.

కావలిస్తే వంటంతా నేను చేస్తా, వంటలక్క_నా అని అడక్కు_ండానే!" అన్నది రాజ్యం.

"ఇంటి మనిషి ఇంటిపనులు కనుక్కు_ని చెయ్యాలిగాని ఒకరు చెప్పేదేమిటి?" అన్నది అత్తగారు.

"నేను చేస్తున్నది నా సొంతపని కాదు" అన్నది రాజ్యం.

"ప్రతిదానికీ నాతో చాడీలు చెప్పకండి. నేను తీర్పులు దిద్దేవాణ్ని కాను. ఏదన్నా తేలకపోతే మీరూ మీరూ తేల్చుకోండి" అన్నాడు దాసు.

# 12

గోపీ మటుకు తన సవతి తల్లిని గురించి ఎటూగాని పరిస్థితిలో పడ్డాడు, రాజ్యం ఇంకా కాపరానికి రాకపూర్వమే వితంతువులిద్దరూ వాడి మనస్సు బాగా విరిచిపెట్టారు.

"ఒరే, మీ కాన్న మళ్ళీ పెళ్ళిచేసుకుంటున్నాడ్రా! నీకు సవతితల్లి వస్తుంది. నిన్నూ, నీ తమ్ముణ్ణి నానా హింసలూ పెడుతుంది. అందుకే మీనాన్న పెళ్ళి చేసుకుంటున్నాడు. నువ్వంటే మీ నాన్నకు మరీ కోపం. అవునా, కాదా? నీకు మీ నాన్న ఇష్టమా, మే మిష్టమా? నా తండ్రే! నే చచ్చిపోయినానే! వాడికిమట్టుకు తెలీదుటే? అయితే చూడు నాన్నా, మీ సవతితల్లి నిన్నేమన్నా అంటే ఏం చేస్తావో చెప్పు చూతాం? ఛీ! అది నువు చంపితే చస్తుందిట్రా? మన అందరి ఆయుస్సూ పోసుకు బ్రతుకుతుందిగానీ! నిన్నేమన్నా అంటే నాకో, అత్తయ్యకో చెప్పేం? మీ నాన్నకు చెప్పకు, వినిపించుకోడు."

ఈ ధోరణిలో గోపీకి చాలారోజులు రహస్యబోధ జరిగింది. వాడు ఏ కారణంచేతో తన సవతితల్లి కూడా తన నాయనమ్మల్లేనూ వితంతువై ఉంటుందని ఊహించుకున్నాడు. ఆ మనిషిని గురించి తన మనస్సులో ఒక రూపం కల్పించుకుని ఆ రూపాన్ని మనస్ఫూర్తిగా ద్వేషించాడు. అందుచేత వాడికి ముందుగా చేసిన ఉపదేశం దాదాపు వ్యర్థమయింది. ఎందుకంటే, గోపీ ద్వేషించిన మనిషికీ రాజ్యానికీ ఏమీ సంబంధంలేదు. రాజ్యం వాడి కళ్ళకు కళకళ్ళాడుతూ ఎంతో ముచ్చటగా కనపడింది. అంత చిన్నవయసుదీ, అందులో పునిస్త్రీ ఇంట్లో మసలటం వాడెరగడు. వాడికి తన తల్లి ఏమీ జ్ఞాపకం లేదు. నగలు పెట్టుకునీ, మంచి చీరె కట్టుకుని, ఇంత పెద్ద జడా, జడలో పూలూ పెట్టుకునీ, చేతుల గాజులూ, మెళ్ళో నగలూ గలగల్లాడుతూ రాజ్యం అటూ ఇటూ కదులుతుంటే గోపీ ముగ్ధుడయిపోయినట్టయినాడు.

రాజ్యం స్నానానికి వెళ్ళిన సమయంలో వితంతువులు వాణ్ని వంటింట్లోకి పిలిచి మళ్ళీ పురెక్కించవలసి వచ్చింది. రాజ్యం స్నానం చేసివచ్చి గదిలో మొహా

నికి పౌడరు వేసుకుంటుండగా గోపి యోధుడల్లే గదిలోకివెళ్ళి తన సవతితల్లి కెదురుగా, చేతులు వెనక్కి కట్టుకుని నిలబడ్డాడు.

"ఏం?" అన్నది రాజ్యం నవ్వుతూ.

గోపి మాట్లాడలేదు.

"నీ పేరేమిటి?" అన్నది రాజ్యం అద్దంలో మొహం కలయజూచుకుంటూ.

గోపి దానిక్కూడ సమాధానం చెప్పలేదు.

"నువు చెప్పకపోతే నాకు తెలుసులే. నీపేరు గోపి" అన్నది రాజ్యం వాడి కేసి చూస్తూ.

"నువు మా యింటి కెందుకొచ్చావు? పో" అన్నాడు గోపి.

"ఈమాట ఎవరనమన్నారూ?" అన్నది రాజ్యం.

గోపి మొహంలో ఏదో భయం కనిపించింది. వాడొక్క క్షణంపాటు కళ్ళు పెద్దవిచేసి రాజ్యంకేసి చూసి గదిలోనుంచి పారిపోయినాడు.

గదిలో రాజ్యం అన్నమాట ఏ చాటునుండో భాగ్యమ్మ విని అయినా ఉండాలి. లేదా గోపి వెళ్ళి ఆవిడకు చెప్పి అయినా ఉండాలి. మరి అయిదు నిమిషాల అవతల దొడ్లో మడిబట్టలు ఆరేస్తున్న భాగ్యమ్మ "ఆరేళ్ళ వెధవకు ఎవరేమిటో తెలీదూ ? ఒకరు చెప్పాలా ఏమిటి?" అని గింజుకోవటం గదిలో ఉన్న రాజ్యానికి వినిపించింది.

ఏమయినా రాజ్యం గోపీని ఆకర్షించటం మానలేదు. వాడు ఉన్నట్టు ఉండి రాజ్యం గదిలో ప్రవేశించాడు. రాజ్యంకేసి అట్లాగే చూసేవాడు. రాజ్యం తన కేసి చూడగానే పారిపోయేవాడు. ఇది మొదటి దశ. కొద్దిరోజుల్లో వాడు తనతో సావాసం ప్రారంభిస్తాడని రాజ్యం ఊహించింది. తాను తొందరపడ దలచలేదు. ఎట్లాగైనా యీ పిల్లలిద్దరిని వితంతువులనుంచి వేరు చెయ్యాలనే పట్టుదల ఆమెకు కలిగింది. ఆ పిల్లలమీద ఆమెకింకా అనురాగం లేదు. కాని ఇటువంటి ఉద్యమం ఒకటి పెట్టుకోవటం అవసరమనీ, లేకపోతే తనకీ యిల్లు దుర్భరమవుతుందనీ రాజ్యం అనుకుంది.

ఏ పనిచెబితే ఆ పని చేస్తానని రాజ్యం మాటవరసకు అన్నదేగాని, అత్తగారు ఆడబిడ్డా పురమాయించే పనులు చేద్దామన్న ఉద్దేశం ఆమెకులేదు. ఈ సంగతి ఆమె దాసుకు చెప్పింది.

తన భార్య ధోరణి దాసుకు పూర్తిగా నచ్చలేదు. పెళ్ళాన్ని శాసించాలనే ఆకాంక్ష దాసుకులేదు. ఎవరిని గాని శాసనంక్రింద ఉంచే ఓర్పు దాసుకులేదు. తన తల్లిని కూడా అతనెన్నడూ శాసించలేదు. కాని తల్లిని శాసించ లేకపోయి నాడనిపించుకోడానికీ, పెళ్ళాన్ని శాసించలేక పోయినాడనిపించుకోటానికీ, వ్యత్యాసం ఉంది. రెండోది పెళ్ళాం మొగుణ్ని చెవులకు పిడకలుకట్టి ఆడిస్తున్నదన్న మాట రావటం జనఖ్యాతికే మంచిదికాదు. రాజ్యానికీ మంచిదికాదు.

కాని రాజ్యం ఇంట్లో తన అధికారం చెలాయించుకోగలిగితే తనకూ పిల్లలకూ మంచిదేకాక, కొంపలో నిజమైన శాంతి ఉంటుంది. అందుచేత తనభార్య పద్ధతులు తనకు పూర్తిగా నచ్చకపోయినా దాసు ఆమెకు అడ్డం రాదలచలేదు. అదేకాక రాజ్యం తనతో ముందు చెప్పకుండా ఏదీ చెయ్యదు. "నా అంతట నేను వాళ్ళతో గిల్లికజ్జా పెట్టుకోను. మీరు ఒక్కనాటికీ అనుకోకండి" అని మాట ఇచ్చింది రాజ్యం.

ఆమె సత్యానికి అన్ని పనులూ తానే చేసేది. వాణ్ని వెయ్యికళ్ళతో కనిపెట్టి ఉండేది. ఎప్పుడు అవకాశం దొరికినా వితంతువులు వాణ్ని గద్ద తను కుపోయినట్టు తన్నుకుపోయి ఏదో ఒకటి మేపటానికి ప్రయత్నించేవాళ్ళు.

"అలా పిల్లలకు ప్రతిగడ్డీ పెట్టరాదు. నే చెబితే మీకు నమ్మకం లేకపోతే ఏ డాక్టర్నన్నా అడగండి. పెట్టదలచినవాళ్ళు చాటుమాటున పెట్టటం కూడా దేనికి ఇంటికి పెద్దవాళ్ళు పెద్దరికంగా ఉంటే బాగుంటుంది" అనేది రాజ్యం.

"చాల్లే, మాటలు నేర్చావ్! నువుగాంగా వచ్చి మా దొంగతనం పట్టావు!" అనేది వెంకమ్మ.

"ఇటువంటి దొంగతనాలు పట్టటానికి పోలీసులు కావాలా?" అనేది రాజ్యం.

సత్యంతో వితంతువులకు ఇంకో చిక్కొచ్చింది. వాళ్ళ చంకలో ఉండగా రాజ్యం, "రా, నాన్నా" అని పిలిస్తే ఇకవాళ్ళ చంకలో ఉండేవాడు కాడు.

ఒకరోజు తల్లీ కూతుళ్ళు దాసుతో పెద్దపెట్టున ఫిర్యాదుచేశారు. "ఇదేమిట్రా? ఆ చంటివెధవ మమ్మల్ని ముట్టుకుంటే మైలపడిపోతాడూ? ఈ మూడేళ్ళూ వాణ్ని మేం సాకామా, తను సాకిందా? ఒక్క క్షణం వాణ్ని మా దగ్గిర ఉండనివ్వదేం? ఆ పిల్లలకోసం కాకపోతే యీ కొంపలో మేమెందుకున్నట్టూ? ఈవిడకు కాచి పొయ్యడానికా?"

అంతా విని దాసు "దానికి వాణ్ని పెంచే పద్ధతి మీకన్న బాగా తెలుసు. సవతితల్లి పిల్లవాణ్ని చూస్తున్నదని తహతహ లాట్టం నేనెక్కడా చూళ్ళేదు. ఈ నెలరోజుల్లోనూ వాడు ఎంతో బాగుపడ్డాడు. వాడి పొట్ట తగ్గిపోయింది. బెండల్లే ఉండేవాడు, ఎత్తుకుంటే బరువుగా ఉంటున్నాడు. మనుషుల మొహాలు చూసి ఇంత కాలానికి నవ్వుతున్నాడు. కాస్త కాస్త మాటలు కూడా వస్తున్నాయి. తప్పటడుగులు వేస్తున్నాడు. ఇదంతా చూసి సంతోషించలేకపోతే మీకు వాడిమీదున్న అపేక్ష ఎటువంటిదనుకోవాలి?" అన్నాడు.

"మూడేళ్ళు నిండటానికి సిద్ధంగా ఉన్న వెధవ తప్పటడుగులు వేయటం నీ పెళ్ళాం మహాత్యమే నంటావ్?" అన్నది తల్లి.

"అట్లా అయితే మూడేళ్ళపాటు వాడు ముడ్డిన దేకటం నీ మహాత్యం మను

కుంటాలే. అవసరమైనదానికీ, అవసరం లేనిదానికీ రాద్ధాంతం చెయ్యకండి" అన్నాడు దాసు.

ముందు ముందు ఏమైనా ప్రస్తుతానికి మట్టుకు కొంపలో అశాంతి హెచ్చటం దాసుకు కనిపించింది. వెంకమ్మకు కోడలిమీద రోజురోజుకూ పగ జాస్తి అయిపోతున్నది. ఒకనాడు ఆవిడ వంట మానేసి వొంట్లో బాగాలేదని పడుకున్నది.

"ఏమండీ వంట మీరు చేస్తారా? నన్ను చెయ్యమన్నారా?" అని రాజ్యం భాగ్యమ్మ నడిగింది.

"ఇంతెత్తు చాకిరి ఒంటెత్తున చెయ్యాలి. ఎట్లా తెములుతుందమ్మా?" అన్నది భాగ్యమ్మ, మడిబట్టలు ఆరేసుకుంటూ.

"నన్ను చెయ్యమంటే నేను చేస్తా. కాని నాకు తడి మడీ ఆచారము తెలీవు" అన్నది రాజ్యం.

రాజ్యం వంటింటోకి ప్రవేశించిన మరుక్షణం వెంకమ్మ పక్కమీద నుంచి లేచివచ్చి "నువు వంట చెయ్యకపోతే పీడాపోయింది. ఇల్లంతా మైల చెయ్యకు" అని రాజ్యాన్ని సాగనంపి, "మడి తెలీదుట! బ్రాహ్మణ జన్మెత్తలా? ఇంటో ఆచారం గల వాళ్ళం ఏడిస్తిమిగా? తడిబట్టకడితే వొళ్ళు పుచ్చిపోతుంది కామాలు" అని తనలో తాను మాటాడసాగింది.

రాజ్యం ఇంటిపని ఏమీ చెయ్యటం లేదన్న ఆరోపణ మీద దాసు పంచాయతీ చెయ్యక తప్పిందిగాదు! దాసు ఈ పంచాయతీని చాలా నేర్పుగానే జరిపాడు. పాచి పని చేయటానికి మనిషి ఉన్నది. మిగిలిన "చాకిరీ" యావత్తూ వెంకమ్మ, భాగ్యమ్మల ఆచారానికి సంబంధించినవేగాని మరొకటి కాదు. రాజ్యం ఎంత ఆచారంగా ఉండటానికి ఒప్పుకున్నా పునిస్త్రీ ఆచారం వితంతువులకు ఎన్నటికీ సరిపోదు. పైగా పిల్లలున్నారు. రాజ్యం రాకమునుపు వెంకమ్మో, భాగ్యమ్మో ఎవరో ఒకరు పిల్లలకోసం మైలలో ఉండేవాళ్ళు, మిట్టమధ్యాహ్నందాకా. ఇప్పుడు ముగ్గురాడవాళ్ళూ మడిలో ఉండటం అర్థం లేనిపని. రాజ్యం మడిలోకి రాకుండా ఉండటం అన్ని విధాలా మంచిదని దాసు తేల్చాడు.

# 13

గోపీలో కొంత మార్పు కలుగుతున్నదిగాని, అది ఇంకా పైకి కనపడ లేదు. వాడింకా వెనుకటి మాదిరిగానే తన నాయనమ్మమీదా, సాగినంత వరకు మేనత్తమీదా తన ప్రభావం చూపిస్తూనే ఉన్నాడు. వాడు ఏడిచి రాగాలు పెట్టి నప్పుడెల్లా వెంకమ్మ జావజావఅయి హిరణ్యాక్షవరాలు వాగ్దానం చేస్తూనే ఉంది. అయినా వాడికిప్పుడు ఆవిడమీద విజయం సాధించటంలో వెనకఉన్న ఆనందంలేదు. ఒక్కసారి రాజ్యం తనను చూసి జాలిపడి, తన పక్షం అయితే బాగుండునని వాడికి

మహా ఉన్నది. అటువంటప్పుడు వాడు తన నాయనమ్మా, మేనత్తా, "ఎందుకేడుస్తు న్నావురా? ఏం జరిగిందిరా? చెప్పరా? తండ్రీ! ఎందుకేడిపిస్తావురా?" అని అడిగితే సమాధానం చెప్పక ఏడుస్తూనే రాజ్యం గదివైపు చూసేవాడు.

"ఒరే, ఒక్కమాట విను. ఈ మాటకు సమాధానం చెప్పి, తరువాత ఏడుద్దు వుగాని" అని వెంకమ్మ రహస్యంగా చెప్పేది. వాడు ఏడుపు మానేవాడు.

"మీ పిన్ని నిన్నేమన్నా అన్నదా?" అని అడిగే దావిడ రహస్యంగానే.

దాంతో వాడు మరింత పెద్ద పెట్టున శోకం ఎత్తుకునేవాడు.

"అదే ఏదో చేసి ఉంటుంది, ఇంకా సందేహం దేనికి?" అని భాగ్యమ్మ తల్లికి ఊతమిచ్చేది.

"ఏమన్నా అంటే మనతో చెప్పకూడదుటే. పిచ్చి వెధవ! దానిసంగతి మనం కనుక్కుంటాంగా?" అనేది వెంకమ్మ.

భాగ్యమ్మ గొంతెత్తి, "కాకపోయినా, తన మానాన తనుండరాదూ? చిన్న వెధవ, వాడిజోలి తన కెందుకూ? తల్లి లేనివాడని అంత అలుసా?" అని పేలేది.

రాజ్యం ఆ మాటలు విని తననే అంటున్నట్టు ఊహించేది? కాని వాళ్ళతో ఏమీ అనక దాసుతో మాత్రం తరవాత చెప్పేది.

"వాళ్ళకు నేనే అపకారమూ చెయ్యలేదుగదా. నన్ను వీళ్ళింత ద్వేషంతో ఎందుకు చూస్తారా అని ఆశ్చర్యంగా ఉంటుంది. వీళ్ళు నిజంగా ఇంత కుళ్ళు మనుషులు కాదేమో. నేనే వీళ్ళలో ఈ కుళ్ళు తెచ్చి పెట్టానేమో అనికూడా అని పిస్తుంది. మనుషులకు అసూయ లుండొచ్చు. మా వదినెకు నన్నుచూస్తే, అసూయ గానే ఉండేది. ఆవిడా, ఆవిడ మొగుడూ, పిల్లలూ హాయిగా ఉండకుండా నేను పానకంలో పుడకల్లే, సత్రకాయల్లే మధ్య ఉంటూండేదాన్ని. అయితే ఏమాట కామాటే చెప్పాలి. ఆవిడ నాపట్ల ఇంత ఘోరంగా ఎన్నడూ ప్రవర్తించలేదు. ఒకప్పుడు కాకపోతే ఒకప్పుడన్నా నాతో మంచిగా ఉండేది. ఆవిడతత్వం నాకు మొదట అర్థం కాకపోయినా పెద్దయినాకనన్నా అర్థమయింది. కాని వీళ్ళ తత్వం అర్థంచేసుకోవా లంటే నా చదువూ నాకున్న తెలివితేటలూ చాలటం లేదు. ఇంత తెలీని మనుషుల మాటలు పట్టించుకోవటమేమిటని ఒక్కోసారి అనిపిస్తుందిగాని, ఒక్కొక్కపుడు మాత్రం వీళ్ళచేత ఈ మాటలన్నీ ఎందుకు పడుతున్నానా అనిపిస్తుంది....నేను మీతో నన్నా చెప్పుకుంటున్నా. అదికూడా నోచుకోని ఆడవాళ్ళెందరున్నారో?" అన్నది రాజ్యం.

దాసు తన తల్లిని గురించీ, అక్కను గురించీ అదివరకు బాధపడ్డదానికంటే కూడా ఈ మాటలకు ఎక్కువ బాధపడ్డాడు.

"మావాళ్ళ గురించి నాకు తెలీదా? ఇంకెందుకూ కాకపోతే నన్నుచూసి అయినా వాళ్ళను కొంతవరకు సహించు. మరీ దుర్భరమైనప్పుడు ఏదో ఒకటి చెయ్యవచ్చు.... సత్యం బ్రతికి బట్టకడతాడని నేనెన్నడూ ఆశపడలేదు. అటువంటిది

ఇప్పుడు వాడిమీద ఆశ కలుగుతున్నది. గోపీనికూడా నువు బాగుచెయ్యగలవేమో అనే ఆశ పీకుతున్నది. నువ్విప్పుడు వాణ్ని చూసి నమ్మలేవేమోగాని, ఒకప్పుడు వాడు తన ముద్దుబిడ్డ. వాడికి తెలివితేటలుండేవి. తెలివిగా మాట్లాడేవాడు. వాణ్ని ఇవాళ నేనే గుర్తు పట్టలేదు. మా అమ్మ వాణ్ని అట్లా చేసింది" అన్నాడు.

"ఇప్పటికన్నా వాడు తెలివిగలవాడే, కాని ఏం లాభం?" అన్నది రాజ్యం.

రాజ్యం దగ్గిర చీమ తలకాయంత అలుసు ఎట్లాగన్నా దొరుకుతుందేమోనని గోపీ విశ్వప్రయత్నం చేస్తున్నాడు. వాడు రాజ్యం దృష్టి ఆకర్షించడానికి అచ్చగా ఏడవటమేకాక, కోతివేషాలుకూడా వేసేవాడు. ఈ వేషాలు చూసి వాడి నాయనమ్మ చాలా అబ్బురపడేది. "ఓరి వెధవా!" అని ముక్కుమీద వేలేసుకుని ఆనందించేది.

ఏడిచినా, కోతి మొగ్గలు వేసినా తన నాయనమ్మ అంత సులభంగా తన చేత ఆకర్షించబడుతుందిగదా. తన సవతితల్లి ఎందుకు గమనించలేదని గోపీ కొంత కాలం ఆత్మవంచన చేసుకున్నాడు.

"నా గదిలోకి వచ్చి కోతిగంతులు వెయ్యకు. నాకు తగని అసహ్యం. నువు ఏడ్చినాకూడా అసహ్యమే" అని రాజ్యం వాడితో ఖచ్చితంగా చెప్పేసింది ఒకసారి.

ఇంత అవమానం భరించలేక గోపీ కిటికీలో ఉన్న అద్దం తీసుకుని లాగి గోడకేసి పగులగొట్టాడు. వాడి తప్పులేదు. అటువంటి అఘాయిత్యంచేస్తే వెంకమ్మయితే వాడికి సాష్టాంగపడి వాడినోట అడక్కుండానే అన్ని వరాలూ ఇచ్చేస్తుంది. "నీ కోపం వచ్చిందానాన్నా? కొట్టు, నన్ను కొట్టు!"అని ఆవిడ నెత్తిమీది ముసుగు కూడా తీసెయ్యటం కద్దు. గోపీ ఆవిణ్ని కొట్టటమూ కద్దు.

రాజ్యం కూడా ఇట్లాగే ప్రవర్తిస్తుందని అనుకున్నవాడైతే గోపీ చాలా పొరపాటు పడ్డాడు. అద్దం గోడకింకా తగిలి పగలకముందే రాజ్యం చివాలున లేచింది. ఆమెనుచూస్తే ఆ క్షణంలో గోపీకి అదురు పుట్టింది. ఆమె మొహంలో అంత కోపం వాడెన్నడూ ఎరగడు. అదీకాక అఘాయిత్యం చేసేవాళ్ళందరిలాగే గోపీ పిరికివాడు.

గోపీని సున్నంలోకి ఎముక లేకుండా కొట్టాలన్నంత ఉద్రేకాన్ని రాజ్యం ఎంతో బలవంతాన అణుచుకున్నది. ఆమె వాడి రెక్కపట్టుకుని గది బయటకి ఈడ్చుకుపోయి వదిలిపెట్టి "పో! నా గదిలో అడుగు పెట్టావంటే మక్కెలు విరగదంతా జాగర్త. నా సంగతి నీకు తెలీదు. నేను మీ నాయనమ్మ ననుకున్నావేమో?" అన్నది తలుపు దబాలున మూస్తూ.

తలుపు మూతపడ్డ తరువాత గోపీకి గొంతెత్తి ఏడిచే ధైర్యం వచ్చింది. మరుక్షణంలో నాయనమ్మ మొహమూ, మేనత్త మొహమూ చూసేసరికి ధైర్యం

వెట్టింపయింది. కాని యీ ఏడుపులో ఈసారి కొంత పాలు నిజమైన దుఃఖం లేక పోలేదు. దానికి కారణం వాడు రాజ్యాన్ని ఆకర్షించటానికి ఇన్ని ప్రయత్నాలూ చేసి ఆఖరుకు గది బయటికి నెట్టించుకోవటం.

కాని వాడి మనసులో ఏమున్నదీ విచారించిన వాళ్ళెవరు? రాజ్యం అన్న మాట విని వెంకమ్మ తాచుపాములాగా లేచింది. కోడల్ని పేరుపెట్టి నానా తిట్లూ తిట్టింది. "కళ్ళు నెత్తికొస్తున్నాయా, చచ్చేట్టు వండిపెట్టిన తిండి వంట పట్టిందా? ఎవరి అంతరం ఏమిటో తెలీటంలేదా? నాలుకకు హద్దూపద్దూ లేకుండా పోయిందా?" అని అడిగింది.

"ఏమనుకుంటున్నావే నువ్వు? నిన్ను వెయ్యి పుటాలు వేసినా నేను కాలేవు. వాడు మట్టుకు నిన్నుచూసి నాయనమ్మ అని ఎందు కనుకుంటాడు? ఎవరిది రక్త సంబంధమో, యెవరు వాడి ప్రాణానికి మహమ్మారో వాడికి తెలీదూ? మక్కెలు విరగదంతావుగా? వాడెవడనుకున్నావ్? అంత కండ కొవ్వేం? వాడి వొంటిమీద చెయ్యివెయ్యి, నిన్ను నిలువునా చీలిపించకపోతే నా పేరు వెంకమ్మకాదు! ఆఁ!" అన్నది వెంకమ్మ.

రాజ్యం పడి ఊరుకోలేదు.

"పెద్దవారు, అనవసరంగా తూలి మాట్లాడకండి. నేనెవరో మీ రెవరో నాకు తెలీకపోలేదు. ఈ ఇంటికి మీ రెట్లావచ్చారో నేనూ అట్లాగే వచ్చా. గోపీ నా గదిలోకి వచ్చి మీ దగ్గర వేసే వేషాలు వేస్తే తప్పక మక్కెలు విరగదంతాను. ఆ తర్వాత మీరు నన్నెట్లా చీల్పిస్తారో చూస్తాను. అరిచినంతమాత్రాన మీ రనేదంతా నిజమూ, నేననేదంతా అబద్ధమూ అయిపోదు. గోపీ జోలికి నేనెన్నడూ పోవటంలేదు. నాకు సత్యం కన్నకొడుకు కాడు. గోపీ శత్రువు అంతకన్నా కాడు. మీరే వాణ్ని ఎందుకూ పనికిరాకుండా చేస్తున్నారు. సవతి తల్లికీ సవతి పిల్లలకూ శత్రుత్వమంటే లోకం నమ్ముతుందిగదా అన్న ధైర్యంకొద్దీ మీ యిష్టం వచ్చినట్టు మాట్లాడకండి. లోకం కబుర్లు చెబుతుంది. ఉద్ధరించదు. నిజం ఏనాటికన్నా గోపీ తెలుసుకోలేకపోడు. మగవాడు, ఎప్పటికన్నా ప్రపంచ జ్ఞానం సంపాదించకపోడు. ఇప్పటిమట్టుకు వాడికి మీకూ నాకూ ఉండే తేడా తెలుసుకోలేక, మీరు హర్షించే పనులన్నీ నా దగ్గిరా చేస్తున్నాడు. నేను సహించనని మీతోకూడా చెబుతున్నా. వాడు నా దగ్గరికి వచ్చి అఘాయిత్యప్పన్లు చెయ్యకుండా చూడండి చాతయితే. మీకు చాతకాకపోతే నేనే తగు జాగర్తపడాలిసొస్తుంది?" అన్నది రాజ్యం.

ఆమె లోపల్లి ఎంత మంట మండుతున్నదంటే, తన నోటవచ్చే మాటలన్నీ సబబుగా ఉన్నదీ లేనిదీ కూడా ఆమె నిర్ణయించుకోలేక పోయింది. అదీగాక మనుష్యులకు ఎదుర్తు తిర్గి నోరు పారేసుక మాట్లాడటం వెంకమ్మకు అల వాటున్నట్లుగా రాజ్యానికి లేదు. అందుచేత ఈ సంఘటనవల్ల వెంకమ్మ తెక్కు చెదరలేదు గాని రాజ్యం నీరసించిపోయింది. ఆమెకు కాళ్ళూ చేతులూ వణ్ణ

బడ్డాయి. ఆగకుండా శరీరం చెమటలు కమ్మింది. భరించరాని తలనొప్పి వచ్చేసింది. గది తలుపు గడి వేసుకుని నిద్రపోవటానికి ప్రయత్నిస్తే ఆఖరుకు కళ్ళయినా మూతపడలేదు....

తన మాటలు వినిపించుకోకుండా రాజ్యం గదితలుపులు వేసుకున్నప్పటికీ వెంకమ్మ అనదలచుకున్న అవాచ్యాలన్నీ కోడల్ని అని, మనవణ్ణి పరామర్శించాలన్న మాట జ్ఞాపకం వచ్చి "నా కన్నతండ్రి గదరా! నీకి పీడ ఎందుకు దాపరించిందిరా" అంటూ వాణ్ణి దగ్గిరికి తీసుకోబోయింది.

గోపీ ఆవిణ్ని నెత్తిమీద ఒక్కటి పెట్టి "పో, వెధవముండా! నన్నంటుకోకు!" అంటూ తప్పించుకు పోబోయినాడు. అంత దూరంలో నిలబడి ఆనందించే భాగ్యమ్మ, "ఆఁ? ఆఁ? అదేమిట్రా? నానమ్మను, అట్లా అనొచ్చట్రా?" అంటూ వాణ్ణి పట్టుకోబోయింది. గోపీ ఆవిడ చెయ్యి గట్టిగా కొరికి పారిపోయినాడు.

జరిగిందేమిటంటే, వెంకమ్మ రాజ్యాన్ని అన్నమాటలు వాడికి కలిగించిన ఆనందం ఒక్క క్షణంకూడా దక్కలేదు. పెద్దవాళ్ళను అంచనాకట్టే శక్తి పిల్లలకు అపారంగా ఉంటుంది. వెంకమ్మ రాజ్యాన్ని అన్న మాటల్లో లేని బలం రాజ్యం వెంకమ్మని అన్న మాటల్లో గోపీకి కనిపించింది. వాడికి తన నాయనమ్మ మీద కోపం వచ్చింది.

"నీ పెళ్ళాం ఏం చేసిందో చూశావుట్రా?" అని వెంకమ్మ దాసుతో ఇంకా రెండు గంటలకు ఫిర్యాదు చేస్తుందనగానే గోపీ రెండోసారి పిల్లిలాగ రాజ్యం గదిలోకి ప్రవేశించాడు.

"ఏం?" అన్నది రాజ్యం కోపంగా.

"నీ అద్దం పగలగొట్టాగా ఎట్లా?" అన్నాడు గోపీ.

"నా బ్రతుక్కి అద్దం ఒకటి తక్కువయింది....ఇంకేం పగలగొట్టటానికి వచ్చావ్?" అన్నది రాజ్యం.

"నే నేం పగలగొట్టటానికి రాలా! నిజం!" అన్నాడు గోపీ, తన మాట రాజ్యం నమ్మాలని విశ్వప్రయత్నం చెయ్యటానికి సిద్ధంగా ఉన్నవాడల్లే.

గోపీ చేసినదానికి క్షమాపణ చెప్పుకున్నా రాజ్యం అంత సంతోషించి ఉండదేమో.

'పాపం, వాణ్ని చూసి కోప్పడి ఏం లాభం? అంతా ఆ రాక్షసముండ చేస్తున్నప్పుడు!' అనుకున్నది రాజ్యం. ఆమె తలనొప్పి ఒక్కసారిగా సహం తగ్గినట్టయిపోయింది.

"ఇట్లా వచ్చి కూచో గోపీ! నువ్వెందుకిట్లా వెధవపన్లు చేస్తావ్? నీ సాటి పిల్లలు చూడు, ఎట్లా ఉంటారో? నువ్వు వెళ్ళి ఎవరితోనూ కలిసి ఆడుకోనన్నా ఆడుకోవేం? ఆడపిల్లవా? అస్తమానం ఇల్లు కదలకుండా కూచుంటావు!" అన్నది రాజ్యం.

"నా ఇష్టం" అన్నాడు గోపీ. మాటలో ఉన్న దర్పం గొంతులో లేదు.

"నీ మొఖం! నీ ఇష్టం ఎవరు సాగనిస్తారు? ఎన్నాళ్ళు సాగనిస్తారు?" అన్నది రాజ్యం.

"నాకు తింటానికేదన్నా పెట్టు."

"నే నెందుకు పెట్టాలి? మనిద్దరికీ విరోధం. మీ నానమ్మనడుగు."

"నే నా వెధవముండతో అసలు మాటాణ్ను."

రాజ్యం సంతోషం ఆపుకోలేక పైకి నవ్వేసింది. రాజ్యం నవ్వటం చూసి గోపీ మొహం వికసించింది.

"నువ్వు మంచి అబ్బాయిగా ఉంటేనే నీ కేమన్నా పెట్టటం. సత్యం చూడు ఎంత మంచివాడో!"

"నువ్వు సత్యాన్ని ముద్దు పెట్టుకుంటావు!" అన్నాడు గోపీ.

"అదే నేనూ అంటున్నాను. సత్యం మంచివాడు, నువ్వు చెడ్డవాడుగా ఉండటం దేనికి?"

"నేనూ మంచివాణ్నే."

"కావు. నువు నిజంగా మంచివాడివైతే నేనుచెడ్డవాడి వంటానా?"

నీకు నన్నుచూస్తే కోపమా?"

"నువ్వంటే కాదు—నీ పాడు పన్లు చూస్తే కోపం. మంచిపన్లు చేస్తే ఎందుకో్కపం ఉంటుందీ?"

గోపీ కాస్సేపు ఆలోచించి, "అద్దం పగులగొట్టానని నాన్నతో చెబుతావా?" అన్నాడు.

"ఎందుకు చెప్పనూ? ఏం చెబితే?" అన్నది రాజ్యం.

"మా నాయనమ్మయితే చెప్పదు. నీకు నేనంటే కోపం. అందుకని చెబుతావు" అన్నాడు గోపీ.

"అట్లా కానేకాదు. మీ నాన్నకు నువ్వంటే ఇష్టం. కనుక నువ్వేదన్నా చేస్తే చెప్పాలి. తెలిసిందా? మీ నాన్నకు తెలుస్తుందంటే నువ్వు చెడ్డ పన్లు చెయ్యవు అవునా కాదా?" అన్నది రాజ్యం.

"మా నాన్నకి తెలిస్తే నాకేం భయంలేదు" అన్నాడు గోపీ.

"భయం లేకపోతే, మా నాన్నకి చెబుతావా అని ఎందుకడిగావ్? నువ్వు పాడు పన్లి చేస్తే అందరికీ తెలుస్తుందని భయం ఉండొద్దు గోపీ? భయం లేనివాళ్ళె చెడ్డవాళ్ళు. చెడ్డవాళ్ళకి చెడ్డపనులు చెయ్యటానికి భయముండదు. నువ్వు మంచి వాణ్నన్నావే?"

గోపీ మళ్ళీ ఆలోచించాడు. "ఈసారికి చెప్పకుండా వుంటే ఇంకెప్పుడూ పాడుపని చెయ్యనుగా!" అన్నాడు.

"సరే చూద్దాం. ఈ మాటమీద ఎంతకాలం ఉంటావో! ఇందా పిప్పరమెంట్లు. అన్నీ తినెయ్యక కొన్ని దాచుకో."

# 14

గోపీ ప్రవర్తన వితంతువుల కెంతమాత్రం అర్థంకాలేదు. వాడికింత కోపం వచ్చినా తమను తన్నే తన్నులు తన్ని, తిట్లే తిట్లు తిట్టి తన కోరికలు చెల్లించు కొని అఖరకు రాజీపడి "నువ్వంటే నాకిష్టం!" అని మరీ వెళ్ళేవాడు. ఈసారి వాడు ఇద్దర్నీ తిట్టి ఏ వరాలు కోరకుండానే, వాళ్ళతో రాజీపడకుండానే వెళ్ళిపోయినాడు. ఇటువంటిది అదివరకెన్నడూ జరగలేదు.

దీని అంతరార్థం గురించి వంటింటో తర్కవితర్కాలు జరిగాయి.

"అది మనమీద వాడి మనస్సు విరుస్తున్నదేమోనే?"అన్నది తల్లి. తనకు వాడి మనస్సు విరచటం పరిపాటి కనుక అందరూ అదే పద్ధతి అవలంబిస్తారని అవిడకు గట్టి నమ్మకం.

"అదెట్లా అవుతుందమ్మా? మనం వింటుండగానే అది వాణ్ణి నానా మాటలూ అనెనుగా! వాడేడుస్తుండెగా!" అన్నది కూతురు.

"నిజమేగాని, వాడి కప్పుడప్పుడూ ఏదో పెంట పెట్టటం లేదనుకున్నావా? వొద్దురా అని ఎన్నిసార్లు చెప్పినా వినక దేబిరించుకుంటూ ఆ గదిలోకి పోయి దాని కెదురుగా నుంచుంటాడు. అది గెంటితేగాని బయటికిపోడు. నీకు తెలీదు, అది వాణ్ని మెల్లిమెల్లిగా చేరదీస్తున్నది. అమ్మో అట్లా ఉందిగాని దానికెన్ని ఆలోచ నలనుకున్నావేం? ఈ వెధవ దాని కెదురుగా వెళ్ళి దేవిరించబట్టే దానికి రాను రాను మనం అలుసవుతున్నాం. అటువంటి దానికి ఏమాత్రమన్నా సందివ్వవచ్చునా? దాని చేత ఇన్ని మాటలూ పడ్డాడా, గెంటించుకున్నాడా, పీడు మళ్ళీ రేపు దాని గదిలోకి పోతాడు. వెధవకు అభిమానమన్నా లేదేం?" అన్నది తల్లి.

వాళ్ళా మాటలనుకుంటున్న సమయంలోనే వాడు రాజ్యం గదిలో ఉన్నట్టు తెలిస్తే, తన మాట నిజమైనందుకు ఆ ఇల్లాలు ఎంత సంతోషించేదోకాని, తీరా ఈ సంగతి ఆవిడ తెలుసుకునే సమయానికి ఆవిడకి ఆనందండక్కే యోగ్యత లేకపోయింది.

కాస్సేపటికల్లా గోపి గుప్పిట్లో పిప్పరమెంటు బిళ్ళలు పట్టుకుని తింటూ వంటింటోకి వచ్చాడు. వాడి మొహాన దిగ్విజయం చేసిన వాడికున్నంత గర్వం కనిపిస్తున్నది.

"ఓరి వెధవా! ఏదో తినడానికి సంపాదించావే!" అన్నది భాగ్యమ్మ సంతోషంతో.

"పిన్ని ఇచ్చిందిలే నాకు" అన్నాడు గోపి మరింత గర్వంగా.

ఇద్దరిమీదా చెరొక పిడుగుపడ్డా ఆ వితంతువులు అంత శీఘ్రం కొయ్యబారి పోయి ఉండరేమో. ఇద్దరూ ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు.

"నీకు సిగ్గులేదుట్రా? మళ్ళీ దాని చంకలోనే దూరావ్? అది నిన్ను గదిలో నుంచి ఇంతకుముందే కాదుట్రా గెంటెనూ?" అన్నది వెంకమ్మ.

"నా ఇష్టం పో!" అన్నాడు గోపీ, తన ఆత్మగౌరవానికి కళంకం ఆపాదించ బడుతున్నట్టు అర్థం చేసుకుని.

"నే చెప్పలేదుటే?" అన్నది వెంకమ్మ కూతురితో.

"అదికాదు మనం తింటానికి ఎన్ని ఇచ్చినా వాడికి లెక్కలోకిరాదే. అది రెండు పంచదార బిళ్ళలు పెడితే వాడిట్లా దానికి దాసోహమవుతాడేం?"అని ఆశ్చర్య పడింది భాగ్యమ్మ.

అందులో వున్న కిటుకేమిటో వాళ్ళకు తెలియలేదు.

"ఇటువంటి వెధవకు మనం ఏమీ చెయ్యనేకూడదూ!" అన్నది వెంకమ్మ. ఆ మాట అంటే వాడు తన 'దుర్బుద్ధి' సరిచేసుకుంటాడన్న ఆశతో.

"నువ్వు నాకేం చెయ్యలేదు. చెయ్యక్కర్లేదు పో! నువ్వు నాతో అసలు మాటాడేవద్దు" అన్నాడు గోపీ.

"హోరి కృతఘ్నుడా! నిన్నది అంత వెధవనెట్లా చేసిందిరా? ఏం మత్తుమందు చల్లిందీ?" అన్నది వెంకమ్మ.

భాగ్యమ్మ తల్లికి అడ్డంవచ్చింది. ఆవిడకు వెంకమ్మ ధోరణి నిరుపయోగం గానూ, చాదస్తంగానూ కనిపించింది.

"అది గాదురా" అన్నది భాగ్యమ్మ లాలూచీగా, "మీపిన్ని నీతో మమ్మల్ని ఏంమాట అన్నదిరా? చెప్పు పరవాలేదులే! మేం మళ్ళీ దాన్ని అడగంలే!"

"పిన్ని గాదు, దాని పిండాకూడు! పిన్నట! నీకది ఎట్లా పిన్నిరా! నీ అమ్మ చెల్లెలా, నీ బాబాయి పెళ్ళామా?" అని కసిరింది వెంకమ్మ.

"నువుండవమ్మా!" అన్నది భాగ్యమ్మ, "ఏమిరా గోపీ?"

"నేన్నీతో మాట్లాడను పో. నువు వెధవముండవు" అన్నాడు గోపీ ఇంకో పిప్పరమెంటు నోట్లో వేసుకుంటూ.

"నిన్నామాట అదే అనమన్నదా?" అన్నది భాగ్యమ్మ ఎట్లాగైనా తన పాచిక పారుతుందేమోనని.

"నేను మంచివాణ్ని. మీరే నాచేత చెడ్డపనులు చేయిస్తున్నారు. అందుకని నేను మీ మాటలు విన్ను" అంటూ గోపీ వెళ్ళిపోయినాడు.

తల్లీ-కూతుళ్ళు ఒకరి మొహం ఒకరు చూసుకున్నారు. గోపీ అన్న ఆఖరు మాట వాడితల్లో పుట్టివుండటం అసంభవమని వాళ్ళకు తోచటంలో ఆశ్చర్యంలేదు.

రాజ్యం గోపీని, తననూ నానా మాటలూ అన్నదని వెంకమ్మ కొడుకు రాగానే ఫిర్యాదు చేసింది. దాసు మామూలు ప్రకారం కేసు విచారించాడు. తనూ

అన్న మాటలు నిజమేనని రాజ్యం ఒప్పుకొన్నది. గోపీ అద్దం పగులగొట్టటం మాట కూడా చెప్పింది.

"ఎందుకమ్మా? నువు వాణ్ణి భయపెట్టలేవు. నిన్ను వాడు గడ్డిపోచ కింద ఏనాడో కట్టేశాడు. ఇంకెవరన్నా వాడికి భయభక్తులు కలిగించటానికి ప్రయత్నిస్తే అడ్డుపడతావు కూడా దేనికి? వాడు చీటికి మాటికి వస్తువులు పగల గొడుతుంటే ఊరుకుంటే ఎట్లా? నేనేమన్నా లక్షాధికారినా? అది కోప్పడకుండా నీతో ఫిర్యాదుచేస్తే నువు కోప్పడతావు గనకనా?" అన్నాడు దాసు.

"నువు దానిపక్షమేనని నాకేనాడో తెలుసుగాని, అది తనంతరం నా అంతరం తెలియకుండా నన్ను గురించి అంత తేలిగ్గా మాట్లాడుతుందిట్రా?" అన్నది వెంకమ్మ.

"నన్ను గౌరవంగా చూడవేమని పోట్లాడుతావంటమ్మా? నువు దాని గౌరవం సంపాదించటానికే ప్రయత్నించావా? దానిమీద ఎప్పుడు అర్థంలేని చాడీలు చెప్పట మేగా నీ పని? నన్నేం చెయ్యమంటావ్? నువ్వే చెప్పు?"

"ఏం చెయ్యమంటావా? దవడలు రెండూ వాయించమంటా! ఇక నన్ను గురించి నోటికి వచ్చినట్టు రాకుండా నోటిపళ్ళు రాలగొట్టమంటా!" అన్నది వెంకమ్మ.

"ఆ పని చేసిన తరువాత నిన్నుచూస్తే దానికి గౌరవం జాస్తి అవు తుందా?" అన్నాడు దాసు. అతను గోపీని చూసి, "నువ్వీ అల్లరి ఎప్పుడు మానేస్తావురా? నీ మూలంగా ఎంత రభస జరుగుతున్నదో చూస్తున్నావా?" అని అడిగాడు.

"మధ్యలో వాడిమీద పడతావేం? వాడేంచేశాడనీ?" అన్నది వెంకమ్మ.

"అదికాదు నాన్నా! నాన్నమ్మ పిన్నిని నానా మాటలూ అన్నది. పిన్ని నాకు పిప్పరమింటిచ్చిందని నానమ్మా, అత్తయ్యా నన్ను నానా మాటలూ అంటున్నారు" అన్నాడు గోపీ.

"దొంగవెధవా, మాటలు కల్పించటం కూడా నేర్చుకున్నావా ? ఇదేనా ఆ మహాతల్లి నీకు రహస్యంగా నేర్పే విద్యా?" అన్నది వెంకమ్మ.

"ఇప్పుడేగా నువు వాణ్ని వెనకేసుకొస్తున్నదీ?" అన్నాడు దాసు తల్లితో.

# 15

గోపీ రాజ్యం పక్షం అవుతున్నాడని తోచినప్పటినుంచి వితంతువులు వాణ్ని రాపాడసాగారు. "ఛీ వెధవా ? పాపిష్టి మొహమూ నువ్వూను ! నాతో మాట్లాడకు. వెళ్ళి మీ పిన్ని చంకనాకు. నేను నీకేం చెయ్యను పో" అని వెంకమ్మ తరచు మనవణ్ని పర్యామర్శించటం జరుగుతూ వచ్చింది.

గోపీకి ఎన్నడూలేని భయభక్తులు వెంకమ్మపట్ల ఇప్పుడు కలగటం అసాధ్యం గనక వాడు తిరిగి ఆవిడమీద ఆవిడ భాషే ప్రయోగించేవాడు. అటు వంటి పాడుమాటలు అనరాదని రాజ్యం వాడికి చెప్పేది.

"ఆవిడ అనటం లేదా?" అనేవాడు గోపీ.

"ఆవిడ అంటే అన్నదిలే. నువ్వనకు. చంకనాకటమేమిటి? ఎవరన్నా వింటే ఏమనుకుంటారు?"

ఓటమి కలుగుతున్నకొద్దీ వెంకమ్మకు ఉక్రోషం హెచ్చుతున్నది. నిప్పుకు గాలి తోడైనట్టు తిన్న యింటి వాసాలు లెక్కపెట్టే భాగ్యమ్మ ఆవిడకు తోడయింది. ఈ ఇద్దరూ చేరి బయటివాళ్ళతో దాసుమీదా, రాజ్యంమీదా, గోపీమీదా, ఆఖరుకు సత్యంమీదా కూడా దుష్ప్రచారం సాగించారు.

"ఆశ్చర్యమేస్తుంది! సత్యం అంత నాజుగ్గా ఉండేవాడా, మా పెద్దమ్మ అడుగుపెట్టిన మూణ్ణెల్లలో బస్తాకు మల్లే అయిపోయి చూడటానికి అసహ్యమేస్తు న్నాడు, ఎక్కడి కక్కడ కండలు వెళ్ళుకొస్తునూ ....! ఆ పెద్దవాడు మటుకు ? వాడెంత భోళావెధవ! ఎంత అల్లరి చేసినా— పిల్లలన్న తరువాత అల్లరి చెయ్యరా ఏం? వాడిదగ్గర ఏకోశానా దాపరికం ఉండేదికాదు. ఉన్నమాట మొహాన అనేసే వాడు. అటువంటివాణ్ని కాస్తా వొట్టి కూబినిచేసి కూచోబెట్టింది కదా! మా ఇద్దరి మీదా వాడు వేగు ! ఏ కిటికీలోనుంచో చూస్తాడు – ఏంచేస్తున్నామో ఏమను కుంటున్నామో తెలుసుకోవటానికి ! మామీద వాళ్ళ నాన్నతో అది ఏం చెప్ప మంటే అదల్లా చెబుతాడు. నమ్మినబంటనుకో! వీడికి ఎంత చేశానూ ! ఎన్ని అగచాట్లుపడ్డానూ! ముందొచ్చిన చెవులుకన్న వెనకొచ్చిన కొమ్ములు వాడిట; ఎంతలో వాణ్ని బుట్టలో వేసుకుందీ ! అవిషప్పుచ్చె ! చూస్తూవుండు. అది ఈ ఇంటికి చిచ్చుపెట్టిగాని పోదు! కైకేయి దాపురించింది మా ప్రాణానికి ! దాని చదువు బోర్లించా. ఆ చదువంతా మా కొంప కూల్చటానికి పనికొస్తున్నది. తన కిష్టంలేకపోతే పని చెయ్యొద్దు. గదిదాటి బయటికి రావద్దు. పాన్పుమీదనే రాత్రీ పగలూ ఆహారించమను! కాని ఇదేమిటమ్మా? ఈ విషం పొయ్యటమేమిటమ్మా ? ఇన్నేళ్ళు బ్రతికాను. ఇంత విడ్డూరం ఎక్కడా చూళ్ళేదు.... ! ఎందుకులే అను కోటం ! మన బంగారం మంచిదైతే —! అది చెప్పిందల్లా నమ్మి మాతో శత్రుత్వం పెట్టుకున్న ఆ వెధవ బుద్ధి ఏమనాలి? తనను పుట్టినప్పటినుంచీ ఎతిగున్న మమ్మల్ని కాదని నిన్నగాక మొన్న వచ్చిన దాన్ని నెత్తినెక్కించు కున్నాడే; వాడి బుద్ధి ఏం బుగ్గయినట్టు? ఇన్నాళ్ళకు మే మిద్దరం వాడికి దెయ్యాల మయినామా? మళ్ళీ ఎక్కడా అనకు— మా దాసున్నే — ఈ పెళ్ళాన్ని చూస్తే గడగడ ! ప్రపంచంలో ఇంతమంది మొగుళ్ళున్నారు; పెళ్లాన్ని చూసి అట్లా గడగడలాట్టం ఎక్కడా చూడం. మొదటి పెళ్ళాన్ని కాల్చుకు తిన్నాడు. దీని జిత్తులు దానికేం తెలుసూ? అది మహా ఇల్లాలు. అందుకే దాటిపోయింది."

ఇటువంటి ప్రచారంవల్ల తమకేం వొరుగుతుందో వాళ్ళకు స్పష్టంగా తెలీదు. కాని కుట్ర అనేది వాళ్ళిద్దరి హృదయాలలోనూ ప్రవేశించింది. పగ గుడ్డిది. అది గురిచూసి కుట్రచెయ్యలేదు. ఎటువంటి విచక్షణా చూడకుండా రాళ్ళు విసురుతుంది. అపజయం ఎదురైనకొద్దీ దాని విసురు జాస్తీ అవుతుందిగాని తగ్గదు. చావు సమీపిస్తున్నకొద్దీ చలవలు కమ్ముకొచ్చినట్టు తల్లీ కూతుళ్ళలో నానాటికీ మా మానవత్వం నశించసాగింది. ఈ స్థితిలో ఎవరన్నా వచ్చి "మీకు కావలసిందేమిటి?" అని వాళ్ళ నడిగితే వాళ్ళు సమాధానం చెప్పగల స్థితిలో కూడా లేరు. దాసు కాపరం విచ్ఛిన్నం కావటం తప్ప వాళ్ళ కిప్పుడేమీ అక్కర్లేదు.

మానవ మనస్తత్వంలో సహజ దౌష్ట్యమంటూ ఉండదు. దౌష్ట్యానికి ఏదో ఆధారం ఉండాలి. వెంకమ్మ ఒకప్పుడు కోరినదల్లా అధికారం, పెత్తనం మాత్రమే. ఆవిడ కాపరానికి వచ్చేదాకా పుట్టింట చాలా అధికారం వెలగబెట్టింది.. అందరికన్నా పెద్ద సంతానం కావడంచేత చాలాకాలం తమ్ముళ్ళకూ, చెల్లెళ్ళకూ ఆవిడే పెద్ద దిక్కుగా ఉండేది. ఆవిడ కాపరానికి వచ్చిన తర్వాత ఈ పెత్తనం పోయింది. అటు తమ్ముళ్ళూ, చెల్లెళ్ళూ ఎవరికాపరాలు వాళ్ళు ఏర్పాటుచేసుకుని ఎవరి బ్రతుకు వాళ్ళు బ్రతకసాగారు. వెంకమ్మ మొగుడు వెంకమ్మను తోక జాడించనివ్వలేదు. ఆవిణ్ని 'కత్తుల బోను'లో ఉంచాడు. ఆయన దాసులాగే మిత భాషి. అందుచేత పెళ్ళాం తన ఇష్టంలేని మాట అన్నప్పుడల్లా వీపు పెట్లగొట్టే వాడు. "మనిషికో మాటా, గొడ్డుకో దెబ్బా! నీకు మాట అర్థంకాదు. దెబ్బే అర్థ మవుతుంది. నువ్వు గొడ్డుజాతివై యుండాలి" అనేవాడాయన. ఆ విషయంలో ఆవిడ అప్పటికీ ఇప్పటికీ ఆట్టే మారలేదు.

మొగుడు చచ్చినప్పటినుంచీ వెంకమ్మ తన కొడుకుమీద చాలా దాష్టీకం చేసింది. కాని దాసు పెద్దవాడైన తర్వాత ఈ అధికారం అంత జోరుగా సాగ లేదు. అప్పటికీ ఆవిడ కొడుక్కు విసుగు తెప్పించి తన పట్టుదల నెగ్గించుకుంటూ వచ్చింది. దాసు మొదటి భార్య దాసును సొంతం చేసుకోవాలని చాలా ప్రయ త్నించింది. ఎవరి "సొంతం" కావటమూ ఇష్టంలేక దాసు అత్తకోడళ్ళను యథేచ్ఛగా కీచులాడుకో నిచ్చాడు. దాసు మొదటి భార్య చచ్చినప్పటినుంచే వెంకమ్మకు గృహాధిపత్య కాంక్ష ప్రబలమయింది. తనకున్న ఒక అడ్డంకి తొలగిపోయింది. పిల్లలు చిన్నవాళ్ళు. పిల్లలను తానే సాకాలి. దాసు బొత్తిగా అశక్తుడు. తనకు ఎప్పటికన్నా కట్టుబడి ఉంటాడు. ఇంటిమీద తన సామ్రాజ్యాధి పత్యం సాధించుకోగలందులకు వెంకమ్మ ఇద్దరు మనవళ్ళనూ నిర్మూలించటానికి పూనుకొన్నది. వాళ్ళు తనకు ఉపగ్రహాలల్లే కావడమే ఆవిడ ఆశయం. తనుతప్ప వాళ్ళకు ప్రపంచంతో మరొకరుండరాదు. తమకన్న చిన్నది తన చెల్లెలు మొగుడు చచ్చినప్పట్నుంచీ తన నలుగురుకొడుకుల మీదా, ఇద్దరు అల్లుళ్ళమీదా నిరాక్షేప

ఇగ్గా ఏలుతుండటం వెంకమ్మ కళ్ళారా చూసి ఉన్నది. తన ఖర్మేం కాలిందీ? తను ఏం తక్కువ తిన్నదీ!

దాసు రెండో పెళ్ళిచేసుకున్నది కేవలం పిల్లల క్షేమం కోసమే అయినా వెంకమ్మ దృష్టిలో ఇది తన అధికారానికి పెద్ద దెబ్బగా కనబడింది. తాను 'రాజకీయ దృష్టి'తో ప్రతిపని చేస్తున్న మనిషి కనుక దాసుకూడా అటువంటి దృష్టితోనే ప్రతిపనీ చేస్తున్నట్టు ఆవిడ బుద్ధికి తోచింది. దాసు పెళ్ళాడ నిశ్చయించి సంబంధం ఫలానా అని తన కెందుకు తెలియజేయలేదూ? ఎవరూ వెంటరాకుండా వెళ్ళి పెళ్ళి ఎందుకు చేసుకొచ్చాడూ? ఇది వెంకమ్మ దృష్టికి చాలా పెద్ద కుట్రగా కనబడింది. దాసు దృష్టినుంచి వీటికి వేరే అర్థం ఉన్నది. సంబంధం విషయం తాను నిశ్చయించుకునేదాకా ఎవరికీ వివరాలు చెప్పదలచలేదు దాసు. తీరా అందరికి చెప్పి తాను పెళ్ళి ఏ కారణం చేతనన్నా మానదలిస్తే అభాసవుతుందని అతని భయం. ఈ పెళ్ళివల్ల చలపతికి సాధ్యమైనంత తక్కువభారం కలగాలనే ఉద్దేశంతోనూ, రెండోపెళ్ళికి అట్టహాసం దేనికన్న భావంతోనూ దాసు పెళ్ళికి ఎవరినీ తీసుకుపోలేదు. కాని ఈ విషయం వెంకమ్మ గ్రహించలేదు. గ్రహించాలన్న తాపత్రయం ఆవిడకు లేదు. ఆవిడ దాసును శత్రువర్గంలో చేర్చేసింది.

రాజ్యం వెంకమ్మగారి ఊహాలను బలపరిచింది. ఆమెకు పిల్లలమీద మొదట్లో ఏమంత అపేక్ష లేదు. అన్న పిల్లలు దూరమైన లోపం కొంత తీరటానికీ, తనకుచేసే పని ఉండటానికీ, దాసు కోరికను మన్నించి రాజ్యం పిల్లల్ని చేరదీసింది. కాని పిల్లల మంచిచెడ్డల ప్రసక్తిలేని వెంకమ్మకు రాజ్యం చర్య తన అధికారానికి గొడ్డలి పెట్టు అయింది. గృహసామ్రాజ్యాధిపత్యానికి తనతో సమంగా పోటీచేసే భయంకర శత్రువుగా రాజ్యం వెంకమ్మ కళ్ళకు కనిపించింది. వెంకమ్మ శత్రువర్గంలో దాసు రెండోస్థానానికి దించబడ్డాడు. ఆ స్థానం రాజ్యాని కివ్వబడింది.

అన్నిటికన్నా గోపీ శత్రువర్గంలోకి పోవటం వెంకమ్మకు భరించరానిదైపోయింది. తన "రాజకీయాలకు" అవసరంగనక వెంకమ్మ ఇంతకాలమూ వాణ్ని పెద్ద జేసిందిగాని వాడు "శత్రుపక్షం" అయేసరికి సరిఅయిన ప్రమాణంలో ఆవిడ వాణ్ని చూడసాగింది. "పోరా ఉల్లిత్తా, కుర్రకుంకా, పిల్లకాకీ, బొట్టికాయీ" అని వాణ్ణిప్పుడావిడ సంబోధిస్తున్నది. దీనివల్ల జరిగిన మేలేమంటే తన నాయనమ్మ అసలు స్వరూపం గోపీ బాగా తెలుసుకోగలిగాడు.

ఈ నాటకంలో భాగ్యమ్మది విచిత్రమైన పాత్ర. తల్లి అధికారం కోసం తాపత్రయ పడుతున్నదని భాగ్యమ్మకు తెలుసు. తనకు ఉపకారం చేస్తున్నవాడు దాసనికూడా ఆమెకు తెలుసు. కాని ఈ సంఘర్షణలో తాను ఏదో ఒక ప్రక్క చేరాలిగాని తటస్థంగా ఉండటం సాధ్యంకాదని భాగ్యమ్మ భావించింది. అవతల రాజ్యం లేకపోతే భాగ్యమ్మ తమ్ముడి పక్షం చేరటంగాని తటస్థంగా ఉండటంగాని

చేసేదేమో, కాని ఒక పక్షాన రాజ్యం ఉండటంచేత భాగ్యమ్మ తప్పనిసరిగా తల్లి పక్షం వహించాలని ఆవిడ సంస్కృతి శాసించింది. తను ఆడబిడ్డ. మరదలు తన తల్లిమీద గెలవటానికి తాను ఎన్నటికీ తోడ్పడలేదు. తను ఎటూ కాకుండా ఉన్నా తల్లి ఒంటరిదై పోతుంది. రెండోపక్షం బలమవుతుంది.

తల్లికూతుళ్ళిద్దరూ మానవత్వానికి ఉద్వాసన చెప్పి బుద్ధిపూర్వకంగా కుట్ర లోకి దిగారు.

భాగ్యమ్మ సోది చెప్పేదాన్ని పిలిచింది. మనసులో ఉన్నది సోదిలో వస్తుం దంటారు. "నాలుగు నెల్లుగా మీ ఇంటికి శని చుట్టుకున్నది. శని వదిలించుకోండి. ఈ శని కొంపకు చెరుపు" అని సోది మనిషి ఏకతార మీటుతూ చెప్పింది.

బుడబుక్కలవాళ్ళూ అదే చెప్పారు.

వెంకమ్మ ఇష్టదైవం వెంకటేశ్వరస్వామి కూడా ఆవిడకు కలలో కనిపించి ఆ ముక్కే చెప్పాడు.

దాసు లక్ష్యపెట్టలేదు. నాస్తికుడల్లే మాట్లాడటమే గాక, "ఈసారి వెంక టేశ్వరస్వామి కలలో కనిపించి పిచ్చిపిచ్చి మాటలు చెబితే నిన్ను శాశ్వతంగా తిరుపతికి పంపిస్తా. ఈ కొంపలో ఎవరూ చావు బ్రతుకుల్లో లేరు. గనుక సోదీ గీదీ అడక్కండి. ఎవరన్నా వింటే మిమ్మల్ని చూసి నవ్వుతారు" అన్నాడు.

# 16

గోపి రాజ్యం గదిలోకి వచ్చాడు.

"కూచో గోపీ" అన్నది రాజ్యం జడవేసుకుంటూ.

గోపి చాలా సేపు మౌనంగా కూచున్నాడు.

"నిన్ను తమ్ముడు అమ్మా అని పిలుస్తాడే" అన్నాడు గోపీ.

వాడి మనసు యెట్లా పనిచేసేదీ రాజ్యం సులభంగా అర్థం చేసుకోగలదు.

"ఔను, నేను వాడికి అమ్మను కాదూ?" అన్నది.

"వాడికి అమ్మవయితే నాకు పిన్ని వెందుకవుతావ్" అన్నాడు గోపి.

"నువు పిన్నీ అని పిలుస్తున్నావుగా - అందుకు?"

"నేను కూడా నిన్ను అమ్మా అని పిలిస్తే?" అన్నాడు గోపి.

"పిలవాలనుందా!"

"పిలిస్తే నువు పలుకుతావా?"

"నువు చక్కగా బడికిపోయి చదువుకుంటే అమ్మా అని పిలవనిస్తా. చూడు నీ ఈడువాళ్ళు చక్కగా ఎట్లా చదువుకుంటున్నారో!"

"అయితే నేనూ చదువుకుంటా!" అన్నాడు గోపి ఆత్రంగా.

"మంచివాడివిగదూ. మీ నాన్నగారికి చెబుదాం. భలే సంతోషిస్తారు."

గోపీ రాజ్యం దగ్గిర తినటానికి పంచదార గుళ్ళు పుచ్చుకొని వంటింటోకి పరిగెత్తాడు.

"ఏం వచ్చావు? ఏం చేస్తున్నామో చూసి రమ్మందా ఏం?" అన్నది వెంకమ్మ చీదరింపుతో.

"నేను బడికి పోతున్నాగా?" అన్నాడు గోపీ.

వెంకమ్మ నిర్ఘాంతపోయింది. భాగ్యమ్మ నివ్వెరపోయింది.

"బడా?" అన్నది వెంకమ్మ.

"చదువుకుంటావు(టా?" అన్నది భాగ్యమ్మ చదువుకోటం విడ్డూరమైనట్లు.

"ఒరే, ఇట్లారా! మాట. కాస్సేపు కూచో! చదువుకోమని మీ పిన్ని చెప్పిందా ఏం!" అన్నది వెంకమ్మ.

"పిన్నేమిటి పిన్ని? మా అమ్మ!"

"ఇదెప్పుణ్నుంచిరోయ్?" అంటూ భాగ్యమ్మ పెద్ద పెట్టున నవ్వింది.

గోపీ ఆవిడకేసి చులకనగా చూసి "ఇవాళనుంచే. నేను బడికెళ్ళి చదువుకుంటే అమ్మా అని పిలవనిస్తానంది" అన్నాడు.

"చూశావుటే?" అన్నది వెంకమ్మ.

"ఎంత ఆలోచనో?" అన్నది భాగ్యమ్మ.

గోపీని బళ్ళోకి పొమ్మనటంలో ఏమి రహస్య దుర్మార్గం ఉన్నదో వితంతువులకు తెలీదు. కాని ఏదో ఉండి తీరుతుందని వాళ్ళు నిశ్చయించుకున్నారు.

"ఒరే పిచ్చిమొద్దూ, బడికిపోతే పంతులు కొడతా(డా? అందుకే నిన్ను బడికి పొమ్మంటున్నది" అన్నది వెంకమ్మ.

"తను కొడితే తాట వొలుస్తామని ఈ యెత్తెత్తింది" అన్నది భాగ్యమ్మ.

"పంతులు నన్నెందుకు కొడతాడూ? నన్నెవరూ కొట్టలేరు" అన్నాడు గోపీ గర్వంగా.

"అట్లా అనుకున్నావేం. బడ్డిలో మోకాటితండా వేయించి గుంజెళ్ళు తీయిస్తారు. గోడకుర్చీ వేయిస్తారు. కోదండం వేయిస్తారు. పేంబెత్తాలు పెట్టి చళ్, చళ్ మని రక్తం వరదలయేదాకా కొడతారు. ఒళ్ళంతా ఇంతెత్తు అట్టు పొంగుతుంది. పడుకోటానిక్కూడా ఉండదు. చచ్చే బాధ పెడుతుంది" అన్నది వెంకమ్మ.

గోపీ బెదిరిపోయినాడుగాని, ఇంకా దర్పం చావలేదు.

"పంతులు కొడితే నాన్నతో నేను చెప్పుతాగా?" అన్నాడు వాడు.

"మీ నాన్నకి చెబితే పంతులు కెక్కువా ఏం?" అన్నది వెంకమ్మ.

"(బతికుంటే బలుసాకు తినొచ్చు. బడీవద్దు, దడీవద్దు. ఇంత తిని సుఖంగా ఉండు. నీకేం మహారాజువు" అన్నది భాగ్యమ్మ.

గోపీ బెదిరిపోయిన మొహంతో రాజ్యం దగ్గిరికి వచ్చి, "అమ్మా, నేను బడికి పోను" అన్నాడు.

రాజ్యం తోకతొక్కిన తాచల్లే లేచింది. "అట్లా అయితే నన్ను నువు అమ్మా అని పిలవక్కర్లేదు. అసలు నా గదిలోకే రానక్కర్లేదు. నీ మొహం నాకు చూపించ నక్కర్లేదు. పో అవతలికి!" అని ఆమె గోపీని కసిరింది.

గోపీ బావురుమన్నాడు.

వెంటనే తను తొందరపడ్డట్టు రాజ్యం తెలుసుకున్నది. ఇది అఘాయిత్యపు ఏడుపుకాదు. గోపీ నిజంగా ఏడవగా రాజ్యం చూడటం ఇదే మొదటిసారి. కాస్తరో తొందరపడి గోపీని బాధ పెట్టినందుకు రాజ్యం నొచ్చుకున్నది. ఇన్నాళ్ళకు గోపీ దిక్కులేని పిల్లవాడని జాలి కలిగేటట్టుగా ఏడవటం చూసి ఆమె హృదయం కరిగి పోయింది.

రాజ్యానికి ఆకస్మికంగా ఓర్పు పోవటానికి కారణం ఉంది. ఆమె ఎంతో కాలంగా గోపీని చదువుకు సుముఖుణ్ణి చెయ్యటానికి పునాది వేసింది. చదువుని గురించి చాల గొప్పగా వర్ణించింది. చదువు వస్తే దూరాన ఉన్నవాళ్ళతో మాట్లాడ వచ్చన్నది. పుస్తకాలు చదవొచ్చన్నది. గొప్ప పనులు చేయవచ్చన్నది. అంతా విని గోపీ "ఆఁ నాకు చదువక్కర్లేదు. ఎవరు పోతారు వెధవ బడికి?" అనేవాడు. రాజ్యం ఓర్పుతో "పోనీ మానెయ్యి, నాకేం? నువ్వే ఉద్యోగాలు చెయ్యవు. నువ్వే బైతల్లే ఉంటావు. నిన్నుచూసే అందరూ నవ్వుకుంటారు. నిన్నే కూలిపని చేసుకోమంటారు" అని ఉడికించేది.

రాజ్యం దాసుతో కూడా గోపీ చదువును గురించి ఎన్నోసార్లు చర్చించింది. వాడిపైన ఇతర పిల్లల ప్రభావం లేదు. అది ఉంటేగాని వాడు మామూలు పిల్లవాడల్లే ఉండడు. రోజల్లా ఇంట్లో ఉండడమూ, పని లేకపోవటమూ, ముసలాళ్ళ సావా సమూ వాణ్ణి పాడుచేస్తున్నాయి.

ఇంతా అయిన తరువాత గోపీ ఏ బుద్ధిన ఉన్నాడో చదువుకోవటానికి ఒప్పుకున్నాడు. తన కృషి ఎట్లాగయితేనేం ఫలించిందిగదా అని రాజ్యం సంతో షించింది. విజయగర్వంకూడా పొందింది. ఇంతలోనే గోపీ తిరిగివచ్చి మళ్ళీ పాత పాటపాడి రాజ్యానికి భరించరాని గర్వభంగం చేశాడు! ఆమెకు కోపంతో ఒళ్ళు తెలియలేదు. ఎవరు కోప్పడ్డా లక్ష్య పెట్టటం అలవాటులేని గోపీ రాజ్యం కోపానికి తట్టుకోలేక కొంత - బితంతువులు పెట్టిన భయంతో కొంత - ఏడవ సాగాడు.

రాజ్యం గోపీని ఎప్పుడూ ఎరగని ప్రేమతో దగ్గరకు తీసుకొని, "ఏడవకు నాయనా ఊరుకో. ఎందుకేడుస్తావ్? నీకేం జరిగింది?" అన్నది కళ్ళు తుడుస్తూ.

"బడికిపోతే పంతులు నన్ను కొడతాడు. వొళ్ళు వాస్తుంది" అన్నాడు వెక్కుతూ, మాటకూడా సరిగా చెప్పకుండా గోపీ.

"ఎవరన్నారూ? పంతులు నిన్నెందుకు కొడతాడూ? కొడితే నే నూరుకుం

టానా! మీ నాన్నగారితో చెప్పి పంతుల్ని మళ్ళా కొట్టించనూ?" అన్నది రాజ్యం.

గోపీకి కొంచెం కొంచెంగా ధైర్యం తిరిగి వచ్చింది.

"పంతులు కొడతాడని నానమ్మ చెప్పిందే? అత్తయ్యకూడా చెప్పింది" అన్నాడు గోపి.

"వాళ్ళకేం తెలుసూ? వాళ్ళెప్పుడన్నా బడికి వెళ్ళారా ఏమన్నానా? నువు బడికి వెళ్ళటం చదువుకోవటం వాళ్ళకిష్టం లేదేమో, అట్లా చెప్పి వుంటారు. ఆ మాట నమ్మి నువు పిరికివాడివైపోతావా? ఛీ, ఛీ!" అన్నది రాజ్యం.

"వాళ్ళకేం తెలీదు" అన్నాడు గోపి.

గోపీని పంపి రాజ్యం బయటికి వచ్చింది. వంటింట్లో అత్తగారూ ఆడబిడ్డా గట్టిగా మాట్లాడుకుంటూ ఉండటం ఆమె చెవిని పడింది.

"ఒళ్ళో కూచోబెట్టుకోనీ, ఎవడిక్కావాలి? చిత్రాంగి దాపరించింది. చిత్రాంగి! అవును ఈ ఇంగిలి అక్షరాలు మనమెక్కడ చదివాం! లోకాన్ని తనే కాచి వడబోసింది. మనకేం లోకం మొహం తెలుసునా? కొట్టించదూ మరీ? గెంతమంటే గెంతే మొగుడు ఉన్నాడుగదూ? పంతుల్నీ కొట్టిస్తుంది. ఊళ్ళోవారందరూ మనమాదిరిగా ముండ మోసిన వాళ్ళనుకుంటున్నది గామాలు...."

రాజ్యానికి కోపంతో వొళ్ళంతా కంపించిపోయింది. ఆమె గబగబా వంటింట్లోకి వెళ్ళి "మీరు పరువు మర్యాదగల సంసార్లా? కల్లుపాకల దగ్గర చెడ తాగి నోటికొచ్చినదల్లా పేలే అలగా మనుషులా? మీరున్న కొంపలో ఉండటానికే పరువుకలవాళ్ళు సిగ్గుపడి చావాలి. దొంగపనులు చెయ్యటం, దొంగచాటునుంచి చూడటం, దొంగచాటుగా వినటం—అన్నీ విడిచేశారు. ఇంక గయరో వదలా లన్నా ఏమీలేదు. నేనీ ఇంట్లో ఒక్కక్షణం ఉండను. ఆయనవస్తే వెళ్ళిపోయినానని చెప్పండి. అందులోకూడా మీ బుద్ధికితగ్గ అబద్ధాలు కలిపించి చెప్పండి. ఏది మరచినా జన్మలో ఎన్నడూ మిమ్మల్ని మాత్రం మరవను" అంటూ వెళ్ళిపోయి గదిలో తన సామాను సర్దుకోసాగింది.

రాజ్యం గది తలుపు బిగించుకుని చాలాసేపు ఏడిచింది కూడాను. కాని తన కంటినీరు వితంతువులను మటుకు చూడనివ్వలేదు. ఆఖరు క్షణంలో ఆమె భర్తకు ఒక ఉత్తరం కూడా రాసింది. అందులో ఆరోజు జరిగినదీ, వంటింట్లో తాను విన్నదీ, వితంతువులను తాను అన్నదీ పూసగుచ్చినట్టు ఆరు పేజీలమేర రాసింది. చివరకు "మీరు వాళ్ళను ఇంకేమీ అనక్కరలేదనుకుంటా. అనవలసిన మాటలన్నీ నేనే అన్నా. నేను ప్రస్తుతం మా అన్నగారింటికి పోతున్నా. మీకు ఓపిక ఉన్నప్పుడు వచ్చి చూసిపోతూ ఉండండి. సెలవు—రాజ్యం" అని ఉత్తరం పూర్తి చేసింది.

# 17

దాసు స్కూలునుంచి తిరిగివచ్చి నేరుగా గదిలోకి వెళ్ళాడు. ఇల్లంతా నిశ్శబ్దంగా ఉన్నది. గదిలో రాజ్యంగాని, ఆమె పెట్టెలుగాని లేకపోవటం చూశాడు. చివరకు ఉత్తరం కూడా కనబడింది. దాన్ని విప్పి ఆత్రంగా ఒకటికి రెండుసార్లు చదువుకున్నాడు.

"చూశావ్రటా? అది వెళ్ళిపోయింది. నిజంగా మేమేమీ అనలేదు. ఎంత వొట్టుపడితే అంతవొట్టు" అంటూ వెంకమ్మ గదిలోకి వచ్చింది.

"అది అంతేలే. నువు గాని దాన్ని వెళ్ళొద్దనలేదుగద?" అన్నాడు దాసు.

వెంకమ్మ మొహం వికసించింది. ఎంత నిగ్రహించుకున్నా ఆగకుండా ఆవిడ మొహాన మందహాసం అంకురించుకొచ్చింది.

"బాగుందే, నాకేంపనీ? నాతో చెప్పివచ్చిందా? చెప్పిపోయిందా?"

"పోతున్నానని నీతో మాటమాత్రం కూడా చెప్పలేదా యేం?"

"ఎబ్బే, ఎక్కడిదీ? ఉట్టిపుణ్యానికి రయ్ రయ్యమంటూ వచ్చి నన్నూ, భాగ్యాన్నీ అనరాని మాటలన్నీ అని వెళ్ళింది. ఇట్లా చూద్దుంగదా, బండెక్కి వెళ్ళి పోతున్నది!"

"అట్లాగా? అక్క యేదీ?" అన్నాడు దాసు.

"ఏంరా, దాసూ?" అంటూ భాగ్యం తలుపు అవతల నుంచి లోపలికి వచ్చింది.

"ఏంలేదు, పాపం నువిక్కడ ఎంతకాలం ఉంటావు. ఇల్లూ వాకిలీ విడిచి? నువ్వుండి చేస్తున్న దేమిటి కనక? రంగయ్య చదువుకుంటూన్నాడాయె. అంతగ్గా అయితే వాడికి అక్కడే హోటల్లో ఏర్పాటు చేస్తా. అమ్మకూడా నీవెంట వచ్చి కొన్నాళ్ళుంటుంది. డబ్బుకిబ్బందయితే నేను పంపిస్తాలే!" అన్నాడు దాసు.

వితంతువు లిద్దరూ పాలిపోయినారు.

"అదేమిట్రా?" అని ప్రారంభించింది వెంకమ్మ.

"నాకు నీ సలహా అక్కర్లేదమ్మా. కావలిస్తే నేను అడగనూ?" అన్నాడు దాసు.

"దాన్ని వెనకేసుకొచ్చి అయినవాళ్ళను దూరం చేసుకోకు, భద్రం!" అని బెదిరించింది వెంకమ్మ.

"అదెవరు? మీ ఇద్దరికంటె నాకు అయిన వాళ్ళెవరున్నారు? నన్నూ, నా పెళ్ళాన్నీ, కాపరాన్నీ మీకంటె ఎవరు బాగా కనిపెట్టి ఉంటారు? రేపు ప్రొద్దున్నే ప్రయాణం. మరచిపోకండి!"

"మమ్మల్ని వెళ్ళగొట్టేస్తావ్రటా?" అన్నది వెంకమ్మ కుండపగలేసి.

"మిమ్మల్నెందుకు వెళ్ళగొట్టుతానమ్మా? నేనే వెళ్ళిపోతున్నా, పదిరోజులు శలవు పెట్టి. ఆ తరువాత ఏమవుతుందో నాకూ తెలీదు."

"పిల్లలు?"

"పిల్లలు నాతోనే ఉంటారు."

"నా వెంట పంపించవు!"

"పంపించను. వాళ్ళతో నువ్వు పడలేవు."

"పడతాలే. ఇన్నాళ్ళూ పడలా?"

"అందుకే కాస్త విశ్రాంతి తీసుకో. పెద్దదానివై పోతున్నావు."

"రేపే పోవాలని ఏముందీ? అసలు పోకపోతేనేం?"

"నేను రేపు ఉదయమే ఇంటికి తాళంవేసి పోతున్నా. మీ ఇద్దరాడవాళ్ళనూ నమ్మి ఇల్లు వప్పగించడం సాధ్యంకాదు."

"ఎవరన్నా తోడు—"

"నాకెవరిలోనూ నమ్మకం లేదు."

"నీ పెళ్ళయినప్పుడు మేమిద్దరమే కాదుట్రా ఉన్నది ఇంటికంతకీనూ?"

"ఆ పెళ్ళిసంగతిఎత్తకండి. ఈలోపల ఎంతమారింది? అయినా అక్కయ్యను నేను వెళ్ళిపొమ్మంటుంటే పరువైన మనిషి ఏమని ఉంటుందీ? నువ్వొక్కత్తెవ్వూ కొంపలో ఎట్లా ఉంటావు?"

అసలు దాసు మనసులోమాట ఏమిటో చెప్పించటానికి వెంకమ్మ చాలా ప్రయత్నం చేసిందికాని లాభంలేక పోయింది. మర్నాడు వితంతువు లిద్దర్నీ పంపించేసి, దాసు రాజ్యాన్ని కలుసుకోవటానికి రైలెక్కాడు.

ప్రచురణ : 1954, సవతి తల్లి కథల సంపుటిలో
దేశి కవితా మండలి : విజయవాడ.

# తాతయ్య

మనుష లందర్లోకీ బ్రాహ్మ లెక్కువ. బ్రాహ్మర్లో నియ్యోగుల కంటె వైదీకు లెక్కువ; తలకాయంతా గొరిగించి వెనకాల పిలక పెట్టుకుని పొద్దున్నే మూడు వేళ్ళూ కనిపించేట్టు వీబూది పెట్టుకుని తద్దినాలు అవీ పెట్టించే బ్రాహ్మలు చాలా మంచివాళ్ళు. వాళ్ళు అందరి ఇళ్ళకూ వచ్చి 'శ్రీ కృష్ణపరబ్రహ్మణేనమః' అంటారు. అప్పుడు ఇంటివాళ్ళమ్మ వచ్చి వాళ్ళ చెంబులో బియ్యం పోస్తుంది. శూద్రవాళ్ళు బిచ్చగాళ్ళు. వాళ్ళకి ముష్టి వేస్తాం. ముష్టి ఒకచేత్తో వేస్తాం. బ్రాహ్మలకి బియ్యం రెండు చేతులా, దోసిట్లో, పట్టుకొచ్చి వెయ్యాలి. వాళ్ళు ముష్టివాళ్ళుకారు.

వాళ్ళు మీసాలుంచుకోరు. ఇస్త్రీ బట్టలు కట్టుకోరు. చొక్కాలు తొడుక్కోరు. మా తాతయ్య చొక్కా తొడుక్కునేవాడు కాడు, చలికాలంలో రాత్రిపూట తప్ప. అప్పుడు ఎర్రపూలు కుళాయికూడా పెట్టుకునేవాడు. దాన్లోనించి మొహం మాత్రమే కనబడేది. నెత్తీ, మెడా కనిపించేవి కావు. అది పెట్టుకుంటే తాతయ్య ఎవరో అల్లే ఉండేవాడు.

తాతయ్య ముష్టి ఎత్తేవాడు కాడు. తద్దినం పెట్టేటప్పుడు ఆయన కూడా బ్రాహ్మలతో పాటు మంత్రాలు చదివేవాడు. తద్దినం బ్రాహ్మలు తాతయ్య కన్న ముందు తినేవాళ్ళు. అయితే తాతయ్యను వాళ్ళ అన్నం తాకనిచ్చే వాళ్ళు. తద్దినానికి గారెలు పరమాన్నమూ చేస్తారుగాని పులుసు చెయ్యరు. కందిపప్పు కూడా వండరు. పెసరపప్పు వండుతారు.

తద్దినం పెట్టించే బ్రాహ్మ లంత మంచి బ్రాహ్మలు కాకపోయినా వాళ్ళు తాతయ్యను గౌరవంగా చూసేవాళ్ళు. తాతయ్యకు ఇంగ్లీషురాదు. అందుకని తాతయ్య నాన్నని గొప్పగా చూసేవాడు. నాన్న తాతయ్యంత మంచి బ్రాహ్మడు కాడు. నాన్నకు మీసాలుండేవి. ఇస్త్రీ బట్టలు కట్టుకునేవాడు. బిళ్ళ గోచీ పెట్టుకునేవాడు కాడు. వాలు గోచీ పెట్టుకునేవాడు. తాతయ్యలా భోజనం చేసేటప్పుడు గంధం అక్షింతలు పెట్టుకునేవాడుకాడు. చాచ్చుక్క పెట్టుకునే వాడు. పట్టుబట్టకట్టుకుని భోం చేసేవాడు. పట్టు బట్టకంటె మడిబట్టే ఎక్కువ. మడిబట్టలు ఆరేసినప్పుడు పిల్లలు ముట్టుకుంటే మైలపడతై. తడిబట్టలు మైలపడవు. కాని తడిబట్ట కన్న మడిబట్టే ఎక్కువ. దారపోగు తొక్కితే మడిగట్టుకున్న ముసలివాళ్ళు మైలపడతారు. పత్తికి మైలలేదు.

శూద్దరవాళ్ళు బ్రాహ్మల కంటె చాలా తక్కువ. వాళ్ళు బ్రాహ్మలలా ఉండరు. చూడటానికి నల్లగా వుంటారు. మా ఇంటికి కూరలు తెచ్చే మనిషి చాలా పచ్చగా ఉండేది. కాని ఆ మనిషి మాట్లాడితే శూద్దరదని తెలిసేది. నల్లని బ్రాహ్మణ్ణి, ఎర్రని శూద్దర వాణ్ణి నమ్మరాదు. తాతయ్య నల్లగానే ఉండేవాడు. అమ్మ ఆయన్ని నమ్మేదే కాని అందరూ అట్లా అంటారు—ఎర్రని శూద్దర వాళ్ళని నిజంగా నమ్మరాదు. మాకు కూరలు తెచ్చే మనిషి అమ్మతో అన్నీ అబద్ధాలాడేది. అమ్మ రోజూ దాంతో పోట్లాడేది. నాన్న దాంతో పోట్లాడేవాడుకాదు.

శూద్దరవాళ్ళు మాంసం తింటారు. వాళ్లు గంపలో పెట్టి కోళ్ళకి ఈకలు తీస్తారు. ఈకలు తీస్తుంటే కోడి కొంచెంసేపు అరుస్తుంది. ఆ తరువాత మాట్లాడదు. ఈకలు తీసిన తరువాత కోడి గుర్తుపట్టే టట్టుండదు. అసహ్యంగా ఉంటుంది. శూద్దర ముసలమ్మలు కోడితలకాయ దేవుడికి నైవేద్యం పెడతారు. నైవేద్యం పెట్టేటప్పుడు మంత్రాలు చదవరు. తాతయ్యలా వాళ్ళు మడికూడా కట్టుకోరు. కోడితలకాయ కోడి చూసినట్టు కాకుండా అదోరకంగా చూస్తుంది. కోడికి ఈకలు తీస్తుంటే బ్రాహ్మణ పిల్లలు చూడగూడదు.

బ్రాహ్మణపిల్లలు శూద్దరవాళ్ళింట్లో మంచినీళ్లు తాగరాదు. మంచినీళ్ళలో ఒక చుక్క మజ్జిగ వేస్తేనే తాగవచ్చు. తాగే నీళ్ళలో ఒక చుక్క మజ్జిగవేస్తే ఏమీ కనిపించదు. మామూలు నీళ్ళలానే ఉంటుంది. గొల్లవాళ్ళు మజ్జిగలో నీళ్లు కలుపుకొస్తారు. మజ్జిగలో నీళ్ళు కలిపితే అమ్మకి తెలుస్తుంది. శూద్దరవాళ్లు మజ్జిగలో నీళ్లు కలిపితే బ్రాహ్మలు తాగవచ్చు.

నియ్యోగులు మంచి బ్రాహ్మలు కారు. వాళ్లు సంధ్య వార్చరు. అనాచారంగా ఉంటారు. ఎర్రగా నిలువుబొట్టు పెట్టుకుంటే వాళ్ళు చూడటానికి బాగుంటారు. కాని ఆ బొట్టునిపట్టి వాళ్ళు మంచి బ్రాహ్మలు కారని తెలుస్తుంది. మీరు మంచి బ్రాహ్మలు కారని చలపతిరావుగారితో పిల్లలు అనరాదు. అలా అనటం మర్యాదగా ఉండదు. చాటుగా అనుకుంటాం గాని, ఎదురుగా ఉన్నప్పుడు నియ్యోగులని కూడా మంచి బ్రాహ్మల్ని చూసినట్టే చూస్తాం. శూద్దర వాళ్ళను చూసినట్టు చూడం. పసిపిల్లలు నియ్యోగులిళ్ళల్లో మంచినీళ్ళు తాగితే తప్పులేదు. నియ్యోగుల నీళ్ళలో మజ్జిగ చుక్క వెయ్యమని పసిపిల్లలు అనగూడదు. తాతయ్యంత పెద్దవాళ్ళు నియ్యోగుళ్ళలో మంచి నీళ్ళు తాగరు. ఎందుకంటే ముసలివాళ్ళకు దాహం కాదు.

చలపతిరావు గారింట్లో ఏదన్నా అయితే భోజనానికి పోడు. అమ్మా, నాన్నా, నేనూ పోతాం. మా ఇంట్లో తద్దినాలూ అవీ అయితే చలపతిరావు గారింట్లో అంతా భోజనానికి వస్తారు. తాతయ్య వాళ్ళ ప్రక్కనే భోంచేస్తాడు కాని, వాళ్ళు వెళ్ళిన తరవాత విసుక్కుంటాడు. రైళ్ళూ రహదార్లూ వచ్చి లోకమంతా మాలకూడై పోయిందని తాతయ్య చెప్పేవాడు. తాతయ్య రైలుకు పోయేటప్పుడు చొక్కా తొడుక్కుంటాడు కాని కుల్లాయి టోపీ పెట్టుకోడు.

రైలు దిగివచ్చిన గుడ్డలు తాతయ్య వేరే పెడతాడు. నాన్న బయటికి వెళ్ళొచ్చిన గుడ్డలు ఇంట్లోనే కలుపుతాడు. ఆ మైల తాతయ్యకు కలుస్తూనే ఉంటుంది. కాని ఏం చేస్తాడూ? అంతా మాలకూడే.

మాలవాళ్ళంటే బ్రాహ్మలకి భయం. మాలవాళ్ళు మన దగ్గిరగా పోతారు. అప్పుడు మనం మైలపడతాం. కొందరు మాలవాళ్ళు అరుస్తున్నా వినిపించుకోరు. వాళ్ళు మంచి మాలవాళ్ళు కారు. దొరలు కూడా మాలవాళ్ళే. వాళ్ళు స్నానాలు చెయ్యరు. స్నానం చెయ్యకపోయినా వాళ్ళు తెల్లగా ఉంటారు. మనం సబ్బురాచుకున్నప్పుడు కూడా తెల్లగా ఉండం. దొరలు గొప్పవాళ్ళు. వాళ్ళు ఇంటిదగ్గిరకూడా ఇంగిలీషు మాట్లాడతారు. దొరసాన్లు నెత్తిన పింగాణీ కంచాలు పెట్టుకుంటారు. బ్రాహ్మలు పింగాణీ కంచాల్లో తినరాదు. పింగాణీ కంచాల్లో తినేది సాయిబులు.

సాయిబులు దూదేకుతారు. దూదేకుతుంటే మొదట కాస్సేపు వినటానికి బాగుంటుంది. తరవాత చూడటానికి అసహ్యంగా ఉంటుంది. బలంకలవాడు దూదేకే మరను నిలువుగా పట్టుకుని దాంతో బాణాలు వెయ్యొచ్చును. సాయిబులు జట్కాబండి తోల్తారు. ఎద్దుబండి తోలరు. సాయిబులు గుడ్డలు కుడతారు. సాయిబులు ఇంకేమీ చెయ్యరు. వాళ్ళు వీధిబళ్ళోకొచ్చి చదువుతారు.

సాయిబుల సన్నాయిమేళం బాగుంటుంది వినటానికి. సాయిబుల పెళ్ళికి ఆ మేళం వాయిస్తారు. పెళ్ళి కొడుకు మొహానికి మల్లెపూదండ లడ్డం పెడతారు. సాయిబు పెళ్ళికొడుకు గుర్రమెక్కి ఊరేగుతాడు. సాయిబు పెళ్ళికూతుళ్ళు ఊరేగరు. గుర్రమెక్కటం చాతకాకపోతే సాయిబులు పెళ్ళిచేసుకోరు.

పీర్లపండక్కి సాయిబులు పెద్దపులి వేషాలు వేసి ఆడతారు. మహన్నవమాల్లో పోలీసువాళ్ళు భేతాళవేషాలు వేస్తారు. భేతాళుణ్ణి చూస్తే పిల్లలు దడుచుకుంటారు. చూడటానికి పెద్దపులి వేషాలే బాగుంటై.

శ్రీరామనవమి కూడా భలే బాగుంటుంది. ఊరంతటా పందిళ్ళు వేస్తారు. పందిళ్ళ కింద చాలా చల్లగా ఉంటుంది. శ్రీరామనవమినాడు వాటినిండా జనం ఉంటారు. చిన్న పిల్లలు ఆ జనంలోకి పోరాదు. పోతే మారుబడతారని పెద్దవాళ్ళు కోప్పడతారు. కాని అన్నీ వొట్టిదే. ఎక్కడికి పోయినా పిల్లలు మారుపడరు. చిన్నపిల్లలు పొట్టిగా ఉండటంవల్ల దేముడూ పూజా కనిపించవు.

ఊరంతా కలిసి చేసుకునే పండగలన్నీ ఎంతో బాగుంటై. కార్తీకమాసంలో వనసంతర్పణలు చేస్తారు. అప్పుడన్ని కులాలవాళ్ళూ కలిసి కూర్చుని భోంచేస్తారు. మన ఎదురుగా కోమట్లూ శూద్దర్లూ కనిపిస్తారు. అట్లా భోంచెయ్యనిస్తే బాగుంటుంది కాని భయం వేస్తుంది. ఉసిరి చెట్టున్నచోట, కులభేదాలు లేకుండా భోంచెయ్యవచ్చుట. మా దొడ్డో ఉసిరి చెట్టుంది కాని తాతయ్య మూలాన మా ఇంట్లో శూద్దర వాళ్ళకి అన్నం పెట్టం. తాతయ్య వనభోజనాలక్కూడా రాడు.

సప్తాహం చేసేటప్పుడు కూడా ఊళ్ళో వాళ్ళంతా భోజనాలకి పోతారు. రోజల్లా భజనచేస్తారు. రాత్రిరి హరికథలు చెబుతారు. భజనలు చేసే చోట చిన్న పిల్లల్ని ఆరుమనీ పెట్టి వాయించనిస్తారు. చిన్న పిల్లలు వాయిస్తే మోత ఒకసారి ఎక్కువగా ఇంకోసారి తక్కువగా వస్తుంది. అదీ కాక చెయ్యినెప్పుడ్తుంది. చేతులు మార్చినా లాభం ఉండదు. ఆఖరుకు రెండు చేతులూ ఉపయోగించాలి సొస్తుంది. రెండు చేతులూ నెప్పెత్తినప్పు డేడుపొస్తుంది. చేతులు నెప్పెత్తినా భజనదగ్గిర ఆరుమనీ వాయించటం పుణ్యం. ఏడుపొస్తే ఎవరన్నా చూస్తారేమో అని సిగ్గేస్తుంది.

ఊళ్ళోకి సర్కసువస్తే చాలా సరదాగా ఉంటుంది. ఊళ్ళోకి సర్కసు రాగానే వాన కురుస్తుంది. సర్కసుడేరా పొలంలో వేస్తారు. వానకు పొలమంతా మోకాలు లోతు బురద అవుతుంది. డేరాదగ్గరికి ఆ బురదలో నడిచివెళ్ళాలి. జనం కూర్చునే చోట ఊక పోస్తారు. ఊకమీద కూర్చుంటే బురద అంటదుగాని, లాగు తడిసి చల్లగా ఉంటుంది.

సర్కసుదగ్గిర సోడా అమ్ముతారు. చిన్నపిల్లలు సోడా తాగుతారంటే నాన్నకి కోపం- చలపతిరావుగారికి కోపంలేదు. సోడాతాగితే నోరు కారంగా ఉంటుంది. ముక్కుల్లో ఘాటుగా ఉంటుంది. సోడా సీసాలో గుండు అడ్డం పడ్డప్పుడు మాత్రం హాయిగా ఉంటుంది. సర్కసు చూడటానికి బాగుంటుంది కాని వాళ్ళు చేసేపనుల్లో కష్టమేమీలేదు. వాళ్ళు చాలా సులభంగా చేస్తారు. ఒక్కసారయినా తప్పరు. కాని చిన్న గొడుగు పట్టుకుని తీగమీద నడవటం భలే కష్టం; అందుకనే ఆ పిల్ల అంత భయపడుతూ నడుస్తుంది. ఆ పిల్ల క్రిందపడితే పట్టుకోటానికి ఒక మగవాడుంటాడు. పిల్లకేసి చూస్తుంటాడు. పిల్ల ముందుకుపోతే తనూ ముందుకుపోతాడు. వెనక్కొస్తే వెనక్కొస్తాడు. పరిగెత్తితే పరిగెత్తుతాడు; తీగెమీద నడిచేపిల్ల ఎంతో చక్కగా ఉంటుంది. ఆ పిల్లతో ఆ మొగవాడు మాట్లాడుతాడు. ఆ పిల్ల అబ్బాయిని చూసి నవ్వుతుంది. ఇంకెవర్నీ చూసి నవ్వదు. సర్కసు వెళ్ళిపోయిన తర్వాత కూడా ఆ పిల్ల మనకు జ్ఞాపకం వస్తుంది.

సర్కసు వెళ్ళిపోయిన తరవాత చిన్నపిల్లలు చిన్నకర్రలకు నులకతాడుకట్టి ఉట్టుట్టి ఏనుగులను ఆడిస్తారు. నులక కొరడాలు చళ్‌మనవు.

తాతయ్యకు ఊళ్ళోచేసుకునే పండగ లేవీ ఇష్టంలేదు. తాతయ్య ఆఖరుకు సర్కసుకూడా చూడడు. ఆయనకి ఇంట్లో చేసుకునే పండగలే ఇష్టం. ఇంట్లో చేసుకునే పండగలు వూళ్ళో చేసుకునే పండగలంత బాగుండవు. పిండివంటలు చేస్తారు గాని మన ఇష్టం వచ్చినట్టు తిననివ్వరు. తాతయ్య నోట్లో మెతుకులు వేసుకునేదాకా మనం అన్నం కలుపుకోకూడదు. పండుగరోజున గోగుపచ్చడిగాని కందిసున్నిగాని వెయ్యమంటే అమ్మ తిడుతుంది.

చలపతిరావుగారింట్లో చేసుకున్న పిండివంటలు నాకోసం మీనాక్షి తెస్తుంది. అప్పుడు అమ్మ మీనాక్షిని ఎంతో అపేక్షగా చూస్తుంది. మీనాక్షికి మా ఇంట్లో పిండి

వంటలుకూడా పెడుతుంది. పండుగైన మర్నాడు మిగిలిన పిండి వంటలు తాతయ్య చూడకుండా అమ్మ నాకూ నాన్నకూ పెడుతుంది.

పిండి వంటలు జాస్తిగా తింటే జరం వస్తుంది. జరం వస్తే దిగులేస్తుంది. ఆకలెయ్యదు. జరమొచ్చినప్పుడు ఎవరూ చూడకుండా ఏమన్నా తింటే నోరు చేదుగా ఉంటుంది. జరమొచ్చిన పిల్లలకి అజీర్ణం మాత్రలేస్తారు. అవి మింగితే గొంతులో వికారంగా ఉంటుంది, జరం వొచ్చినట్టదే గుర్తు.

జరం పిల్లలకే వొస్తుంది. పెద్దవాళ్ళకిరాదు. పెద్దవాళ్ళు చచ్చిపోతారు. పెద్దవాళ్ళు చచ్చిపోయినప్పుడు ఆడవాళ్ళేడుస్తారు. మగవాళ్ళు ఏడవరు. దిగులుగా ఉంటారు. దిగులుగా ఉన్నప్పుడు నవ్వరు. దిగులుగా ఉన్నట్టు అదే గుర్తు. చచ్చిపోయిన తరవాత తాతయ్య చచ్చిపోయినట్టులేడు. నిద్దరపోతున్నట్టున్నాడు; అయితే తాతయ్య నిద్దర్లో గురక పెడతాడు. చచ్చిపోయినవాళ్ళు గురక పెట్టరు. చావకముందు కొద్దిగా గురక పెడతారు. కాని ఆ గురక పెట్టేటప్పుడు నిద్దర పోరు. తాతయ్య నిద్దరపోకుండానే గురక పెడుతుంటే అమ్మా వాళ్ళూ ఆయన నోట్లో తులసి తీర్థం పోస్తారు. అయితే తాతయ్య తులసిదళం నమిలి మింగలేదు. అది ఆయన పెదిమల మధ్య ఇరుక్కుంటుంది. అమ్మ మెల్లిగా ఆ దళాన్ని చేత్తో తీసేస్తుంది. చచ్చిపొయ్యేటప్పుడు అమ్మ తాతయ్యను తాకుతుంది. అప్పుడు నాన్న ఆయన చెవిదగ్గిర మూతిపెట్టి 'నారాయణ, నారాయణ' అని జపం చేస్తాడు.

తాతయ్య ఏంచెబుతాడో అడగమని నాన్నని అంతా అడిగారు. నాన్నకి అడగటం ఇష్టంలేదు. కాని అంతా అడగమంటుంటే అడుగుతాడు. తాతయ్యను 'నాన్న నాన్న' అని పిలుస్తాడు. మాకేం చెబుతావంటాడు నాన్న. అప్పుడు నాన్న మాట్లాడుతుంటే ఎవరో అల్లే ఉంటుంది. తాతయ్య నాన్నకు సమాధానం చెప్పడు. ఊరికే గురక పెడతాడు. తాతయ్య చచ్చిపోయినా కళ్ళు తెరచుకునే ఉన్నాడు. కాని ఆయన గుడ్డి బిచ్చగాడల్లే ఎవరివంకా చూడలేదు. గుడ్డిబిచ్చగాణ్ని చూస్తే నాకు భయం. నాన్న వాణ్నిగురించి చెబితే జాలేసింది. వాడికి ఇల్లుండదుట. పొలాలుండవుట. ఆమాట విన్నతరవాత వాణ్నిచూసి జాలేసింది. దేవుడు తాతయ్యను చూసి జాలిపడతాడు. ఎందుకంటే చచ్చిపొయ్యేప్పుడు తాతయ్య గుడ్డి బిచ్చగాడల్లేనే ఉన్నాడు. చచ్చిపోయిన తరవాత తాతయ్యకు ఇల్లూ వాకిలీ లేదు. తాతయ్యను ఎక్కడికో తీసుకుపోయినారు. ఆయనకి పొలాలుకూడాలేవు. ఇక తాతయ్య రైతులతో పోట్లాడ్డు.

తాతయ్య పోట్లాడినా రైతులకి కోపంలేదు. వాళ్ళు శూద్దర్లు. ఒక రైతు వచ్చి తాతయ్య చచ్చిపోయినందుకు ఏడిచాడు. మగవాళ్ళు ఏడుస్తుంటే భయమేస్తుంది. నాన్న ఏడవలేదు. ఆయన నవ్వకపోవటం చూస్తే దిగులుగా ఉందని తెలుస్తుంది.

తాతయ్యని యములవాళ్లు పట్టికెళ్ళారు. యములవాళ్ళు మనకి కనిపించరు. తాతయ్యకు కనిపిస్తారు. తాతయ్యకోసం విమానం రాలేదు. నాయనమ్మ చచ్చిపోయినప్పుడు విమానం వచ్చింది. 'నా కోసం విమానం వచ్చింది, పోతున్నా'నని ఆవిడే చెప్పింది. తాతయ్య తనకోసం విమానం వచ్చిందని చెప్పలేదు. పోతున్నాననికూడా చెప్పలేదు. తాతయ్య ఎంత మంచి బ్రాహ్మడైనా నరకానికే పోతాట్ట, అమ్మ చెప్పింది. ఎంత మంచివాళ్ళన్నా కాస్త పాపం చేస్తారు కనక నరకానికి పోతారు.

యమలోకం భయంకరంగా ఉంటుంది. అక్కడి యములవాళ్లు చచ్చిపోయిన వాళ్ళని రంపాలతో కోస్తారు. గదలు పెట్టి కొడతారు. నిప్పుల్లో కాలుస్తారు. కాగే నూనెలో ఉడక పెడతారు. యముల వాళ్ళను చూస్తేనే, చచ్చిపోయిన వాళ్ళ ప్రాణాలు కాస్తా పోతై. కోళ్ళను కోసేవాళ్ళను వాళ్ళు రంపాలతో కోస్తారు. కాని మనని కోసినందుకు వాళ్ళకి పాపం లేదు.

మనమంతా ముసలివాళ్ళమయిన తరవాత తాతయ్యల్లేనే చచ్చిపోతాం.

ముద్రణ : 1940-1941.

ప్రచురణ : కాలభైరవుడు కథల సంపుటిలో,
యువ బుక్ డిపో : మద్రాసు

# దేవుడింకా ఉన్నాడు!

ఇటీవల నేను మా స్వగ్రామం వెళ్ళాను. నాకు అయినవాళ్ళంతా అక్కడే ఉన్నారు. వాళ్ళని చూసి పదేళ్ళయినది. నేను జంధ్యాలు తెంపేసి తద్దినాలు మానేసి, ఏనాడయితే వితంతువును అందులో మరో శాఖవాణ్ని పెళ్ళాడానో ఆనాడే నాకు మా బంధువులకు ఋణం తీరిపోయింది. నేను మా ఊరు వదిలిపెట్టి వెళ్ళిపోతున్నా నన్నప్పుడు అందరూ సంతోషించారు. నా ప్రయాణానికి ముహూర్తాలు పెట్టారు. "ఎప్పుడు వెళ్ళటం?" అని ఒకటికి పదిసార్లు అడిగారు. "ఇంకా పోలేదా?" అని కూడా అడిగారు. అయిపోయింది. నేను ఊరు విడిచి వచ్చేశాను. వాళ్ళకోరిక ఫలించిందని నేనూ సంతోషించాను.

కాని వారికి సంతృప్తి కలిగినట్టు లేదు. నేను వాళ్ళ మొహం చూడకుండా పదేళ్ళ గడపగలగటం వారు సహించలేకపోయినారు. నాకు బంధువుల మీద ప్రేమే లేదన్నారు. ఎవరు బ్రతికున్నారో ఎవరు చచ్చారో కూడా నేను పట్టించుకోవటం లేదన్నారు. నాకు నిష్ఠురపు ఉత్తరాలు రాశారు. చివరకు నేను మోసపోయినాను. వాళ్ళంతా కాలంతోపాటు మారారనుకున్నాను. నిజంగా సంతసిస్తున్నారని నమ్మాను. వెళ్ళాను.

అరుగుమీద చాపేసి కూర్చోబెట్టారు నన్ను. ఊళ్ళో ఉన్న బంధువులంతా చేరారు. మామూలు కుశలప్రశ్నలు వేశారు. సమాధానం చెప్పాను. సంభాషణ ఆగిపోయింది.

అందరి మొహాలకేసి చూశాను. ఎవరి మొహాన్నా ఒక సంతోషంగాని విచారం గాని లేదు.

ఆకస్మాత్తుగా నిశ్శబ్దం భంగమయింది.

"చావు వెధవా!" అని మా పెద్ద వొదినెగారు తన ఆఖరు కొడుకును వీడి మని వీపు మీద ఒక్కటి చరిచింది. వాడు కెవ్వున ఏడ్చాడు. వాడి మొహాన్ని అమ్మ తాయెత్తులూ, మొలకు మరొక తాయెత్తు కనిపించింది. పిల్లవాడు చాలా అనారో గ్యంగా ఉన్నాడు. పొట్ట పెరిగింది. రొమ్ము ఎండుకుపోయింది. కాళ్ళు పుడకలల్లే ఉన్నాయి. తల పెద్దదిగా కనిపిస్తున్నది.

"పిల్లవాడట్లా ఉన్నాడే వదినా?" అన్నాను.

"నేను చేసుకున్న రాత!" అన్నదావిడ.

"ఏమన్నా మందిప్పిస్తున్నారా?"

మా చిన తాతయ్యా దగ్గాడో, లేక నవ్వాడో, ఆ రెండు చప్పుళ్ళు ఆయన ఒకటిగానే చేస్తాడు.

"భైరవ శాస్తుల్లూ....నవగ్రహ జపం చేసి.... తాయెత్తు కట్టాళ్ళే" అన్నాడాయన సావధానంగా.

విషయం మార్చటానికని "ఇక్కడ ఈ ఇటికల పోగేమిటి?" అన్నాను.

"చూడలేదుట్రా? మేడమీద దక్షిణవేపు గది విప్పించేశాం?" అన్నాడు మా పెదనాన్న.

"ఏం" అన్నాను ఆశ్చర్యంగా. ఆ దిక్కుమాలిన మేడకల్లా అదొక్కటే సుఖమైన గది.

"అందులో తాతయ్య ఉన్నాడు కాదు మరీ?" అన్నాడు పెదనాన్న.

తాతయ్య ఉండటమంటే మీ కర్థంకాదు. మా తాత చచ్చిపోయి దయ్యమై ఆ గదిలో ఉంటున్నాడు. మరే గదిలోకి తాతయ్య రాడు.

"భైరవ శాస్తులు చేత ముగ్గులూ అవీ వేయించాం. లాభించలేదు. తాతయ్యకు భేతాళ మంత్రం వచ్చును కాదు మరీ? భైరవ శాస్తులు ముగ్గులు పని చెయ్యలేదు మారణహోమం చేస్తానన్నాడు భైరవ శాస్తుల్లు. బ్రహ్మహత్య దేనికని మేమంతా వారించాం" అన్నాడు పెదనాన్న.

చిన తాత దగ్గాడో లేక నవ్వాడో.

"ఎందుకూ? గది పడగొట్టేస్తే.... ఆయన వెళ్ళిపోతాడు .... ఆ గదిలో అన్నయ్య ఏమన్నా నిక్షేపం దాచాడా.... లేకపోతే ఆ గదిని విడిచి ఎందుకుపోడూ? అని నాకు సందేహం కలిగింది. సగం అందుకే నేను పట్టుబట్టి గది పడగొట్టించేశా" అన్నాడాయన.

"అన్నీ అనర్థాలుగానే ఉన్నవి కొంపకు. (గొంతు తగ్గించి) సత్యం పెళ్ళాం మళ్ళీ లేచిపోయింది. గుర్రబ్బండి వాడితో—".

సత్యమంటే మా రెండో అన్న. నేను మా వూరు వదిలినాక వాడి భార్య పోయింది. రెండో పెళ్ళి చేసుకున్నాడు. ఈవిడ అదివరకొకసారి లేచిపోయిందని నాకు తెలీదు.

"ఇదంతా సత్యం మొదటి భార్య పనే! బాలింత చావుకూడా చచ్చిందా? నానా పీడుపులూ ఏడిపిస్తున్నది! సత్యానికి నెలకో సారైనా కనిపించి, స్త్రీకాపురం సాగనిస్తాననుకున్నావా, అని బెదిరిస్తూ వుంటుంది. అది లేచిపోయిందంటే పోదూ? దీనికి నలుగురు పిల్లలు పుట్టారా? మూడోవాడుతప్ప మిగిలినవాళ్ళంతా పోయినారు. అందర్నీ పొట్టన బెట్టుకుంది" అన్నాడు పెదనాన్న.

"మూడోవాణ్ని వదిలిందేం?" అన్నాను.

"ఏం వదిలింది? వాడికి అన్నీ మోరాలే! డాక్టర్ను వద్దు అంటున్న కొద్దీ మీ పెద్ద అన్న పిలిచాడు. వాళ్ళ మొహం! డాక్టర్లేం చెబుతారు? తల్లికి సవాయి

రోగం ఉందన్నాడు. నిక్షేపమైన బ్రాహ్మణకుటుంబంలో సవాయిఏమిటి వాడిశ్రాద్ధం? భైరవ శాస్త్రుల్లును పిలిస్తే అసలు కీలకం ఇట్టే చెప్పాడు. ఇదంతా సత్యం మొదటి పెళ్ళాంపనే!" అన్నాడు పెదనాన్న.

చిన తాతయ్య దగ్గాడు.

"అసలు సత్యానికి గురువులో శనీ! రవి కోణంలో ఉన్నాడు. సప్తమంలో శుక్రుడూ, బుధుడూ ఉన్నారు.... ఇంకా రెండేళ్ళు మూడు నెల్ల పన్నెండు రోజులు. అప్పటికి సత్యానికి మారకమన్నా కావాలీ లేదా మంచి యోగమన్నా పట్టాలి. ఏదో ఒకటి తప్పదు...." అన్నాడు చిన తాతయ్య.

నేనీ మాటలు వింటూండగా మా పెద్దన్న రెండోకూతురు ఎప్పుడో, వచ్చి నా జేబులో పెన్నులాగి మోకాలికి పెట్టి రెండుగా విరిచి కాళ్ళమీద సిరా పడ్డందుకు పెద్ద పెట్టున ఏడవసాగింది. మా పెదనాన్న చప్పునలేచి నా కండువాతో దాని కాళ్ళు రెండూ తుడిచాడు.

మా చిన తాత మా సత్యానికి రానున్న మారక యోగం సంగతే ఇంకా ఆలోచిస్తున్నట్టు కనబడ్డాడు. ఆయన నిట్టూర్చి "ఏమో , అన్నింటికీ భగవంతుడు న్నాడు"అన్నాడు.

ప్రచురణ : 1954, సవతితల్లి కథల సంపుటిలో.
దేశి కవితా మండలి, విజయవాడ.

# వరప్రసాదం

కాపరానికి వచ్చిన పన్నెండేళ్ళకిగాని, కనకమ్మగారికి సంతానం లేకపోయింది. ఆ సత్యనారాయణస్వామి వారి కటాక్షం కలగబట్టే అంత ఆలస్యంగానైనా ఆ కొరత తీరింది.

నరసింహంగారూ, కనకమ్మగారూ, పిల్లలకోసం వాచిపోయినారు. చాలా కాలంగా కాపరంచేస్తూ పిల్లలు కలగకపోతే, ఏ దంపతులైనా సంతానంకోసం వాచి పోవచ్చును. ఇతరులు పిల్లలకోసం తపించటంలోనూ, కనకమ్మా నరసింహంగార్లు తపించటంలోనూ, చాలా వ్యత్యాసం ఉంది.

కనకమ్మగారికి పట్టి ఉండిన దిగులేమంటే, సంతానం కలగకపోవటం తన స్త్రీత్వానికే అవమానకరంగా ఉండినట్లు భావించిందామె. అందరూ పిల్లల్ని కంటు న్నప్పుడు తను కనకపోవటం సాటి ఆడవాళ్ళల్లో తనకు అవమానకరమైన విషయం కాదా మరి?

"కొందరికి కడుపులైనా పోతై!" అంటూ ఉండే దామెగారు. ఆ వాక్యంతో అపారమైన అర్థం కనిపిస్తుంది నాకు. ఆ వాక్యంమీద ఎంత పెద్ద గ్రంథమైనా రాయవచ్చు ననుకుంటాను. 'అథాతో బ్రహ్మ జిజ్ఞాసా' అనే ముక్క తలచుకుంటే మా స్వాములవారు ఎట్లా ఉద్రేకపూరితు లౌతారో, కనకమ్మగారి మాటలు తలచు కుంటే నేనూ అంత తన్మయుణ్ణి అవుతాను. కాని అనేక కారణాలవల్ల కనకమ్మగా రన్న వాక్యంలో ఉన్న వివిధ భావాలను పఠితల కుశాగ్రబుద్ధికి వదలి పైకథ కుపక్రమించుతాను.

పోతే నరసింహంగారికిన్నీ కొరతగానే ఉండింది, పిల్లలు లేకపోవటమనేది. కొందరు పిల్లలకు బొమ్మలు ఎట్లా కావాలో, కొందరు పెద్దలకు కూడా పిల్లలు అట్లాగే కావాలి- ఆడుకోవటానికి. నరసింహంగారు ప్రాణంగల బొమ్మల కోసం కలవరించాడు.

ఎట్లాగైతేనేం కాపరానికి వచ్చిన పుష్కరానికి కనకమ్మగారికి నెలతప్పింది. నలుగురూ సంతోషించారు. నరసింహంగారి ఉత్సాహం చూసి నలుగురాడవాళ్ళూ నవ్వుకోలేక ఇదయినారు కూడాను.

ఒకనాడు కనకమ్మగారికి వింత కల వచ్చింది. ఆవిడకు నామాలవాడు కలలో కనిపించి "నా దయవల్ల నీకు మగపిల్లవాడు పుడితే నా పేరు పెట్టు కుంటావా?" అని అడిగాడు. మర్నాడు భార్యాభర్తలిద్దరూ కూడబలుక్కుని

మగపిల్లవాడే కలగాలి కాని తప్పకుండా ఆ స్వామిపేరు పెట్టుకుందామని అనుకు న్నారు. ఆ సాయంకాలమే! కనకమ్మగారు బయట ఉండింది.

"మేమంటే వెంకటేశ్వరస్వామికి కూడా వేళాకోళమయిందిగదా!" అని విల పించింది కనకమ్మ ఎడంగా కూర్చుని.

అనేకమంది దేవతలుండడం కూడా ఒకందుకు మంచిదే సంటాను. ఆంధ్ర దేశానికంతకూ ఒక్క వెంకటేశ్వరస్వామే వుంటే ఆ దంపతుల గతి ఏమైఉండును! డాక్టర్లలో పరస్పరం ఉండే ఈర్ష్య దేవతలలో కూడా ఉండి ఉంటుంది. నరసింహం గారికి సంతానం ప్రసాదించటం వెంకటేశ్వరస్వామివల్ల ఎప్పుడైతే కాకపోయిందో అప్పుడు శ్రీ సత్యనారాయణస్వామివారు వెంటనే తన ఏజంటు ఎవరో పంపినట్టే వచ్చాడు. ఆయన వస్తూవస్తూనే నరసింహంగారి ఇంటిలోపలి అరుగుమీదకూర్చొని వేదోక్తంగా ఆశీర్వదించాడు గృహస్థును. ఆ తరువాత కనకమ్మగారిని చూసి "అంతా క్షేమంగా ఉన్నారా తల్లీ?" అన్నాడు. ఆ తరువాత "కాస్త స్నానంచేసి సంధ్యా వందనం చేసుకుంటాను. నుయ్యి ఎక్కడ?" అని అడిగి ఆ కార్యకలాపంలో పడి పోయినాడు.

మళ్ళీ భార్యాభర్తలిద్దరూ కూడబలుక్కుని "ఈయన ఎవరో దేవుడల్లేవచ్చాడు. భోజనానికి ఉండిపొమ్మందాం!" అనుకున్నారు.

"సత్యనారాయణవ్రతం చేసుకోండి. మీకు పిల్లలు ఎట్లా కలగరో చూస్తాను!" అన్నాడా బ్రాహ్మడు భోజనాలప్పుడు.

నరసింహంగారూ, కనకమ్మగారూ సత్యనారాయణ వ్రతం చేసుకున్న తరు వాత సంవత్సరం వెళ్ళక పూర్వమే కనకమ్మగారికి మళ్ళీ నెలతప్పింది. ఈసారి కనకమ్మగారికి గర్భం నిలిచింది కూడాను. కాని ఆ తొమ్మిది నెలలూ ఆవిడ పోయిన పోకడలు సంతానవాంఛ ఉన్న మనిషికి ఉచితమైనవికావు. ఆవిడకు వేవిళ్ళే సరిపడలేదు.

అన్ని తత్వాలూ ఒకటిగా ఉండవు. కొందరికి జబ్బేరాదు. అసలు జబ్బు రావటమూ, రాకపోవటమూ, వచ్చిన తరవాత అదీ త్వరగా నయం కావటమూ, కాకపోవటమూ, డాక్టరు చేతిలో కంటె మన చేతిలోనే ఎక్కువ ఉంటుంది. ఒక్క రోజు జ్వరంతో మంచాని కంటుకుపోయినవాళ్ళున్నారు. నాలుగైదు లంఘనాలు చేసికూడా పైకి కనిపించని వారున్నారు. ఒక్కపూట భోజనం మానేసి బిక్క మొహం వేసేవాళ్ళు ఉన్నారు. ఎవరేమైతేనేం? కనకమ్మగారు కేవలం వేవిళ్ళతోనే పీనుగయిపోయింది.

ఆ తరువాత నెలలు గడిచినకొద్దీ ఆవిడ నస ప్రారంభించింది. "ఏం కడుపు లమ్మా? దిక్కుమాలిన కడుపులూ!.... కడుపులు రాకుండా పిల్లలు పుట్టిరాదూ?" అని. అదివరకల్లా కడుపుతో ఉండిన వాళ్ళను చూచి అసూయపడ్డది. అనేక మంది కడుపుతో ఉండి కళకళలాడేవారు. తను ఏబ్రాసల్లే ఉండటం దేనికో ఆవిడకు అర్థం

క్తాలేదు. అట్లా ఉండకపోవటం తన పొరపాటే అయి ఉండవచ్చు నన్న అనుమానం ఆవిడకు తట్టింది. కాని అది ఎవరూ నిరూపించలేరని తెలుసుకుని ఆవిడ నిశ్చింతగా ఉండింది. (ఇంకొకరు నిరూపించలేనంత కాలమూ తప్పులు చెయ్యటానికి గాని, అశక్తత ఉండటానికిగాని ఎవరికభ్యంతరం ఉంటుంది?)

ఏడోనెల గర్భిణీగా ఉండగా కనకమ్మగారికి అగ్నిపరీక్షగా ఆవిడ అన్నా, అన్న భార్యా, అన్న అత్తగారూ, ఏదో పనిమీద తమ ఇంటికి వచ్చారు. కనకమ్మ పోకడలు చూసి ఆవిడ అన్న అత్తగారు "ఇదేమిటమ్మా కనకమ్మతల్లీ! ఇలా అయితే నేను పదిహేను మంది నెలా మోశానూ?" అని నీతులు ప్రారంభించింది. అది చాల నట్టు కనకమ్మగారి వదినెగారుకూడా ఆరునెలల గర్భిణిగా ఉండింది. ఆవిడ మొహాన ఎప్పుడూ సంతోషమూ చిరునవ్వూ తాండవిస్తూ ఉండేవి. తన అన్న ఆ భార్యని పువ్వుల్లోపెట్టి చూచుకోవటం చూస్తే కనకమ్మ వళ్ళు భగ్గున మండింది. ఆ ముగ్గురూ తమ యింటో ఉన్న రెండు దినాలకాలంలోనూ చూడవచ్చిన అమ్మలక్కలంతా తన వదినెగారి ఆరునెలల గర్భాన్ని చూసి ఏమి మురిశారు! ఏడు నెలల గర్భిణి తన మొహాన ఏ ముద్దులూ లేవు!.... సకాలానికి కనకమ్మగారు మగ పిల్లవాణ్ని కన్నది. ఆ కుర్రవాడికి రేపు బారసాల అనగా నరసింహంగారి కలలో సత్యనారాయణ మూర్తివారు ప్రత్యక్షమై "నా అనుగ్రహంవల్ల పుట్టిన యీ పిల్లవాడికి నా పేరుపెట్టుకో" అని సలహా ఇచ్చారు.

ఆ ప్రకారమే నరసింహంగారు బియ్యంలో "సత్యనారాయణ వరప్రసాదు" అని రాశాడు. ఆయన ఆ పేరు రాశాడో లేదో తల్లి చేతుల్లో ఉన్న గుడ్డు ఒక్క కేకపెట్టి నిశ్చలంగా ఉండిపోయాడు. అందరూ గొల్లుమన్నారు. ఈ గలాభాలో ఒక పూర్వసువాసినికి పూని ఆవిడ కేకలు వేయటం మొదలు పెట్టింది. వెంకటేశ్వర స్వామి ఏదో అంటున్నాడని అందరూ సావధానులై విన్నారు. వెంకటేశ్వరస్వామికి చాలా కోపం వచ్చింది. తనపేరు పెట్టుకుంటామని వాగ్దానంచేసి ఏమిటి 'నరసిం హాయి' ఉద్దేశం? ఇప్పటికైనా పిల్లవాడికి తన పేరు పెడతాడా? తను ఏంచేసేదీ చూస్తాడా!

మరి వెంకటేశ్వరస్వామి ప్రత్యక్ష దేవుడు. ఇతరులకు వాగ్దానాలు చేసి తప్పవచ్చుగాని వెంకటేశ్వరస్వామితో కుదరదు. కోర్టుకు ఈడ్చే రకం!

సరే, నలుగురూచేరి పిల్లవాడిపేరు వెంకటనారాయణ అని ఒప్పుకునే వరకూ పిల్లవాడు ఏడవనే లేదు....

ఇద్దరు దేవతల దయవల్ల భూమిమీద పడి ఆ యిద్దరిపేర్లూ తనపేరు చేసుకున్న ఆ కుర్రవాడు, ఎంతగొప్ప జాతకుడో అని అందరికీ అనుమానం రావచ్చును. ఒక దైవజ్ఞుడు రాసిన జాతకంలో అతను చాలా గొప్ప జాతకుడని మళ్ళీమళ్ళీ చెప్పబడి వుంది.

ఉదాహరణకు ఆయుర్భావం అనే ఘట్టంలో ఈ విధంగా ఉంది—

"ఆయుష్యాధిపతియైన చంద్రుడు (గ్రామ్యంగా 'చంద్రుడు' అని రాసినా తప్పులేదు!) పంచకోణమునందు యున్నందున్న కారకుడు సుఖస్థాన స్థితియందు యున్నందున్న ఈ జాతకునికి పరమాయుర్దాయము యున్నది" అని మనకు సులభంగా అర్థమయేటందుకు "దీర్ఘాయురోగ్యవాన్ భవతి" అని సంస్కృతంలో ఉంది.

ఆ విధంగానే "అస్యజాతకస్య ధనాభావః" అనే ఘట్టంలో కూడా డబ్బును గురించి దసకాన్ని గురించీ చాలా విశేషంగానే చెప్పబడి ఉంది.

ముందు ముందు కుర్రవా డేమవుతాడోగాని ఇప్పటిమట్టుకు వాడి సంగతి నాకేమీ బాగాలేదు— ఇంకొకరి గొడవ నాకెందుకు!

వాడికి రెండు నెలలు వెళ్ళింది లగాయతు ఈనాటివరకూ వాడి తల్లిదండ్రులు ఎవరిమట్టుకు వారు వాణ్ని తనవాణ్ని చెయ్యాలని ఒకరొకరితో ఘోరంగా పోట్లాడుకున్నారు. వాణ్ని ఆ ఇద్దరూ చెరొక రెక్కా పట్టుకుని చెరొక వైపూ లాగినా వాడి కంత అపకారం జరగకపోను.

వాడు తండ్రిపోలిక అని అంటే తల్లికిమంట. తల్లిపోలిక అంటే తండ్రికి కోపం. తండ్రిమాట వింటే వాణ్ణి తల్లి కొడుతుంది. తల్లిమాట వింటే తండ్రి తిడతాడు. వాణ్ణి తల్లికొడితే తండ్రి సముదాయిస్తాడు. తండ్రి తిడితే తల్లి ఓదార్చుతుండే. భార్యభర్తలిద్దరిలో ఏ ఒకరు వాణ్ణి ఏం చేసినా రెండోవారు పోట్లాటకు వస్తారు.

ఈ ఇద్దరి మధ్యా వెంకటనారాయణకు ప్రవర్తన అనేదాని సూత్రం తెలియకుండా పోయింది. ఏదిచేస్తే ఎవరు తప్పుపడతారో, ఎవరు తప్పు పట్టటంకంటే ఎవరు తప్పు పట్టటంలో ఎక్కువ న్యాయం ఉందో తెలియక వాడు వట్టి భాజమ్మగా తయారయినాడు. వాడికి ఆవగింజంత ఆత్మవిశ్వాసం కూడా లేదు. తను ఏదిచేసినా తప్పవుతుందని వాడికి తెలుసును — సాధారణంగా అవుతుంది కూడానూ! వాడు తన్ను తాను మరచిపోలేని జబ్బుతో బాధపడుతూ ఉండటం నేను గమనించాను. వాణ్ణి పలకరిస్తే సమాధానం చెప్పటానికి భయపడతాడు. రెండక్షరాల సమాధానం చెప్పవలసివస్తే అంతకన్నా చిన్నది ఒక అక్షరం సమాధానం ఏమైనా ఉందేమోనని ఆలోచించటం ప్రారంభిస్తాడు. తనసాటి వాళ్ళతోకూడ వాడు నిశ్చింతగా నవ్వలేడు. ఎవరన్నా తను మాట్లాడటం వింటున్నారని తెలిస్తే మతిపోయి మాట తడబడుతుంది. ఎవరన్నా చూస్తూండగా వాడు సరిగా నడవనైనా లేడు. లోకమంతా తనమీద సానుభూతిలేని విమర్శకులతో నిండి ఉందని నమ్మినవాడల్లే కనిపిస్తాడు. పాపం, నవ్వినా వాడిమూతో పక్కకి తోసుకు పోతుంది!

ముద్రణ : భారతి, ఆగస్టు 1938.

# హింస

మా కుటుంబాలలో పిల్లల్ని పెంచటానికి రెండే పద్ధతులు. పిల్లల్ని చావ గొట్టి చెవులుమూసి చెప్పినమాట వినేటట్టు చేయటమూ, లేకపోతే వాళ్ళని గారాబం చేసి వాళ్ళు ఆడినట్టు ఆడటమూ. ఒకటి సన్మార్గమూ, రెండోది దుర్మార్గమూను. కొందరికి రెండూ దుర్మార్గాలే అనిపించవచ్చు. అదివేరే విషయం. మరో పద్ధతిలో పిల్లల్ని పెంచటం సాధ్యమని మేం మటుకు ఒప్పుకోం. ఎక్కడైనా, ఎవరైనా పరాయివాళ్ళ పిల్లలు మా పిల్లలల్లే కాకుండా తల్లిదండ్రుల ప్రేమకు పాత్రులవుతూ కూడా, తల్లిదండ్రులు చెప్పే మాటలను విశ్వసిస్తూ వాళ్ళు వద్దన్న పనులు మానటం మా అనుభవంలోకి వస్తే, ఆ తల్లిదండ్రుల పురాకృత పుణ్యమంటారు. "పుణ్యం కొద్దీ పురుషుడు, దానం కొద్దీ పిల్లలు" అనుకుంటాం. మాకటువంటి పిల్లలు పుట్టరు. మాకు పుట్టేవాళ్ళు చూస్తూ చూస్తూ మా మాటవినరు. మేం పూర్వజన్మలో చేసిన దానం అటువంటిది! అంచేత మేం వాళ్ళని క్రమశిక్షణలో పెంచుతాం. వాళ్ళ బాగు కోసమే వాళ్ళని కొడతాం. మేం కొట్టకుండానే వాళ్లు భయభక్తులు కలిగివుంటే ఇక కావలసిందేమిటి? కాని అంత అదృష్టం మాకు రాసిపెట్టి ఉంటేగా? పిల్లల్ని క్రమ శిక్షణలో ఉంచకపోతే వాళ్ళని పాడుచేస్తాం. ఆపేక్ష అని పేరు పెట్టి వాళ్ళను పడేసి సాకుతాం. అది మా దౌర్బల్యం. అందుకనే అట్లా పెరిగిన పిల్లలు మాట వినరు. మాకు ఎదురు తిరుగుతారు. చిన్నతనంలో పిల్లల్ని హద్దులో ఉంచలేక పోయినం దుకు వాళ్ళు పెద్దయినాక తలవంచుకు తిరగవలసి వస్తుంది. మొక్కై వంగనిది మానై వంగుతుందా ఏమిటి?

*       *       *       *

కిష్టుడు చిన్నప్పటినుంచీ చాలా భయభక్తులతో పెరిగినవాడు. ఎందుకు పెరగడూ? మహాలక్ష్మమ్మగారు ఆరుగురు పిల్లల్ని కన్నది. ఆరుగురూ ఆరుగురే. నవరత్నాలు. ఎన్నడూ తలిదండ్రులమాట జవదాటి ఎరుగరు. పెద్ద మొగ పిల్లలిద్దరూ పెళ్ళయిన తరవాత అత్తవారి వలలోపడి తల్లిదండ్రులకు దూరమైనారు గాని, పెళ్ళయ్యేవరకు ఎంత భయభక్తులలో పెరిగారు! తరవాత ఆడపిల్లలిద్దరూ మొగుళ్ళ దగ్గిర భయభక్తులతో కాపరాలు చేస్తున్నారు. కిష్టుడూ, కడగొట్టు పిల్లదీ ఉన్నారు. అందరు పిల్లల్నీ ఆదర్శంగానే పెంచిన మాలక్ష్మమ్మ, పెద్దపిల్లలు అట్లా దూరమైనాక కిష్టుణ్ణి ఇంకా శ్రద్ధగా పెంచింది. వాణ్ణి ఎవరి సావాసమూ చెయ్య నిచ్చేదికాదు. వెయ్యి కళ్ళతో కనిపెట్టి ఉండేది. అన్నం తూచినట్లు పెట్టేది.

ఆకలి అయినా కాకపోయినా గడియారం ప్రకారం పెట్టేది. వాడు తిండి సరిగా తినకపోతే మొట్టి తినిపించేది. ఇంకా కావాలంటే నాలిక పీక్కువచ్చినా పెట్టేదీ కాదు. ఆవిడ అంత శ్రద్ధగా పెంచినా కిష్టుడు రోగిష్టిగానే వుండేవాడు. వాడికి నరాల జబ్బు వుందని డాక్టర్లు చెప్పారు. డబ్బు గుంజటానికి ఈ డాక్టర్లు ఏమైనా చెబుతారు. అందుకనే వాడికి పదిరోజుల కొకసారి జబ్బుచేస్తే నాటువైద్యుణ్ణి పిలిపించేది మాలక్ష్మమ్మ. ఇక ఆ నరసింహంగారి మాట చెప్పనే అక్కర్లేదు. ఆయన హుంకరిస్తే కిష్టుడు లాగురో ఉచ్చపోసుకునే వాడు. తండ్రి నడవలోకి వస్తే వాడు దొడ్లో వుండేవాడన్నమాట.

*　　　　*　　　　*　　　　*

మాలక్ష్మమ్మ పిల్లల్ని పెంచటం విషయంలోనేకాక, అన్ని విషయాలలోనూ అద్భుతమైన నియమాలు కలది. ఆవిడ ఏ జంతువునూ హింసించేదికాదు. వాళ్ళింట్లోకి తేళ్ళు వస్తే వాటిని ఉపాయంగా పట్టుకుని, దారంకట్టి కత్తెరతో కొండె కత్తిరించి, కత్తెర తోమి, కడిగి, తేళ్ళను వదిలిపెట్టేది. మరోసారి వాళ్ళ యింటి నిండా నల్లులు పుట్టలు పుట్టలుగా బయలుదేరినై. ఆవిడ నల్లిని కూడా ఎన్నడూ చంపేది కాదు. నల్లులు పోవటానికి ఎవరో మంచి ఉపాయం చెప్పారు. ఆవిడ ఒక పెద్ద కాగితం సంపాదించి కిష్టుడి చేత దానిమీద, చివర "రు" అనే అక్షరం వచ్చే ఊర్ల పేర్లన్నీ - కోడూరు, గూడూరు, నెల్లూరు మొదలైనవి రాయించి, ఆ కాగితం చుట్టగాచుట్టి ఇంటి కప్పుకు వేళ్ళాడగట్టింది. ఆనాటి నుంచి ఆవిడను నల్లి కుట్టి ఎరుగదు. రాత్రి పడుకుంటే భళ్లున తెల్లవారేదాకా మెళుకువ వచ్చేది కాదు.

"నీ మొహంమల్లేనే వుంది! తెల్లవార్లూ నన్ను నల్లులు చెడపీకినై" అన్నాడు నరశింహంగారు.

"మీ భ్రమ, ఇంకా నల్లి ఎక్కడ కుడుతుంది?" అన్నది మాలక్ష్మమ్మ.

"నా పక్కనిండా పాకితేనే?"

"పాకుతై, కుట్టవు." అన్నది మాలక్ష్మమ్మ.

అటువంటి మాలక్ష్మమ్మ పెంపకంలో పెరిగాడేమో, కిష్టుడు కించిత్తయినా జీవహింస సహించేవాడు కాడు. వాడు కాకుల్ని, పిచ్చికల్ని, పిల్లుల్ని, కుక్కల్ని వీలయినప్పుడల్లా మేపేవాడు.

ఈ విషయమై వాణ్ణి తల్లి కోప్పడ వలసికూడా వచ్చింది.

"కాకి ఆకలై అరుస్తే కొంచెం చద్దన్నం పెట్టానమ్మా." అన్నాడు కిష్టుడు భయంతో పిచ్చి మొహం వేసి.

"కాకి ఆకలి వెయ్యక పోయినా అరుస్తుంది. కాకుల్నీ, పక్షుల్నీ చూసి జాలి పడాలిగాని, అన్నం వేస్తూ కూచుంటార్రా?" అన్నది తల్లి.

ఈ గుణపాఠాన్ని అర్థం చేసుకోవటానికి కిష్టుడు ప్రయత్నించాడు.

వాడికి అన్ని జంతువుల మీదా జాలివుందిగాని, బల్లుల మీద మటుకు లేదు. వాడురోజూ గోడమీద బల్లులు పురుగుల్ని వేటాడటం చూసేవాడు. ఒక రోజు వాడు చూస్తుండగా బల్లి ఒకటి పోతంత రెక్కల పురుగును పట్టుకుంది. కిష్టుడది చూడలేక కళ్ళు గట్టిగా మూసుకున్నాడు. కాస్సేపటికి వాడు కళ్లుతెరచి చూస్తే బల్లి వుందిగాని, రెక్కలపురుగు దానినోట్లో లేదు. కిష్టుడి హృదయం ఆనందంతో పొంగిపోయింది. రెక్కలపురుగు బల్లినోట్లోపడి తప్పించుకు పోయిందనుకున్నాడు.

మరోసారి కిష్టుడు చూస్తుండగానే పిల్లి ఒకటి ఎలకని పట్టుకుంది. ఆ సమయంలో కిష్టుడు అన్నం తింటున్నాడు. పిల్లి లోపలికి వచ్చింది. దాని వాలకం చూస్తే ఏదో పెద్ద పనిమీద ఉన్నట్టు కనపడ్డది. మాలక్ష్మమ్మ "ఛీ! ఛీ!" అంది. అది వినిపించుకోలేదు. మూలఉన్న బుట్టను పంజాతో గీర సాగింది. కాస్సేపటికి అది అమాంతం దేనిమీదనోపడి దాన్ని నోట కరచుకొని బయటకు వెళ్ళిపోయింది. కిష్టుడి కళ్ళకేదో మైకం కమ్మినట్టయి, పిల్లినోట ఉన్న ఎలిక వాడికి కనిపించలేదు.

కిష్టుడికి అన్నం సహించలేదు. తల్లి మొట్టికాయలతో వాడిచేత అన్నం తినిపించింది.

ఆ రోజు నుంచీ వాడికి పిల్లులమీద జాలిపోయింది.

* * *

కామయ్య గారి ఇంట్లో ఒకకుక్క ఉండేది. దాని కెప్పుడన్నా వాళ్ళు అన్నం పెట్టేవాళ్లు. కిష్టుడికి ఈ కుక్క అంటే ప్రాణం. "కస్తూరీ" అని పిలిస్తే అది తోకాడించుకుంటూ వాడిదగ్గరకి వచ్చేది. దాన్ని ముట్టుకుంటే ఒకప్పుడు చూసినంత మాత్రం చేతనే, కిష్టుడి హృదయంలో ఏదో బిగబట్టి నట్టయేది. దాన్ని గట్టిగా గుండెకు అదముకుని ఎప్పటికీ వదలకుండా ఉండాలనిపించేది. కుక్కల్ని మనుషులు ముద్దుపెట్టుకోరని కిష్టుడికి తెలుసు కాబట్టి సరిపోయింది. కాని లేకపోతే, వాడు దాన్ని, ఎవరూ చూడకుండా ముద్దులు కూడా పెట్టుకునేవాడేమో.

కస్తూరికి కిష్టుడు తనచేతి మీదుగా ఎన్నడూ ఏమి పెట్టలేదు. కాని అది ముఖ్యం కాదు. దానిమీద వాడికి చాలా జాలి. పాపం, దానికి కడుపులో నొప్పి వస్తే ఎవరితోనూ చెప్పలేదు కద! ఆకలయితే అన్నం పెట్టమని అడగటానికి దానికి అమ్మ లేదు కద! ఇటువంటి ఆలోచనలు రాగానే కిష్టుడికి పొర్లి ఏడుపు వచ్చేది.

ఒకసారి కస్తూరి నాలుగు పిల్లల్ని పెట్టింది. కిష్టుడు ఒకరోజల్లా మనస్సు చిక్కబట్టుకొని చివరకు వాళ్ళమ్మ నడిగాడు. "అమ్మా కామయ్యగారు కస్తూరి పిల్లల్ని అందరికీ ఇచ్చేస్తున్నారు. మనం కూడా ఒకటి తెచ్చుకుందామా?" అని.

"ఇంకా నయం! మీ నాన్నవింటే తాట వొలిచేస్తారు" అన్నది మాలక్ష్మమ్మ. కిష్టుడిక ఆ విషయం ఎత్తలేదు.

ఒకనాడు కిష్టుడు బడినుంచి ఇంటికి వచ్చాడు. బయట నుంచున్నాడు. కస్తూరి కనిపించలేదు. ఆ రోజే వాడు సాహసించి కస్తూరికోసం ఒక పప్పుండ తెచ్చాడు. ఆ రోజు ప్రొద్దున వాడు బళ్ళోకి వెళ్ళేటప్పుడు వాడొక పప్పుండ కొను క్కొని, కొంచెం కొరికాడు. ఇంతలో కస్తూరి జ్ఞాపకం వచ్చి కొరికిన పప్పుండ జేబులో దాచి ఇంటికి వచ్చాడు. అందుకోసం నిలబడటం జరిగింది.

చాలాసేపు చూసి విసుగెత్తి కిష్టుడు కామయ్యగారింట్లోకి వెళ్ళాడు. వరం డాలో కస్తూరి కన్నపిల్ల ఒకటి కుంయి కుంయి మంటున్నది. కామయ్యగారు ప్రమిదలో పాలుపోసి దానిచేత తాగించటానికి ప్రయత్నిస్తున్నాడు.

"కామయ్య బాబుగారూ! కస్తూరి ఏది?" అన్నాడు కిష్టుడు, పరాయి వాళ్ళతో మాట్లాడటం అలవాటు లేని జంకుతో.

"పట్టుకెళ్ళారుగా యములవాళ్ళు!" అన్నాడాయన. కిష్టుడి కర్థంకాలేదు.

"దేనికి?" అన్నాడు కిష్టుడు.

"ఇంకా దేనికి? చంపటానికి .... ఈపిల్ల ఇంకేం బతికి చస్తుంది. పాలు పోస్తే తాగిన పిల్లలన్నిటినీ ఇచ్చేశాను. ఈ వెధవకు పాలు త్రాగటం చేతకావటం లేదు. ఆ మునిసిపాలిటీవాళ్ళు దీని తల్లిని కాస్తా పొట్టనపెట్టుకున్నారు" అన్నాడు కామయ్య.

"కస్తూరి చచ్చిపోయిందా?"

"చంపితే చావదూ?"

"ఎవరు చంపారు?"

"మునిసిపాలిటీవాళ్ళు."

"ఏం చేసేదీ?"

"ఏం చెయ్యకపోయినా చంపుతారు. లేకపోతే కుక్కలు పెచ్చురేగి బతక నిస్తాయా? అందుకని చంపేస్తారు."

"మంచి కుక్కల్ని కూడా చంపేస్తారా?"

"కుక్కలకి మంచేమిటి? చెడేమిటి?"

* * * *

కిష్టుడికి ఏమయిందో తెలీదు. ఆ రోజునుంచీ వాడు మారాడు. ఏది కనిపిస్తే దాన్నల్లా చంపేస్తాడు. గోడమీది పిల్లుల్ని, మిడతల్ని, నేలమీది చీమల్ని, చెట్లమీద తొండల్ని, నీళ్ళదగ్గిర కప్పల్ని బతకనివ్వడు. వాడు చూస్తుండగా వాళ్ళమ్మ తేళ్ళను పట్టుకుంటే చంపేస్తాడు. నల్లుల్ని వేటాడతాడు.

ఇది చూసి వాళ్ళమ్మ విస్తుపోతుంటే, వాడిప్పుడు వాళ్ళమ్మ మాట, తండ్రి మాట కూడా లక్ష్యం చేయడు. ఒకసారి వాళ్ళ నాన్న కొట్టవచ్చేప్పటికి వాడు

చేతిలో వున్న పలక తండ్రి మొహాన కొట్టాడు. ఆయన మొహం అంతమేర కోసుకు పోయింది.

ఈ మార్పు వచ్చిన తరువాత కూడా కొంతకాలం వాడు కస్తూరిని తలుచు కుని చాటుగా ఏడిచేవాడు. కాని ఇప్పుడు వాడికి కస్తూరి జ్ఞాపకంరాదు. వస్తే విచారం కూడా లేదు. వాడి అంతరాత్మకు కావలసింది అదే గామాలు!

ముద్రణ : ఆంధ్రజ్యోతి, (మాసపత్రిక) డిసెంబరు 1949

# పోయిన సామ్మ

"అబ్బాయ్? ఓ రబ్బాయ్! నాయనా ఓర్నాయనా!.... ఇంతలో ఎక్కడికి పోయినాడే."

"కాకపోయినా ఒళ్ళు బరువు కాదుటే? పనీ పాటా లేదుకదా! మూడేళ్ళ కుంకను కనిపెట్టుకుని వుండలేకపోతే— నా పోలికే వచ్చివున్నట్టయితే ఈ పాటికి ఆరుగురు బిడ్డల తల్లివి కావలసినదానివి! — నీవంటివాళ్ళు సంసారాలు ఏమి ఈదుతారే తల్లీ!"

"అబ్బ : ఒక్కడు చాలేద్దూ, అమ్మా! వేగలేకుండా ఉన్నానూ!.... ఆ బావి దగ్గిరికే పరిగెత్తాడో— ఏం కర్మమో! రామ రామా! ఒక్కనిముషం కాలు నిలువదు కదా! ఎక్కడి మైరావణ సంతతో!—"

"చేసుకున్నవారికి.... పో, వెళ్ళి చూడు! నీకింత ఒళ్ళు బరువయిందేమే? నిన్ను ఏ అత్తగారూ, మొగుడూ చెడగొడుతున్నారులేవే!...."

"అడగనక్కరలేదు!" అంటూ సోమమ్మ లేచి సావిడిలోకి వచ్చేటప్పటికల్లా కింద పెదిమ పయి వరుస పళ్ళతో బిగపట్టి రెండు చేతులూ మండిగం మీద ఆనించి ఉపాయంగా గడపదాటుతున్న కృష్ణుడు ప్రత్యక్షమయినాడు.

పిల్లవాడు కనిపించిన సంతోషం రెండు క్షణాలుకూడా వుండలేదు. పిల్లవాడి మొహంలో ఏదో వెల్తి సోమమ్మకు తోచింది. ఏమిటా అది అనే ఆలోచన పోయింది. ఈ ఆలోచన కూడా ఎంతోసేపుండలేదు.

ఇంట్లో పొయ్యిమీద ఎసరు ఎక్కించబోతున్న తల్లి ఉలిక్కిపడి చేతుల్లోనించి గిన్నె జారి పడవేసేటంత పెడబొబ్బ పెట్టింది సోమమ్మ— "ఓరి వెధవా గొలుసేదిరా?"

పిల్లవాడి మెళ్ళో వున్న పులిగోరూ, గొలుసూ మంత్రించినట్టు మాయమయినవి.

"ఏం గొలుసే" అంటూ తల్లికూడా సావిట్లోకి వచ్చింది.

"పులి గోరే! గొలుసే" అంది సోమమ్మ తెల్లమొహం వేసి.

"తలంటి పోసి గొలుసు పెట్టావుటే?"

"అయ్యో— పెట్టానే"

"ఏంలా.. నానా? గొలుసేదిరా?"

అమ్మమ్మ చంకకెక్కి కృష్ణుడు "అమ్మ—మ్మ—మ్మ......." అని ప్రారంభించాడు.

"సీల వూడి గొలుసెక్కడయినా జారిపడ్డదేమోనే" అంటూ సోమమ్మ దొడ్డి చుట్టూ తిరిగి వచ్చింది. ఎక్కడా గొలుసు జాడాలేదు. పచ్చగా కనపడ్డదల్లా గడ్డిపరక గానే పరిణమించింది.

"అయ్యయ్యో! పాపిష్టి సొమ్మే!" అంది సోమమ్మ నిలువునా కంపిస్తూ. ఆ పాపిష్టి సొమ్ముకోసం ఆమె పడుతున్న తహతహ చూస్తే ఎంత మందమతి కయినా ఆశ్చర్యం వేస్తుంది.

"వాకిట్లోకి వెళ్ళాడేమో" అంది తల్లి. అనీ అనడంతోటే సోమమ్మ వాకిట్లోకి పరిగెత్తింది. కూతుర్ని అనుసరించింది తల్లి.

వీధిలో "వాళ్ళ" రాముడు ఆడుకుంటున్నాడు.

"ఏంరా. రాముడూ, మాపిల్లవాడు వాకిట్లోకి వచ్చాడా?" అంది సోమమ్మ.

"ఆ వచ్చాడండి" అన్నాడు కళ్ళు పెద్దవి చేసి. వాడి వాలకం చేస్తే ఈ రహస్యం ఎవరు ముందడుగుతారా చెప్పేద్దామనుకున్నట్టుంది.

ఈ కాస్త ముక్కా చెప్పేసి పెద్ద బరువు తన మీద నించి తీసేసుకున్న వాడల్లే రాముడు రెండు పెదిమలూ లోపలికీ నాలిక బయటికి పోనిచ్చి బొంగరానికి జాగ్రత్తగా తాడు చుట్టడం మొదలుపెట్టాడు.

"ఎంత సేపయిందిరా—రాముడూ?"

నాలిక లోపలికి పోయింది. పెదిమలు పయికివచ్చినయి; కనుబొమలు పయికి పోయినయి, "ఏమిటండీ?" అన్నాడు.

"మా కిష్టుడు బయటికి వచ్చి ఎంత సేపయినది?"

"ఇప్పుడేనండీ! ఎనిమిది గంటలప్పుడు" మళ్ళా కనుబొమ్మలు యథా స్థానానికి వచ్చేసినయి. కళ్ళ సయిజు కూడా తగ్గిపోయింది. పెదిమలు లోపలికి వెళ్ళినయి, నాలిక బయటికి వచ్చేసింది. బొంగరం విసరివేయడానికి తయారవు తున్నాడు.

అప్పుడు దాదాపు పదకొండు గంటలు కావడంవల్ల రాముడు చెప్పిందంతా సోమమ్మకుగానీ తల్లికిగానీ ఎందుకూ పనికిరాలేదు. తల్లీ కూతురూ మొహా మొహాలు చూసుకున్నారు.

ఇంతకూ మనకు ప్రాప్తం లేదు! నీకు బుద్ధిలేదులేవే! ఇదేం మీవూరా! ఎక్కడ పారవేసిన వస్తువక్కడ వుండడానికి? బస్తీలో పిల్లలక్కు నగలూ నాణ్యాలూ పెట్ట డానికి వుందా? ఇంకా పిల్లవాణ్ని నిలువునా ప్రాణం తియ్యలేదు. బిడ్డయినా దక్కా డని సంతోషించక ఏడుస్తా వెందుకు? పద!"

సోమమ్మకు దుఃఖం ఆగలేదు.

"అది పెట్టడం మరిచిపోనన్నా పోలేదే! నా చేతులు కాలిపోనూ! పాపిష్టి సొమ్మే! అయ్యో అయ్యో! తరు నవరసుల సొమ్ము ఎవరి నోట పెట్టానే—"

ఇంతలో తల్లికొక ఆలోచన తట్టింది.

"ఇదుగో—చూడమ్మాయ్ ! వాడున్నాడే— వాళ్ళ రాముడు—వుత్త పోకిరీ వెధవ! వెనక యిట్లాగే వాళ్ళ నాన్న జేబులోనుంచి అయిదు రూపాయల కాయితం కూడా యెత్తుకుపోయినాడే! నేను వెంకాయమ్మను మెల్లిగా అడిగి చూస్తానుండు.... వూరుకో అమ్మా-వూరుకో! పిచ్చిదానా ఏడిస్తే వస్తుందిటే?"

"ఇప్పుడడగవే అమ్మా: యిప్పుడు అడగవే!" అంటూ రాగం తీసింది కూతురు.

"ఊః" అని ఒక్క ముక్కు ముక్కి తల్లిలేచి "నాకు మడి బట్టన్నా ఆరలేదు" అంది.

"అయ్యో! అయిదు నవర్సుల బంగారముకన్నా ఎక్కువటే!" అంది కూతురు.

అంతా విని వెంకాయమ్మ అంతెత్తు ఎగిరిపడ్డది.

"చాల్లేవమ్మా నేర్చుకుపోయినావు. ఓడు ఓడంటే కంచం అంతా ఓడు అన్నారుట. అజ్ఞానపు కుంక తెలియక జేబులోంచి తీస్తే అప్పుడే వాళ్ళ నాన్న మెక్కలు విరగతన్నాడు. ఆరునెలలయింది. మళ్ళీ వాడు కానీ తాకి ఎరగడు. ఓహో—బాగావుందే- ఇటువంటి—చాడీలు మాత్రం తీసుకురాబోకమ్మా! ఏది పోయినా యిక మావాడిమీదే పెడతారు....చాలా బాగుంది?" అని ఆవిడ యింటి పెంకు లెగరగొట్టేటప్పటికి సోమమ్మ తల్లి దడుచుకుని ఇంట్లో వచ్చి పడ్డది.

ఇంతలోనే సోమమ్మ తండ్రి వచ్చాడు. పెళ్ళామూ కూతురూ ఒక్కసారే మాట్లాడడంలో ఆయన కెంతసేపటికి అర్థం కాలేదు. తీరా అర్థమయిన తర్వాత నయినా ఆయన ఆడవాళ్ళకు ధైర్యం కలిగేటట్టు ప్రవర్తించలేదు. పెదిమ్మలు బిగపట్టి "ఊఁహూఁ" అన్నాడు. ఇనప పెట్టికేసి తీక్షణంగా చూశాడు. "హూఁ" అన్నాడు. పెళ్ళానికేసి తీవిగా "ఎవరు నీవు" అన్నట్టుచూసి "ఊఁ—హూ" అన్నాడు; క్రమంగా అంతా బోధపడిపోతున్నట్టు, అకస్మాత్తుగా లేచి బయటకు వెళ్ళాడు.

ఈ చర్య ఆడవాళ్ళ కర్థంకాలేదు. వాళ్ళు ఎక్కువ impress కూడా కాలేదు. అందుకు నిదర్శనంగా సోమమ్మ తల్లి వంటింట్లో నుంచి "మళ్ళీ ఎక్కడికో వెళ్ళారు. ఎంతసేపుకు కనిపెట్టుకు కూచోవాలో!" అంది.

ఒక అరగంటలో సోమమ్మ తండ్రి ఒక పోలీసును తీసుకొచ్చాడు.

"ఏమమ్మా! పోయిన వస్తువెవరిది?" అన్నాడు పోలీసు వచ్చి రావడము తోనే.

"నాది" అంది సోమమ్మ ఆదుర్దాగా. "ఆఁ.... నీ మొహం!... దానిది కాదు దాని పిల్లవాడిది...." అన్నాడు సోమమ్మ తండ్రి.

"అబద్ధాలు చెపితే మేము సొమ్ము పట్టివ్వలేము....పోయిన నగను కొంచెం వర్ణించండి."

"గొలుసు— నాయనా— పులిగోరూ"

"ఎటువంటి గొలుసు?"

"మామూలు గొలుసే—పులిగోరూ—మామూలు పులిగోరే!"

"అట్లా చెబితే చాలదు. గొలుసెంత తూకం వుంటుంది?"

"ఎనిమిది సవర్లు"

"ఇదుగో అమ్మగారూ— మీకీ సంగతులు తెలియవు మాతో అబద్ధాలు చెబితే మీ సొమ్ము మీకు దక్కదు. ఎంత తూకం వుంటుంది?"

"అయితే ఎనిమిది సవర్లని చేయించారు కామన్లు. అరిగిపోయి నాలుగన్నా ఉంటుంది."

"ఎక్కువుంటుందా?"

"వుండవచ్చు....ఉండదు."

"మూడు సవర్ల ఎత్తు.... సరే పులిగోరెంత పొడుగుంటుంది?"

"రెండంగుళాలు."

"ముప్పాతిక అంగుళం.... సరే. ఎప్పుడు పోయింది?"

పోలీసు స్టేటుమెంటు తీసుకొని "ఏమండో పంతులుగారూ— సొమ్ము దొరికితే ఏదయినా యీనాం...." అని హెచ్చరించి వెళ్ళిపోతూ ఆయన్ను బయటికి పిలిచి రహస్యముగా "మీ కెవరిమీదనయినా అనుమానం వుందా?" అన్నాడు.

"అడిగావు కాబట్టి చెబుతున్నాను. ఎనిమిదో వార్డు ఎలక్షన్‌లో నేను లంచాలిచ్చి నెగ్గానని కోర్టులో పిటీషన్ పెట్టి ఓడిపోయిన నాటినుంచి ఆ చలపతిరావు నామీద కారాలు మిరియాలు నూరుతున్నాడు....ఏమిటి వ్రాసుకొంటున్నావు?"

"ఏమీ లేదులెండి" అంటూ పోలీసు వెళ్ళిపోయినాడు.

ఆ రోజు సాయంకాలమే దేవుడల్లే వచ్చింది ఒక సోదమ్మి. దాన్ని పిలిచారు. సోమమ్మ పుల్ల పడితే సోది సరిగా రాదని పూర్వానుభవం. అందుచేత తల్లే కూచుంది.

మొదట వెంకటేశ్వరస్వామి వచ్చాడు. ముడుపులూ అవీ చెల్లించుకోడమయిపోయింది. పో. పొమ్మన్నది సోమమ్మ తల్లి. అప్పుడు వెంకటేశ్వరస్వామి పోయి యెప్పుడో ఆరునెల్లు పెరిగిపోయిన సోమమ్మ అప్ప వచ్చింది. సోమమ్మ తల్లి కంగారు పడకుండా "నాకు నువ్వక్కరలేదు." అని చెప్పేసింది. అప్పుడసలు సంగతి వచ్చింది.

"సొమ్మొక చోట; అనుమాన మొకచోటే తల్లీ?" అంది సోదమ్మి.

"ఆc అదుగదీ" అంది సోమమ్మ తల్లి.

"నీ సొమ్మిటా!— ఇటా—ఇటా అనడుగుతుందవూ! ఇటంటే బొడ్డిటంటే గడ్డమే

చూయమ్మా" అని పాడుతూ సోదమ్మి బొట్టు పుల్లతో చూపించింది. అసలది గడ్డం చూపించబోతుంటే సోమమ్మ తల్లి బొట్టువేపు చెయ్యి పోనిచ్చింది.

ముసిముసి నవ్వులు నవ్వుతూ కూతురివైపు చూసింది. "వాళ్ళ రాముడే తీసివేసి తల్లికిచ్చాడు. సందేహం లేదు."

ఈ ముక్క సోదిలో వచ్చిన సంగతి పొద్దుగూకే లోపల వూరంతా తెలిసి పోయింది. ఆ రాత్రి పన్నెండు కొట్టేవరకున్నూ పక్కింటి పెంకు లెగిరిపడుతూ ఉన్నాయి. సోమమ్మ—తల్లీ వెంకాయమ్మను లెక్కచెయ్యలేదు. వాళ్ళకేమిటో సొమ్ము దొరికినట్టే వుంది. "పుచ్చకాయల దొంగా అంటే భుజాలు తడువుకున్నా డుట! ఏమీ ఎరుగని మనిషి తనకెందుకు?"

మర్నాడు పొద్దున్న సోమమ్మ తండ్రి వీధి అరుగుమీద కూచుని మొహం కడుక్కుంటూ వుండగా ఒక బుడబుక్కలవాడు వచ్చాడు.

"పెశ్న చెబుతను— దొరా పెశ్న చెబుతను కోరిక ఫలిస్తది"

"ఏం ప్రశ్న చెబుతావు?"

"నీ అనుమాన మెక్కడ వుండదో అదే నిజమయితది దొరా?"

"నా అనుమాన మెక్కడ?"

బుడబుక్కలవాడు సరిగా ఈశాన్యమూలగా చూపించాడు. భేష్! అటే ఉంది చలపతిరావుగారి ఇల్లు. వాడికొక పాత వస్త్రమిచ్చి- "ఇకలేదు పొమ్మ"ని నచ్చచెప్పి పంపాడు సోమమ్మ తండ్రి.

పోలీసు చెప్పివుండడు గదా—ఎట్లా తెలిసిందో ఊరంతా తెలిసింది. ఫలా నాయన ఫలాని చలపతిరావు తన ఇంటో సొమ్ము ఎత్తుకుపోయినాడని పోలీసులకు రిపోర్టు చేశాడుటా అని!

రోజులు గడిచినయి. సొమ్ము సంగతేమీ తేలలేదు. పయిగా సోమమ్మ తల్లిని గురించి ఆడవాళ్ళూ సోమమ్మ తండ్రిని గురించి మొగవాళ్ళూ రకరకాలుగా చెప్పు కొని నవ్వుకుంటున్నారని కూడా స్పష్టమయింది.

ఈ పాప కర్మ ఫలం యిట్లా వుండగా ఇంటో చిన్న వస్తువులు రోజురోజు కొకటీ రెండూ చొప్పున మాయం కావడం మొదలు పెట్టినయి. ఎంత జాగ్రత్తపడ్డా ఏమీ ఫలం లేకపోయింది. అప్పుడే వచ్చిపడుతున్న వేసంకాలము కూడా లెక్కచేయ కుండా అంతా ఇంట్లోనే పడుకుంటూ వచ్చారు- దొంగల భయము నించి.

కాని అంత జాగ్రత్త అనవసరం. ఎందుకంటే యీ దొంగతనాలు ఎవరు చేస్తున్నారో కాని కేవలమూ ఏడిపించడానికే చేస్తున్నారుకాని ధనాశకొద్దీ కాదు. పోయిన వస్తువులన్నీ చూశారో లేదో చాలా స్వల్ప ధరవే! చిన్న చిన్న గ్లాసులంటే, ఉద్ధరణలంటే— అన్నీ ఇటువంటివే! ఎవరో పగ కొద్దీ చేస్తున్నారుకాని మరొకటి కాదు.

ఇంతలో ఒకరోజున పూడిక తీస్తామంటూ బావుల్లో పూడిక చేసేవాళ్ళొద్దకు వచ్చారు. "బావిలో చాలా పూడిక వుంది; కింద పేడు కూడా తీయించలేదు. తీయించండి" అంది తల్లి మొగుడితో.

ఆ సందర్భంలో పోయిన సామానంతా—పులిగోరు—గొలుసుతో సహా దొరకటం తటస్థించింది.

*　　　*　　　*　　　*

మూడోయేట అందరి కళ్ళల్లోనూ దుమ్ముకొట్టిన కృష్ణుడు పెద్దయిన తర్వాత మాంచి గజదొంగగా తయారయినా ఆశ్చర్యంలేదు.

ముద్రణ : వినోదిని, జూలై 1935.

# ఎందుకూ కొరగాడు!

"చికు– చిక్కూ – చిక్ – కూ! ఆ –చికు – చిక్కూ – చిక్ – కూ!"

పెద్దపులి ఆట జోరుగా సాగిపోతున్నది. నలుగురు బడితెలంటి కుర్రాళ్ళు మొలతాళ్ళకు కాగితపు తోకలు తగిలించుకుని, రంగుకాగితపు కళ్ళజోళ్ళు పెట్టుకుని ఉత్సాహంతో అడుగువేస్తున్నారు.

ఆరేళ్ళ బక్కపలచని పిల్లవాడు ఎడంగా నుంచుని, కనుబొమలు ముడేసి ఆట చూస్తున్నాడు. ఆతని ఆత్మో, అంతరాత్మో, మనకు తెలీని ఇంకేదో వాళ్ళకు వంత పలుకుతున్నది.

"చికు – చిక్కూ – చిక్ – కూ ! ఆ – చికు – చికూ – చిక్– కూ !"

వాళ్ళ మాదిరిగా ఆడటం తనకెందుకు చేతకాదూ! తనలో లేని శక్తి వాళ్ళలో ఏముందీ? కాగితపు తోక పెట్టుకోటానికి తన కెందుకూ బిడియం?

వాళ్ళమ్మ రోజుకు పదిసార్లయినా అంటుంది—'వీడెందుకూ కొరగాడు!'

'అదేనేమో కారణం!'

"ఏంరా? నాన్నా, ఈ మూటేమిటి? కందిపప్పా? ఇది పెసలా? ఇవి మిరప కాయలా? మెంతులేవిరా?"

"వాటి పేరు మర్చిపోయినానమ్మా! పోయి తీసుకురానా?"

"ఛా! పిచ్చికుంకా. చెప్పిన వాటిల్లో సహం మర్చిపోతావేరా? ఎప్పుడూ బుద్ధి ఎక్కడో ఉంటుందీ! మీ నాన్న అన్నట్టు—"

"ఏమిటే అదీ?"

"ఏం లేదు లెండి! మెంతులు మరిచిపోయినాడు.... అయ్యోయ్యో! ఇదే మిట్టా!"

"ఏమిటే అదీ?"

"వీడితో ఎట్టా చావనండీ! పచ్చపెసలు తెచ్చాడు. అర్ధరూపాయి పచ్చ పెసలు నా బొందలో ఎక్కడ బోర్లించుకునేది? సున్నిపిండి విసిరి వారం కాలేదింకా! ఆరునెల్లదాకా ఉంది!....పో! ఇవి ఆ కోమటి మొహానపోసి మంచివి తీసుకురా!"

"ఆ వెధవ ఎందుకూ కొరగాడు ! కోమటి ఏమనుకుంటాడో!"

తన్ను ఎందుకూ కొరగాడంటే కష్టంగానే ఉంది. కాని వాళ్ళు అబద్ధ మాడుతారా?

గణపతి లోపల్నించి పొంగివస్తున్న దిగులును రెండు గుటకలుగా మింగేశాడు.

"ఏంరా నాన్నా"

"ఊఁ!"

"అప్పుడే పడుకున్నావట్రా?"

"నిద్దరొస్తున్నదే!"

గణపతికి నిద్దర రావటం లేదు. ఆరు బయట మంచంమీద వెల్లకిలా పడుకుని చూస్తున్న చంద్రుణ్ని విడిచి పోబుద్ధి పుట్టలేదు. చంద్రుడిలోనూ కిటికి చువ్వల్లోనూ వున్న చిత్రమేమిటంటే వాటి వంక ఒక రకంగాచూస్తే చేతికి అందే టంత దగ్గిరిగా వచ్చినట్టు కనబడి దృష్టిపక్కకు తిప్పితే తప్ప ఎడంగా పోవు. ఇప్పుడు చంద్రుడు చేతి కందేటంత దగ్గిరిగా వున్నాడు. ఎందుకూ పోనివ్వటం?

"ఛా! వెధవా! చదువూ లేదు సంధ్యా లేదు. నీకెట్లా చదువొస్తుందిరా? పిచ్చి కుంకా?"

ఒక నిట్టూర్పు విడిచి లేచాడు గణపతి. దూరానికి పోయిన చంద్రుడి వంక ఒకసారి చూసి లోపలికివెళ్ళి చాపవేసుకుని, కిరసనాయిలుబుడ్డి తెచ్చుకుని, తెలుగు వాచకం ముందు వేసుకొని పేజీలు తిప్పటం మొదలు పెట్టాడు.

"జడివాన కురియ బోవుచున్నది సుమీ!-"

గణపతి అక్షరాలు చూడటం మానేసి బొమ్మలుచూడటం మొదలు పెట్టాడు. చూస్తుండగానే ఆ బొమ్మ పెద్దదయింది. మనిషి బొమ్మలు మనుషులంతయినై. వాన కురుస్తున్నది. వానలో తడుస్తున్నవాడల్లే గణపతి కొద్దిగా వణికాడు. తాటాకుల గొడుగు వేసుకొని తన వంక చూస్తున్న వాణ్ని చూస్తే గణపతికి కొద్దిగా నవ్వొచ్చింది. గూడలు వేసుకొని పోతున్న వాళ్ళను చూస్తే ఎందుకో కొద్దిగా జాలేసింది. తడి రోడ్డుమీద పాపలు!....అటు యిటూ చాలాదూరందాకా ఇళ్ళులేవు. ఇటుపోతే ఫ్యాక్టరీలు వస్తయి!.... అటుపోతే?....

"చూడండి:- ఈ వెధవ! నిద్దరపోయినాడు. ఒక్క కాగితం తిప్పాడేమో? వీడికేం చదువొస్తుందీ?"

"వాడా వాడెందుకూ కొరగాడు!

గణపతి చప్పుడు చెయ్యకుండా తల్లి మంచం దగ్గిరికివచ్చి నిశ్చలంగా ఆమె జీర్ణ శరీరం వంక చూస్తూ నుంచున్నాడు.

"అమ్మ బతకదు! అమ్మ చచ్చిపోయింది! బతకదు!" ఆవిడ కళ్ళు తెరిచి చూచింది.

"ఏం రా, నాన్నా?"

గణపతి జవాబు చెప్పలేదు.

"పిచ్చి నాన్నా! నే పోతే నీకు దిక్కెవ్వర్రా?"

గణపతి మంచం పక్కన మోకరించి మొహం ఆవిడ పక్కమీద పెట్టి కుళ్ళి కుళ్ళి యాడవటం మొదలు–పెట్టాడు.

తల్లి కొడుకు తల తన చేతి బొమికలతో తడుపుతూ "నా పిచ్చి తండ్రీ! యాడవకు!" అంది.

* * * *

అప్ప పోయిందన్న ఏడుపు, తనకు సవితితల్లి వస్తుందన్న ఏడుపుగా మార్చింది తన పినతల్లి. అతని కాశ్చర్యం వేసింది.

ఏం. సవితి తల్లి వస్తే? తన తల్లిని రెండో సంబంధం చేస్తే, ఆవిడ అప్పుడిం కోరికి సవితితల్లి అయి ఉండేది కాదూ?

తెలీని మనిషిని గురించి ఎందుకిట్లా అనటం?

* * * *

కారణం లేకుండా ఒక మనిషిని చూస్తే ఇంకో మనిషికింత కోపం ఉంటుందా? ఎందుకు తన సవతితల్లి తన్ను చూస్తేనే మొహం మటమట లాడించు తుందీ? తన గొంతు వినపడితేనే ఆవిడకు కోపమా? లేక తన భ్రమా?

"పిన్నీ!" అని పిలిస్తే "అమ్మా!" అని పిలవమంది; "అమ్మా!" అని పిలిస్తే "అంత అయిష్టంగా పిలవకపోతే మానరాదా" అంది! ఏం చెయ్యాలి?

యధాలాపంగా "ఏదో ఒకటి వెయ్యిలే" అంటే సరి. తనకు సయించని చింత కాయ తొక్కు తెచ్చి వేస్తుంది అన్నంలో!

ఈవిడ ఇట్లా చెయ్యబోతుందని వాళ్ళకెట్లా తెలుసో!

వాళ్ళన్నట్టే చెయ్యాలా ఈవిడ? వాళ్ళమాట అబద్ధం చెయ్యటానికైనా ఇంకో రకంగా వుండరాదూ?

తన తండ్రి తన్ను చూస్తే కారాలు మిరియాలు నూరతాడు. ఆవిడ తన మీద చాడీలు చెప్పదు కద!— వాళ్ళంతా అన్నట్టు!

ఏ మనిషి మాత్రం అంత అసహ్యకరమైన పని ఏం చెయ్యాలిసొస్తుంది?

"ఎందుకూ కొరగాని వెధవ్వా! నాకెదురుగా ఎందుకురా! పో లేచిపో! మీ పింతల్లి పోషిస్తుందేమో!" అన్నాడు తండ్రి.

ఒక చెంప నెత్తురు బంక ఫిరోచనాలు వెళ్ళుతూ బజారుకు నడిఎండలో వెళ్ళలేనన్నందుకా? మొత్తానికి తన పింతల్లి విచిత్రమైన వ్యక్తే!

తన తల్లికోసం ఆవిడ ఏడుస్తుంటే తనకు జాలికి బదులు – సానుభూతికి బదులు– చిరాకు వేస్తుందెందుకూ ?

తను ఏడుస్తున్న వాడేగా! అర్ధరాత్రి తల్లి జ్ఞాపకం వచ్చినప్పుడు–మొహం దిండులో దూర్చి – నిశ్శబ్దంగా!

ఈవిడకి తనంటే ఎంత ప్రాణం. నెత్తురు స్పర్శా? కాకపోతే ఆవిడ తన్నేం బాగా ఎరుగునూ? — గుణగణాదులు తెలియటానికి?

ఆన పింతల్లి ఆవిడకు తనమీద వున్న ఆపేక్ష ఇంతకన్నా కాస్త రహస్యంగా ఉంచితే బాగుండదూ? ఎందుకంటే ఆవిడ గొంతులో మాటల్లో ఉన్నంత ఉద్రేకం లేనట్టు అనుమానం తట్టుతున్నది!....పాపం!

ఏమిటి ఈవిడదంతా నటనకాదు కదా! అనుమానించటం మనసు కెంత నెప్పి కలిగిస్తుందీ!

"మా నాయన! మా నాయన! ఒక్కరవ్వ విస్తరెత్తుకుంటావా? మడితో కందులు వేయించాలి."

"అట్లాగేలే పిన్నీ!"

"అదుగో, మెతుకు! అదుగదుగో — ఉండుండు. ఆదేమిటీ? ఎప్పుడన్న చాతవునా! పెట్టునా పాపం.....

* * * *

"మా నాయన! మా నాయన! విస్తర ఎత్తి పారెయ్యకపోతే మానెగాని. చీమ లీడ్చుకుపోతై, కాస్త మెతుకులెత్తి, విస్తరి మడిచి, అక్కడే ఉంచిపో!"

గణపతి విస్తరి తీసుకుపోతూ ఆవిడ వంక చూసి నవ్వాడు. ఆ నవ్వులోని నిరసన ఆవిడ కర్థం కాలేదు.

అతనికి కష్టం ఆవిడ తన్ను ఇట్లా చూస్తున్నందుకు కాదు - అప్పుడట్లా చూసినందుకు!

ఎవరిని వంచించాలని?

ఆత్మ వంచనా?

ఏం మనుషులు!

ఒక గుడి మండపంమీద ఎక్కి కూర్చుని ఉన్నాడు గణపతి, కాళ్ళు ఊగిస్తూ కడుపులో ఒక చెంప దహించుకు పోతున్నది. అన్నంవేళ అయి రెండు గంట లయింది. కాని అతనికది పట్టలేదు.

అకస్మాత్తుగా అంధుడికి కళ్ళువస్తే అప్పుడేనా భోజనం సంగతి విచారించ వలసింది!

అతని మొహం నూతన వికాసంతో ప్రకాశిస్తున్నది. అతనో కొత్త విషయం కనిపెట్టాడు.

ఈ అందరూ పశువులు! పురుగులు ! అంతా! ఒక్కరుకూడా బీరు పోకుండా!

ఇంత కాలమూ పెద్దవాళ్ళంతా ఏదో తెలిసినట్టు నటించారు. కాని ఎవరికీ ఏమీ తెలీదు.

వీళ్ళ తెలీటం తెలుసుకోవాలని లేకపోవటం! బహుశ ఇందుకు సందేహమేమీ ఉండదు.

"జయ్! మహాత్మాగాంధీకీ—"

"కయ్" చెవులు బద్దలయ్యే ధ్వని.

ఎందుకట్లా అరుస్తారు. ఉత్సాహం కోసమా? ఎందుకట్లా ఉద్రేకం తెచ్చి పెట్టుకోటం? ఉద్రేకంతో ఏం పని చెయ్యగలరు?

"జయ్!" "జయ్!" "జయ్!"

మిన్ను విరిగి పడ్డట్టే!

ఇదేమిటి, అల్లరి కాకపోతే?

గణపతి పద్దంత వరకు కనిబొమలు ముడివేశాడు. అతనికి కోపం వచ్చింది. మండపం మీది నుంచి ఒక్క దూకు దూకి పరిగెత్తటం మొదలు పెట్టాడు.

"జయ్"లు వినబడుతున్న వేపు.

అనేకమంది జనం ఎదురుగా వస్తున్నారు రణగొణ ధ్వని చేసుకుంటూ!

ఎందుకల్లా అరుస్తారు?

కాళ్ళు కొంచెము ఎడంగా పెట్టి, తల ఠీవిగా పైకెత్తి, రోడ్డుమీద అడ్డంగా నుంచున్నాడు....గజమున్నర ఎత్తుధీరుడు!

ఊరేగింపు అంత దూరంలోకి వచ్చింది.

గణపతి చెయ్యి పైకెత్తి—

"ఏయ్! ఎందుకట్లా అరుస్తారూ? మీరేం చేస్తున్నామనుకుంటున్నారూ? పొండి! మీ యిళ్ళకు పొండి!"

"ఎవడ్రా వాడూ?" అన్నాడు ముందు నడుస్తున్న వారిలో ఒకడు.

"ఏమిటంటాడూ?"

"వాడి మొహం. పక్కకు లాగేసి వెనకాలే రమ్మనండి!"

"గొర్రెలు! గొర్రెలమంద! పొండి! ఇంటికి పొండి!? ఎందుకట్లా అరుస్తారు."

"ఏ-మి-టీ?" అన్నాడొక నల్లగా పెం

(ఇంతవరకే లభ్యం)

ముద్రణ : యువ, నవంబరు—డిసెంబరు 1935.

# దత్తపుత్రుడు

అయిదేళ్ళ వాడప్పుడు ప్రసాదరావును తెచ్చి పెంచుకున్నది సుబ్బమ్మ గారు. వాడికి లక్ష్మీనారాయణశాస్త్రి అని తన భర్తగారి పేరే పెట్టించుకుని, ఆ పేరు పెట్టి పిలిచే యోగ్యత తనకులేదు గనుక 'ప్రసాదం' అని పిలిచేది.

తన దత్తత నిశ్చయమైన కొత్తలో ప్రసాదం (లేక శాస్త్రి) తనకేదో జరగబోతున్నదని మాత్రమే తెలుసుకోగలిగాడుగాని, అది ఏమిటో గ్రహించ లేక పోయినాడు. తనకు నిజంగా ఏదైనా విపత్తే జరగబోతుంటే ఎవరో ఒకరు తనకోసం ఆదుర్దాపడరా? ఏ విపత్తూ లేకపోతే, తన తల్లి మొహం ముడుచుకొని సహం కావటానికి కారణం ఏమిటి?....ఆ రాత్రి ఒక రాత్రివేళ ఆవిడ తన పక్కలో వచ్చి ఎందుకు పడుకున్నది ? తన మొహం ఎందుకు అన్నిసార్లు ముద్దు పెట్టు కొన్నది? ఆవిడ మొహం తన మొహానికి తడిగా ఎందుకు తగిలింది.

తన తల్లి చేసిన ఆ పనికి ఆ అర్భకుడికి ఆనందం కలిగే అవకాశంకూడా ఎక్కడ? ఒక వేపునించి అర్థంకాని భయం అవతరించుకొచ్చిందేగాని!

ఆ తరువాత, వెంటనే కొద్ది రోజుల్లో దత్తత చేసేశారు. తనకు కొత్త తల్లి వచ్చింది. ఆవిడకు జుట్టులేదు. బొట్టులేదు. ఇకముందు ఆవిడ తనకు అమ్మ ! వెధవముండ అయిన అమ్మను ప్రసాదం ఊహించుకోలేకపోయినాడు. వాడి కది చెప్పరానంత అశుభంగా తోచింది.

దత్తత జరుగుతుంటే వాడు ఎవరికేసీ చూడలేకపోయినాడు. అవ మానమూ, రోషమూ, దుఃఖమూ, నిరాశా, ఇంకేమేమిటో వాడి చిన్నహృదయాన్ని మథించేస్తున్నై, వాడి కళ్ళు మంత్రాలు చదివే బ్రాహ్మణిగురించి ఆత్రంగా అనవ సరమైన వివరాలన్నీ గమనిస్తున్నై. ఆయన పెదిమలు ఎట్లా కదిలేది, ఆయన మెడమీది చర్మమూ పీకా ఎట్లాపైకి కిందికీ ఆడుతున్నదీ, మంత్రాలు చదవటంలో గుక్కతీసుకునేటప్పుడు ఆయన కనుబొమ్మలు ఏవిధంగా పైకెత్తేది గమనిస్తు న్నాడు. తన వెనక, సమీపంలోనే కూర్చున్న తన అమ్మ - ఆ వెధవముండ గుండు ముసుగుకాదు! - 'అమ్మ మొహం ఎట్లావున్నదీ, చూడకుండానే వాడికి కని పిస్తున్నది.

దత్తత అయిపోగానే 'అమ్మ' కంటనీరు పెట్టుకున్నది. తనకూ్కడా బావురు మని ఏడుపొచ్చింది. ప్రసాదం ఏడిచాడు.

"పిల్లవాణ్ని కాస్సేపు అట్లా దొడ్లోకి తీసుకుపోయి సముదాయించ

వమ్మా!" అని ఒకమగగొంతు – నలభై ఏళ్ళ నెరసినగడ్డం గొంతు — కేక పెట్టింది.

"నాన్నగారూ? ఏడవకు అట్లా ఏడుస్తారా ఎక్కడన్నా?" అన్నది అమ్మ.

"మరి నువ్వేడవలేదు టే?" అన్నాడు ప్రసాదం.

"మిగిలిన నలుగురు పిల్లలులేందీ. నువ్వు నన్ను 'ఏమే' అని పిలవటం కూడా ఎందుకు నేర్చుకున్నావురా నానా? నీ మాటలు జ్ఞాపకం వస్తే నేనేమయే దిరా?" అని ఆవిడ మళ్ళీ రోదనం మొదలుపెట్టింది. ప్రసాదానికి ఏడుపొచ్చింది.

ఇంతలో ముందుకు పోయినట్లుగా వచ్చింది ఆ ముసుగు గుండు వెధవ ముండ- "పిల్లవాడేస్తున్నాడటమ్మా? పాపం...."అంటూ.

దూరాన్నించి ఒకగర్జన వినబడింది—" వొసే, నుబ్బ .... మ్మా" గడ్డం నెరిసిన నలభై ఏళ్ళ గొంతు.

"ఓ ఓ ఓయ్!" అన్నది ముసుగు వెధవముండ గుండు.

"న్ వ్ ట్ రా?"— నెరసిన పీఘాది నలభై ఏళ్ళ రుద్రాక్షలు, బలవం తాన గుండు రుద్రాక్షమాల మాట ప్రకారం నడుచుకుంటూ వెళ్ళింది.

"అమ్మా, నాకు వాళ్ళ ఆస్తి ఒద్దే!" అన్నాడు ప్రసాదం ఏడుపు గొంతులో. తల్లి సమాధానంకోసం ఊపిరి బిగబట్టి చెవులు రిక్కించిన దేవతల కేమీ వినిపించలేదు.

* * * *

"అబ్బాయి, ప్రసాదం!.... ఇక్కడవుండే పలకవేంరా నాయనా?"

"ఎందుకేం?"

"అన్నం తినవుట్రా?"

"నా కాకల్లేదు పో!"

"నువు మా అమ్మ నేడిపించలేదేం? ఆవిడకన్న నువెక్కువేడుస్తున్నావా?"

"హయ్యో తంద్రీ! ఏడవదూ, పాపం ! కన్నకడుపు కాదూ? నిన్నెప్పుడు పెంపుడివ్వటానికి వొప్పుకుందో అప్పుడే ఆవిడ కడుపు కోసుకుంది."

"నువు పెంపుడడిగితే ఇచ్చింది. లేకపోతే ఇస్తుందా ఏమిటి?"

"అడిగితే మాత్రం ఇస్తారుట్రా నాయనా! ఇంకా ఇద్దరు కొడుకులూ, ఓ కూతురూ ఉన్నారు గనక ఇచ్చింది లేకపోతే ఇస్తుందా?"

"మరి నా కోసం ఏడవటం మానేసిందా?"

"మానకుండా వుంధా ఏమిటి? ఏడిచి ఏడిచి మానేసుంటుంది."

"మా అమ్మ నా కోసం రోజూ ఏడుస్తుంది."

"నేను మాత్రం మీ అమ్మను కాదుట్రా నాయనా!

"నువు మా అమ్మ వెందుకవుతావేమిటి? మాఅమ్మను నేను 'ఏమే' అనేవాణ్ని అందుకని నా కోసం ఏడుస్తుంది."

"నన్ను కూడా 'ఏమే' అనరా!"

"మా అమ్మ నా దగ్గర పడుకుని ముద్దు పెట్టుకునేది."

"మరీ, నే ముద్దు పెట్టుకోబోతే తోసేస్తా వెందుకురా నాయనా?

"నువ్వా! నీ దగ్గర వెధవముండ వాసన! నువ్వేమన్నా మా అమ్మవా ఏమిటి, నన్ను ముద్దు పెట్టుకోటానికి!"

"నేను మీ అమ్మల్లే ఏడవటంలా? చూడూ!"

"అన్నీ దొంగ ఏడుపులు!.... నాతో అవీ ఇవీ చెప్పుతూ కూర్చుని అన్నం పెట్టవేం?"

"ఇదిగో ఒక్క క్షణం!"

"నాకు పెరుగ్గావాలి, ఉందా?"

"అయ్యో! నీకు పెరుగు లేకుండా చేస్తానుట్రా?"

"నిన్ను 'అమ్మా' అని పిలవటానికి అంచమేం?"

"నీ కిష్టం లేకపోతే పిలువకమ్మా! 'అమ్మా' అని పిలువకపోయినా పెరుగే స్తాగా! నీకు కాకుండా నేనింకెవరికి పెట్టుకుంటాను చెప్పు"

"మా అమ్మను చూడాలి. మా అమ్మదగ్గిర పడుకోవాలి. మా అమ్మ నన్ను ముద్దు పెట్టుకోవాలి. నా కన్నం పెట్టాలి. మా అమ్మ నాకు నీళ్ళు పొయ్యాలి. మా అమ్మను రమ్మను, లేకపోతే నేను బడికిపోను. అన్నం తినను. నీళ్ళు పోసుకోను. ఏమీ చెయ్యను."

"మీ అమ్మ, పాపం, ఇక్కడికి వచ్చికూచోమంటే కూచోగలదా? నువ్వే వెళుదువుగాని."

"అన్నీ వొట్టిదే! నువు పంపిస్తావా నిజంగా?"

"పంపించకపోతే అప్పుడను."

"చూద్దాంగా?"

* * * *

తన తల్లి కనపడగానే ప్రసాదం తల్లికేసి చేతులుచాచి "నేనొచ్చానే అమ్మా!" అన్నాడు. తల్లి పెద్ద కేకవేసి కొడుకుని ఆలింగనంచేసి, మొహమంతా నిమిరి, "ఒచ్చావుట్రా, నాన్నా? నా చిట్టితండ్రే! నా బంగారు తండ్రే మా నాయనే! మా వర హాలే!" అని ప్రేమ కురిపించసాగింది.

"నన్ను పంపించకపోతే అన్నం తిన్నన్నానే! బడికి పోనన్నానే? నీళ్ళు పోసుకోనన్నా!"

తల్లి ముక్కుమీద వేలు పెట్టుకొని గుడ్లు తేలవేసి కొడుక్కేసి చూస్తూ "అయ్యయ్యో! అట్లా అనొచ్చునట్రా, పిచ్చి వెధవా!" అన్నది.

"ఏమే" అన్నాడు ప్రసాదం. నిర్లక్ష్యంగా తలాడిస్తూ.

"ఆవిడ ఏమన్నా అనుకోదూ?"

"ఏ మనుకుంటే?" ఇంకా నిర్లక్ష్యంగా.

"ఆవిడ కోపం రాదుట్రా? పైకట్లా అనొచ్చా?"

"ఆ వెధవముండ కోపంవస్తే నాకు భయమూ ఏమిటి?" అన్నాడు ప్రసాదం తన తల్లి బెదురు కాశ్చర్యపడుతూ.

తన కొడుకు ప్రయోజకత్వానికి కలిగిన ఆనందాన్ని లోపలే అణుచుకోటానికి ఆడది చెయ్యగలిగినంత ప్రయత్నంచేస్తూ, నోటిమీద చెయ్యి కొట్టుకొంటూ "అవ్వ! అవ్వ! అట్లా అనొచ్చుట్రా? ఆవిడకు తెలిస్తే ఏమంటుంది?" అన్నది.

"ఏమంటుందేం? నేను రోజూ ఆవిణ్ని అంటంలా?"

"ఏమనీ?"

"వెధవముండా అని."

తల్లి కొడుకువంక సోద్దెంగా చూస్తూ "ఆ మాటంటే ఊరుకుంటుందీ?" అన్నది.

"ఎందుకూరుకోదూ?"

నువ్వట్లా అన్నా, నిన్ను ఆపేక్షగా చూస్తుందిట్రా?" అన్నది తల్లి.

"పెరుగేసి పెడుతుంది."

* * * *

రాత్రివేళ భోంచేసి ప్రసాదం పడుకున్నాడు. ఇక్కడి మంచాలూ పక్కలూ అక్కడంత బాగాలేవు. లేకపోతే ఏం? ఇది అమ్మవేసిన పక్క. ఇవాళ మళ్ళీ ఒక రాత్రివేళ అమ్మవచ్చి తన పక్కలో పడుకుని అదివరకట్లేనే ముద్దు పెట్టుకుంటుంది. కాని ఏడవదు. ఇంకెందుకేడవడం? తన పెంపుడయి పోయిందిగా!.... అమ్మవచ్చి తనదగ్గిర పడుకునేదాకా తను మేలుకునే ఉండాలి.... తనువచ్చిన సంతోషం పొద్దున అమ్మ ఎంత బాగా కనపరిచింది. మళ్ళా రోజల్లా కనబరచలేదు కాని లోపల, ఉంటుంది!

అమ్మా, నాన్నా జాము సేపటినించి మాట్లాడుకుంటున్నారు. తనకేమీ అర్థం కాదు. వాళ్ళు మాట్లాడేది తన్నుగురించే.

"ఆవిడకి వాడంటే చాలా ఆపేక్షగా ఉన్నట్టుంది. అదీ కొంత నయమే! వాణ్ణి మనిష్టం వచ్చినప్పుడల్లా తెచ్చుకోవచ్చు....ఆవిణ్ని కొంత డబ్బేమన్నా అడుగుతారా ఏమిటి?" అంటున్నది అమ్మ.

"ఏదో చూద్దాంలే" అని విసుక్కుంటున్నాడు నాన్న.

* * * *

నెలరోజులయినా సుబ్బమ్మ కుర్రవాడికోసం కబురు చేయదు పది రోజుల నించీ ప్రసాదం తల్లిదండ్రుల ఆదుర్దా హెచ్చుతున్నది.

ఆవిడ పిల్లాణ్ని విడిచిపెట్టేసి, ఇంకోణ్ని పెంచుకుంటుందేమో!

వీడు ఆవిడకేం కోపం తెప్పించాడో ఏం ఖర్మమో!

కాకపోయినా, ఆవిడమీద ఈ వెధవ కింత అలుసెట్లా వచ్చిందో! ఎవర్ని

తొందరపడి ఏ మాటా అనేవాడు కాదే!....

చాటుగా అమ్మ అబ్బాయిని కసిరింది— "నువ్వావిణ్ణి ఏమన్నావురా వెధవా?"

"వెధవముండా అన్నాను."

"ఎన్నిసార్లన్నావు?"

"ఏమీ! చాలాసార్లన్నాను. ప్రతిరోజూ అన్నాను. ఆవిడ వెధవముండ కాదా ఏమిటి? ఆవిడ దగ్గిర వెధవముండ వాసన కూడానూ!"

తనని గద్దించే తల్లినీ, ఆదివరకు ఆనాడు తనని దొడ్లోకి తీసుకువచ్చి ఏడ్చిన తల్లినీ ఒకలెగా భావించలేక పోయినాడు ప్రసాదం. ఆడదాని అఘాయిత్యం వాడికేం తెలుసు! ఆనాడు తనని ఏడిపించడమే ఆవిడ ఆశయం అని వాడే ఎరుగునూ?

* * * *

"మావాడు వట్టి వదరుబోతు. వాడు అందర్నీ తిట్టటం కూడా నేర్చుకున్నాడు." అన్నాడు అబ్బాయి జనకతండ్రి.

"అందర్నీ ఎందుకు తిడతాడు పాపం? నన్నే తిడతాడు. వాడిచేత తిట్టించుకోవటం నాకు ముద్దే! నేను వాడి కా అలుసిచ్చాను." అన్నది సుబ్బమ్మగారు.

జనకతండ్రి అతిదీర్ఘ నిశ్వాసం విడిచాడు. అంత గాలీ ఆయనలో ఉండి రకరకాల హృదయ మనోవికారాలు కలిగిస్తూ ఉండింది. ఆ విషవాయువు బయటికి పోగానే ఆయన మొహంలో కొత్త కళ వచ్చింది.

"వాడు తల్లికోసం, పాపం కలవరించసాగాడు. అందుకని పంపించాను. వాడి సుఖమే నాక్కావలిసింది" అన్నది సుబ్బమ్మకూడా నిట్టూర్చి.

"బాగుందే! ఇక మీరే వాడి తల్లి! మీరు వాణ్ణి కాస్త భయపెట్టండి, లేకపోతే చెడతాడు!"

* * * *

"ప్రసాదం?"

"ఏవమ్మా?"

"పడుకోవ్వుటూ, నాయనా?"

"పడుకుంటాన్లేవే."

"నా పిచ్చి తండ్రిగడే. నన్నేవే అన్నావుటే! ఏదీ ఒక ముద్దు పెట్టు! అరి దొంగముండా, నీ ముద్దెంత కమ్మగా ఉందిరా!.... నా దగ్గిర వెధవముండ వాసనెయ్యటల లేదమ్మా!

ప్రసాదం బిక్కమొహం వేశాడు.

"నా తండ్రి లేదులేరా!" అని సుబ్బమ్మ కుర్రాణ్ణి తన రొమ్మున అదుముకున్నది.

ముద్రణ : భారతి, ఆగస్టు 1938

# పిల్లి కథ

"మ్యా! మ్యా!"

"అమ్మోయ్, పిల్లి కూనేవ్!" అన్నది చిట్టి.

"తెల్లగా ఎంత ముద్దొస్తుందో!...." అన్నాడు బుల్లాడు.

"ఛీ! ఛీ! దాన్ని ముట్టుకుంటారేమ్రా. పిల్లిని ముట్టుకుంటే పంచమహా పాతకాలూ చుట్టుకుంటై!" అన్నాడు నాన్న.

"మ్యా! మ్యా!" అన్నది కూన.

"చూడు నాన్నా, ఎట్లా దగ్గిరకొస్తుందో" అన్నాడు బుల్లాడు.

"ఇది పెంపుడు పిల్లి. అందుకే పారిపోవటంలేదు." అన్నది చిట్టి

"చూడు నా చెయ్యి ఎట్లా నాకుతుందో!" అన్నాడు బుల్లాడు.

"దాని కాకలవుతోంది." అన్నది చిట్టి.

"చెబితే మీక్కాదుట్రా? దాన్ని వెళ్ళగొట్టండి ముందు....బొచ్చంతా రాలిపోయి ఎంత అసహ్యంగా ఉందో, దాని ముట్టుకున్నారంటే మీక్కూడా చీడ పట్టుకుంటుంది" అన్నాడు నాన్న.

"దాని కాకలవుతుంది నాన్న, కొంచెం అన్నంపెట్టి వెళ్ళగొడతాం" అన్నది చిట్టి.

"దానికి చీడలేదు, నాన్న" అన్నాడు బుల్లాడు. మజ్జిగా అన్నమూ కలిపి పెడితే కూన ఉత్సాహంగా తిన్నది.

అనుకున్న ప్రకారం కూన ఇల్లు వదిలిపోలేదు. అది ఇల్లు తన సొంతం చేసుకున్నది. అందరితోపాటు ప్రతిపూటా తిండికొచ్చేది. మిగతా సమయాల్లో ఎండ పొడో, వెచ్చనిచోటో చూసుకుని నిద్రపోయ్యేది. రాత్రిపూట ఎవరో ఒకరి పక్కల్లో పడుకునేది. దాని యిష్టం వచ్చినప్పుడు బయటికివెళ్ళి పెత్తనాలు చేసి వచ్చేది.

నాన్నకు పిల్లిని చూస్తే చాలా కోపంగా ఉండేది. 'ఏమిటీ వెధవ పిల్లి? పొద్దునే మనకు దీని దర్శనం! అస్తమానమూ ఏ పని చేసుకోబోయినా అడ్డం వస్తూం టుంది....పిల్లలూ, మీరు దీన్ని మచ్చికచేస్తే ఊరుకోను. రెండు పూటలు తిండి వెయ్యకుండా ఉంటే అదేపోతుంది" అన్నాడు నాన్న.

"ఏం, నాన్నా, పాపం...." అన్నది చిట్టి.

"పిల్లి పాపిష్టిది. ఇంకా కుక్క నయం. విశ్వాసంగల జంతువు. దానికి స్వామి భక్తి ఉంది. పిల్లికి విశ్వాసం లేదు. తన సుఖమే చూసుకుంటుంది. ఇంకొకరి సుఖం ఓర్చలేదు. మనం ఏదన్నా తింటుంటే శాపనార్థాలు పెడుతుంది. పిల్లి శాపనార్థాలంటే అవే మనం తినే ముద్దలుకూడా లెక్క పెడుతుంది" అన్నాడు నాన్న.

"పిల్లికి ఒంట్లు వచ్చా నాన్నా!" అన్నాడు బుల్లాడు.

"దాని ఒంట్లు దానికొచ్చులే." అన్నాడు నాన్న చిరాకుగా.

పిల్లికి కూడ కృతజ్ఞత ఉంటుంది, నాన్నా. అది నాతోనూ, బుల్లాడితోనూ ఆడుకుంటుందిగాని నీతో ఆడుకోదేం!" అన్నది చిట్టి.

"ఏమైనా దానికి అన్నం పెడితే నేను ఒప్పుకోను. మనుషులకే తినటానికి లేకుండా ఉంది!" అన్నాడు నాన్న.

"దాని తిండెంత, నాన్నా? మనం పారేసినంత ఉండదూ?" అన్నాడు బుల్లాడు.

"వీల్లేదు." అన్నాడు నాన్న.

* * * *

"చూడండి. ఈ దిక్కుమాలిన పిల్లి ప్రద్దాన్నోనూ మూతిపెడుతున్నదీ! ఎట్లా చచ్చేది దీంతో!" అన్నది అమ్మ.

"గోతాలు పెట్టి ఊరిబయట విడిచొస్తేగాని దీనిపీడ వదలదు."

దాన్ని అన్నం పెట్టక చంపుతుంటే ఏం చేస్తుందే?" అన్నాడు బుల్లాడు.

"దాన్నెవరు మేపుతారు? దాని తిండి అది చూసుకోమను" అన్నాడు నాన్న.

"దాని తిండి ఏం చూచుకొంటుంది. ఇప్పుడింటో ఎలికెలు కూడా లేకుండాపోయునై" అన్నాడు బుల్లాడు.

"అవును పాపం దాని ధర్మమా అంటూ ఈ పిల్లొచ్చాక ఎలికెల బాధ లేదు." అన్నది అమ్మ.

"అది ఎలికెల్ని పట్టినా మనం దానికన్నం పెట్టం" అన్నది చిట్టి.

"మనమే కృతజ్ఞత లేనివాళ్ళం" అన్నాడు బుల్లాడు.

"ఇంకేం ఎలికెల్ని పట్టుకోమను? మళ్ళీ అన్నం కూడా దేనికి?" అన్నాడు నాన్న.

"ఎలికెలు అయిపోయినకొద్దీ మనకు లాభం దానికి నష్టం. ఇదేం న్యాయము నాన్నా!" అన్నాడు బుల్లాడు.

"పట్టుకునేటందుకు ఎలికెలు లేకపోతే ఇంకా ఈ పీనిగె మన కొంపల్లో దేనికి?" అన్నాడు నాన్న.

"అక్కర తీరితే అల్లుడు లంజకొడుకు" అన్నాడు బుల్లాడు.

"పట్టుకునేటందుకు ఎలికెలు లేకపోతే ఇంకా ఈ పీనిగె మన కొంపతో దేనికి?" అన్నాడు నాన్న.

"అక్కర తీరితే అల్లుడు లంజకొడుకు" అన్నాడు బుల్లాడు.

"అది ఇంటో ఉండగూడదర్రా వెధవ చీడపిల్లి? దాన్ని ముట్టుకుంటేనే రోగాలొస్తాయి" అన్నాడు నాన్న.

"చీడపిల్లా నాన్నా? చూడు దాని వొంటినిండా ఊలుబంతల్లే ఎంత బొచ్చో. బలిసి ఎంత ముద్దొస్తున్నదో !!" అంది చిట్టి.

"మనింటో బాగా పాలూ, మజ్జిగా తిని కొవ్వింది. లావుగా ఉండదూ ?" అన్నాడు నాన్న.

"చిక్కితే చిక్కిందంటావు. బలిస్తే బలిసిందంటావు. యెట్లా నాన్నా ?" అన్నాడు బుల్లాడు.

"మనం మనుష్యులంకదా. పిల్లుల్ని దగ్గిర పడుకోబెట్టు కోవటమూ, దాన్ని ఎత్తుకుని ఆడుకోవటమూ అసహ్యం కాదుట్రా ?" అన్నాడు నాన్న.

"అది మనకన్న శుభ్రంగా ఉంటుంది. రోజుకు పదిసార్లు ఒళ్ళంతా నాక్కుంటుంది. పక్కమీద ఉచ్చకూడా పొయ్యదు" అన్నది చిట్టి.

నాన్న మాట్లాడలేదు. కాని, మర్నాటినించి పిల్లికూడా కనపళ్ళేదు. నాన్న ఏంచేశాడో మరి.

* * * *

కిస్మస్ శెలవులకి బావొచ్చాడు.

చిట్టీ, బుల్లాడూ బావచెరో చెయ్యీపట్టుకు వేళ్ళాడుతూ పిల్లి కథంతా చెప్పారు.

"పిల్లిని వెళ్ళగొట్టటం అన్యాయమే" అన్నాడు బావ. "మచ్చిక చెయ్యని పిల్లి దాని యిష్టం వచ్చినట్లు అది జీవిస్తుంది. తిండి దొంగిలిస్తుంది. కొట్టబోతే పారిపోవటం నేర్చుకుంటుంది. దాని బతుకు అది చూసుకుంటుంది. కాని మనం దాన్ని మచ్చిక చేసిన తరువాత దాని బతుకు అది చూసుకోలేదు. ఎలికెల బాధ కోసం పిల్లిని పెంచి ఎలికెలబాధ పోగానే దాన్ని వెళ్ళకొట్టేస్తే దానిగతి ఏం కానూ ? కొన్నాళ్ళు మనుషులు దానికి తిండి పెట్టటంచేత మనిషి శత్రువనే జ్ఞానం దానికి లేకుండా పోతుంది. దొంగతనంగా తిండి సంపాదించటం దాని కలవాటుండదు. మనిషిని నమ్ముతూ అది తిండిలేక చస్తుంది. ఆ పాపం పెంచిన వాళ్ళను చుట్టుకుంటుంది" అన్నాడు బావ.

"ఇప్పుడు మళ్ళీ మనింటో ఎక్కడ చూసినా ఎలుకలే" అన్నది చిట్టి.

"ఎందుకుండవూ ? పిల్లి ఉన్నంతకాలమూ దాని ఉపయోగం ఏమీ, లేనట్టే ఉంటుంది. అది పోయిన తరువాతగాని దాని ప్రయోజనం తెలియదు" అన్నాడు బావ.

"పిల్లులు మంచివి కావంటాడే నాన్న ? వాటిని ముటుకుంటే పంచ మహా పాతకాలు చుట్టుకుంటాయట. వాటిని ముట్టుకుంటే రోగం కూడా వస్తుందట" అన్నాడు బుల్లాడు.

"దానిబతుకు దాన్ని బతకనివ్వక మనం దాన్ని సరిగా చూడనప్పుడు పిల్లి అనారోగ్యంగా ఉండదూ ? వొంటినిండా చీడపడుతుంది. బొచ్చంతా రాలి పోతుంది. మనం చూడకుండా అది మనం తినేవాటిని ముట్టుకోవచ్చు. మన పక్కల్లో పడుకోవచ్చు. మన గిన్నెల్లో మూతి పెట్టవచ్చు. అట్లాకూడా మనకు రోగా లొస్తాయి....అంతేగాని మనం శ్రద్ధగా పెంచే పిల్లి ఎంత ఆరోగ్యంగానైనా ఉంటుంది. దానివల్ల మనకూ మనవల్ల దానికీ లాభం ఉంటుంది" అన్నాడు బావ.

బావ ఈ మాట అంటుండగానే బుల్లాడు దూరంగా ఒక పిల్లిని చూశాడు. బయట గడ్డిలో ఏదో వెతుకుతున్నది పిల్లి.

"అది మన పిల్లే బావా !" అన్నది చిట్టి.

బావా, చిట్టీ, బుల్లోడు కలసి పిల్లిని చూడటానికి బయటికొచ్చారు. వాళ్ళు దగ్గిరికి రావడం చూచి పిల్లి నాలుగు గజాలు పారిపోయి వాళ్ళకేసి భయంతో చూస్తూ నిలబడింది.

"చూశావా, చిట్టీ. మన పిల్లి ఎట్లా అయిపోయిందో, దాని వొంటిమీద బొచ్చంతా రాలిపోయి, చిక్కిపోయి ఎట్లా ఉందో ?" అన్నాడు బుల్లోడు.

"ఛీ. పాడుపిల్లి, మనకొద్దు ?" అన్నది చిట్టి.

"మనింటో ఎలికెలో" అన్నాడు బావ.

"ఎలికలయితేమటుకు దీన్నెట్లా పెంచుతాం బావా ?" అన్నది చిట్టి.

"అట్లాకాదే, చిట్టీ. దీనికి నాలుగు రోజులు తిండి పెడితే మళ్ళీ బాగా బలుస్తుంది. వొంటినిండా బొచ్చొస్తుంది. ఎలికెల్ని కూడా పడుతుంది !" అన్నాడు బావ.

"నేను పట్టుకోనా?" అంటూ బుల్లాడు పిల్లిదగ్గిరి కెళ్ళాడు. పిల్లి భయపడుతూ ముడుచుకుపోయి, పీలగొంతుతో, "మ్యా !" అన్నది.

"ఎంత జాలిగా అరుస్తోందో !" అన్నది చిట్టి.

పిల్లి ఇప్పుడు బాగా బలిసింది. చిట్టితోనూ బుల్లాడితోనూ చాలా సరదాగా ఆడుకుంటుంది. ఇంటో ఎక్కడా ఎలికె అలికిడిలేదు. అది ఒక్కసారి నాన్న పక్కమీదికే వెళ్ళి దర్జాగా పడుకుంటుంది. నాన్న దానికేసి అనుమానంగా చూస్తాడు గాని, ఏమీ అనడు.

ముద్రణ : అభ్యుదయ, డిసెంబరు 1946

# దీపావళి

రేపు దీపావళి.

నిన్నరాత్రి బండికే అక్కా బావా దిగారు.

"అసలు వద్దామనుకోలేదు. రైలెక్కడమంటే హడలుగా వుంది. కిందటి మాటు దీపావళికి కూడా రాలేకపోయినాం గదా అని నేనే బలవంతపెట్టి ఆయన్ని బయల్దేరదీశా" నన్నది అక్క.

"అయ్యో! అదేమిటి? మన కింతకంటె పెద్ద పండుగ లేదుగదా. వద్దామనుకోకపోవడమేమిటి? చీటికిమాటికీ వస్తూ పోతూ వుండటానికి దూరభారమాయెను! మిమ్మల్నిద్దరిని, పిలిచి పెట్టుకోవాలన్నా, చేసుకోవాలన్నా, ఇప్పుడు కాకపోతే మరెప్పుడే" అన్నది అమ్మ.

"చిట్టిని, బుల్లాణ్ణీ, మిమ్మల్నీ చూసిపోదామని వచ్చాంగాని విందులు కుడవడానికి రాలేదు. మీరేమీ వృథాగా డబ్బు తగలెయ్యకండి" అన్నాడు నాన్నతో బావ.

"అదేమిటయ్యా? పండుగన్న తర్వాత ఉన్నంతలో ఏదో చేసుకోవాల్సిగాని, ఏమీ లేకుండా ఊరుకుంటామా!" అన్నాడు నాన్న....

"చూడమ్మా, ఆయనకుగానీ, నాకుగానీ బట్టలూ అవీ పెట్టకండి. అసలే కరువురోజులు[1], రేషనుకార్డుమీద దొరికే గుడ్డ ఏమూలకీ చాలకుండా వుంది. మీరు గుడ్డ కొని పెడుతున్నారని తెలిస్తే ఆయనకు చాల కోపం వస్తుంది" అన్నది అమ్మతో అక్క చాటుగా.

అక్క అనుమానపడ్డట్టే రాత్రి ఎనిమిది గంటలకే ఎవరో ఒకాయన చంకలో చిన్న మూట పట్టుకొచ్చాడు. నాన్న ఆయన్ని లోపలికి పిలిచాడు.

---

1. కరువురోజులు : 1943 - 1944 మధ్య భారతదేశంలోని చాలా ప్రాంతాల్లో పంటలు దెబ్బతినడంవల్ల యేర్పడ్డ తీవ్రమైన కరువు రోజులు. బెంగాల్లో యివి తీవ్రమైన కరువురోజులు. బీహార్‌లో, రాయలసీమలో సైతం అవి కరువు రోజులే. నాలుగు మిలియన్ల టన్నుల ధాన్యం కొరత యేర్పడిన పరిస్థితుల్లో ఒక మిలియన్ టన్నులను బ్రిటన్ ఎగుమతి చేసింది. ధాన్యం ధర పదింతలు పెరిగింది. బ్లాక్‌మార్కెట్ పెరిగింది. అయిదు లక్షల మంది కరువువాత పడ్డారు.

ఆయన లోపలికొచ్చి మూట విప్పాడు. అందులో చక్కని మిల్లు ధోవతులూ, మిల్లు చీరెలూ వున్నాయి. వాటి ధరకూడ అందంగానే వుంది.

బావ చూస్తూనే వున్నాడు. నాన్న ఒక ధోవతుల చాపూ, ఒక చీర కొనడానికి తయారవుతున్నాడు. ఇంతలో బావ నాన్న కడ్డంవచ్చి, "ఈ బట్ట లేషాపులోవి ?" అని అడిగాడు. బట్టలు పట్టుకొచ్చిన మనిషి ఆశ్చర్యపడి చూశాడు.

బావ మండిపడ్డాడు. దొంగవ్యాపారం చేసేవాళ్ళందర్నీ కొరతవేయాలన్నాడు. ఇటువంటి భ్రష్టులు అవకాశం చిక్కితే దేశాన్నీ, జాతినీ కూడా దొంగ మార్కెట్టులో అమ్మేస్తారన్నాడు. బట్టలు తెచ్చినవాడు గబగబా చుట్ట చంకనపెట్టి జారుకున్నాడు.

"అదేమిటయ్యా ? రేపు పండగ్గదా ఏదోవిధంగా బట్టలు సంపాదించుకోకపోతే ఎలా ?" అన్నాడు నాన్న.

"బీదవాళ్ళకి చౌకగా అందవలసిన ఈ బట్టలు దొంగవ్యాపారుల దగ్గిర బోలెడంత ధరపోసి కొనకపోతే హాయిగా నేతబట్టలుగాని, ఖద్దరుగాని కొనరాదా ?" అన్నాడు బావ.

"నాజూకుగా వుంటాయని" అన్నాడు నాన్న.

"అయితే సిల్కులు కొనండి" అన్నాడు బావ.

"ఏమిటే అమ్మాయి. మీ ఆయనేదో కేకలేస్తున్నట్టుంది ?" అన్నది అమ్మ అక్కతో.

"నేను చెప్పలేదా" అన్నది అక్క.

* * *

తెల్లవారుజామున తలంట్లు పోసుకొని టపాకాయలు కాల్చాలి. అందుకని నాన్న ముందుగానే కొన్ని సీమటపాకాయలూ, మతాబాపుల్లలూ అవీ తెచ్చి వుంచాడు.

"నేను ఇప్పుడే రంగు నిప్పుల్లలు కాలుస్తా" నంటూ చిట్టి పంతంపట్టింది.

"ఇప్పుడు కాల్చకూడదమ్మా ! రేపు పొద్దుని కాలుద్దుగాని. ఏం ?" అన్నాడు నాన్న.

"ఇప్పుడే కాల్చాలి" అన్నది చిట్టి.

"ఇప్పుడు కాలిస్తే బావ కోప్పడుతాడు" అన్నాడు బుల్లాడు. అంతకుముందు బట్టల విషయంలో బావ కేకలెయ్యటం బుల్లాడు చూశాడు.

"ఏం బావా, కోప్పడుతావా ?" అని అడిగింది చిట్టి.

బావ చిట్టినీ, బుల్లాణ్ణీ దగ్గరికి పిలిచి కూచోపెట్టి, "ఇవ్వాళ ఎవరూ టపాకాయలు కాల్చకూడదు. ఎందుకో తెలుసా ?" అన్నాడు.

"ఇవాళ కాల్చొచ్చు" అన్నది చిట్టి.

"తెలీ"దన్నాడు బుల్లాడు.

"ఇవాళ ఎందుకు కాల్చకూడదంటే, ఇంకా నరకాసురుడు చావలేదు. అందు కని కాల్చకూడదు" అన్నాడు బావ.

"నరకాసురుడు చచ్చింతర్వాత కాల్చొచ్చా!" అన్నాడు బుల్లాడు.

"కాల్చొచ్చు" నన్నాడు బావ.

"నరకాసురు డెప్పుడు చస్తా?"డని అడిగింది చిట్టి.

"తెల్లారుజాముకల్లా చస్తాడు. అప్పుడు మనం తలంటిపోసుకొని టపాకాయలు కాలుస్తా" మన్నాడు బావ.

"నరకాసురుడు చస్తే మనం టపాకాయలు కాల్చడం దేనికి!" అని అడిగాడు బుల్లాడు.

"నరకాసురుడంటే ఏమిటను కున్నారు. వాడు రాక్షసుడు. వాణ్ణి చూస్తే ప్రజలందరికీ హడలు. వాడు అందర్నీ తిండి తిననివ్వడు. హాయిగా నిద్ర పోని వ్వడు. సుఖంగా బ్రతకనివ్వడు. వాడు మనుషుల్ని పశువులల్లే బళ్ళకికట్టి లాగి స్తాడు. లాగని వాళ్ళని కొరడాతో కొడతాడు. వాడు బలవంతుడు. అందుకని వాణ్ణి చూసి భయపడి ప్రజలు వాడు చెప్పినట్లల్లా చేస్తారు."

బావకడ్డంవచ్చి చిట్టి, "ఎవరైనా వాడు చెప్పినట్టు చేయకపోతే?" అన్నది.

"చెప్పినట్టు చేయకపోతే వాడు చంపేస్తాడు." అన్నాడు బావ.

"అందరూ కలసి వాణ్ణి మెత్తగా తంతే?" అన్నాడు బుల్లాడు.

"తంతే చచ్చిపోతాడు. కాని వాణ్ణి తన్నడానికి అందరూ కలవాలిగద? అందరూ కలవడానికి ఒక నాయకుడు కావాలి. కృష్ణుడే ఆ నాయకుడు. కృష్ణుడూ, కృష్ణుడివెంట సత్యభామా కలిసి ప్రజలందర్నీ ఏకంచేసి నరకాసురుడి మీదపడి, వాణ్ణి మెత్తగా తన్ని చంపేశారు. నరకాసురుడు చచ్చిపోగానే ప్రజలందరి భయం తీరిపోయింది. చక్కగా అందరూ మళ్ళీ ఇళ్ళల్లో దీపాలు పెట్టుకుని తలంట్లు పోసు కుని పండుగ చేసుకున్నారు." అన్నాడు బావ.

"అయితే మరి, టపాకాయలెందుకు కాల్చారు?" అన్నాడు బుల్లాడు.

"నరకాసురుడు చచ్చినా ఇంకా చిల్లర రాక్షసులు మిగిలారు. వాళ్లు దోమలూ పురుగులూ అయి మురుగ్గుంటల్లోను రొచ్చులోను దాక్కుని ప్రజల కనేక విధాల బాధలు తెచ్చిపెట్టారు. వాళ్ళందర్నీ చంపటానికి టపాకాయలు కాల్చవలసి వచ్చింది." అన్నాడు బావ.

"ఇవాళ రాత్రికి నరకాసురుడు చస్తే మనం చూడొచ్చా?" అన్నది చిట్టి.

"నరకాసురుడు చావడం మనం కళ్ళారా చూడగలమా? వాడు ఎక్కడో చస్తాడు. మళ్ళీ ఎక్కడో పుడతాడు. అందర్నీ పీడించుక తింటాడు. వాడున్నంత కాలమూ ఎవరూ కొంపలో దీపాలుకూడా పెట్టుకోరు. వాడు చచ్చేవరకూ అమ్మా నాన్నే. మళ్ళీ వాణ్ణి ఏ కృష్ణుడో వచ్చి చంపేస్తాడు. మళ్ళీ కొంతకాలం మన ప్రాణాలకు హాయిగా వుంటుంది. కాని వాణ్ణి ఎన్నిసార్లు చంపినా, వాడి తర్వాత

వాడి భటులైన రాక్షసులుంటూనే వుంటారు. వాళ్ళనికూడ చంపాలి.......మీరు హిట్లరు పేరు విన్నారా ?" అన్నాడు బావ.

"నేను హిట్లరు[1] బొమ్మ చూశా !" అన్నాడు బుల్లాడు.

"అయ్యో, నేను చూడలేదే" అన్నది చిట్టి.

"ముక్కుకింద మీసాలంటించుకుంటాడే, వాడేనా" అన్నాడు బుల్లాడు.

"వాడా ? వాణ్ణి నేను చూశా. మనం భాగోతంలోచూశామే, వాడుకాదూ !" అన్నది చిట్టి.

"ఔను. వాడే....హిట్లరు ప్రపంచాన్నంతా మింగటానికి యుద్ధం చేశాడు. యుద్ధం జరిగినన్నాళ్ళూ ఎవరూ రాత్రిపూట దీపాలు వెలిగించలేదు. చివరకు ప్రపంచములో వున్న ప్రజలంతా కలిసి హిట్లరును చంపేశారు. హిట్లరుకు తోడైన వాళ్ళని యీ మధ్యనే వురి తీసేశారు."[2]

"అందుకనేనా, మనం దీపావళి చేసుకుంటున్నాం!" అని అడిగింది చిట్టి.

"ఔను. పెద్ద పెద్ద రాక్షసులు చచ్చిపోయినందుకు పండుగ చేసుకుంటాం. కాని దీపావళి టపాకాయలు కాల్చడమంటే వట్టి పండగ చేసుకోవడమే కాదు, చిల్లర రాక్షసుల్ని కూడా చంపుతామని ప్రతిజ్ఞ చేయాలన్నమాట" అన్నాడు బావ.

"ఎవరీ చిల్లర రాక్షసులు !" అన్నది చిట్టి.

"దురాశా, కోపమూ, గర్వమూ, పొగరూ—ఇటువంటివన్నీ చిల్లర రాక్షసులే. ఈ రాక్షసుల్లో నుంచే మళ్ళీ ఒక నరకాసురుడు లాంటివాడు పుడతాడు.... ఇందాక బట్టలు పట్టుకొచ్చాడే, ఆ మనిషి ఎవరో తెలుసా ?" అన్నాడు బావ.

"తెలుసు" నన్నది చిట్టి. "ఆయన పేరు సాంబయ్య" అన్నాడు బుల్లాడు.

"ఆ సాంబయ్య వెంట చిన్న రాక్షసి కూడ వచ్చింది. చూశారా ?" అన్నాడు బావ.

చిట్టి భయం మొహం పెట్టి "లేదే" అన్నది.

"సాంబయ్య వెంట దురాశకూడా వచ్చింది. అయిదు రూపాయలు ఖరీదు చేసే ధోవతులకు పన్నెండు రూపాయలడగమన్నది రాక్షసి. సాంబయ్య అడిగాడు."

బుల్లాడు కిలకిల నవ్వాడు. బావకూడా నవ్వాడు.

"సాంబయ్య వెంట వచ్చిన రాక్షసుణ్ని చంపాలా వద్దా ?" అన్నాడు బావ.

చంపాలన్నది చిట్టి. చంపాలన్నాడు బుల్లాడు నవ్వుతూ.

* * *

---

1. చూడండి అనుభవం నవలలో.

2. "న్యూరెన్‌బర్గ్‌లో పాసిస్టు అవశేషాలకు సమాధి".... చూడు అనుభవం, పు. 141.

తెల్లవారుజామున అందరూ తలంట్లు పోసుకున్నారు. నాన్న బావకు ఖద్దరు ధోవతులూ, అక్కకి ఖద్దరు చీర కట్టబెట్టాడు. అందరూ సీమ టపాకాయలు కాల్చారు.

"రాక్షసులమాట మరచిపోవద్దేం!" అన్నాడు బావ.

చిట్టి సీమటపాకాయ అంటించి దూరంగా పారేసి చెవుల్లో వేళ్ళు పెట్టుకుంటూ "మరచిపో"నన్నది.

"రాక్షసుల్ని చంపేవాళ్ళట్లా భయపడతారా" అన్నాడు బావ.

"నాకు భయంలేదు" అంటూ బుల్లాడు కాల్చిన సీమటపాకాయ చేతిలోనే ఒక పక్కకుతిప్పి పట్టుకుని మొహం ఇంకో పక్కకితిప్పి కళ్ళు గట్టిగా మూసుకున్నాడు.

సీమటపాకాయ పేలి బుల్లాడి చేతిలోంచీ ఎగిరిపోయింది. బుల్లాడి వేళ్ళ కందినై. వాడు బిక్కమొహంతో వేళ్ళకేసి చూసుకున్నాడు.

"దీనికే భయపడతారా!" అన్నాడు బావ. "నా చిన్నతనంలో మేం టపా కాయలు కడుతుంటే మందు పేలి మా అందరి చేతులూ, మొహాలూ కాలినై.... రాక్షసుల్ని చంపడమంటే మాటలా ?" అన్నాడు బావ.

"నాకేం భయంలేదు" అన్నాడు బుల్లాడు.

కొంచెం పొద్దెక్కినాక పక్కయింటి కాంతయ్యగారి భార్య బియ్యం బదులడుగ వచ్చింది. ఆ వారం వాళ్ళకి చుట్టాల తాకిడి చాలా తగిలిందిట. నాలుగు రోజుల కిందట తిరపతినుండి తిరిగివస్తూ వాళ్ళ పెద్దబ్బాయి మామగారి తాలూకు అయిదారుగురు వచ్చి రెండు రోజులుండి వెళ్ళారుట. నిన్న వాళ్ళమ్మాయిని దిగ బెట్టటానికి వస్తూ అయిదారుగురు వేరే పనిమీద వచ్చి ఒకపూట ఉండిపోయినారుట.

"పిల్లా అల్లుడూ వచ్చారు. ఇవాళ్టికి సరిపోతాయో లేదో అన్నట్టుంది. రేపటి మాట ఎట్లాగా అని చూస్తున్నానమ్మా........పాపం" అన్నది అమ్మ.

బావ ఈ సంభాషణ విన్నాడు. అక్కను పిలిచి, "పాపం ఆవిడెవరో బియ్యం కోసం వస్తే, మీ అమ్మ లేదని చెబుతున్నదే. చూసి వీలయితే బియ్యం ఇప్పించు" అన్నాడు.

"మీకు పులిహోర యిష్టమని అమ్మ పులిహోర చేద్దామనుకొంటున్నది. అందు చేత నిజంగానే బియ్యం చాలవు" అన్నది అక్క.

"సామెత చెప్పినట్టుంది, వాళ్ల అన్నం తినటం కన్న మనం పులిహోర తినటం ముఖ్యమా ? పులిహోర మానేసి ఆవిడకు కాసిని బియ్యం ఇయ్యమను" అన్నాడు బావ.

మధ్యాహ్నం ఒంటిగంట వేళప్పుడు కాంతయ్యగారి రెండో కొడుకువచ్చి "మా అమ్మ కాస్త యింగువ పెట్టించుకు రమ్మంది" అన్నాడు.

అమ్మ వాణ్ణి వంటింట్లోకి పిలిచి ఇంగువ యిస్తూ, "ఇవాళ మీ యింట్లో పిండి వంట లేమిట్రా ?" అని అడిగింది.

"గారెలూ, అప్పడాలూ, పులిహోరా !" అని కేక పెట్టి కాంతయ్య కొడుకు ఇంగువ తీసుకుని పరిగెత్తాడు.

"చూశారా! మనం పులిహోర మానుకుని వాళ్ళకి బియ్యమిస్తే వాళ్ళు హాయిగా పులిహోర చేసుకుంటున్నారు" అన్నది అక్క బావతో.

"కాంతయ్య భార్య వెంట రాక్షసి ఉందని గుర్తించలేదు సుమా !" అన్నాడు బావ.

"చాల్లెండి, మీ రాక్షసులూ మీరూనూ" అన్నది అక్క.

"చూశావా, చిట్టీ? చూశావురా, బుల్లాడా కొంతమంది మనుషులు రాక్షసులకు మద్దతు చేస్తుంటే మనవంటి వాళ్ళం రాక్షసుల్ని ఎట్లా చంపగలం ?" అన్నాడు బావ.

"అక్క కూడా రాక్షసులకు మద్దతేనా !" అన్నాడు బుల్లాడు.

"అక్కకు రాక్షసులంటే కోపమేగాని మనసులో నమ్మకంలేదు. అందుకని మనం రాక్షసుల్ని చంపటం మానేస్తామా ?" అన్నాడు బావ.

"మానెయ్యం" అన్నది చిట్టి.

"చంపుతాం" అన్నాడు బుల్లాడు.

* * *

పొద్దూకింది. ఎవరిళ్ళ ముందు వాళ్ళు దీపాలు పెట్టుకుంటున్నారు. కొందరి వాకిళ్ళ ముందు పిల్లలప్పుడే మతాబాలు, తాటాకు టపాకాయలూ, చిచ్చుబుడ్లూ కాల్చడం మొదలుపెట్టారు. వీధులంతా గంధకం పొగ కమ్ముకుంటున్నది.

"వీధుల వెంట తిరిగివద్దాం వస్తారా !" అన్నాడు బావ.

చిట్టి, బుల్లాడు- బావ చెరో చెయ్యీ పట్టుకుని బయల్దేరారు.

"రోజూ ఇలా ఉంటే బాగుండదూ ?" అన్నది చిట్టి.

"రోజూ రాక్షసుల్ని చంపుతూ కూచుంటే ఇతర పనులు చేసుకోవద్దా ?" అన్నాడు బావ.

"టపాకాయలు దీపావళికే వస్తాయిగా, రోజూ ఎలా కాల్చటం !" అన్నాడు బుల్లాడు.

"అందరూ టపాకాయలు కట్టరాదు. దానికి లైసెన్సు కావాలి. టపాకాయలు కట్టేవాళ్ళు చాలా లాభం తీస్తారు." అన్నాడు బావ.

"మనం రాక్షసుల్ని చంపితే వాళ్ళకు లాభం" అన్నాడు బుల్లాడు.

"కొందరు చాటుగా టపాకాయలు కట్టేస్తారు. అది తెలిస్తే పోలీసులొచ్చి పట్టుకుపోతారు" అన్నాడు బావ.

"పోలీసులే రాక్షసుల్ని చంపరాదూ !" అన్నది చిట్టి.

"ఒక్క పోలీసులతో రాక్షసులు చావరు. దానికి అందరూ కావాలి" అన్నాడు బావ.

"అయ్యో! ఈ ఇంట్లో ఎవరూ టపాకాయలు కాల్చటంలేదే! చూడు బావ, చీకటిగా ఎలా ఉందో?" అన్నాడు బుల్లాడు.

"వాళ్ళకింకా రాక్షసుల భయం పోలేదు. వాళ్ళకి డబ్బులేదు; వాకిట్లో నిలబడ్డ ఆ పిల్ల చూడు, ఎంత కుళ్ళు గుడ్డలు కట్టుకుందో? అటువంటి పిల్లకు నరకాసురుడు చచ్చాడన్న సంతోషం ఏముంది" అన్నాడు బావ.

చిట్టిగాని, బుల్లాడుగాని ఏమీ మాట్లాడలేదు. మౌనంగా నడుస్తున్నారు.

బుల్లాడు అకస్మాత్తుగా ఆగి, "నేనోసారి ఇంటికెళ్ళొస్తాను బావా, మీరిక్కడే ఉంటారుగాదూ!" అన్నాడు.

బావ 'ఎందు' కన్నాడు. బుల్లాడు పనుందంటూ ఇంటికేసి పరిగెత్తాడు.

దూరాన రోడ్డుమీద ఇద్దరు మనుషులు తోటాలు కాలుస్తున్నారు. అందుట్లో ఒకడి చేతిలో తోటా జారి రోడ్డుమీదపడి అన్నివైపులా పరిగెత్త సాగింది. రెండోవాడి కాళ్ళసందున దూరి వాణ్ణి భయపెట్టింది.

"ఆ అబ్బికి రాక్షసుల్ని చంపటం చేతకాదు" అన్నది చిట్టి గంభీరంగా.

క్షణక్షణమూ వీధి రంగులు మారుతున్నది. కాస్సేపు ఒక ఇంటిముందూ మరి కాస్సేపు మరో ఇంటిముందూ కాంతి వెలుగుతున్నది. మధ్యమధ్యన పెద్దపెద్ద మోతలు కూడా వినిపిస్తున్నై.

ఇంతలో బుల్లాడు పరుగెత్తుకుంటూ తిరిగొచ్చాడు. చేతిలో కొన్ని టపాకాయలున్నై.

బుల్లాడు రొప్పుతూ, "ఇదిగో టపాకాయలు. ఆ అమ్మాయికిచ్చి రాక్షసులను చంపిద్దాం, ఏం?" అన్నాడు.

బావ నోట మాటరాలేదు. బుల్లాణ్ణి అక్కడే వాకిట్లో నిలబడి ఉన్న పిల్ల దగ్గరికి పట్టుకెళ్ళి ఆ టపాకాయలా పిల్ల కిప్పించాడు.

ఇంటోనుంచి జబ్బుతో వున్న పిల్లతల్లి బయటికొచ్చింది. బుల్లాడికేసి కృతజ్ఞతతో చూసి కూతుర్ని, "కాల్చమ్మా కాల్చు!" అన్నది.

బుల్లాడు తెచ్చిన టపాకాయలు కాలుస్తుంటే కళా కాంతీ లేని ఆ బీదపిల్ల మొహం వికసించింది. మతాబాల వెలుతుర్లో ఆ పిల్ల కళ్ళతోపాటు బుల్లాడి కళ్ళూ, చిట్టి కళ్ళూ, బావ కళ్ళూ కూడా మెరిసినై.

ముద్రణ :
అభ్యుదయ, నవంబరు, 1946

# దీపావళి రాజకీయాలు

"కాలిస్తే ఈ యేడే కాల్చాలిరా టపాకాయలూ" అన్నాడు సత్యం.

"అవున్రా ! ఎందుకూ ?" అన్నాడు శివం, తెలుసుకుని ఉండటం మంచిదని.

"ఎందుకేమిటి ? టపాకాయలు కాల్చటం పిల్లల జన్మహక్కు" అన్నాడు సుందరం. ముగ్గురిలోకీ సుందరమే రాజకీయవేత్తా, విప్లవ నాయకుడూనూ.

"హైదరాబాదులో నరకాసురుడి ప్రభుత్వం అయిపోలేదుట్రా ? అందుకు" అన్నాడు సత్యం.

"హైదరాబాదులో రాక్షస ప్రభుత్వం అయిపోతే మనకేం వరిగిందోయ్ ?" అన్నాడు విప్లవ నాయకుడు సుందరం.

టపాకాయలు జారిపోతున్నట్టే అనిపించింది శివానికి.

"అట్లా అవటానికి వీల్లేదు. ఎప్పుడో చచ్చిపోయిన నరకాసురుడి కోసం కాల్చుకోగా లేందీ, రజాకార్ల కోసం కానిని సీమటపాకాయలూ, తాటాకు టపాకాయలూ, మతాబాలూ, పూవొత్తులూ, కడ్డీలూ, జిల్లీలూ, ధరణాలూ, నిప్పుల్లలూ, పాంమందూ, ఎలక్ట్రితీగె, చిచ్చుబుడ్లూ, విష్ణు చక్రాలూ అవి కొద్దిగా కాల్చుకోరాదేం?" అన్నాడు శివం. అన్నీ వస్తాయని ఆశ ఎట్లాగూలేదు. అనుకోటానికేం ?

"మనకేం వొరిగిందేమిట్రా? ఆ దొంగ వెధవలు మూలంగానేగా మామయ్యా, అత్తయ్యా పారిపోయి వచ్చిందీ ? మామయ్య వంటిమీద కోటుకూడాలేదు, జ్ఞాపకం ఉందా ? అత్తయ్యకి జ్వరం ! అక్కడ ఇల్లూ, వాకిలీ, గుడ్డలూ, కుర్చీలూ ఏమయ్యాయో తెలీదు ! మామయ్య కయితే మన కయినట్టు కాదూ ?" అన్నాడు సత్యం.

"మనకయినట్టు కాదూ ?" అని వంత పాడాడు శివం.

"అవుననుకో !" అన్నాడు రాజకీయవేత్త సుందరం.

ఇక్కడికి మీటింగు ఒక మెట్టెక్కింది. పిల్లకాయలు ఈ దీపావళికి టపాకాయలు విరివిగా కాల్చవలసిన ఆవశ్యకతను గురించి, ఎట్లాగైతేనేం సభికులందరూ ఏకాభిప్రాయానికి రాగలిగారు.

సత్యం చల్లగా నాన్నమీద అవిశ్వాస తీర్మానం ప్రవేశపెడుతూ, ఉపోద్ఘాతంగా "నిరుడు కూడా నాన్న టపాకాయలు కొనిపెడతాను, కొనిపెడతాను అంటూనే తలాయించాడు" అన్నాడు.

"ఈ ఏడూ తలాయిస్తాడు !" అన్నాడు శివం బెదురు మొహం పెట్టి.

"ఏదీ? ఎల్లుండి పండుగ! ఇంతవరకూ ఒక్క కాకర పువ్వొత్తన్నా కొనలా! ఈ యేడుకూడా బండిసున్నాయే."

"ఆ క్రిందటేడు భలే కాల్చాం, చక్కహా!" అన్నాడు సుందరం, మంచి రోజులు జ్ఞాపకం తెచ్చుకుంటున్నవాడల్లే.

"నీ మొహం! ఆ క్రిందటేడు నువ్వు కప్పగంతులు చూసి దడుసుకుంటు న్నావు. అసలు మీలో ఎవరూ నిజమైన దీపావళీ టపాకాయ లెరగరు. శివుడికి పేర్లు తెలుసుకాని వాటని చూడనన్నా లేదు. టపాకాయలంటే యుద్ధం ముందు కాల్చాం! అవీ టపాకాయలు! ఆ తర్వాత టపాకాయ లున్నాయి ఏమిటి?" అన్నాడు పితామహుడిలాటి పధ్నాలుగేళ్ళ సత్యం.

"నాకు జ్ఞాపకం లేకేమోయ్? నేను బుట్టెడు జిల్లీలు కాల్చా ఓ చిన్నప్పుడు" అన్నాడు శివం.

"ఒరే సుందరం, ఓ యేడు మామయ్య శేర్లు తెచ్చాడురా! నిజమైన శేర్లు! బందరువి! అవి కాల్చాను చూడు! ఎందుకులే?" అన్నాడు సత్యం.

"అవును, నేను చూశా?" అన్నాడు శివం. "నేలలో పాతిపెడితేనే మన కొబ్బరి చెట్టెత్తు లేచినై పూలు!"

"ఛీ, అవి చిచ్చుబుడ్లు!" అన్నాడు సత్యం.

నాన్న మీది అవిశ్వాస తీర్మానం పెదదోవ పడుతోందని శివం గ్రహించి "నాన్న ఈ యేడు టపాకాయలు కొనిపెట్టనంటే?" అన్నాడు.

"నాన్న ఎట్లాగా కొనిపెట్టడు" అన్నాడు సుందరం, వర్గతత్వం ఎరిగినవాడు కనుక.

"కొనిపెట్టకపోతే ఊరుకోవద్దు" అన్నాడు శివం మితవాద ధోరణిలో.

"ఊరుకోక ఏం చేద్దాం?" అన్నాడు విప్లవ నాయకుడు సుందరం.

"ఏం చేద్దామా? రేపు తలంటు పోసుకోవద్దు. అమ్మ చేసే అప్పచ్చులు తినొద్దు" అన్నాడు సత్యం సత్యాగ్రహ శంఖం పూరించి.

"ఒకవేళ అమ్మ బొబ్బట్లు చేస్తే అవి తినొద్దు?" అన్నాడు శివం ముందుగా తెలుసుకుని ఉండటం మంచిదని.

సత్యం ఒక్క క్షణం ఆలోచించాడు. అతని ముఖం రాయిలా ముడుచుకు పోయింది. సత్యాగ్రహి దుష్టశక్తులతో రాజీపడరాదు!

"బొబ్బట్లు చేసినాసరే మనం తినం!" అన్నాడు సత్యం.

నాన్నమీద అవిశ్వాస తీర్మానమూ, శాసనధిక్కార తీర్మానమూ ఏకగ్రీవంగా ఆమోదించబడ్డాయి. కాని సుందరం మళ్ళీ సందేహం లేవదీశాడు.

"మనం తలంటుకుని, కొత్తబట్టలు వేసుకుని, బొబ్బట్లు తినకపోతే నాన్నకేం?" అన్నాడు సుందరం విప్లవదృష్టితో.

దగ్గిరకి వస్తూ వస్తూ ఉన్న టపాకాయలు కాస్తా మళ్ళీ అంతర్హితమైపోయి పట్టయింది శివానికి. వాడు దీన మొహం పెట్టి, "అన్నిటికీ వీడేదో అడ్డు చెబుతాడేంరా ?" అన్నాడు.

"నిజమేరా, ఒకవేళ నాన్న ఇస్తానన్నా వీడు టపాకాయలు వద్దంటాడు కూడానూ ! గొప్ప, ముష్టి గొప్ప !" అన్నాడు సత్యం.

పరిస్థితులకు తల వంచి సుందరం తన అనుమానాన్ని ఉపసంహరించుకున్నాడు.

# 2

"ఏమండీ పాపం, వాళ్ళ కేమన్నా తీసుకురారు ? తెగ గోల పెట్టేస్తున్నారు" అన్నది అమ్మ.

"గోలపెట్టరూ దవడపళ్లూడగొట్టేవాళ్లు లేకా ?" అన్నాడు నాన్న. ఆయన ఫస్ట్ పానిస్టు పద్ధతులే.

"అదేమిటండీ ఇరుగు పొరుగు పిల్లలంతా అవీ ఇవీ కాలుస్తుంటే వాళ్ళకి మట్టుకు కాల్చాలని ఉండదూ ?"

"ఒహాళ్ళతో మనకు వంతేమిటి ? నిన్ను ఇందుకే పత్రిక చదవ్వే అంటాను. ప్రభుత్వాలు కూడా ఆదాలో పడ్డాయిగదా! మనం దుబారా ఖర్చు చేస్తూ కూర్చుంటే ఎట్లా ?"

"ఏడాదికోసారి వచ్చే పండక్కి దుబారా ఖర్చేమిటండీ. మీదంతా చోద్యం ?"

"అట్లాగా ? గుండుసూది దగ్గిర్నుంచీ ఆదా చేసేది చెయ్యాలవలసిందే. మన ప్రభుత్వం తీసుకో."

"నాకక్కర్లేదు ప్రభుత్వం. మీరే తీసుకోండి !"

"మన ప్రభుత్వానికి— అదేమిటీ ?— ఎన్నో కోట్లు ఖర్చుందనుకో. అయినా కూడా వాళ్ళు ఆదా చేస్తున్నారు ?"

"ఎంత ఆదా చేస్తున్నారు ?"

"సరిగా జ్ఞాపకం లేదు. లక్షలకు లక్షలాదా చేస్తున్నారనుకో !"

"లక్షలు కనక ఆదా చేస్తున్నారు. పోనివ్వండి. పిల్లలు గోలపెడుతుంటే రెండు రూపాయలకి టపాకాయలు పట్టుకు రావటానికి సంపాదకీయమల్లే మాట్లాడతారేమిటి ?"

"నేర్చావులే ! ఇంటికి పత్రిక రావటం పొరపాటయింది !"

"పోనీ పత్రిక మానేద్దురు గాన్లెండి."

"బాగా చెప్పావు !"

"పోనీ మానకండి. మా ఖర్చు తగ్గించమంటే మీకు నచ్చిందా? వాళ్ళ ఖర్చు తగ్గిస్తే వాళ్ళ కెట్లా ఉంటుంది?"

"అవసర ఖర్చూ, అనవసర ఖర్చూ లేదుటే?"

"వాళ్ళకిది అవసర ఖర్చే."

"అయితే వాళ్ళని పెట్టుకోమను."

# 3

నాన్న లొంగిరాలేదని పిల్లలకి తెలిసింది. అమ్మ పంచమాంగదళంగానూ విదేశాంగ రాయబారిగానూ కూడా పనిచేస్తోంది.

ముగ్గురూ వచ్చి నాన్నని అటకాయించారు.

"మాకు టపాకాయలెందుకు కొనిపెట్టవు, నాన్నా?" అన్నాడు సత్యం.

"వెధవల్లారా, టపాకాయలూ లేదు. గిపాకాయలూ లేదు. ఊరుకోండి."

"ఎందుకు లేదూ?" అన్నాడు సుందరం.

"వొళ్ళు కాలిపోతుంది. గుడ్డలు కాలిపోతాయి. ఏమన్నా తినేటందుకు అమ్మ చేస్తుందిలే," అన్నాడు నాన్న.

"మాకోసమని చేస్తుందా ఏమిటి? నువ్వూ అమ్మా తినటానికి చేసుకుని చిన్న పిల్లలం కనక మాక్కూడా పెడతారు. అది మాకు చాలదు," అన్నాడు సుందరం.

"మాకు టపాకాయలు కావాలి," అన్నాడు శివం, తమ కనీస కోర్కెలను మరింత స్పష్టంగా ప్రకటిస్తూ.

"వచ్చే ఏడు చూదాంలే. ఈయేడు డబ్బులేదు" అన్నాడు నాన్న, మిగులు బడ్జెటుకోసం తాపత్రయ పడుతున్న ఆర్థిక మంత్రిలాగా.

"టపాకాయలు కొనకపోతే మేమూరుకోం!" అని సత్యం అల్టిమేటమ్ ఇచ్చేశాడు.

కార్మికుల సమ్మెవార్త విన్న డిక్టేటరుమాదిరిగా నున్న సత్యంకేసి విచిత్రంగా చూసి, "ఊరుకోక?" అన్నాడు.

"టపాకాయలు కొంటేకొను లేకపోతే మాకు రేపూ ఎల్లుండీ పండుగే వద్దు, మేం తలంటు పోసుకోం, పిండి వంటలు తినం" అన్నాడు సత్యం.

"నువ్వురా?" అన్నాడు నాన్న శివంతో.

"నాకు టపాకాయలు కావాలి" అన్నాడు శివం మితవాద వైఖరిలో.

"నువ్వో?"

"నేను తింటే ఏం, తినకపోతే ఏం?" అన్నాడు సుందరం.

"ఒసే వీళ్ళు బొబ్బట్లు తినరట, చెయ్యకే!" అని కేకేశాడు నాన్న.

శివం సత్యంకేసి దిగులుగా చూశాడు.

"నేను తింటా నాన్నా. నాకు టపాకాయలసలు అక్కర్లేదు" అన్నాడు విప్లవ వీరుడు సుందరం.

"ఇంకెవరన్నా ఉన్నారా బొబ్బట్లు కావలసినవాళ్ళు?" అన్నాడు.

"బొబ్బట్లు నాక్కూడా కావాలి" అని గట్టిగా అని "టపాకాయలు కూడా కావాలి" అని చేర్చాడు శివం, అనుమానానికి తావులేకుండా.

"టపాకాయలు లేవని ముందే చెప్పాగా? బొబ్బట్లు నీక్కావాలన్న మాట? అక్కర్లేందది నీ కొక్కడికేనుట్రా సత్యం?"

సత్యం ముఖం ఎర్రబడింది. తన తమ్ముల ఎదుట తనకి తీరని అవమానం జరిగింది. అటువంటివాళ్ళను వెనక వేసుకురావటంకన్న చావే మేలనిపించింది సత్యానికి. తన వెనక లేని ప్రజలకు నాయకత్వం వహించి రాజకీయవేత్తలాగా బాధపడ్డాడు సత్యం.

"ఇక పదండి" అన్నాడు నాన్న, సమావేశం ముగించే అధ్యక్షుడల్లే.

# 4

నలుగురు మనుషులు గట్టిగా మాట్లాడుచున్న గోలకి పిల్లలు ముగ్గురూ నిద్రలేచారు. ఇల్లంతా దీపాలు వెలుగుతున్నాయి. వంటింట్లో పొయ్యిలు జయ్యిమని మండుతున్నాయి.

ముద్రణ : అక్టోబరు, 1948, ఆంధ్రపత్రిక

# చిన్నతనపు పెళ్ళి

పదమూడేళ్ళ కృష్ణారావుకు పదకొండేళ్ళ రుక్మిణినిచ్చి పెళ్ళిచేశారు. ముసలమ్మ ప్రోద్బలంవల్ల ఆ పెళ్ళి జరిగింది. ఆవిడకు కృష్ణారావు కూతురి కొడుకు, రుక్మిణి కొడుకు కూతురు. కొడుకుకూ ఆవిడకు పడదు. అందుచేత ఆవిడ అల్లుడి దగ్గరే ఉండేది. కాని ఆవిడకు రుక్మిణి మీద ఆపేక్ష. అందుచేత రుక్మిణి గొంతు ఈ విధంగా కొయ్యదలచింది ముసలమ్మ. కొందరి ఆపేక్షలు అంత ప్రమాదకరంగా ఉంటై.

ముసలమ్మకి తప్ప ఈ పెళ్ళి ఇంకెవరికీ ఇష్టంలేదు— రుక్మిణి తండ్రికి కూడా. రుక్మిణిని ఇతరత్రా ఇస్తే కట్నాలూ కానుకలూ ఇవ్వాలి. ఆయన దగ్గిర విశేషం డబ్బులేదు.

ఇంతటితో నా దరిద్రం తీరుతుందా ? ఇంకా ఇద్దరు ఆడపిల్లలున్నారు. వాళ్ళ పెళ్ళిళ్ళు చెయ్యటం తప్పుతుందా ?" అన్నాడాయన.

అందరూ తనను ఎందుకు ప్రతిఘటించుతున్నారో ముసలమ్మకు అర్థం కాలేదు; తన చిన్నతనంలో ఆ పెళ్ళికి అందరూ ఆమోదించి ఉండేవాళ్ళు.

ముసలమ్మకు అంత మొండితనం దేనికో ఎవరూ అర్థం చేసుకోలేక పోయినారు. కాలధర్మం మారుతున్నది మరి.

పదుగురాడుమాట పాటియై ధర జెల్లు నన్నది నిజమే. కాని మొండివాడు రాజుకన్న బలవంతుడనేదీ నిజమే. లోకంలో అచ్చమైన నిజమూ అచ్చమైన అబద్ధమూ లేదు. ఒకదానికంటె ఒకటి నిజం. ఒకదానికంటె ఒకటి అబద్ధం.

ముసలమ్మ పంతమే నెగ్గింది. ఆవిడ ఇన్నిమాటల మనిషికాదు. "నువ్వు ఈ పెళ్ళికి ఒప్పుకోకపోతే నేను బావిలో దూకుతాను!" అన్నదావిడ అల్లుడితో. అల్లుడు అత్తగారిమాట నమ్మలేదు— ఆవిడ నిజంగా దూకి చూపించే వరకూ.

కొన ఊపిరితో ఉన్న ముసలమ్మను బావిలోనుంచి పైకి లాగారు. స్మృతి తెలియగానే ఆవిడ అల్లుణ్ణి అడిగిన ప్రశ్న : "ఇప్పుడైనా పెళ్ళికి ఒప్పుకుంటావా ?"

ఇంట తిని ఇంత చేసిన ముసలమ్మ సాహసానికీ కృతఘ్నతకూ మండిపడి అల్లుడు ససేమిరా అన్నాడు. అంతమంది చూస్తుండగానే ముసలమ్మ అమాంతం లేచి మళ్ళీ బావిలో పడ్డది! ఆ రోజు సాయంకాలమే పెళ్ళి స్థిరమయింది.

పెళ్ళి సదస్యంనాడు ముసలమ్మ తులసికోటకు ఎదురుగా కూర్చుని నిశ్చలంగా ప్రాణం విడిచింది. "బతికి ఎంత ఏడిపించింది ?" అన్నారు దగ్గిర బంధువులు.

"ఎంత కుచ్చితపు ముండకు ఎటువంటి చావు !" అని దూరపు బంధువులు ఆశ్చర్య పడ్డారు.

ముసలమ్మ చావు కాకపోయినా, పెళ్ళి రక్తికట్టలేదు. ఊరేగింపుకు పోయి నప్పుడల్లా ఊళ్ళో వాళ్ళంతా పెళ్ళికొడుకును చూచి నవ్వటం. పెళ్ళి అయిదు రోజులూ రుక్మిణి తల్లి ఒకటే ఏడుపు, అఘాయిత్యంగా. "ఊరుకోవమ్మా పచ్చ పచ్చగా పెళ్ళి జరుగుతుంటే ఎందుకా ఏడుపు ?" అని నలుగురూ మందలించారు.

"ఏం పచ్చ ? పసుపుపచ్చా ? ఆకుపచ్చా ?" అని అడిగారు ఒకరు. పెళ్ళి వేళాకోళంగా తయారయింది.

పదహారు రోజుల పండుగనాడు రుక్మిణి రజస్వల అయింది. అసలే గుండె పగిలి ఉన్న రుక్మిణి తల్లి ఎదట "గర్భాదానానికి అప్పుడే తొందర లేదులే. ఇంకా చిన్నపిల్లేగా !" అన్నారెవరో. గర్భాదాన మనేమాట తలుచుకుంటేనే ఆవిడగారి గుండె అవిసిపోతున్నది ! ఇంక ఆరు నెలలకు తనను అంతా అడగటం మొదలు పెడతారు—

"ఏవమ్మా ? పిల్లకింకా అవుపోసనకార్యం చెయ్యలేదుగా ?.... అయినా ఏదీ? పన్నెండోయేడేగా ! వచ్చే సంవత్సరం ఈనాటికి". "పోనీ పిల్లదాన్ని అత్త వారింటికి పంపెయ్యక పోయినారూ ? ఎదిగిన పిల్ల పుట్టింటిదగ్గిర ఎంతకాలం ఉంటుంది?.... ఇంకా రెండు మూడు నెల్లలో మించిపొయ్యేదేమీ లేదనుకో !" అని అంటారు : ఆ తరువాత మిన్ను విరిగి మీదపడేటట్టు ! తరవాత మరో ఆరునెలలు గడవనిచ్చి "పిల్లకేమైనా పిల్లలా, అమ్మా ?" అని ప్రారంభిస్తారు— తెలిసి కూడా! రుక్మిణి తల్లికి ఇదంతా బాగా తెలుసును.

కాని అందరికన్నా ఎక్కువ బాధపడుతూ ఉండినవాడు కృష్ణారావు. వాడి గొడవ ఎవరూ విచారించలేదు. పెళ్ళి స్థిరమైన మరుక్షణం నుంచీ తనవంక తనవాళ్ళే విచిత్రంగా చూడటం గమనించాడు వాడు. పెళ్ళి జరిగేటప్పుడు తన అత్తగారు కంటికీ మంటికీ ఏకధారగా ఏడవటమూ, ఊరేగేటప్పుడు అందరూ పల్లకి దగ్గిరికివచ్చి తననూ తన పెళ్ళాన్నీ ఎగాదిగా చూడటమూ మొదలైనవి చూశాడు. తరవాత కొంత ప్రయత్నంతో వీటన్నిటికీ కారణం కనుక్కున్నాడు - తనకు తన ఈడుకు మించిన పెళ్ళాం !

అయితే బాధ ఏమో వాడికి అర్థంకాలేదు. కాని తనకు తెలియకుండా ఏదో ఇబ్బంది ఉండి ఉంటుందనీ, అది తెలుసుకునేటంత ఈడు తనకులేదనీ అనుకున్నాడు కృష్ణారావు.

"వాడు అర్భకుడు !" అనేది తన తల్లి. "అది రేపిపాటికి కాపరానికివచ్చి కూచుంటుంది."

ఆ మాటలో ఉండే అంతరార్థం తెలుసుకోవటానికి ఎంత ప్రయత్నించినా కృష్ణారావువల్లకాలేదు. తనకు తెలియని ఈ పరమరహస్యం ఒకవేళ రుక్మిణికి తెలు

సేమో ! అది అప్రయోజకపు మొగుడు దొరికాడనుకుంటున్నదేమో !

ఒకప్పుడు తనంటే దానికి చాలా ఆపేక్షే. ఇప్పుడు దాన్ని తనతో మాట్లాడ నిస్తే ఏమైనా చెప్పును. పెళ్ళిలోనే ఒకటి రెండుసార్లు తను రుక్మిణిని పలకరించ బోతే రెండుసార్లూ ఏదో అభాసు జరిగింది. ఒకసారి పక్కన ఉన్న వాళ్ళెవరో నవ్వి "పాపం, అ అబ్బాయికేం తెలుస్తుందీ ?" అన్నారు. ఆ ముక్క తనకు అర్థం కాలేదు అసలు ఈ మాయ పెళ్ళి ఎప్పుడనుకున్నారో, ఆ క్షణం నించీ తనకు ఎవరేమన్నా. అర్థం కావటంలేదు—వాళ్ళనే మాటలు అర్థమైనా భావం అర్థంకాదు. చక్కగ పెద్ద వాళ్ళకు అన్నీ అర్థమవుతైగామాలు !

పెద్దవాళ్ళంతా తనమీద కట్టుకటినట్టు తోచింది కృష్ణారావు బుద్ధికి.

ఇంకొకసారి తను రుక్మిణిని పలకరించినప్పుడు, ఎక్కణ్ణించి చూసిందో తన అత్తగారు చూసి గొల్లున ఏడిచింది. చాతకాని వైద్యుడల్లే — పిడుగుకూ బియ్యానికీ ఒకటే మంత్రమన్నట్టు—ఆవిడ ప్రతిదానికీ గొల్లున అఘాయిత్యంగా ఏడవటం ఒకటి నేర్చుకున్నది. ఆవిడ పాపిష్టి ఏడుపు మూలకంగా చాలామందికి కోపాలు వచ్చినై. ఆవిడ లక్ష్యం చెయ్యలేదు.

కొంతకాలం మధనపడి ఆ తర్వాత క్రమంగా తన అస్పష్ట సమస్యను సంపూర్ణంగా మరిచిపోయినాడు కృష్ణారావు. స్పష్టమైన సమస్యలను గురించే మనో వ్యాధి పడే వయసుకాదు పాపం, వాడిది.

కాని ఆ మనశ్శాంతి ఎన్నోరోజు లుండలేదు. పదహారో రోజు పండగ వచ్చింది. రుక్మిణి రజస్వలా అయింది. పాత పుండు రేగి, ఎప్పటికన్నా పెద్దవ్రణం అయికూర్చున్నది. మళ్ళీ అత్తగారి శోకాలూ, అందరూ తనవంక విచిత్రంగా చూడ టాలు ప్రారంభమయినై.

దీని అంతేమిటో ఇక తేల్చవలసిందే ననుకున్నాడు కృష్ణారావు—ఎవరినన్నా అడిగి అయినా సరే ఇంకొకరిని అడిగే లోపల తనకు ఈ రహస్యమేమిటో తెలియ దని తేల్చుకుంటే బాగుంటుందని తోచింది వాడికి.

భార్యా భర్తలు కాపరాలు చెయ్యడం తను చూశాడు. భార్యలు వంట చేస్తారు. ఇంటిపని చేస్తారు. మొగుళ్ళు వస్తే లేచి నిలబడతారు. భర్తలు ఇంట్లో ఏమైనా కావలిస్తే తెస్తారు. ఎంత ఆలోచించినా ఇంతకంటె విశేషం ఏమీ కని పించలేదు కృష్ణారావుకు. ఈ భాగ్యానికే పెద్దవాళ్ళంతా తనవంక అంత విచి త్రంగా చూస్తున్నారా ? తన అత్తగారు ఇంతమాత్రానికే అట్లా రాగాలు పెట్టి ఏడు స్తుందా ! అసలు కిటుకేమిటో తనకు తెలియలేదనుకున్నాడు కృష్ణారావు.

ఈ పెద్దవాళ్ళను చూస్తే వాడికి మండిపోయింది. వీళ్ళు తన చుట్టూ ఒక వ్యూహంపన్ని, "దీంటోనించి వీడు ఎట్లా బయటపడతాడో చూతాం !" అని నిర్దయతో ఎడంగా నిలబడి చూస్తున్న వాళ్ళల్లే కనిపిస్తున్నారు. తనకు ఏ రహస్యం తెలియదని వీళ్ళంతా అనుకుంటున్నారో ఆ రహస్యం ఈ మహా తెలిసిన

వాళ్ళు తనకు చెప్పెయ్యకూడదూ? ఏమిటీ ముసుగులో గుద్దులాటా? ఇంతలో తనకు అగ్నిపరీక్ష దేనికో?

కృష్ణారావు తన మీద ఏదో బాధ్యత ఉందనీ అదేమిటో తను ఎట్లాగైనా తెలుసుకోవలసిందే కాని ఎవరూ చెప్పరనీ నిశ్చయం చేసుకున్నాడు. అంత చెప్పనివాళ్ళు తను అడిగితే చెబుతారా? అయినా ఎవరినో ఒకరిని అడగటం తప్పలేదనుకున్నాడు వాడు. కాని ఎవరిని అడగటం? అది తేలనేలేదు- రోజులూ, వారాలూ, నెలలూ గడిచినై!

"పిల్లవాడు దిగనాసిల్లి పోతున్నాడు!" అంది తల్లి.

"ఏమి దిగనాసిల్లి పోవటంలేదు. మీ అమ్మ వాడికి ఈ శ్రాద్ధయోగ్యపు పెళ్ళి చేసిందికదా అని చరచరా ఎదుక్కురావటం లేదు! ఆ మాట అను." అన్నాడు తండ్రి.

మర్నాటినించీ పిల్లవాడికి మూడుపూటలా ఇంత పెరుగూ వెన్నపూసవేసి భోజనంపెట్టీ, మళ్ళీ మధ్యాహ్నం వేళ కుడుములూ గడ్డలూ చేసిపెట్టీ తల్లి కృష్ణారావును బాగా మేపటం మొదలు పెట్టింది. తల్లి ప్రాణం కదా!

అయితే మొదటినుంచీ వాడిది పిట్టమేత కావటంచేతను ఈ తిండి యావత్తూ వాడికి విషమయింది. పిల్లవాడికి కడుపునొప్పీ అజీర్తీ ప్రారంభమయినై.

కృష్ణారావు తండ్రి భార్యను గట్టిగా కేకలు వేశాడు. "వాణ్ణి నిష్కారణంగా చంపుతావా ఏమిటి? అంతా నీ చేతుల్లోనే ఉందని నీ యభిప్రాయం? అవకతవక పనులన్నీ చేసేటప్పుడు వేదాంతం చెబుతావే! అప్పుడీ నమ్మకం ఉండదేం?" అని ఆయన భార్యమీద తనకుగల పాతకోపం కూడా ఇప్పుడే కొంత తీర్చుకున్నాడు....

రుక్మిణి రజస్వల అయి మూడోసంవత్సరం నడుస్తున్నది. కృష్ణారావు తల్లిదండ్రులకు నలుగురి మూలకంగానూ బాగా వేడి తగలటం మొదలు పెట్టింది.

"ఏమిట్రా కోడలిని ఇంకా ఎంతకాలం పుట్టింటో ఉంచుతారు? భావ్యమా? నలుగురూ ఏమనుకుంటారు? ఆ కాస్త అడ్డంకీ తొలిగించెయ్యండి! ఆ తరవాత అది సంవత్సరానికి పదకొండు నెలలూ పుట్టింటో ఉన్నా తొందర లేదు. పిల్లవాడికి కూడా పదహారోయేడు వచ్చిందాయెను!" అంటూ సాగించారు అందరూ.

కృష్ణారావు తండ్రి వియ్యంకుడితో ఈ మాట అంటే ఆయన, "ఎవరో అన్నారని భయపడతామటయ్యా, బావా? నువ్వూ అర్థం చేసుకోగలిగితే ఎవరేమనుకుంటే ఏం? మా పిల్లకు ఇంకో సంవత్సరందాకా తొందరలేదులే! ఏదీ దానికింకా పధ్నాలుగో ఏడేగా?" అన్నాడు.

మళ్ళీ కృష్ణారావు ప్రాణం మీదికి వచ్చిపడ్డది. ఈ సంవత్సరం లోపల

ఈ రహస్యం ఏమిటో తెలుసుకుని తీరాలనుకున్నాడు వాడు. ఇది తెలుసుకోవ టానికి సంవత్సరమైనా తప్పక పట్టేటట్టు కనిపించింది.

మళ్ళీ వెనుకటి ప్రశ్నే - ఎవరి నడగాలి? వాళ్ళింటో నీళ్ళుపోసే వితంతువు ఒకావిడ ఉంది. పంచప్రాణాలు బిగబట్టి కృష్ణారావు ఆమె నడిగాడు. "ఏమమ్మా? కార్యంనాడు ఏంచేస్తారు?" అని. ఆవిడ కృష్ణారావును ఛెడామడా తిట్టి మీదపడి కొట్టడానికి సిద్ధపడ్డది. ఆవిడకు కృష్ణారావు వైవాహికస్థితి ఏమీ తెలియదు.

ఆ దెబ్బతో కృష్ణారావు బెదిరిపోయినాడు. కాని మళ్ళీ నెలరోజులయిన తరవాత ఆ ప్రశ్నే ఇంకోవిధంగా వాళ్ళింటో పనిచేసేదాన్ని వేశాడు.

ఆ ముండకు[1] నలభై దాటినై. కాని కుర్రవాళ్ళు వాంఛించుతారనే భ్రమ దానికి పోలేదు. అందుచేత అది తోముతున్న గిన్నె అక్కడే వదలిపెట్టి పోయి, "చూడండి అమ్మగారు? అబ్బాయిగారు నన్ను ఏమంటున్నారోనూ? ఇంత కుర్ర వాడికి ఇప్పుడే ఇవేం బుద్ధులు?" అని రిపోర్టు చేసింది. కృష్ణారావు తల్లి దాన్ని ఎట్లాగో సమాధానపరిచి పంపించింది!

ఈ సంఘటన రకరకాలుగా దేశమంతటా వ్యాపించింది. ఎవరో వచ్చి రుక్మిణి తల్లిదండ్రులతో "మీ అల్లుడు ముండల్నీ ముతకల్నీ మరిగి ఇష్టం వచ్చి నట్టు తిరుగుతున్నాడు. మొన్న ఎంత పెద్ద ఆగం అయిందో విన్నారా!" అని ఏదో ఒక కథ చెప్పారు—వినేవాళ్ళ గుండె పగిలేటట్టు.

రుక్మిణి తండ్రి ఆదరా బాదరా పరుగెత్తుకుని వచ్చి బావగారితో మాట్లాడి శోభోసన కార్యానికి ముహూర్తం పెట్టుకుని వెళ్ళాడు.

ఈ లోపల కృష్ణారావు అవస్థ సరిగా అర్థం చేసుకున్న మనిషి ఒకడు తేలాడు. ఆయన వాళ్ళ బంధువర్గంలో వాడే, పెద్దవాడు. ఆయన ఒకనాడు కృష్ణారావుని ఒంటరిగా పిలిచి ఒక పావుగంటసేపు విశదంగా మాట్లాడాడు. కృష్ణారావు అంతసేపు మౌనంగా విన్నాడు. ఆ తరువాత ఇంటికి వచ్చేశాడు. వాడు మళ్ళీ ఆయనతో ఆయన

---

1. 1942 కు మునుపు రాసిన ఈ కథలోనూ, 'పనివాళ్ళు' (వినోదిని, సెప్టెంబరు 1935) కథలోనూ పని మనుషుల్ని అలగా మనుషులుగా చూసే ఫ్యూడల్ సంస్కారమే కథకుడి టోన్‌లో, చిత్రణలో, ప్రయోజ నంలో కనిపిస్తుంది. 1942 లో మార్క్సిజంతో పరిచయం అయ్యాక ఆయన సంస్కారంలో కలిగిన మార్పు మూలంగా, తర్వాత రాసిన "దాలిగుంటలో కుక్కలు, (? 1954) మహాయిల్లాలు, (1947) వంట మనిషి, (?) మనుషులకు గల స్వేచ్ఛ" (1978) అనే కథల్లోనూ (యీ కథ లన్నిటి ముద్రణ తారీఖులు యింకా లభ్యం కాకపోయినా ప్రచుర ణను బట్టి 1942 తర్వాతివిగానే భావించవలసి వుంది), 'ప్రేమించిన మనిషి' నవలలోనూ ఫ్యూడల్ సంస్కారాన్ని ఆయన హేళన చేశారు.

బతికి ఉండగా మాట్లాడి ఎరగడు. ఆయన మొహం చూడటానికే వాడికి సిగ్గుగా తోచేది. ఆయనా వాణ్ణి ఎన్నడూ పలకరించలేదు మళ్ళా !....

ఔపోసన కార్యంనాడు రాత్రి రుక్మిణి గదిలోకి వెళ్ళటానికి ఎంతో అల్లరి చేసింది. ఆ పిల్ల బెదురుచూసి వెనక ఏడిచిన తల్లిదగ్గిరనించీ అంతా నవ్వారు. పది మంది ముత్తయిదువులుపట్టి దాన్ని గదిలోకి తొయ్యవలసి వచ్చింది. లోపలికి వచ్చి ఆ అమాయకురాలు కృష్ణారావుకు ఎదురుగా వణుకుతూ నిలబడ్డది !....

ముద్రణ : ?

ప్రచురణ : యువ కథావళి సంపుటిలో,

యువ కార్యాలయం : తెనాలి, ఆగస్టు 1938

# పెంకెపిల్ల

"...."పెంకెపిల్ల" అనే కథలో కొసకు ఒక ప్రశ్న వేశాను. ఆ అనుమానం నాది కాదు."

(కారుణ్యం కథలకు ముందుమాట "నా కథలు" నుంచి)

రామనాథంగారు నాకు మామగారు కాబోతారని ఎరగకుండా వారింట్లో తూర్పువైపు గదిలో అద్దెకుంటూ ఎనిమిదేళ్ళు చదువుకున్నాను. నా హైస్కూలు చదువంతా వారింట్లోనే వెళ్ళిపోయింది. మా పల్లెటూళ్ళో వీధిబడి చదువు పూర్తిచేసి నేను ఎనిమిదో ఏటనే ఇంగ్లీషు చదువు కోసమై బస్తీకి రావలసి వచ్చింది. మా నాన్నకు ఇంగ్లీషు చదువంటే ఇష్టమే కాని బస్తీ జీవనం ఇష్టంలేదు. అందుకని ఆయన మా అమ్మతో కూడా నావెంట రాలేదు. అంత చిన్న వయస్సునుంచీ నేను హోటల్లోనే తింటూ శని ఆదివారాలు వచ్చినప్పుడు మాత్రం మా వూరు పోతూ కాలం వెళ్ళబుచ్చాను. మా అమ్మ కూడా పిల్లల విషయమై లేనిపోని ఆరాటాలు పెట్టుకొని తను గోలపడి ఇతరులను కంగారు పెట్టే రకం కాదు.

మా మామగారి చిన్న కూతురు రుక్మిణి అమిత పెంకెపిల్ల. పెంకెతనం కనీసం రెండు రకాలు—చూసేవాళ్ళకు కోపం తెప్పించే రకం ఒకటీ. చూడముచ్చటగా ఉండేది మరొకటీ. కొంతమంది మా అత్తమామల మాదిరిగా ఏ రకమైనా పెంకెతనం సహించలేరు. రుక్మిణి చేసే అల్లరి నాకు చాలా ముచ్చటగా ఉండేది. ఆమె తలిదండ్రులకు తలనెప్పిగా ఉండేది. కొందరు పిల్లలు సహజంగా ఏడుపుగొట్టువాళ్ళయి ఉండి చేస్తున్న పని తప్పని తెలిసి చేస్తున్నట్టు చాటుమాటున అల్లరి చేస్తారు. వాళ్ళని చావగొట్ట బుద్ధవుతుంది. రుక్మిణి తన పెంకెతనం తనే ఆనందించగలది. ఆ పిల్ల లోపల పొంగుతూ ఉన్న జీవశక్తిని ఆపుకోలేక దాన్ని అల్లరిరూపంగా విడుదల చేస్తున్నట్టుండేది. ఆ పిల్ల పెంకెతనం అనారోగ్యంతో కూడుకున్నది కాదని నా తాత్పర్యం.

రుక్మిణి సాక్షాత్తూ నా కళ్ళ ఎదుట పెరిగిందన్నమాట. నేను వారింట్లో ప్రవేశించే రోజుకు రుక్మిణి మూడు నాలుగు నెలల పిల్ల. అందుచేత నేను కాలేజీలో ప్రవేశించే వరకూ తల్లిదండ్రులను ఆ పిల్ల ఎంత బాగా ఎరుగునో నన్నూ అంత బాగా ఎరుగును. రామనాథంగారు మొదట మొదట ఆ పిల్లచేత అల్లరి చేయించటానికి నాకు కావలసినంత స్వతంత్రం ఇచ్చాడు. రుక్మిణి నా ఆసరా చూసుకుని తల్లిదండ్రులకు కూడా ఎదురు తిరిగి అల్లరి చేస్తుండేది.

రామనాథంగా రెప్పుడైనా నాతో, "దానికి నువ్వట్లా అలుసివ్వకు నాయనా. అది మరీ మితిమీరి పోతున్నది" అంటే నేను "పోనివ్వండి! మీ పెద్దమ్మాయల్లే మత్తాగా ఉంటేమాత్రం ఏం బాగుంటుంది?" అని ఆయన్ను సర్దేవాణ్ని.

రుక్మిణికి స్వేచ్ఛవల్ల కలిగిన లాభం ఏమిటంటే చురుకుతనం. ఆ పిల్ల పైకి చూడటానికి ఎంత చలాకీగా, ఆరోగ్యంగా ఉండేదో అంత చురుకైన బుర్ర కూడా సంపాదించింది. ఆ పిల్ల మగపిల్లలతోపాటు చెట్లూ చామలూ ఎక్కటమూ, చెడుగుడూ, కోతికొమ్మచ్చూ ఆడటమూ మొదలైన పనులన్నీ చేసేది. తోడి పిల్లలు ఎవరైనా తనకు తీరని అన్యాయం చేసినట్లు తోస్తే వేరే ఆలోచన యేమీ లేకుండా చెంపమీద లాగి ఒకటి పెట్టేది. పాఠాలు చదివేది కాదు. ఆ పిల్లచేత పాఠం చదివించటం మా ఎవరిచేతా కాలేదు. కాని తన అక్క చదివే పాఠాలన్నీ విని వప్పగించేది. అప్పుడప్పుడు అక్క చదువులో తప్పులుపట్టి మేష్టరుతనం కూడా సాగించేది. ఆ ఎనిమిది సంవత్సరాల కాలంలోనూ ఆ పిల్ల అసహాయత వల్ల ఒక్కసారయినా ఏడిచినట్టు నాకు జ్ఞాపకంలేదు. రుక్మిణితో ఆడుకునే పిల్లల్లో ఎవరో ఒకరు రోజూ ఆమెమీద ఏదో చాడీ తెచ్చేవాళ్ళు. రామనాథంగారికీ, ఆయన భార్యకూ మొహమాటం జాస్తి. ఎవరు తమ పిల్లమీద చాడీతెచ్చినా తాము పిల్లను మందలించి తీరాలనే. రుక్మిణి నిష్కారణంగా వెళ్ళి ఇంకొకరిని గిల్లిరాదని నాకు బాగా తెలుసును. అందుకని ఆ పిల్ల తల్లిదండ్రులచేత తిట్లూ దెబ్బలూ తినటం ఒకటి రెండు సార్లు చూసి నేను సహించలేక పోయినాను. ఎవరైనా చాడీలు చెప్పితే నేను కేసు విచారణచేసి రుక్మిణివల్ల తప్పులేదని నిర్ధారణచేసి ఫిర్యాదు చేసిన పిల్లలను పంపేసే వాణ్ని.

ఒక్క విషయంలో మాత్రం నేను రుక్మిణితోపాటు అపరాధినయినాను. చాలా చిన్నతనంలో రుక్మిణికి ఏ విధమైన మనఃక్లేశం కలిగినా దాన్ని పోగొట్టే మిషమీద ముద్దుపెట్టుకోవటం ఒకటి అలవాటు చేశాను. రుక్మిణి ఏదో వంకపెట్టి నాచేత ముద్దుపెట్టించుకునేది. అయిదేళ్ళ రుక్మిణిని నేను ముద్దుపెట్టుకోవటం ఎవరికీ ఎబ్బెట్టుగా తోచలేదు కాని ఎనిమిదేళ్ళ రుక్మిణిని నేను ముద్దుపెట్టుకుంటుం డంగా చూసిన ఒక పెద్దమనిషి— రామనాధంగారి బంధువు, చుట్టపు చూపుగా వచ్చాడు— తను చాలా కంగారు పడటమే కాకుండా రామనాధంగారితో కూడా అన్నాడు. మరొకరు అన్న మీదట రామనాధంగారికి ఆ పని ఆటే మంచిదికాదని తోచినట్లుంది. ఆయన నాతో అనటానికి చాతకాక రుక్మిణిని చాటుగా చివాట్లు పెట్టాడు. "ఏమిటది? అట్లా అతని వొళ్ళోకెళ్ళి కూర్చుని ముద్దుపెట్టుకోనిస్తే ఎవరన్నా ఏమనుకుంటాడు? ఎనిమిదేళ్ళు వచ్చి ఎద్దల్లే!" అని.

రుక్మిణి సహజంగా తండ్రిమీద తిరగబడి పోట్లాడటమేకాక, ఆయన గోప్యంగా మాట్లాడబోతే తను ఇల్లంతా చిందులుతొక్కి పెద్దపెట్టున అరవటమే గాక, నాతో మానాన్న ఇట్లా అన్నాడని కూడా చెప్పేసింది. నాతో రుక్మిణి ఇదంతా

చెప్పిందని తెలిసేన తరువాత నేను తెలియనట్టు నటించితే నన్ను చూసినప్పుడల్లా ఆయన ప్రాణం చచ్చినట్టుండేదేమోనని, "ఇక రుక్మిణి నాతో అంత చనువుగా ఉండనట్టు చూస్తానులెండి. ఇంకా రెండు నెల్లు ఆ తరవాత మీదయ ఉంటే ఈ మెట్టు దాటి కాలేజీ ఉండనే ఉంది.... అయినా నేను రుక్మిణిని చిన్నపిల్లగదా అని ఎప్పుడూ ముద్దుపెట్టుకుంటూనే ఉన్నాను. ఏ తారీకునించీ మాని ఉండవలసిందో నాకు ఇప్పటికీ తెలియకుండా ఉంది!" అని కాస్త అంటించాను.

ఆయన, "అఁ! దానికింత రాద్ధాంతం ఏమిటి ? మా చుట్టం తప్పుపట్టాడని అందరి ఎదటా ఎందుకట్లా మగవాళ్ళమీదికి ఎగబాకుతా వన్నాను. కాని మరేం లేదు. నాయనా! నువ్వంటే సరేననుకో! మరొకరౌతారు!...." అని తన్ను సమర్థించుకోజూశాడు.

నేను కాలేజీలో ప్రవేశించిన తరువాత చాల రోజులు రుక్మిణి దగ్గిరలేని వెల్తి కనపడ్డది. ఆ పిల్లకోసం నేను బెంగపడ్డాను కూడానూ. మొదట్లో దాదాపు ప్రతి రోజూ కల్లో కనిపించేది. నాకా పిల్లమీద ఎంత మమకారం ఉందో దూరం వెళ్ళిన తరవాతగాని తెలియలేదు. వారం పదిరోజులు శలవులకు కూడా నేను ఇంటికి వెళ్ళేవాణ్ణి ఆ సంవత్సరం. దారిలో కాబోయే మామగారింట్లో ఒక రోజు ఉండే మరీ మా గ్రామం వెళ్ళేవాణ్ణి. రుక్మిణి వెనుక జరిగిన చిన్నఘర్షణ మర్చిపోక నేను వాళ్ళింటికి వెళ్ళినప్పుడల్లా నన్ను పట్టుకునే వేళ్ళాడేది, నా ఒళ్ళో కూర్చోనే కూర్చునేది. నన్ను అడిగి ముద్దుపెట్టించుకునేది.

అంత పట్టుదల పిల్లను నే నెక్కడా చూడలేదు!

ఆ చలికాలపు శలవుల్లో మా నాన్న నా పెళ్ళిని గురించి ప్రస్తావిస్తూ, "రామనాధంగారికి వాళ్ళమ్మాయిని నీకివ్వాలని ఉంది. నన్నడిగాడు, నీకేమైనా అభ్యంతరం ఉందా ?" అన్నాడు.

నాకా వార్త చాలా తృప్తికరమయింది. అంతకాలం వారింట్లో ఉండి వారి కుటుంబం వదిలిపెట్టగానే కలిసిన బంధుత్వం బలవంతంగా తెగకోసుకున్నట్టని పించింది. తరవాత ఒకటీ అరా రోజు వారింట్లో గడపబోతే అది పరాయి యిల్లే అనిపించింది. కాని వెనకటి మాదిరిగా లేదు. ఏమాత్రమైనా నాకు వెనకటి రోజులు ఇంకా అయిపోలే దనిపిస్తే దానికి రుక్మిణి ఒకత్తే కారణం.

"నాకేమీ అభ్యంతరంలేదు, నాన్నా !" అన్నాను. నా ఉత్సాహం గమనించి మా నాన్న వెంటనే రామనాధంగారి సంబంధం ఖాయం చేసుకున్నాడు. వచ్చే వేసవిలో పెళ్ళి అనుకున్నారు.

నాకు ఒకటే సంతోషం, రుక్మిణి నాకు మరదలు అయిపోతుంది. పెళ్ళి అయితే మా యిద్దరి చుట్టరికమూ ఖాయం అయిపోతుంది. తరవాత ఎవరూ దాన్ని మార్చలేరు.

బావా మరదలు బాంధవ్యంకంటె దగ్గిర బాంధవ్యం మా కిద్దరికీ కలగటానికి అవకాశం వుందని కాని, నేను దాన్ని ఎప్పటికైనా వాంఛించ బోతానని కాని నేను అప్పట్లో ఏ మాత్రము అనుమాన పడలేదు కద !

నేను మళ్ళీ రామనాథంగారింట్లో అడుగు పెట్టటం స్నాతకం చేసుకున్న పెళ్ళికొడుకునుగా.

మా మామగారి తరపు పెద్దమనిషి మా విడిదికి వచ్చి, "అయ్యో ! ఇంకా ఇట్లాగే కూర్చున్నారేం ? ముహూర్తానికి మళ్ళీ వ్యవధానం ఉండదు లేవండి !" అని ఉచితరీతి ఏదైతే వుందో ఆ రీతిగా మమ్మల్ని కదలదీశాడు. నేను ఆ పెళ్ళివారి వసారాలో అడుగు పెట్టేటప్పటికి లోపల్నించి రుక్మిణి బయటికి వచ్చి నన్ను చూసి క్షణమాత్రం అట్లా ఆగింది.

ఆ దృశ్యం నేనెన్నటికీ మరవలేను. తలంటి పోసుకున్న జుట్టు ఆరటానికి విరబోసుకుని, మొహాన కళ్యాణంబొట్టు పెట్టుకుని, బుగ్గన చిన్న కాటుక చుక్క పెట్టుకుని, కాళ్ళకు పసుపూ పారాణీ పెట్టుకుని, కొత్తచొక్కా పరికిణా కట్టుకొని రుక్మిణి కనిపించేటప్పటికి నాకు మతిపోయింది. ఆ క్షణంలో ఊహించగలిగాను. నాకా పిల్లతో ఎటువంటి బాంధవ్యం కావాలని నా అంతరాత్మ వాంఛించుతున్నదో. రుక్మిణి నన్ను చూసి ఆగిన క్షణమాత్రంలో నా మనస్సులో ఒక ఆశ అట్లా తళుక్కున మెరిసింది. ఏదో ప్రోగ్రాములో మార్పు జరిగి నేను రుక్మిణినే పెళ్ళి చేసుకోబోతున్నానని ! ఆ ఆలోచన మాత్రంచేతనే నా మనసు ఎట్లా స్తంభించిపోయిందో మీరే ఊహించండి - రుక్మిణీ వేసిన వేషం తోడుపెళ్ళికూతురు వేషమని ఆమెను అడగకుండా నా అంతట నేను ఊహించలేక పోయినాను !

ఒక్క క్షణం సేపు తన కళ్ళను నమ్మలేని దానల్లే రుక్మిణి నా వంక అట్లా చూసి ఒక్కపరుగున వచ్చి నా నడుము చుట్టువేసుకుంది....నేను అక్కడ వున్న మనుష్యులను ఎవరినీ లెక్కచేయకుండా రుక్మిణిని ఎత్తుకుని ముద్దు పెట్టుకున్నాను.

ఆ ముద్దు నేను పూర్వం రుక్మిణిని పెట్టుకున్న ముద్దుల జాతిది కాదు. కాని, పాపం, రుక్మిణి ఆ తారతమ్యం గ్రహించగల స్థితిలో లేదు.

నా వివాహం అయిన మరుసటి సంవత్సరమే రుక్మిణి వివాహం జరిగింది. మా మామగారు ఆ పిల్లకు మంచి సంబంధం - పెద్ద కూతురికన్న మంచి సంబంధం - తెచ్చాడని ఆయన బంధువర్గం అభిప్రాయ పడ్డట్టు విన్నాను. రుక్మిణి మొగుడు నాకంటె తప్పకుండా అందమైనవాడు. వస్తుతహ అతనికి నాకు ఉన్నంత ఆస్తి లేక పోయినా అతని బంధువర్గంలో చాలా గొప్ప గొప్ప ఉద్యోగస్తులున్నారు. నాకంటె కాస్త పై గ్రేడు కుటుంబీకుడనే చెప్పాలి.

కాని మా షడ్డకుడు కొన్ని కొన్ని విషయాల్లో అదోరకం మనిషి. దాచాలని ప్రయత్నం చేసేవాడే కాని అతను గర్వి అని అతని ప్రతి పనిలోను అతను ఉచ్చరించే ప్రతి మాటలోనూ స్పష్టంగా స్ఫురిస్తూనే ఉండేదీ, గ్రహించగలవాడికి. అతనికి

ప్రత్యేకంగా దేన్ని గురించీ సుమారుగానైనా తెలిసినట్టు కనబడలేదు. ప్రతిదాన్ని గురించి ఏదో మాట్లాడాలని ప్రయత్నించేవాడే కాని అతని అభిప్రాయాలన్నీ జన సామాన్యం యొక్క అభిప్రాయాలుగానూ, అతని అభిరుచులు కూడా తుమ్మాయి జగ్గాయిగాళ్ళ అభిరుచులుగానూ తేలినై, కాస్త విచారించిన మీదట. అతనికి ఖచ్చితమైన అభిప్రాయాలు లేనేలేవు. అవి ఏ గాలి ఎటుకొట్టితే అటు మళ్ళేవి. అతనిలో నేను గమనించిన మరొక విశేషం ఏమిటంటే, ఎవరితోనైనా ఏ విషయమైనా తర్కించటం జరిగితే అవతలవాడు ఎన్ని కారణాలు చూపించినా వాడితో ఏకీభవించక, వాడి తర్కం మరొకడితో తర్కించేటప్పుడు ఉపయోగించేవాడు. ఆడవాళ్ళ చదువుకోవటం చాల అనర్థం అని నాతో వాదించి నేనెంత చెప్పినా వినక, మర్నాడు నా సమక్షానే ఇంకొకరితో ఆడవాళ్ళ చదువుకు తీరాలని వాదిస్తూ నేను చెప్పిన కారణాలే చెబుతున్నాడు.

అన్నిటికన్నా విచిత్రమైన విషయమేమిటంటే నేను తనను చూసి అసూయ పడుతున్నానని అతనికొక అభిప్రాయం ఎట్లా పడ్డదో పడ్డది. తనకు నామీదగల ఆధిక్యత నా ఎదట మరుగు పరచి నా అసూయను ఉపశమింప చెయ్యటానికి విశ్వప్రయత్నం చేసేవాడు !

నేను అతన్ని చూసి ఒక్కందుకే అసూయ పడ్డాను - అతను రుక్మిణి భర్త అయినందుకు. అందులో అతని ఆధిక్యత నాకేమీ కనిపించలేదు.

ఇంకా కొద్ది రోజులకు కాపరానికి వెళ్ళుతుందనగా రుక్మిణి మా యింటికివచ్చి ఒక వారం రోజులున్నది. ఆ రోజుల్లో ఆమె తన అక్కను బాగా కోప్పడేది ప్రతిదానికీ.

"ఈ కూర ఇట్లా చేశావేం, అక్కయ్యా ! బావకిట్లా సయించదు!.... ప్రతి దానిలోనూ ఇంత కారం వేస్తావేం? బావకు కారం పడదు!.... పూరీ లెందుకు చేస్తున్నావే ? బావకు పూరీలు తినటం అంటే తగనిమంట!.... బావకు ఈ సగ్గు బియ్యపు పరమాన్నం కంటె బియ్యపు పరమాన్నమే ఇష్టంగాదూ ?"

రుక్మిణి అట్లా మాట్లాడుతుంటే నాకు కడుపులో చెయ్యిపెట్టి కలియబెట్టి నట్టుండేది. పిచ్చిపిల్ల! ఆ వారం రోజుల్లోనూ తన అక్కను తన మాదిరిగా చేసి పోదామని !

అప్పటికి కూడా రుక్మిణికి నామీద అభిమానం కాని వెనకటి పెంకెతనం కాని ఒక్కరవ్వయినా పోలేదు. తను వెనకటి మాదిరిగా నన్ను పట్టుకుని ఊగటానికి లేదని కూడా ఆ పిల్లకు అర్థం కాలేదు. నేను జాగ్రత్తగా తప్పించుకుని తిరగకపోతే రుక్మిణి నా భార్య నిష్కారణంగా అనుమాన పడేటట్టు చేసేదే!

రుక్మిణి ఒక విధంగా చాలా దురదృష్టవంతురాలు. అనేక విధములైన అదృష్టాల్లో ఒకటి ఏదంటే మన సుఖం ఎవరెవరి మీద ఆధారపడి ఉంటుందో వారికి మన స్వభావం నచ్చేటట్లు మనలను మనం మార్చుకోగలగటం. రుక్మిణి వంటి మనిషి

ఎవరి కోసమూ మారలేదు. ఆ రకం నేనెరిగినంత వరకు నేనొకణ్ణి తప్ప మరెవరూ ఆమోదించలేదు. రుక్మిణి సుఖం నామీద ఆవగింజంత కూడా ఆధారపడి లేదు.

ఆ పిల్ల తల్లిదండ్రులతో సుఖపడలేదు. భర్తకూడా ఆమెను సుఖపెట్టలేదు. అసలే చపలచిత్తుడు, ఆలోచనా శక్తిగానీ, గ్రహణ శక్తిగాని లేనివాడు. అతనికి భార్య ఏ మాట మాట్లాడినా అనుమానంగానే ఉండేది. తన్ను భార్య చులకన చేస్తున్నదనీ, ఆమెకు పాపభీతిలేదనీ, చాలా "విడిచేసిన మనిషి" అనీ అతనికి భార్యను గురించి అనుమానం కలగటం మొదలు పెట్టింది. అతని అనుమానం నా మీదికి తిరగటానికి ఎంతోకాలం పట్టలేదు. రుక్మిణి తనకు నామీద గల అభిమానం భర్తదగ్గర ఏమాత్రమూ దాచినట్టు కనిపించదు. చివరకు నేను అతన్ని చూసి అసూయపడటం అబద్ధమై, అతను నామీద అసూయ పడటం నిజమైంది.

అతను భార్యను తిట్టకుండా కొట్టకుండానే చాలా వేచుకుతిన్నాడు. ఒక్క సంవత్సరకాలంలో ఆమె ఉత్సాహం పూర్తిగా విరిచేశాడు.

నేను పనిమీద వాళ్ళ ఊరు వెళ్ళవలసి వచ్చింది. సహజంగా నేను వాళ్ళింటికే వెళ్ళాను. అదే నేను రుక్మిణి కాపరం చేస్తుండగా మొదటిసారి చూడటం. ఆమెను చూడగానే నాకు దాదాపు కళ్ళనీళ్ళ పర్యంతం అయింది. మా షడ్డకుడు బయటికి వెళ్ళాడు.

"రుక్మిణీ.... ఎవరు నిన్నిట్లా మార్చింది ?"

"అంత మారిపోయినానా ?" అన్నది రుక్మిణి చెక్కిళ్లు తడువుకుంటూ.

ఆ సమయంలో మా షడ్డకుడు ఎదట ఉంటే హత్య చేతామనిపించింది. అతను రుక్మిణిని చేసిందేమిటి ? ఆ మార్పుకు అతనే కారణమని నేను గ్రహించ లేనా ?

"మారిపోయినావా ? లేదు, సాంతంగా చచ్చిపోయినావు.... ఎందుకిట్లా అయిందీ ?"

రుక్మిణి ఏం చెబుతుందీ ?

మా షడ్డకుడు ఇంటికి రాగానే నన్ను చూసి పరమానంద భరితుడైనట్టు కనిపించాడు.

నేను భోజనం చేసి పనిమీద వెళ్ళాను. నా పని నాలుగయిదు రోజులు పట్టేటట్టు కనిపించింది. ఆ రాత్రి నేను హోటలుకు వెళ్ళుతానంటే మా షడ్డకుడు కాదు, కూడదు, ఈ నాలుగు రోజులూ మా యింట్లోనే ఉండాలి అని నన్ను నిలిపి వేశాడు. అతనికి మారు చెప్పటం నాకిష్టం లేకపోయింది. రుక్మిణి మొఖం ఏం సూచిస్తుందోనని ఆమె వైపు తిరిగేటప్పటికి ఆమె మొగుడి వీపువంక మూడో కన్ను తెరిచి చూస్తున్నది. నాకదేమిటో అర్థం కాలేదు.

మర్నాడుదయమే అతను కాఫీ అవీ తెప్పించి ఆ పని పూర్తి కాగానే ఊళ్ళోకి వెళ్ళాడు.

అతను ఇల్లు దాటగానే రుక్మిణి నా దగ్గిరికి వచ్చి నాతో కాసేపు మాట్లాడా లన్నది. కానిమ్మన్నాను. అప్పుడామె తన భర్త గొడవ అంతా చెప్పుకొచ్చింది.

"నువు నిన్న నన్ను చచ్చిపోయినా నన్నావు జ్ఞాపకం ఉందా? నాకు సాక్షాత్తూ అట్లాగే ఉంది, బావా! మీ తమ్ముడుగారు నేను చేసిన పనికల్లా ఆడిన మాటకల్లా తప్పుపడతారు. కారణం ఏమిటో తెలియదు. నాకు కొంతకాలం నించీ జంకు కలుగుతున్నది. నా మనస్సు అందరి మనస్సుల వంటిది కాదేమో, నేను వట్టి పాపిష్టిదాన్నేమోనని. నువ్వు నన్ను చిన్నప్పటినించీ ఎరుగుదువు కదా? నాలో పాడుగుణాలు ఏమేమి ఉన్నయ్యో చెప్పు! నువ్వు చెప్పితే నాకు నమ్మకం. నా తప్పులేమిటో దిద్దుకుంటాను.... చిన్నప్పటి రోజులు ఎంత బాగుండేవి!.... నీ కళ్ళకు కూడా నేను పాపిష్టి దానల్లే కనిపిస్తున్నానా? వెనక నన్ను చూసినట్టు చూస్తావా, బావా! చూడవు కాదూ? ఆ రోజు లెంత బాగుండేవి?.... అప్పుడు భయం ఏమిటో ఎరగను. నా కిప్పుడెందుకింత భయం?.... నువ్వు వచ్చినప్పటి నించీ నాకు మళ్ళీ ప్రాణం వచ్చినట్టుంది! నాకు ఇల్లంతా చిందులు తొక్కాలనిపించింది. ఇంతలో ఆయన వచ్చారు. తరవాత నువ్వెక్కడికో వెళ్ళావు. ఇక నువ్వు వెళ్ళినప్పటినుంచి, బాబూ, ఏం మాట్లాడారనుకున్నావు? చాలా సేపు నాకేమి అర్థంకాలేదు. 'నీకోసం వచ్చారే మీవారు!' అంటారు! మీవారు అంటే నీ మొగుడని అర్థంకాదు, బావా? అట్లా అంటం తప్పు కాదూ! నాకు వళ్ళు మండి పోయింది. 'అవును! నా కోసం ఎందుకురాడు? మా బావకు నేనంటే ప్రాణం!' అన్నాను. 'నీకో?' అన్నారు. 'అయ్యో, బాగుందే నాకూనూ!' అన్నాను. 'ఆయన మొహం చూసేటప్పటికి ఎంత ధైర్యం వచ్చిందీ?' అన్నారు. నిజంగానే నా కెంతో ధైర్యం వచ్చింది. బావా-నువు నమ్ముతావో నమ్మవో.... ఆ కోపం మళ్ళీ నా మీదే చూపించటం, నీతో చూడు ఎంత ఆపేక్షో! ఎట్లా మర్యాద చేస్తారో ఉండమని!

మనం నిజంగా మళ్ళీ చిన్న పిల్లలం అయితే?....(ఆదుర్దాగా) నువ్వు నన్ను మళ్ళీ వెనకటి మల్లే ముద్దు పెట్టుకుంటావా, బావా?"

"ఆ! పెట్టుకుంటాను!"

రుక్మిణి మొహాన ఒక విధమైన తృప్తి వచ్చింది. తృప్తి అనుభవిస్తూ కాస్సేపుండి, అకస్మాత్తుగా, "నీకు నిజంగా నేను పాపిష్టిదాన్ననిపించటం లేదుగా?" అన్నది.

"లేదు, రుక్మిణీ!"

వెనక రుక్మిణీ ఎంతో తెలివితేటలు కలదిగా చురుకుగా ఉండేది. ఆ రుక్మిణేనా ఈ మాట్లాడేది అని ఆశ్చర్యపడసాగాను. అతను ఆమెను ఇట్లా ఎట్లా చెయ్యగలిగాడు?

రుక్మిణి మళ్ళీ నావంక తిరిగి అనుమానిస్తూ "నన్ను ఒక్కసారి వెనకటి మోస్తరుగా ముద్దు పెట్టుకుంటావా బావా?" అన్నది.

నేను ఆశ్చర్యపడి "ఎట్లా పెట్టుకోగలను, రుక్మిణి?" అన్నాను.

"నువ్వు కూడా నన్ను పాపిష్టిదాని కిందనే కట్టేశావు! ఎందుకు అబద్ధం ఆడుతావూ?" అన్నది రుక్మిణి పుట్టెడు దిగులుతో.

"అది నాది కాదు. నువ్విప్పుడు పెద్దదానివి కాలేదా? నేను నిన్ను ముద్దు పెట్టుకోవటం తప్పు కాదా?"

"వెనకనో?"

"అప్పుడు పెట్టుకున్నదారివేరూ! అప్పుడు చిన్న పిల్లలం!"

"అట్లాగే ఇప్పుడూ పెట్టుకో!.... ఏమీలేదు, బావా ఎట్లాగైనా నేను వెనకటి దాన్నేనని నమ్మేటట్టు చెయ్యి."

"నేను చెయ్యలేను. ఆ మాటంటే ఆ లోపం నీలో ఉందనుకోకు! నాలోనే ఉంది. నా మాట నమ్ము!"

"నీలోనా? నేను నమ్మను. నువ్వేం మారావూ?"

"ఏం మారానా? నేను నిన్ను వాంఛించటం నేర్చుకున్నాను. నువ్వు నాకు కావాలి. కాని నిన్ను నోరు తెరిచి అడిగేటందుకు కూడా దమ్ములేదు నాకు. నేను వెనకటి వాణ్ణికాను. ఇప్పుడు నువు వెనుకటి మాదిరిగా నా ఒళ్ళో కూర్చుని నన్ను ముద్దు పెట్టుకోనిస్తే నాకు నీ మీద గల మోహం కట్టలు తెగిపోతుంది. నేను వెర్రి వాణ్ణయిపోయి నిన్నూ నన్నూ కూడా అపాయకరమైన స్థితిలోకి తెస్తాను. నీ బంధువులూ నా బంధువులూ తలలు పగలకొట్టుకోవలసి వస్తుంది!.... ఇంత విపులంగా ఇది నా చేత వప్పించి నీ పెంకె పట్టు సాధించావు. తృప్తి అయిందా?"

రుక్మిణి నా వంక ఒక్క క్షణం దీనంగా చూసింది.

"అప్పుడే నేనంత పెద్దదాన్నయినానా, నీకు....! ఇంకేం అదే పాపిష్టిదాన్ని కావటమంటే! నువు కనుక్కోలేక పోయినావు!" అన్నది రుక్మిణి.

రుక్మిణి అన్న మాటలో నిజం లేదా?

ముద్రణ :

ప్రచురణ : కారుణ్యం కథల సంపుటిలో,
యువ కార్యాలయం, తెనాలి, ఫిబ్రవరి 1937

# తల్లిలేని పిల్ల

మన ఆస్తిపాస్తులు గురించీ, ఆచార వ్యవహారాలను గురించి ఉన్నంత స్పష్టమైన అభిప్రాయాలు మన సంస్కారం గురించీ నాగరికతను గురించీ సంఘానికుండవు. ఫలాని శివయ్యగారికి పదెకరాల ఆస్తి ఉందనీ, చిన్న డాబా ఉందనీ కో-ఆపరేటివ్ బాంకులో ఎకౌంటెంటు ఉద్యోగం ఉందనీ, హాయిగానే వెళ్ళిపోతున్నదనీ, ఆయన ఒకరి కపకారం చేసేవాడూ, ఒకరి వ్యవహారాల్లో జోక్యం కలిగించుకునేవాడు కాడనీ ఊళ్ళో ఎవరినడిగినా చెబుతారు. అదే విధంగా శివయ్యగారి చదువు సంధ్యల్ని గురించి కూడా ఆయన 1910 లో పాసయిన ఆఖరు మెట్రిక్యులేటనీ, తరవాతా ఎకౌంటెన్సీ పరీక్షలు పాసయినాడనీ, చాటుపద్య మణిమంజరిలో పద్యాలన్నీ కంఠతావచ్చుననీ ఎరిగినవాళ్ళు చెబుతారు. కాని శివయ్య ఏపాటి సంస్కారం కలవాడని అడిగితే ఆ ప్రశ్న ఒకరర్థం చేసుకున్నట్టు ఒకరర్థం చేసుకోరు. దానికి ఒకరు సమాధానం ఇచ్చినట్టు ఒకరివ్వరు. ఎవరిమటుకు వారు తమ సంస్కారం అత్యుత్తమమైనదని భావించి అంతకంటె తక్కువ సంస్కారం ఉన్నవారినీ ఎక్కువ సంస్కారం ఉన్నవారినీ కూడా విమర్శిస్తారు. తమకన్న తక్కువ సంస్కారం ఉన్నవారినైనా క్షమిస్తారుగాని ఎక్కువ ఉన్నవారిని బొత్తిగా క్షమించరు.

నిజం చూస్తే, ఇందులో న్యాయం ఉంది. మనకుండే ఆస్తిలాగా, మనం చదువుకున్న చదువులాగా మన సంస్కారం ఒక నియమిత పరిణామం కలదికాదు. మనకన్న మరొకరికి ఎక్కువ సంస్కారం వుందని గ్రహించటంలో మన సంస్కారం కూడా పెరుగుతుంది. అట్లాగే మనకన్న తక్కువ సంస్కారంగల వాళ్ళను సహించటం మొదలు పెట్టగానే మన సంస్కారం తగ్గిపోవటం మొదలు పెడుతుంది. అందుకని మన సంస్కారం ఆత్మ సంతృప్తి, తక్కువ వాళ్ళమీద నిరసనా, ఎక్కువవాళ్ళ మీద అసూయా అనే మూడు కాళ్ళమీద స్థాయీభావం సంపాదించుకోగలుగుతుంది. సాంఘిక చైతన్యం విశేషం గల సమాజంలో-స్నోలూ, పౌడర్లూ, సిగిరెట్లూ ప్రచారమైనంత విరివిగా సాహిత్యమూ, శాస్త్ర విజ్ఞానమూ ప్రచారమయ్యే సమాజంలో- మనుష్యుల సంస్కారం ఇంత సులువుగా స్థాయీభావం పొందలేదు. కాని శివయ్య సమాజం అటువంటిది కాదు. మనమూ అందులో వాళ్ళమే గనక ఈ విషయం జాస్తిగా వితర్కించ నవసరంలేదు.

శివయ్య సంస్కారాన్ని కొలిచి చూడటానిక్కూడా మనకట్టే అవకాశాలు లేవు. సంస్కారమంటే ఆనందాన్ని సాధించి అనుభవించే శక్తి. జంతువులు సుఖ

సంప్రాప్తికోసమే పాటుపడగలవు. మానవుడు కొంతవరకు కష్టసుఖాలకు కూడా అతీతుడై ఉంటూ ఆనందంకోసం పాటుపడగలడు. శివయ్య ఈ లెక్క ప్రకారం సంస్కారే నంటాం. ఆ మాటంటే కొందరు, "శివయ్యకేం? ఇల్లుంది. ఇంత ఆస్తి ఉంది. చక్కగా ఉద్యోగం వుంది. రోజల్లా శరీరం హూనం చేసుకుంటేగాని కడుపు కింత కూడే రాని దౌర్భాగ్యులకు సంస్కారం లభ్యం కాదేమోగాని, శివయ్యకేం తీపరమా?" అంటారు. అయితేనేం శివయ్యపాటి ఉపాధి గలిగిన తల్లిదండ్రులంతా శివయ్య మాదిరిగా పిల్లలద్వారా ఆనందం అనుభవించగలుగుతున్నారా? దానికెవరూ కాదనలేరు. కాని ఆస్తిపాస్తుల్ని నిలబెట్టుకోవటం కన్న కూడా సంస్కారాన్ని నిల బెట్టుకోవటం చాలా కష్టం. ఎంతో విజ్ఞానమూ, వివేకమూ ఉంటేనేగాని అది సాధ్యం కాదు.

శివయ్యకు ఒక మగపిల్లవాడూ, ఒక ఆడపిల్లానూ. ఇద్దరి మధ్యా మరో ఇద్దరు పుట్టి పోయినారు. ఇంతకంటె ఆయన కష్టాలెరుగడు. పిల్లలు అసలే కష్టాలు ఎరగరు. తల్లిదండ్రుల స్వార్థబుద్ధీ, అసహనమూ కారణముగా సామాన్యంగా పిల్లల జీవితం దుఃఖభాజన మవుతూంటుంది. శివయ్యగాని, ఆయన భార్యగాని అటువంటి స్వార్థమూ, అసహనమూ ఎన్నడూ ప్రకటించలేదు. సహజంగా ఆనందంతో కూడు కుని వుండే పిల్లల జీవితం పెద్దవాళ్ళ నుంచి అంతులేని త్యాగం కోరదు. తమ ఇద్దరి పిల్లల సుఖంకోసమూ శివయ్యా, ఆయన భార్య కూడా అవసరమైన త్యాగాలు సంతోషపూర్వకంగా చేసి అందులో ఆనందం చూడగలిగారు. మానవయత్నం విలువ తెలీనివాళ్ళు, "అటువంటి పిల్లలుండటం ఆ తల్లిదండ్రుల అదృష్టం - జాన కమ్మ ఏ జన్మానో మంచిపళ్ళు దానం చేసుకుంది" అన్నారు. మరికొందరు, పిల్లల్లోనే విశ్వాసం లేనివాళ్ళు, "చూడు. ఆ శివయ్య పిల్లలెందునా కాకుండా పోతారు. వాళ్ళకి భయమూ, భక్తీ లేదు. వాళ్ళ కేదనాలో ఏదనకూడదో కూడా తెలీదు. ఇప్పణ్ణించీ ఈ విధంగా పెంచితే వీళ్ళు పెరిగి పెద్దవాళ్ళయి పెద్దలమాట వింటారా? మొక్కయి వొంగకపోతే మానయి వొంగుతుందా?" అన్నారు. వీళ్ళకి పిల్లల్ని గురించి ఉండే విశ్వాసాలకూ్కడా పరస్పర సమన్వయం వుండదు. పధ్నాలుగేళ్ళ నరుసుకూ, ఆరేళ్ళ చిట్టికీ యిప్పుడే తొంభయ్యేళ్ళ వాళ్ళకుండే వివేకం లేదని ఒక వంక తప్పు పడుతూ మరోవంక వీళ్ళకు తొంభయ్యేళ్ళొచ్చినాక నూరేళ్ళవాళ్ళ చెప్పుచేతుల్లో ఉండరేమో అని ఈ విమర్శకుల బెంగ!

* * *

జానకమ్మగారి ఆకస్మిక మరణంతో శివయ్య కొంపలో పిడుగుపడింది. పది మంది గల కుటుంబంలో గాని అరాజకంగా ఉండే కుటుంబంలో గాని ఒక మనిషి చావు చెప్పుకోదగ్గ మార్పు కలిగించకపోవచ్చు. కాని శివయ్య కుటుంబానికి పెద్ద దెబ్బగా పరిణమించింది. పోయిన జానకమ్మ పోగా మిగిలిన ముగ్గురూ ఒకరి కొకరు మరింత గట్టిగా అంటుకుపోయినట్టయింది. ముఖ్యంగా పిల్లలిద్దరికీ తల్లి

స్థానం కూడా తండ్రే ఆక్రమించిన వాడయినాడు. వాళ్ళ జీవితంలో ఆయన విలువ రెట్టింపయింది.

శివయ్యగారికి ఆప్తకుటుంబాలు అయిదారున్నై. ఆయన్ను పరామర్శించి పోవటాని కందరూ వచ్చారు. అందరూ అనేక రకాలుగా కర్తవ్యబోధ చేశారు. కొందరు పిల్లలిద్దర్నీ కొంతకాలం తమ యిళ్ళలో పెంచుకుంటామన్నారు. కనీసం చిట్టినన్నా తమ వెంట పంపమన్నారు. చాలామంది శివయ్యను మళ్ళీ వెంటనే, పిల్లలకోసమైనా పెళ్ళాడమన్నారు. ఆడదిక్కులేని కొంపలో పిల్లల అచ్చట్లూ, ముచ్చట్లూ ఏముంటై? మరెవ్వరైనా తల్లి కాదుగదా? మళ్ళీ పెళ్ళి చేసుకుంటే అమ్మ అని చెప్పకోటానికైనా వుంటుంది.

ఈ సలహాలన్నిటికీ శివయ్య పెడచెవి పెట్టాడు. పిల్లలు తన దగ్గిర వుండ వలసిందే తప్పదు. గారాబంగా పెరిగిన పిల్లల్ని మరొకరికి వప్పజెప్పటం చాలా తెలివితక్కువ. ఇక రెండో పెళ్ళి చేసుకోవటం మాటకొస్తే అంతగా తప్పనిసరి అయినప్పుడు చూసుకోవచ్చు.

బంధువులంతా వెళ్ళిపోయిన తర్వాత శివయ్య తానే వంటచేసి పిల్లలిద్దరికీ ఇంత పెట్టి తాను తిని, బాంకుకు వెళ్ళి, మళ్ళీ సాయంకాలం ఇంటికి తిరిగివచ్చే వాడు. పగలల్లా పిల్లలిద్దరూ బిక్కు బిక్కుమంటూ ఇంటిదగ్గర ఉంటే ఆయన ఆలోచనలన్నీ ఇక్కడే ఉండేవి. అదీగాక, ఇట్లా ఎంతకాలం సాగుతుందీ? వేసవి శలవులు గనక సరిపోయింది. మరో రెండు వారాల్లో నరుసు బడి తెరుస్తారు. వాడు బడికివెళ్ళితే చిట్టి ఒంటరిదైపోతుంది. అన్నట్టు చిట్టిని కూడా బళ్ళో వెయ్యాలి చిట్టికి ఉదయంపూట బడి అవుతుంది. పదిగంటలకుకాని తిరిగిరాదు. ఈలోపల తను ఆఫీసుకు బయల్దేరాలి. అందుచేత ఇంట్లో ఇంకో దిక్కు తప్పదు. శివయ్య బంధువుల్లో విడిగా ఉన్న ముసలమ్మలుగాని విధవరాళ్ళుగాని ఎవరూలేరు. ఉన్న ఒకరిద్దర్నీ అడగటం ఇష్టంలేదు. అందుకని ఆయన ఇల్లు అంటిపెట్టుకునే వంటా విడకోసం ప్రయత్నం చేసి కుదిర్చాడు.

ఈ వంటావిడ యాభై ఏళ్ళ వితంతువు. తిండిపెట్టి ఇరవై రూపాయలిస్తే ఇంటోనే ఉండి కాచి పొయ్యటానికి ఒప్పకుంది. ఆవిడ అడుగుపెట్టిన క్షణంలోనే చిట్టికీ ఆవిడకూ స్నేహమయింది. అన్నాల దగ్గర "అమ్మా! అది వెయ్యి. అమ్మా ఇది వెయ్యి!" అని అడగటం అలవాటు ఛొప్పన చిట్టి ఆవిడ్ని అమ్మా అనటం జరిగింది. అదే ఖాయమైపోయింది. ఆవిడ ఎక్కడా పిల్లల్ని గారాబం చేసినట్టే ఉండేది కాదు. కాని ఇద్దరూ క్షణంలో ఆవిడకు మాలిమైపోయినారు. వంటింటి పెత్తనమంతా పిల్లదే.

వంటావిడ వచ్చి రెండు రోజులైనా కాకముందే శివయ్యగారు, తనకు పెద్ద సమస్య ఒకటి తీరిపోయిందనుకున్నాడు. ఆయన ఆవిణ్ణి పరాయి మనిషల్లే

చూడలేదు. మంచిచెడ్డలన్నీ ఆవిడతో చెప్పేసేవాడు. ఆవిడకూడా తనకు వినే అధికారం వున్నట్టే వినేది.

బడి తెరవగానే నరుసు బడికి వెళ్ళసాగాడు. చిట్టికూడా ఆడపిల్లల బడిలో చేరిపోయింది. సాయంకాలం పూట తండ్రీ బిడ్డలు ఒకచోట చేరి కాల క్షేపం చేసేవాళ్ళు. వంటింటో అలికిడి అవుతుంటే అక్కడ పనిచేస్తున్న మనిషి తమ తల్లికాదనే విషయం పిల్లల్నిగాని, తన భార్యకాదనే విషయం అంతగా శివయ్యనుగాని బాధించేదికాదు.

ఇది చక్కని ఏర్పాటు. ఇందులో శివయ్య తెలివితేటలేమీ లేకపోయినా సాధించటానికి అసంభవమైన ఏర్పాటు కాదు. ఈ వెంకమ్మగారు కాకపోతే మరో సుబ్బమ్మగారు దొరికివుండును. ఈ ఏర్పాటుతో శివయ్య తృప్తిపడవల సింది. తను తిరిగి పెళ్ళాడితే తనకు సన్నిహితురాలైన మనిషి ఏర్పడుతుంది గనుక పిల్లలు కూడా మరింత సుఖపడతారని శివయ్య భావించటంలో అర్థంలేదు. వంటమనుషులను మార్చినట్లు భార్యల్ని మార్చే అవకాశంలేదు. వయస్సు మళ్ళిన వంటమనిషి తన పిల్లల్ని ఆదరించినట్టుగా కొత్తగా కాపరానికి వచ్చిన పిల్ల తన సవతిపిల్లల్ని ఆదరించే అవకాశం చాలా తక్కువ.

అయినా శివయ్య తిరిగి పెళ్ళాడటానికి సంకల్పించాడు. కనీసం ఆ సంకల్పం ఇతరులు తనలో కలిగించటానికి ప్రయత్నించినప్పుడు దాన్ని ప్రతిఘటించలేదు. ఆ సంబంధములోనైనా ఆకర్షణ ఏమీలేదు. పిల్ల చూడటానికి సంసారపక్షంలో బాగానే ఉంటుందిగాని రాతకోతలేమీ రావు. చాలా బీద కుటుంబం. మారుమూల పల్లెటూరు. సంస్కారం లేనికొంపలో, మూఢాచారం మధ్య దయాదాక్షిణ్యాలూ, అపేక్షా, అంతఃకరణాలూ లేనిచోట పెరిగింది. బుద్ధెరిగిన నాటినుంచీ ఇంటిచాకిరీ చచ్చేటట్లు చేసింది. ఒక దెబ్బ తగిలినా, కంటినొప్పి వచ్చినా, కాలి నొప్పి వచ్చినా, "అయ్యో, పాపం" అన్నవాళ్ళు లేరు. ఆడపిల్లంటే భారమనీ, పాతకమనీ అనుకునే వాళ్ళు ఆమె చుట్టూ ఉండేవారు. ఆమెను వదిలించుకోవటానికి తాము చేసిన ప్రయత్నాలు తల్లిదండ్రులు లక్ష్మి దగ్గిర దాచటానికికూడా ప్రయత్నించలేదు.

అటువంటి భార్యను శివయ్య ముందూవెనకా చూసుకోకుండా కట్టుకున్నాడు. నిజానికి తనలో మాత్రం ఆకర్షణ ఏముందీ? నడివయస్సువాడూ ఇద్దరుపిల్లల తండ్రీనూ! ఈ లోపాలు కమ్ముకుపోయేటందుకు కొట్టుకుపోయినంత ఆస్తిలేదు. సంస్కారమా? దానికి బజారు ధర ఎంత? శివయ్యే తన సంస్కారానికి విలువ ఇచ్చుకోవడం మరిచాడు. ఇతర్లకెవరికి జ్ఞాపకం ఉంటుందీ?

"ఏమండీ, వెంకమ్మగారూ! నేను మళ్ళా వివాహం ఏర్పాటు చేసుకున్నాను. రేపు ముహూర్తం. మళ్ళీ ఎల్లుండి ఉదయానికి తిరిగి వస్తాను. పిల్లల్ని కాస్త కనిపెట్టి ఉండండి" అని శివయ్య వంటామెతో చాటుగా చెప్పాడు.

"మంచిది.... పిల్లలు మీకోసం అడిగితే ఏం చెప్పమన్నారు?"

"చెప్పండి ! ఇవాళ కాకపోతే రేపైనా తెలిసేదేగా ?"

"మంచిదండి !" అన్నది వెంకమ్మగారు, నిర్లిప్తురాలై తన పనిలో జొర పడుతూ.

పెళ్ళి కవసరమైన చీరలూ అవీ కొనుక్కొని శివయ్య వెళ్ళిపోయినాడు.

*　　*　　*

పిల్లలడిగేదాకా వెంకమ్మ ఆగలేదు. సాయంకాలం బడినుంచిరాగానే వాళ్ళతో తండ్రి సంగతి చెప్పేసింది. ఇద్దరూ కొంచెం సేపటివరకూ మాట్లాడలేదు. వాళ్ళ చిన్న తలకాయల్లో ఏమేమి ఊహలు సాగిందీ ఆవిడ ఊహించలేదు. చిట్టి తన కొత్త అమ్మకు ముప్పై అయిదేళ్ళుంటాయని ఊహించుకుంటున్నట్లు ఏ మాత్రం తెలిసినా వెంకమ్మ నిర్ఘాంతరపోయి వుండును. ఒక్క వయస్సు విషయంలోనే కాదు, అన్నివిధాలా యీ కొత్తఅమ్మ పాత అమ్మ మోస్తరుగానే ఉంటుందని చిట్టి ఊహించుకున్నది. వెంకమ్మగారూహించినట్టుగా చిట్టి తన మనస్సులో ఏమీ ఖేదపడలేదు. అనుమానపడలేదుకూడానూ. అయితే చిట్టి తలకాయలో ఊహలు గ్రహించటం ఎవరికీ సాధ్యంకాదు.

నరుసు మటుకు యీ మాటవిని కంగారుపడ్డాడు. పెళ్ళిళ్ళూ, వాటికి సంబంధించిన నియమాలూ నరుసుకు కొంతవరకు తెలుసును. పెద్దవాళ్ళు చిన్నపిల్లల్ని చేసుకోవటం గురించి అసహ్యపడటం వాడదివరకే నేర్చుకున్నాడు. ఈ న్యాయమైన అసహ్యాన్ని నిష్పక్షపాతంగా తండ్రిమీదికి తిప్పటం వాడికర్థంకాలేదు. తండ్రిమీది అభిమానం యీ అసహ్యాన్ని మార్చుకోవటానికి కూడా వాడు సిద్ధపడ్డాడు. అంత నీచమైన పని అయితే తండ్రి చేస్తాడా ? సవతి తల్లులంతా చెడ్డవాళ్ళే అయితే తండ్రి తమ యిద్దరిని కూడా యీ సవతితల్లి కెందుకు రుద్దుతాడూ ?

పసిపిల్లల్లో సయితం విశ్వాసాలు ప్రబలమైనవి. వాటిని మార్చుకోవటం బాధతోనూ, శ్రమతోనూ కూడుకున్నపని. మనస్ఫూర్తిగా తన విశ్వాసాలను మార్చుకుందామనుకున్న నరుసుకే ఎంతో బాధ కలిగింది. ఒకవేళ తన నమ్మకాలన్ని తప్పే అయినా తండ్రి యీ పెళ్ళిచేసుకుని తనకింత శ్రమ కలిగించకపోతే ఏమనిపించింది. ఇంతేకాక నరుసు మరొక ఆలోచనతో కూడా బాధపడ్డాడు. తన తల్లి చచ్చిపోయినప్పటికీ ఎక్కడో వున్నట్టే వుంది. ఆవిడ కీసంగతి తెలిస్తే ఏమనుకుంటుంది ? తన తండ్రి తిరిగి పెళ్ళాడటం గురించి తన తల్లి ఆత్మ ఏమనుకుంటుందో అని నరుసు సిగ్గుపడటం చిత్రమైన సంగతి.

నరుసు కింకో సమస్యకూడా పట్టుకుంది. తనూ చిట్టీ ఈ వచ్చే ఆవిణ్ణి ఏమని పిలవాలి ? అవ్వగారినడిగితే చెబుతుందిగాని అడగటానికి నరుసుకి బిడియం వేసింది.

ఈ విషయాన్ని ఇంతటితో పోనివ్వక నరుసు తన రాబోయే తల్లిని గురించి ఊహించుకుంటూ తనకిష్టమైన ఆడవాళ్ళందర్నీ ఊహించుకున్నాడు. తండ్రి పెళ్ళిని

గురించి వాడింత బాధపడినా తన సవతి తల్లి మాటల్లోనూ చేతల్లోనూ తన కిష్టంలేని రకం అవుతుందనే భయం నరుసుకు కలగనేలేదు.

రాత్రి భోజనాలయినాక వెంకమ్మగారు నులకమంచం ఒకటి వాల్చుకుని కూచుంది. చిట్టి ఆవిడపక్కనే జేరింది. నరుసు దగ్గర్లోనే చాప పరుచుకుని లాంతరు పెట్టుకుని చదువుకోటానికి కూర్చున్నాడు గాని వాడి దృష్టి పుస్తకాల మీదికి పోవటం లేదు.

"అమ్మా, అమ్మా ? మా కొత్తమ్మొస్తే మాకు కథలు చెబుతుందా ?" అన్నది చిట్టి.

"కథలుగాదు గడ్డలు చెబుతుంది!" అన్నది వెంకమ్మ ఉద్రేకంతో. "ఇక మీ పాట్లు కుక్కలూ, నక్కలూ పడవు. మీ ఆటలన్నీ నాదగ్గరా, మీ నాన్నగారి దగ్గరా సాగినట్టు ఆవిడ దగ్గిర సాగుతయ్యనుకున్నావా ?"

వెంకమ్మ ఇటువంటి మాటలని పిల్లల మనస్సు పాడుచేసిన మాట అబద్ధం కాదు. కాని ఆవిడకు దురుద్దేశం ఏమీ లేదు. రాబోయే లక్ష్మిమీద పగాలేదు. తను చెప్పేదంతా ఆ పసివాళ్ళకి లోకజ్ఞానంగా ఉపకరిస్తున్నదని ఆవిడ మనస్సాక్షిగా నమ్మింది. అదీకాక ఆ పిల్లలకు తను చాలా దగ్గిరదాన్ననుకోవటానికీ, తల్లి తరవాత తల్లివంటిదాన్ననుకోవటానికీ తనకు దొరికిన ఈ అవకాశాన్ని ఆమె జారవిడవదలచలేదు.

సవతి తల్లు లెట్లా ఉంటారో చిట్టికి తెలియజేయటానికిగానూ వెంకమ్మగారు చాలా కథలు చెప్పింది. బాలనాగమ్మ కథా, చిత్రాంగి కథా కాక తన అనుభవంలో జరిగిన విషయాలు చాలా చెప్పింది.

నిజమైన ఆరాటం మనస్సులోలేని కారణంచేత మాట్లాడుతూ మాట్లాడుతూనే వెంకమ్మగారు నిద్రలో పడింది. నరుసు ఒక అక్షరమైనా చదవలేదు. అట్లాగే చీకట్లోకి చూస్తూ కూచున్నాడు. చిట్టి మెల్లిగా నులకమంచం దిగివచ్చి, "నర్సన్నయ్యా, మన కొత్త అమ్మ నన్ను కొడుతుందా ?" అన్నది.

నర్సు అనుమానంగా "ఏమో?" అన్నాడు.

చిట్టి ధైర్యంగా, "ఆవిడ నన్ను కొడితే నాన్న ఆవిణ్ణి తుక్కుతుక్కుగా కొడతాడు, ఏం ?" అన్నది తృప్తి తెచ్చుకుంటూ.

మళ్ళీ నరుసు "ఏమో?" అన్నాడు.

నరుసు ఇంత అనుమానంలో పడటం చిట్టికి నచ్చలేదు. "ఒకవేళ నాన్న కొట్టకపోతే నువ్వయినా కొడతావా ?" అన్నది చిట్టి.

నరుసు అకస్మాత్తుగా ఎక్కడలేని పౌరుషమూ వచ్చి, "ఓ!" అన్నాడు.

# 2

పెళ్ళి జయప్రదంగా చేసుకుని శివయ్య తిరిగి వచ్చాడు. పెళ్ళి అయింది తనకేననే విశ్వాసం ఒకంతట కలగలేదు. కాని తిరిగి పిల్లల్ని కలుసుకునే క్షణాలు సమీపిస్తున్న కొద్దీ తనకు వాళ్ళకూ మధ్య ఏదో ఎడమయిన భావం ఆయన్ను వేధించసాగింది. ఎంత పోగొట్టుకుందామన్నా ఈ భావం పోలేదు. పిల్లల్ని చూడ గానే ఇది పోతుందని ఆశపడ్డాడు. చిట్టి కంటపడగానే ఆ ఆశ కాస్తా అడుగంటింది.

పెద్ద పెద్ద కళ్ళేసుకుని చిట్టి తండ్రి కేసి వింతగా చూస్తూ నిలబడింది. నవ్వ లేదు, మాట్లాడలేదు, దగ్గరికి రాలేదు. ఇదంతా గమనించనివాడల్లే శివయ్య "ఏమే, చిట్టెమ్మ తల్లీ?" అంటూ తన గదిలోకి వెళ్ళాడు. చిట్టి చిన్న గొంతుతో "ఊ" అన్నది. తండ్రి కంటపడకుండా తప్పించుకోవటానికా అన్నట్టు నరుసు పెందలాడే భోంచేసి స్కూలుకు వెళ్ళాడు.

శివయ్య గబగబా భోంచేసి, స్నానంచేసి బాంకుకు వెళ్ళాడు. ఆయన మళ్ళీ పెళ్ళాడాడని అందరికి తెలుసును. ఒకరిద్దరు తప్ప ఆ విషయం ఎత్తలేదు. వాళ్ళ యినా తనను ఓదార్చుతున్నట్టుగా, "మంచిపనే చేశావులే! ఏమిటి లేకపోతే? ఆడ దిక్కులేని సంసారం! ఇంత కాచి పొయ్యటానికైనా లేకుండా! రేపు మంచాన బడితే ఊళ్ళో వాళ్ళు చేస్తారా ఏం?" అన్నారు గాని ఉత్సాహకరంగా మాట్లాడలేదు. శివయ్య తన వృద్ధాప్యం గురించి ఆలోచించుకున్నాడు. తను మంచాన పడ్డట్టూ, తన పళ్ళన్నీ ఊడిపోయినట్టూ! కళ్ళు పొరలేసినట్టూ, చెవులు వినపడనట్టూ, తనకు పక్ష వాతం వచ్చినట్టూ....తన కరవై యేళ్ళొచ్చేసరికి- ఏదీ?- లక్ష్మికి ముప్ఫయేళ్ళు వస్తయి. పాతికేళ్లు దాటిన తరవాత ఇంకేముంది ఆడది ముసలిదే- నలుగురు పిల్లలు పుడితే సరీ!.... తనకింకా నలుగుర్ని కనే వయస్సులేదా? తను పుట్టేసరికి తన తండ్రికి యాభై నాలుగేళ్ళు....అప్పటివాళ్ళు పెళ్ళాడితే ముప్పై యేళ్ళవాడికి మూడేళ్ళ దాన్నిచ్చి చేసేవారు. ఈ పాపిష్టికాలం ఇట్లా వచ్చింది.

సాయంకాలం శివయ్య ఇంటి కొచ్చేటప్పటికి ఆరుబయట మంచం వేసుకొని పిల్లలిద్దరూ కూర్చున్నారు. చిట్టి నరుసు కాలిమీద తాళంవేస్తూ "కొత్తమ్మని కొడ దామే కొత్తమ్మని కొడదామే!" అంటూ పాడుతున్నది. తండ్రిని చూసి అయినా ఆప లేదు. పైపెచ్చు, "నాన్నోయ్ కొత్తమ్మని కొడదాం!" అంది మహా ఉత్సాహకరంగా. చిట్టి పొద్దుటిలాగా మూగనోము పట్టలేదన్న సంతోషం శివయ్యకు దక్కలేదు. ఆయనకోపం కూడా వచ్చింది. చిట్టిమీద మటుక్కాదు. చిట్టి తనను చూడగానే తప్పు చేసిన మొహం పెట్టివుంటే ఏమై ఉండేదోగాని చిట్టి అమాయకత్వమే శివయ్యకు కనిపించింది.

"నీకా పాడు ఆలోచన ఎవరు చెప్పారే, అమ్మా?" అని అడిగాడు శివయ్య.

"అన్నయ్య చెప్పాడు" అన్నది చిట్టి.

శివయ్యకు నరసుమీద చెప్పరానంత ఆగ్రహం వచ్చింది.

"నీకు బుద్ధిలేదుట్రా ? ఏమీ ఎరుగనిపిల్ల కిటువంటి బుద్ధులా నేర్పేది? ఎండు కేళ్ళొచ్చినై చెట్టు కొచ్చినట్టు, ఛీ!" అన్నాడు శివయ్య.

నరసు మాట్లాడలేదు. తండ్రి తనమీద అన్యాయంగా కోప్పడ్డాడని కూడా నరసుకు తోచలేదు. కాని తన తండ్రి వాడికా క్షణంలో మామూలు మనిషల్లే కని పించాడు. ఆనాటివరకూ నరసు దృష్టిలో శివయ్య ఒక ప్రత్యేక వ్యక్తి. అందరి తండ్రుల వంటివాడు కాడు. శివయ్య అయిదు సెకండ్ల కాలంలో యీ ప్రత్యేకత పోగొట్టుకున్నాడు, నరసు దృష్టిలో.

తన కొడుకు మనస్సు గాయపడిందని శివయ్య కనుక్కునికూడా చలించ లేదు గాని మళ్ళీ చిట్టి పొద్దుటి మాదిరిగా మారిపోవటం చూసి బాధపడ్డాడు. ఈ పిల్ల లిద్దరూ తన కెడమైపోతే ప్రపంచంలో ఇంకేమీ లేదనిపించింది. తీరా పెళ్ళికానే అయి పోయింది గనుకనూ, ఆ మూడు ముళ్ళూ మళ్ళీ విప్పే శక్తి బ్రహ్మదేవుడిక్కూడా లేదు గనుకనూ, శివయ్య కొంచెం పశ్చాత్తాపపడదలుచుకుని, "పిల్లల కిష్టం ఉండదని తెలిస్తే దిక్కుమాలిన పెళ్ళి చేసుకోకనే పోదును." అని తన అంతరాత్మతో చెప్పు కున్నాడు. ఆ ముక్క విని శివయ్య అంతరాత్మ ఎంతో సంతుష్టి చెందినదై నిద్ర పోయింది.

ఇట్లా నిద్ర చెందిన శివయ్య అంతరాత్మ తిరిగి మేల్కోవలసిన అవసరం లేకపోయింది. పిల్లలు క్రమంగా ఎప్పటిమాదిరిగా కాసాగారు. తమ తండ్రి తిరిగి పెళ్ళి చేసుకోవటంవల్ల వాళ్ళ జీవితాల్లో మార్పేమీ కనిపించలేదు. వాళ్ళు - ముఖ్యంగా చిట్టి-పద్ద భయాలకు తార్కాణంగాని ఆధారంగాని కనిపించలేదు. కొత్త అమ్మ ప్రసక్తి పూర్తిగా అంతమైపోయింది. శివయ్య కూడా ఈ మార్పుకు సంతో షించాడు. వాళ్ళకా విషయం జ్ఞాపకం రాకుండా చూస్తూ వచ్చాడు. అయితే శివయ్య తన కొత్త భార్యను గురించి ఆలోచించకపోలేదు. ఆయన లక్ష్మి కోసం ఆదుర్దాగా ఎదురుచూస్తున్నాడు. తన చిన్న భార్యా పరిపాలించవలసిన సామ్రాజ్యాన్ని తాత్కా లికంగా ఈ దిక్కుమాలిన వెంకమ్మగారు ఏలుతూ ఉండటం శివయ్య ఆరాటాన్ని మరింత చేసింది.

వెంకమ్మగారికి ఇంట్లో స్థానం లేకుండా చేద్దామని శివయ్య అభిప్రాయంకాదు. ఆవిడ మంచి వంటగత్తె. ఇల్లు చక్కగా ఉంచుతుంది. పిల్లల్ని ప్రేమగా చూస్తుంది. లక్ష్మి గూడా ఇంటిపనులన్నీ చెయ్యగలదేకాని ఆ దారిద్ర్యంలో నుంచి తన దగ్గరికి వచ్చే లక్ష్మి కింద వంటమనిషిని పెడితే లక్ష్మికి కూడా సంతోషంగా ఉంటుందనీ, తనను పెళ్ళాడటంతో లక్ష్మి ఎన్ని మెట్లు పైకెక్కి వచ్చిందో తెలిసిరావాలనీ శివయ్య ఆశించాడు. లక్ష్మి జీవితం స్వర్గలోకవాసం చేసేపాటి ప్రతిపత్తి తనకున్నది అదే ఇంత కలవాళ్ళింటి పిల్లయితే చెప్పలేం గాని లక్ష్మి ఆగర్భదరిద్రుల పిల్ల శివయ్య ఉత్సాహానికి మేరలేదు.

పెళ్ళయిన అయిదారు మాసాలకు లక్ష్మి కాపరానికి వచ్చింది. శివయ్య స్వయంగా వెళ్ళి భార్యను తెచ్చుకున్నాడు. లక్ష్మి వెంట ఎవరినన్నా పంపటానికి శివయ్య అత్తవారు ప్రయత్నించారు. కాని ఆ ప్రయత్నాలను శివయ్య పడగొట్టాడు. ఒక్క లక్ష్మితో తప్ప మరెవ్వరితోనూ శివయ్య ఎటువంటి సంబంధమూ పెట్టుకో దలచలేదు. వాళ్ళ సంస్కారమూ, పద్ధతులూ ఆయనకి నచ్చేవికావు. ఆ సంస్కారంలోనుంచే వచ్చిన లక్ష్మి తనకు దగర మనిషి అవుతుందని శివయ్య ఎట్లా అనుకున్నాడో, అట్లా అనుకోని పక్షంలో ఆమెకు తన సంస్కారాన్ని యివ్వటానికి ఏవిధమైన ప్రయత్నం చేతామనుకున్నాడో మనం ఊహించలేం. ఎందుకంటే శివయ్య తన భార్యను ఉన్న విధంగానే స్వీకరిస్తూ ఆవిడ సంస్కారానికి తన సంస్కారానికున్నంత విలవా ఇచ్చాడు - ఇంకా కాస్త ఎక్కువే ఇచ్చాడు. ఈ మాదిరిగా ప్రవర్తించేవారు చాలా మంది ఉండటం మనం చూస్తాం. అయితే అటువంటి ప్రవర్తన వారి వారి జీవితాలను ఏ విధంగా మార్చేదీ మనకు స్పష్టంగా తెలీదు. జీవితంలో ఇందువల్ల కలిగిన ఫలితాలను తెలుసుకునే అపూర్వమైన అవకాశం మనకున్నది.

లక్ష్మి శివయ్య ఇంట్లో అడుగు పెడుతూ, శివయ్య ఊహించినట్టుగా ఎన్నో మెట్లెక్కి వచ్చానని అనుకోలేదు. పూరి గుడిసెలో నుంచి డాబాలోకి వచ్చానని సంతోషించలేదు - డాబా ఉన్నదని ఆమె అదివరకే విన్నది. అది తను అనుకున్నంత పెద్దది కాకపోవటం చూసి నిరుత్సాహపడింది. ఇంట్లో వంటమనిషి ఉన్నందుకు కూడా లక్ష్మి గర్వించలేదు. వంట మనిషి ఉన్నదనే సంగతి కూడా లక్ష్మికిదివరకే తెలుసు. ఆవిడ ఇంట్లో ఇంత అధికారం చెలాయిస్తుందనే విషయమే తెలియదు. అది తెలుసుకొని లక్ష్మి సహించలేకపోయినది. పైగా, ఇంటివాళ్ళు చేసుకోక ఈ వంటవాళ్ళను పెట్టి గొప్పలకుపోయి, డబ్బుకు డబ్బు ఇంటికి ఇల్లు గుల్ల చేసుకోవటమేనని లక్ష్మి నమ్మకం. వెంకమ్మగారు లక్ష్మి కళ్ళకి అత్తగారల్లేనూ, ఆడ బిడ్డల్లేనూ కనిపించింది. ఇక నరుసు విషయమూ, చిట్టి విషయమూ లక్ష్మి మొదటి నుంచీ భయపడుతూనే వచ్చింది. వాళ్ళను చూసినాక లక్ష్మి భయానికి అసహ్యము కూడా తోడయింది. నరుసు తనకేసి చూడనయినాలేదు. ఇంకా అదేనయం. చిట్టి తనకేసి తప్ప మరొకటి చూడలేదు. తను స్నానం చేయటానికి ముందు పెట్టె సర్దుకుంటూంటే చిట్టివచ్చి అంత దూరాన నిలబడి చేతులు రెండూ వెనక్కు పెట్టుకొని కళ్ళార్పకుండా చూడసాగింది. చిట్టిని ఈ విధంగా చాలాసేపు భరించి లక్ష్మి ఆఖరుకు, "ఎందుకట్లా చూస్తావ్ ? నా మొహానేమన్నా కోతులాడుతున్నాయా?"

చిట్టి తల అడ్డంగా తిప్పి, "ఉహూ" అన్నది గాని చూడటం మానలేదు. లక్ష్మి గబగబా తనకు కావలసిన బట్టలు తీసుకుని పెట్టెమూత దబాల్న మూసి తాళం వేసి దొడ్లోకి వెళ్ళిపోయింది. చిట్టి లక్ష్మి చేసే ప్రతి చిన్నపనీ జాగ్రత్తగా పరిశీలిస్తూ ఉంది. లక్ష్మి పెట్టెను తన కాలితో ఒక చిన్న తన్ను తన్ని, చేతులు వెనకే పెట్టుకుని తానుకూడా దొడ్లోకి వెళ్ళింది.

లక్ష్మిని చూస్తే చిట్టికి అనుమానమూ, కోపమూ కాక ఒక ఆకర్షణ కూడా ఏర్పడింది. లక్ష్మికి పిల్లలంటే ఇష్టమైనట్లయితే చిట్టి ఒక్క క్షణంలో ఆమెతో సహవాసం చేసి ఉండును. కాని లక్ష్మి నేర్చిన సంస్కారంలో పిల్లలమీది రక్తిలేదు. ఆమె ఎరిగిన ప్రపంచంలో తల్లులు తమ సొంత పిల్లల్ని మాత్రమే ప్రేమిస్తారు-ఆడమృగాలు ప్రేమించినట్టు. పరాయి పిల్లల్లో ఆనందం చూడడానికి ప్రయత్నించరు. వాళ్ళు ఆనందం ఇచ్చే పిల్లలయితే అసూయపడి దిష్టికూడా పెడతారు. ఇక సవతి పిల్లల మాట చెప్పనే అక్కర్లేదు. సవతి తల్లులు సవతి పిల్లలతో ఏ మాత్రమూ కలవరాదు. వాళ్ళను పాముల్నీ తేళ్ళనూ చూసినట్లు చూడాలి.

లక్ష్మి పాలిటికి చిట్టి మామూలు పాములాగా కూడా లేదు, పగపట్టి వెంటపడే పాములాగా కనిపించింది. తను స్నానంచేసే చోటికి, బట్ట కట్టుకునే చోటికీ చిట్టి వెంటపడి వచ్చింది. మాటా పలుకూ లేదు. చేతులు వెనక పెట్టుకోవటమూ, గుడ్లు గుండ్రంగా పెట్టుకు చూడడమూనూ.

"ఎందుకు నువ్విక్కడా ? పో అవతలికి" అన్నది లక్ష్మి చిరాకుగా.

"నేను పోను !" అన్నది చిట్టి నిష్కర్షగా.

"ఏం ? తీపరమా ?"

"నీకే తీపరం, నువ్వే పో మా యింటోనించి. మీ ఊరెక్కడో ఉంది. మీ యింటికి పో" అని గబగబా చిట్టి ఏకరువు పెట్టింది.

"ఒక్కటి కొట్టానంటే, మొహం పగుల్తుంది. నాసంగతెరగవ్ !" అన్నది లక్ష్మి, పుట్టింటి దగ్గిర నేర్చుకున్న నాజూకుతో.

"నన్ను కొట్టావా, మా నర్సన్నయ్య చంపేస్తాడు. జాగ్రత్త !" అన్నది చిట్టి. లక్ష్మి చిట్టిని ఒక్కటి పెట్టింది.

* * *

ఆ రాత్రే లక్ష్మి భర్త దగ్గిర వలవలా యేడిచింది.

"నన్నెంతెంతేసి మాటలన్నది! అదా అమాయకురాలు ! అమ్మో, దానికి గుడినీ గుడిలో లింగాన్నీ మింగే తెలివుంది. నే నింటోనుంచి లేచిపోవాలిట. తనూ అన్నా కలిసి నన్ను చంపుతారుట."

శివయ్య లక్ష్మి కంటినీరు చూడగానే నీరుగారిపోయాడు.

"ఊరుకో, ఊరుకో.... దానికేం తెలుసు ? దాని మొహం !.... ఎవరో అన్న మాటలు పట్టుకుని–"

"ఎవరనుకుంటారీ మాటలు ? అందరికీ ఇదే పనా ? గారాబంచేసి పాడుచేస్తే పిల్లలు నోటి కొచ్చిందల్లా అనకేం జేస్తారు ?"

"అయినా నువు దాన్ని కొట్టవలసింది గాదు, అది–"

"ఏమీ కందదు లెండి. మీరే పిల్లల్ని కనలేదు. మా అమ్మ, ఎనిమిది మందిని కన్నది, మిగలటం నలుగురమే మిగిలాం గాని! మమ్మల్ని ముద్దు పెట్టు

కోలేదు. మక్కెలు విరగ్గొట్టారు. ఒక్కదెబ్బ కొడితేనే కంది పొయ్యేది అదేం బాగుపడేడుస్తుంది ?"

"సవతి తల్లనగానే మొదట్లో అట్లా ఉంటుంది. క్రమంగా-"

"ఈ బొల్లి మాటలు నాకు చెప్పకండి. వంటలక్క చుట్టూతా 'అమ్మా అమ్మా' అంటూ పూసుకు తిరిగే దానికి నేనేం విషం పోశానని నన్నంత మాట లంటుందీ ?"

శివయ్య భార్య మాటలు వింటూ రకరకాలుగా బాధపడ్డాడు. కొత్త పెళ్ళా మన్న మార్దవమూ, ముచ్చట్లూ లేకపోగా చిట్టిని సమర్థించుకోవటంగాని లక్ష్మిని శాంతపరచటం గాని సాధ్యపడలేదు. పైపెచ్చు లక్ష్మి తన సంస్కారాన్ని గురించి తనకే సిగ్గయేటట్టు చేస్తున్నది. దాన్ని శివయ్య ప్రతిఘటించలేక పోయినాడు.

నిజానికి శివయ్యకున్న సంస్కారం లక్ష్మికున్న సంస్కారంకంటె ఎక్కువైనదనుకోగానే సమస్య పరిష్కారం కాలేదు. లక్ష్మికి తన సంస్కారంలో ఉన్న గాఢ విశ్వాసం శివయ్యకు తన సంస్కారంలో ఉన్నట్లు కనిపించలేదు. లక్ష్మి ఏ నీతి చెప్పినా తన జీవితానుభవంలోనుంచి తీసుకు చెబుతుంది. తనకు తల్లిదండ్రులేమీ ప్రేమ చూపలేదు గనకా తనను మక్కెలు విరగదన్నారు గనకా అందరి పిల్లలూ ఆ విధంగానే పెరగాలంటుంది. తను ఒక నిర్దుష్టమైన మనిషిలాగా మాట్లాడుతుంది. శివయ్య తనలో మూడోవంతు వయసులేని లక్ష్మితో ఆ విధంగా మాట్లాడలేకపోగా లక్ష్మి ఇతరుల కాదర్శప్రాయురాలు కానేరదనే మాటకూడా అనలేక పోయినాడు. ప్రపంచ చరిత్ర తీసి చూస్తే ఆత్మవిశ్వాసం గల తక్కువ సంస్కారాలు, ఆత్మ విశ్వాసం కోల్పోయిన ఎక్కువ నాగరికతలను జయించిన ఘట్టాలెన్ని ఉంటయ్యో !

ఉరుము ఉరిమి మంగలంమీద పడ్డట్టు లక్ష్మి ఆగ్రహం వంటావిడమీద పడింది. వంటావిడమీద అనేక నేరాలు ఆరోపించబడినై. ఆవిడ అనవసర ఖర్చు. వంటయేది మరోటయేది అయినవాళ్ళు చేసుకున్నట్టు పరాయివాళ్ళు చేస్తే ఉండదు. వెంకమ్మగారు పిల్లల్ని ప్రత్యేకించి చిట్టిని చెడగొట్టుతున్నది. ఆవిడ ఆసరా చూసుకునే చిట్టి భయభక్తులు లేకుండా ప్రవర్తిస్తున్నది. నోటికొచ్చిన మాటల్లా అంటున్నది. రేపు చిట్టి పెంకి పిల్లగా తయారయితే వెంకమ్మదేం పోయిందీ ?

ఈ కారణాలన్నీ ఎట్లా ఉన్నా శివయ్యకు లక్ష్మి మధ్యా వెంకమ్మ మధ్యా జరిగే వాగ్యుద్ధాలతో విసిగెత్తిపోయింది. తన కింద ఒక వంట మనిషి ఉన్నదనే విషయం చూసుకుని లక్ష్మి సంతోషించకపోవటమే శివయ్యకెంతో నిరుత్సాహం కలిగించింది. ఈ వాగ్యుద్ధాలు కూడా దేనికి ? నెలకాగానే వెంకమ్మగారి జీతం ఇచ్చేసి మరోచోట చూసుకోమని చెప్పేశాడు శివయ్యగారు.

వెంకమ్మగారు తడిచెయ్యి కొంగున తుడుచుకొని జీతం డబ్బులు అందుకుంటూ "నాదేమిటి, నాయనా? నావంటిది ఒకవేళ దుష్టురాలైతే ఒక్క క్షణంలో వొదిలించుకోవచ్చు !" అని ఒక విసురు విసిరింది.

శివయ్య ఆవిడకు ద్రోహం చేసి పశ్చాత్తాప పడుతున్నవాడల్లే, "మీరు ఆపదలో ఆదుకున్నారు. పిల్లల్ని ఎంతో బాగా చూశారు. మీ రుణం ఎప్పటికీ తీర్చుకోలేను !" అన్నాడు.

"ఎంత మాట నాయనా ? నే చేసేదేముందీ ? డబ్బు తీసుకున్నానూ, చాకిరీ చేశానూ! ఉచితంగా ఏమైనా చేశానా ?"

"దాందేమిటిలెండి ? అది మటుకెందరూ చేస్తారా!"

"ఆ మాట చాలు, నాయనా! అదే కలకాలం ఉంటుంది. వెళ్ళొస్తా నాయనా, దయ ఉంచండి."

వెంకమ్మగారు వెళ్ళేటప్పుడు పిల్లలిద్దరూ ఇంట్లోనే ఉన్నారు. చిట్టి ఆవిడ కేసి కొత్త మనిషిని చూసినట్టు చూసింది. దగ్గరికి పోలేదు. ఏడవలేదు. వెంకమ్మగారు చిట్టిని ఏడిపించాలని ఏమీ ప్రయత్నం కూడా చెయ్యలేదు. ఒక రూపాయి తీసి నరుసు చేతిలో పెట్టి, "నువ్వూ, చిట్టి ఏదైనా కొనుక్కోండి నాయనా!" అన్నది.

నరుసు చెయ్యిచాచి తీసుకున్నాడు. వెనకనుంచి లక్ష్మి మటుకు తీసుకోవద్దని కేకవేసింది. నరుసు వినిపించుకోలేదు. తీరా ఆవిడ వెళ్ళిపోయిన తరవాత లక్ష్మి వచ్చి "ఏదీ రూపాయీ ?" అని అడిగింది. నరుసు మాట్లాడలేదు. రూపాయి ఇవ్వనూలేదు.

# 3

"చిట్టిని చీటికీ మాటికీ కొట్టవద్దని చెప్పు నాన్నా?" అన్నాడు నరుసు. నరుసు సవతి తల్లిని గురించి తండ్రితో చాడీ చెప్పటం ఇదే మొదటిసారి. ఆవిణ్ణి "పిన్ని" అని పిలవమని శివయ్య పిల్లలిద్దరికీ ఎంతో బోధించాడు. కాని లాభం లేకపోయింది. ఇద్దరూ మొండికెత్తారు. ఇందులో ఒకరికొకరు చాలా మద్దతుగా ఉన్నట్టు శివయ్య కనుమానం. కాని చేసేదేముంది ?

"ఏమిట్రా నరుసూ ?" అన్నాడు శివయ్య విసుగ్గా.

నరుసుకోపం వచ్చింది. వాడి మనస్సులో లక్ష్మి మీద చాలా ఫిర్యాదులున్నై. చిట్టిచేత పనులు చేయిస్తుంది. చిట్టిని పుస్తకం పట్టుకు చదువుకోనివ్వదు. చిట్టికిగాని, తనకుగాని అన్నం ముందర ఏ వూరగాయి తినాలనిపించి అడిగినా, అది అయిపోయిందని చెబుతుంది. శివయ్యగారింట్లో పిల్లలకు ఇటువంటి చచ్చు అబద్ధాలు చెప్పటం ఎన్నడూ ఆచారం లేదు. లక్ష్మి అడుగు పెట్టేవరకూ పిల్లల మీద ఏవిధమైన నిరంకుశత్వమూ లేదు. అంతేగాక ఈ విధంగా పిల్లల్ని చూసే వాళ్ళను గురించీ శివయ్య జానకమ్మ హేళనగా చెప్పుకునేవాళ్ళు- పిల్లల ఎదటే చెప్పుకునేవాళ్ళు.

ఇవన్నీ కూడా నరుసు సహించటానికి సంసిద్ధుడైనాడు- లక్ష్మి చిట్టిని కొట్టకుండా ఉంటే, మిగిలినవన్నీ ఒక ఎత్తూ, ఇదొక ఎత్తూ అయింది నరుసు ప్రాణానికి. తండ్రి ఇవన్నీ చూడటంలేదా? పైగా తన మీద చిరాకు పడతాడెందుకు? నరుసుకు కోపం వచ్చి మనస్సులో ఉన్న ఫిర్యాదులన్నీ చేసేశాడు.

చిట్టి సహాయం చెయ్యకపోతే వంట జరగదా? అయితే ఆ వెంకమ్మగార్నెం దుకు పంపాలి? చిట్టి ఈ యీడుకే ఇంటి పనులన్నీ నేరవాలా? అది ముఖ్యమా దాని చదువు ముఖ్యమా? ఏ చింతకాయ పచ్చడో కావాలంటే వెయ్యనన్నైనా చెప్పక లేదని చెప్పటమేమిటి? చిట్టిని చీటికీ మాటికీ మొట్టికాయలు వెయ్యటమేమిటి? చిట్టిని తను బజార్లో కొనుక్కుందా? ఏమిటిదంతా?

"నిజంగా చిట్టి ఏదన్నా చెయ్యరాని పనిచేస్తే నువు కొట్టరాదా నాన్నా ?" అని అడిగాడు నరుసు.

శివయ్య లక్ష్మిని పిలిచి ఖిన్నుడై సంజాయిషీ అడిగాడు. లక్ష్మి ఇటువంటి పనులు చెయ్యటంవల్ల తనకెక్కువ బాధ కలిగిందీ, వాటిని గురించి నరుసు విమర్శించటంవల్ల ఎక్కువ బాధ కలిగిందీ ఆయనకే తెలీదు. కాని మనం తెలుసుకో గలం. ఎందుకంటే నరుసు తనతో ఈ ప్రస్తావన తీసుకురాకపోతే ఆయన తనంతట తాను లక్ష్మిని దేనికీ సంజాయిషీ అడిగి ఉండడు.

లక్ష్మి ఏమీ పిచ్చిదికాదు. ఆమాటే శివయ్యగారికి తెలిసివచ్చేటట్టు అంటించింది.

"మీ అబ్బాయి వచ్చి చెవులో ఊదగానే నాది ఘోరమైన తప్పయిందా? పిల్లలకు పని నేర్పరా? వాళ్ళ చెప్పుచేతల్లో అడుగులకు మడుగులొత్తుతూ ఉంటారా? మీ కలవాటేమో నేనెప్పుడూ ఎరగను. నేనేమీ మీ పిల్లల్ని చాటుగా కోసుకు తినటం లేదు. నే చేసేదంతా మీ ఎదటే చేస్తున్నాను. నా పిల్లల జోలి నీకెందుకని స్పష్టంగా చెప్పెయ్యండి. పీడా విరగడైపోతుంది. వాళ్ళను నేను పెట్టే బాధకన్న వెయ్యింతలు బాధ వాళ్ళే నన్ను పెడుతున్నారు- చూసేటందుకు కళ్ళుండాలిగాని!"

తెలివైన మాటలు! లక్ష్మి పుట్టి పెరిగిన వాతావరణంలో ఈపాటి మాటకారితనానికంతా తలలొగ్గేస్తారు. ఈ ధోరణి శివయ్యకెంత కంపరం ఎత్తించినదీ లక్ష్మికి తెలీదు. తెలిసే అవకాశం లేదు. ఎందుచేతంటే శివయ్య తలఒగ్గాడు-లక్ష్మి సంస్కారానికి కాదు, లక్ష్మికి. ఆ తేడా లక్ష్మి గ్రహించే అవకాశం లేదు.

"ఏమైనా, నువ్వు మాత్రం దాన్ని కొట్టబోకుదూ! అదేమైనా చేస్తే నాతో చెప్పు!" అన్నాడు శివయ్య.

"అదికూడా ఎందుకూ? ఎత్తుకుని ముద్దులాడటానికా? వొద్దులెండి." అని మొగుణ్ణి దెప్పింది లక్ష్మి.

ఈ సంఘటనవల్ల లక్ష్మి ప్రవర్తనలో ఏమీ మార్పు రాలేదు-చిట్టిని కొట్టటంతో తప్ప చిట్టి చదువు చూస్తే లక్ష్మికి కారం రాచినట్టయేది. చిట్టి పుస్తకం పట్టుకున్నా

బడికి పోవటానికి తయారవుతున్నా, ఆఖరుకు బడి విషయాలింట్లో మాట్లాడినా లక్ష్మికి దయ్యం పట్టినట్టయ్యేది. ఆడవాళ్ళ చదువుల్నీ, చదువుకున్న ఆడవాళ్ళనీ చెడతిట్టేది. చిట్టిని కొట్టటం మానేసింది గనక రోజుకు తొంభై చాడీలు చిట్టిమీద తన మొగుడితో చెప్పేది.

మొదట్లో శివయ్య ఈ చాడీలు వినిపించుకోనట్టు నటించాడు. కాని రాను రాను చిట్టిని చివాట్లు పెట్టటంలోకి దిగాడు. ఒకనాడు ఆయన చిరాకు పట్టలేక చిట్టిని ఒకటి కొట్టాడు కూడానూ. ఆ దెబ్బతిని చిట్టి ఏడవలేదు. తల వొంచుకొని అవతలికి వెళ్ళిపోయింది. అవతలికి వెళ్ళి ఎవరూ చూడకుండా గుండె పగిలేటట్టు ఏడిచింది.

"తాడితెడు పిల్లకు బారెడు రోషం! అదంతా బాధే?" అని అడిగింది లక్ష్మి, భర్త మనసులో రేగే కల్లోలానికి ఉపశాంతి చెయ్యటానికి.

లక్ష్మి ఉద్దేశంలో శరీరానికి కలిగే బాధే యథార్థమైనదనీ, మనసుకు కలిగే బాధలను వేదాంతరీత్యా పరిగణించ నవసరం లేదనీనూ!

లక్ష్మి ఉద్దేశం నెరవేరింది. ఆమె అన్న ఆ మాటతో శివయ్య అంతరాత్మ శాంతించింది. ఇప్పుడు లక్ష్మి సంస్కారానికీ శివయ్య సంస్కారానికీ ఆట్టే వ్యత్యాసంలేదు.

* * *

నరుసు కాలేజీ చదువుకు వెళ్ళిపోయినాడు. దూరం వెళ్ళిన తరవాత చిట్టి మరింత దగ్గిరికి వచ్చినట్టయింది. చిట్టి జ్ఞాపకం వచ్చినప్పుడల్లా నరాలన్నీ లాగినట్టయ్యేది. ఉక్కు సంకెళ్ళతో బంధించబడినవాడు చెప్పరానంత స్వాతంత్ర్యకాంక్షకు లోబడిపోయి బంధ విముక్తుడు కావటానికి ప్రయత్నించటంలో ఎంత వేదనా, బాధా పడతాడో నరుసు చిట్టిని గురించి అంత బాధాపడేవాడు. బంధితుడు పెనగులాడ నంత కాలమూ బంధాలను మరిచిపోయే అవకాశం ఉంది. నరుసు పెనుగులాడ సాగాడు.

తను చెయ్యగలిగిందేమీ లేదు. ఈ క్షణాన చిట్టిని ఆ నరకంలో నుంచి పైకి లాగి తన దగ్గరనే ఉంచుకోవాలని ఉంది నరుసుకు. కాని అది ఎట్లా పొసగుతుంది? తన కిల్లా వాకిలా? ఎప్పుడో తనకు పెళ్ళి కావాలి, పెళ్ళాం కాపరానికి రావాలి, ఉద్యోగం దొరకాలి. అప్పుడు చిట్టి వచ్చి తన ఇంట్లో ఉంటుంది! అయ్యో ఖర్మ, అప్పటికి చిట్టిక్కూడా పెళ్ళి అయిపోతుంది!

ఇటువంటి ఆలోచన కలిగినప్పుడల్లా చిట్టికీ తనకూ రుణం తీరినట్టనిపించి నరుసుకు వొళ్ళంతా చెమటలు పోసేవి.

"నేను వట్టి వెధవను కాకపోతే, ఇంకా నాలుగేళ్ళు పెద్దవాణ్ణయి ఉండరాదూ? చిట్టిని ఆ మహామారినుంచి రక్షించటానికి ఏదారీ లేకపోవటం తన అసమర్థతేనని నరుసు నమ్మాడు. నెపోలియన్, గాంధీవంటి లోకోత్తర పురుషులు తన స్థితిలో ధైర్యంగా ఏదో ఒకటి చేస్తారుగాని ఊరికే గుడ్లు పెట్టుకు చూడరని అతని విశ్వాసం.

నరుసు బాధ కాలక్రమాన పెరిగింది గాని తరగలేదు. అతను కాలేజీకి పోతున్నాడు. పాఠాలు వింటున్నాడు. చదువుతున్నాడు. స్నేహితులతో తిరుగు తున్నాడు. సరదాగా కూడా కాలం గడుపుతున్నాడు. అయినా చిట్టిని గురించిన మనోవ్యాధి ఒక చెంప అతన్ని తినేస్తూనే ఉంది.

నరుసు ప్రతి శెలవలకూ ఇంటికి పోతుండేవాడు. వెళ్ళినప్పుడల్లా చిట్టికి పర మానందంగా ఉండేది. ఆ ఆనందాన్ని బట్టి చిట్టి కష్టాలు నరుసుకు పదింతలుగా కనిపించేవి.

"ఒక మనిషిని చూసి ఇంకో మనిషి కింతగా ప్రాణం లేచిరావటం అసహజం. అవతల చిట్టి ఎంతో నరకం అనుభవిస్తూ ఉండకపోతే నన్ను చూసి ఇంత సంతో షించదు" అనుకున్నాడు నరుసు. ముందు ముందు సాహితీపరుడు కాబోయే లక్షణా లప్పుడప్పుడే అతనిలో తల ఎత్తసాగినై.

ఇంకో విషయం కూడా నరుసు కాలక్రమాన తెలుసుకున్నాడు. నరుసు లేన ప్పుడు చూసినట్టుగా లక్ష్మి చిట్టిని నరుసున్నప్పుడు చూడటంలేదు. తనంటే లక్ష్మికి ఏదో బెదురుంది. లక్ష్మికే ఏమిటి? తన తండ్రిక్కూడా తనమీద ఏదో కొంతగురి ఉంది. కాని దాన్ని వినియోగపరచుకునే మార్గం ఏది?

ఈ మార్గం అతను బియ్యే మొదటి సంవత్సరం పూర్తి చేసిన తరవాత వేసవి శలవుల్లోగాని అతనికి స్ఫురించలేదు.

నరుసుకు పందొమ్మిది నిండినై, త్వరలోనే చిట్టికి పదకొండు నిండుతై. చిట్టి బడికిపోవటం మానేసి అప్పుడే రెండేళ్ళయింది. లక్ష్మికి ఆడపిల్ల కలిగింది లగాయతూ చిట్టి బడిమొహం ఎరగదు. చిట్టి బడికిపోతే పాపాయికి అడ్డమైన చాకిరీ ఎవరు చేస్తారూ? పొత్తిళ్ళ గుడ్డలు దగ్గర్నించీ ఎవరు మారుస్తారు? ఏడుస్తుంటే పాపాయిని వీపున వేసుకుని ఎవరు తిరుగుతారూ?

ఇప్పుడు పాపాయికి రెండోయేడొచ్చింది గనక లక్ష్మి మొగుణ్ణి చిట్టి పెళ్ళి విషయమై తొందర చెయ్యసాగింది. సామాన్యంగా ఆడపిల్లకు వెతికితేగాని సంబంధం దొరకదు. శివయ్య ఇంకా అన్వేషణ ప్రారంభించలేదు. ఈ స్థితిలో చిట్టిని వెతుక్కుంటూ ఒక సంబంధం వచ్చింది. వరుడు ముప్పై ఏళ్ళవాడు, రెండో పెళ్ళి, బోలెడంత ఆస్తికూడా ఉంది. చిట్టినిస్తారా అంటూ వచ్చి అడిగారు. వెయ్యి నూట పదహార్లు, లాంచనాలూ తప్ప వారు పెద్ద కట్నాలూ కానుకలూ కూడా అడగలేదు.

ఈ పెళ్ళి చెయ్యమంటూ కూర్చుంది లక్ష్మి. దగ్గరికొచ్చిన సంబంధం తోసేస్తే వెతకటం మాటలా అన్నది. ఏ క్షణానగాని చిట్టి పెద్దమనిషై కూచుంటే ఇంకేమన్నా ఉందా అన్నది. (చిట్టికి రజస్వలానంతర వివాహమే చెయ్యటానికి అదివరకే సంకల్పించిన శివయ్య ఇప్పుడామాట భార్యతో అనటానికి సాహసించ లేకపోయినాడు. ఇటీవల లక్ష్మి సంస్కారమే శివయ్య సంస్కారం కన్న ఒక

బత్తెడు పైకి వెళ్ళిపోయింది!) రెండోపెళ్ళి చేసుకుని డబ్బు లేకపోయినా తను సుఖంగా ఉన్నప్పుడు, అంత చిన్న మొగుడితో, అంత డబ్బుతో చిట్టి ఎందుకు సుఖపడదని అడిగింది. (దీనికి కాదనటం ఎట్లాగో శివయ్యకు తెలీలేదు).

అదృష్టవశాత్తు ఈ సంబంధం నరుసు శెలవల కింటిదగ్గర ఉండగా వచ్చింది. తండ్రి ఏ కారణంచేతో మెత్తబడ్డట్టు కనిపించటం గ్రహించి నరుసు తన నిర్ణయం స్పష్టంగా చెప్పేశాడు.

"చిట్టి పెళ్ళి కిప్పుడేమీ తొందర్లేదు. రెండో పెళ్ళి సంబంధం ఇవ్వటానికి వీల్లేదు. దిక్కులేని పిల్లల నట్లా ఇస్తారు."

"నేను దిక్కులేని దాన్నయే రెండో సంబంధం చేసుకున్నానా!" అన్నది లక్ష్మి.

"రేపు చిట్టి బుద్ధిపూర్వకంగా అయిదో పెళ్ళి సంబంధం చేసుకుంటే నేను మాట్లాడను. కాని దిక్కున్న పిల్లల్ని తీసుకుపోయి పెద్దవాళ్ళు చూస్తూచూస్తూ ముసలివాళ్ళకి ఇవ్వరు" అన్నాడు నరుసు.

ఇదంతా వింటున్న శివయ్య మోహం జేవురించింది గాని మాట్లాడలేదు.

లక్ష్మి మటుకు చాలా దర్పంగా, "ఈ విషయాలన్నీ నీమాత్రం మీనాన్నగా రాలోచించలేక పోర్లే ?" అన్నది.

"నే నాలోచించ లేనప్పుడు గద ఇంకోరి కాలోచన వదిలెయ్యటం. చిట్టికి నేను ఎవరికన్న దూరం వాణ్నని ?" అన్నాడు నరుసు. చిట్టి పెళ్ళి గొడవ ఆ తరువాత ముందడుగు వెయ్యలేదు.

ఈ విషయం ఇట్లా ఉండగానే నరుసుకొక సంబంధం వచ్చింది. ఈ సంబంధం నరుసుకుగాని శివయ్యకిగాని కొత్తదికాదు. చలపతిగారని వాళ్ళకి దూరపు బంధువు. ఆ వూళ్ళోనే ప్లీడరు. తన కూతుర్ని నరసుకు చేసుకోమని కోరాడు. శివయ్య లాంఛనం మాటలన్నీ అని ఆలోచించి చెబుతా నన్నాడు. చలపతిగారు వెళ్ళిపోయినాడు.

ఈ విషయమై నరుసు ఎటూ తేల్చుకోలేకపోయినాడు. చిట్టి పెళ్ళి తృప్తికరంగా జరిగే వరకూ తాను పెళ్ళాడటం భావ్యంకాదని మొదట అనిపించింది. అందుకని మరి మూడేళ్ళదాకా ఈ ప్రసక్తి వద్దనుకున్నాడు. కాని ఈ ఆలోచన వెనకడితే మరో ఆలోచన కూడ వచ్చింది. చలపతి కూతురు పెద్దపిల్ల. పెళ్ళాడి వెంటనే కాపరానికి తెచ్చుకుంటే చిట్టిని ఇక్కణ్ణుంచి లేవదీయవచ్చు! ఇంకో మూడేళ్ళు చిట్టి ఈ కొంపలో ఉండనా ?

తన తండ్రి చలపతిగారితో ఆలోచించి చెబుతానన్నప్పుడు తనతో ఆలోచిస్తాడేమోనని సహజంగా నరుసు ఊహించాడు కాని అదేమి జరగలేదు. జరగవలసిన ఆలోచనేమో భార్యభర్తల మధ్య జరిగిపోయింది.

"చాల్లేండి ! చలపతిగారమ్మాయి పెద్దమనిషై ఏడాదయింది. ఎవరికి తెలిదనీ? ఇంకో రెండేళ్ళాగండి మా రాజికూతుర్ని చేసుకోవచ్చు. దానికింకా ఎనిమి దేళ్ళు నిండలేదు" అని లక్ష్మి సలహా ఇచ్చింది. రాజి కూతురు మాట ఎట్లావున్నా చలపతిగారమ్మాయి అక్కర్లేదనేది ఖాయం అయింది గనక శివయ్య భార్యతో సమాలోచన పూర్తి చేశాడు.

చలపతిగారు నరసుమీద గట్టి ఆలోచనే పెట్టుకున్నాడు. వాళ్ళ ఇందిర నరసును చేసుకోవటానికి చాలా ఇష్టంగా ఉన్నట్టు కనిపించింది. చిట్టికన్న మూడు నాలుగేళ్ళు పెద్దదైనా బళ్ళో ఇద్దరూ స్నేహంగా ఉండేవాళ్ళు. ఇందిర నరసుతో ఎప్పుడు మాట్లాడకపోయినా అతన్ని చాలాసార్లు చూసింది. చిట్టి నరసును గురించి ఇందిరతో అంతులేకుండా చెప్పేది. ఇటువంటి ప్రచారం ఊరికే పోదు.

ఇందిరను నరసుకిచ్చి చేస్తే బాగుంటుందనే అభిప్రాయం చలపతిగారికి స్వతహాగా కలుగలేదు. కాస్త కట్నం ఎక్కువ ఇచ్చినా తన పిల్లను పదిమంది బలంగల ఇంట్లో ఇద్దామనుకున్నాడు. చాల రోజులు అటువంటి సంబంధాలే చూశాడు కూడానూ. ఊళ్ళో దగ్గిర్లో సంబంధం పెట్టుకుని ఎక్కడో వెతుకుతావేమని ఎవరో శివయ్య కొడుకు సంబంధం సూచించారు. అంతవరకల్లా పెళ్ళి సంగతి ఎత్తితే ముభావం గానూ, ఒక్కసారి ఆమదం తాగే మొహం పెడుతూనూ వచ్చిన ఇందిర, నరసు పేరు చెప్పగానే నోరుతెరచి తన కిష్టమేనన్నది. చలపతిగారు ఈ సంగతి తేల్చుకోందీ మరో సంబంధం ఆలోచించనక్కర్లేదని రూఢి చేసుకున్నాడు.

కాని చలపతిగారికి చుక్కెదురయింది. మంచి ముహూర్తం చూసుకుని తను పెళ్ళి అడిగితే ఆలోచించి చెబుతానన్న శివయ్య మళ్ళీ వెళ్ళినప్పుడు, "మా వాడి పెళ్ళి ఇప్పుడు పడదులెండి" అన్నాడు. ఇప్పుడు చలపతిగారికి నిరుత్సాహం వెంట కోపం కూడా వచ్చింది.

"ఏమిటి ఆటంకం ?" అన్నాడాయన, ఇదేదో కట్నాల పేచీ అయి ఉంటుం దని రూఢి చేసుకుని.

"దానికంతా ఉందిలెండి" అని శివయ్య తప్పుకో జూచాడు. కాని చలపతిగారు వదల్లేదు. మనసులో ఉన్నమాటేమిటో చెప్పు అన్నాడు. కట్నాలా, లాంఛనాలా ? ఏమిటి విషయం ?

"మరేంలేదు. మా చిట్టెమ్మ పెళ్ళిచేసి తరవాత పిల్లవాడి సంగతి చూద్దామను కుంటున్నా" అన్నాడు శివయ్య ఎదురుగా ఉన్న కూతుర్ని అడ్డంపెట్టి.

చలపతిగారు చిట్టిని దగ్గిరికి పిలిచి ఒళ్ళో కూచోబెట్టుకుని, "చిట్టి పెళ్ళికప్పుడే ఏం తొందరా ?....ఏం తల్లీ, మీ అన్నయ్య పెళ్ళయితే నువేం కట్నం కోరతావు ? మా అమ్మాయి కిటువంటి ఆడబిడ్డ దొరికితే అల్లుడికి కట్నమన్నా మానేసి ఆడ పడుచు కిద్దునే !" అంటూ చిట్టిని ముద్దుచేశాడు. చిట్టికి చప్పున కళ్ళనీరు దిగింది. తనని పెద్దవాళ్ళు గారాబంచేసి ఎన్నో ఏళ్ళయింది.

"అందుకనే పిల్లవాడి పెళ్ళి ఇప్పట్లో తలపెట్ట దలచలేదు." అన్నాడు శివయ్యగారు. తన తండ్రి మరేదో లోకంలో నుంచి మాట్లాడుతున్నట్టు తోచింది చిట్టికి. ఈ పెళ్ళికి ఎందుకొప్పుకోడు ? ఇందిర ఎంత అందంగా ఉంటుంది ? ఎంత మంచిది ! తనూ, ఇందిరా, నరుసూ ఒక చోటుంటే ఎంత బాగుంటుంది.

శివయ్యగారు మన్ను తిన్న పాములాగే కదలకపోవటం చూసి చలపతిగారు బ్రహ్మాస్త్రం ప్రయోగించారు. అయిదువేల కిమ్మతుగల కట్నాలూ, కానుకలూ శివయ్యగారి ముందు ఝళిపించాడు. శివయ్య కొద్దిగా కదిలాడుగాని మళ్ళీ ససేమిరా పూనింది.

చివరకు విసిగి చలపతిగారు, "మీ కుర్రవాడి అభిప్రాయం కూడా ఇంతేనా?" అన్నాడు లేచి వెళ్ళిపోతూ.

"అసలు నాకన్న కూడా మావాడికే చిట్టి పెళ్ళి ముందు కావాలనే పట్టుదల జాస్తిగా ఉంది" అన్నాడు శివయ్య.

చలపతిగారు దీర్ఘ నిశ్వాసంచేసి శలవు పుచ్చుకున్నాడు.

బయటికి వెళ్ళిన నరుసు తిరిగిరాగానే చిట్టి అతన్ని అవతలికి తీసుకుపోయి జరిగిందంతా చెప్పింది. వందమంది శిఫార్సు చేసినా నరుసు, చలపతి కూతుర్ని చేసుకోవడానికి తీర్మానించుకుని ఉండడేమోగాని చిట్టి రెండుసార్లు "పాపం, చలపతి గారు"-అనేటప్పటికి నరుసు మనసు ఆయనవైపు మొగ్గింది.

"నువ్వేమీ తొందరపడకు. నేనీ విషయం చూస్తాను," అన్నాడు నరుసు.

ఆరోజు సాయంకాలం నరుసు చలపతిగారింటికి వెళ్ళాడు. ఇంటి ముందున్న ఖాళీ స్థలంలో నీళ్ళు చల్లుతున్న నౌకరు, "అయ్యగారింట్లో లేర"ని చెప్పాడు.

"ఎంతసేపటికి వస్తారు?" అని నరుసు అడుగుతుండగా చేతిరుమాలులో ఇన్ని మల్లెపూలూ, చేతిలో సూదీదారమూ పట్టుకుని ఇందిర బయటికొస్తూ, "ఒరే వెంకా, పడక్కుర్చీ పట్రారా" అని కేకేసి నరుసుని చూసి ఆగిపోయింది.

వెంకడు గబగబా లోపలికెళ్ళాడు.

"మీ నాన్నగారికోసం వచ్చాను." అన్నాడు నరుసు కొంచెం కంగారుపడి.

"చిట్టికూడా వచ్చిందా ?" అన్నది ఇందిర కంగారుతో.

"మీ నాన్నగారింటో లేరని చెప్పాడు. ఎప్పుడొస్తారు?" అన్నాడు నరుసు,

"ఇప్పుడే వస్తాడు నాన్న." అన్నది ఇందిర పూర్తిగా మతిపోయి. చలపతి గారు రాత్రి పదింటికైనా ఇంటికి తిరిగివస్తాడనే రూఢి ఇందిరకు లేదు. ఆ పరిస్థితిలో ఇప్పుడే వస్తాడని నరుసుకు భరవసా ఇవ్వటంలో అర్థం లేదనే అనుకోవాలి.

తను వెంటనే వెళ్ళిపోనవసరం లేదని నరుసు అర్థం చేసుకున్నాడు. నరుసు వెళ్ళిపోక ఎందుకు నుంచున్నాడు? అతను మరో నిమిషం సేపు అట్లాగే నిలబడితే తనేం చెయ్యాలో తెలీక తికమకపడింది ఇందిర.

వెంకడు పడక్కుర్చీ తెచ్చి ఆరుబయట గడ్డి ఉన్న ప్రదేశంలో వేశాడు. నరుసు పడక్కుర్చీ వేపు ఆశగా చూశాడు.

ఇందిర "కూర్చోండి" అన్నది. ఆమె ఆజ్ఞాపించక పోయినా వెంకడు మరో కుర్చీ కూడ తెచ్చి గడ్డిమీద వేశాడు.

"కూర్చోండి" అన్నది ఇందిర మళ్ళీ.

ఏ కుర్చీలో కూర్చోవాలో నరుసుకు చప్పున తెలీలేదు. తను మామూలు కుర్చీలో కూర్చుంటే ఆ పిల్ల-ఆ అమ్మాయి-పడక్కుర్చీలో కూచుంటుందా? అట్లా కూచుందామంటే అసహ్యంగా ఉండదూ? అందుకని పడక్కుర్చీలో కూచుందామంటే తనకు మర్యాదగా ఉండదేమో?

"కూర్చోండి" అన్నది ఇందిర మూడోసారి, అతను కూచోందే తను కూచోటం బాగుండదని.

నరుసు సాహసించి పడక్కుర్చీలో కూచుని వెనక్కు వాలి పడుకున్నాడు. పడుకోవటమంటే ఏటవాలుగా పడుకోవటం కాదు. ఏకంగా కాంపుకాటుమీద పడుకున్న భావం కలిగింది నరుసుకు. అతను కంగారుతో లేచి కూచున్నాడు. కూచుంటే కుర్చీ ఒక అంచున బాలెన్సు చేస్తున్న భావం కలిగింది. అటువంటి పడక్కుర్చీ నరుసెప్పుడూ చూడలేదు.

అది కుర్చీలోపం కాదనీ, వెంకడు వెధవ కుర్చీస్టాండును ఆఖరు మెట్టుమీద పెట్టాడనీ నరుసుకు క్రమంగా అర్థమయింది. అతను లేచి స్టాండును రెండు మూడు మెట్లు పైకి లాగిపెట్టి మళ్ళీవచ్చి కూచుని ఒక పక్కకు ఒరిగి ఊరుకున్నాడు.

ఇందిర నవ్వు ఆపుకుంటూ, "తప్పు పెట్టారు ఒకవేపు పైకి, ఒకవేపు కిందికీ ఉంది." అంటూ లేవబోయింది. కాని నరుసు చప్పునలేచి స్టాండును రెండో వేపు కూడా పైకెత్తిపెట్టి రెండువేపులా సమంగా ఉన్నట్టు రూఢిచేసుకుని మరీ కుర్చీలో కూచున్నాడు.

ఆ కుర్చీస్టాండు భార్యాభర్తల పరస్పర సమన్వయం లేని సంసారంలాగా అయిపోయి, ఒక పక్క ఎగసన లాగినా రెండోవేపు కదలని స్థితిలో ఉంది.

నరుసు సుఖాసీనుడైనట్టు తెలుసుకుని ఇందిర పూలు గుచ్చసాగింది. ఈ పిల్ల తన భార్య అయి రోజూ సాయంకాలం పూట ఈ విధంగా ఆరుబయట కూచుని పూలు గుచ్చుతూ ఉంటే బాగానే ఉంటుందని తనకు తాను నచ్చచెప్పుకోవటంలో నిమగ్నుడై నరుసు తేలుకుట్టినట్టు లేచి, "మీ నాన్నగారింకా రాలేదే" అన్నాడు, తను వచ్చి ఇంకా అయిదు నిమిషాలు కానప్పటికీ.

రాలేదని ఇందిర ఒప్పుకున్నది. తనకదే కావలసిందన్నట్టుగా నరుసు మళ్ళీ కుర్చీలో వాలి, రోజూ - ఎండయేది, వానయేది, చలి అయేది - తనూ, ఈ పిల్లా - అదే ఈ అమ్మాయీ - ఈ విధంగా ఆరుబయట కూచుని, ఈ అమ్మాయి - వేసం

కాల మయేది, వానాకాల మయేది, చలికాల మయేది - ఇట్లా మల్లెపూలు గుచ్చుతూ ఉంటే బాగానే ఉంటుందనటానికి మరికొన్ని ప్రబల కారణా లాలోచించసాగాడు.

ఈ ఆలోచనలను భగ్నం చేస్తూ చప్పుడయింది. తలవాకిలి తలుపు చప్పుడయింది. చలపతిగారు మొదట కూతుర్ని పలకరించి తరవాత పడకకుర్చీలో ఉన్న వ్యక్తిని గురించి, "ఎవరూ ?" అన్నారు.

నరుసు పడక్కుర్చీలో నుంచి హౌడూగ్గాలేచి, "నేనండి శివయ్యగారబ్బాయిని మీతో మాట్లాడటానికి వచ్చాను" అన్నాడు.

* * *

నరుసు ఇంటికి తిరిగి వచ్చేటప్పటికి రాత్రి ఎనిమిదిన్నర కావచ్చింది. భోజనాల దగ్గిర నరుసు తండ్రితో, "చలపతిగారు కనిపించారు" అన్నాడు.

పరధ్యానంగా శివయ్యగారు, "ఉఁహూఁ!" అన్నాడు.

"వాళ్ళ ఇందిరను నా కిద్దామని ఉందన్నాడు."

"ఊఁ!"

"నా కభ్యంతరం ఏమీ లేదన్నాను."

"ఆఁ!" శివయ్యగారికి తాగుతున్న నీరు కొరబోయింది.

"చేసుకుంటానని మాటకూడా ఇచ్చాను."

"నన్నడక్కుండానే?"

"ఫలాని పిల్లను చేసుకోనా, వద్దా అని నిన్నడగనా?" అన్నాడు నరుసు నవ్వుతూ. "చేసుకోవాలో, వొద్దో నీకు మాత్రం ఏం తెలుస్తుంది?"

"అందుకని నాతో సంప్రదింపు అవసరం లేదా ఏమిటి?"

"ఇదుగో సంప్రదిస్తుంటినిగా? ఇంకో పదిరోజుల్లో లగ్గం ఉందిట, మనకు వ్యవధి చాలుతుందా?"

"ఎంత మాత్రమూ చాలదు"

"ఆడపెళ్ళివారైనా వారికి చాలుతుందిటగా?"

"మన సంగతి మనకు తెలుస్తుందిగాని వారి సంగతి మనకు తెలుస్తుందా ఏం?"

"మనకు వ్యవధి ఎందుకు చాలదూ?"

"ఎందుకైననూ."

"నాతో చెప్పటానికేం? ఎందుకు చాలదూ ?"

"సవాళ్ళు వేస్తున్నావా?"

"నేను మంచిచెడ్డ లడుగుతుంటేనే సవాళ్ళంటున్నావే? సవాళ్ళు వేస్తే ఏమంటావ్! నేనెందు కడిగానంటే, పదిరోజులు మనకు చాలకపోతే పన్నెండు రోజుల్లో మరో మంచి లగ్గం ఉందిట."

"నీ వెటకారం నాకేమీ బాగాలేదు. ఇంట్లో పెద్దవాళ్ళుండగా మధ్య నువు వెళ్ళి మాటివ్వటం ఎందుకు జరగాలిసొచ్చిందీ?"

"ఉన్న పెద్దవాళ్ళిద్దరూ ఇక్కడే ఉన్నారుగా? ఈ సంబంధంలో మనకు హితం కానిదేదన్నా ఉంటే చెప్పండి! నేను రేపువెళ్ళి ఈ కారణంచేత మీ సంబంధం మాకు పనికిరాదుట, పెద్దవాళ్ళు చెప్పారని నేను చలపతిగారితో అంటాను."

"ఏ కారణమూ చెప్పకుండా నేనీ సంబంధానికి ఒప్పుకోకపోతే ఏం చేస్తావ్?"

"ఆ సంగతి ఆలోచించలేదు. నువ్వంత అర్థం లేకుండా మాట్లాడతావని నా కెందుకు తడుతుందీ?"

"నే నర్థం కలిగే మాట్లాడుతున్నాను."

"ఏమిటి? నేనీ సంబంధం చేసుకోవటానికి వీల్లేదంటావా?"

"వీల్లేదు."

"అట్లా అయితే నా పెళ్ళి నువ్వు రాకుండానే జరిగిపోతుంది. ఏదన్నా బలమైన కారణం ఉంటే ఆడినమాట తప్పగలను గాని మా నాన్న నిరంకుశంగా మాట్లాడాడని నేను అన్నమాట తప్పలేను. పెద్దమనిషి నా అభిప్రాయం అడిగాడు. అడిగాడు కదా అని చెప్పాను."

"ఆ చలపతిగారి సంగతి కొంచెం కనుక్కుంటాను. ఆయనతో ఇప్పుడు పెళ్ళి వీల్లేదని స్పష్టంగా చెప్పాను. మళ్ళీ నిన్నెందు కడగవలసి వచ్చిందీ ? నన్ను పిచ్చివాణ్ణి చెయ్యలేక నిన్ను సులభంగా చేద్దామనా ?"

"ఆయనతో సంబంధం పిచ్చివాళ్ళుగాని చేసుకోరా ఏం ? ఆయనలో పిచ్చి నాకేమీ కనిపించలేదు—కూతురిమీద ఆపేక్ష తప్ప.... ఆ విషయం అట్లా ఉంచి నువ్వాయన్నే పిచ్చివాణ్ణి చేశావుటగా? నాక్కూడా ఈ పెళ్ళి ఇష్టంలేదని చెప్పావుట? నేను నీతో ఈ మాట ఎప్పుడన్నానూ ?"

శివయ్య జవాబు చెప్పలేదు. ఒక నిమిషంపాటు నోట్లో ముద్దకూడా పెట్టుకో లేదు. ఆఖరుకు, "ఇంకేం ? మాట ఇచ్చినవాడివి పెళ్ళి ప్రయత్నాలు కూడా నువ్వే చేసుకో !" అన్నాడు.

"పెళ్ళి ప్రయత్నా లేమీలేవు. ఒకరోజు పెళ్ళి. నావేపు ఖర్చులు కూడా ఆయనే పెట్టుకునేట్టూ, నా కాయన ఇవ్వగలిగినదంతా ఆయన నాపేర బాంకులో వేసేటట్టూ, సాధ్యమైనంత క్లుప్తంగా పెళ్ళి చేసేటట్టూనూ."

"పెళ్ళి కెవర్నీ పిలవ్వా ?"

"నా క్కావలసిన వాళ్ళందర్నీ నేను పిలుస్తాను. నీక్కావలసిన వాళ్ళందర్నీ నువు పిలు, నాకేమీ అభ్యంతరం లేదు."

పెళ్ళి ఖాయమయింది.

చలపతి నరుసును అప్పుడే బుట్టలో వేసుకున్నాడనీ, రజస్వల అయిన

పిల్లను చేసుకున్న వాళ్ళంతా అధోగతికి పోతారనీ, ఎవరూ చేసుకోని పిల్లను నరుసు కంటగట్టారని లక్ష్మి నాలుగైదురోజులు నసపెట్టింది. కాని అకస్మాత్తుగా ఆవిడకు తన లాంఛనాల మాటా, తన కూతురు పాపాయి లాంఛనాలమాట స్ఫురణ కొచ్చింది. ఉన్న ఒక్క మగపిల్లవాడి పెళ్ళికి తను సమ్మెచేస్తే తనకు కలిగే అవకాశం కాస్తాపోతుంది. అందుచేత లక్ష్మి భర్తదగ్గిర ముందుగానే నీలుగు ప్రారంభించింది.

"ఓ చెంప అంతా అయిపోతుంటే చూస్తూకూచుంటారేం? నాకూ, పాపాయికీ ఏమిస్తారో ఇప్పుడే ఖండితంగా తేల్చుకోండి ! ఊఁ !" అన్నది లక్ష్మి.

"నీకాృవలిసినవన్నీ నేనిస్తాలే !" అన్నాడు శివయ్య విసుగుతో.

* * *

నరుసు పెళ్ళయింది. గృహప్రవేశంనాడు తప్ప నరుసు సొంత ఇంట్లోలేడు. పెళ్ళి అయిపోయింది లగాయతు చిట్టి అన్న వెంటే ఉంది. నరుసు తన బట్టలూ, పుస్తకాలూ అత్తవారింటికి తెప్పించుకున్నాడు. చిట్టి తన బట్టలు కూడా వొదిలేసి అన్న వెంట మనుగుడుపులు కుడుస్తున్నది. ఇందిర తనతోపాటే చిట్టికూ్కడా ఎన్నో పావడాలూ జాకెట్టులూ కుట్టించింది. నరుసు తిరిగి కాలేజికి వెళ్ళే సమయం సమీపిస్తుండగా శివయ్యగారు వచ్చి చిట్టిని ఇంటికి పట్టుకుపోవటానికి ప్రయత్నించాడు.

చలపతిగారు, "నాలుగురోజు లుండనివ్వండి, బావగారూ, మా ఇందిరతో కాలక్షేపం చేస్తుందీ! చిన్న పిల్లల కీడుజోడూ ఉండాలి" అన్నాడు.

శివయ్యగారికేదో భయం వేసింది—చిట్టి తనకు కాకుండాపోతున్నదని. ఆయన చిట్టినే అడిగాడు ఇంటికి రమ్మని.

చిట్టి రానని ఖచ్చితంగా చెప్పేసింది.

శివయ్యగారి కాఖరుకు నరుసు శరణ్యమైనాడు. తండ్రిని ఒంటరిగా కూచోబెట్టి నరుసు ఉన్న సంగతి చెప్పేశాడు.

"ఎందుకు, నాన్నా? చిట్టి నీకక్కర్లేదు. దానికీ నువ్వూ అక్కర్లేదు. అది నీ కోసం దేవుళ్ళాడినప్పుడు దాని సంగతి నువ్వు విచారించలేదు. ఇక్కడ దానికి హాయిగా వుంది. దానికి నువ్వు చేసేదంతా నేనూ చెయ్యగలను— తీసుకుపోయి రెండోపెళ్ళివాళ్ళ కివ్వలేనేమోగాని ! దాని పెళ్ళికోసం మూడువేలు బాంకులో వేయించాను. చిట్టికి కావలసిందేదో మనింటోలేదు. ఇక్కడుంది— కాస్త మాన వత్వం....నీవంటి నాన్న ఎవరికీ వుండదని నేనూ చిట్టీ అనుకునేవాళ్ళం. చిట్టికి జ్ఞాపకంలేదు గాని నాకు జ్ఞాపకం వుంది. అదంతా వెనకపడిపోయింది. చిట్టి ఇవ్వాళ నీ దగ్గరకిరాదు. దాన్ని దగ్గిరికి తియ్యటం నీకు చాతకాదు. దాన్ని ఆవిడ పాకీదానికంటె నీచంగా చూస్తుంటే ఎప్పుడైతే చూస్తూ ఊరుకున్నావో అప్పుడే నీకు చిట్టి అందకుండా పోయింది. ఆవిడ మాట విని రెండేళ్ళనుంచీ చిట్టికి చదువు లేకుండా చేశావు. ఇవాళ నువ్వు దానిమీద నీకున్న అపేక్ష ఏ విధంగా చూపిసావ్ ?

ఏమీ మార్గంలేదే!.... నే నావిజ్ఞేమీ అనను. ఆవిడ ఒకరకంగా పెరిగింది. వాళ్ళ ఊళ్ళో, వాళ్ళింటో ఆవిడ చాలా వివేకంగల మనిషే. కాని అది మనింటో వివేకంగా సాగిపోవటం ఆశ్చర్యం! ... చెట్టంతతండ్రి ఉండగానే నా పెళ్ళి నేను చేసుకోవలసి వచ్చింది. చిట్టి పెళ్ళి నువ్వు చెయ్యగలవా? దానికేం కావాలో నువు విచారించగలవా? నేను నోరు తెరుచుకొని నాకీ సంబంధం చేసుకోవాలని ఉన్నదంటేనే వినిపించుకోక పోతివే! అది నీకు చెబుతుందా ? అది తన మనస్సులోని మాట నీతో చెప్పి ఎన్నేళ్ళయింది ?"

కొడుకు మాట్లాడుతున్నంతసేపూ శివయ్య ఏవో అడ్డమాటలు వేశాడు కాని తీరా నరుసు మాట్లాడటం మానేసిన తరవాత శివయ్యకు అనేటందు కేమీ కనిపించ లేదు.

"నేను రెండుమూడు రోజుల్లోగా వెళ్ళిపోతున్నాను. చిట్టి ఇక్కడే ఉంటుంది. శలవులకు వచ్చినప్పుడుకూడా నేనిక్కడ ఉంటూ ఉంటాను. నేను మామగారి వల్లో పడ్డాననీ, పెళ్ళాం వల్లో పడ్డాననీ ఎవరన్నా పిచ్చికూతలు కూస్తే నమ్మి నిద్రపోకు. నేనూ, చిట్టీ సొంతఇంటోకన్న మరోఇంటో ఎక్కువ సుఖంగా ఉండటం నాకూ అవమానంగానే ఉంది. మాకిట్లా అనిపించకుండా ఆ ఇల్లు కొంచెం బాగుచెయ్యి. ప్రస్తుతం అది పశువులపాక మోస్తరుగా ఉంది. ఆ ఇంట్లో ఒకప్పుడు నాగరికతా సంస్కారమూ ఉన్నట్టుగా ఉండేది. అది నా భ్రమమేమో! ఇప్పుడా భ్రమకాస్తా పోయింది. తిరిగి ఎట్లాగయినా ఆ భ్రమ కలిగిస్తే మేమిద్దరమూ అక్కడికే వస్తాం. ఈ ఇంటో మాకెవరూ మీ యిద్దరికంటె దగ్గిరవాళ్ళులేరు. అయితే మీరు దగ్గిర వాళ్ళయి ఉండి దూరంగా ఉండిపోయినారు. వీళ్ళు దగ్గిరికి రావటానికి ప్రయత్నిస్తు న్నారు. అంతే తేడా !"... అన్నాడు నరుసు.

శివయ్య ఇంటికి తిరిగి వెళ్ళిపోయినాడు.

చిట్టి రాలేదేమని లక్ష్మి అడిగింది. లక్ష్మి చేతుల్లోనుంచి జారి పాపాయి తండ్రి దగ్గిరికి వచ్చింది.

శివయ్య పాపాయిని ఎత్తుకుంటూ, "చిట్టి రాదుట. దాని కక్కడే సుఖంగా ఉందిట!" అన్నాడు.

"అయితే అక్కడే ఏడవమనండి" అన్నది లక్ష్మి.

"రేపు నువు చచ్చిపోయి నేను తిరిగి పెళ్ళాడితే ఈ పాపాయి కూడా నా ఇంటోనించి వెళ్ళిపోయి తిరిగి రానంటుంది!" అన్నాడు శివయ్య.

ప్రచురణ : డిసెంబరు 1947,
తల్లిలేనిపిల్ల కథల సంపుటిలో,
ప్రజాసాహిత్య పరిషత్తు : తెనాలి.

# మధ్యవర్తి

"అసలు నువ్వు నా కొడుకువే కాదు. పో ముందు బయటికి!"

"అదేమో నీకు తెలియాలి, మా అమ్మకు తెలియాలి! నేను మాత్రం వెయ్యి రూపాయలక్కడ పెడితేగాని ఎక్కడికీ కదిలేది లేదు."

"వెయ్యిరూపాయలు! ఈ రోజుల్లో! పాపం నువ్వు ఎప్పుడు అడుగుతావా అని కుప్పపోసుకూర్చున్నా! ఏం చేస్తావు వెయ్యిరూపాయలతో? మూటా మూటా మెడకు ఉరిపోసుకుంటావా?"

"మీ కటువంటి అనుమానం ఉంటే నోట్లుగానే ఇవ్వండి!"

"నోట్లో నల్లబొగ్గులో— వాటితో ఏం చేస్తావన్నాను?"

"ఏదో చేస్తానన్నాను! నీ కదంతా ఎందుకు? హోటలు పెట్టుకు బతుకుతాను."

"అదే! అటువంటి దేదో చేస్తే కాని నువు నా ప్రతిష్ఠ బాగా నిలబెట్టిన వాడివి కావు. ఏం?"

"నే నెవరో? మీ రెవరో? మీ ప్రతిష్ఠ నేను నిలబెట్టేదేమిటి, కనీసం మీ కొడుకునన్నా కానప్పుడు!"

"ఆ కూత నువ్వు కూస్తున్నావుకాని, ఇంకా లోకమంతా కుయ్యటం లేదుగా, కోడై!"

"మొదట నువ్వే కూశావో నేనే కూశానో మనిద్దరికి తెలుసు... అయినా, నాకు పోట్లాడటం సరదా అనుకోకండి. అటువంటప్పుడు అసలు విషయం దగ్గిర తగాదాపడటం ఎట్లాగూ తప్పేటట్టు లేదు. వ్యర్థకలహంలోకి కూడా ఎందుకు దించుతారు?"

"మాటలు నేర్చావు. చాతకాని వెధవా! పోయి సంపాదించు. నిన్ను బియ్యే చదివించి నీకోసం ఎంత తగలెయ్యాలో అంతా తగలేశాను. ఇక నా దగ్గిర చిల్లి గవ్వ లేదు"

"ఆ సంపాదనకే పెట్టుబడి కావాలిసి వెయ్యిరూపాయలు అడిగాను. అవి పెట్టుకొని యావజ్జీవమూ తిందామని కాదు."

"నీ జన్మకు పెట్టుబడి అదివరకే అయిపోయింది. ఇక దమ్మిడీలేదు.... ఉద్యోగంచేసి యేడుస్తావని ఆ పెద్దమనిషి కాళ్లా వేళ్లాబడి శిపారసు చెయ్యటానికి వప్పిస్తే, ఆయన్ను కాస్తా అవమానపరచి, నాకు ఆయన మొహం చూడటానికూడా తలవంపులుగా చేస్తావా?"

"అవమాన మేమిటి? నా కిప్పటికీ అర్థంకాకుండా ఉంది. తన తమ్ముడి కొడుక్కు పదిరూపాయల ఉద్యోగం ఇప్పించలేనివాడు నా ఉద్యోగానికి ఎట్లా శిఫార్సు చెయ్యగలడో! కళ్ళూ, చెవులూ లేనివాళ్ళకు చెప్పండి ఇటువంటి కబుర్లు."

"వాళ్ళే నయం!—నీ మాదిరిగా దురహంకారంతో గింజుకోక, రోజుకో పావలా డబ్బులు యాచించుకోగల్గుతున్నారు."

"అవును. ఆ పని మీ ప్రతిష్టకు భంగకారి కాదుకూడనూ!... మొత్తానికి మంచి ఉపాయం కనిపెట్టావు- నన్ను అసలు విషయాన్నించి తప్పించి నాచేత అవీ ఇవీ వాగించటం!...నాకీ కబుర్లతో ఏమీ పనిలేదు. నేనింకో విషయం ప్రసంగించను. నాకు కనీసం వెయ్యిరూపాయలు కావాలి. ఎప్పుడిస్తావో చెప్పు. అంతదాకా పెద్దమనిషి తరహాగా ఊరుకుంటాను. ఆ పైన ఒక్క క్షణం కూడా కొంపలో ఎవరికీ నిద్రాహారాలు లేకుండా చేస్తాను. చేసి తీరుతాను!"

"నీ తాతముల్లె దాచావా ఏమిటి నా దగ్గిర?"

"నా తాతముల్లె కాకపోతే నీ స్వార్జితం నాకిమ్మన్నానా ఏమిటి? నీ డబ్బు నాకు విషతుల్యం. నా తాతముల్లె ఎనిమిదెక రాలుండాలి. ఏం చేశావదంతాను? దాన్లో నా కెంతవస్తుందో అంతా పంచండి. మీరు హరీ అన్న తరవాత మిగతాదాని సంగతి చూస్తాం!"

"మాటలు తిన్నగా రానీ, పుండాకోర్! నీ అక్కల పెళ్ళికి మూడేసి మూడేసి వేలు పోశాను. నీ దినవారాలకు మూడువేలు పైగా తగలేశాను. నీ తాతముల్లె అప్పుడే పోయింది. నడు ముందు బయటకి!"

"నా తాతముల్లెకు నాకన్నా ముందు నా అక్కల మొగుళ్ళ వారసులల్లే ఉన్నారు. తలా వెయ్యిన్నూట పదహారూ, వెండిసామానూ, అవన్నీ కట్టబెట్టి అల్లుళ్ళచేత నానా బూతులూ పడటాని కభ్యంతరం లేదు కాని కొడుక్కు 'బతుకుతానో, భగవంతుడా!' అంటే ఇవ్వటానికి చిల్లిగవ్వలేదు!"

"నిన్ను నేను బతకవద్దన్నానా? భరణం ఇస్తాను, ముండ కిచ్చినట్లు, తింటూ ఉండు!"

"నాకాభరణం అక్కర్లేదనే చెప్పటం. నేను కానీ కావాలన్నా మిమ్మల్ని అడగాలి. ఎందుకని మీచేత అడిగించుకోవాలి. రేపు యీ ముండభరణమే నా భార్యా కూడా పంచుకోవాలి— దాని కేదైనా కావాలంటే అది నన్ను ప్రార్థించటమూ, నేను మీతో మనవి చేసుకోవటమూ! తమ శలవైతే కద్దు, లేకుంటేలేదు... నాకిదంతా పనికి రాదు. నాకు వెయ్యిరూపాయలు కావాలి. ఎందుకు కావాలో కూడా చెప్పను. ఇవ్వకపోతే కొంపకు చిచ్చుపెట్టి తీరుతాను. అట్లా చెయ్యకపోతే నేను మీ కొడుకును కాదు."

"నువ్వసలు నా కొడుకువే కాదు. ఫో అవతలికి!...నువ్వూ, నీ పెళ్ళామూ!"

"దానిజోలి ఎత్తకండి, నాకు తూలుతుంది. నేను తూలితే మనిషిని కాను!"

వారంరోజులనించి, ఈ విధంగా నడుస్తున్నది దశరథరామయ్యకూ, కొడుకు హనుమంతరావుకూ.

ఏరకం మనుషులు ఆ రకం మనుషులతో అతికిపోతారని తెలీనివాళ్ళు అను కుంటారు. కాని అది పూర్తిగా నిజంకాదు. ఇద్దరు మంచివాళ్ళ విషయంలో తప్ప అది వర్తించదు. ఇద్దరు చెడ్డవాళ్ళకు వాళ్ళ దుర్గుణాల సామ్యం వల్ల పొసగటం అసంభవం. ఇద్దరు పిసినిగొట్టులకు ఎట్లా పొసగుతుంది? గుణాల యొక్క మంచి చెడ్డలు నిర్ణయించటానికి ఇది ఒక మంచి ఉపాయం కూడానూ. ఒక గుణాన్ని ఆ గుణంతోనే పరీక్షచెయ్యాలి. ఏ గుణం కలవాడు ఆ గుణమే ఇతరుల్లో చూసి సహించలేడో, అది దుర్గుణం. మానవులను ఎడం చేసేవి దుర్గుణాలు. మానవులను దగ్గిరికి చేర్చి జాతికి ఐక్యమత్యమూ, బలమూ చేకూర్చేవి సద్గుణాలు.

ఈ తండ్రీ కొడుకులు అనేక విషయాల్లో ఒకరినొకరు పోలినవారే. కాని ఇద్ద రికీ పడలేదు. హనుమంతరావుకున్న ఓర్పులేనితనం చూస్తే దశరథరామయ్యకు ఒళ్ళు మంట. దశరథరామయ్యకు ఓర్పులేకపోవడం చూస్తే హనుమంతరావుకు ఒళ్ళు మండేది. కాస్త కోపం రాగానే అవతలివాణ్ణి గడ్డిపరక కింద కట్టివేయటం తండ్రిలో పెద్ద దుర్గుణమని హనుమంతరావు నమ్మకం. కాస్త వాదనలోకి దిగగానే తన్ను "నువ్వు నువ్వు" అని సంబోధించటమేకాక, తన్నొక వెంట్రుక కింద కట్టి మాట్లాడటం తన కొడుకుకున్న పెద్ద తెగులని దశరథరామయ్య నమ్మకం. వీరిద్దరి తగాదా పరిష్కారం అయ్యేదెట్లా?

తను మాట్లాడినదాన్లో పాయింటు ఉన్నదని దశరథరామయ్య కొడుక్కు తెలియ చెయ్యాలని ప్రయత్నం చేస్తూ, అతను అది చూడకపోవటం చూచి మరింత మండిపడేవాడు. సరిగా అదే సమయంలో హనుమంతరావుకూడా తన పాయింటు తండ్రికి విప్పి చూపిస్తూ, ఆయన దాన్ని గమనించకపోతే మరింత మండిపడేవాడు.

"ఏంరా, అబ్బాయి! శేషగిరిరావు గారితో మాట్లాడాను. నీకు ఉద్యోగం ఇప్పిస్తానన్నాడు. కాస్త ఆయనకు కనపడుతూ ఉండు అప్పుడప్పుడూ!"

"ఆయన ఎట్లా ఇప్పిస్తాడు నాన్నగారూ? ఆయనకంత పలుకుబడే ఉంటే, నరసింహారావు నిరుద్యోగిగా ఉండటమేమీ?"

ఈ పోట్లాట ఈ విధంగా ప్రారంభమయిందంటే ఎవరైనా నమ్మగలరా?

కాని ఇది యిట్లా ప్రారంభం కావటం సౌభాగ్యమ్మగారు కళ్ళారా చూస్తూ చెవులారా విన్నది. ఆరోజు కారోజు ఈ వివాదం పెరిగిపోతున్న వైనంచూసి ఆవిడ తన కళ్ళనూ, చెవులనూ తనే నమ్మలేక పోయింది. చదరంగం మొదలైన ఆటల్లో ఆడేవాళ్ళ కన్న చూసేవాళ్ళకు ఆటయొక్క కిటుకులు బాగా తెలిసినట్టు, ఆవిడకు ఈ కలహం ఎంత వృథా కలహమో తండ్రి కొడుకులకన్న బాగా తెలుసును. ఆ యిద్దరూ చిన్న అగ్ని కళకాని ఒక మండదగిన కట్టెగాని లేకుండా, గాలిడీ చేసి కాలే జ్వాల తయారుచేశారు. అది చల్లారాలంటే ఎక్కువ శ్రమకూడా అవసరం

లేదు. తండ్రికొడుకు లిద్దరూ, తమవల్ల పొరపాటుందని చెంపలు వాయించుకోను కూడా అక్కర్లేదు. రెండోవారు చెప్పే మాటల్లో కించిత్తు సబబు ఉందేమో చూతా మని అనుకుంటే చాలును— ఈ తగాదా కట్టుబడిపోతుంది. ఎవరికన్న ఎవరు రెండో వారిని ఎంత ఎక్కువ నీచంగా చూడగలుగుతారో చూతామని ఇద్దరూ ఎంతకూ పట్టుపట్టుకు కూర్చుంటే పాపం ఆడది సౌభాగ్యమ్మ ఏం చెయ్యగలదు ? ఇద్దరిచేతా ఇంతవయసు గడిచిన తరవాత ఇప్పుడు రంకులు కట్టించుకుంటూ, ఇద్దరి సందునా నలగటం తప్ప ! ఆవిడ ఎడంగా ఉంటేనే ఇంత సౌరభ్యంగా ఉంది; ఇక ఆవిడ మధ్యవర్తితనం చెయ్యబోతే వాళ్ళు ఆమెను బతకనిస్తారా ? ఉత్తది, ఆవిడ ఒక్క నమస్కారం చేసి, "దీనికి అంతు ఎప్పుడురా భగవంతుడా ?" అని ప్రార్థించింది.

ఆ యిద్దరిలోనూ పైకి చూడటానికి హనుమంతరావు మెరుగనిపిస్తాడు. సాధ్యమైనంత వరకు అతను అవీ ఇవీ తవ్వడు. పోట్లాడటం ఇష్టంలేనివాడల్లే కనిపిస్తాడు. తండ్రి తూలినంత తూలినట్టుండడు, అప్పుడప్పుడూ వాదనలో తండ్రి మాటలు ఆయన మీదికే తిపి కొట్టి వినేవాళ్ళకు తప్పంతా తండ్రిదే నని పిస్తాడు. కాని అతని వల్ల కావలసినంత తప్పు లేకపోలేదు. పదిరోజుల కిందటి వరకూ తనకు కానీ కావలసినా సంతోషంతో తండ్రి నడిగి తీసుకోలేదా ? అది తనకు భరణంగా భావించాడా ? తను బియ్యే వరకూ చదవటానికి అయిన ఖర్చంతా వృథా అయిందనీ, తనకు ఏ చిన్న ఉద్యోగమన్నా దొరకక్క పోవటం తన ప్రారబ్ధమనీ, అతను అనేకమార్లు అనుకోలేదా ? తన అక్కలకు తన తాత ఆస్తిమీద నైతికంగా తనకున్న అధికారం ఉందని ఎన్నోసార్లు ఎంతోమంది దగ్గిర అనలేదా ? ఇవన్నీ అడిగేవారెవరు ?

కాస్త కోర్టుపని తగిలి దశరథరామయ్యగారు బస్తీకి వెళ్ళవలసివచ్చింది. హనుమంతరావు అత్తవారి ఊరు ఆ ఊరే. సహజంగా దశరథరామయ్య వియ్యంకుడి ఇంటికే వెళ్ళాడు ఆతిథ్యానికి.

దమయంతి మామగార్ని చాలా మర్యాదచేసి, కుశలప్రశ్నలడిగి, కాళ్ళు కడుక్కునేందుకు నీళ్ళిచ్చి ఎంతో గౌరవించింది. దశరథరామయ్యకు కోడల్ని చూడగానే ఎందుకో ప్రాణం లేచివచ్చినట్టయింది. ఈ వారం రోజులనుంచీ తీక్ష్ణమైన ఎండ దెబ్బతగిలి నెర్రెలు పడ్డట్టున్న ఆయన హృదయం మీద అమృత వర్షం కురిసినట్టయింది.

కామక్రోధాదులను తిరస్కరించే మహర్షులు సహితం సద్గుణాలకు లొంగిపోయేవాళ్ళు. వారం పదిరోజులనించీ గౌరవించబడటం కాని, సానుభూతి చూపబడటం కాని అనుభవించని దశరథరామయ్యకు కోడలి ఆపేక్ష ఎంత ఆహ్లాదకరంగా ఉందో ? తన గర్భవాసాన పుట్టి తన్ను వేధిస్తున్న హనుమంతరావుతో ఈ పిల్లను పోల్చుకున్నాడేమో దశరథరామయ్య ? ఎవరి సానుభూతితోనూ తమకు ప్రమేయం

లేనట్టు నటిస్తూ అందరికన్నా ఎక్కువ సానుభూతి కావలసిన వాళ్ళలో ఆయనకూడా ఒకడు.

ఏమయినా ఆయనకు దమయంతిని చూడగానే కలిగిన ఆనందానికి మేరలేదు. "ఈ పువ్వు ఎంత అందంగా ఉందీ ! ఎన్నడూ చూడలేదే ! ఆహా ! ఇది మనింట్లో ఉంటే ఎంత బాగుండును !" అని అపూర్వమైన పుష్పాన్ని చూసి మనం అనుకున్నట్టే అనుకోగలిగాడు దశరథరామయ్య దమయంతిని చూస్తూ. ఈ పిల్ల తన కోడలయినందుకు చాలా సంతోషమయింది. కాని, "ఆ వెధవ దీనికి తగడుకదా" అనే చింత ఆయన్ని కొంచెం బాధించింది.

వెయ్యవలసిన కుశల ప్రశ్నలన్నీ వేసి దమయంతి పారిపోలేదు. అక్కడే గడపలో ఆయనకు సగం కనబడుతూ నిలుచుంది. ఈ పిల్లతో తన కష్టసుఖాలన్నీ చెప్పుకోవాలని దశరథరామయ్యకు ఒక ఆవేశం వచ్చింది. ఆమెకూ తనకూ మధ్య ముప్పైఏళ్ళ తేడా ఉన్నమాట కూడా మరచిపోయి, ఆమె తన వయస్సు మనిషి అయినట్టూ, తను ఆమె వయస్సువాడల్లేను ఆయన మాట్లాడదం మొదలుపెట్టాడు. చిన్నతనంలో ఎప్పుడో ఆయన తన తల్లితో ఈ విధంగా మాట్లాడి ఉంటాడు. మళ్ళీ ఇప్పుడు ! ఈ అనుభవం ఆయన ఆత్మకు చాలా సుఖకరంగా కూడా ఉంది.

పూసగుచ్చినట్టు తనకూ, తన కొడుక్కూ నడిచిన తగాదా యావత్తూ దశరథరామయ్య కోడలికి చెప్పాడు, పొరపాటున అయినా తను కొడుకును అన్నమాటల్లో ఒకటయినా పయికిరానివ్వకుండా. దమయంతి తీరికగా ఆయన చెప్పేదంతా విన్నది. మధ్య మధ్య మాటలు కూడా అందుకున్నది. "నేను పసిదాన్ని ఇదంతా నా కెందుకు లేండి!" అన్నట్టుగా కాని "పెద్దనాంబసానితనం" కనపరుస్తూ కాని ఒక్క మాట కూడా రానివ్వలేదు, మాట్లాడటంలో ఆ తూకం సహజంగా రావాలి. దమయంతికది పుట్టకలోనే వచ్చింది.

దశరథరామయ్యగారు తనమీదినించి గొప్పభారం ఒకటి తొలగించుకున్నవాడల్లే తృప్తిపడ్డాడు. ఎట్లాగో అది తన నోటిమీదిగానే రావాలి. కనక, దశరథరామయ్య వియ్యంకుణ్ణి తన కొడుకు అవుపోసన కార్యం గురించి కదిలించాడు. దమయంతి కేం? పదిహేనేళ్ళు నిండుతై. రజస్వల అయి ఏడెనిమిది మాసాలు కూడా కావస్తుంది. ఆమె తండ్రి కొన్ని లాంచనపు మాటలన్నా చివరకు సరేనన్నాడు. ముహూర్తం కూడా నిర్ణయం అయిపోయింది. ఈ మాట ఇంట్లో తెలియగానే తండ్రి కొడుకులకు మళ్ళీ ఘర్షణ జరిగింది.

"చేసేది నా కార్యమా? ఊళ్ళోవాళ్ళ కార్యమా? నాకు తప్పెట్లూ, తాళాలూ, బాజాలూ, వందమంది సాక్షులూ ఎందుకు? నా యిష్టం వచ్చినప్పుడు వెళ్ళి నా పెళ్ళాన్ని నేను తెచ్చుకుంటాను" అని హనుమంతరావూ, "నీ యిష్టం వచ్చినట్టే ఏడుచుకో, నువ్వెట్లా ఛస్తే నాకెందుకు?" అని దశరథరామయ్యా, ఆ పోట్లాట అప్పటికి ఆఖరు చేశారు.

"అమ్మయ్యో! మీకు పోట్లాడటం ఎంత సరదా అండీ! నాతో ఎప్పుడూ పోట్లాడరు కదూ? ఎవరికైనా కోపం వస్తే నా ప్రాణాలు పీచుపీచుమంటై!" అన్నది దమయంతి.

హనుమంతరావు నవ్వాడు. అతను భార్యను తెచ్చుకొని వారం రోజులయింది. ఇక ముందెట్లా వున్నా, యిప్పటివరకూ అతను పెళ్ళాంవంక నవ్వుతూ తప్ప చూడ లేకుండా ఉన్నాడు. ఇకముందు కూడా ఆమెమీద గాని, చివరకు ఆమె ఎదురుగా గాని కోపంతో ఉండటం కష్టంగానే ఉండేటట్టు ఉంది. ఎల్లప్పుడూ సంతోషంగా ఉండే విద్య ఆమెకు తెలుసునల్లే ఉంది. ఆమె యొక్క సరదా అదొక రకమైన ఉత్తమ జాతి అంటువ్యాధి మాదిరిగా కూడా కనపడుతున్నది.

కొద్దికాలం కిందట తండ్రి చేసినపనే హనుమంతరా విప్పుడు చేశాడు— తను తన తండ్రిని అన్న మాటలన్నీ దాచిపెట్టి పెళ్ళాంతో తండ్రిమీద చాడీలు చెప్పాడు. భగవంతుడు దమయంతిని మధ్యవర్తితనం చెయ్యటానికి సృష్టించా డేమో. లేకపోతే వాళ్ళూవాళ్ళూ వచ్చి తమతమ రిపోర్టులు ఆమె దగ్గర చెయ్యటం ఎందుకు?

మధ్యవర్తులెప్పుడూ గోడమీద పిల్లివాటంగా ఉండాలి, లేకపోతే తమ ఉద్యోగం త్వరలో ఊడిపోగలదు. అందుకనేనేమో దమయంతి మొగుడులేన ప్పుడు మామగారితోనూ, ఒంటరిగా మొగుడితోనూ ఒక రకంగా మాట్లాడటం మొదలు పెట్టింది. ఆ రకం ఇదీ :

"ఎబ్బే! మీరు అనవసరంగా మథనపడుతున్నారండీ! మీరు అనేది ముమ్మాటికీ నిజమనుకోండీ! కాని ఆయన అనేమాట అబద్ధం కాదు. మీకు సరియైన మధ్యవర్తి ఉండి పనిచేస్తే మీ తగాదా సులభంగా తేలిపోతుంది!"

"నీకు తెలీదే, పిచ్చిదానా. అయినా నీకేమన్నా వాణ్ణి తిప్పగలనని ధైర్యం ఉంటే ప్రయత్నించు" అని దశరథరామయ్య అన్నాడు.

"సరే! ఇంకేం? మాకు నువ్వే మధ్యవర్తిగా ఉండు. ఇటువంటి బంగారపు చిలుక మాకు మధ్యవర్తిగా ఉండటంకన్న కావాలిసిందేమిటి?" అని హనుమంతరావు అన్నాడు.

కాని ఎన్నాళ్ళకూ దమయంతి వ్యవహారంలోకి దిగలేదు. ఎవరి దౌర్బల్యం ఏమిటో తెలిస్తేనేగాని మధ్యవర్తితనం సరిగా సాగదు. సహజంగా మొగుడి తత్వం తెలుసుకోటానికే ఆ కు ఎక్కువ అవకాశాలు లభించినై. ఆమెకు ఒకనాడు మంచి ఉపాయం తట్టింది. అవకాశం కోసం కనిపెట్టుకుని కూర్చుంది. పోట్లాట కొద్దిగానో, గొప్పగానో ప్రతిరోజు జరిగిపోతున్నది. కాని ఆమెకు కావలసిన అవకాశం అయి దారు రోజుల దాకా రాలేదు.

ఆనాడు మధ్యాహ్నం భోజనాలైన తరవాత దశరథరామయ్య భార్యతో ఏదో యింటి ఖర్చును గురించి మాట్లాడుతూ, కొడుకును కూడా ఒక పోటు పొడవటానికి

అవకాశం దొరికేటప్పటికి అది వదులుకోటం యిష్టంలేక— ఆయన యిటువంటి విషయాల్లో, పాపం! చిన్న పిల్లవాడి వంటివాడు:— "మీకేమే? 'అది చెయ్యి, ఇది చెయ్యి! నాకు పాతిక ఇయ్యి, యాభై ఇయ్యి!' అంటారు. చేసేవాడికి తెలుస్తుంది ఆ కష్టనిష్టూరాలు!" అన్నాడు.

ఇందులో హనుమంతరావు తండ్రి తన్ను ఎత్తిపొడిచా డనుకునేటందు కేమీలేదు. కాని ఇతను ఆ తండ్రి కొడుకే కనక తండ్రి ఉద్దేశం గ్రహించ గలిగిన వాడై, "అబ్బో! ఏమిచేత! బహు గొప్పచేత చేస్తున్నారు?" అని, పుచ్చకాయల దొంగ అంటే భుజాలు తడుముకున్నాడు. అప్పుడు దమయంతి కలిపించుకుంది.

"ఏమిటండీ, కాకపోయినా! ప్రతిదానికీ ఆయనమీదికి ఒంటికాలిమీద లేస్తారు! అంత చాతయినవారు మీరు చెయ్యరాదూ?.... ఆ తాళం చెవులు ఆయన కివ్వండి మామగారూ! నిజంగానే! ఏంచేస్తారో చూతాం! ఈ సూటీ పోటీలన్నీ మీకెందుకు!"

దశరథరామయ్య ఒక్క క్షణం నిర్ఘాంతపోయినాడు. కాని దమయంతి మొహం చూసి ధైర్యం తెచ్చుకుని, "ఓ! మహారాజుగా" అంటూ తాళపుచెవులు తీసి కోడలి చేతిలో పెట్టాడు. దమయంతి అవి తీసుకొని మొగుడి మొహం ఎదట గలగల్లాడిస్తూ "ఇంద !" అన్నది.

హనుమంతరావు లోపల పొందిన ఆనందానికి మేరలేదు. తన తండ్రిని దమయంతి ముచ్చటగా బుట్టలో వేసిందనుకున్నాడు కాని, పాపం ఏమీ లాభంలేదు. అతనికి ఎటువంటి బాధ్యతా వహించటానికి ఓపికలేదు. అటువంటి విషయాల్లో అతను అమిత సోమరి. తనకిప్పుడీ మేనేజిమెంటుకూడా ఎందుకు ? కాని, దమయంతా ? బాకువంటి పిల్ల !

అతను పెళ్ళాం వంక నవ్వుతూ చూసి, "అంటే సరి!" అని ఊరుకున్నాడు.

"తీసుకోండి మరి !"

"నేనిప్పుడు ఈ పెత్తనం తక్కువయిందనే దిగులుపడుతున్నా కాదూ ?" అన్నాడు హనుమంతరావు.

"మాటలు మాత్రం అంటారు...పడేవాళ్ళుంటే ! ఏం ?" అంటూ దమయంతి తాళం చెవులు మామగారికి యిచ్చేస్తూ, "క్రియకు వచ్చేటప్పటికి యింతే లెండి" అన్నది.

వంట ఇంట్లో సౌభాగ్యమ్మ నిట్టూర్పు విడిచిన చప్పుడు అస్పష్టంగా వినపడ్డది దమయంతికి.

ముద్రణ : భారతి, డిసెంబరు, 1935

# పంచరత్నాలు

రామకిష్టయ్యది అదృష్టం! అయిదుగురు కొడుకులు. ఆడపిల్లలు లేరు. ఇంకేం కావాలి? ఈ రోజుల్లో ఆడపిల్లంటే మూటంబేస్తు, మగపిల్లవాడు జాక్‌పాట్.

దేవుడు కొందరికి పొలాలిస్తాడు. కొందరికి మగపిల్లల్నిస్తాడు. ఈ దేశానికి కావలసింది సంతాన నిరోధం కాదు. స్త్రీ సంతాన నిరోధం. ఆడపిల్లల సంఖ్య మగ వాళ్ళ సంఖ్యతో సమంగా ఉంటేనే మగపిల్లలు గాలిపటాల్లాగా ఆకాశాన ఆడు తున్నారు. ఆడపిల్లల సంఖ్య సగానికి తగ్గిందంటే ఇక మగపిల్లల తండ్రులకు వేరే ఆస్తులూ, ఉద్యోగాలూ దేనికి?

మగపిల్లలంటే అమ్మకం పన్నులేని కార్గో! బ్లాక్‌మనీ! దాచిన బంగారం.

రామకిష్టయ్యకు కావలసిన వాళ్ళమంతా ఈ ధోరణిలోనే ఆలోచించి ఎంత గానో అసూయపడ్డాం. ఆయనకూడా తన కొడుకులను పందెపుగుర్రాల్లాగా తయారు చేస్తూ వచ్చినది, వాళ్ళు తనలాగా బడిపంతులు బతుకు బతకరాదనే అనుకుంటాను.

మనుషులకు ఎన్నో దాహాలు. రామకిష్టయ్యకు విద్యా దాహం జాస్తి. ఇప్ప టికీ అయిదు నిమిషాలు ఖాళీ దొరికితే ఏదో ఒక పుస్తకం తిరగేస్తాడు. పాతిక సంవత్సరాలుగా పిల్లలకు పాఠాలు చెబుతున్నా ఆయనకు పుస్తకాలంటే మొహం మొత్తకపోవటం ఆశ్చర్యం.

అపరిపక్వంగా నిలిచిపోయిన ప్రేమలే అమరప్రేమలు. రామకిష్టయ్య విద్యా దాహం విద్యార్థి దశలో తీరలేదు. ఆయన ఇంటరుతో చదువు కట్టిపెట్టవలసి వచ్చింది. ఎందుకంటే, అప్పటికే ఆయన తండ్రి-రెండెకరాల భూస్వామి; ప్లీడరు గుమాస్తా-ఇద్దరాడపిల్లలకు పెళ్ళిచేసి, శకునితో పాచికలాడిన ధర్మరాజులాగా తయా రయాడు. ఎంత చెడ్డా ప్లీడరు గుమాస్తా గనక కట్టుబట్టలతో అరణ్యాలు పట్టి పోలేదు. "అబ్బీ నాతోపాటు నువుకూడా నాలుగురాళ్ళు తెస్తేనేగాని ఈ బండి నడ వదురా?" అని కొడుకును హెచ్చరించాడు.

రామకిష్టయ్య ట్రైనింగు చదివి, రెండు మూడు మిడిల్ స్కూళ్ళలో హెడ్ మాష్టరుగిరీ చేసి, చివరకు హైస్కూలులో మూడోఫారం బీ సెక్షనుకు క్లాసు టీచరుగా స్థిరపడ్డాడు. తన పేరు చివర "ఎం ఏ." తగిలించుకునే అవకాశం పోయిందన్న విచారం పోయింది. ఇరవై రెండో ఏటనే తాను తన యాభై ఏళ్ళ తండ్రికన్న హెచ్చు సంపాదిస్తున్న తృప్తి మిగిలింది.

కాని రామకిష్టయ్యలో ఉన్నత విద్యా వ్యామోహం ఏ మాత్రం చావలేదు.

జ్ఞానం సంపాదించాలంటే కాలేజీల్లోనే చదవనవసరం లేదు. మంచి మంచి పుస్తకాలున్నాయి. ఆయన వాటిని మథించేవాడు. స్కూలు స్టాఫ్‌లో ఎవరికి అనుమానం వచ్చినా రామకిష్టయ్య నడిగేవాళ్ళు. కాలేజీ చదువుల్లో కొద్ది విషయాలే చెబుతారు. రామకిష్టయ్య అన్ని విషయాలను గురించీ చదివాడు. అసూయగ్రస్తులాయన్ని పుస్తకప్పురుగనే వాళ్ళు.

థర్డుఫారం క్లాసుటీచరుగా స్థిరపడ్డాక, రామకిష్టయ్యకు కొడుకులు పుట్టుకొచ్చారు. తొలిచూలు బిడ్డ ఇంకా పురిటి గదిలో ఉండగానే, వాడు డాక్టరేట్ సంపాదించటానికి పథకం ఆలోచించసాగాడు రామకిష్టయ్య. పుస్తక పఠనంలోను, దాంపత్య సుఖంలోనూ కూడా దొరకని నిరంతరానందం ఆయనకు ఈ పథకాలు వెయ్యటంలో— పగటి కలలు కనటంలో— లభ్యమయింది.

మంచి సిమెంటురోడ్డు ఒక్కసారే వేస్తారు. తీవ్రమైన కృషి అంతా అప్పుడే జరుగుతుంది. అటు తరువాత, దానిమీద మొదటి వాహనం వెళ్ళాక, ఎన్నివేల వాహనాలైనా వెళ్ళొచ్చు. అదే విధంగా, రామకిష్టయ్య తన పెద్దకొడుకు కోసం పథకాలు వెయ్యటంలో బుర్ర పగలగొట్టుకున్నట్టు మిగిలిన కొడుకులకోసం బాధ పడలేదు.

## 2

ఏకాగ్రత గలవాడు స్వార్థపరుడిలాగ కనిపిస్తాడు. చుట్టుపక్కలవాళ్ళ విమర్శలకు గురి అవుతాడు. తపస్సమాధిలో ఉన్న ముని తనను లక్ష్యపెట్టలేదని పరీక్షిత్తుకు ఆగ్రహం రావటం మనకు తెలిసినదే గద!

రామకిష్టయ్యను మా బంధువర్గం ఏమంత మెచ్చలేదు. ఒంటికంటి రామలింగమనీ, ఉలిపికట్టె అనీ రకరకాల పేర్లు పెట్టారు. ఆయనకు ఇద్దరు చెల్లెళ్ళున్నారు. వాళ్ళకు పిల్లలున్నారు. పిల్లాపీచూ, సంసారము ఉన్నవాళ్ళకు కష్టాలొస్తాయి. వాళ్ళ కష్టసుఖాలు పంచుకోవటం తన విధి అన్నట్టుగా ఆయన ఏనాడూ ప్రవర్తించలేదు.

తన అత్తవారివైపు వాళ్ళపట్ల కూడా అంటీ అంటనట్టే ఉండిపోయాడు.

ఇంకెందుకూ తెలివితేటలు లేకపోయినా అవతలివాణ్ని విమర్శించడంలో బంగారాన్ని తూచినట్టుగా తూచగలవాళ్ళు ప్రపంచంలో ఎంతో మంది ఉన్నారు. అటువంటివాళ్ళు రామకిష్టయ్యను చాలా సూక్ష్మంగా విమర్శించారు— "బావమరిది పెద్ద కూతురి పెళ్ళి తాను వెళ్ళకుండా తన భార్యనూ పిల్లల్నీ మాత్రమే పంపాడంటే పోనీలే అనుకోవచ్చు. తన చెల్లెలి బావగారు కాలంచేస్తే వెళ్ళి చూడకపోవటం ఎంత తప్పు!"

ఇటువంటి తప్పులు రామకిష్టయ్య తలవెంట్రుకలన్ని చేశాడు.

"బాధ్యతలేని మనిషి!" అన్నారు.

"ఎప్పుడు కాకపోతే మానె, పండగలకీ, పబ్బాలకీ చెల్లెళ్ళను పిలుచుకోరూ; మేనల్లుళ్ళకూ, మేనగోడళ్ళకూ దోచిపెట్టే వాళ్ళున్నారే!" అనేవాళ్ళు అడంగులైన బంధువులు.

ఇటువంటి విమర్శలు రామకిష్టయ్యకు హాస్యాస్పదంగా ఉండేవి. వాళ్ళ ఆచారాలూ బాధ్యతలూ అనేవి ఏనాడో గతించిన కాలం నాటివి. ఆటవిక ఆచారాలు! మ్యేట్రియార్కీ! జీవితానికి ఒక లక్ష్యమూ, అర్థమూ లేకుండా పొలాలమీద తేరగా వచ్చినది మేస్తూ రికామీగా ఉండేవాళ్ళు ఈ ఆచారాలనూ, మర్యాదలనూ, బాధ్యతలనూ అమలు చేస్తున్నారు. ఈ శషభిషలు తన దగ్గర సాగవు.

రామకిష్టయ్యలో ఉన్న ఒక్క సుగుణమేమంటే, తనకు చిన్నమెత్తు ఉపకారం చెయ్యలేని వాళ్ళూ, చెయ్యదలచిన వాళ్ళూ తనను గురించి ఎంత చెడ్డగా మాట్లాడినా ఏమాత్రమూ చలించేవాడు కాడు. వాళ్ళు తనను గురించి నిజం బయట పెట్టడంకన్నా తమను గురించే ఎక్కువ నిజం బయట పెట్టుకుంటున్నారని తృప్తి పడేవాడు. ఈ ఒక్క గుణమూ అందరిలోనూ ఉంటే. బతికేపోదుము!

ఈ ఛిద్రాలన్నీ పట్టించుకోవటానికి రామకిష్టయ్యకు టైములేదు, ఓపికాలేదు. అతను చెయ్యవలసింది ఎంతైనా ఉంది. తాను నిర్మించనున్న భవంతి చాలా పెద్దది. అది తనవల్ల అవుతుందో, కాదో దేవుడెరుగు. కాని అందుకు లోతైన పునాదులు తవ్వటం, తన విధి. పునాదులు మాత్రమే లేచి బేస్‌మెంటు దగ్గర ఆగిపోయిన ఇళ్ళు ఎన్ని లేవు?

స్కూలువాళ్ళు తనకిచ్చే జీతం చాలదు. పెద్దవాడి పుటకలకు తండ్రికూడా పోయాడు. రాఘవుడు తాతగండాన పుట్టాడన్నారు. అటువంటి మూఢవిశ్వాసాలు రామకిష్టయ్య సహించేవాడుకాడు.

"ఒక విధిని నమ్ము! లేదా గ్రహాలను నమ్ము! అంతేగాని, తుమ్ములూ, శకునాలూ, చేతబళ్ళూ, దొడ్లో మొక్కలూ, బల్లిపలుకులూ, దేవుళ్ళకు ముడుపులూ, మంత్రోపాసనలూ, తాయెత్తులూ, సాయిబాబాలూ, ఇంకో బాబాలూ—నీ జీవితాన్ని ఇన్నీ శాసిస్తున్నాయనుకుంటే మనిషిగా పుట్టటంకన్నా అడవిలో మానుగా పుట్టటం మేలు?" అనే వాడాయన.

"నువు దేన్ని నమ్ముతావు?" అని ఒకసారి ఎవరో అడిగారు.

"ప్రకృతి ధర్మాన్ని. ఎటుచూసినా నాకదే కనిపిస్తున్నది" అన్నాడు రామకిష్టయ్య. నామటుకు నేనామాట మెచ్చాను. అంతవరకు రామకిష్టయ్య పూరా ఆధునికుడే.

వచ్చేజీతం చాలదనేకన్నా తగినంతగా మిగలదనాలి. ఎందుకంటే ఆరోజుల్లో రామకిష్టయ్య సంసారంలాటిది ముప్పై రూపాయలతో హాయిగా వెళ్ళిపోయేది!

అంతకు మూడింతలు జీతం వస్తూనే ఉన్నది. అందులో భీమా పాలసీ ఒకటి తీసుకున్నాడు. పదిహేనేళ్ళమీద అయిదు వేలకి. రాఘవుడు బి. ఏ. పాసయ్యేలోపలే ఆ డబ్బు చేతికి వస్తుంది. కావలిస్తే దానితో వాడిని పై దేశాలకు కూడా పంపవచ్చు. మోతీలాల్ నెహ్రూ[1] తన కొడుకును[2] ఇంగ్లండు పంపించటం ఒక గొప్ప సంగతికాదు. బడిపంతులు రామకిష్టయ్య తన కొడుకును పంపటం చాలా ఘనమైన సంగతి.

రామకిష్టయ్య ట్యూషన్‌లు కూడా తీసుకున్నాడు. స్కూలు పిల్లలకు తనక్లాసు పిల్లలకు ట్యూషన్‌లు చెప్పటం కాదు - అందుకు కమిటీవాళ్ళ పరిమిషన్లు, పచ్చి ఖద్దలు కావాలని రూలు పెట్టారు. కొందరు సంపన్నుల బిడ్డలు చదువు సంధ్యలు లేకుండా జులాయిగా తిరిగి, తీరా పెళ్ళికి ముందు, "మావాడు మెట్రిక్ చదువుతున్నాడు!" అని చెప్పుకునేందుకు ట్యూషన్‌లు చెప్పించి మూడో ఫారంలోనో, నాలుగో ఫారంలోనో చేరుస్తారు. వాళ్ళు డబ్బుకూడా బాగా యిస్తారు.

రామకిష్టయ్యది సుఖము విశ్రాంతి కోరే తత్వంకాదు. అమెరికాలో బిజినెస్ ఎగ్జిక్యూటివ్‌లకు కాలం విలువ ఎంతబాగా తెలుసునో రామకిష్టయ్యకూ అంతబాగానూ తెలుసు.

"ఎందుకండి ఊరికే పనులు అట్లా మీదేసుకొంటారు?" అనేది రామకిష్టయ్య భార్య.

రామకిష్టయ్య వరలక్ష్మమ్మ కేసి వింతగా చూసి "ఇంతకు రెట్టింపు పని చేయగలను. పని చూపించు?" అనేవాడు. ఆయన పనిలేక కొట్టుకుంటున్నాడనికాదు. క్షణం తీరిక దొరికితే పుస్తకాలు చదివేవాడు. ఆయనకు కావలసింది డబ్బొచ్చేపని

ఒకసారి "భారతి"లో ఏదో వ్యాసం పడింది. అటువంటి వ్యాసాలు తను కూడా వ్రాయవచ్చనిపించింది రామకిష్టయ్యకు. బమ్మెరపోతనామాత్యుని కథా కథన శక్తిని గురించి వ్యాసం వ్రాసి పంపాడు. అది అచ్చయ్యింది. ఆ పైమాసం దానికి ప్రతిఫలం కూడా ముట్టింది.

"సంపాదనకు ఇదొక మార్గం కూడా ఉందన్నమాట!" అనుకొని రామకిష్టయ్య తృప్తిపడ్డాడు.

---

1. మోతీలాల్ నెహ్రూ (1864-1954) : ప్రముఖ న్యాయవాది; జాతీయోద్యమ నిర్మాతల్లో ఒకరు.
2. జవహర్‌లాల్ నెహ్రూ (1889-1964); మే 1905 నుండి 1912 వసంతందాకా యేడేండ్లపాటు యింగ్లండులోని హారో, కేంబ్రిడ్జిలలో సాగిన చదువు ప్రస్తావన.

# 3

పిల్లలు ఎదిగివస్తున్నారు. అయిదు 'పెట్టెలరైలు. పెట్టెలన్నీ ఒక్కసారి కదలవు. ఒకదాని తరువాత ఒకటి కదులుతుంది. ఈ రైలుకు తానే పట్టాలు వేశాడు. తానే ఇంజను కూడాను. మొదటి పెట్టెను లాగేవరకే ఇంజను పని. మిగిలినవి ఒకదాని వెనుక ఒకటిగా అవే వస్తాయి.

అందుకని రామకిష్టయ్య తన దృష్టినంతా రాఘవుడి మీదనే కేంద్రీకరించాడు. అందుకు మరొక కారణం కూడా ఉన్నది. రాఘవుడు ముమ్మూర్తులా తండ్రిపోలికే. కాకపోతే సాత్వికుడు. చొరవ తక్కువ,అయినా ఫరవాలేదు. వాణ్ణి ముందుకు నెట్టేపని తాను చూసుకుంటాడు.

రాఘవుడు చిన్నతనంలో విచిత్రంగానే ఉండేవాడు. ఏ పనిగాని ఎవరన్నా చెయ్యమనేదాకా చేసేవాడుకాడు. ఆఖరుకు తల్లి కంచంలో అన్నంపెట్టి "తినవేంరా" అంటే అప్పుడు తినేవాడు. వాడిలో స్వతంత్రంగా ఆలోచించి ఏదైనా చేసే శక్తి బొత్తిగా లేనట్లుండేది. దానికి కారణం రామకిష్టయ్యేనని నా అనుమానం. తాను వేసిన పట్టాలమీదినుంచి ఎక్కడ దిగిపోతాడోనని ఆయన అడుగు అడుగున వాడికి ఏం చేయాలో చెప్పేవాడనుకొంటాను.

లేక రాఘవుడి పుటక తీరే అంతో !

రామకిష్టయ్యగారి పిల్లలు ఆయన దృష్టిలో రైలుపెట్టెలైతే కావచ్చు కాని, అన్నీ ఒకరకం పెట్టెలు మటుకుకావు. పిల్లలందరు ఒక తాటిమీద నడవరని దూరాన్నుంచి చూసిన మావంటి వాళ్ళకు మొదటినుంచీ అనిపించింది.

పెద్దవాడు ఒట్టిమేక - తెలివైన మేక అనుకుందాం. వాడిది మేషలగ్నమైతే రెండవ వాడిది మకర లగ్నం. వాడిది మొసలి పట్టు. వాడిపేరు రామ్మూర్తి. మూడవ వాడికి సరిపడే రాశి యేమిటో నాకే తెలీదు. కర్కాటక లగ్నమేమో. వాడు ఎవరినీ నమ్మేవాడుకాడు. అందరూ తనతో అబద్ధాలాడుతున్నారన్నట్లుగా ప్రవర్తించేవాడు. తల్లి మిఠాయి పెడతానన్నాసరే "అబద్ధాలు! మిఠాయి ఎక్కడిది? ఎవరిచ్చారు?" అని ప్రశ్నించేవాడు. వాడిలో చిన్నపిల్లవాడి లక్షణాలు నేనేనాడూ చూడలేదు. ఆ మాటని చాలా గొప్ప బుర్ర అంటే అదీ లేదు. ఇప్పుడు అప్పగించిన పాఠం ఇంకాస్సేపటికి మరచిపోయేవాడు.

ఈ మూడోవాడు, నారాయణ, తండ్రిచేత తిన్న దెబ్బలు మరెవరు తినలేదు. అ ఆ లు రాసిస్తే అవి అ ఆ లు కాదనేవాడు. తన్నులు తినేవాడు.

నాలుగోవాడు కోదండరాముడు. పై ముగ్గురికన్నా తెలివి గలవాడని నా నమ్మకం. అయితే అవి పైకి కనిపించే తెలివితేటలు కావు. చాలా మితభాషి. మనుషులను చాలా త్వరగా అర్థం చేసుకొనేవాడు.

అయిదోవాడు గోవిందం. నాలుగోవాడంత తెలివిగలవా డవునో కాడో కాని చాకులాంటి మనిషి. మాటలతో నెగ్గుకొచ్చేవాడు. వాడిని మోసపుచ్చటం చాలా కష్టమయ్యేది.

ఈ అన్నదమ్ముల మధ్య రెండేసీ మూడేసీ ఏళ్ళు తేడా ఉండేది.

తండ్రిచేత మాటపడకుండా వుండటానికయితేనేం, తండ్రి తనకోసం వేసిన పట్టాలమీద గురివల్లనైతేనేం రాఘవుడు ప్రతిక్లాసు చాలా శ్రద్ధగా చదివి మంచిమార్కులతో పాసవుతూ వచ్చాడు. ఇంటరులో వాడికి చాలామంచి మార్కులు వచ్చాయి. వాడికి కాబోయే బావమరిది ఇంటరులో వాడికి క్లాసుమేటు కూడా కావటం తటస్థించింది. సాధారణంగా క్లాసులో మంచి తెలివిగల వాళ్ళనిపించు కొనేవాళ్ళు ఒకటవుతారు. రాఘవుడికి, శివానందానికి మంచి స్నేహం కూడా ఏర్పడింది.

శివానందం అన్న పెళ్ళైతే రాఘవుణ్ణి బలవంతం చేసి తీసుకుపోయాడు. పెళ్ళి బెజవాడలో. శివానందం తల్లీ తండ్రీ రాఘవుణ్ని దగ్గర బంధువుని చూసినట్లే చూశారు. రాఘవుణ్ని శివానందం వెంటపెట్టుకుపోయింది సగం వాళ్ళు చూడటా నికే. అంతకుముందే ఆ కుర్రవాడు రాఘవుణ్ని గురించి తల్లి తండ్రులకు బాగా చెప్పాడు. శివానందం చెల్లెలు, రాధ పన్నెండేళ్ళది. రజస్వలాంతర వివాహాలు అక్కడక్కడా జరుగుతూనే ఉన్నాయి కాని శివానందం తల్లిదండ్రులు బాగా సంప న్నులు కావటం చేత పేదలకు కాస్త వెనకగా ఉండవలసిన వాళ్ళయ్యారు.

తన పెళ్ళి చూపులు అయిపోయాయని రాఘవుడికి తెలియదు. "ఇది మా చెల్లెలు రాధ" అని శివానందం తన చెల్లెలిని చూపించటం, రాధ కొద్దిగా సిగ్గు పడటమూ చూసినాక ప్రపంచంలో వున్న ఆడపిల్ల లందరికన్నా ఆ పిల్ల కొంచెం ప్రత్యేకంగా రాఘవుడికి అనిపించింది. రాధ ప్రత్యేకించి అందగత్తెకాదు. సంసార పక్షం. అయితే రాఘవుడికి అందం తెలిసినా అందంపట్ల స్పార్ధం లేదేమో.

అటు తర్వాత శివానందం తండ్రి రాజగోపాలం గారికి, మా రామకిష్టయ్య గారికి మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగాయి. పెళ్ళి ఖాయమయింది. "మీ వాడి చదువు గురించి మీరేమి శ్రమపడనవసరం లేదు. నేను వాడిచేత ఇంజనీరింగ్ పాస్ చేయిస్తాను. అవకాశం వుంటే ఇంగ్లండు కూడా పంపిస్తాను. జర్మనీ అయితే బాగుణ్ణు. కాని అక్కడ నాజీల గొడవ మరీ జాస్తిగా ఉన్నది." అని రాజగోపాలం అన్నమీదట రామకిష్టయ్య కట్నాల ప్రసక్తి కూడా తీసుకురాలేదు.

పెళ్ళి సలక్షణంగా జరిగిపోయింది. రాజగోపాలం అన్నమాట నిలబెట్టుకొని శివానందంతోపాటు రాఘవుణ్ని కూడా ఇంజనీరింగులో తన ఖర్చుతో చేర్పించాడు.

రాఘవుడి విషయంలో తన కృషి నూటికి నూరుపాళ్ళు సఫలమైనదని రామ కిష్టయ్య అనుకున్నాడు. మా అందరితో అన్నాడు కూడానూ. వాడి చదువు మాట అట్లా ఉంచి ఇంటరు చదువుతూండగానే రాజగోపాలం లాటి ఐశ్వర్యవంతుణ్ని

ఆకర్షించి అల్లుడు కాగలిగాడంటే అది తన ప్రయోజకత్వమేనని ఆయన అనుకొని ఉండవచ్చు. దానికి అభ్యంతరం చెప్పేవారూ ఉండరు.

# 4

ఇక రామకిష్టయ్య దృష్టి రామ్మూర్తిమీద కేంద్రీకరించవలసిన సమయం వచ్చింది. అప్పటికి వాడు స్కూలు ఫైనలు దాకా వచ్చాడు. అప్పటికే వాడు కొద్దిగా పట్టా తప్పాడు. ఎందుచేతనంటే ఫిఫ్తు ఫారంలో వాడికి లెక్కల్లో సీట్లు ఇవ్వమనేసారు. అందుచేత హిస్టరీ సెక్షనులో చేరాడు. వాడు ఇంజనీరు గాని, డాక్టరుగాని అయ్యే అవకాశం లేదు. అప్పటికి రామకిష్టయ్య వాణ్ని లెక్కల గురించి హెచ్చరించాడు.

"నాకు లెక్కలు రావులే నాన్నా!" అని రామ్మూర్తి ఖచ్చితంగా చెప్పేసాడు.

వాణ్ని బాగెట్లా చదివించే అవకాశం ఉంటుందేమోనని రామకిష్టయ్య ఆశ పడ్డాడు. వేళాకోళాని కన్నట్లుగా "వీడికి కూడా డబ్బుగల మామగారు వచ్చి ఏ ఇంగ్లండో పంపిస్తే బాగానే ఉండును." అని ఒకసారి అన్నాడు కూడాను.

రామ్మూర్తి ఇంటరు చదువుతుండగా పెళ్ళి సంబంధాలు వచ్చాయి. ఒక్కటి కూడా చెప్పుకోదగిన సంబంధం కాదు. వచ్చిన వాటిలో ఏదో ఒకటి చేద్దామా అని రామకిష్టయ్య అనుకున్నాడు. వాడి పెళ్ళికివచ్చే కట్నంతో వాడి చదువు వెళ్ళమారి పోతే తనకూ కొంత తేలికగా ఉంటుందని ఆయన ఉద్దేశం.

అయితే రామ్మూర్తి పెళ్ళాడనని మొరాయించాడు. కారణం వాడు ఎవరి తోనూ చెప్పలేదు మంచి మాటలతో నేను రాబట్టగలిగాను. రాజగోపాలం గారికి ఇంకోపిల్ల ఉన్నది. దాన్ని తనకిస్తారేమోనని రామ్మూర్తి ఆశపడ్డాడు. కాని రాజగోపాలం అలాటి అభిప్రాయం ప్రకటించనే లేదు. రామ్మూర్తికి చాలా కోపం వచ్చింది.

రామ్మూర్తిని బి. ఎల్. దాకా రామకిష్టయ్య తన సొంత ఖర్చుతోనే చదివించ వలసి వచ్చింది. ఖర్చు కూడా ఆయన అనుకున్న దానికన్నా జాస్తి అయ్యింది. దానికి కారణం రామ్మూర్తి ఖర్చుమనిషి. వాడి పెద్ద ఖర్చు బట్టలు.

"పట్నంలో కాస్త స్మార్టుగా ఉండాలి నాన్నా, అందులో లా కాలేజీ అంటే మరీనూ!" అనేవాడు రామ్మూర్తి.

వాడి స్మార్టునెస్ మార్కులు తేలేదు. ఎఫెల్లోనే తప్పాడు. తప్పినందుకు రామ్మూర్తి అట్టే బాధపడలేదుగాని రామకిష్టయ్య అవమానంతో కుంగిపోయి మంచం పట్టినంత పని చేశాడు.

"ఛీ, వెధవ! వీడికింక చదువు రాదు. మానిపించేస్తాను" అన్నాడు ఆయన. కాని ఆ పని చేయటానికి ఆత్మాభిమానం అడ్డువచ్చింది. ఇంత దూరంవచ్చి వెనక్కు తీస్తాడా ?

రామ్మూర్తి చదువు కొనసాగింది. ఖర్చుకూడా కొనసాగింది.

"వీడి చదువుకింద ఖర్చయినదంతా వీడి పెళ్ళికి రాబట్టాలి. లేకపోతే మిగిలిన పిల్లల చదువులు దెబ్బతింటాయి. నేనేమన్నా లక్షాధికారినా ?" అన్నాడు రామకిష్టయ్య.

కాని అక్కడకూడా ఆయన అనుకున్నట్లు జరగలేదు.

రామ్మూర్తి బి. ఎల్. పాసయ్యాక ఎన్‌రోలయ్యి లక్ష్మీనారాయణగారనే ఎడ్వొకేటు దగ్గిర పని నేర్చుకొంటూ ఆయన కుమార్తెను పెళ్ళాడవలసిన పరిస్థితి కలిగించుకున్నాడు. పెళ్ళి ముహూర్తం నిశ్చయమయ్యాక గాని రామకిష్టయ్యకు తెలియలేదు.

పెళ్ళికి వెళ్ళిన రామకిష్టయ్య కుటుంబానికి గొప్ప మర్యాదలయినా జరగలేదు.

రెండో కొడుకు కోసం అప్పటికే చాలా ఖర్చు చేసిన రామకిష్టయ్య రామ్మూర్తితో "ఇక నీ రెక్కలమీద నీవు ఆధారపడటం మంచిది" అని చెప్పి వచ్చేశాడు.

రామ్మూర్తి చెడిపోయినా దనటానికి లేదు. బాగుపడ్డాడనే చెప్పాలి. అతని భార్యకు కొంత ఆస్తి కూడా ఉన్నది. అదీగాక ఆమెకు రామ్మూర్తి మీద ఉత్త వ్యామోహమే గాక కొంత అభిమానం కూడా ఉన్నట్టు కనబడుతుంది. పెళ్ళినాటికే ఆమె బియ్యే పరీక్షకు కూర్చున్నది. తరవాత ఆమె బి. టి. చదివి, ఏదో కాన్వెంటులో టీచరుగా చేరింది. తన తండ్రి తన భర్తను తగినంత గౌరవంగా చూడటం లేదని ఆమె వేరే ఇల్లు తీసుకుని వేరే కాపరం పెట్టింది. రామ్మూర్తికూడా ఉద్యోగం సంపాదించాడు. వాళ్ళు ఏలోటూ లేకుండా నిక్షేపంగానే జీవించారు.

కాని రామకిష్టయ్య పడిన శ్రమకు మాత్రం ప్రతిఫలం ముట్టలేదు.

# 5

రాఘవుడు ఇంజనీరింగ్ పూర్తిచేసే సరికి ప్రపంచ యుద్ధం[1] వచ్చి కొంత కాలం అయ్యింది. అందుచేత వాడు విదేశాలకు వెళ్ళే అవకాశం కలగలేదు. ఎక్కడో బొంబాయిలో మెటల్ ఫ్యాక్టరీలో ఉద్యోగం సంపాదించాడు. భార్యతోసహా అక్కడే కాపరం పెట్టాడు. జీతం బాగానే వస్తూ ఉండి ఉండవచ్చు. కాని తండ్రికి ఏమి పంపించలేదు. ఎప్పుడన్నా ఒక ఉత్తరం రాస్తే అందులో తన భార్య గురించీ, బిడ్డ

1. రెండవ ప్రపంచ యుద్ధం (1939-1945) ప్రస్తావన. చూడు పేజి 139.

లను గురించి రాసేవాడు. డబ్బు కావాలా అని అడిగేవాడు కాడు.

"మీ వాడిప్పుడు బొంబాయిలో బాగానే ఉన్నట్టున్నాడే. సిమ్లాకూ, ఆగ్రాకూ, మౌంట్ ఆబూకూ ఈ మధ్య సకుటుంబంగా వెళ్ళివచ్చాట్ట. ఇంటికేమన్నా పంపు తున్నాడా ?" అని ఎవరో అంటే రామకిష్టయ్యగారి మొహం జేవురించింది.

"వాడు డబ్బు పంపకపోతే నాకు గతిలేదా ఏం ?" అని అడిగాడు.

తన కొడుకు అత్తవారి మనిషి అయిపోయాడనీ, వాళ్ళు వాడికి పెద్దెత్తుగా జీవించే పద్ధతులు చెప్పారనీ, అందుకే పిల్లను తక్కువ చోటినుంచి చేసుకోమంటా రనీ, ఇప్పుడనుకుని లాభంలేదనీ ఆయన అంటూ వచ్చాడు.

"లేదు లెండి. వాడికి పెద్ద ఉద్యోగం రావటంతో కళ్ళు నెత్తికెక్కాయి. ఇప్పుడు మనం వాడికి కనిపించం." అన్నది అతని భార్య.

నిజానికి ఆ రోజుల్లో రామకిష్టయ్య పెద్దగా డబ్బుకు ఇబ్బంది పడను కూడ లేదు. ఆ స్థితి తరవాత చాలా రోజులకు ఏర్పడింది.

"ఈ లోపల మూడోవాడు నారాయణ చదువు మానేశాడు. వాడికి చదువు అంతగా అంటలేదు-కాని కమ్యూనిస్టు సాహిత్యం బాగా అంటింది. జీవితంలో ప్రతి దాన్ని గురించి శంకించిన వాడి బుర్రకు మార్క్సిజం సూటిగా తగిలింది. మార్క్స్[2] సిద్ధాంతాలలో ఏలాటి కాపట్యమూ ఉండే అవకాశంలేదని వాడికి గురి కుదిరిపోయింది. జీవితంలో ఉండే వంచనను నారాయణ ఊహించుకున్న దానికన్నా కూడా మార్క్సిస్టు సాహిత్యం బట్టబయలు చేసింది. మార్క్స్ చెప్పిన సూత్రాల మీద రష్యాలో ఒక సమాజం ఏర్పడిందని, అందులో కోటీశ్వరులు అందలాలెక్కి తిరగటానికీ, కటిక దరిద్రులు ముష్టెత్తటానికి అవకాశాలు లేకుండా పోయాయని

---

2. కార్ల్‌మార్క్స్ (1818-1883) "తాత్వికులు యింతకాలం ప్రపంచాన్ని రకరకాలుగా వ్యాఖ్యానించడం మాత్రమే చేశారు. అసలు చేయాల్సింది దాన్ని మార్చడం" అని నిర్ధారించిన భౌతికవాది, చరిత్రకారుడు, ఆర్థిక సిద్ధాంతకారుడు. ఆయన ప్రతిపాదించిన ప్రాపంచిక దృక్పథం మార్క్సిజం. అందులోని మూలాలు : గతితార్కిక భౌతికవాదం; చరిత్రను గురించిన భౌతికవాద దృక్పథం, వర్గపోరాటం; విలువ, అదనపు విలువ, సోషలిజం, కమ్యూనిజం. ఆచరణే సిద్ధాంత జీవమనీ, సిద్ధాంతం ఆచరణకు మార్గదర్శకమనీ నమ్మి ఉపదేశించి, ఆచరించి, అంతర్జాతీయ శ్రామికవర్గ వుద్యమానికి పునాదులు వేసిన వర్గపోరాట యోధుడు.

కమ్యూనిస్టు ప్రణాళిక (1848), పెట్టుబడి (మూడు సంపుటాలు 1867, 1885, 1894) మొదలైన రచనలు ఈ శతాబ్ది చరిత్రను కొత్త ప్రపంచంలోకి మలుపుదిప్పిన రచనలు, ఫ్రెడరిక్ ఎంగెల్స్ (1820-1895) మార్క్స్ సహయోధుడు, మిత్రుడు, సహరచయిత.

వాడు నమ్మగలిగాడు. విప్లవం, శ్రామికవర్గ నియంతృత్వం. మొదలయిన మాటలతో వాడి బుర్ర వెలిగిపోయింది. ఆ వెలుగులో వాడు అతి మనోహరమైన జీవిత విధానాలను రూపొందించుకున్నాడు.

వాడు కమ్యూనిస్టుల వెంట తెగ తిరిగాడు. మామూలు మనుషుల్లో కనిపించే దాపరికమూ, స్వార్థమూ, మోసమూ వాడికి కమ్యూనిస్టుల్లో కనపడలేదు. వాళ్ళకు రెండు నాలుకలూ, రెండు గుండెలూ లేవు. వాళ్ళలో ధైర్యమున్నది. వాళ్ళతో స్నేహంగా ఉండటం తేలిక.

మార్క్సిజం గురించీ, కమ్యూనిస్టులను గురించీ ఇలాంటి సదభిప్రాయా లన్నీ ఏర్పడిపోయాక, వాడు కమ్యూనిస్టులతో తిరిగి ఎందునా కాకుండా చెడిపోతు న్నట్టు రామకిష్టయ్యకు తెలిసింది.

"ఒరే ఆ పనికిమాలిన కమ్యూనిస్టులతో ఎందుకు తిరుగుతావురా? వాళ్ళు తోక తెగిన నక్కలు! ఏవేవో నినాదాలు పట్టుకొని, పిడుక్కూ, బియ్యానికీ వాటినే వల్లె వేస్తారు. వాళ్ళకు కావలసింది అరాజకం" అని మధ్యతరగతి గృహస్థు చెప్ప వలసిన నీతులేవో రామకిష్టయ్య నారాయణకు చెప్పాడు.

నారాయణ తండ్రికేసి వింతగా చూశాడు. తన తండ్రి అంత అజ్ఞాని అని నారాయణకు అంతకుముందు తెలియదు. నిజానికి రామకిష్టయ్య ఒక పొరపాటు చేశాడు. ఆయన కమ్యూనిస్టులను గురించి ఏమి తెలియకుండానే కొంత తెలిసిన వాడితో మాట్లాడడు. కమ్యూనిస్టులను గురించీ, మార్క్సిజం గురించీ తెలుసుకో వలసినది ఏమీ లేదని ఆయన గట్టిగా నమ్మాడు. ఈ పొరపాటే దేశంలో చాలా మంది మధ్యతరగతి గృహస్థులు చేసి తమ పిల్లల విశ్వాసాన్ని సొంతం పోగొట్టు కున్నారు. మార్క్సిస్టు సిద్ధాంతాలలో లోపాలే ఉండవచ్చు. కమ్యూనిస్టుల ఆశ యాలు తప్పుడువే అయి ఉండవచ్చు. కాని ఆ లోపాలేవో, తప్పేమిటో రామ కిష్టయ్యకు బొత్తిగా తెలీదు.

తన తండ్రి ఒక్క ముక్కతో కొట్టిపారేసిన కమ్యూనిస్టులు బోలెడంత సాహిత్యం అచ్చేశారు. దళాలను ఏర్పాటుచేసి కళాస్వరూపాలను ప్రచారం చేశారు. బొంబాయిలో వాళ్ళకు ఎంతో పలుకుబడి ఉంది. నారాయణ బొంబాయి వెళ్ళి నెల రోజులున్నాడు. కమ్యూనిస్టు పార్టీ ఆఫీసుకు బ్రిటిషు సైనికుల దగ్గిర నుంచీ రావ టమూ, సినిమా స్టార్లు దగ్గిర నుంచీ వాళ్ళకు ఎంతో ప్రోత్సాహం లభించటమూ కళ్ళారా చూశాడు. ఏదో పెద్ద మిల్లు, పార్టీ నిధికి విరాళాలు కూడా ఇచ్చేదని విన్నాడు నారాయణ. ఇందులో నూరోవంతు కూడా తన తండ్రికి తెలియకపోవటం నారాయణకు తలచుకున్నప్పుడల్లా ఆశ్చర్యంగా ఉండేది.

కమ్యూనిస్టుల సంపర్కం నారాయణకు ఒక సద్యఃఫలితాన్ని ఇచ్చింది. ఫిఫ్తు ఫారంలో ఇంగ్లీషులో నూటికి 25 మార్కులు తెచ్చుకొని తప్పిన వాడు మార్క్సిస్టు పుస్తకాలను ఇంగ్లీషులో చదివి అర్థం చేసుకునే స్థితికి రెండేళ్ళలో వచ్చాడు. వాడి

జీవితానికి అవే అసలైన పాఠ్యపుస్తకాలయాయి. వాడు క్లాసులో చదువుకున్న పుస్త కాలలో ఉన్నదేమిటి? అదంతా వాడికి అవిద్య అనిపించింది.

యుద్ధం చివరి రోజులలో నారాయణకు, చరిత్రకు మూలాధారం ఇకమీదట కమ్యూనిస్టులు తప్ప మరొకరు కాలేరనీ, కావటానికి పీలుకూడ లేదనీ అనిపించింది. యుద్ధం ముగిసిన ఏడాది లోపల మనదేశంలో కమ్యూనిజం వచ్చేస్తుందని వాడు ఎందరితోనో అన్నాడు.

# 6

యుద్ధం అయిపోయింది. రాఘవుడి ఉద్యోగం కూడా అయిపోయింది.

నావికుల తిరుగుబాటు[1] కీర్తిని పటేలు[2] గారు కాంగ్రెసు బుట్టలో వేసు కున్నప్పటికి, ప్రజలకు కమ్యూనిస్టులతో పనితీరినట్లు కనపడలేదు. అయితే చీకటి వ్యాపారాలు చేసేవాళ్ళకు కమ్యూనిస్టులు పానకంలో పుడకల్లాగా అడ్డుపడ్డారు. అతిసామాన్య మధ్యతరగతి వాళ్ళలో కూడా కమ్యూనిస్టులంటే చాలా అసహ్యం పుట్టింది.

"పండగనాడు పస్తుండమంటా రేమిటయ్యా ఈ కమ్యూనిస్టులూ ? ఇప్పుడే నాలుగు డబ్బులు చేసుకోకపోతే ఆ తరువాత ఈ అవకాశం వస్తుందా ?" అని నాతోనే కొందరన్నారు.

"వాళ్ళు రాబోయే కమ్యూనిజంకు అలికి ముగ్గులు పెడుతున్నట్టున్నారు" అన్నాను.

"క్వినైను లాభానికి అమ్ముకుంటే బెదిరిపోయే కమ్యూనిజం, అదెంత కమ్యూ నిజమయ్యా ?"

---

1. నావికుల తిరుగుబాటు (18-23 ఫిబ్రవరి, 1946) : జాతి వివక్షపట్ల, పని పరిస్థితుల పట్ల అసంతృప్తి చెందిన రాయల్ భారత నౌకాదళం చేసిన తిరుగుబాటు. బొంబాయిలోని సిగ్నల్ శిక్షణా కేంద్రం తల్వార్‌లో ఫిబ్ర వరి 17 వ తేదీ నిరాహారదీక్షతో మొదలైన అసంతృప్తి 18 వ తేదీకి సమ్మె రూపం తీసుకుంది. కరాచీ, కలకత్తా, విశాఖ మొదలైన అన్ని నౌకా కేంద్రా లకు విస్తరించింది. సమ్మె కమిటీ ఏర్పాటుతో రాజకీయ డిమాండ్లు కూడా ముందుకొచ్చాయి. బ్రిటిష్ పతాకాల స్థానంలో కాంగ్రెస్, కమ్యూనిస్టు, ముస్లింలీగు పతాకాలు నౌకలపై సమ్మెదారులు ఎగురవేశారు, సమ్మె జరి పారు. సమ్మెను అణిచేందుకు ప్రభుత్వం సైన్యాన్ని పంపింది. భారతీయ సైనికులు నావికులపై కాల్పులు జరిపేందుకు నిరాకరించారు. బ్రిటిష్ పటా లాలు దిగాయి. కాజిల్‌రాక్ నౌకా కేంద్రంవద్ద ఫిబ్రవరి 21వ తేదీ 7 గంటల

నాకు మాత్రం ఏం తెలుసు ?

ఉద్యోగం అయిపోగానే గుజరాతీలు ఇచ్చిన కాంపెన్సేషన్ చెక్కు జేబులో పెట్టుకుని రాఘవుడు అత్తవారిల్లు చేరాడు. అప్పటికి వాడికి ఇద్దరు పిల్లలు. వాళ్ళ నింకా మా రామకిష్టయ్య చూడలేదు.

రామ్మూర్తికి కూడా ఒక ఆడపిల్ల. దాన్ని రామకిష్టయ్య చూడలేదు.

నారాయణ బొంబాయిలోనే ఉండిపోయాడు. వాడు ఏ విధంగా పొట్టపోసుకుంటున్నదీ ఎవరికీ తెలీదు. తిండికి మాడకుండా ఉంటే అదే చాలు. పొట్టపోసుకునే ప్రతిమార్గమూ సజావైనదే - ఉపవాసమనేది తలవాకిలి దగ్గిర తిష్టవేసి ఉన్నప్పుడు.

ఈ లోపల కోదండరాముడు తండ్రి వేసిన పట్టాలమీద సక్రమంగా నడిచాడు. వాడు మెడిసిన్ చదివాడు. పదివేలు కట్నం తీసుకుని పెళ్ళి కూడా చేసుకున్నాడు. రామకిష్టయ్య మహా సంతోషించాడు. ఇంత కాలానికి తన కొడుకు జమా పద్దు చూపగలిగాడు. కట్నం పదివేలలో రెండువేల చిల్లర దానికీ దీనికీ ఖర్చయింది. కోదండరాముడి పెళ్ళినాటికి దాదాపు బికారి అయి ఉన్నాడేమో, రామకిష్టయ్యకు ఏడువేల రూపాయలు లక్షరూపాయలల్లే కనపడింది.

అయితే అదీ దక్కలేదు. "నాకు ఉద్యోగం చెయ్యాలనిలేదు నాన్నా. మిగిలిన డబ్బుతో క్లినిక్ పెట్టుకుంటాను." అన్నాడు కోదండరాముడు.

రామకిష్టయ్య ఎట్లా కాదంటాడూ? కట్నం బేరమాడి తెచ్చుకున్నది కోదండ

---

పాటు పోరాటం జరిగింది. బేషరతుగా లొంగకపోతే నౌకాదళాన్ని నాశనం చేస్తానని నౌకాదళాధిపతి గాడ్ ఫ్రె బెదిరించాడు. 22 వ తేదీ కమ్యూనిస్టు పార్టీ పిలుపుపై బొంబాయిలో సార్వత్రిక సమ్మె జరిగింది. ఈ సమ్మెను పటేల్ వ్యతిరేకించాడు. బ్రిటిష్ సైనికులు కార్మికులపై కాల్పులు జరిపి మూడు వందలమందిని పొట్టనబెట్టుకున్నారు. పటేల్, జిన్నాలు బేషరతుగా లొంగిపోతే, పగ సాధింపు చర్యలు లేకుండా చూస్తామని నావికులకు సలహా ఇచ్చారు. "మేము భారతదేశానికి లొంగిపోతున్నాం కానీ, బ్రిటిష్ ప్రభుత్వానికి కాదు" అని నావికులు 23 వ తేదీ సమ్మె విరమించారు. ఈ సమ్మె సమయంలో అపూర్వమైన ప్రజా సహకారం నావికులకు లభించింది. "ఆర్. ఐ. ఎన్. ఉదంతం భారత సైన్యాల చరిత్రలో ఒక కొత్త అధ్యాయం ప్రారంభించింది." అని జవహర్లాల్ నెహ్రూ భావించాడు.
(వివరాలకు చూడు. **Subrata Banarjee, The RIN Strike, People's Publishing House : New Delhi,** 1981 **Reprint.**)

2. పటేల్ (1875-1950) : **వల్లభాయిపటేల్.**

రాముడు. ఆ కట్నాన్ని తన కుటుంబం కోసమే వినియోగిస్తానని కూడా వాడు తన భార్యకు మాట ఇచ్చాడు.

వాడా క్లినిక్కును ఉన్న ఊళ్ళోనే పెట్టుకున్నా రామకిష్టయ్యకు కొంత అనుకూలంగా ఉండేది. వాడు దాన్ని మద్రాసు పట్నంలో నెలకొల్పాడు. అక్కడ వాడి క్లాస్‌మేట్ సర్జను ఒకడున్నాట్ట. ఇద్దరూ కలిసి క్లినిక్ నడుపుతారుట. వాడు కూడా తన మామగారిచ్చిన కట్నంతోనే ఆపరేషన్ థియేటరొకటి ఏర్పాటు చేస్తున్నాట్ట. ఇంత పెద్ద స్కీముకు రామకిష్టయ్య ఎట్లా అభ్యంతరం చెబుతాడూ ?

కోదండం సంగతి ఆ విధంగా అయింది. కొత్తగా ప్రాక్టీసు పెట్టిన ప్లీడరూ, డాక్టరూ ఎప్పటికి ఒడ్డున పడేది ఎవరూ చెప్పలేరు. కొందరికి చప్పున ప్రాక్టీసు అందుకుంటుంది. కొందరికి ఎంతకూ అందుకోదు. అదంతా వాళ్ళ వాళ్ళ ముఖార విందాలమీదా, చాకచక్యం మీదా, కొంతవరకు వృత్తిలో వాళ్ళకుండే నైపుణ్యంమీదా ఆధారపడుతుంది.

# 7

ఇక ఆశలు పెట్టుకోవటానికి రామకిష్టయ్యకు గోవిందుడొకడు మిగిలాడు- ఆయనకింకా కొడుకులమీదా ఆశలు పెట్టుకునే శక్తి ఉంటే.

"మనకన్న పక్షులు నయం. పిల్లలకు రెక్కలొచ్చేదాకా అన్ని రకాలా సహాయం చేస్తాయి. రెక్కలొచ్చిన పిల్లలు తమను ముసలితనంలో ఆదుకోవాలని ఆశించవు. పక్షి పిల్లలకూ్కడ, తమ తల్లిదండ్రుల గతేమిటా అన్న విచారం ఉండదు. ఆ విచారం మనిషి పిల్లలకూ ఉండటం లేదనుకో. కాకపోతే మనిషి పెద్దలకు పిల్లల మీద ఆశలు పెట్టుకోకుండా జరగటం లేదు. ఇక్కడే మనుషులకూ పక్షులకూ పెద్ద తేడా ఉంటున్నది" అనేవాడు రామకిష్టయ్య.

నేనూ ఒకప్పుడు ఆయనను మెచ్చుకున్నవాణ్ణే. ఆయన స్థితిలో ఉన్న వాడెవడూ తన పిల్లలు పైకివచ్చే సదుపాయాలు ఆ విధంగా చెయ్యడు, చెయ్యలేడు. "తండ్రి అంటే అట్లా ఉండాలి!" అని నేను ఎన్నిసార్లు అని ఉంటానో!

కాని నాకు ఆవిషయం ఇప్పుడు సందేహమే. రామకిష్టయ్య అవాస్తవికంగా ప్రవర్తించాడేమో. ఒక్క ఆడపిల్ల పెళ్ళి చేసి గొప్ప సంబంధం తీసుకురావటానికై దివాలా తీసిన వాళ్ళను నేనెరుగుదును. అంతెత్తు ఎగిరి ముక్కులు పిరగ్గొట్టుకోవాలా?

ఆర్థికంగా ఎవడి స్థాయి వాడికుంటుంది. ఈ స్థాయిలను వ్యక్తులు మార్చేది కల్ల. ఎవడి స్థాయిలో వాడుంటేనేం? సినిమా కథలో రిక్షావాడి కొడుకు కలెక్టరు కావచ్చునేమో. నిజమైన జీవితంలో రిక్షాలు లాగేవాడి కొడుకు కారు డ్రైవరయితే స్థాయి పెరిగినట్టు కాదా? కన్ను పోయినంత కాటుకెందుకని!

రామకిష్టయ్య చేసిన తప్పు స్పష్టంగా తెలిసి వచ్చేటట్టు చేసినవాడు గోవిందుడు. నిజానికి వాడు తండ్రిపైన అట్టే ఆధారపడలేదు. ఆ మాటకొస్తే తండ్రే వాడిపైన ఆధారపడవలసిన స్థితిలో ఉన్నాడు. అంతేకాదు; వాడైనా దబ్బున చదువు పూర్తిచేసి నాలుగురాళ్ళు తెస్తే బాగుండునన్న ధోరణిలోకి వచ్చాడు రామకిష్టయ్య.

కాని గోవిందుడు లేడిలాగా గెంతుతూ చదువులో ముందుకు పోయాడు. వాడు ప్రతిక్లాసు ఫస్టుక్లాసు మార్కులతోనే పాసయ్యాడు. స్కాలర్‌షిప్పులు తెచ్చుకున్నాడు. న్యూక్లియర్ ఫిజిక్సు తీసుకున్నాడు. రిసెర్చి చేసి అందులోనే డాక్టరేట్ కూడా సంపాదించాడు. వాడి ఫోటో పేపర్లలో పడింది. ట్రాంబేలోనే పెద్ద ఉద్యోగం దొరికింది.

ఆ మధ్యను గోవిందుడు వస్తే కలిశాను. వాడు పెద్ద స్కీములతో ఉన్నాడు. బొంబాయిలో స్థలం తీసుకున్నాట్ట. ఇల్లు కట్టాలిట. కారు కొనాలిట. తను ప్రస్తుతం ఉంటున్న ఇల్లు ఏమీ బాగాలేదుట. అయిదురూముల ఫ్లాట్‌ట. రిఫ్రిజిరేటరూ, ఏర్ కండిషనింగ్ ప్లాంటూ అన్నీ ఏర్పాటు చేసుకున్నాట్టగాని, ఇల్లే తనకు నచ్చలేదుట. తాను కట్టబోయే ఇంట్లో కనీసం నాలుగు బెడ్‌రూములైనా ఉండాలిట. ఫర్నిచరుకే యాభై వేల రూపాయలవుతుందిట. ఇల్లు దొరలక్కూడా అనుకూలంగా ఉండాలిట.

అంతా విని, "ఇవన్నీ మీనాన్న ఊహించనుకూడా లేడు" అన్నాను.

"మా నాన్నకు లైఫ్‌మీద ధ్యాస ఎక్కడున్నది?" అన్నాడు వాడు.

"ధ్యాస ఉన్నంత మాత్రాన ఏమవుతుందిలే? మీ అన్నదమ్ముల చదువుల మీద మీనాన్న చాలా ధ్యాస పెట్టాడు. అందువల్ల ఆయనకు ఒరిగిందేమిటి?" అన్నాను

గోవిందుడు కాస్త ఆలోచించి, "అఫ్‌కోర్స్. ఆయన మా చదువు గురించి చాలా శ్రద్ధ కనబరిచాడు.... కాని మళ్ళా ఆయనతో అనొద్దు. నేను ఇంటర్ పాసు కాగానే నన్ను ట్రైనింగయి మన స్కూల్లోనే టీచరుగా చేరమన్నాడు! ఆయన మాటవింటే ఇప్పుడు నేనెక్కడ వుండేవాణ్ణి" అన్నాడు చిరునవ్వు నవ్వుతూ.

చివరకు రామకిష్టయ్యకు కొడుకులిచ్చిన కితాబు, నాకు తెలిసినంతవరకు, ఇదే!

ముద్రణ : యువ దీపావళి సంచిక, 1968

# నిష్కామకర్మ

తన తండ్రి చావు బతుకుల్లో ఉన్నాడని తెలియగానే శోభనాద్రి అంతస్సు ఒక్క పెట్టున జయధ్వానం చేసింది. "చస్తాడు, ముసలాడు ! వాళ్ళ ఊరికి పీడ వదలిపోతుంది. భూ భారం తీరిపోతుంది. ప్రపంచంలో ఉన్న ప్రాణవాయువు పరిశుద్ధం అవుతుంది!"

ఈ జయధ్వానం వినగానే శోభనాద్రికి ముచ్చెమటలు పోసినై. అతనికి సిగ్గుకూడా కలిగింది. తనకు అంత నీచమైన ఆలోచన రావటమేమిటి ?

ఎందుకంటే శోభనాద్రికి రెండు అంతరాత్మలున్నై. ధైర్యం కలవాడికి ఒకటే అంతరాత్మ ఉంటుంది. పిరికివాడికి మాత్రం రెండు ఉంటై. శోభనాద్రి అమిత పిరికివాడు.

శోభనాద్రి రెండో అంతరాత్మ, "నీ ధర్మం మరవకు. ఆయన కర్కోటకుడు కావచ్చును. నీ జీవితాన్ని ధ్వంసం చేసి ఉండవచ్చును. కానీ నీ తండ్రి. తండ్రి అనే ప్రేమ నీకు లేకపోయినా ఇబ్బంది లేదు. నీ ప్రవర్తను జాగ్రత్తగా కాపాడుకో. విధి నెరవేర్చు. నీ తండ్రికి ద్రోహంచేసే ఆలోచనచేసి నీకు నువే ద్రోహం చేసుకోకు?" అంటున్నది.

ఒక వారం రోజులు సెలవుపెట్టి శోభనాద్రి తండ్రిని చూడటానికి బైలు దేరాడు. రైలులో కూర్చున్నది లగాయతు ఇదే ఆలోచన.

తన తండ్రి తన జీవితాన్ని కాలమేఘం ఆవరించి, ఎక్కడా చిన్న సూర్య కిరణం ఎరగకుండా చేశాడు తనను. తనకు బుద్ధితెలియక పూర్వంనించి కూడా తను తన ఆనందంకోసం ఒక్కపనిచేసి ఎరగడు. పోనీ తండ్రి అయినా ఆనందిం ఛాడా? ఊరికే మెప్పయినా వచ్చిందా? కనీసం సమ్మతి అయినా ? ఒక్కనాడు లేదు. క్రియకు తను ఆయన ఇష్టానికి వ్యతిరేకంగా ప్రవర్తిస్తూ వచ్చినట్టే అయింది. ఆ విధంగా తను రెంటికీ చెడ్డాడు.

తన ఇష్టాయిష్టాలను చంపుకున్నందుకు తండ్రి చేసిన బహుమానం ఏమంటే తన బి.ఏ. చదువు మొగ్గలో తుంచటమూ, పోయి సంపాదించుకోమని ఇంటో నించి తరమటమూనూ! ఆ గోడౌను కీపరు ఖాళీ వచ్చినప్పుడు తను కష్టపడి అంత మంచి శిఫారసు తెచ్చుకున్నా తండ్రి సెక్యూరిటీ కట్టనని అది కాస్తా పాడు చేశాడు-భ్రాష్టుడు !

సంవత్సరానికి ఇరవై పుట్ల చొప్పునవచ్చే ఆస్తి సంపాదించాడు, ఉద్యోగంలో ఉన్న రోజుల్లో రెండు చేతులా లంచాలుపట్టి ! అదంతా ఎట్లా ఖర్చుచేస్తాడో ఏమో.

ప్రతిదానికీ డబ్బు లేదంటాడు. గర్భదరిద్రులైనా అనుభవించేటప్పు డనుభవించి మాడేటప్పుడు మాడతారు.

ఎంత పాపిష్టివాళ్ళను కూడా ఎవరో ఒకరు ఎప్పుడో ఒకప్పుడు "అయ్యో! పాపం!" అంటారు. తన తండ్రిని లోకం పాపిష్టి వాడికింద చూడకపోవచ్చును కాని "అయ్యో ! పాపం !" అనాలని మాత్రం ఎవరికీ ఆయన విషయమై ఆలోచనపోదు. తన జీవితపు ఇతర అసభ్యతలకు తోడు ఇటువంటి తండ్రి !

తను ఎట్లా తిండిలేక మాడాడో, ఎవరెవరి కాళ్ళు పట్టుకున్నాడో, ఎవరెవరిని ప్రాధేయపడి, ఎంత కష్టంమీద ఈ గుమాస్తాగిరీ ఈ పాతిక రూపాయల జీతమూ సంపాదించాడో, తన తండ్రికి ఏం తెలుసు ?

ఏమైతే ఏం. ఇక తన కష్టాలు గట్టెక్కినట్టే. ఈ పాతిక తనకు సరిపోతై: ఇందులో ఐదారు మిగులుతై కూడాను. తనకు కిల్లీకూడా అవసరంలేదు కదా ! ఇక తన తండ్రి తననేం బాధపెట్టగలడు ? తను ఒక వందరూపాయలు వెనక వేసుకోగలిగాడు కూడానూ. ఆ వందా ఖర్చుపెట్టి పెళ్ళిచేసుకుంటే పాతిక రూపాయలమీద ఇద్దరూ హాయిగా బతకవచ్చును. ముందు ముందు పిల్లలు పుడతారూ? కానీ కాలం ఎప్పుడూ ఒక విధంగానే ఉంటుందా ?

శోభనాద్రి తండ్రిని చూశాడు. ఆయనకు నంజు వ్యాధి. వైద్యంగాని, పథ్యంగాని ఏమీలేదు. కొడుకును చూడగానే తల్లి ఆవురుమని ఏడ్చింది. ఆవిడ గర్భవాసాన పాపం, లేకలేక ఒక్క కొడుకు.

"ఏమిటమ్మా ! ఆయనకు వైద్యం ఎందుకు చేయించటం లేదూ?" అన్నాడు శోభనాద్రి.

"ఏమో, మీ నాన్నకు అశ్రద్ధ. పెత్తనంలో వచ్చే జబ్బులు నయమయిందాకా నమ్మకమేమిటి, నాయనా? ముందు వైద్యులకు మాత్రం బోలెడంత పొయ్యాలి !"

శోభనాద్రి తల తిరిగి పోయినట్టయింది. తన తల్లి వైధవ్యాన్ని అటువంటి వేదాంతంతో ఎదుర్కొంటున్నదా ? ఇంటో రుగ్మత ఆమెకుగాని తన తండ్రికిగాని ఈషణ్మాత్రం, మీద ఈగ వాలినట్టయినా లేదా ? తను మాత్రం అపరిపూర్ణమైన ఆరోగ్యాన్ని సహించలేడు.

అతను వెంటనే ఇల్లు బయలుదేరి వెళ్ళి మంచి డాక్టరును పిలుచుకు వచ్చాడు. డాక్టరు రోగిని పరీక్షించి "నయం కావచ్చును వైద్యం చేదాం !" అన్నాడు. సరే మందిస్తూ ఉండమన్నాడు శోభనాద్రి.

డాక్టరు వెళ్ళిపోగానే తండ్రి కొడుకుమీద ఎగిరిపడ్డాడు. "ఈ డాక్టర్లు బోలెడంత డబ్బు కాజేస్తారు. ఏమిటి వాళ్ళు చేసే వైద్యం, వాళ్ళ మొహం ?"

"మంచాన పడి ఉన్న వాడివి పడివుండక తర్కించ వస్తావేమిటి ? నేనిక్కడ ఉన్నంతసేపూ నాయిష్ట ప్రకారం నడవాలిసిందే" అని శోభనాద్రి బిగ్గరగా అరిచాడు.

అతనికి తండ్రిమీద కోపం కంటే ఆయన్ను చూస్తే ఆశ్చర్యం ఎక్కువ

గలిగింది. ఆయన మనస్తత్వం ఏమిటో అతను ఊహించ లేకపోయినాడు. డబ్బు కన్న ఇంకేమీ ఆయనకు ఎక్కువగా కనిపించదా? తన ప్రాణంకూడా? ప్రాణం పోతే డబ్బేం చేసుకుంటాడు? తనకు డబ్బుకన్న తక్కువైనవి బహుకొద్దిగా కనిపిస్తై. ఇద్దరు సామాన్య మనుష్యుల దృష్టిలో ఇంత తేడా ఏమిటి?

తను వెళ్ళిన మరుక్షణం డాక్టరును ఇంట్లో అడుగు పెట్టనివ్వడు తండ్రి. శోభనాద్రి ఒక నెలరోజుల సెలవుకోసం రాశాడు. మూడోరోజుకు తిరిగి సమాధానం వచ్చింది — పీలుపడదనీ, వారం కాగానే బయలుదేరి రమ్మనీ. జీతం లేకుండానైనా సరే శెలవిప్పించమని ప్రాధేయపడుతూ శోభనాద్రి మళ్ళీ ఉత్తరం రాశాడు. జవాబు లేదు.

తండ్రి మందులకూ ఇంజక్షనులకూ శోభనాద్రి తన డబ్బే వాడుతున్నాడు. మొత్తంమీద రోగం తిరుగు మొహమైంది. డాక్టరు కూడా సంతోషించాడు.

"ఇంత త్వరలో రోగం దారికి వస్తుందని నేను నా అంతరాత్మలో అనుకోలేదు" అన్నాడు డాక్టరు.

"వాళ్ళు డబ్బు గుంజటానికి అట్లాగే అంటారులే!" అన్నాడు తండ్రి.

శోభనాద్రి నెలాఖరుకు జీతము, ఉద్యోగం ఊడిన వార్తా వచ్చినై. అతడు కన్నీళ్ళు ఆపుకోవటం దాదాపు అసంభవ మయింది. తనకెందుకీ పెంట? తను అతి ప్రయత్నంమీద నిలవచేసిన డబ్బు అయిపోతున్నది. తండ్రికి సాంతంగా నయమయ్యేటప్పటికి ఒక కానీ మిగలదు. ఉద్యోగం ఊడింది. మళ్ళీ కడుపు మాడటమూ, ఆశ్రయింపూ, అవమానమూ, ఇంకొక బానిస తొత్తు నౌకరీనీ!

"ముసలాణ్ణి ఎందుకు చావనివ్వక పోయినావు? సంవత్సరానికి ఇరవై పుట్లు! స్వేచ్ఛ! తగుదునమ్మా అని ఏమని వచ్చి ఆ ముసలి ప్రాణానికి అడ్డుపడ్డావు? ఇవాళ నంజు నయం చేశావు, రేపు ఏ రోగమూ లేకుండా చస్తాడు; ఆపుతావా?" అన్నది ఒక అంతరాత్మ.

"ఏమయితేనేం? ఒక ప్రాణం దక్కించావు. నీ చేతిలో లేకుండా పొయ్యే ప్రాణమూ, నీ ఎదుట నిష్కారణంగా పొయ్యే ప్రాణమూ ఒకటేనా? ఆయన్ను చావనిచ్చి ఉంటే నీ ఆత్మగౌరవం, నీ వ్యక్తిత్వం దక్కి ఉండునా? నీ వ్యక్తిత్వం ఎక్కువా, ఇరవై పుట్లెక్కువా? నీ వ్యక్తిత్వం కోసం నువ్వు ఒకప్పుడు అన్ని రకాల బాధలూ, అవమానాలూ సహించిన వాడివికావా? అప్పటికీ ఇప్పటికీ తేడా ఏముంది?" అన్నది మరొక అంతరాత్మ.

ముద్రణ : ?

ప్రచురణ : ఇల్లరికం కథల సంపుటిలో
యువ కార్యాలయం : తెనాలి, మార్చి 1939

# దుక్కి బెద్దం

"వద్దు. వద్దు! నాకు డాక్టరొద్దు! రెండు రోజులుంటే అదే నిమ్మళిస్తుంది!" అన్నాడు కిష్టయ్య ఆయాసంగా.

"అదేమిటి, నాన్నగారూ? అదే నయం కావటమేమిటి? అసలు జబ్బేమిటో తెలుసుకోనివ్వండి. ముందుగా జాగ్రత్తపడాలిగాని, రోగం ముదర బెట్టుకుంటారా?" అన్నది అనసూయ. ఆమె పిల్లలు నలుగురూ ఆమె చుట్టూ నిలుచున్నారు.

"పిల్లలకోడి" అని కిష్టయ్య తన కూతురికి ఏనాడో పేరు పెట్టుకున్నాడు. కాని ఆయన ఆ మాట ఎప్పుడూ పైకి అనలేదు. ఆయన పెళ్ళాంతోగాని, పిల్లలతో గాని అనని విషయాలు, ఇటువంటివి, ఇంకా బోలెడున్నై.... అనసూయకు పిల్లలకోడి అని పేరు పెట్టుకున్నాక, ఆవిడ పిల్లల్ని వెంటేసుకొని ఇంట్లో కనిపించినప్పుడల్లా కిష్టయ్యకు నవ్వొచ్చేది. ఒకసారి అనసూయ గమనించి, "ఏమిటి, నాన్నా, నవ్వు తున్నావు?" అని అడిగింది.

"ఏంలేదు. ఏంలేదు! ఏదో జ్ఞాపకం వచ్చింది." అన్నాడు కిష్టయ్య.

అనసూయ నమ్మలేదు. ఆమెది అసలే అనుమానం మనసు. పిల్లలతల్లి అయి కూడా పుట్టింటిని విడవకుండా ఉండటమేకాదు, తనకు తల్లిదండ్రులుగాని, అన్న దమ్ములుగాని ఏలోపం చేసిపోతారో అని వెయ్యికళ్ళతో కనిపెట్టి ఉండేది. అనుమా నించటానికి ఏమాత్రం అవకాశం దొరికినా సూటీపోటీ మాటలని సాధించేది. ఎన్నో ప్రమాణాలూ, క్షమాపణలూ అయినదాకా వొదిలేదికాదు. తన నోటికి ఇంటిల్లిపాదీ వెరుస్తారన్న నమ్మకం ఒకటి ఆమెకు గొప్ప అండగా ఉంటూ వస్తున్నది....

తండ్రి తననుచూసే నవ్వాడన్న అనుమానం పోలేదు. కాని ఏం చెయ్యలేక, కుడిచేతికి అందిన కొడుకుని ఒక్కటిపెట్టి, "పదా!" అన్నది. నోట్లోనుంచి తాపీగా వేలుతీసేసి, నింపాదిగా కళ్ళుమూసి, నోరు బార్లా తెరచి బావురుమన్నాడు. నలుగురు పిల్లల్నీ వెంటబెట్టుకుని అనసూయ అవతలికి వెళ్ళిపోయింది.

"ఉపగ్రహాలు!" అనుకున్నాడు కిష్టయ్య, అనసూయ పిల్లలకు కొత్త నామ కరణం చేసుకుంటూ.

ఒకప్పుడు కిష్టయ్య తన భార్యను గురించీ, పిల్లల్ని గురించీ మురిసినవాడే. ఆయన చిన్నతనంలో కష్టాలు పడ్డాడు. ఆయన తన తల్లి నెరగడు. తండ్రి రెండో పెళ్ళి చేసుకున్నాడు. మారుతల్లి కిష్టయ్యని చాలా హీనంగా చూసేది. వాళ్ళ పల్లెటూళ్ళో ఇంగ్లీషు బడి లేదు. బస్తీ చదువు డబ్బు దండగన్నది మారు

తల్లి. తండ్రి కాదనలేదు. కిష్టయ్య- పదేళ్ళవాడు- ఇంట్లో చెప్పకుండా బస్తీకి వెళ్ళి వారాలు చేసుకుని, పుస్తకాలు, జీతం డబ్బులు, ఇతరులు పారేసిన బట్టలు ముష్టెత్తి చదువుకున్నాడు. తాను మేజరై తండ్రితో ఆస్తి పంపకం చేసుకునేసరికి కిష్టయ్యకి చదువు అయేపోయింది.

ఇతరుల్ని మంచి చేసుకునే విద్య కిష్టయ్య చిన్నతనం నుంచీ విధిగా అలవరించుకున్నాడు. "మంచివాడు" అనిపించుకోవటం, ఇతరులను ఏ మాత్రమూ నొప్పించకుండా వారి పూర్తి సహకారం పొందటం, పొందిన సహాయానికి రెట్టింపు కృతజ్ఞత చూపటం ఆయనకు బాగా అలవాటైపోయింది. ఇదే ఆయనకు ఉద్యోగంలో పైకిరావటానికి కూడా ఎంతో ఉపకరించింది. చదివినది స్కూలు ఫైనలే అయినా పెళ్ళి అయేనాటికి అప్పుడే నూరు రూపాయలు - ఆ రోజుల్లో బియ్యేలు కూడా చెయ్యలేని సంపాదన - సంపాదిస్తున్నాడు.

భార్య కాపరానికి వచ్చాక కిష్టయ్య ఆనందానికి మితిలేదు. "తన" అన్న మనిషంటూ కిష్టయ్య ఎరగడు. ఇప్పుడాయనకు ఒక భార్యా, సహజీవనమూ, తన యిష్టప్రకారం ఇల్లు అమర్చుకోవటం, వంటచేయించుకు తినడం ఏర్పాటయింది. పిల్లలు పుట్టుకొచ్చారు-ఇద్దరు కొడుకులూ, ఒక కూతురూ, మళ్ళీ ముగ్గురు కొడుకులూనూ. తన భార్యనూ, ఆరుగురు పిల్లల్నీ తనకు సాధ్యమైనంతగా సుఖపెడతానని కిష్టయ్య శపథం చేసుకున్నాడు. వాళ్ళ కేలోటూ రాకూడదని రెండు చేతులా సంపాదించాడు. అదనంగా రెండు రూపాయలు సంపాదించటానికి రెండు పూటలు తిండిలేకుండా తిరగవలసివస్తే తిరిగాడు.

కిష్టయ్య ఏళ్ళతరబడి దుక్కిటెద్దులాగా పని చేశాడు. ఎన్ని వ్యాపారాల లోనో భాగం తీసుకున్నాడు. ఆ వ్యాపారాలు దండగపాలు కాకుండా తానే స్వయంగా పైపెట్టున ఉండి నడిపాడు. దీనిఫలితం, కిష్టయ్య తప్ప, అందరూ అనుభవించారు. కిష్టయ్య పెళ్ళాం నూరు రూపాయలకు తక్కువ చీర కట్టి బయటికి పొయ్యేదికాదు. కిష్టయ్య కొడుకులకు చదువు సంధ్యలు అబ్బినా, అబ్బక పోయినా సరికొత్త ఫాషన్‌లో దుస్తులు ధరించటం, మోటారు సైకిళ్ళెక్కి తిరగటం, టెన్నిస్ ఆడటం మొదలైనవన్నీ అబ్బినై.

పెద్దవాడు చిన్న టెన్నిస్ ఛాంపియన్. వాడికి స్పోర్ట్స్ ప్రపంచం తప్ప, ఇంకేమీ తెలీదు. తాను ఉద్యోగం చెయ్యబోవటంలేదని వాడు చదువుతూండగానే ప్రకటించాడు. రెండోవాడు ఇంజనీరు చదివి, జంషెడ్పూరులో ఉద్యోగం సంపాదించాడు. వాడిభార్య లక్షాధికార్ల బిడ్డ. ఆవిడ తాహతుకు తగినట్టుగా బతకటానికి తండ్రి దగ్గరినుంచి ప్రతినెలా వందా, రెండువందలు తెప్పించుకుంటాడు. మూడో వాడికి చీట్లాటపిచ్చి. అందులో వాడు సంపాదిస్తాడని ప్రతీతి. కాని వాడికింద కిష్టయ్య ఏటా నాలుగైదు వేలు ఖర్చుచేస్తూనే ఉన్నాడు. నాలుగోవాడికి సినిమా స్టారు కావాలని. వాడు స్కూలు ఫైనల్‌తో చదువు ఆపేశాడు. చదవరా అని-

కిష్టయ్య అంటే, "నీవు చదివినంత నేనూ చదివాను. సినిమాస్టారు ఛాన్సురానీ, నీకన్న ఎక్కువే సంపాదిస్తాను" అనేవాడు. అయిపోవాడు మటుకు చదువుతున్నాడింకా.

అనసూయకు పదోఏటనే పెళ్ళి చేశారు - శారదా చట్టాన్ని[1] ధిక్కరించి, బాగా ఉన్నవాళ్ళ పిల్లవాణ్ణే చూసి చేశారు. అనసూయ మొగుడి దగ్గరకు పంపిన కొద్ది రోజులకే ఆమె అత్తవారి ఆస్తంతా అప్పులవాళ్ళ పాలయింది. డిప్రెషన్[2] వాళ్ళ మీద పెద్ద దెబ్బ తీసింది. "మహాతల్లి మెట్టిన వేళావిశేషం ఎటువంటిదో, లక్షరూపాయల ఆస్తి సోదిలోకి రాకుండా పోయింది!" అని అనసూయ వింటుండగా అత్తవారు అన్నారు. అనసూయ అప్పటికప్పుడే పెట్టే బేడా సర్దుకుని పుట్టింటికి బయలుదేరి వచ్చేసింది. మళ్ళా అత్తవారింటి మొహం చూడలేదు. ఒక వారం రోజులు వెనకగా అనసూయ భర్త కామేశ్వరరావు కూడా వచ్చేశాడు.

"కాపరానికి వచ్చాడు అల్లుడు" అనుకున్నాడు కిష్టయ్య తనలో తాను ఆనంద పడుతూ.

కామేశ్వరరావంటే ఎందుకో కిష్టయ్యకు మొదటినుంచీ కూడా మంటే! ఈ మంటకు పెద్ద కారణాల్లేవు. ఉన్నవన్నీ అతి చిన్న కారణాలు. గొప్ప చెప్పుకుంటాడు, అబద్ధాలాడుతాడు. పెళ్ళామంటే అంతులేని ప్రేమ అభినయిస్తాడు. ఈ అభినయాన్ని కిష్టయ్య ఏనాడూ నమ్మలేదు. మరి మిగిలిన వాళ్ళంతా నమ్మారు.

అనసూయకు చాలారోజులు పిల్లలులేక వరసగా నలుగురు పుట్టుకొచ్చారు. కిష్టయ్య వాళ్ళందర్నీ పగవాడల్లే చూసేవాడు. కొడుకుల పిల్లలూ, కూతురి పిల్లలూ డజనుమందిదాకా ఉన్నారు. వాళ్ళల్లో ఎవరు కనిపించినా కిష్టయ్యకు జెర్రులు పాకినట్లుండేది. "లంకంత ఇల్లున్నది! వీళ్ళు నేనున్న చోటికే ఎందుకు వస్తారో!" అనుకునేవాడు.

కిష్టయ్యకు మనుషులంటే అసహ్యం, మనవలతో మనవరాళ్ళతో ఆరంభం కాలేదు; పెళ్ళాం పిల్లలతో ఆరంభమయింది. వాళ్ళు ఆయనను డబ్బు సంపాదించే యంత్రంగా చూడసాగారు. డబ్బు కావలిస్తేనే తన దగ్గిరికి వచ్చేవాళ్ళు. డబ్బు దేనికో

---

1. శారదా చట్టం : ఈ చట్టాన్నే 1929 **Child Marriage Restraint Act** అంటారు. (సెక్షన్ 6 (1) షెడ్యూలు 11, క్రిమినల్ ప్రొసీజర్ కోడ్) బాల్య వివాహాల నిషేధ చట్టం యిది. దీని శాసనకర్త దివాన్ బహద్దూర్ హరవిలాస శారద. మాజీ జుడీషిల్ సర్వీసు సభ్యుడు. శారదా చట్టం ముంచుకొస్తుందని పెద్ద యెత్తున బాల్య వివాహాలు చేశారు. చట్టం వచ్చాక కూడా యానాం, పాండిచ్చేరి, తెలంగాణా మొదలైన బ్రిటిష్ పాలిత ప్రాంతాలు కాని ప్రాంతాలకు వెళ్ళి వివాహాలు చేసుకొని వచ్చేవాళ్ళు.
2. డిప్రెషన్ : 1929-1934 మధ్య ప్రపంచ వ్యాప్తంగా వచ్చిన ఆర్థిక కాటకం. ఇది మన వ్యవసాయక, ఆర్థిక జీవితాన్ని, తీవ్రంగా దెబ్బతీసింది.

తెలుసుకుందామని తాను ఎప్పుడన్నా విచారిస్తే చెప్పటానికి విసుక్కునేవాళ్ళు. ఒక్క కామేశ్వర్రావే తన దగ్గిరికి వచ్చి కూచుని ఏవేవో వ్యాపారాలను గురించి గంటల తరబడి మాట్లాడేవాడు. చివరకు, రెండు వేలు మూడు వేలు పెట్టుబడి కావాలని బయట పెట్టేవాడు.

తను ఏ పూటా సరిగా వేళకు భోంచేసేవాడుకాడు కిష్టయ్య. కాని దానికి అందరూ అలవాటు పడిపోయారు. ఒక రాత్రి పన్నెండు గంటలకు ఇంటికి వస్తే అందరూ నిద్రలు పోతున్నారు. "భోజనం చేస్తావా ?" అని అడిగినవాళ్ళులేరు. అన్నం పెట్టమని అడిగితే పెట్టేవాళ్ళే. ఎందుకో కిష్టయ్యకు అడగబుద్ధి కాలేదు. బోజనం చెయ్యకుండానే పడుకున్నాడు.

ఇంట్లో కిష్టయ్య తప్ప మిగిలిన వాళ్ళందరి మధ్యా ఏవో బంధాలున్నాయి. వాళ్ళు ఆప్యాయంగా మాట్లాడుకునేవాళ్ళు. కాని వాళ్ళమధ్య కిష్టయ్యకు ఏమీ స్థానం లేదు.

"వీళ్ళందరి కోసం నేనెందుకు హూనం కావాలి. నా తిండికి బట్టకూ యాభై చాలు, నాకు నస్యం కూడా అలవాటులేదు" అని కిష్టయ్య చాలాసార్లు అనుకున్నాడు. కాని దొర్లే రాయి దొర్లుతూనే ఉంది. సగం ఈ మూకను మరచిపోవటానికే పైపనులు పెట్టుకున్నాడు. ఎప్పుడైనా పెందలాడి ఇంటికి వచ్చినా, ఇల్లు దాటి పోకపోయినా ఏదో ఆత్మద్రోహం చేసినట్టుగా తోచేది.

"ఈవాళ తాత ఇంట్లోనే ఉన్నాడే !" అనేవాళ్ళు కుర్రాళ్ళు. అందులో కిష్టయ్యకి ఏదో వెటకారం అనిపించేది. తరవాత కాస్సేపటికి ఇంకెవరోవచ్చి గోడల్ని అడిగినట్టుగా, "ఈవేళ నాన్న ఎక్కడికీ పోలేదల్లే ఉందే !" అనేవాళ్ళు. ఆఖరుకు అసలావిడ, "వెళ్ళారనుకున్నా, ఉన్నారా ?" అనేది.

ఇంట్లో ఎవరికీ తను అవసరం లేదని తెలుసుకోవడానికి కిష్టయ్యకు చాలా కాలం పట్టింది. తాను ఏదైనా మాట్లాడినప్పుడు ఎవరూ సొంతం వినేవారుకారు. ఇది గమనించినాక కిష్టయ్య అనేక డజన్లసార్లు రుజువు చేసుకున్నాడు. కాని ఎవరితోనూ ఈ మాట అనలేదు.

కిష్టయ్యకి మరీ మంట ఎత్తింది దేనికంటే, తాను అనేకమంది సహాయం పొందాడు. కాని వారందరికీ తన కృతజ్ఞత చూపాడు. ఈ మూక తనవల్ల ఇంత సహాయం పొందుతూ కూడా తన కష్టసుఖాలు ఎందుకు విచారించరు? తనకు యాభై ఎనిమిదో ఏడు. ప్రభుత్వోద్యోగం చేసినట్టయితే పించను పుచ్చుకుని సుఖపడవలసిన వయసు. అదంతా లేకపోగా ఎంత తెచ్చినా చాలదు. ఎంత ఇచ్చినా ఇంకా ఇమ్మనే మాట. డబ్బు ఇవ్వటానికి తప్ప మిగిలిన అన్ని విషయాలకూ తాను పరాయివాడే.

కిష్టయ్యకు జబ్బు చేసింది. ఆరోగ్యం చెడింది. చెడదూ ? విధీవిరామం లేకుండా పనిచేస్తుంటే ఎంతకాలం ఆరోగ్యం ఉంటుంది ? అందులోనూ ఈ వయసులో !

"ఈ సారి నేను చచ్చిపోతాను !" అనుకున్నాడు కిష్టయ్య. ఈ జబ్బు నుంచి ఆయనకు కోలుకోవాలని లేదు. ఈ అవతారం ఇక చాలించవచ్చు ననిపించింది.

కాని మిగిలినవాళ్ళకు ఆయనను చావనివ్వాలని ఏ కోశానా లేదు. డాక్టరును పిలవ పంపారు. తనకు డాక్టరు అవసరం లేదన్నాడు కిష్టయ్య.

డాక్టరు రానేవచ్చాడు. పరీక్ష చేశాడు. విశ్రాంతి తీసుకోమన్నాడు. ఏవో ఇంజెక్షన్లూ టానిక్కులూ రాసి ఇచ్చాడు.

"డబ్బు దండగ, నా బతుకు ఎట్లా ఆరంభమయిందో అట్లాగే ముగుస్తుంది. నా అనేవాళ్ళు లేకుండా, నా బతుకు నేను బతికినప్పుడు ఏ డాక్టరూ నాకు ఇంజెక్షనిస్తా ననలేదు. ఎందుకంటే అప్పుడు డబ్బులేదు. ఇప్పుడు డబ్బుందిగనక డాక్టర్లు చేతికొచ్చిన మందులల్లా రాసిస్తారు. అవి ఏమీ చెయ్యలేవు" అనుకున్నాడు కిష్టయ్య.

కాని ఇంజెక్షన్లు పనిచేశాయి. విశ్రాంతికూడా కొంత పనిచేసిందేమో? కిష్టయ్య మంచంలో లేచి కూచుంటే అందరి ముఖాలూ విప్పారినై.

"బంగారుగుడ్లు పెట్టేకోడి చావలేదని ఎంత సంతోషం !" అనుకున్నాడు కిష్టయ్య.

లేడికి లేచిందే ప్రయాణం. కాస్త ఆరోగ్యం కుదుటపడగానే కిష్టయ్యకు ఏమీ చెయ్యకుండా ఉండటం దుర్భరమనిపించింది. అధమం ఏదన్నా చదువుదా మనుకున్నాడు. అనసూయ ఆఖరు కొడుకు కనిపిస్తే వాణ్ణి పిలిచి, "చదువుకు నేందుకు ఏదన్నా పట్టారా !" అని అడిగాడు.

వాడు వెళ్ళి ఏదో పత్రిక తెచ్చి యిచ్చాడు. కిష్టయ్య పేజీలు తిరగేస్తూ, "వట్టిచెత్త! ఇహమూ, పరమూ లేని రాతలు!" అనుకున్నాడు. అకస్మాత్తుగా ఆయన దృష్టి కొన్ని పద్యాలమీద పడింది. పద్యాలకు "దుక్కిటెద్దు" అని శీర్షిక ఉంది. దానికింద తన ఆఖరు కొడుకు పేరుంది.

'వీడు తిక్కన సోమయాజి అని నేను ఎరగనే !' అనుకుంటూ కిష్టయ్య పద్యాలు చదవసాగాడు. పొలాల మొహం ఎరగని తన ఆఖరు కొడుకు దుక్కిటెద్దు గురించి పద్యాలు రాయటమేమిటి ?

కాని కుర్రాడు, కిష్టయ్య అనుకున్నంత తెలివితక్కువవాడు కాడు. వాడు తానెరిగిన దుక్కిటెద్దు గురించే రాశాడు. ఆ దుక్కిటెద్దుకు జీవించటం చేతకాదు. తన కష్టసుఖాలను ఇంకొకరితో పంచుకోదు. ఇతరుల కోసం అస్తమానం శ్రమపడి వాళ్ళను సోమరిపోతులనుగా చేసి, వారంతా తనకు రుణపడి ఉన్నారని సంతోషిస్తుంది. వాళ్ళు తనకు కృతజ్ఞత చూపటంలేదని మనసులో బాధపడుతుంది. క్రమంగా దాని హృదయంలో ఆపేక్ష, అంతఃకరణలకు చోటుండదు. ఆఖరుకు కోపంవచ్చి కొమ్ము విసరటంకూడా చాతగాని స్థితిలోపడి చావుకోసం ఎదురుచూడ సాగుతుంది.

కిష్టయ్య ఆఖరు కొడుకు కొద్దిపాటి హాస్యధోరణిలో రాసిన అయిదు పద్యాల సారాంశమూ ఇంతే.

"ఓరి పిడిగా !" అనుకున్నాడు కిష్టయ్య. కిష్టయ్యలో కొద్దిపాటి హాస్యం ఉంది. అది ఎవరికీ వశపడ నిచ్చేవాడుకాడు. అదే తనకొడుక్కుకూడా సంక్రమించింది. వాడుకూడా పైకి హాస్యం ఉన్నట్టు కనిపించడు.

అనసూయ గ్లాసులో పళ్ళరసం తెచ్చింది.

"ప్రతిపూటా నాకు పంచదార తక్కువవుతున్నది !" అంటూ గొణిగాడు కిష్టయ్య.

"తక్కువైతే అడిగి వేయించుకోరాదూ ?" అన్నది అనసూయ ఆశ్చర్యంగా.

"అదే దుక్కిటెద్దు లక్షణం !" అన్నాడు కిష్టయ్య.

"ఏమిటీ?" అన్నది అనసూయ, అయోమయంగా.

"ఏం లేదులే ! పిల్లల్నందర్నీ ఒకసారి పంపించు."

"దేనికి ?"

"దేనికేమిటి ? పంపించమంటుంటే !"

అనసూయ తల అడ్డంగా ఆడించి వెళ్ళిపోయింది.

కాస్సేపటికి ఏడెనిమిదిమంది పిల్లలు కిష్టయ్య గదిలోకి వచ్చి కుక్కిన పేలల్లే నిలబడ్డారు.

"చదవండి, నావెంట!" అంటూ "దుక్కిటెద్దు" పద్యాలు వాళ్ళచేత చదివించాడు. వాళ్ళు బెరుకు బెరుకుగా చదివారుగాని రానురాను గొంతులు హెచ్చినై.

తండ్రి పంచదార కావాలని అడిగినమాట మరచిపోయిన అనసూయ తిరిగి జ్ఞాపకం తెచ్చుకుని పంచదారసీసా, చంచా పట్టుకొని వచ్చేసరికి కిష్టయ్య గది, వీధి బడిలాగా ఉంది. పిల్లలంతా కప్పెగిరిపోయేట్టు తాతవెంట పద్యాలు చదువుతున్నారు. పళ్ళరసం గ్లాసు పక్కనే బల్లమీద ఖాళీగా పెట్టిఉంది. దాని అడుగున చూచాడు. పంచదార కరిగీ కరగకుండా మిగిలి ఉన్నది.

"పంచదార చాలా ఎక్కువేశావ్!" అన్నాడు కిష్టయ్య అనసూయకేసి చూడకుండానే.

పిల్లలు "దుక్కిటెద్దు" గోలగా చదువుతూనే ఉన్నారు. అవి వాళ్ళకు అప్పుడే కంఠతా వచ్చేశాయి.

ప్రచురణ : 1954-1955 దుక్కిటెద్దు కథల సంపుటిలో,
జయా పబ్లికేషన్స్ : విజయవాడ.

# ధర్మ సందేహం

ప్రమాణ పూర్తిగా అంతకన్న ఏమీ జరగలేదు.

"కాస్త పలహారం చేద్దువుగాని లేవరా!" అని వాళ్ళమ్మ అంటూనే వుంది. ఏదో ఆలోచిస్తూ పడుకున్నవాడల్లా చివాలున లేచాడు. కోటు వేసుకున్నాడు. బయట వున్న తనపుస్తకాలూ, కాగితాలూ,కలమూ, రెండు చొక్కాలూ, తువాలూ గబ గబా పెట్టెలో అడ్డదిడ్డంగా పడేసి పెట్టె మూసేశాడు. కాళ్ళకు చెప్పులు తగిలించుకున్నాడు. పెట్టె చేతపట్టుకున్నాడు. "నే పోతున్నా" అన్నాడు.

ఎక్కడికిరా, అంటే చెప్పలేదు. ఎందుకురా అంటే చెప్పలేదు.

శివయ్యకు కోపం వచ్చింది. రాదూ? అడ్డంవెళ్ళి, "నీవేషాలు—నాకెప్పుడూ అర్థం కాలేదనుకో—ఇప్పుడసలే అర్థం కావటంలేదు" అని పలకరించబోయినాడు.

"నాదారికి అడ్డంలే!" అన్నాడు జానకిరాముడు.

అంతే వెళ్ళిపోయినాడు. మళ్ళీ తిరిగిరాలేదు. తిరిగి వచ్చేవాడైతే అట్లా దేనికి వెళతాడూ?

చేతికొచ్చిన కొడుకు. లా చదవకపోతే మానె, ప్రాక్టీసు పెట్టకపోతే మానె, బియ్యే చదివాడుగా? నాలుగురాళ్ళు తెచ్చుకోగల సమర్థత వున్నవాడేగా?

తనకోసం కాకపోతే మానె - పెళ్ళాం, పెటాకులా? నిక్షేపమల్లే వాడి ఈడు వాళ్ళంతా బిడ్డల తండ్రులై కూర్చున్నారు! తండ్రికోసమైనా ఒక ఉద్యోగమంటూ అఘోరించి, పుత్రధర్మంగానైనా, తండ్రిమీది బరువు తగ్గించినవాడు కావచ్చుగా !

తన తండ్రి ప్లీడరు గుమాస్తాగిరీ చేసి కాపరం గడుపుతున్నాడంటే తనకు మాత్రం ఏం ఘనం?

అన్నిటికి ఏదో ఒకటి చెబుతాడు. ఉద్యోగాలెక్కడ ఉన్నయ్యంటాడు. శివయ్య మూడోఫారం పాసుకాలా. ఏడాది వాలంటీరుచేసి అయిదురూపాయల మీద ప్లీడరు గుమాస్తా అయినాడు. జానకిరాముడి పుటకలప్పటిమాట. మరి ఆ చేత్తోనే ముప్పైవేలు చేసే ఆస్తి సంపాదించాడా? డబ్బు మనదగ్గిరకెప్పుడన్నా వస్తుందా? మనం దాని దగ్గిరి కెళ్ళాలిగాని!

అయినా, వాడికి పుత్రధర్మమేమిటి? నాస్తికుడైతే. తద్దినాలేమిటంటాడు. కొలుపులేమిటంటాడు. పూజలేమిటంటాడు. జాతకాలేమిటంటాడు. "వీరేశలింగం గారు చచ్చిన ఇన్నేళ్ళకి నాచుట్టూతా ఈ మూఢాచారాలేమిటి" అంటాడు. దొరికాడు వెధవ ముండల పెళ్ళిళ్ళ పంతులు - ప్రతిదానికి మూఢాచారమే? పని

మీద పొయ్యేవాడు, వొంటి బ్రాహ్మడెదురైనాడనో, తుమ్మారనో కూర్చుంటే అది మూఢాచారమా? పొద్దున్నే లేచింది లగాయతు ఎన్నో పాపాలు చేస్తాం. ఎన్నో అబద్ధాలాడతాం, ఎంతమందినో టోపీ వేస్తాం. రాత్రికి పడుకోబొయ్యే సమయానికి కాస్త 'రామా కృష్ణా' అనుకుంటే, దానమ్మ కడుపుకాలా, అదీ మహాపాతకమేనా? ఇదేనా చదువు సంధ్యలు నేర్పేది?....

# 2

శివయ్యకు నిజంగా పట్టుకున్నది ఇవేవీ కావు. జానకిరాము డిల్లు వొదిలి ఎందుకు పోయినట్టు?

ఒక పోట్లాట జరగలేదు; వాగ్వాదమన్నా జరగలేదు.

వాడికేవో మనస్సులో ఉన్నమాట నిజమే— కాని అవి ఈనాటివి కావుగా?

అసలు వాడి కా ఇంటిమీదే పగ. "కట్టారు ఇల్లు ప్రతి దర్వాజాలోనుంచి వొంగిపోవలసిందే. మరో ఆరేసి అంగుళాలు పెట్టుకుంటే ఏంపోయింది? ఇల్లు మొత్తంమీద ఈ పొట్టి గుమ్మాలు పెట్టి పది రూపాయలన్నా ఆదా చేశారో లేదో, పాపం?" అని సణిగేవాడు.

తను చెమటోడ్చి ఒక్కొక్క రూపాయే కూడపెట్టి పోగుచేసి ఎన్నో ఏళ్ళ ప్రయత్నంతో ముచ్చటపడి కట్టించిన ఈ ఇంటికి, దర్వాజాలు మరో అంగుళం పెట్టలేదని, రోజూ తన కొడుకు సణుగుతూ వుంటే శివయ్యగారి ప్రాణం ఎంత క్షోభపడాలి, క్షోభపడలా?.... వీడు ఆరడుగులు పెరుగుతాడని ఆ యిల్లు కట్టిన వారెవరన్నా కలగన్నారా?....

అదేం ఖర్మమో, ఆ తండ్రి కొడుకు లిద్దరికీ ప్రతిదాన్లో ఎదురుమల్లే. శివయ్యగారు ఎంత సదుద్దేశంతో ఏది చెప్పినా, జానకిరాముడు దానికొక దురుద్దేశం అంటగడతాడాయె.

"నీ జన్మల్లా ప్లీడరు గుమాస్తా గిరీలో గడిచింది. ప్లీడరు పని చెయ్యాలనే నీమోజు నాద్వారా తప్ప తీర్చుకునేటందుకు లేదు. అందుచేత నన్ను ప్లీడరు కమ్మంటున్నావు.... అవును, ప్లీడర్లకి ఏమీ రావటం లేదని నీకు తెలుసు. మీ ప్లీడరుగారు సంపాదించింది నీ తెలివితేటలవలననే అని నీ నమ్మకం. నీ తోడుంటే నేను లక్షలు సంపాదిస్తానని నీ ఆశ! నిజంగా నీ మూలంగానే మీ ప్లీడరుగారు వేలకువేలు సంపాదిస్తే నువ్వాయన దగ్గిర నలభై రూపాయలతో ఎందుకు తృప్తి పడ్డావు? నీ అసలు సంపాదనంతా క్లయింట్లను దోచి ఎందుకు సంపాదించావు?"

ఏమిటీ మాటలు? మాటా మర్యాదా తెలిసినవాడు అనేవేనా?

అసలు వాడికి పెద్దంతరం, చిన్నంతరమంటూ ఉందా?

"రోజూ పాపాలు చేస్తున్నామని తెలుసుండి ఆ పాపాలు చెయ్యకపోతే ఏం?" అని వాడు తండ్రి నడగలా?

# 3

"వాడెందుకు వెళ్ళినట్టు?"

ఈ ప్రశ్నకి సమాధానం దొరక్కపోవటం శివయ్యగారికి వింతగా ఉంది.

వెడితే వెళ్ళాడు. బలవంతాన ఇంటో ఉంచుతారా ఏమిటి? పాతికేళ్ళు పైబడ్డవాణ్ణి.

వాడు జంఝుం లాగిపారెయ్యటం ఈ యింటోనే అయిపోయింది. తనను అనవలసిన మాటలన్నీ అనటం అయిపోయింది. నీ సంపాదనలో నుంచి నాకొక్క దమ్మిడీ అక్కర్లేదనటం అయింది. చాలాకాలం కిందటే అచ్చుపోసి విడిచేశారు. ఇప్పుడకస్మాత్తుగా ఏమి వచ్చిందని లేచిపోయినట్టు?

రోజూ భోజనం వేళకు ఇంటికి వస్తాడు. ఎక్కడికో వెడతాడు. ఎవరెవరో వచ్చి పిలుచుకుపోతారు. ఏమేమి విషయాలో మాట్లాడతారు. ఇహానికీ, పరానికి చెందిన విషయాలు కావు. ఒక డబ్బు విషయం కాదు. ఒక కోర్టు వ్యవహారం కాదు. ఒక కుటుంబ వ్యవహారం కాదు. ఎవరూ లేకుండా ఇంట్లో కూచుని ఏదో రాస్తాడు బ్రహ్మరాత. అదంతా పత్రికలకి పంపిస్తాడు గామాలు. చిన్నవాడప్పుడప్పుడూ, "నాన్నా, అన్నయ్యరాసింది అచ్చుపడ్డది చూశావా?" అంటాడు.

ఏముంటుంది చూడటానికి? బూడిద! వీరేశలింగమని ఉంటుంది! జంఝాలు తెంచమని ఉంటుంది! అన్నమంతా పట్టిచూడాలీ? అబ్బాయి వాలకం అర్థమవుతూనే ఉందిగా!

ఇదంతా జరిగిపోతూనే వుందిగా? ఇప్పుడు వీడెందుకు ఇల్లువిడిచి దిక్కులేని పక్షి అయి, వెళ్ళిపోవాలి?....

శివయ్యగారు తనమీద దోషారోపణ చేసుకోవలసిన అవసరం ఏమీలేదు. కాని కొడుకు లేచిపోవటానికి తప్పు తనదే అని ఎవరో అన్నట్టుగా ఆయన బాధపడ్డాడు. వాడు, "నీ మూలంగానే నేను ఈ కొంపలోంచి బయటికి పోతున్నా" అంటే ఎంత గింజుకోవాలో అంతగా ఆయన మనస్సు గింజుకుంటున్నది.

ఆ కారణం తెలిస్తే బాగుండును. అప్పుడుగాని ఈ గుంజాటన అంతం కాదు. ఆ కారణం కోసం ఆయన మనస్సు ఆనాటి— జానకిరాముడు వెళ్ళిపోయిననాటి— సంఘటనని సినిమాచిత్రం మళ్ళీ మళ్ళీ వేసి చూసుకున్నట్టు చూసుకుంటున్నది.

వెనక ఒకసారి—పదేళ్ళ క్రితం—చిన్న సంఘటన జరిగింది. శివయ్యగారు బజార్లో అయిదు రూపాయల కాగితం పారేసుకున్నాడు. అది పోయిందని చూసు-

కున్నచోట రోడ్డు ఝాముసేపు వెతికాడు. కాగితం దొరకలేదు. ఆయనే కాదు, ఇంకా యాభైమంది కలిసి వెతికారు.

"ఇంకెక్కడన్నా పారేసుకున్నారేమో?" అని ప్రతివెధవా అనేవాడు. చివరి కాయనకి కోపంకూడా వచ్చింది.

"ఇంతవరకూ చేతిలోనే ఉంది. ఇప్పుడే పోయింది. ఇక్కడే చూసుకున్నా" అంటాడాయన.

కాగితం పోయిందని రూఢి అయినాక ఆయనకు, వట్టి పుణ్యానికి ఐదు రూపాయలు పోయాయన్న విచారంకన్న పెద్దకొడుకు — అంటే ఈ జానకి రాముడే — ఆ పొద్దునే తనను ఐదురూపాయ లడిగి లేదంటే లేదనిపించినందులకు కోపం ఎత్తుకొచ్చింది. ఆ వెధవ తనచేత అన్నిసార్లు ఐదురూపాయలు లేదనిపించక పోతే ఈ కాగితం ముక్క పోకాపోను....వెధవ తథాస్తు దేవతలు !

అట్లాగే ఇప్పుడు....

ఈ విషయం ఎందుకు చెప్పొచ్చానో మరిచాను. పోనివ్వండి....

# 4

రెండోవాడున్నాడే—సూర్యం—వీడు వాడుమాదిరేకాడు. అసలు మొదటి నుంది వీడితరహాయే వేరు. వీడిదగ్గర దాపరికంలేదు. స్పష్టంగా మనసులో ఉన్నది చెప్పేస్తాడు.

"ఇదుగో, నాన్నా ! నువు నన్ను లా చదవమంటున్నావు. నువు చెప్పినట్టు వినడం నా ధర్మం. నేను చదువుతాను. నాకేమి అభ్యంతరంలేదు. నీ ముచ్చట తీర్చటం కంటే నాకు కావలసిందేమిటి ? కాని నేను ప్రాక్టీసుచేసి పైకొచ్చి ఫలానా వాడి పిల్లవాణ్ణి అనిపించుకోగలనని నాకు నమ్మకంలేదు. నువు ప్లీడరు గుమాస్తా చేశావంటే మీ ప్లీడరుగారికున్నంత పేరు నీకూ ఉంది. ఆయన సంపాదించినంతా నువ్వూ సంపాదించావు. రేపు నలుగురూ నన్నుచూసి ఫలానా శివయ్యగారి కుర్రాడేనా ఈ ప్రాక్టీసులేని ప్లీడరు, అంటే నీ మనస్సెట్లా ఉంటుందో ఆలోచించు. ప్లీడరీ చెయ్యటానికి కాస్త ఆరితేరినవాడై ఉండాలని నీకు తెలుసుకదా ! నన్ను నలుగురి చేత్తా బుద్ధిమంతుడు, అమాయకు డనిపించుకునేటట్టు పెంచావు. లాయరు పేచీలు నావల్ల కావు, ఆలోచించు. నువు చదవమంటే లా చదివేస్తాను. ఫస్టుక్లాసులో కూడా పాసయిపోతాను. బియ్యే పాసయిన వాడికి లా ఒక లెఖ్ఖా ?" అని స్పష్టంగా చెప్పేశాడు.

నిజానికి వాడు చెప్పిందాట్లో అబద్ధం ఏమీలేదు. పెళ్ళి విషయంలో కూడా వాడు అట్లాగే చెప్పేశాడు.

"ఇదుగో, నాన్నా ! నాకు పెళ్ళి చెయ్యాలనుకుంటే మహారాజుగా చేసెయ్యి. కాని, ఇప్పుడు పెళ్ళిళ్ళు వెనుకటిలాగా లేవు. ఈ శారదా బిల్లొచ్చినాక పెద్ద పిల్లలై పెళ్ళాడుతున్నారే, వీళ్ళు మొగుళ్ళని చూసుకొని ఇష్టపడటమూను, పడకపోవటమూ నేర్చుకుంటున్నారు. ఒకవేళ పెద్దవాళ్ళకి ఎదురాడక వాళ్లు అంటగట్టిన మొగుణ్ణి చేసుకుంటున్నా లోపల, వీణ్ణి నాకు అంటగట్టారే అన్న పగ పెట్టుకుంటున్నారు. ఇటువంటి పెళ్ళిళ్ళు లేకుండానే ఉండాలిగాని, ఉన్నాక మొగుడు పెళ్ళాలు ఒకరి మనస్సులొకళ్ళు తెలుసుకొని చేసుకోవటమే మంచిది. ఏమీ ఎరగనప్పుడు చేసేసిన మీ కాలపు పెళ్ళిళ్ళే మేలు. అవి పోయాక ఎవళ్ళకి వాళ్ళు చూసుకునే సంబంధాలు నయంగాని ఈ మధ్యరకపు పెళ్ళిళ్ళు అందునా ఇందునా కాకుండా అఘోరిస్తాయి. నే చెప్పింది అవునంటావా, కాదంటావా !"

అందులో అబద్ధమేముందీ ?

"ఎక్కడ చూసినా బియ్యేలే నాన్నా! రూపాయికి పదిమంది దొరుకుతున్నారు. ఏం ఉద్యోగం పోనిస్తూ ? ఉద్యోగం లేకపోతే మనకేం జరగదు గనకనా ? నాక్కూడా అన్నయ్యలాగే కథలు రాద్దామని ఉంది, నవలలు రాద్దామని ఉంది. నాటకాలు రాస్తాను కూడాను. రెండు కథలు రాసి పత్రికలకు పంపా. పడతాయి. నువ్వే చూద్దువుగానిగా ? నే చెప్పేది. చాతనయిన పని చెయ్యటంలోనే నిజమైన కీర్తి ఉంది. ఎందరు ప్లీడరూ గుమాస్తా పని చేయలేదు. నీ కొచ్చిన పేరందరికీ రాలేదేం !" అన్నాడు సూర్యం.

# 5

నేనీమధ్య చుట్టపుచూపుగా శివయ్యగా రింటికి వెళ్ళాను.

కుశలప్రశ్న లయినాక మాటల సందర్భంలో ఆయనతో, "ఏం బావగారూ ! పిల్లలిద్దర్నీ సాహిత్యంలో దించారే ?" అన్నా.

"వాళ్ళ మొహం ! .... నిన్ను చూసే చెడిపోయి ఉంటారు.... సరేకాని మా సూర్యం ఏమన్నా బాగా రాస్తాడూ" అన్నడాయన.

"బాగానే రాసే ధోరణి ఉంది. కాని పెద్దవాడికి చాలడేమో. ఎక్కువ మందిని ఆకర్షించేవి చిన్నవాడి కథలే గాని, మీ జానకిరాముడి రాతలో లోతు జాస్తి అనిపించింది నాకు" అన్నాను.

"నే నివేవీ చదవనులే.... అయినా నన్నడిగితే ఏ పనిలో కూడా, చూస్తున్నాగా, పెద్దవాడికన్నా సూర్యానికే చాకచక్యం జాస్తి" అన్నాడు శివయ్యగారు.

అందామా వద్దా అని కాస్సేపు పస్తాయించి ఆఖరుకు అనేశా!

"చూడండి బావగారూ, మీరు చదువరు కనుక తెలీదుగాని, మీ పిల్లలిద్దరూ మెమ్మల్ని కథలోకి ఎక్కించేశారు."

"నన్నే? నన్నే?" అన్నారు శివయ్యగారు కంగారుగా.

"అవును. అదిగాదు నే చెప్పవచ్చింది. మీ సూర్యం మిమ్మల్ని చాలా అపహాస్యం పాలుచేసి రాశాడు. మీ పెద్దవాడి కథలో—"

నా మాట శివయ్య పూర్తి కానివ్వలేదు.

"వాడెందుకు ఇల్లువొదిలి వెళ్ళిపోయినాడో నాకర్థం కాలేదు. ఎంతో ఆలోచించా. ఇంట్లో ఉంటే వాడికేమి నష్టం వచ్చింది?"

"ఉంటే వాడు కూడా మీ సూర్యం రాసినట్టే రాసేవాడేమో!" అన్నా. నాకింకేమీ అనటానికి తోచలా చెప్పొద్దూ.

శివయ్యగారు అర్థంకాని చూపులతో నాకేసి అట్లాగే చూశాడు.

ముద్రణ : ఆంధ్రజ్యోతి, అక్టోబరు 1948

# అక్క పెళ్ళి

"ఆయనకేం? మహారాజు! ఇంకా ఇద్దరు కూతుళ్ళున్నా అవలీలగా సంబంధాలు తీసుకురాగలడు!" అని తనను గురించి ఎవరన్నా స్నేహితులు అనుకున్నప్పుడు శ్వేతాంబరానికి కొద్దిగా గర్వమూ, అంతకంటె ఎక్కువ భయమూ కలిగేవి.

తన శక్తిలో తనకే లేని నమ్మకం తన స్నేహితుల కెందుకుండాలి? ఒకవేళ తాను హనుమంతుడల్లే తన శక్తి సామర్థ్యాలను గుర్తించలేకుండా ఉన్నాడా? అయితే, తనకూ, హనుమంతుడికీ ఒక్క విషయంలో మటుకు పోలికలేదు— హనుమంతుడు పొగిడితే విజృంభించేవాడు. దిక్కుమాలిన పొగడ్త తనను కుంగదీస్తోంది.

రెండు సంవత్సరాలుగా కళ్యాణికి తగినవాడెక్కడన్నా దొరుకుతాడా అని వెయ్యికళ్ళతో చూస్తున్నాడు. భూమ్యాకాశాల మధ్య అటువంటి వాడెవడూ ఇంత వరకు కనిపించలేదు. "ఎవరన్నా కాస్త సహాయపడండర్రా!" అని ఆప్తులనూ, మిత్రులనూ అడుగుదామన్నా వాళ్ళు తన అసహాయస్థితి గుర్తించేటట్టు లేరు.

"శ్వేతు పెద్దదానికింకా పెళ్ళి చేశేడు కాదేం?"

"ఆఁ ఇవాళ అనుకున్నాడంటే రేపు చేసేస్తాడు. మనవాడి కది ఏమంత కష్టమైన పని కాదులే!"

తన బంధువు లిద్దరిమధ్య జరిగిన ఈ సంభాషణను శ్వేతాంబరం తన చెవులారా విన్నాడు. తాను వింటున్నట్టు వాళ్ళకి తెలీదు; అందుచేత అవి ఇచ్చకాల మాటలనుకోవటానికి లేదు....

అవును, తన అసమర్థత ఒక్కరూ గమనించరు. ఆ కారణంచేత తాను బొత్తిగా ఒంటరిగాడై పోయినాడు. అంతకంటె తనకు కలిగిన లాభం ఆవగింజంత కూడాలేదు. అన్ని విషయాలలోనూ తనను నిశితంగా విమర్శించే తన భార్య గుణమణి కూడా, "మీరు పని పెట్టుకుని వెతికితే క్షణంలో దానికి సంబంధం కుదరక పోయిందా? మీ కసలు ఈగవాలినట్టయినా ఉంటేగా?" అంటుంది తప్ప "ఇది నీవల్ల అయే పనికాదు, మరెవరికన్నా పురమాయించు" అనదు....

తనలో ఇంతమందికి విశ్వాసం ఉండటానికి గల కారణాలు శ్వేతాంబరానికి తెలియకపోలేదు. ఆరేడు వందల రూపాయల జీతగాడు, పలుకుబడి గలవాడు, "నా కూతురికి పెళ్ళి చేస్తున్నాను!" అన్నాడంటే ఎంతమందో కుర్రాళ్ళు ఎగబడక పోతారా అని కొందరు బంధువుల నమ్మకం! ఎంతమంది స్నేహితుల కూతుళ్ళకో సంబంధాలు కుదిర్చాడు. తన కూతుళ్ళకు కుదర్చలేడా అని మరి కొందరి ఉద్దేశం!

ఇదంతా నిజమే అనుకున్నా, కళ్యాణికి మొగుణ్ణి తీసుకు రావటానికి చిన్న మెత్తు ఉపకరించలేదు—అది అసలైన నిజం. కొందరు పెద్దమనుషులు తమకు తామై వచ్చి, "మీ పిల్లను మావాడికి చేసుకుంటాం," అని అడగటమూ, ఇతరుల ద్వారా అడిగించటమూ జరిగింది. కాని అట్లా వచ్చిన సంబంధాలలో ఒక్కటి కూడా గుణమణి ఆమోదించలేదు.

గుణమణి ఆక్షేపించుటలో అఖండురాలు. ఎంటువంటివాళ్ళకైనా వంకలు పెడుతుంది—వాళ్ళంటే తనకు ఇష్టం లేకపోతే! "ఆవిడకి హృదయనేత్రమే తప్ప మనోనేత్రం లేదు. ఒకప్పుడుండేదేమో, ఇప్పుడు పువ్వేసి పోయింది," అని ఒక కవి మిత్రుడు తాను పూర్వం ప్రేమించిన ఒక గొప్ప ఇంటి ఇల్లాలిని గురించి శ్వేతాంబర దగ్గిర విరక్తిగా అన్నాడు. ఆ వర్ణన గుణమణికికూడా వర్తిస్తుందని శ్వేతాంబరానికి ఎన్నోసార్లు అనిపించింది. గుణ మానవులందర్నీ రెండు తరగతులుగా విభజించింది—తన కిష్టులైనవాళ్ళు, కానివాళ్ళూనూ! ఇష్టులైనవాళ్ళలో ఆమెకు ఏ ఒక్క లోపమూ కనిపించదు. అధవా కనిపించినా ఎంతో హృదయ వైశాల్యత కనబరిచి ఆ లోపాన్ని క్షమిస్తుంది, సమర్థిస్తుంది, వీలయితే మెచ్చుకుంటుంది కూడా.

గుణకి తన పెద్దకూతురు కళ్యాణిమీద చాలా ప్రేమ. "పాపం, దానికి ఏమీ తెలీదు—సీత ఇంకా గడుసుదిగాని...అందుకే దానికి మంచి సంబంధం చూడాలి!" అనేది. ఈ 'మంచి' సంబంధం ఎట్లా ఉంటుందో శ్వేతాంబరానికి ఎన్నడూ అర్థం కాలేదు. కళ్యాణిని చేసుకుంటామని వచ్చిన సంబంధాలలో చాలాభాగం తనకూ నచ్చని మాట నిజమేగాని, తాను కష్టపడి వెతికినా ఇంచుమించు అటువంటి సంబంధాలు తప్ప కళ్యాణికి రావని ఆయన నమ్మకం.

ఆమాట అంటే గుణ, "మీకు అదంటే చాలా తేలికలెస్తురూ!" అంటుంది.

"నీ కళ్ళకి నీ కూతురు రంభల్లే కనిపించగానే సరా?" అంటాడు శ్వేతాంబరం.

"అదే నాకర్థంకాదు. మీ కళ్ళకి మాత్రం రంభల్లే ఎందుకు కనిపించ కూడదూ? మీ కూతురు కాకపోయిందా?" అంటుంది గుణ.

"నీ మాదిరిగా ఆత్మవంచన చేసుకోవటం నాచేతకాదు."

"ఇష్టమైతే అన్నీ చాతవుతై!"

"పోనీ ఇష్టంలేదే అనుకో !"

"ఎందుకు లేకపోవాలి ? అదే నాకర్థంకాదు."

"ఇష్టమైతే అదే అవుతుందని నేను కూడా అనవచ్చా ?"... ఒక పావుగంట సేపు ఈ ధోరణిలో పడ్డాక, తాము ప్రారంభించిన విషయానికీ మాట్లాడుతున్న మాటలకూ సంబంధం లేకుండా పోయిందని శ్వేతాంబరానికి అర్థమయేది.

"నీతో ఏది మాట్లాడాలన్నా చిక్కే, అసలు విషయం వదిలేసి ఎటో ఈడు స్తావు !" అని విసుక్కునే వాడాయన.

"నేనా ! ఇంకానయం ! మీరే ఈడుస్తారు—దాని పెళ్ళి విషయం ఎత్తితే చాలు మీకు కోపం ! అదంటే మీకు బొత్తిగా గిట్టదు. అందుకని మీరే మాట మార్చేసి, ఇంకేదో మాట్లాడతారు" అనేది గుణ పూర్తి నమ్మకంతో.

తన భర్తకు కళ్యాణి అంటే ఇష్టంలేదని రుజువు చెయ్యటానికి గుణమణి దగ్గిర బోలెడంత సాక్ష్యం వుంది. ఊళ్ళోవాళ్ళందరికీ సంబంధాలు కుదర్చగలడు గాని, తన కూతురుకి కుదర్చడు ! తాను పెళ్ళికొడుకు తండ్రి అయినట్టుగా కళ్యాణిలో లోపాలెన్నుతాడు ! అదికూడా ఎందుకు ?— మంచి సంబంధం వెతక్కుండా తప్పించుకోవటానికి. సరస్వతమ్మగారి సుశీలకు ఈయనేగా సంబంధం కుదిర్చిందీ ! దానికి అంత మంచి మొగుడు వస్తాడని సరస్వతమ్మ కలలోనైనా అనుకొని ఉంటుందీ ? ఊళ్ళో వాళ్ళ కూతుళ్ళకు చేసేదానికన్న కన్నకూతురుకు ఎవరన్నా కాస్త ఎక్కువగానే జరుపుకోవాలా, వద్దా ?

తన భార్య ఈ ధోరణిలో పడ్డప్పుడు శ్వేతాంబరం అస్త్రసన్యాసంచేసి వింటూ ఉండిపోయేవాడు. ఎందుకంటే గుణ అనే మాటల్లో వాక్యానికి రెండేసి అబద్ధాలుంటాయి. సరస్వతమ్మ కూతురు సుశీలకూ, కళ్యాణికి ఏమీ పోలికలేదు. సుశీల చాలా తీరైనపిల్ల. తెలివిగలది. ఆ పిల్లకు వచ్చిన సంబంధం గుణ చెప్పేటంత గొప్పది ఏమీకాదు. పిల్లవాడికి ఆస్థిలేదు. రెండు వందలు సంపాదిస్తున్నాడన్న మాటేగాని కనుబొమలమీద వెంట్రుకల్లాగా ఎదుగూ బొదుగూలేని ఉద్యోగం. ఇంకా పదేళ్ళు చేసినా అదే జీతం రావచ్చు. లేదూ, రేపే ఉద్యోగం ఊడవచ్చు. ఈ జీతంరాళ్ళల్లో ఇద్దరు తమ్ములకు చదువులు చెప్పిస్తున్నాడు. అందులో ఒకడు కాలేజీ చదువు !... ఇంతాచేసి కుర్రవాడికి పలచని జుట్టూ, మెల్లకన్నూ ! తోలు ఎర్రగా ఉంటే అందగాడై పోయాడా ? ఇన్నిటికన్నా ముఖ్యమైన విషయమేమంటే ఈ సంబంధం కుదిర్చింది శ్వేతాంబరం కానేకాదు. ఆ కుర్రవాడి పినతండ్రి శ్వేతాంబరానికి బాల్య స్నేహితుడు. అందుచేత ఆ అబ్బాయి పిల్లను చూడటానికి తనుకూడా వెంటపెట్టుకు వెళ్ళాడు...

కాని గుణ స్టీమ్‌రోలర్‌ను నడిపించిందంటే దానిముందు ఏ నిజము అగలేదు. దాని క్రిందపడి అన్ని నిజాలూ రూపుమాసిపోవలసిందే ! అందుచేత శ్వేతాంబరం

మాట్లాడక ఊరుకునేవాడు.

* * *

సీత చాలా విషయాల్లో తండ్రి పోలికే. శ్వేతాంబరానికిగల నిగ్రహమూ, తీక్షణమైన బుద్ధీ వచ్చాయి. అంతేగాక, ఆమె తండ్రిలాగా మానసికంగా ఏకాంతవాసిని. ఆ పిల్ల తండ్రితోగాని, తల్లితోగాని, అక్కతోగాని చెప్పకుండా తన కడుపులో దాచుకున్న ఆలోచనలు చాలా ఉన్నాయి. ఆ సంగతి శ్వేతాంబరానికి తెలీదుగాని గుణమణికి తెలుసు. "మీరు మాట మాట్లాడితే సీతను వెనకేసుకొస్తారు గాని, అది వట్టి కూచి ! దొంగ ! అమ్మో !" అనేదావిడ భర్తతో.

తమకు కలిగిన ఇద్దరాడపిల్లలనూ భార్యాభర్తలిద్దరూ కూడబలుక్కున్నట్టుగా పంచేసుకున్నారు. కళ్యాణి అమ్మ పిల్ల ! సీత నాన్న పిల్ల ! శ్వేతాంబరం భార్యతో "నీ కూతురు" అంటే నూరింట తొంభై పాళ్ళు కళ్యాణి అన్నమాటే. అదే విధంగా గుణమణి కూడా సీతను గురించి మాట్లాడేటప్పుడు — ముఖ్యంగా దెప్పగా మాట్లాడేటప్పుడు — "మీ కూతురు" అని తీరేది.

ఈ పంపకం గురించి సీత చాలా చిన్నతనంనుంచీ ఎరుగును. అంతేకాదు, ఇందులో ఏదో క్రూరత్వం ఉన్నట్టు ఆ పిల్లకు తోచేది.

ఒక్క ఇందులోనేకాదు, భార్యాభర్తల మధ్య ఉండే సంబంధాలూ, తల్లిదండ్రులకూ మధ్య ఉండే సంబంధాలుకూడా అత్యంత క్రూరమైనవిగా సీత బుద్ధికి తోచేవి. తన తల్లి తండ్రి ఎప్పుడు ఏ విషయం మాట్లాడినా వారి మాటల వెనక ఏదో పరస్పర విద్వేషం దాగి ఉన్నట్టు ఆ పిల్ల తెలుసుకోగలిగేది. వాళ్ళు కూతుళ్ళ నిద్దరినీ పంచుకున్నారేమో, ఒకరిమీద ఒకరికిగల తేలిక భావాలూ, కసీ, విసుగూ ఒకరి పిల్లల మీద ఒకరు చూపించుకునేవారు — అది కూడా గోప్యంగానే !

సీత నిత్యమూ ఘర్షణపడే దంపతులనుకూడా చూసింది. కాని అట్లా పోట్లాడుకోవటంకంటే తన తల్లిదండ్రులు సాగించే మూఢయుద్ధం మరింత క్రూరంగా ఉన్నట్టుండేది. "శ్వేతాంబరంగారూ, గుణమణిగారూ కూడా నిజంగా ఎంతో అన్యోన్యంగా ఉంటారు !" అని ఎవరన్నా అనుకుంటూంటే సీత ఆశ్చర్యపోయేది.

ఆ పిల్లమీద తన ప్రభావం ఏమీలేదని గుణమణి బాగానే గుర్తించింది. కాని, శ్వేతాంబరం మటుకు సీత అచ్చు తనలాంటిదే అని ఆత్మవంచన చేసుకునేవాడు. ఒకటి నిజం. సీత మనస్సుమీద తల్లిదండ్రులిద్దరి ప్రభావమూ తక్కువే. జన్మతః ఆమెకు చాలావరకు తండ్రి పోలికలూ కొంతవరకు తల్లిపోలికలూ వచ్చాయి. ఆమె ఎనిమిదేళ్ళు వెళ్ళేదాకా తన తల్లిదండ్రులలో ఎవరు రైటో ఎవరు తప్పో తెలుసుకోలేకపోయేది. ఆ తరవాత ఇద్దరూ చాలావరకు తప్పేననే నిర్ణయానికి వచ్చింది. ఇప్పుడు సీతకి పద్దెనిమిది నిండాయి. ఈ పదేళ్ళుగా ఆమె మీద తల్లిదండ్రులిద్దరి ప్రభావమూ కూడా లేదు.

తాను మానసికంగా దృఢంగా, బలంగా ఉండగలందులకు సీత చాలా

ఏప్పృగా ఎవరూ ఊహించని కృషి చేసింది. ఈ కృషి సఫలమయింది. కాని, దాని ఫలితాలు తల్లికి ఒక విధంగానూ, తండ్రికి ఒక విధంగానూ కనబడేవి. "అది కఠినురాలు, కఠినురాలు" అనేది తల్లి. "నా పోలికే....పట్టుదల....ఉండాలిసిందే !" అనేవాడు తండ్రి. "పట్టుదల ఏం కాదు — మొండితనం !" అనేది తల్లి.

సీత మానసిక దార్ఢ్యంకోసం కృషి చెయ్యటానికి కారణం కళ్యాణే. కాళ్ళలో సత్తువ లేనివాళ్ళు దేన్నయినా ఆనుకుని నిలబడ్డట్టుగా, కళ్యాణి ఎవరినో ఒకరిని ఆనుకునేది. మానసికంగా తనకన్న పెద్దదైవుండి తననే ఆనుకునేది.

ఎవరుకూడా కళ్యాణి మోస్తరుగా ఉండరాదని సీత నమ్మకం. అయితే సీతకు తన అక్కమీద కోపం ఏమీలేదు. ఆమెకు ఎవరి అశక్తతమీదా కోపంలేదు. అక్కడే శ్వేతాంబరానికీ, సీతకూ తేడా. ఇతరుల అసమర్థతవల్ల శ్వేతాంబరం చాలా క్రూరంగా ప్రవర్తించేవాడు. తన భార్య తనకన్న తెలివితక్కువ మనిషి అని తెలిసినాక ఆమె తెలివితక్కువతనాన్ని తన తెలివితో భర్తీ చెయ్యటానికి దాన్ని రెటింపు చెయ్యటానికి తన తెలివితేటలు ధారపోసేవాడు. గుణమణి మామూలు తెలివితేటలుగలవాణ్ణి చేసుకుని ఉంటే ఇంతకన్న రాణించి ఉండేది!.... కళ్యాణి విషయంలో కూడా తండ్రి ప్రవర్తన చాలా క్రూరంగా ఉన్నట్టు సీతకు తోచేది. ఒక ఇంట్లో, ఒక కుటుంబంలో ఉన్న మనుషులు ఒకరినొకరు పరీక్షకు పెట్టి మార్కులువేస్తూ కూచోవటంతోనే సరిపోతే ఇక వీళ్ళు కలిసి జీవించే దెప్పుడు ? ఒకరికొకరు సహాయపడేదెప్పుడు ?

తనను చూసి తండ్రి గర్వపడే సంగతి సీతకు తెలుసు. కాని, అందుకామె పెద్దగా సంతోషించేదికాదు. ఆయన కళ్యాణిని చూసి ఎందుకు అవమానపడేవాడో అందుకే తనను చూసి గర్వపడేవాడు — స్వాతిశయం ! అంతకన్నా ఏమీలేదు. నిజంగా తండ్రి సహాయం ఎక్కువగా కావలసినది కళ్యాణికి. అయినా కళ్యాణి విషయం వచ్చేసరికి తండ్రి చేతులు ముడుచుకున్నట్టుగా ప్రవర్తించేవాడు.

కల్యాణి పెళ్ళి ప్రయత్నాలు విషయం చూడరాదా; ఆయన సరి అయిన ప్రయత్నం చెయ్యటంలేదని తల్లి చేసిన ఆరోపణను సీత కూడా చాలావరకు ఆమోదించింది.

"రేపు సీతకు సంబంధం చూడాలంటే ఇట్లాగే తాత్సారం చేస్తారా ?" అన్నది గుణమణి.

"సీతకి సంబంధం తీసుకురావటానికి అరనిముషం పట్టదు" అన్నాడు తండ్రి.

ఈ మాటకు సీత సంతోషించలేదు. తనకు సులువుగా సంబంధాలు వచ్చే పక్షంలో ఆయన తన సర్వశక్తులూ ధారపోసి తన అక్కకే సంబంధం తీసుకు రావచ్చుగద !

సీతకు ఇంకో విషయం కూడా తెలుసును. కల్యాణికి మంచి సంబంధం రావటానికి తను అడ్డుగా ఉన్నదని తన తల్లి నమ్మకం ! ఆవిడ అట్లా అనుకోవ

టంలో తప్పేమీలేదు. కొన్ని సంబంధాలవాళ్ళు "మీ రెండో అమ్మాయిని చేసు కుంటాం" అని అనటం జరిగింది.

తన అక్కకు చాతయితే సహాయపడాలని సీత ఉద్దేశంగాని, ఆమెకు ప్రతి బంధకంగా ఉండాలని కాదు. కాని తాను చేయగలిగినదేమీ ఉన్నట్టు కనబడలేదు.

"జీవితం ఎంత క్రూరమైనది ! ఎంత నిర్దాక్షిణ్యమైనది !" అనుకున్నది సీత.

*  *  *  *

కల్యాణికి సంబంధం వచ్చింది. వరుడు పాతికేళ్ళవాడు. వాళ్ళకేమీలేదుట. ఇతనుమటుకు రెండువందల యాభై తెచ్చుకుంటున్నాడు. ఈ కాలంలో పొడి బియ్యే అక్షరాలతో రెండువందలయాభై తెచ్చుకోవటం ఘనమే. కాని, ఈ అబ్బాయి ప్రకాశం విషయంలో అంత ఘనంగా చెప్పుకొనటానికిలేదు. ఎందుకంటే అతనిపై పెద్ద కుటుంబ భారం ఉంది. అతని అన్న చనిపోయాడు. ఆయన ప్రకాశం కంటె తొమ్మిది పదేళ్ళ పెద్దవాడు. క్రిమినల్ లాయర్‌గా మంచి ప్రాక్టీసుండేది. ప్రకాశం చదువంతా ఆయనే చెప్పించాడు. ఆయనకు అయిదుగురు పిల్లలు-అందులో ముగ్గురు ఆడపిల్లలు ! ఆయన ఆకస్మికంగా చనిపోవటంతో ఆయన కుటుంబ భారం ప్రకాశంపైన పడింది.

"అందుచేత నా సంపాదన నాకు ఏమూలా చాలదు. మా అన్న పిల్లల్లో ఆఖరువాడు తప్ప అందరూ చదువుకుంటున్నారు. నేను న్యాయంగా పెళ్ళి చేసు కోనేరాదు. నే చేసుకోబోయే భార్య తరఫునుంచి ఏదైనా ఆర్థిక సహాయం ఉండే పక్షంలోనే పెళ్ళాడతాను." అని ప్రకాశం పెళ్ళిచూపులకు వచ్చినప్పుడు కుండ పగలేసి చెప్పాడు.

అతను వెళ్ళటానికి లేచినప్పుడు శ్వేతాంబరం, "సరే, నాయనా ! నువ్వు వెళ్ళి రెండు మూడు రోజులలో నీ నిర్ణయం తెలియజెయ్యి. ఈ లోపల మేం కూడా ఒక నిర్ణయానికి వస్తాం" అన్నాడు.

"నా నిర్ణయం నేను ముందే చెప్పేశాను గద ! అధమం ఇంకో అయిదేళ్ళ పాటు నేను మా అన్న కుటుంబాన్ని పోషించాలి. అప్పటికి పెద్ద కుర్రాడు కాస్త తన కాళ్ళమీద నిలబడగలుగుతాడు. ఆ తరవాత అంత ఇబ్బంది ఉండదు. కట్నంగా ఇచ్చినాసరే, నెలనెలా రెండువందలకు తక్కువ కాకుండా నాకు సహాయం చెయ్య గలిగినా సరే నేను పెళ్ళికి సిద్ధంగా ఉన్నాను." ప్రకాశం చప్పున నవ్వి "ఇది ఒక బేరంకింద అడుగుతున్నాననుకోండి, నాకు వెనక ఆస్తి ఉంటే నేనడిగేదానికి మూడింతలు అడక్కుండానే ఇచ్చి ఉందురు !—కాని, ఇది నా పరిస్థితి. దాన్ని దాచి లాభంలేదు" అన్నాడు.

"సరే. ఆలోచిద్దాం !" అన్నాడు శ్వేతాంబరం.

గుణమణి ఎంతో ప్రయత్నంమీద తననుతాను నిగ్రహించుకుని ఉండాలి.. ప్రకాశం గడప దాటగానే ఆవిడ అగ్నిపర్వతంలాగా బద్దలయింది.

"ఛీ ఛీ! ఎంత నాగరికతలేని మనిషి! 'నువ్వూ వద్దు. నీతో సంబంధమూ వద్దు' అని చెప్పేయ్యక, ఆలోచిస్తామంటారేమిటి? ఏమిటుంది ఆలోచించటానికి? ఈ సంబంధానికి నేను చచ్చినా ఒప్పుకోను" అన్నదావిడ.

"ఆ మాటే ఒక కార్డుముక్క రాస్తే పోలా? అతని మొహానే అనాలని ఏముందీ? అది మాత్రం ఏం నాగరికతా?" అన్నాడు శ్వేతాంబరం.

"అటువంటి వాళ్ళతో అట్లాగే ప్రవర్తించాలి!"

ఇది ఆవిడ తరచు అనే మాటల్లో ఒకటి. తనకొక నాగరికత ఉన్నట్టు ఆవిడ ఎప్పుడూ ఒప్పుకునేది కాదు. అవతలి వాళ్ళనుబట్టికూడా ప్రవర్తించాలని ఆవిడ సిద్ధాంతం. ఈ సిద్ధాంతాన్ని శ్వేతాంబరం ఏనాడూ అర్థం చేసుకోలేదు. గుణమణి ఆ సిద్ధాంతాన్ని విసర్జించనూలేదు!

"అతన్ని మర్యాదగా పంపినందువల్ల నష్టంలేదులే. అతను కుండ పగలేసి తన సంగతి చెప్పినట్టే మనంకూడా కుండ పగలేసి మన పరిస్థితి అంచనా వేసుకోవటం మంచిదికాదూ?" అన్నాడు శ్వేతాంబరం.

"ఇది పోగొట్టుకుంటే కల్యాణికి ఇంతోటి సంబంధం మరి రాదనేగా మీరనేదీ?" అన్నది గుణమణి తీవ్రంగా.

"నేనా మాట అనటం లేదుగాని ఈ సంబంధం మనం అనుకున్నంత తీసేసేది కాదని నా ఉద్దేశం" అన్నాడు శ్వేతాంబరం చాలా ఓర్పు అభినయిస్తూ.

"ఇంతకన్న చచ్చు సంబంధం మీరు కావాలన్నా తీసుకురాలేరు!" అన్నది గుణమణి, ఛాలెంజి చేస్తున్న దానిలాగా.

"నా కళ్ళకి కుర్రాడు చాలా అందంగా ఉన్నాడు. అతను కాస్త ప్రయత్నిస్తే ఏ సినిమావాళ్ళయినా ఎగరేసుకుపోవచ్చు!"

"ఇంకేం? ఆపనే చేసుకోమనండి! చాతనయితే మీరుకాస్త సహాయం కూడా చేసిపెట్టండి!"

"కాస్త తాపీగా ఆలోచించవలసిన సమయంలో నువ్వు కాస్త వేడెక్కిపోతావు. నే చెప్పేది కాస్త శ్రద్ధగా విను. ఇతని అన్న నెలకి రెండు వేలు చొప్పున సంపాదించేవాట్ట. ఆయనే ఇప్పుడు బతికుంటే ఈ సంబంధం మంచిదని నువు ఒప్పుకునే దానివేనా?"

"బతికిలేడుగా?"

"ఆ మాట నాకు తెలీదూ?" అన్నాడు శ్వేతాంబరం ఓర్పు కాస్తా పోగొట్టుకుంటూ.

"తెలిసి ఎందుకడుగుతారూ? ఇది మంచి సంబంధమని నాచేత అనిపించటమేగా మీ ఉద్దేశం? ఇతనికి ఓ లక్షరూపాయల ఆస్తి ఉంటే మంచి సంబంధమేనా, అని అడగరాదూ? ఉన్న సంబంధం ఉన్నట్టుగా ఆలోచించాలిగాని అయితేలూ, గియితేలూ ఇప్పుడెందుకంట?" అన్నది గుణమణి.

శ్వేతాంబరం అందామనుకున్న మాట అనే అవకాశమే లేకపోయింది. ఆయన హేతుబద్ధంగా మాట్లాడుదా మనుకున్నప్పుడల్లా గుణమణికి మరింత ఆవేశం వస్తుంది. ఈ సంగతి సీత తన చిన్నతనంనుంచీ కళ్ళారా చూస్తున్నది.

"మనం ఇంత ఘర్షణ పడేకన్న అమ్మాయి ఏమంటుందో తెలుసుకోవటం మంచిదికాదూ!" అంటూ శ్వేతాంబరం కల్యాణికేసి చూశాడు.

కల్యాణి ఒక్కసారి తల్లివంక చూసి, "ప్రైవేట్ మాస్టర్ని పెట్టినట్టు నెల జీతం మీద నాకు మొగుణ్ణి పెడతారా? నాకిష్టంలేదు. ఆ మనిషి అంత స్పష్టంగా డబ్బుకోసం పెళ్ళిచేసుకుంటుంటే నేనెట్లా ఇష్టపడతానూ?" అన్నది.

శ్వేతాంబరానికి ఓర్పు కాస్తా పోయినట్టుంది. "నాకు తెలీకడుగుతాను నీ అందం చూసి మురిసి చేసుకునేవాడే అయితే వాడేపాటి అందగాడై ఉంటాడు. ఇంకోరి బండారం ఎంచేముందు మన బండారం కూడా ఎంచుకోవాలిగా" అన్నాడతను.

"అట్లా అయితే దాని ఇష్టం ఎందుకడుగుతారూ? డబ్బుంది గనుక దానికొక మొగుణ్ని కొనిపారెయ్యండి. ఉద్ధరింపు అవుతుంది. అసలు మనకున్న సంస్కారమే అంత! అంతకంటె ఎక్కువ ఉన్నట్టు నటించటం కూడా దేనికి?" అన్నది గుణమణి.

"ఒకవేళ ఆ ప్రకాశం కోరిన షరతులు ఒప్పుకుని పెళ్ళి నిశ్చయించా ననుకో, నేను నా కూతురికి పనికిమాలిన సంబంధం చేశానని నలుగురూ నన్నాడి పోస్తారా!" అని అడిగాడు శ్వేతాంబరం.

"నలుగురూ అనుకునేదానికి, పెళ్ళాం పిల్లలు అనుకునేదానికీ ఏమీ తేడా లేదా?"

"పెళ్ళాం పిల్లలు పైత్యానబడి తెలుపును నలుపంటే దాన్ని శిరసావహించాలి సిందేనా?"

"ఇక వీళ్ళు ఒకరికొకరు ప్రశ్నలుతప్ప వేసుకోలేరు" అనుకున్నది సీత. తన తల్లిదండ్రుల ఘర్షణలో వివిధ దశలు ఆ పిల్లకు కొట్టిన పిండి.

"ఎందుకండీ ఈ డొంకతిరుగుడు మాటలూ! ఈ సంబంధమే సీతకు వస్తే ఇంత ఆత్రంగా ఒప్పేసుకుంటారా?" అని అడిగింది గుణమణి. ఆవిడ అంచనా ప్రకారం ఇది తన భర్తకు మర్మాఘాతం! పడికట్టు రాళ్ళలాగా ఆవిడకు ఇటువంటి ప్రశ్నలు కొన్ని ఉన్నాయి. వాటిని ఆవిడ చాలా "టాక్టికల్"గా ఉపయోగించేది. ఒక్కొక్కసారి అవి ఫలితాలిచ్చేవికూడానూ.

"అయితే గియితేలు నీకు సుతరామూ సరిపడవుగా?" అన్నాడు శ్వేతాంబరం వెటకారంగా.

"నేనడిగినదానికి సమాధానం చెప్పరేం?" అన్నది గుణమణి.

"నాకు నువ్వనుకునే పక్షపాతాలేమీలేవు. సీతకు సమ్మతమైతే నేనభ్యంతరం చెప్పను" అన్నాడు శ్వేతాంబరం.

"దానికి ఇష్టంలేదంటే శాపనార్థాలు పెట్టరుగా?" అన్నది గుణమణి.

శ్వేతాంబరం ఉక్కిరిబిక్కిరి అయ్యాడు. తనకీ సంబంధం ఇష్టంలేదని కల్యాణి అనగానే చర్చ ముగించి ఉంటే ఆయనకింత విపత్తు రాకపోదు!

తలవని తలంపుగా సీత ఆయనకు సహాయం వచ్చింది.

"నేనైతే ఈ సంబంధానికి ఒప్పుకుంటానమ్మా!" అన్నది సీత.

గుణమణి ఏదో అనటానికి నోరు తెరిచింది. కాని ఏమీ అనలేదు.

"అక్కకి మరొక సంబంధం చూచి పెళ్ళి చేసేదాక ఇతను ఉండేట్టయితే నేను తప్పక చేసుకుంటాను. తనకు అన్న చదువు చెప్పించినందుకు కృతజ్ఞత కల వాడు బొత్తిగా మొరటుమనిషి అయియుండడు. మనకన్న నయమే అనుకుంటాను. అయినవాళ్ళమీద ఆపేక్ష చూపేవాళ్ళను గురించి మనం — మనం వేళా కోళంగా మాట్లాడుకోవటం నాకేం బాగాలేదు." అంటూ సీత కూర్చున్న చోటినుంచి లేచి అవతలికి వెళ్ళిపోయింది. మిగిలిన ముగ్గురూ ఆ పిల్లకేసి నోళ్ళు తెరుచుకు చూస్తూ ఉండిపోయారు.

ప్రచురణ : కొడవటిగంటి కుటుంబరావు కథలు, కథల సంపుటిలో.
జయా పబ్లికేషన్ : విజయవాడ.

# చురుకైన అబ్బాయి

నాకేసి జాలిగానూ, చీదరింపుతోనూ చూశాడు;

"మీ ముసలాళ్ళు మీకే అన్నీ తెలుసుననుకుంటారు. నిజం చూస్తే మీకన్నా మాకే ఎక్కువ తెలుసు", అన్నాడు చురుకైన కుర్రాడు.

"ఎందువల్లను?" అన్నాను.

"మీరు పెద్దవాళ్ళూ మేం చిన్నవాళ్ళమూ గనక."

"మేమూ ఒకప్పుడు చిన్నవాళ్ళమేగా ?" అన్నాను.

"అప్పుడు మీకు మీ ముసలాళ్ళకన్న ఎక్కువ తెలుసేమో ?"

"ఆ యేటి కాయేడు మీదపడ్డ కొద్దీ తెలిసింది కాస్త హరించి పోయిందా ఏమిటి ?"

"తెలీటానికి అనుభవంతో ఏమి సంబంధం లేదు. పెద్దయిన కొద్దీ మీరు దొంగవాళ్ళుగా తయారై మా కుర్రవాళ్ళని మోసం చెయ్యటానికి ప్రయత్నిస్తారు. ఏ పాతికేళ్ళో రాగానే మీరు చచ్చిపోతే ప్రపంచం ఎంత బాగవుతుంది."

చురుకైన కుర్రాడి అంచనా ప్రకారం నేను చచ్చిపోయ్యే అర్హత సంపాదించి ఓ పుష్కరం అయ్యింది. "పాతికేళ్ళు నిండితే నువ్వేం చేస్తావు ?" అన్నాను.

కుర్రాడి మొహం చూస్తే అడగరాని ప్రశ్న అడిగినట్లు తోచింది.

"ముసలాణ్ని కాకుండా ఉండటానికి ప్రయత్నిస్తాను. చాతకాక పోతే చచ్చిపోతాను."

కుర్రాడికి ధైర్యసాహసాలకి లోటు లేనట్లు కనిపించింది. నాకంటే నయమే. నాకింకా చావాలని లేదు.

విషయం మార్చాను.

"నీకన్ని విషయాలు తెలుసునా ?" అన్నాను.

"ఓ !" అన్నాడు కుర్రాడు.

నిట్టూర్చి "ఎంత అదృష్టం ! ఎప్పుడు నేర్చుకున్నావు ?" అన్నాను.

కుర్రాడు మరింత అసహ్యంగా నాకేసి చూసి, "మీ ముసలాళ్ళ కెంత చెప్పినా తలకెక్కదు. ఈ విషయాలు నేర్చుకుంటే రావు. అవి తెలియవలసిందే" అన్నాడు.

"ఎట్లా తెలుస్తాయి?" అన్నాను.

"తలకాయ ఉంటే సరి," అన్నాడు కుర్రాడు.

"తలకాయ ఉన్నంతమాత్రానికే అన్వేషించకుండా, పరిశోధించకుండా నిజం తెలుస్తుందా ?" అన్నాను.

కుర్రాడు వింతగా, "నిజమేమిటి ?" అని అడిగాడు.

నిజమంటే ఏమిటో చెప్పటానికి కూడా నాకు తెలివితేటలు లేవనేది బయట పడింది.

నేను తడవుకుంటూ "ప్రత్యక్షానుభవం వెనక ఉండే సత్యం !" అన్నాను.

"అటువంటిదేమీ లేదు." అన్నాడు కుర్రాడు.

"మరి సిద్ధాంతాలెట్లా చేస్తాం ? అన్నాను.

"ఏం సిద్ధాంతాలు ?" అన్నాడు తిరస్కారంగా.

"సిద్ధాంతాలకేం బోలెడన్ని ఉన్నై. భూమి గుండ్రంగా నారింజపండు లాగుందని ఒక సిద్ధాంతం. భూమీ, ఇతర గ్రహాలు సూర్యుడిచుట్టూ తిరుగుతున్నా యని మరో సిద్ధాంతం. శాస్త్రజ్ఞులు కూడా అనేక సిద్ధాంతాలు చేశారు. ఎంతో పరి శోధన చేసి, ఎంతమంది జుట్టో నెరిస్తేగాని ఈ సత్యాలు బయటపడలేదు."

"హాట్టిది ! అన్నీ అబద్ధాలు ! పచ్చి వంచన ! శాస్త్రజ్ఞులయేది, రాజకీయజ్ఞు లయేది, ఎవరికిష్టమైన విషయాలు వాళ్ళు నమ్ముతారు. ఎవరి అభిరుచి వారిదీ! భూమి గుండ్రంగా లేదని నాకు తెలుసు. సూర్యుడే భూమి చుట్టూ తిరుగుతున్నాడు. నా యిష్టం నాది !"

"శాస్త్రజ్ఞులు చేసిన కృషి యావత్తూ వృధాయే ?"

"శుష్కదండగ"

మళ్ళ నాకు గోడ అడ్డయింది. ప్రక్కకు తిరిగాను.

"పోనీ, నువ్వు చెప్పినట్టే అనుకుందాం. ఎవరి ఇష్టవొచ్చినట్టు వాళ్ళనుకునే పక్షంలో, అభిప్రాయభేదం వస్తే ఎవరి అభిప్రాయం సరి అయినట్టు ? ఎవరిది తప్పయినట్టు ?

"ఎవరి అభిప్రాయం వాళ్ళకు రైటు ?"

"మా ముసలాళ్ళ తెలివి తక్కువ వాళ్ళన్నావే ? మా అభిప్రాయాలు మీకు రైటేగా ?"

"కావలిస్తే అట్లాగే అనుకోవచ్చు. మీ అభిప్రాయాలు తప్పని మా కుర్రాళ్ళకి తెలుసుగా ?"

"నేననుకునే దానికన్న నువ్వనుకునేది ఎక్కువ నిజమని నీ అభిప్రాయం అవునా, కాదా ?"

"అవును," అన్నాడు కుర్రాడు.

"అయితే నిజమంటే ఏమిటి ?" కుర్రాడు చిక్కాడనుకున్నాను.

"నేననుకునేది !" అన్నాడు కుర్రాడు.

"నేననుకునేదే నిజమని నేనూ అంటాను. ఇన్ని రకాల నిజానికి ప్రపంచంలో స్థానం వుందా ?"

"లేనప్పుడు, మాతో ఏకీభవించని వాళ్ళని చంపేసి మా నిజమే చలామణిలో ఉంచుతాం." అదీ సబబుగానే ఉంది.

"మా ముసలాళ్ళతో అభిప్రాయ భేదం వస్తే మమ్మల్ని చంపేస్తావు బాగానే వుంది! నీసాటి కుర్రాళ్ళతోనే అభిప్రాయ భేదం వస్తే?"

"వాళ్ళనీ పాతేస్తాం. మీ ముసలాళ్ళ మాటలు విని చెడిపొయ్యే కుర్రాళ్ళందరనా?"

"నీమాట వింటే బాగుపడేటట్టూ, నీమాట వినకపోతే చెడిపోయినట్టూనా?"

"నా దృష్టిలో అంతేగా?"

"ఇంతమందిని చంపెయ్యాలంటే నీకు కొంతమంది మద్దతు అయినా వుండాలి కదా, మీ సమాజానికి నాయకుడెవరు? ఇంతమందిలో ఎవరి అభిప్రాయాలు ఆమోదించాలో నీకెట్లా తెలుస్తుంది?" అన్నాను.

"చాదస్తంగా మాట్లాడకు, నేనే నాయకుణ్ని. నాతో ఏకీభవించే వాళ్ళందరూ నాతో వచ్చేస్తారు."

"వాళ్ళెక్కువమంది లేకపోతే?"

"ఎందుకుండరు? మొదట్లో ఓ పాతిక మందిమి వున్నప్పటికీ ఒక్కొక్కరిని పూడలగొట్టి మాలో కలుపుకుంటాం. ఈ విధంగా ఎన్ని లక్షలమందిమైనా అవుతాం. అప్పుడు మా విశ్వాసాలకెవరూ ఎదురు చెప్పలేరు. చెప్పిన వాళ్ళని చంపేస్తాం."

"నువ్వంత బలవంతుడివయే లోపల మిగతా వాళ్ళు నీ అభిప్రాయాలు ప్రచారం చెయ్యకుండా అడ్డుపడితే?"

"ఏమిటి? నా అభిప్రాయాలు నేను ప్రచారం చేసుకునే హక్కుకూడా నాకివ్వరా?"

"నీకు డెమోక్రసీలో ఎంత విశ్వాసం వుందీ!" అన్నాను.

"కొంత వరకు డెమోక్రసీ మంచిదే. కొంతవరకు ఏదైనా మంచిదే!"

చురుకైన అబ్బాయి చెప్పిన అభిప్రాయాలన్నీ ఒక దండ గుచ్చాయి.

"అయితే నీ రకం నిజం అమల్లోకి రావాలంటే ముందు ముసలాళ్ళంతా ఆత్మహత్య చేసుకోవాలన్నమాట. ఆ తరవాత స్వేచ్ఛగా లాఠీలతో నీ విశ్వాసాలను నువ్వు ప్రచారం చేసుకుంటే, నీ బలం తన బలం కంటే హెచ్చిపొయ్యే వరకూ ప్రపంచం చూస్తూ ఊరుకోవాలన్నమాట. ఇట్లా లాఠీ ప్రయోగంతో సాధించిన ఐకమత్యంతో నీ మతం వారంతా కలిసి, మీతో ఏకీభవించని వారందరిని హత్య చేసేసి, నిజం స్థాపించేస్తారన్నమాట. అన్వేషణలూ, పరిశోధనలూ, తర్కమూ, అనుభవమూ, సిద్ధాంతాలూ వాటి సంస్కరణా ఏమీ అవసరం లేదన్న మాట! తెలివితేటలూ, నిజం తెలుసుకునే శక్తి నీ ప్రపంచంలో పుట్టుకతోనే వచ్చేస్తాయన్నమాట."

"ఈ ప్రపంచానికంతకీ అధినాయకుడివి నువ్వన్నమాట! నీతో ఏకీభవించలేని వారంతా ముసలితనం వచ్చిందని గుర్తించి ఆత్మహత్యలు చేసుకోవాలన్నమాట?" అన్నాను.

"అందులో తప్పేముంది? అందరూ నే చేసే ప్రయత్నమే చేస్తున్నారు. అయితే వాళ్ళకి సరి అయిన అభిప్రాయాలు లేక, పద్ధతులు లేక ఓడిపోతున్నారు. నేను జయిస్తాను. ప్రపంచమంతా నా పాదాల కింద పెట్టి తొక్కేస్తాను." అన్నాడు.

నాకేదో ఆవేశం వచ్చినట్టయింది. ఆ ప్రయత్నంగా వాడి పీక పట్టుకొని, "వెధవా! నిన్నిప్పుడు పీక నులిమేస్తే ఏం చేస్తావు? నీ రాక్షసత్వమంతా బయట పెట్టుకోడానికిప్పుడే సాహసించటం నీ పొరపాటు? కొంతకాలం ఆగవలసింది!" అని వాడి పీక నొక్కెయ్యసాగాను.

"నన్ను చంపుతావుట్రా, ముసలి పీనుగా! నీ చేతులు పడిపోనూ! చిన్న పిల్ల వాణ్ణి చేసి నీ పిశాచబలం నా మీద చూపిస్తావుట్రా?" అని కుర్రాడు అరవసాగాడు. నలుగురూ చేరారు. కుర్రాణ్ణి విడిపించారు. "నీకేం పొయ్యేకాలం? లేత వెధవని పట్టి గొంతు పిసుకుతావా? నీకు పిల్లల్లేరా?" అని అడిగారు.

కుర్రాడు నాకేసి గర్వంగా చూసి మెడ తడువుకుంటూ "చూసుకో, నా తడాఖా! ప్రపంచమంతా నా పక్షం ఉంది. ఇందాకట్నుంచి ప్రపంచం తరఫున వకాల్తా తీసుకొని మహా పేలావు. ఇప్పుడు పేలు!" అంటూ ఠీవిగా నడిచి వెళ్ళి పోయాడు. చుట్టూ పోగయిన వాళ్ళలో నాకేసి చూసినవాళ్ళు లేరు. అందరూ వాడు వెళ్ళిన దిక్కే చూస్తున్నారు. అందరి మొహాల మీద ఆప్యాయంగా చిరునవ్వు తాండవిస్తుంది.

"కుర్రాడెవరోగాని ఎంత ముద్దొస్తున్నాడు!" అన్నదో ముసలి తొక్కు.

"చాలా చురుకైన కుర్రాడు. ముందు ముందు పైకొస్తాడు!" అన్నాడు పళ్ళు లేని ముసలాయన. పాముపిల్ల ప్రాణంతో తప్పించుకుపోయింది. అయితే ఏం? నేను ఇంకా జీవించే ఉన్నాను. నాదీ మొండి ప్రాణమే. ఇంతట్లో చావను! ఈ పాము నాకందేసరికి బాగా కోరలు పెరిగి బుసకొడుతూ ఉంటుంది. నేను మంచి దుడ్డు కర్ర వెతుక్కోవాలి. చేతులతో పని కాదు.

ముద్రణ : ఆంధ్రజ్యోతి మాసపత్రిక,

1 మే, 1946.

# శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః అయ్యా ! ఇవాళ...తిథి వార నక్షత్రాలూ, త్యాజ్యము ఏకరువు పెట్టాడు భైరవ శాస్త్రుల్లు.

"శాస్త్రుల్లుగారికి ఉపాదానం వెయ్యండర్రా," అని కేకపెట్టాడు మాధవరావు గారు.

"అయితే చూడండి, బాబూ. తమ తండ్రిగారి తిథి ఎల్లుండే, గుర్తుంది కామోసు ?" అన్నాడు శాస్త్రుల్లు ప్లీడరుగారితో.

"అవునండీ. మీ అబ్బాయిగారు ఊళ్ళో ఉన్నారా"

"ఎల్లుండికి ఉంటాడులెండి. వాడూ నేనూ తప్పక వస్తాం. వేరే ఎక్కడా చెప్పకండి."

సరేనన్నాడు మాధవరావుగాడు. ఆయన భార్య దోసెడు బియ్యం తెచ్చి శాస్త్రుల్లుగారి చెంబులో వేసింది.

శాస్త్రుల్లు వెంటనే నిష్క్రమించక, "అయితే చూడండి బాబూ ? ఈ యేడు సూ రెండోవాణ్ణి బళ్ళో వేద్దామనుకుంటున్నాను. నలుగురూ తలాయింత సహాయం చేస్తున్నారు. తమరు కూడా—" అని అడిగాడు.

"అట్లాగే చూద్దాంలెండి. కుర్రవాడి చదువెంత భాగ్యం ?... అవునుగాని ఆచారం తప్పిస్తున్నారేం ?" అన్నాడు మాధవరావుగారు నవ్వుతూ.

"ఇంగ్లీషు చదువు చెప్పిస్తున్నా వేమంటున్నారా? చూడండి, బాబూ, నేను వేదం చదువుకున్నాను. ఏం బావుకున్నానూ? అక్షయపాత్ర తప్పలేదు. మా పెద్దవాడికి శాస్త్రం చెప్పించాను. 'అబ్బో, తర్క-వ్యాకరణాల్లో నీ కొడుకంతటివాడు లే'డన్నారు. ఏం లాభించిందీ ? సంభావనలకూ, సన్మానాలకూ తెగ తిరిగి ఆరోగ్యం పాడుచేసుకున్నాడు. హైదరాబాదులో ఏమిటో కొల్లబోతున్నదని అక్కడి కెళ్ళాడు. అక్కడ ఎంత అవమానం జరగాలో అంతా జరిగింది. ఆ తురక సామ్రాజ్యంలో తద్దినం, మంత్రాలూ, సంధ్యావందనం ముక్కలు కూడా రాని తాగుబోతు వెధవలు పెద్ద వాళ్ళయి కూర్చున్నారు. మనవాళ్ళే. ఇక్కణ్నుంచి వెళ్ళినవాళ్ళే. అయితే ఏం? యాచకో యాచకశ్శత్రుః ! మా వాడికి వొక పోగుపడ్డ వెధవలతోపాటు సంభావన లిప్పించారుట. జబ్బుపడి చక్కా వచ్చాడు."

"మన తెలుగువాళ్ళ జన్మే అంతలెండి. ఎంత మానవ స్వభావమైనా ఎక్కువ స్థితిలో ఉన్నవాణ్ణి చూసి ఓరవలేక పోవటంలో అర్థం ఉందిగాని, మనవాడు వెయ్యి

రూపాయలు సంపాయించుకుంటున్నా, పదిరూపాయలు తెచ్చుకునేవాణ్ణిచూసి కళ్ళల్లో నిప్పులు పోసుకుంటాడు. అలా చూస్తే తెలుగు జాతంతా అడుక్కుతినే జాతే."

"బాగా సెలవిచ్చారు!—ఇక ఈ యాయవారం చాలొచ్చింది. మా రెండో వెధవకైనా ఇంత ఇంగ్లీషు చదువు చెప్పించి గౌరవంగా బతికే సదుపాయం చేద్దామని చూస్తున్నాను."

"నన్నడిగితే మంచిపని చేస్తున్నారంటాను. మావాణ్ణి కూడా ఈ యేడే స్కూల్లో ప్రవేశపెడుతున్నాను. మా వాడికి చదువు రాదేమో ననిపిస్తుందండీ! ఆ వెధవకు గట్టిగా రెండో యెక్కంరాదు. వాడికి లెఖ్ఖలు బొత్తిగా రావు. ఇంగ్లీషు కూడా అంతంత మాత్రమే. తెలుగేదో కాస్త ఏడుస్తాడు అందుకని మా బావమరిదిని-వీడే మా రెండో బావమరిది ఇక్కడే వుండి పిల్లవాడికి కాస్త చదువు చెప్పరా అన్నాను. మా గోపాలం ఇంటరు చదివి ట్రెయినింగ్ కూడా అయినాడు. స్కూళ్ళో మాష్టరు పని దొరుకుతుందేమోనని చూస్తున్నాడు. స్కూలు కమిటీ చూడబోతే నానా అయోమయంగానూ ఉంది. అక్కడ పార్టీలూ! నియోగులూ వైదీకులూనూ! కొట్టుకు చస్తున్నారు. మా వాడికి ఉద్యోగం ఇవ్వటానికి ప్రయత్నిస్తామన్న వాళ్ళంతా మైనారిటీవాళ్ళు. మెజారిటీతో ఇద్దరు ముగ్గురైనా మావాడి కోసం పాటుపడితే తప్ప ఉద్యోగం అయ్యేటట్టులేదు. ప్రస్తుతం మీ వైదీకులదే అక్కడ రాజ్యంగా ఉంది—నే నన్నానని కోపంవద్దు" అన్నారు మాధవరావుగారు.

"ఉన్నమాటకు తప్పేమిటి, బాబూ...అయితే, చూడండీ! తమ పేరేమి టన్నారూ? గోపాలంగారా! మీరు పంతులుగారి పిల్లవాడికి చదువు చెప్పేటప్పుడు కాస్త మావాణ్ని కూడా దగ్గిర ఉండనివ్వండీ? మావాడి కోసరం తమరేమీ శ్రమ పడనక్కరలేదు, చదువులో మావాడేమంత ఛరవాలేదు. అదీగాక పక్కన ఇంకో కుర్రాడుంటే పంతులుగారి పిల్లవాడి క్కూడా కొంచెం ఉత్సాహంగా ఉంటుంది. ఏమంటారు!"

"దానికేం భాగ్యంలెండి. అట్టాగే పంపించండి" అన్నాడు గోపాలం.

తనపని ఐపోగానే భైరవశాస్తుల్లు శెలవు పుచ్చుకుని వెళ్ళిపోయాడు.

"ఉద్దండుడల్లే వున్నాడే! చీపురుపుల్లకూడా ఊరికే దొరికితే పోనిచ్చేట్టు కనిపించదు. దరిద్రం మనుషులచేత అటువంటి పనులు చేయిస్తుందనుకుంటా" అన్నాడు గోపాలం. అతనూ దరిద్రంలో ఉన్నవాడే.

"దరిద్రం ఏమిటి నీ మొహం! ఆయనకు కనీసం పదిహేనెకరాల పొలం వుంది. ముప్పై ఏళ్ళనుంచీ జోలె పట్టుకుతిరుగుతున్నాడు. నే నింతప్పట్నుంచీ ఎరుగుదును. అప్పటికీ ఇప్పటికీ ఆయన అలవాట్లు మారలేదు. ఆ నీరు కావి గుడ్డే కడతాడు. ఆ అంగ వస్త్రమే పైనవేస్తాడు. ఆ పూరి గుడిసెలోనే వుంటున్నాడు. ఈ ఊళ్ళో కనీసం వంద ఇళ్ళల్లో ఆయనే తద్దినాలు పెట్టిస్తాడు. పెళ్ళిళ్ళు వడుగులూ చేయిస్తాడు. అపరక్రియలు కూడా తనే చేయిస్తాడు. రోజుకైదారు మానికలు

బియ్యం సంపాయిస్తాడు. దొడ్లో ఒక కరేపరెబ్బ దగ్గర్నుంచీ గుమ్మడికాయ వరకూ ఏది కనిపించినా దేహీ అని చెయ్యిచాస్తాడు. నెలకు రెండురోజులన్నా ఇంట్లో వంట చేయిస్తాడో లేదో. అన్ని ఇళ్ళల్లోనూ ముత్తయిదువు పెట్టుకుంటే ఆయన పెళ్ళాం వుంది. ఎవరింటోనన్నా పెళ్ళి అయితే అయిదురోజులూ వడ్డనలూ అవీ చేస్తుంది. యాభై యేళ్ళున్నయ్యా. ఇప్పటికి మనిద్దరం తినలేని తిండి తిని హరాయించు కుంటాడు. నల్లగా చావదేలి ఎట్లా ఉన్నాడో చూడు ఉక్కుముక్క!"

"ఓరీ పిడుగా!.... వీడి కొడుక్కా నేను ఊరికే పాఠాలు చెప్పేదీ? కావలిస్తే నా ఆస్తిని అయిదుసార్లు కొనేస్తాడుకదా!" అన్నాడు గోపాలం. భైరవశాస్త్రుల్లు వంటి మనుషులుంటారని అతను కల్లోకూడా ఎరగడు.

## 2

భైరవ శాస్త్రుల్లు కొడుకు చదువుకుగాను లోకులదగ్గిర పాతిక రూపాయలు పోగుచేశాడు. అవి సత్యనారాయణ ఏడాది చదువుకుగాను జీతానికి పుస్తకాలకు రెండు జతల బట్టలకు కూడా సరిపోతై. ఇంకా అయిదో ఆరో మిగులుతై కూడానూ.

సత్యనారాయణనూ, మాధవరావు గారబ్బాయి రంగారావునూ బళ్ళో వేసిన రెండుమూడు రోజుల్లోపల మాధవరావుగారి బావమరిది గోపాలానికి తలవని తలం పుగా ఉద్యోగం అయింది. అవుతుందని మాధవరావుగాని, గోపాలరావుగాని కల్లో కూడా అనుకోలేదు. మాధవరావు ఈ విషయం స్కూలు ప్రెసిడెంటుతోనూ సెక్ర టరీతోనూ ప్రస్తావించినప్పుడిద్దరూ కూడా అసహ్యంగా మాట్లాడారు.

ఈ రహస్యం సత్యనారాయణ ద్వారా రంగారావుకి తెలిసి, రంగారావు ద్వారా పెద్దవాళ్ళకు తెలిసింది. సత్యనారాయణ రోజూ మాధవరావుగారింటికి వచ్చి ఒక గంటసేపు రంగారావు పక్కనే కూచుని గోపాలం చెప్పే పాఠాలు వింటూండేవాడు. గోపాలానికి ఉద్యోగం ఇప్పించింది భైరవ శాస్త్రుల్లేనని సత్యనారాయణ రంగా రావుతో రహస్యంగా అన్నాడు.

మొదట మాధవరావు ఈ మాట నమ్మలేకపోయినాడు. కాని ఆలోచించిన కొద్దీ నిజమై వుండాలనిపించింది. ఏమో ఉద్దండ ముండాకొడుకు! ఆ ప్రెసిడెంటు దగ్గరికీ, సెక్రటరీ దగ్గరికీ వెళ్ళి కాస్త గట్టిగా చెప్పాడేమో!

మర్నాడు ఉపాదానానికి వచ్చినప్పుడు మాధవరావుగారు భైరవశాస్త్రుల్లుతో "విన్నారా! మా గోపాలానికి స్కూల్లో వుద్యోగం దొరికింది" అన్నాడు.

"చాలా సంతోషం! ఎందుకు దొరకదండీ? మావాడు కూడా చెప్పాడు పాఠాలెంతో విశదంగా చెబుతారుట. వారి ధర్మమా అంటూ మా వాడికింత చదు వచ్చితే!" అన్నాడు శాస్త్రుల్లు.

"శ్రీకృష్ణార్పణం"గా ఇన్ని బియ్యం చెంబులో పోయించుకొని నిండిన చెంబులో బియ్యం జోలెలోకి మార్చుకుని శాస్త్రుల్లు వెళ్ళిపోయినాడు.

"దొంగముండాకొడుకు, అంతుచిక్కలా!" అన్నాడు గోపాలం. "ఈ పుణ్యం ఈ బ్రాహ్మడు కట్టుకున్నదే. సందేహం లేదు. ఎటువంటివాళ్ళకు ఏ విధంగా ఋణ పడతామో చెప్పలేం కద!"

గోపాలం కృతజ్ఞతతో కూడిన హృదయం గలవాడు. పైకి చూపడం అలవాటు లేకపోయినా అతను తన కితరులు చేసే చిన్న చిన్న ఉపకారాలు మరిచి పొయ్యేవాడుకాడు. ఇతరులకు చిన్న చిన్న వుపకారాలు చేసే అవకాశం దొరికితే పోనిచ్చేవాడుకాదు. ఇటువంటివాళ్ళు ప్రపంచాన్ని ప్రేమించటానికి ప్రయత్నించి పరాభవం పొందుతుంటారు. ప్రపంచం మంచివాళ్ళ చేతుల్లో వుంటే గోపాలం వంటి వాళ్ళు ఉపకారం తక్కువ పొందటమూ పరాభవం ఎక్కువ పొందటమూ తరుచు జరగదు. తనకు పరాభవం జాస్తిగా జరగబట్టే గోపాలం వుపకారం చేసేవాళ్ళని మరింతగా జ్ఞాపకం పెట్టుకునేవాడు.

ఉద్యోగం దొరికిందన్న మాటేగాని స్కూలులో తనను హెడ్మాస్టరూ, పెద్ద మాష్టర్లుగా వున్న ఇతర వైదీకి మాష్టర్లూ చిన్నచూపు చూస్తారనీ, తన లోపాలన్నీ చిట్టావేసి కమిటీవారి కంపజేస్తూ వుంటారనీ, తనమీద వేగు ఉంటుందని గోపాలానికి తెలుసు. బళ్ళో మాస్టర్లంతా చెడ్డవాళ్ళు కారనీ గోపాలానికి తెలుసు. అందులో మంచివాళ్ళున్నారు. కాని వాళ్ళు అరణ్య మృగాలల్లే స్వార్థం చూసుకోవటంలో మునిగి వున్నారు. తనకు పైవాళ్ళ వల్ల అన్యాయం జరుగుతుంటే, అన్యాయమని నమ్మినా, వాళ్ళు దాన్ని గురించి ఏమీ చెయ్యరు. తమ కన్యాయం జరుగుతుంటే ఇతరులు సహాయం చెయ్యకపోయినా చెయ్యలేదనుకోరు. వీళ్ళు దాస్యంలో వుండ టమేగాక దాస్యం ఆమోదించారు కూడాను. ఆ మాటకొస్తే గోపాలం కూడా దాస్యం ఆమోదించినవాడే మరి...

సత్యనారాయణ, పాపం రంగారావుతోపాటు కూర్చునేవాడేగాని గోపాలాన్ని ఒక్క ప్రశ్న అడిగేవాడు కాడు. నోరు తెరిచేవాడుకాడు. ఈ రెండు మూడు రోజు ల్నుంచీ జరిగిన పాఠాలేమీ లేకపోయినా సత్యనారాయణతో మాట్లాడనన్నా మాట్లాడ నందుకు గోపాలానికిప్పుడు పశ్చాత్తాపం కలిగింది. ఇప్పుడు సత్యనారాయణకు రంగారావుతోపాటు సమానమైన శ్రద్ధను చూపసాగాడు. సత్యం చాలా చురుకైన కుర్రవాడనీ, ఎంతో మంచి మార్కులు తెచ్చుకోవటం కోసం భైరవశాస్త్రుల్లు తన కొడుకును పంపిస్తున్నాడనీ గోపాలానికర్థమైంది. తన చేతితో వున్నంతవరకూ సత్యాన్ని పైకి తెద్దామనీ; బాగా కనిపెట్టి వుందామనీ అనుకున్నాడు.

కాని గోపాలం ఆశయం నెరవేరే యోగ్యత లేకపోయింది. ప్రైవేటు ట్యూషన్లు చెప్పరాదనీ, డబ్బు తీసుకున్నా తీసుకోకపోయినా ప్రైవేటు ట్యూషనుకు స్కూలు నిబంధనలు వొప్పుకోవనీ గోపాలానికి హెడ్మాస్టరుగారు తెలియజేశారు.

రంగారావుకు గోపాలం సహాయం చెయ్యకుండా అడ్డుపడటం బ్రహ్మవశం కాదు. గోపాలం వాళ్ళింటోనే వుంటున్నాడు కాని, సత్యంమటుకు తన స్వగృహంలోనే చదువుకోవలసి వచ్చింది.

# 3

గోపాలం ఉద్యోగం ఏప్రిల్ నెలతో అయిపోయింది. అతని ఉద్యోగం అక్కడతో అంతంచేసి రెండు నెలలజీతం - తొంభై రూపాయలు - అదా చేశారు స్కూలు కమిటీవాళ్ళు. ఆ ఉద్యోగం అయిపోయినందుకు అతనికి విచారం కలగ లేదు. స్కూలు కక్షల మూలంగా అతను చాలా అవమానాలు భరించాడు. ఎంతో ఓర్పుగలవాడైనప్పటికీ అతనికి ఎప్పుడో నౌకరీమీద విసుగెత్తింది. స్కూలు మటుకు మంచి ఉపాధ్యాయుణ్ణి కోల్పోయింది. స్కూలందు విషయమై విచారపడలేదు.

స్కూలు కమిటీవాళ్ళ నిరంకుశ ప్రవర్తన ద్వారా గోపాలం చాలా డబ్బు కోల్పోయినాడు. కనీసం పదిహేను మంది స్కూలు విద్యార్థులు అతని దగ్గిర ట్యూషను చెప్పుకోవటానికి తయారయినారు. కొత్త మేస్టరనే నెపంమీద కమిటీవార తన్ని ట్యూషనులు చెప్పుకోనివ్వలేదు.

స్కూలులో అనేకమంది ఉపాధ్యాయులు ట్యూషనులు చెప్పుకుంటున్నారు. దత్తాత్రేయులింటోనూ, రామ్మూర్తి ఇంటోనూ, శివరామయ్య ఇంటోనూ, గణపతి ఇంటోనూ, పాతికమందీ, ముప్పైమందీ విద్యార్థులు ట్యూషన్లు చెప్పుకుని అక్కడే పడుకునేవాళ్ళు. పరీక్షలు దగ్గిరకొస్తున్న కొద్దీ ఈ విద్యార్థుల సంఖ్య దాదాపు రెండింతలకు పెరిగింది. కొంతమంది క్లాసుకు క్లాసు ఇంటిదగ్గిర చేర్చుకునేవాళ్ళు.

ఈ విద్యార్థులకు క్లాసులో రానిపాఠాలు ఇంటిదగ్గిర ఎట్లా వస్తాయి? ఏ ఆశతో ఈ విద్యార్థుల తల్లిదండ్రులు నెలకు అయిదేసి రూపాయలిచ్చి ట్యూషన్లు చెప్పిస్తున్నారు ?

ట్యూషన్లు చెప్పించుకునే విద్యార్థులకు క్లాసులో ఎక్కువ మార్కులు రావటం రివాజు. క్లాసుపరీక్షల్లో వీళ్ళెప్పుడూ తప్పరు. అయితే ఆఖరు పరీక్ష మాటేమిటి? అదీ ఉపాధ్యాయుల చేతుల్లో వున్నదే. ఎల్లయ్య క్లాసు పేపరు పుల్లయ్య చేతిలో వుంటుంది. పుల్లయ్య క్లాసు పేపరు మల్లయ్య చేతిలో వుంటుంది. అంతా బీరకాయ పీచే. నీ పేపరు నాకు చూపించు. నా పేపరు నీకు చూపిస్తా! అంతా పొట్టకోసం దేవులాడుతున్న వాళ్ళే.

ఫలితమేమంటే స్కూలు ఫైనలు వరకూ దేదీప్యమానంగా వెలిగినవాడు గవర్నమెంటు పరీక్షలో గొట్టుపడ్డట్టు పడటం జరిగేది. ఇంత డబ్బూ బుగ్గిలో పూసిన పన్నీరయిందని అప్పటికి తెలిసి వచ్చేది పిల్లల తండ్రులకు! యాభై రూపాయల జీతంగల మాస్టరు, పైన నూటయాభై సంపాదించటం విడ్డూరంగా వుండేదికాదు

స్కూలు కమిటీ కట్టుదిట్టాలతో కూడుకొని వుంటే మేస్టర్లింత తెంచుకుపడటాని. కవకాశం వుండకపోను. కాని ఈ స్కూళ్ళల్లో కుళ్ళంతా కమిటీలోనే ఉంది. ఉపాధ్యాయుల పై సంపాదనలో భాగం తీసుకుని సెక్రటరీగారే చాలా వేలు సంపాదించాడని ప్రతీతి ఉండేది. నిజం కూడా కావచ్చు.

స్కూలు విద్యార్థులలో మటుకు గోపాలం చాలా గట్టి మేస్టరనే ప్రతీతి పడిపోయింది. చదువంటే ఇష్టం వున్నవాళ్ళూ లేనివాళ్ళూ— అందరూ ఏకగ్రీవంగా గోపాలమంటే గౌరవంగా వుండేవాళ్ళు. శెలవల్లో నలుగురు విద్యార్థులు రెండోఫారం. కింది తరగతులవాళ్ళు అతని దగ్గిరికి ప్రైవేటుకొచ్చి నెలకు పదీ పదహేనూ, ఇరవై కూడా ఇచ్చి శెలవలాఖర్న వేరే ఊళ్ళలో పై తరగతుల్లో ప్రవేశించటానికి ఆశపడ్డారు. వీళ్ళంతా పాసవుతామనే ఆశ ఏమీ లేని బాపతు. అయినా గోపాలం ఈ ట్యూషన్లు ఒప్పుకున్నాడు. సత్యానిక్కూడా శెలవుల్లో వచ్చి తన దగ్గిర చదువుకోమన్నాడు కేవలమూ ప్రైవేటు ట్యూషన్లు చెప్పి బతకవచ్చుననే ఆశ పుట్టింది గోపాలానికి.

ఈ విధంగా గోపాలం ఒక సంవత్సరం గడిపాడు. మరుసటి సంవత్సరానికి పరిస్థితులు తారుమారై స్కూలు కమిటీలో నియోగుల సంఖ్య హెచ్చి వారికి పెత్తనం లభించింది. ఒకసారిగా పదిమంది నియోగి మెంబర్లు వచ్చి స్కూలు కమిటీలో చేరారు. స్కూలు ఆర్థిక పరిస్థితులు బాగుండని కారణంచేతా, స్కూలు నిర్వహణం గురించి వూళ్ళో అలజడి జాస్తి కావడంవల్లా ఈ మార్పు తాత్కాలికంగా మంచిదే అయింది.

ఇతర విషయాలెట్లావున్నా గోపాలం తిరిగి ఉద్యోగం సంపాదించాడు. మరుసటి సంవత్సరం అది ఖాయం కూడా అయిపోయింది.

గోపాలం సత్యానికి శాశ్వతమైన మేస్టరై పోయినాడు. సత్యం ప్రతి ఏడూ దాదాపు ప్రతి సబ్జక్టులోనూ మొట్టమొదటి మార్కు తెచ్చుకుంటుంటే గోపాలానికి స్వయంగా ఎంతో గర్వంగా వుండేది. రంగారావు మొదటి సంవత్సరమే వెనకపడిపోయినాడు. అయినా సత్యాన్ని గోపాలం వదలలేదు. రోజూ సత్యం, గోపాలంగారింట్లోనే చదువుకునేవాడు. అక్కడే పడుకునేవాడు. అతని కింటో పడుకునే అలవాటు కూడా తప్పింది.

సత్యం మూడో ఫారం చేరిన సంవత్సరం గోపాలం అతన్ని తన సెక్షనులోనే వేసుకున్నాడు. ఆ సంవత్సరం సత్యం చదువులో తీసుకున్న శ్రద్ధ గోపాలం మరే విద్యార్థి చదువులోనూ ఎన్నడూ తీసుకుని ఉండలేదు.

ఆ తరవాత సత్యానికి గోపాలం మేస్టరుగా వ్యవహరించలేదు. తనతో సమానంగానే చూసుకున్నాడు. తన ఇంటోనే సత్యాన్ని చదువుకోమన్నాడు. అప్పుడప్పుడూ అతని చదువు గురించి విచారిస్తూ వచ్చాడు. కాని స్వయంగా దగ్గిర కూర్చుని నూరిపొయ్యలేదు.

సత్యం స్కూలు ఫైనలు పరీక్షకు కూర్చునేనాటికి అతని జీవితంలో గోపాలం ఒక గొప్ప స్నేహితుడుగా తయారై సిద్ధంగా ఉన్నాడు.

# 4

ఇంకా కొద్దిరోజులకు పరీక్షా ఫలితాలు తెలుస్తాయనగా ఒకనాడు సత్యం వచ్చి గోపాలంతో, "మేస్టారూ, మా నాన్న నా పెళ్ళి చేద్దామని చూస్తున్నాడు. మీరేం సలహా చెబుతారు?" అని అడిగాడు.

సత్యం ఆ మాట అంటూండగా గోపాలం చేతిలో ఒక ఉత్తరం ఉంది—ఒకానొక స్నేహితుడు రాసినది. ఆ క్షణంలో సత్యం వచ్చి ఈ వార్త చెప్పి సలహా అడగటం గోపాలానికి దైవికంగా కనిపించింది.

"నన్నడిగితే చేసుకోమనే అంటాను. ఇంకా ఆలస్యం చేశావంటే పిల్ల నీకన్న మరీ చిన్నదై పోతుంది. దురదృష్టవశాత్తు మన సంఘం రజస్వలానంతర వివాహాలు ఒప్పుకోదాయె... కాని ఒక్కపని చేస్తావా, సత్యం? అర్జంటుగా నేను మీ నాన్న గారితో ఒక విషయం మాటాడాలి. ఆయనకెప్పుడు వీలవుతుందో కనుక్కో. పెద్ద వాడు, ఆయన నా దగ్గిరకు రానక్కర్లేదు నేనే వచ్చి మాటాడుతాను" అన్నాడు గోపాలం.

"అదేమిటండీ, మాష్టారూ? ఆయనే మీ దగ్గరికొస్తాడులెండి. ఆయనతో ముందుగా అప్పాయింటుమెంటు పెట్టాలా?" అన్నాడు సత్యం.

"అలాకాదు. సత్యం! ఈ విషయంలో న్యాయంగా నేనే ఆయన దగ్గరికి వెళ్ళాలి."

"ఫరవాలేదులెండి, నేనింటికెళ్ళి చెప్పగానే బయల్దేరి రాడూ?" అంటూ సత్యం సెలవు పుచ్చుకున్నాడు.

సత్యం చెప్పినట్టే మరో పావుగంటలో భైరవశాస్త్రుల్లు గోపాలంగారింటి దగ్గిర హాజరయినాడు.

"రండి శాస్త్రుల్లుగారూ, దయచెయ్యండి. పెద్దలు మీరే వచ్చారు" అన్నాడు గోపాలం.

"రావటం నా విధి" అన్నాడు ముసలాయన. ఆయనకిప్పుడు అరవై చేర బడుతున్నై. కొంచెం వయసు కూడా కనిపిస్తున్నది. గోపాలం ఆయన్ను బలవంతాన కుర్చీలో కూర్చోబెట్టాడు.

"మరేంలేదు, మీవాడి వివాహం గురించి అనుకుంటున్నట్టు నాకు చూచాయగా తెలిసింది, ఆ ముక్క నిజమేనా?"

"అనుకోవటం వరకూ చేతిలో పనేగనక అనుకున్న మాట నిజమే. తమకు చెప్పుదామనుకుంటున్నాను కూడానూ. నాకు తమకంటె ఆప్తులెవరున్నారూ? తమరు

మావాడి విషయంలో తీసుకుంటున్న శ్రద్ధ మరెవరు మటు కెందుకు తీసుకుంటారు గనకా? వాడి పురాకృత పుణ్యమో ఏమిటో అనుకుంటాను!"

"ఎంత మాటన్నారు? పైకొచ్చే విద్యార్థి నావాడని చెప్పుకుందామని ఏ మేస్టరుకుండదు చెప్పండీ, రేపు మీవాడు పెద్దవాడైతే నేను చెప్పుకుని గర్వపడనూ?" గోపాలం నవ్వుతూ.

"ఏ జన్మానో మావాడు పెట్టిపుట్టబట్టే తమరంతగా వాడియందు నమ్మకం వుంచటం జరిగింది... ఇంతకూ వాడి పెళ్ళి విషయం అడగటంలో తమ వుద్దేశం-"

"మరేమీలేదు మీరు పిల్లవాడికి ఏపాటి కట్నం కోరుతున్నారు, ఎటువంటి అభిప్రాయంలో వున్నారో తెలుసుకుందామనే!"

భైరవశాస్త్రిల్లు కనుబొమ్మలు ముడేసి రెండు క్షణాలపాటు నేల కేసి చూసి తలపైకెత్తి మనస్సులో వున్నమాట చెబుతున్న వాడల్లే "అయ్యా, నేను పెద్ద గొంతెమ్మ కోరిక పెట్టుకున్నాను. మనస్సులో వున్న దురాశ బయటికి చెప్పేస్తే పోతుంది. నా రెక్కలు బలహీనమైపోయినై. శరీరంలో పూర్వపు దార్ఢ్యమూ జవసత్వాలూ లేవు. పోనుపోను కుర్రవాడి చదువు నాకు భారమై పోతుందా అనే భయం పట్టుకుంది. ఇదివరకల్లా పడ్డ కష్టమేమో పడ్డానుగాని ఇకనైనా, ఈ మిగిలిన నాలుగు రోజులూ కృష్ణా రామా అంటూ ఇల్లు కదల కుండా కూచుందామనిపిస్తున్నది. పిల్లవాడి భారం పిల్లనిచ్చేవారు తీసుకుంటే—వాడెంతవరకు చదువుకుంటానంటే అంతవరకూ—పోతానంటే ఇంగ్లాండు కూడా పంపే బాధ్యత మీద వేసుకుని చదివించినట్టయితే నాకు తినేటందు కింత లేకపోలేదు. నాకూ ఇరవై ఎకరాల ఆస్తి వుంది - అంతా స్వార్జితం సుమండీ. జోలె పట్టుకు తిరిగి సంపాదించాను. గడచిన పదేళ్ళనుంచీ ఏ రోజున నేను జోలె అవతల పారే సినా నాకు హాయిగా వెళ్ళిపొయ్యేది. కాని ఈ కుర్రవాడికోసమే నేను యాచన చేశాను. నా బొందెలో ప్రాణం వుండగా నేను కూడబెట్టగలిగిన ప్రతి చిల్లిగవ్వా వాడి చదువుకింద ధారపోయటానికే సంకల్పించాను. న్యాయంగా మా పెద్దవాడికి ఆస్తి కొంత ఇవ్వాలి చూడండీ, అది కూడా పాటించకుండా పూచికపుల్లతోసహా మా రెండోవాడి చదువుకే ధారపోద్దామనుకున్నాను. ఆడపిల్లల క్కూడా ఏమీ పెట్టినవాణ్ణి కాలేదు. వాళ్ళందరికీ ఏదో విధంగా గడిచిపోతున్నది కదా, పోనీ ఈ వున్నది పెట్టి వీణ్ణి ఎంత పైకి తీసుకురావచ్చునో చూద్దామనిపించింది...."

"ఎందుకో కొంతకాలంగా నాలో స్వార్థం కలుగుతున్నది. ఆడపిల్లలకు తలా రెండెకరాలైనా ఒదిలి ఈ కట్టెను వొదిలేద్దామనిపిస్తున్నది. మా పెద్దవాడి కిందులో సహమైనా ఇద్దామా అనిపిస్తున్నది. వాడుకూడా నామాదిరిగానే ముసలితనంలోకూడా యాచన చెయ్యాలా ఏవిటిరా ఈశ్వరా-అనిపించి జాలివేస్తున్నది. కాని పిల్లవాడి చదువు ఎటూకాకుండా చెప్పించటం ఇష్టం లేదు. మొదట బియ్యేవరకూ చదివించు దామనుకున్నాను. బియ్యే పరిపాటి అయిపోయింది. బి. యల్. చదివించుదామను

కున్నాను. అదీ చవుకయిపోతున్నది. ఏ. ఐ. సి. యస్సయినా చదివిస్తేగాని, నా మొదటిగురికి తగిలేటట్టులేదు. నా దగ్గర ఈ ఆస్తి ఉంచుకుని వాడి చదువు నట్టి మధ్యలో ఆపెయ్యటం అదీ ధర్మంగా కనిపించటంలేదు. ఒకటి రెండేసి ఎకరాలు ఆడపిల్లల కిచ్చినా, పోనీ పదెకరాలు నా పెద్దవాడి కిచ్చినా, అందువల్ల అయ్యే విని యోగం కంటే అంతా ఖర్చుచేసి అయినా - చదువింత అంటుతున్నది గనక— వీడిమీదే వినియోగపరిస్తే ఉత్తమ ఫలం ఉంటుందేమోననే ఆశ పీకుతున్నది."

"పంతులుగారూ, ఈ సందిగ్ధావస్థలో నాకొక్కటే ఉభయతారకమైన ఊహ తోచింది. ఇంతకీ కలవారి పిల్లను చేసుకుని మా రెండోవాడి చదువు బాధ్యత వారికే వొదిలేసి ఈ ఉన్న తృణమూ పెద్దపిల్ల కిచ్చేసి నేను కూడా— ఇంకా ఎంతలెండి - నాలుగు ఘడియలపాటు భగవధ్యానం చేసుకుందామనే స్వార్థంతో పడ్డాను. ముసలి వాడి కెంతతృష్ణరా అనుకుంటారేమో కడుపులో వున్న ఆలోచన పైకి అనేశాను."

అయిదారు నిమిషాలపాటు ఇద్దరూ మాట్లాడలేదు. గోపాలం తన ఎదురుగా వున్న ఈ విచిత్రమైన వ్యక్తిని అర్థం చేసుకోవటానికి ప్రయత్నించాడు. ఇంతకాలమూ ఈయన వొట్టి లోభి అని ; యాచనా ప్రవృత్తి కలవాడనీ గోపాలం విశ్వసించాడు. అటువంటివాడు "ఇప్పుడు నాలో స్వార్థం ప్రవేశిస్తున్నది" అని ఒప్పుకుంటుంటే గోపా లానికి చెప్పరాని ఆశ్చర్యం కలిగింది. ఇంతకాలమూ ఈ ముసలాడు తన చిన్న కొడుకు కోసం ఇంత పెద్ద ప్రయత్నంమీద బయలుదేరాడని వింటుంటే ఈ"ఛాండ సుడు" అగస్త్యుడంత ఎత్తయిన మనిషిగా కనిపించాడు. ఎన్నేళ్ళ శ్రమ, ఎంత దీక్ష ! ఈ చాదస్తపు శాస్తుర్లుగారితో పోలిస్తే పదవుల కోసమూ బిరుదుల కోసమూ దేవులాడే వాళ్ళంతా క్రిములకన్న తక్కువ ప్రమాణంలో కనిపించారు గోపాలానికి. మామూలు లెక్కన తను తెలివిగల వాళ్ళలో జతే అయినప్పటికీ దాదాపు పదేళ్ళుగా చూస్తున్న ఈ శాస్తుర్లుగారిని ఆయన తన మనస్సులో మాట బయటికి చెబితే తప్ప అర్థం చేసుకోలేక పోయినాడే !

"మీరు కోరినట్టుగా జరుగుతుందనుకుంటాను. మీ స్వార్థం ఏమీలేదు మీ కోరిక చాలా సవ్యమైనది. నాకే డబ్బుంటే మీ భారం నేను వేసుకుని మీ పిల్ల వాడికి చదువు చెప్పించి నా కూతుర్నిచ్చి వివాహం చేద్దును. ధనికులంతా ఐసీయస్ పాసయిన అల్లుళ్ళను వెతికి వేలకు వేలుపోస్తారేగాని సత్యంలాంటి వాణ్ణి చూసుకొని ఐసీయస్ పాసుచేయించే కీర్తి మీదవేసుకోరు. ఇదే తల్లక్రిందులు ప్రపంచం" అన్నాడు గోపాలం.

"మీరు చెప్పదలిచిందేదో చెప్పారుకారు" అన్నాడు శాస్తుల్లుగారు గోపాలా నికా ప్రశ్న అర్థంకాలేదు.

"మా వాడి పెళ్ళి ప్రస్తావన ఏ ఉద్దేశంతోనో తెచ్చారు. నా సొంత గొడ వతో మిమ్మల్ని చెప్పనిచ్చానుకాను."

గోపాలానికి సంగతి జ్ఞాపకం చెయ్యగానే అకస్మాత్తుగా బిడియం పట్టుకుని మొహం జేవురించింది.

"అబ్బే, అది వేరే విషయంలెండి. అదేమీ కుదిరేదికాదు, మనకు పొసగే సంగతి కాదు" అని గోపాలం నీళ్ళు నమిలాడు.

భైరవశాస్త్రుల్లు, నవ్వి, "నా చెవినకూడా వెయ్యరాదా ?" అన్నాడు.

"నా స్నేహితుడొకడు — బొత్తిగా లేనివాడే. పాపం, అయితే బహు యోగ్యుడు—తన పిల్లకు తెలివిగల కుఱ్ఱవాడెవడన్నా దొరికితే చూడమని నాకు రాశాడు. వైదీకే. పిల్ల చాలా తెలివిగలది. సంగీతం చక్కగా పాడుతుంది, ఫిడేలు వాయిస్తుంది, ఇంటిపనులన్నీ చేస్తుంది. చాలా బుద్ధిమంతురాలు. ఆశ గదా ? మంచి సంబంధం కోసం చూస్తున్నాడు. కట్నం ఇచ్చుకోలేడు. ఖర్మం !....సత్యానికి చేసు కుంటే ఇద్దరూ ముచ్చటగా ఈడు, జోడుగా వుంటారని ఆలోచన పోయిందిగాని.... మీరు పెట్టుకున్న లైనుకూ దీనికీ కలవదు. అడిగారని చెప్పానుగాని నాకే సిగ్గుగా ఉంది చెప్పటానికి. మీ మనసులో వున్న ఆలోచన సబబైనదని తెలిసి ఇక ఈ విషయం ఎట్లా ప్రస్తావించనూ ?" అన్నాడు గోపాలం.

భైరవశాస్త్రుల్లు మళ్ళా ఒక నిమిషంపాటు నేలకేసి చూసి తల పైకెత్తి, "మీరి ప్పుడే ఆ స్నేహితుడు కే మాటా రాయకండి. రేపీ పాటికి నేనే వచ్చి మాట్లాడతాను. నాకు సెలవిప్పించండి" అంటూ లేచాడు.

గోపాలం ఆ మాటమీద అట్టే ఆశ పెట్టుకోలేదు.

## 5

గోపాలం మళ్ళీ పొరపాటు పడ్డాడు. మర్నాడు సాయంకాలానికి భైరవ శాస్త్రుల్లు మళ్ళీ వచ్చి కూర్చుని, "అయ్యా, మీ స్నేహితుణ్ణి ఒకసారి రమ్మనండి. వీలయితే పిల్లనూ, పిల్ల జాతకాన్ని వెంటపెట్టుకు రమ్మనండి. ఆలస్యదమృతం విషం" అన్నాడు.

"మీరేమీ తొందరపడలేదుకదా ? కాస్త విచారిస్తే సత్యానికి మంచి సంబంధం దొరుకుతుందేమో ! పిల్లనిచ్చేవారు వేలకువేలు పిల్లవాడికి ధారపోయకపోయినా, అప్పు పెట్టవచ్చు. తరవాత సత్యం తీర్చుకోలేకపోతాడా ?" అన్నాడు గోపాలం.

శాస్త్రుల్లుగారు తల అడ్డంగా తిప్పాడు.

కన్నతండ్రిని నేను వస్తాయిస్తే పిల్లనిచ్చిన మామగారు డబ్బు తెచ్చి పోస్తాడా ? అంత సులభంగా డబ్బు పొయ్యగల లక్షాధికారి తన కూతుర్ని మావాడి కిస్తాడా ? గొంతెమ్మ కోరికలు ! నేను నిన్ననే మనవి చేస్తినే...ధీరుడైనవాడు తల పెట్టిన పనులు తుదముట్టించవలసిందే. మీ స్నేహితుణ్ణి పిలిపించండి. మీ ఆప్తుల కంటె మా కాప్తులు లేరు."

మరోవారం రోజులకల్లా సత్యం పెళ్ళి స్థిరపడింది. ఇంకో పదిరోజులకు పెళ్ళి జరిగిపోయింది కూడాను.

సత్యానికి ప్రెసిడెన్సీ కాలేజీలో సీటు వచ్చింది. అతను మద్రాసు బయలుదేరి వెళ్ళేటప్పుడు గోపాలం కొన్ని ముక్కలు చెప్పాడు.

"దేవుడనుకూలిస్తే నువు చాలా ముందుకొస్తావు. కాని ఒకటి జ్ఞాపకంపెట్టుకో. నువు మీ నాన్నగారికి రుణపడబోతున్నావు— ఒక విధంగా కాదు, రెండు విధాలుగా. నీమీద ఆయన పెద్ద ఆశలు పెట్టుకున్నాడు. నువు మరికొన్ని సంవత్సరాల పాటు అహోరాత్రాలు దీక్షతో పనిచేస్తే తప్ప ఆ ఆశలు ఫలించవు. ఆయన నీ కోసం నువు పుట్టినప్పటి నుంచీ దీక్షగా నీ కోసం పనిచేశాడు. ఇంకా చేస్తున్నాడు. అది మరచిపోకు. ఆయన ముసలివాడు, నవు కుర్రాడివి. అందుచేత నీ దీక్షకంటె ఆయన దీక్ష గొప్పది. నువ్వు చెయ్యవలసింది అసాధ్యమైన విషయం కాదు.– సివిల్ సర్వీసులో చేరేవాళ్ళంతా చేస్తున్న పనే కాని మీ నాన్నగారు చేసినపని అసాధ్యమైనది. అటువంటి త్యాగం ఏ తండ్రీ చెయ్యడు.

"రెండో సంగతి ఏమిటంటే, నువు రూపాయి అణా పైసలతో నీ తండ్రి గారికి రుణపడబోతున్నావు. జ్ఞాపకం పెట్టుకో. అది తీర్చవలసిన బాకే. ఆ ఋణం తప్పించుకోదలిస్తే నువు ఏ ప్లీడరు పరీక్షో చదివేసి ప్రాక్టీసు పెట్టుకోవటం, తప్ప మరో దారిలేదు. కాని ఆ పనిచేస్తే మీనాన్నగారికి ఆర్థికమైన బాధ తప్పిస్తావుగాని ఆయనపడ్డ శ్రమంతా వృథా అవుతుంది."

సత్యం ఈ విషయాలు జ్ఞాపకం పెట్టుకుని దీక్షగా చదువుతానన్నాడు.

పట్నం చదువు ప్రారంభించినాక చిన్నతనంనుంచీ పట్నంలోనే ఎందుకు చదవకపోతినా అనిపించింది సత్యానికి. ఈ కాలపు చదువుకు తగిన వాతావరణం పట్నంలో వున్నట్టుగా చిన్న బస్తీలలో వుండదు. అక్కడ ఎంతో తెలివిగల వాళ్ళనిపించుకునే సత్యం వంటి విద్యార్థుల కెక్కువ లోకజ్ఞానం వుంటుంది. తన తోటి విద్యార్థుల్లో ఎంతో సంపన్నులూ గొప్ప సంబంధాలు కలవాళ్ళూ, అనేక రకాల ఉద్యమాల్లో తిరిగేవాళ్ళూ, ప్రతిభావంతులూ వుండటం కనిపెట్టి వాళ్ళ సహవాసాలు సంపాదించసాగాడు. అతన్నికూడా వాళ్ళు తెలివిగల విద్యార్థుల్లో ఒకడి కింద స్వీకరించారు.

సత్యానికి లెక్చరర్లతో కూడా కొంత చనువు దొరికింది. ఐ. సీ. యస్. మీద ఆశ పెట్టుకున్నాడని తెలిసి వాళ్ళు కూడా ప్రోత్సహించి సలహాలిచ్చారు. ఆ సలహాల నతను వేదవాక్యాలుగా పాటించాడు. కాలేజీ చదువు కాక సత్యం యూనివర్సిటీ లైబ్రరీలో అనేక గంటలు గడిపేవాడు.

అతనికి ఎంత డబ్బు కావలసినా తండ్రి పంపిస్తూ వచ్చాడు. ఆ డబ్బు తప్ప సత్యానికి ఇంటి వాతావరణంతో ఏమీ సంబంధం లేకుండా పోయింది. పట్నం వచ్చే వరకూ సత్యం తన యింటి సంస్కారపు గిరులుదాటి పోనేలేదు. కాని ఇప్పుడు

దాన్ని దాటి ఎంత పైకి వెళ్ళితే తనకంత ఉపయోగమనిపించింది. పొదుపూ, పూర్వ సంప్రదాయాలు, మంచితనమూ—ఈ విలువలేవీ తనకు పనికివచ్చేవికావు.

# 6

సత్యం ఆనర్సు పరీక్షల్లో ఉత్తీర్ణుడైనాడు. తరవాత కొద్దికాలానికి ఐ.సీ.యస్. ప్రవేశ పరీక్షలో నెగ్గి ఏరుకోబడ్డాడు.

భైరవశాస్త్రులు ఆరోగ్యం కొంతకాలంగా బాగాలేదు. ఆయన ఎక్కడికీ కదలటంలేదు. పెద్దకొడుకు సంసారం ఖర్చు కూడా జాస్తి అయింది. ఆయన ఇద్దరు కూతుళ్ళకు పెళ్ళి చేశాడు. సామాన్య సంబంధాలు తెచ్చినా కట్నాలు పొయ్య వలసివచ్చింది. రాబడి ఖర్చుకు చాలలేదు. కాని భైరవశాస్త్రులు అణాచీటీ మీద ప్రాణంపోయినా దస్కతు పెట్టలేదు. అయినకాడికి పొలం తెగనమ్మి ఖర్చు జరిపాడు.

సత్యం ఖర్చుముందీ ఖర్చులన్నీ కలిపినా ధూపానికి రాలేదు. ఈ సంగతి భైరవశాస్త్రులు అనుకున్నదేగనక ఆయన ఏమీ విచారించలేదు. ఇంగ్లండు వెళ్ళేన తరవాత సత్యం ఖర్చు అంతులేకుండా పెరిగిపోయింది. "డబ్బు జాగర్తగా వాడు" అని రాద్దామని ఎన్నిసార్లో కలం చివరిదాకా వచ్చింది కాని శాస్త్రులు నిగ్రహించు కున్నాడు. సత్యాన్ని ఏవిధంగానూ నిరుత్సాహపరచరాదు. వాడు తన చదువు విష యంలో శ్రద్ధవహించినన్నాళ్ళూ ఇంకేం జరిగినా ఫరవాలేదు.

ఇంగ్లండులో శిక్షణపొంది దొరవేషంతో సత్యం దిగాడు. భైరవశాస్త్రులు నిట్టూర్చాడు. సత్యం స్వరూపమే కాకుండా అతని ప్రవృత్తి గూడా చాలా మారిపోయినట్టు కనిపించింది. జీవితం గురించీ, జీవిత సమస్యల్ని గురించీ ఒక నిర్లక్ష్యభావం కనిపించింది. అది నిర్భయం కాదు, నిర్లిప్తతగూడా కాదు. అనేక స్వల్ప విషయాల్లో సత్యానికెంతో లౌకిక శ్రద్ధ ఉంది. తన దుస్తులు కొంచం మడత నలిగినా రాద్ధాంతం చేస్తాడు. గడియారం ప్రకారం పనిచేస్తున్నట్టుగా తను అనుకున్న దానికి ఒక నిమిషం జాగయితే అల్లాడిపోతాడు! ఇదంతా ఒక కొత్త సంస్కారమని శాస్త్రులుకు తట్టలేదు. తనకొడుకీ లక్షణాలన్నీ అలవాటు చేసుకున్నాడని నమ్మాడు. సత్యం నేర్చిన కొత్త అలవాట్లన్నీ ఇంకా ఆయనకు తెలీవు. అదంతా తెలుసుకునే అవకాశం లేక మునుపే భైరవశాస్త్రులుకు పెద్ద కనువిప్పయింది. సత్యం అంత వరకు భార్యను తెచ్చుకోలేదు. ఇప్పుడాపని చెయ్యమని తండ్రి హెచ్చరిస్తే సత్యం సరిగా వినిపించుకోలేదు.

భైరవశాస్త్రులుకు కొడుకు మీద అనుమానం కలిగింది. ఏమిటి వీడి ఆలో చన? చవుకబారు వెధవలు చేసినట్టుగా అక్కడ ఏ దొరసాన్నో మరిగి వచ్చాడా!

లాంఛనంగా ప్రాయశ్చిత్తం చేసుకోమంటేనే సత్యం నీళ్ళు నమిలాడు. కాని ఎవ్వరికీ తెలీకుండా ఆ తంతు చేసేశాడు భైరవశాస్త్రుల్లు.

ఇక గర్భాదానం విషయంలో సత్యం లొంగేట్టు కనిపించలేదు. కాస్త రెట్టించి హెచ్చరించగా, "ఇంత చదువూ చదివి నా విషయాలు నేను చూసుకోనా? నా కెందు కింత చెప్పటం?" అన్నాడు.

"ఒరే, కొన్ని విషయాలెంత చదువు చదివినా తెలీవు. అవి పెద్దవాళ్ళు చెబితే తెలియవలసిందే."

సత్యం ఏదో గొణిగాడు.

త్వరలోనే అతన్ని దూరదేశం వేశారు. అతనక్కడ ఎవతెనో—నల్లదాన్నే-పెట్టుకు వుంటున్నాడని వదంతులు వినిపించినై. సత్యం మామగారు తన వియ్యంకుడితో సంప్రదించి తన కూతుర్ని వెంటబెట్టుకుని అల్లుడి దగ్గిరికి వెళ్ళాడు.

సత్యం మామగారితో ఏమీ మాట్లాడలేదు గాని భార్యతోనే మంచిగా చెప్పాడు.

"నేను బుద్ధెరగనప్పుడు మా నాన్న నీకూ నాకూ పెళ్ళి చేశాడు. నాకు నీ మీద ఏమీ కోపం లేదు. కాని ఇంగ్లండులో నాకొక బంగాలీ పిల్లతో స్నేహ మయింది. ఆ పిల్ల అక్కడ చదువుతూండేది, పత్రికలకు రాస్తూండేది. ఆ అమ్మా యికి పెళ్ళి కాలేదు. నువ్వడ్డం లేకుండా వుంటే మేమిద్దరమూ పెళ్ళాడి వుండే వాళ్ళం. కాని మా కిప్పుడా అవకాశం లేదు. నాతో స్నేహంగా వుండటానికైనా ఒప్పుకుందిగాని మరొకర్ని పెళ్ళాడడాని కిష్టపడలేదు. నేను నిన్నెరక్కముందే ఆమె నెరుగుదును. నీకోసం ఆమెను తరిమెయ్య మన్నావా? నా వల్ల కాదు."

"నే నెక్కడికి పోతాను? నన్ను కూడా ఇక్కడే ఉండనివ్వండి" అన్నది అతని భార్య.

"ఉండు, నాకేమీ అభ్యంతరం లేదు. కాని నా మీద అధికారము వుందనుకోకు; ప్రతిదానికీ నస పెట్టకు. ఆ ప్రకారమైతే ఉండు."

సత్యం భార్య సరస్వతి ఒక నెల పాటు భర్త దగ్గిర ఉంది. సత్యం తాగుడూ, ఆ బెంగాలీ అమ్మాయి కూడా అతనితో పాటు తాగటమూ, ఇద్దరూ తనని లక్ష్య పెట్టకుండా నానా వికారచేష్టలు చెయ్యటమూ, తనున్న ఇంట్లో నౌకరుకన్న అధమంగా చూడటమూ సహించలేక తనను పంపించమని భర్తనడిగింది. అత నామెవెంట నౌకరన్నా లేకుండా పంపాడు. అయితేనేం? సెకండు క్లాసులో ఎక్కించి పంపాడు.

* * *

"శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః"

గోపాలం కుర్చీలో కూర్చుని పత్రిక చదువుతుంటూ త్రుళ్ళిపడి లేచాడు. చంకలో బోడె, చేతిలో తళతళామెరిసే చెంబూ పట్టుకుని భైరవశాస్త్రుల్లు ప్రత్యక్ష మైనాడు.

"రండి శాస్త్రుల్లుగారూ, కూచోండి" అని గోపాలం ఆయన్ను బలవంతంగా కూచోబెట్టి "ఏమిటిది ?" అని ప్రశ్నించాడు.

"ఆత్యాశకు పోయినందుకు శాస్తి...చూడండి, బాబూ మనిషైనవాడు విచ్చల విడిగా తాగటమూ, ఎవత్తెనో పెట్టుకుని ఊరేగటమూ, నేర్పే చదువేం చదువూ ? ఇటువంటి చదువులుకూడా ఉంటాయా ? మనుషులు దుర్బుద్ధివల్ల ఇటువంటి పన్లు చేస్తూంటారనుకునేవాణ్ణి. చదువువల్ల కూడా ఇవి అబ్బుతాయా ?" అన్నాడు భైరవ శాస్త్రుల్లు.

"దుర్బుద్ధులందరిలోనూ వుంటూంటై. అయితే ఒక్కో చదువు సంఘ భయం పోగొట్టేస్తుంది. సంఘభీతే దైవభీతి అనుకోండి. ఈ చదువు సంఘభీతి పోగొట్టటమే కాక సంఘానికి మీమీద నామీద ఉండే కట్టుబాట్లుకూడా లేని అవకాశాలు కల్పిస్తుంది. డబ్బు పుష్కలంగా ఇస్తుంది. ఇంక అడ్డేమిటి ?" అన్నాడు గోపాలం.

"ఎంత పొరపాటూ ! మీవంటి తెలిసిన వాళ్ళుండి కూడా నాతో మాట మాత్రం చెప్పకపోతిరే !"

"చెప్పుదామని నాకు నోటిదాకా వచ్చింది. కాని మీరు డబ్బు సంపాదననే ఘనంగా చూసినట్టు కనపడ్డారు. లేనిపక్షంలో మీ పెద్దవాడి విషయంలో మీరు అసంతృప్తిపడవలసిన అవసరం ఏముందీ ! అతడు ఎంత పెద్ద మనిషి ! చదివిన చదువులో ఎంతగట్టివాడు !"

"వాడే నా నిజమైన కొడుకు ఈ వెధవ నా కొడుకేకాడు. వాడి పెళ్ళానికి రెండెకరాలు రాసి ఇస్తున్నాను. నేను ముష్టెత్తుకు బతుకుతాను ఎంతకాలంలెండి. అయిపోయింది. పిల్లలు గలవాడు, నాకున్న ఆస్తంతా నా పెద్దకొడుకే తింటాడు."

"మీరెంతసేపూ డబ్బే ఆలోచిస్తున్నారు. మీ చిన్నవాడిమీది పంతంకొద్దీ... వాడు అందరి కళ్ళల్లోనూ నికృష్టుడుగా కనిపించాలని జోలె పట్టుకున్నారుగాని మీకు తిండి జరగదా ! నన్నడిగితే మీవాడిదేమీ తప్పులేదు. తప్పంతా మీదే. వాడి జన్మకి చదువు తప్ప మరొకటి లేకుండా చేశారు. వాడికి ప్రపంచం గొడవ తెలీదు. ఒక సాహిత్యంలేదు. ఒక పురాణం లేదు. ఆఖరుకు ఒక సుమతీ శతకం పద్యమైనా వాడికి రాదు. నేనెరిగిన మటుకు వాడొక నాటకంగాని సినిమాగాని చూసిన పాపాన పోలేదు. ఇది కూడును, ఇది కూడదు అనే జ్ఞానం వాడికెట్లా వస్తుందీ ?... వాడి మానాన వాణ్ని జీవించ నివ్వండి. ఇంతడబ్బు పంపిస్తూ ఉంటాడు, ఖర్చు పెట్టు కోండి" అన్నాడు గోపాలం.

"వాడి డబ్బు నా కవసరంలేదు. అది నాకు విషంతో సమానం !"

"మన ఇచ్ఛలన్నీ పిల్లలద్వారా తీర్చుకుందామని ప్రయత్నం చేస్తే ఇదే జరుగు తుంది. వాళ్ళు మనకు దక్కకుండా పోతారు....ఫర్వాలేదు, మీవాడు మీకు డబ్బు దానం చెయ్యడు—మీ బాకీ తీరుస్తాడు; మీది మీరు దక్కించుకుని అంతతో తృప్తి పడండి. మీ మనుమడికి పనికొచ్చే చదువు చదివించండి. వాడు తన పొట్ట పోసు

కుంటూ నలుగురికి ఉపయోగపడేటట్టు చదివించండి" అన్నాడు గోపాలం.

తను అన్న మాటలు భైరవ శాస్త్రుల్లుకు కష్టం కలిగించినమాట గోపాలానికి తెలుసు. ఆయనకు కోపం తెప్పించాలనే అన్నాడా మాటలు. ఎన్నడూ తన ఇంటికి ఉపాదానానికి రాని శాస్త్రుల్లు ఇవ్వాళ రావటం దేనికి? గోపాలం సాను భూతి సంపాదించటానికి తప్పితే!

ఆయనకు ఉపాదానం వెయ్యనేలేదన్న సంగతి భైరవశాస్త్రుల్లు వెళ్ళిపోయిన పావుగంటకుగాని స్ఫురించలేదు గోపాలానికి.

ముద్రణ : ఏప్రిల్ 1947, ఆంధ్రజ్యోతి.

# సనాతనిస్టు విభ్రమం

మా తాలూకా పల్లెటూళ్ళరో గమనించదగిన విశేషం ఏమిటంటే—

అరుగులు. వాటిని గురించి రాయాలంటే ఎంతయినా ఉంది.

ఈ అరుగులు వీధివాకిలి కిరువైపులా ఉంటూ నామమాత్రంగా ఇంటివారి హక్కు భుక్తములలో ఉన్నవయి, క్రియకు ఊరి వారందరికి ప్రైవేటు మీటింగులు చెయ్యటానికి ఉపయోగపడుతూ ఉంటవి. అది లచ్చయ్యగారి అరుగు కానివ్వండి, సనాతనిస్టు యాజులుగారి అరుగు కానివ్వండి, అడివి శంకరయ్య గారిది కానివ్వండి. మీరు ఆ గ్రామస్తులు కనక అయినట్లయితే, ఆ అరుగు 'విడిగా' వున్నప్పుడు మీరు వెళ్ళి, అప్పటికి అక్కడ హాజరులో ఉన్న నలుగురయిదుగురితోనూ మీరు దానిమీద ఒక సభచేసి, మీలాగా ఆ సమయానికి ఆ ప్రదేశములో హాజరుగా ఉండనట్టి ఏ కొందరిని గురించి గాని దూషణ భూషణ తిరస్కారాదులు జరిపి, మీపని పూర్తి కాగానే పై బట్టలు దులిపి ఎవరి దారిన వారు చక్కా పోవచ్చును. ఇందుకెవరి అభ్యంతరమున్నూ ఉండబోదు.

ఇది బస్తీలలో వల్లపడదు. ఉత్త మునిసిపాలిటీల శకంలోనే పర్మిషనులనీ, లైసెన్సులనీ పెట్టి, వీధి మీదికి ఉండే అరుగుల అభివృద్ధికి చాలా అంతరాయాలు ఏర్పాటు చేశారనుకుంటే, కమీషనర్లూ, స్పెషల్ ఆఫీసర్లూ రావటంతో బస్తీలలో వాళ్ళు బయటి అరుగులకు పూర్తిగా నీళ్ల విడిచి పెట్టవలసి వచ్చింది.

ఆన 19...సం॥ ది 6 జూన్ తారీఖ్ను...గ్రామ కాపురస్తులు (1) కలవా గౌరీశ్వర సోమయాజులు (వురఫ్ సనాతనిస్టు యాజులు) (2) అగస్త్యుల సీతాపతి శాస్త్రి; వీరుగాక నలుగురు బ్రహ్మచారులూ కలిసి గౌరీశ్వర సోమయాజులు వారి వీధి అరుగులమీద సదరు యాజులవారి ఆధిపత్యం కింద ఒక చిన్న అన్‌లావుల్ ఎసెంబ్లి అయినారు.

"చలవయ్య బావకూతురు వచ్చిందే!" అన్నాడు శంకరం.

"అంత దూరాన చూసి ఎవరో కిరస్తానీ పంతులమ్మేమో అనుకున్నా. తీరా చూస్తే మన మిస్సమ్మే!" అంటూ సీతాపతి బ్రహ్మచార్లకేసి కన్నుమలిపాడు. బ్రహ్మచార్లు తలలు ఎగరవేసి నవ్వారు.

"అది ఆ ఇంగిలీషు చదువులో ఉంది, ఇంగిలీషు చదువు మనకందరికీ కిరస్తానీ కూడు కుడుపటానికి క్కాదూ వచ్చింది?.... ఏమిటో లచ్చయ్య అభిప్రాయం?"

"ఎప్పుడో చల్లగా పిల్లదానికి పెళ్ళిచేసేస్తాడు. అంతకన్న అభిప్రాయం ఏముంటుంది? దాని చదువూ, దాని వేషం, దాని వాలకం-అంతా కళ్ళఎదట కనపడుతూనే ఉందిగా!" అన్నాడు సీతాపతి.

"ఆహా! కనపడకేం? వాళ్ళతాత దాని అవతారం చూస్తే ప్రాయోపవేశం చేసి ఉండేవాడు.... దీనికేదో చెయ్యాలి మనం. నేను లచ్చయ్యతో ఖచ్చితంగా ఒకసారి మాట్లాడాలని అనుకుంటున్నా, ఏమంటావు, సీతాపతీ?"

"కానియ్యి మరి, శుభస్యశీఘ్రం. ఏదోవిధంగా నలుగురి తలకాయలూ ఒక చోట చేర్చి పార్టీలు తీసేసుకున్నామా? మళ్ళీ లచ్చయ్య కూతురి పెళ్ళి చెయ్యటం, నేను చెయ్యలేదు అదే చేసుకుంది అనటం, కొందరు వెళ్ళటం, కొందరూ వాళ్ళింటికి వెళ్ళకపోవటం.... కానీండి! అదేదో దబ్బున తేల్చుకుంటే మళ్ళీ మనపార్టీల గోలలో మునం పడదాం!" అన్నాడు సీతాపతి, ఊరి పాలిటిక్సు యావత్తూ తన నెత్తిమీదిగానే వెళుతున్నట్టు.

"నువ్వేరా, అడివీ?"

"మరేం లేదుగాని, బాబాయి; గాంధిమహాత్మ అంటారు గదా—"

"ఓరి నీ గాంధిమహాత్ములు గడ్డలుగానూ! మతాన్ని గంగలో కలుపటానికి చూస్తున్న కోమటి ముండాకొడుకును పట్టుకు వదలడేమండీ ఈనా?" అన్నాడు యాజులు.

"మరేం లేదుగాని ఆయన వెధవల్ని పెళ్ళాడమని ఉత్తరువు చేశారు కదా! అని చెప్పబోయినాను!" అన్నాడు శంకరయ్య.

"వాడికేం? వాడు రేపు మలభక్షణ చెయ్యమంటే చేస్తావ్రటా!" అన్నాడు యాజులు కదులుతున్న పళ్ళు బిగబట్టి.

"ఏం లాభమంటాను? జుట్టు దువ్వుకుంటుందీ, పూలు పెట్టుకుంటుందీ, చదువుకొంటుందీ! వైధవ్యం తప్పుతుందా? పోయిన పసుపూ కుంకం మళ్ళీ వస్తయ్యా? రావూ! పెళ్ళి చేసుకోటం కల్లోవార్తా! దానికి పెళ్ళిచేసి లచ్చయ్య ఊళ్ళో ఒక్క ఘడియ ఉండగలడూ?" అని అడిగాడు యాజులు ధీమాగా.

"ఎట్లా ఉంటాడూ?" అని తిరిగి అడిగాడు సీతాపతి.

"ఎందుకుండడూ?" అన్నాడు శంకరయ్య దేన్నోగురించి ఆలోచిస్తూ. బ్రహ్మచార్లంతా నవ్వారు.

"ఎవరు వారు!" అన్నాడు యాజులు అనవసరంగా కళ్ళమీదికి ఎండ పడుతుందేమో నన్నట్టు చెయ్యి అడ్డంపెట్టి. అప్పుడే చీకటి పడబోతున్నది. దారి వెంట నెత్తిన పెద్ద గడ్డిమోపుతో వెళుతున్న మనిషి ఆ ప్రశ్నవిని ఆగి, "నేనే, మామా!" అన్నాడు.

"సుబ్బన్నా! కుప్ప కొట్టించావ్రటా? మీ వెధవ—"

"అయితే! మామా! మన లచ్చయ్యగారింటి కెవరో వస్తున్నారే! పాతి కేళ్ళవాడు. సాయిబల్లే ఉన్నాడు. ఏ వూరంటిని; చెప్పలా! లచ్చయ్యగారి ఇంటి కని మటుకు అన్నాడు."

"ఎందాకా వచ్చాడేం?"

"సూరయ్యగారి వామిదాకా వచ్చి ఉంటాడు!" అంటూ సుబ్బన్న సాగాడు.

ఎసెంబ్లి మెంబర్లు మొహమొహాలు చూసుకున్నారు. లచ్చయ్యగారింటికి సాయిబులుకూడా రావటందాకా వస్తే, ఇక ఎవరివల్లా అయేదేమీ లేదు. 'పార్టీలు' తప్పవనేమో సీతాపతి నిట్టూర్పు విడిచాడు. ఆలోచన అభినయించుతూ బ్రహ్మాచార్లు మెడలు గోక్కోటం మొదలు పెట్టారు. ఇంతటిలో వీధి చివర ఆగంతకుడి ఆకారం కనిపించింది. బొందిలాగు సాయిబుల పాషను ఐయితే చెప్పలేం కాని వచ్చే కుర్ర వాడిలో సాయిబు లక్షణాలేమీ లేవు. అతనికి పాతికేళ్ళూ లేవు. ఇరవై రెండుకన్నా ఎక్కువ ఉండవు.

"ఎవరు వారు?" అన్నాడు యాజులు గంభీరంగా.

"తమరెవరు?" అన్నా డాగంతకుడు సవినయంగా.

"ఏవూరు?" అన్నాడు సీతాపతి.

"తమది?" అని తిరుగు ప్రశ్న వచ్చింది.

"ఓయ్!" అన్నాడు యాజులు.

"చిత్తం! సరిగా ఆమాటే నేనూ అందామనుకుంటున్నాను. ప్రశ్నలకు సమా ధానం చెప్పటం ఇష్టంలేనివాళ్ళు ఎన్నడూ ప్రశ్నలు వెయ్యకండి!" అంటూ ఆగంత కుడు లచ్చయ్యగా రింటివేపు సాగిపోయినాడు.

* * *

యాజులు పెద్ద సందిగ్ధావస్థలో పడ్డాడు. ప్రసాదరావు రాక ఆయన పాను లన్నిటినీ తారుమారు చేసింది. యాజులు, పాపం, మతాన్ని గురించీ, ధర్మాన్ని గురించీ లచ్చయ్యగారి ఎదుట ఏకరువు పెట్టడానికి చిన్న ఉపన్యాసం తయారు చేశాడు. ఏం లాభం? అంతా బూడిదను బోసిన పన్నీరయింది. ఆ కుర్రవాడి ఎదట ఆ ఉపన్యాసం వెళ్ళవలసిన తీరుగా వెళ్ళదు. యాజులు ఉత్తమ శ్రేణికి చెందిన సనాతననిష్టు కాడని కాదు. కుర్రకుంకను చూస్తే ఆయనకు భయమనీకాదు, అదొక మనోదౌర్బల్యం.

అందుకని యాజులు తన ప్రయత్నంనించి విరమించవలసిందేనా? ఒక్క నాటికీ కాదు. అన్నిటికీ ఉన్నాడుగా పాపాల భైరవుడు, తిక్కశంకరయ్య!

యాజులుగారు అర్జంటుగా రమ్మంటున్నారని ఒక బ్రహ్మచారి వచ్చి శంక రయ్యకు కబురు అందించి వెళ్ళిపోయినాడు. అప్పుడే భోంచేసి భుక్తాయాసం తీర టానికి మంచం వేసుకుంటున్న శంకరయ్య మంచం అక్కడే వదిలిపెట్టి యాజులు గారింటికి ప్రయాణమైనాడు.

"ఒరే, శంకరం! ఈపని నీవల్లనే కావాలి."

"అదెంత భాగ్యం! ఏంచెయ్యమంటావు నన్ను ?"

"ఒక్కసారి నువ్వు లచ్చయ్యగారింటికి పోయిరావాలి."

"ఇప్పుడు! నుంచున్నట్టుగా రానూ ?" అంటూ శంకరయ్య బయలుదేరాడు.

"ఒరే! ఒరే! ఏమిటా పోవటం ? పోయి ఏం చేస్తావు ?"

"ఏం చెయ్యమన్నావో చెప్పుమరీ !"

"నిన్న లచ్చయ్యగారింటికి వచ్చిన కుర్రవాడెవరో, ఎందుకు వచ్చాడో, వాడూ సరోజినీ ఒకరితో ఒకరు లేచిపొయ్యేట్టున్నారేమో - వెకవెకలూ పకపకలూ ఆడు తున్నారేమో- చూసిరావాలి. నేను పంపించానని చెప్పేవు సుమా! నువ్వు మరీ ఎద్దు మొద్దు స్వరూపానివి; ఆఁ? వెళ్ళు! ఏవేం తెలుసుకోగలవో అవన్నీ తెలుసుకురా! తరువాత ఆలోచిద్దాం!"

అడివి శంకరయ్య 'లచ్చయ్యబాబూ!' అంటూ లోపలికి వచ్చేటప్పటికి నిన్న వచ్చిన కుర్రవాడు ఒక కుర్చీలో కూర్చుని ఏదో పుస్తకం చూస్తున్నాడు. అతని వెనకగా కుర్చీమీద చేతులు పెట్టి సరోజిని ఆ పుస్తకమే చూస్తున్నది. ఇద్దరూ చెప్ప తరం కాకుండా విరగబడి నవ్వుతున్నారు. ఇంకేం ఒక పాయింటు తేలిపోయింది. ఈ యిద్దరూ లేచిపోవటం రూఢే! యాజులెంత దూరాలోచన కలవాడు!

"రండి తాతగారూ, కూర్చోండి!" అని ప్రసాదరావు శంకరయ్యను గౌరవం చేశాడు, తనే గృహయజమానల్లే.

శంకరయ్య దూరంగా కూర్చున్నాడు. ఆయనకు, చప్పు చప్పున వెయ్యవల సిన ప్రశ్నలన్నీ వేసేసి యాజులుముందు ఎప్పుడు వాలుదామా అని ఉంది. ఎట్లా ఉపక్రమించాలో తెలియలేదు. చివరకు తెగింపుచేసి "మీదే గ్రామం, నాయనా ?" అన్నాడు శంకరయ్య.

"నేను ప్రస్తుతం పట్నంలో ఆనర్సు చదువుతున్నానండీ!" అన్నాడు ప్రసాదరావు.

"మా లచ్చయ్య నీకేం కావాలి బాబూ ?"

"నాకేమీ అక్కర్లేదు!" అన్నాడు ప్రసాదరావు చాలా తాపీగా.

శంకరయ్య నిర్ఘాంతపోయినాడు. చదువుకున్నవాళ్ళు మాట్లాడితే అర్థం చేసుకోవటం కష్టమని ఆయనకు తెలుసును. కాని ఇంత కష్టమని ఆయన ఎన్నడూ అనుకోలేదు. "ఏమిటది?" అని అడిగితే తన మర్యాదకు భంగం కలుగుతుందని దాన్ని అంతటితో పోనిచ్చాడు.

"అట్లాగా? అయితే నువ్వీ గ్రామం ఏం పనిమీద వచ్చావు బాబూ?"

"సరోజిన్ని చూసిపోదామనీ, మిమ్మందర్నీ కలుసుకుందామనీ!"

శంకరయ్య ఈ సమాధానానికి ఆశ్చర్యపోయినాడు. సామాన్యంగా ఇంగ్లీషు చదువుకున్న వాళ్లకు ఇంత కలుపుగోలుతనం ఉండదు. శంకరయ్యకు మరికొంచెం

సేపు కూర్చుని ఈ మంచి కుర్రవాడితో గాంధిమహాత్ముల గురించి మాట్లాడదామని పించింది.

"ఏమండీ, తాతగారూ! మిమ్మల్ని యాజులుగారేనా పంపించింది?"

శంకరయ్య నిర్ఘాంతపోయినాడు. ఇది కేవలం గారడీగా ఉంది. ప్రసాదరావు ఆయన కంగారుచూసి నవ్వుతూ, "నన్ను మీ వూరివారు ఎరగరుగాని నేను అందర్నీ ఎరుగుదును" అన్నాడు.

"ఇదిగో చూడు, నాయనా! యాజులు నన్నిక్కడికి పంపించినమాట ఎవరితోనూ చెప్పవద్దన్నాడు, నీకు తెలిస్తే తెలిసిందికాని ఇంకెవరికీ చెప్పకు. నువ్వు కూడానే అమ్మాయి! ఆఁ!"

"అయితే తాతగారూ! మీకు గాంధీమహాత్ముడంటే గురికదా? మీరు యాజులూ వాళ్ళతో ఎందుకు కలుస్తారూ? ఇప్పుడు సరోజిని పెళ్ళి చేసుకుంటానంటే యాజులు వద్దంటాడు! అదే గాంధి మహాత్ముడైతే తప్పకుండా చేసుకోమంటాడు! గాంధీమహాత్ముడు ఎక్కువా? యాజు లెక్కువా?"

"చాలా ముఖ్యమయిన విషయం తీసుకొచ్చావు. చూడు బాబూ ! గాంధీ మహాత్ములకు హిందూ ధర్మమంటే యిష్టమని చెబుతారే? వెధవ ముండల పెళ్ళిళ్ళు ఎప్పుడూ తప్పే! విన్నారూ?"

"గాంధీ మహాత్ముడికికూడా ఆ ముక్క తెలుసు!"

"ఆఁ! ఆఁ! అట్లాగా?" అంటూ చెవులు రిక్కించి వినటం మొదలు పెట్టాడు శంకరయ్య. ఇంత తెలివిగల కుర్రవాణ్ని తను ఎన్నడూ చూసి ఎరగడు. "ఆఁ! ఆఁ!"

"అయితే ఇది ఏ యుగం?"

"ఆఁ!"

"చెప్పండి! ఇది ఏ యుగం?"

"కలియుగం కాదూ?"

"కాదూ మరీ? కలియుగంలో ధర్మం ఒక్క పాదం మీదనే నడవాలి! యుగ ధర్మం పాటించాలి. వానాకాలంలో మామిడిపళ్ళు రావడం లేదా? మామిడిపళ్ళు మంచివే కావటానికి! ఏమంటారు?"

"బాగుంది! బాగుంది! ఎట్లాగూ!"

"గాంధి మహాత్ముడు అవతారం కనక ఆయన యుగధర్మం అమలులో పెడతాడు గాని సనాతన ధర్మం లెక్కచెయ్యడు. రాముడేం చేశాడు? తన యుగ ధర్మం పాటించి రాక్షసులను సంహరించాడు. కృష్ణుడు ఏం చేశాడు? రాక్షసులను చేరదీశాడు. ఘటోత్కచుణ్ణి పాండవుల పక్షాన ఉంచాడు. చూడండి ఈ చిత్రం! అది యుగధర్మం! వెధవ ముండలు పెళ్ళిచేసుకుతీరాలి. అది యుగధర్మం. ఇంకో చిత్రం చూడండి. ఈ సనాతనులు కృతయుగధర్మం తెచ్చిపెట్టాలని చూస్తారు

చూశారూ? వాళ్ళంతా లోపల అమిత పాపాత్ములు. వాళ్ళకెప్పుడూ ఇంకోళ్ళ యావే! ఇప్పుడూ మీవంటి పుణ్యాత్ములకు సరోజిని పెళ్ళిచేసుకుంటే దిగులా? మీరూ సంతోషిస్తారు, ఒక బుద్ధిమంతురాలు సుఖపడుతున్నది కదా అని. అవునంటారా, కాదంటారా?"

"అది సుఖపడితే నేను సంతోషించనా? నాకు కూతుళ్ళు లేరూ! నా కూతురొకటీ అదొకటీనా నాకు?"

"యాజులు చూడండి మరి! ఎవరు ఏ పెళ్ళి చేసుకున్నా తన ధర్మం చెడదు కదు. ఎవరన్నా సుఖపడుతుంటే ఆయనకు ఏడుపు! అనకూడదు కాని ఆయన సరోజిని వంక అఘోరకంగా చూస్తాడుట, చూపులతో శరీరమంతా తడిసినట్టవుతుందిట పాపం, సరోజినికి!"

శంకరయ్య మళ్ళీ నిర్ఘాంతపోయినాడు-నమ్మలేకపోయినాడు. "యాజులే? కాకపోయినా ఆ ముండాకొడుకు అందరివంకా అట్లాగే చూస్తాడు. ఏమో, ఎవరు చెప్పగలరు? బ్రహ్మకైన పుట్టు రిమ్మతెగులు!"

"మీ కాశ్చర్యంగా ఉన్నట్టుంది. నేనింకా ఈ ఊళ్ళో నాలుగు రోజులుంటాను. మీకు స్వయంగా చూపిస్తాను కాదూ ఆయన ప్రకృతి!" అన్నాడు ప్రసాదరావు.

*　　　*　　　*

సరోజినీ, ప్రసాదరావూ ఎవరి ఆలోచనలో వారు ఉండిపోయినారు.

"నీ దుర్మార్గం కొంచెం దుస్సహంగా ఉందిరా. ప్రసాదరావూ!" అంది సరోజిని.

"నీకు తెలియకపోతే నీవు ఊరుకోరాదుటే! ఆడదానివి నీకీవిషయాలేం తెలుస్తై? రెండు అబద్ధాలాడి ఒక కొంప నిలబెట్టమన్నారు. ఇప్పుడున్న పరిస్థితుల్లో నీ పెళ్ళి ఐన మరుక్షణం మీ నాన్నను యాజులు వెలివేయించగలడు. ఆ గాడిద కోరలు తీసేసికాని నే నిక్కణ్ణించి కదలను. తెలిసిందా? నీకేం? నీ దారిన నువ్వు నీ మొగుడితో కులుకుతూ చక్కాపోతావు. ఇక్కడ పెదనాన్న పాట్లు కుక్కలూ, నక్కలూ పడవు. యాజుల్ని హతమార్చుతాను."

"అదంతా బాగానే వుంది. పాపం, ఈ పిచ్చివాణ్ణి నువ్వు గోల చేస్తుంటే నాకు కష్టంగా ఉంది."

"శంకరయ్యా?....మన చేతికి వజ్రాయుధం దొరికింది. దాన్ని ఉపయోగించుకోవద్దంటావేం? నా అవసరం కొద్దీ ఈ ఆయుధాన్ని నేను పట్టుకోడానికి అనువయిన పిడి వేసుకుంటున్నాను. తప్పా?"

"ఏమో, సాటి మనిషిని గురించి చేతి కర్రను గురించి మాట్లాడేటట్టు మాట్లాడితే తప్పో రైటో నేనేం చెప్పను?"

"ఓఁ! నీ సెంటిమెంట్సు ప్రస్తుతం కట్టిపెట్టు. నేను శంకరయ్యకేమీ అప కారం చెయ్యబోవటం లేదు."

* * * *

లచ్చయ్యగారి ఇల్లు వదిలిపెట్టిన తరువాత శంకరయ్య పారవశ్యంలో తన కోసం అరుగుమీద కనిపెట్టుకుని ఉన్న యాజులు మాటే మరిచిపోయి యెకా యెకి కొంప చేరుకొన్నాడు. అతగాడి ముఖారవిందం కోసం నిరీక్షించి నిరీక్షించి విసికి యాజులు తూర్పు పొలం వెళ్ళాడు.

మర్నాడు ఉదయం ఇద్దరు బ్రహ్మచార్లు శంకరయ్య చెరొక చెయ్యీ పట్టు కుని యాజులు గారింటికి నడిపించుకుంటూ వచ్చారు. తానీషావద్దకు తీసుకు రాబడుతూ రామదాసు రాముణ్ని గురించి పలుకుతూ వచ్చినట్లు శంకరయ్య ఎవరికీ అర్థం కాకుండా 'గాంధీ మహాత్ముని' గురించి ఏవో అరుస్తూ వస్తున్నాడు. మధ్య మధ్య 'నే చెప్పలా?' అని దబాయించి అడుగుతున్నాడు. 'అన్నీ చెప్పావులే!' అంటున్నారు బ్రహ్మచారులు.

యాజులు బ్రహ్మచార్లను వాళ్ళపని చూసుకోమని పంపించి, "ఏంరా, శంక రయ్యా! ఏం చేసుకొచ్చావు?" అన్నాడు.

"పనయితే చేసుకొచ్చాను. అంతా చెప్పమంటే నేను కూడబలుక్కో లేను. నువ్వడుగు; నేను చెప్పకపోతే అప్పుడను!"

"ఆ కుర్రవాడిది ఏ వూరు?"

"అదేదో చెప్పాడమ్మా! పట్నం. అదుగదీ! పట్నం!"

"పట్న మేమిటి?"

"అవునూ! పట్నంలో ఆనర్సు చదువుతున్నాట్ట!"

"ఆనర్సేమిటి?"

"ఆఁ! నాకు తెలుసేడుచునా, ఏమన్నానా?"

"ఇంతకూ వా డే వూరి వాడంటే పట్నమంటా వేమిరా?"

"అదే చెప్పాడు మరి!"

"బాగుంది! ఇక్కడి కెందుకు వచ్చాట్ట?"

"అదేదో—ఆఁ! మనల్ని అందర్నీ చూడటానికి వచ్చానన్నాడు."

"హోరి పిడుగా!"

"నా మాట నమ్మకపోతే నువ్వే వెళ్ళి అడగవచ్చును!"

"నిన్ననటంలేదు లేవోయ్! వాడు నీవంటివాళ్ళను పదిమందిని కలిసి అపో సనం పుచ్చుకునేట్టున్నాడు. అయితే యింతకూ ఏమంట్రాడ్రా వాడూ? అదీ వాడూ వెకవెక లాడుతున్నారా?"

"అట్లా అడుగు చెబుతాను! వాళ్ళిద్దరూ తప్పకుండా పెళ్ళి చేసుకుంటారు.

ఆ మాట ఆ కుర్రవాడే చెప్పాడు ! పైగా దాంట్లో తప్పులేదని కూడా ఋజువు చేశాడు !"

"ఛీ, భ్రష్టుడా !"

* * *

యాజులు అవస్థ వర్ణనాతీతంగా ఉంది. లచ్చయ్యగారింటికి వచ్చిన కుర్ర వాడి పేరు మాత్రం ఎట్లాగయితేనేం బయటపడ్డది. ఆ పైన ఒక్క నలుసయినా తెలియలేదు. తీరా సమయానికి గ్రామంలో లచ్చయ్య భార్యకూడా లేకుండా పోవట మేమిటి—తన కర్మం కాకపోతే ! ఆవిడ ఉంటే ఏ ఇల్లాలి ద్వారానయినా బయటికి లాగవచ్చును—ఆ కుర్రవాడెవరో; వాడికి లచ్చయ్యగారింట ఏం పనో, వాడూ ఆడీ (సరోజిని) అస్తమానమూ వెక వెకలూ పకపకలూ పడటానికి హేతువేమిటో ఇత్యాది వివరాలు.

పోనీ లచ్చయ్యనే నిలవేసి అడుగుదామంటే ఆ కుర్రవాడెప్పుడూ లచ్చయ్య వెంట ఉంటూ లచ్చయ్యను పలకరించినప్పుడల్లా తనే అందుకుని చావ గొట్టేస్తాడు. అతడి మాటలు బొత్తిగా అర్థంకావు. తెలుగో అరవమో కూడా తెలియదు. పైగా అతను మాటాడుతున్నంత సేపూ ఇంకొకరి మాట చొరనివ్వడు.

శంకరయ్య,—పిచ్చి ముండాకొడుకు - ఎందుకూ కొరగాకుండా ఉన్నాడు.

ఆ కుర్రవాడు వచ్చి అప్పుడే మూడు రోజులయింది. వాణ్ణి గురించి తెలుసు కోవలసింది చూడబోతే బోలెడుంది. తెలుసుకొన్నది బొత్తిగా ఏమీలేదు.

ఈ మనోవ్యాధి చాలనట్టు శంకరయ్య కిందటిరాత్రి ఇంకో విశేషం కూడా చెప్పి వెళ్ళాడు— ఎంత మటుకు నిజమో! ఆ ప్రసాదరావూ ఈ సరోజిని బయటి గదిలో పక్క పక్కగా మంచాలు వేసుకుంటూ పడుకుంటారుట. ఇదే నిజమయితే— నిజమని రుజువు చెయ్యగలిగితే— లచ్చయ్య భరతం పట్టించవచ్చును. ఔరా! తమ అందరి కళ్ళల్లోనూ ఇంత తాల్చినకారం కొట్టి, ఇంట మిండడిని తెచ్చిపెడతాడా లచ్చయ్య? ఊరు గొడ్డుపోయిందనుకున్నాడా?

ఆ రాత్రే ఈ విషయ మేమిటో తేల్చాలని పట్టుపట్టాడు యాజులు. ఇంకొ కర్ని మద్దతుగా ఉంచుకుంటే సాక్ష్యం ఉంటుందని ఆలోచన తట్టింది. కాని కన్నంలో దొరికే దొంగకు ఏ సాక్ష్యం కావాలి కనక ? ఒకవేళ ఇంతాజేసి ఏమీ లేకపోతే రెండో వాడితో చిక్కుంటుంది— అని యాజులు తను చెయ్యదల్చుకున్న కాస్త అన్వేషణా స్వయంగానే చేద్దామనుకున్నాడు.

* * *

రాత్రి పదిన్నర అయింది. వీధి నిర్మానుష్యంగా ఉంది. అంతవరకూ అక్క డక్కడా అరుగులమీద చేరి ఆత్మస్తుతి కాకపోయినా పరనింద చేస్తున్న గ్రామస్తులు ఒక్కొక్కరే నిష్క్రమించారు.

గుడి మండపంమీద చీకట్లో ప్రసాదరావూ శంకరయ్యా కూచుని చాలా రహస్యంగా మాట్లాడుకుంటున్నారు.

"నేనూ సరోజినీ ఒక చోట పడుకుంటామని ఆ ముసలాడి కెందుకు చెప్పా వయ్యా?" అన్నాడు ప్రసాదరావు.

"అయ్యో! నేను చెప్పలా!" అన్నాడు శంకరయ్య.

"అయితే సరే! కొంపతీసి చెప్పావేమో అని అన్నాలే! ఎందుకంటే ఇప్పు డతడికీ సరోజినిమీద భ్రమ ఉంది కాదూ? అసూయపడతాడు, తెలియలే?"

"తెలిసింది" అన్నాడు శంకరయ్య నిట్టూర్పు విడిచి. అక్కడికి ఒక గండం గడిచింది. నోరుజారి అన్నాడు శంకరయ్య యాజులతో ఆ మాట. చెప్పలేదని ప్రసాద రావు నమ్మాడు కనుక ఫరవాలేదు అనుకున్నాడు. శంకరయ్య చెప్పినట్లు ప్రసాద రావు సులభంగానే గ్రహించాడు. అసలు అదే అతనికి కావలసింది కూడా.

"ముసలాడికి పిల్లదాని మీద భ్రమ ఎంత ఉందీ నీకు తెలీదు, తాతా! నీకు బహూశా ఈవేళే చూపించగలుగుతానేమోగా! తొందర ఎందుకూ?"

"నేను నమ్మలేకుండా ఉన్నా నబ్బా! యాజులు అగ్నిహోత్రం! అటువంటి వాడు కాడు!.... అయినా చూద్దాంగా!"

"అవును, తినబోతూ రుచులడగడం ఎందుకూ? ఒక్కరోజుకే తొందరపడకు. రెండు మూడు రోజుల్లోనే రహస్యం బట్టబయలు చేస్తాను.... ఎందుకూ? అ-డు-గో! మన యాజులు! భేష్! జాగర్తగా గమనిస్తూండు, ఏం చేస్తాడో! మాట్టాడకు."

యాజులు మెల్లిగా లచ్చయ్యగారింటి వైపు వచ్చాడు. వీధిలో ఎవరూలేరు. ఎటుపోయి ఎటువచ్చినా మంచిదని లచ్చయ్య ఇంటిముందు ఆగి వంగి అరికాల్లో ఏదో అంటినట్టు నటించి దులుపుకున్నాడు. ఎక్కడా ఏమీ అలికిడిలేదు. ఆయన మెల్లిగా లచ్చయ్యగారి అరుగెక్కి కిటికీ తలుపుల సందుగుండా గదిలోకి తొంగి చూడాలి. అదీ కార్యక్రమం. తీరా ఉపక్రమించుదా మనుకుంటుండగానే గుండెలు టపటపలాడటం మొదలుపెట్టినై. ధైర్యం చెయ్యాలని చూశాడు. లాభం లేకపోయింది. అరుగు ఎక్కవలసిన యాజులు అరుగుదాకా వెళ్ళి దానిమీద చతికిల బడ్డాడు. ఇంకా కొంచెం సేపటికి మిగతా కార్యక్రమం జరపటానికి తగిన సత్తా రావచ్చునేమో కాని ఇప్పటి కింతవరకే సత్తా ఉంది.

ఎక్కడో ఏదో చప్పుడయింది. యాజులు గుండె బద్దలయింది. దబ్బున అరుగుమీదినించి దిగి వీధి మధ్యకు వచ్చి రెండడుగులు వేసి ఆగాడు. ఏమిటీ పిరికితనం? తెగించి మళ్ళీ వెళ్ళి అరుగుమీద కూర్చున్నాడు. అంతవరకూ అదివరకు ఒకసారి చేసిన పనేగా! పైన ఏమి చేతామూ అని అనుమానిస్తుండగా గదిలో గాజుల చప్పుడయింది. ఎవరో ఆడది నిద్రమత్తున కొద్దిగా మూలిగింది.

ఇక సంకోచించి లాభంలేదనుకున్నాడు యాజులు. ఈ ప్రయత్నంలో తన గుండె పగిలిపోవటంవల్ల ప్రాణాలు పోయినాసరే గదిలో ఏమి జరుగుతున్నదో చూసి

తీరవలసిందే. లోకం యావత్తూ నిద్రావస్థలో ఉంది. తనకు రాగల ఆపద ఏమిటి? కుర్రవాడల్లె భయపడితే ఏం లాభం? తనకు యాభై తొమ్మిదో ఏడు! ఎవరన్నా చూస్తే ఏమనుకుంటారు? ఇప్పుడు తన వయస్సు ఏ పదో పన్నెండో ఉంటే బాగుండును!........

* * *

"ఇకరా! మన కిప్పుడా పెద్ద మనిషితో కొంచెం పని ఉంది! దిగు. చప్పుడు చెయ్యకు!" అంటూ ప్రసాదరావు చల్లగా మండపం మీదినించి వీధిలోకి జారి శంకరయ్యను కూడా దింపాడు.

యాజులు మనుష్యుల సందడికి వెనక్కు తిరిగి వీధివైపు చూస్తున్నాడు.

"ఎవరు వారు?"

యాజులు సరిగా అడుగెత్తు ఎగిరాడు. చప్పున అరుగుమీదినించి దిగి రోడ్డు మీద నుంచున్నాడు. తను చేస్తున్న పనికి ఇద్దరు సాక్షులు. ఒకడు ఆ గదిలో ఉండవలసిన ప్రసాదరావూ, రెండోవాడు పిచ్చిముండాకొడుకు. శంకరయ్యా!

"ఏహో! యాజులవారా! ఏదో పనిమీద ఉన్నారల్లే ఉంది. సరోజిని మేలు కునే ఉందేమో, తలుపు తట్టకపోయినారా?" అన్నాడు ప్రసాదరావు.

శంకరయ్యకి నాజూకులు తెలియవు మోట దెబ్బే తప్ప.

"అయితే, సిన్ను అరగంటనించీ గమనిస్తున్నాను. ఎందుకట్లా కాలుకాలిన పిల్లల్లే అరుగు లెక్కా, డిగా, లోపలికిచూడా, అటూ ఇటూ పరీక్షచెయ్యా— ఏమిటిది? ఏమిటి నీ ఉద్దేశం? నువ్వింత విడిచేసిన వాడివని నేను ఎన్నడూ అనుకోలేదు. ఛీ!"

యాజులు మాటాడవలసిన అగత్యం వచ్చింది. కాని ఆయన వేసిన గుటక వల్ల ఏం చెబుతున్నాడో సరిగా తెలియలేదు వినేవాళ్ళకు.

"అక్— నేనుక్— యాక్!"

ఇక లాభంలేదని యాజులు ప్రయత్నం మాని మౌనం వహించాడు. మాటా డినా మానినా గుటకలు తప్పలేదు.

"మీరుకూడా అట్లా అంటారేం, తాతగారూ! పెద్దవాడాయన చూస్తే తప్పేం వచ్చిందీ? ఆ గదిలో వుండేది సరోజినీయేగా!"

"పెద్దతనం బుగ్గయినట్టే ఉంది! ఏం చూస్తున్నావంటే గుడ్లుపెట్టుకు చూస్తూ మాట్లాడడేం?" అన్నాడు శంకరయ్య.

"ఆయన్నడగటం ఎందుకూ? ఇప్పుడే తేలుస్తాను. సరోజినీ!"

"ఎవరది?" అంటూ సరోజిని తలుపు తెరిచింది. ఒక చేత్తో కుచ్చెళ్ళు సర్దు కోవటంచూస్తే అప్పుడే బట్ట కట్టుకోవటం అయినట్టు కనపడుతున్నది. "నువ్వాటా, అన్నయ్యా? ఎక్కడికి వెళ్ళావు భోంచేసి?"

"ఇక్కడే మండపం మీద కూచున్నాం నేను శంకరయ్య తాతా— నువ్వు గదిలో ఏం చేస్తున్నావు?"

"బట్ట కట్టుకున్నాను, ఏం?"

"ఏం లేదులే! నీవు లోపలికి పదవే, అమ్మాయి! నాకింకా కొంచెం పనుంది."

ప్రసాదరావు సంతోషంతో పొంగిపోతున్నాడు. అతను పెద్ద నాటకం ఆడాడు. అందుకు అనేకమంది సహాయం చేశారు. ముందు పెత్తల్లీ, లచ్చయ్యగారి భార్యా ఊళ్ళో లేకుండా ఏర్పాటు చేసుకున్నాడు. ఆ తరవాత లచ్చయ్య ప్రసాదరావు ఫలానా అని ఎవరికీ తెలియకుండా నెగ్గించుకొచ్చాడు· తరవాత శంకరయ్య తన బుట్టలో చాలా ఒడుపుగా పడ్డాడు. సరోజిని తనవంతు వచ్చేటప్పటికి తన పోర్షను చక్కగా నటించింది. ఇంత నాటకం ఈ యాజులు ముండాకొడుకు పరాభవానికా? కాలాన్ని వెనక్కు తిప్పాలని చూస్తున్న మూర్ఖులలో ఈ యాజులు ఒకడు. ఇతడిచేత సరోజినీ, ఆమె తండ్రీ చాలా బాధపడవలసి ఉన్నారు.

ప్రసాదరావు పళ్ళు బిగబట్టి, "పెద్దవాడివై పోయినావు. ఇంకోణ్ణి ఐతే చీల్చి ఉందును, వెళ్ళు" అని ఉరిమాడు.

"చేసేది శివపూజలూ, దూరేవి దొమ్మర గుడిసెలూ! ఈ మొహానికి గాంధీ మహాత్ములు చాల్లేదుట. ధర్మాన్ని ఉద్ధరించేటందుకు అవతరించాడు— అవతారం!"

ఒక్కక్షణం యాజులుకు లోపలినించి ఉద్రేకం వస్తున్నది. దాన్ని ఎట్లా బయటపెట్టినా వెధవ కావటం తప్ప ఏమీలేదు.

తలవంచుకొని యాజులు ఇంటిదారి పట్టాడు.

ప్రసాదరావు ఆయనవంకే చూస్తూ "ఆ పరిస్థితుల్లో నేనైతే అంత గాంభీర్యంగా ఉండగలనా?" అనుకున్నాడు.

"ఏమిటి ఆలోచిస్తున్నావు?" అన్నాడు శంకరయ్య.

"ఏమీలేదు!" అంటూ అతను లోపలికి వెళ్ళి తలుపు వేసుకున్నాడు.

ముద్రణ : వినోదిని, నవంబరు 1935

# రంగయ్య తాతమీద తిరుగుబాటు

రంగయ్య తాత కరవై యేళ్ళు దాటినై. కాని గట్టిగా ముప్ఫైమంది ప్రాణుల పిలకలా ముసలాడి చేతిలో ఉన్నై. అందరమూ ఆ ముసలాడి చావుకోసం చూస్తున్నాంగాని, ఆ మొండిఘటం ఇంకా కొందర్ని చంపిగాని చావదు.

ఇప్పటి కారుగుర్ని పొట్టన పెట్టుకున్నాడు.... ఏమోలే, చచ్చినవాళ్ళే ధన్యు లనిపిస్తున్నది.

మా కుర్రకారు వాళ్ళను వొదిలెయ్యండి. మా ముందుతరం వాళ్ళు చూసు కున్నా దజనుమంది ఉన్నారుగదా, ముసలాడికి జుట్టునప్పగించి కూచున్నారుగాని ఏమీ చెయ్యలేక పోయినారే! నాకది ఆశ్చర్యంగా ఉంటుంది.

ఆ కథంతా తలుచుకుంటే ఓ నాటకం.

మా రంగయ్య తాత వాళ్ళు ముగ్గురన్నదమ్ములూ, ఇద్దరప్పచెల్లెళ్ళూనూ. మా ముత్తాత ఇరవై ఆరు శాస్త్రాలు చదివిన పండితుడూ, అగ్రహారీకుడూనూ. శాస్త్రా, కూస్తా, నాలుగొందల ఎకరాల ఆస్తి. ఆ మహా విద్వాంసుడు సంవత్సరానికొక దోవతుల చాపుకంటె మరేమీ కోరలేదు. ఆస్తి యావత్తూ సంసార్లకిచ్చి వాళ్ళేమిస్తే అదే పుచ్చుకున్నాడు.

'ఆహా! ఎంత ఉదార హృదయుడు!' అన్నారు లోకులు.

కాని ఆ ఉదార హృదయుడు చచ్చిపోతూ తన ఆస్తికి మూడో కొడుకయిన రంగయ్యను కాపలా పెట్టి మరీ చచ్చాడు. అప్పటికే రంగయ్య కర్కోటకుడనేది అగ్రహారమంతటా పాకిపోయింది. అది తెలిసే ముసలాడా పనిచేసి ఉండాలి.

రంగయ్య తన ఇద్దరన్నల్నీ ఏలాడు. పొలాలన్నీ తనే స్వయంగా మక్తాల కిచ్చి రైతుల్ని దిగ్బంధం చేశాడు. చెల్లెళ్ళని అల్లులకిచ్చి వాళ్ళని తెచ్చి తన ఇంటే ఇల్లరికం ఉంచి వాళ్ళ ఆస్తులు కాస్తో కూస్తో ఉంటే అమ్మించి ఆ పైకం తన దగ్గిరే జాగర్తచేశాడు. బావమరుదులకి చేతినిండా పని కలిపించి వాళ్ళకి వేరే సొంత సంపా దనలు లేకుండా చేశాడు. ఎవరికి కానీ కావలసినా రంగయ్యకు తెలియవలసిందే— రంగయ్య ఆమోదింపుతోగాని ఆ కానీ రాదు.

ఆచే లాయర్లతో మాట్లాడివస్తూ డబ్బు వడ్డీలకిచ్చి అణాబిళ్ళలమీద లోకులచేత సంతకాలు పెట్టిస్తూ ఉండటంచేత రంగయ్య పెద్ద వ్యవహర్త అనే పేరుండేది. లా ప్రకారం ఏది ఏమిటో రంగయ్యగారు చెప్పిందానికి తిరుగులేదు.

మా నాన్నల హయాంలో కొద్ది కలతలు బయల్దేరినై. కాని రంగయ్యతాత సణిగిన వాళ్ళతో, 'నా దగ్గిర లెక్కలన్నీ ఉన్నై. నాకు సెక్షన్లన్నీ తెలుసు!' అని అదరగొట్టుతూ ఉండేవాడు.

మా పెద్దల తరంలో సొంత సంపాదన లేర్పడినై. కాని ఎవరి మటుకు వారు తమ దగ్గిరే ఎక్కువ డబ్బుందనీ, ఆ సంగతి మిగిలిన వాళ్ళకి తెలిస్తే దిష్టి తగులుతుందనీ, ఓరికి తెలియకుండా ఓరు సంపాదనలు తీసుకుపోయి రంగయ్యతాత దగ్గిర దాచారు!

రంగయ్యతాత అందరి రోగాలూ కుదిర్చాడు. మా నాన్నల తరం వాళ్ళకి ఒకళ్ళకీ ఒక మంచి కొంప లేదు. అందులో నలుగురు వైద్య సహాయం లేక చచ్చారు.

'చావనీ. చచ్చేవాళ్ళకి మందుల ఖర్చు కూడా దేనికి?' అన్నారు.

ఆ తరంలోనే ఇద్దరాడవాళ్ళు కూడా చచ్చారు. ఒకతె మనోవ్యాధితో చచ్చింది. మరొకతె నూతిలో దూకింది.

విచిత్రమేమిటంటే మా రంగయ్యతాత పరిపాలన కింద ఒక్క అనుకూల దాంపత్యం లేదు. ఒక్క ఆడదానికి తగిన మొగుడుగాని, ఒక్క మగవాడికి తగిన పెళ్ళాంగాని రాలేదు.

ఇందులో రంగయ్య తాత తాలూకు పిల్లలూ, వాళ్ళ పిల్లలూ కూడా ఉన్నారు. అందరి గతీ ఒకటే అయింది.

ఇక మా తరం వచ్చింది. మా తరం వాళ్ళలో ఇద్దరు లేచిపోయి అడుక్కు తింటున్నారు. ఒకడు తబలా వాయించుకు బతుకుతున్నాడు.

మేం తనమీద తిరుగుబాటు చెయ్యటానికి ప్రయత్నిస్తున్నట్టు పసిగట్టి మాలో ఇద్దరు ముగ్గుర్ని రంగయ్యతాత చీలదీశాడు. వాళ్ళు అయిదు రూపాయలకీ పది రూపాయలకీ మమ్మల్ని రంగయ్య తాతకి అమ్మేశారు.

మా చదువులు రంగయ్య తాత చేతిలో ఉన్నై. మా తల్లులకి రంగయ్య తాతంటే హడలు. రంగయ్య తాతమీద తిరుగుబాటు చెయ్యటమంటే మాకు గృహ విచ్ఛిత్తితో సమానమైన విషయం.

ఒక ముసలాడి చేతులో మా ఇంతమంది ప్రాణాలూ ఉండటం తలుచుకుంటే ఏడుపొచ్చేది.

ముసలాడు చస్తాడు. మనం అందాకా కనిపెట్టుకుని ఉందామనుకుందాం. కాని ఈ లోపుగా మా పుణ్యకాలం వెళ్ళిపోతున్నది.

లాటరీవేసి ఎవరమో ఒకరం ముసలాణ్ణి హత్యచేసి ఉరి పడదామనుకున్నాం. కాని అది సాగలేదు. లాటరీ వేశాం కూడానూ. కాని లాటరీలో బయటపడ్డ వాళ్ళకి గుండె చాలలేదు.

రంగయ్య తాత బసీలో ఎన్ని మేడలు కొన్నాడో, ఎన్ని వందల ఎకరాలు కొన్నాడో మాకెవ్వరికీ తెలీదు. అందులో మాకెవరి కెంత హక్కున్నదో మాకు తెలీదు. మా ముత్తాత తన ఆస్తినంతా రంగయ్య కిచ్చిపోయినట్టు ఊళ్ళో పుకార్లు. దాని విషయం కాగితాలే మున్నదీ లేనిదీ రంగయ్య తాతకే తెలియాలి. ఇప్పుడు రంగయ్య తాలూకు ఆస్తిలో చాలా భాగం ఆయన స్వార్జితం కిందికి వస్తుంది. అది రంగయ్య ఏం చేస్తాడో ఎవరికీ తెలీదు. రంగయ్య స-గతి వాళ్ళకి, ఎప్పటికన్నా ఈ ఆస్తి మనదే కదా అన్న ధైర్యం ఉండి వాళ్ళు మా మిగిలిన వాళ్ళతో కలవకుండా ఉన్నారు.

అటువంటి ఆశలు లేనివాళ్ళం విడిపడదామా అంటే మా తండ్రుల ఆర్జనల తాలూకు డబ్బు రంగయ్య తాత దగ్గిర ఉంది; మంచిగా కాలం వెళ్ళబుచ్చితే చచ్చే లోపుగా మాకందరికీ ఆ డబ్బు వడ్డీతో సహా పంచియిచ్చి ఆశ్చర్యకరమైన పనిచేస్తాడేమోననే ఆశ కొందరికైనా ఉంది.

ఆఖరుకు మావాడొకడు బహిరంగంగా ప్రకటన చేశాడు.

"అబ్బాయిలూ, ఇది కేవలమూ డబ్బు సమస్య కాదు. నే నీ క్షణాన భౌతిక సిద్ధాంతాల కన్నిటికీ తిలోదకాల నిచ్చేస్తున్నాను. ఇప్పుడు ముఖ్యమైంది మన స్వాతంత్ర్యం; రంగయ్య తాత నించి విముక్తి. అడుక్కుతింటాం. కట్టెలు కొట్టుకుంటాం. కాని మన పెళ్ళాల్ని రంగయ్యతాత నిర్ణయించడు. మన యిష్టమొచ్చిన వాళ్ళని పెళ్ళాడి వాళ్ళతో ప్రేమగా కాపరం చేతాం. పుల్నీళ్ళయినా స్వతంత్రంగా తాగుదాం. ప్రపంచంలో మంచితనమూ, మానవత్వమూ ఉందీ; దాని తాలూకు గాలి పీల్చుకుందాం. ఈ పని అదివరకే మన వాళ్ళు కొందరు చేశారు. మనం కూడా ఆ పనే కలిసికట్టుగా చేద్దాం !" అన్నాడు.

ఈ ప్రకటన మాకు నచ్చింది. పూర్తిగా పదిమంది బయటి కొచ్చేశాం. తిండికి లేకపోవటం, ఎండ వానలకు తడవటమూ కూడా అనుభవించాం. కాని మా ఆత్మలకు విముక్తి కలిగింది. ఈ ఆనందం రంగయ్యతాత ఆస్తి పంచుకునే వాళ్ళ కెప్పటికిరాను? సంఘభావమా ? మా పదిమందిమధ్యా ఉన్నదాన్లో నూరోవంతయినా రంగయ్యతాత కింద వాళ్ళెరుగుదురా ? పదిమందిమి ! భౌతికంగా మటుకేం సాధించలేం గనుక ?

ముద్రణ : ఆనందవాణి, 24 సెప్టెంబరు, 1944
(స్వయం నిర్ణయసూత్రం అనే శీర్షిక కింద కథ పేరు ప్రచురితం)

# రంగయ్యా తాతగారి పరువు మర్యాదలు

రంగయ్యతాత లక్షాధికారి, వయోవృద్ధుడు, మహనీయుడు. ఊళ్ళో అంతా ఆయన్ని భయభక్తులతో చూస్తారు. గొప్ప గొప్ప వాళ్ళంతా ఆయన యొక్క సద్గుణాలు మెచ్చుకుంటారు.

"ఈ ప్రాంతాల ఆడి తప్పని వాడుంటే అది రంగయ్యా తాతగారే !" అని డిప్టీకలెక్టరుగా రెప్పుడూ అంటారు.

"ధనవంతు ణ్ణని ఆయనికేమీ అతిశయం లేదు" అని శిరస్తాదారుగారు చాలా ఎన్నిక చేస్తారు.

"అతిథుల్ని సత్కరించటంలో ఆయన తరవాతే యెవరైనా !" అని మేజ స్ట్రేటుగారు సాక్ష్యం ఇస్తారు.

"వితరణలో ఆయన చెయి మహా పెద్దది !" అని లోకలుఫండు ఇంజనీరు గారు ఒప్పుకుంటారు.

ఇంతమంది ఇన్ని విధాల యెన్నిక చేసిన మనిషిమీద ఆయన సంతానమే కత్తి కట్టిందంటే మావూళ్ళో వాళ్ళందరికీ కష్టంవేసినమాట నిజమే. రానురాను కుర్రకారు మరీ అధోగతిపాలు కావటానికి ఇదే తార్కాణం !

ఆయనమీద కత్తికట్టి కుర్రవెధవ లేమైనా బాగుపడ్డారా అంటే అదీ కనిపించ లేదు. ఒకడు తాతగారు బతికుండగానే ఆయన ఉన్న ఊళ్ళోనే కాఫీహోటల్లో ప్లేట్లు అందిస్తూ, పరువు తక్కువవాళ్ళ ఇళ్ళలో మకాం పెట్టాడాయె. ఇంకో మనవడు కంపెనీవాళ్ళకి హార్మోనియం వాయిస్తున్నాడాయె. మరొకడు, కుల గోత్రాలులేని వితంతువును పెళ్ళాడి ఆ మనిషిచేత పోషింపబడుతున్నాడాయె. ఇంకో అప్రయో జకుడు ఊళ్ళో ఉన్న మోటార్లూ, ఆయిల్ ఇంజన్లూ బాగుచేస్తూ మసిగుడ్డలతో తిరుగుతాడాయె.

ఇదేనా తిరుగుబాటు ? తిరుగుబాటంటే మొహంమీద కోపంవచ్చి ముక్కు కోసేసుకోవటమేనా ?

రంగయ్యా తాతగారి మనుమళ్ళలో ఒకణ్ణి పట్టుకుని నాలుగు ముక్కలూ ఝాడించి అడిగాను.

"నువు చాలా పొరపాటు పడుతున్నావు" అన్నాడు వాడు. "మేం తిరుగుబాటయితే చేశాంగాని మొహంమీది కోపంతో ముక్కుకోసుకున్నమాట

అబద్ధం. మా విధి మేం నిర్వర్తిస్తున్నాం. మా ఆత్మలని మేం రక్షించుకోవటమే కాకుండా, మా పొట్టలు మేం పోసుకుంటూ ఇంతకాలానికి జీవితంలో ఆనంద మేమిటో తెలిసికోగలిగాం.

"నామటుకు నేను కాఫీహోటల్లో పనిచేస్తాను. శరీరానికి తగినంత చాకిరి. పొట్టకు కడుపునిండా తిండి. నాపని అయిపోగానే హాయిగా వైట్‌రోజ్ సబ్బుపెట్టి చేన్నీళ్ళ స్నానం చేసి, మంచి ఇస్త్రీమడతలు వేసుకుని, జుట్టుకి వాసననూనె రాచి, మంచి సిగరెట్టు వెలిగించి ఏ సినిమాకో పోతాను. ఈ వూళ్ళో ఏ సినిమాకు గాని, నాటకానికి గాని, సర్కసుకు గాని నాకు టిక్కెట్టక్కర్లేదు. పన్నెండింటిదాకా షికార్లు కొట్టివచ్చి పడుకుంటే వెర్రినిద్ర పడుతుంది. కలకూడా రాదు. మళ్ళీ టంచ నుగా అయిదింటికల్లా లేచి పనిలో జొరబడతాను.

"నాకేమిటి లోటు? వెనకటి ఆశ్రమంలో నాకేమీ ఉండేది కాదు- అసంతృప్తి తప్ప. చేసేటందుకు పనిలేదు. తినేటందుకు తిండిలేదు. కాఫీకి అర్ధణా కావాలంటే రంగయ్య తాతకి తెలియాలి. సిగిరెట్టు కొనుక్కుందామంటే అసలే లేదు. ఎప్పుడూ సిగరెట్లు ముట్టకూడద! దరిద్రం మండా? రంగయ్య మనవడికన్న దరిద్రుడు లేడుగద! అందరికి నేనంటే హడలే— ఎక్కడ సిగరెట్టడుగుతానో, ఇప్పించమంటానో అని. ఇతరత్రా నేనంటే ఇష్టమైన వాళ్ళకూడా ఈ మూలంగా నేనంటే భయం! పేరుకు మటుకు రంగయ్య మనుమడు! లక్షాధికార్లబిడ్డ... దొంగతనాలు చేసేవాణ్ణి! ఇంటి డబ్బే అనుకో! అయినా దొంగతనానికి పాల్పడిం తరవాత నా మొహం దొంగ మొహమే!.... ఏ విధంగా చూసినా, నన్ను చూస్తే నాకే ఏవగింపుగా ఉండేది. రాత్రి పూట నిద్రపట్టేది కాదు. పడితే పీడకల లొచ్చేవి.... పైగా రంగయ్యతాత అజామా యిషీ! సినిమాకు పోవటానికి లేదు. పొద్దూకిన అరగంట లోపల ఇంటికి రావాలి. తొమ్మిదింటికల్లా నిద్రపోవాలి. డ్రిల్లూ!

"ఇంత ప్రాణాలు బిగబట్టుకున్నా ఎప్పుడో అప్పుడు రంగయ్యతాత గౌర వానికి హాని కలగనే కలిగేది.... సిగరెట్టు కాలుస్తుండగా ఎవడో పీనుగ చూడనే చూసేవాడు. ముసలాడికి చెప్పనే చెప్పేవాడు. ఇప్పుడే వెధవా చెప్పడు. కావలిస్తే ముసలాడి మొహానే పొగ విడుస్తాను....!

"మిగిలిన వాళ్ళు నా మాదిరిగానే బాగుపడి పోయినారు గాని చెడిపోలేదు. మాదా డొకడు మంచి ఇంజనీరు. వాడికే డిగ్రీలేదు గాని ఉంటే వేలకువేలు సంపా దించును. ఎంత కొత్త యంత్రమైనా పట్టుకురా— నిమిషంలో అమర్చుతాడు. వాడి లైనులో వాడికి గొప్ప పేరు వస్తున్నది. చూస్తూ ఉండు, వాడెంత పైకొస్తాడో!....

"అవును. ఇంకోడు సంగీతంలో పడ్డాడు. వాడిచేతుల్లో సుఖం ఉంది. ఆ మాట నేననటం కాదు— మంచి పాటగాళ్ళే అన్నారు. రంగయ్య తాతయ్య మీద తిరగబడిం తరవాత ఆరునెలల్లో వాడు మంచి హార్మొనిస్టయి కూచున్నాడు. లేసట్ట

యితే గోళ్ళు గిల్లుకుంటూ కూర్చుండవలసినవాడు. వాణ్ని సినిమావాళ్ళు తీసుకుంటు న్నారు. నెలకు నూటయాభై ఇస్తారుట. రంగయ్య తాత వాడికి నెలకి నూటయాభై దమ్మిడీలు కూడా ఇచ్చిన పాపాన పోలేదు....

"వెధవముండని పెళ్ళాడాడని అందరూ వాడిమీద పడి ఏడుస్తారు. ఆవిడ చేసిన మహాపాపం ఏమీలేదు. బతికుండగానే మొగుణ్ణి వదిలేసింది. వాడి సంగతి అందరికీ తెలుసు. పరువైన ఆడది ఎవతె కూడా వాడితో కాపరం చెయ్యదు. ధర్మాన వాడు చచ్చాడు. ఆ తరవాత మావాణ్ని పెళ్ళాడింది. పదెకరాల భూవసతి ఉంది. మావాణ్ణి కూచోపెట్టి మేపుతున్నది. అదిచూసి ఓర్వలేనివాళ్ళు ఆవిణ్ణి పిట్ట దంటారు. వీటిదైతే లేవదీసుకుపోవటాని కెవడైనా ప్రయత్నించడేం? రెండు సగ లున్నదాన్నే వదలలుకదా. ఆ మనిషిని వొదిలారే?.... అంతా వెధవ కబుర్లు! వాళ్ళిద్దరూ అన్యోన్యంగా ఉన్నారు. ఆ మనిషి చాలా మంచిది. చచ్చినా ఇంకోడి కేసి చూడదు. ఆ మాట ఒప్పుకోవటం ఇష్టంలేక అసూయకొద్దీ అడ్డమైన కూతలూ కూస్తారు. నా ఉద్దేశం, అటువంటి భార్య దొరికిన వాడెవడైనా అదృష్టవంతుడనే....!"

అంతా విన్నాను.

"ఇదంతా కాదననుగాని, అబ్బాయీ, నువొక పొరపాటు పడుతున్నావు. జీవితమంటే కడుపునిండా తిండీ, ఇష్టమైన వ్యాపకమూ, అనువైన పెళ్ళామూ- ఇంతే ననుకుంటున్నావు. ఇంతకన్న విలువైన విషయాలున్నై. మాట వరసకి చెబుతున్నాను. మీ తాతగారు ఆడితప్పని మనిషి, పేరుబడ్డ దాత. ఆతిథ్యం ఇవ్వ టంలో అసమానుడైన గృహస్థు-?"

నా మాట సాంతం కానివ్వకుండానే రంగయ్య మనుమడు గట్టిగా నవ్వి, "ఎవరు చెప్పారు నీకీ అబద్ధాలు?" అన్నాడు.

"డిప్టీ కలెక్టరుగారూ, ఇంజనీరుగారూ అబద్ధాలాడతారా? శిరస్తాదారుగారు కూడానా?.... ఆయన పరువు ప్రతిష్ఠల విలువ గ్రహించకపోబట్టే మీరంతా ఇట్లా చెల్లాచెదురై పోయినారు. ఇప్పటికైనా మీరు పశ్చాత్తాపపడి తిరిగివస్తే ఆయన ముసలిప్రాణం-ఏ క్షణాన హరీ అంటుందోమరి!-చాలా సంతోషిస్తుంది" అన్నాను.

రంగయ్య మనుమడు మళ్ళీ విరగబడి నవ్వి, "మా తాతకి పరువనేది ఉందని నువ్వనుకుంటున్నావు. ఉండొచ్చు; డిప్టీకలెక్టరుగారి దగ్గిరా, శిరస్తాదారు గారి దగ్గిరా ఆయన ప్రవర్తన సరిగానే ఉండొచ్చు. కాని మా తాతకి నిజంగా పరువూ పాడూ ఏమీలేదు. పరువున్నవాడు మూడేళ్ళనాటి పాతగుడ్డలు పిగిలి నందుకు చాకలాడికి డబ్బు విరగ్గోస్తాడా ? పంటలు పండక రైతులు అలోలక్ష్మణా అని ఏడుస్తుంటే బకాయిపడ్డ ధాన్యానికి పత్రాలు రాయించి పుచ్చుకుంటాడా ? కష్ట సమయంలో ఉండిన తన నౌకరీలోకి రాలేకపోయిన కూలివాళ్ళని పనిలో నించి తియ్యటమేగాక ఊళ్ళో వాడి కెవరూ పని ఇవ్వకుండాచేసి ఊళ్ళోనించి సాగ నంపుతాడా ? ఈ ఊరి అలగాజనంలో మా తాత చస్తే పండగ చేసుకోని

వాళ్ళంటారా ? దోపిడీచేసే దొంగవెధవలికి పరువు ప్రతిష్ఠ లేమిటి ? కష్టపడి పని చేసుకునే వాడికి పరువు ప్రతిష్ఠలూ మానాభిమానాలుగాని !

"నన్ను చూడరాదూ ? నేను చేసుకునేపని దాయను. నా సిగిరెట్లు దాయను. ఆఖరికి నా ముండను కూడా దాయను. కాని రంగయ్య నాకు తాత అనేది ఒకటే దాస్తాను, అదే నాకు తలవంపులు!....నేనేకాదు మా అందరికీ అంతే ! మా పాన కంలో పుడక ఆ ఒక్క ముసలాడే ! ఆయన పరువు ప్రతిష్ఠల సంగతి నాకు చెప్పావు గనక నా పరువు ప్రతిష్ఠల సంగతి ఆయనకి చెప్పు. ఆయన్ని త్వరగా చచ్చిపొమ్మను. ఆయన ఒక్కడే. మేం పదిమంది. ముసలాడు చస్తే పదిమందిమి సంతోషిస్తాం. ఆఖరుకు డిప్టీ కలెక్టరుగారయినా అట్టే ఏడుస్తారనుకోను !"

ఈ మాటలు వింటుంటే నాకేమనాలో తెలీలేదు.

"అబ్బాయీ, ఇదంతా నేను మీ అందరి శ్రేయస్సుకోరే చెప్పాను. గనుక మరో విధంగా అనుకోకు ! మీరంతా నిజంగానే సుఖంగా ఉంటే నేను మరేమీ మాట్లాడను. నా ఉద్దేశంకూడా మీరూ మీరూ సుఖంగా ఉండాలనే.... కాని మరొక్క విషయం అడుగుతాను చెప్పు; మీరంతా ఈ విధంగా నిరాధారపు జీవితాలు జీవిస్తున్నారు కదా; మీలో ఎవడైనా రెండు రోజులు పడకవేస్తే మీ గతేమిటి ? అదైనా ఆలోచించారా ?" అన్నాను.

రంగయ్య మనుమడు జేబులోనించి అయిదురూపాయల నోటొకటి తీసి, "ఆలోచించేటందు కేముందీ? ఇదిగో, ఈ అయిదు రూపాయలూ మావాడికొకడికి మనిఆర్డరు చెయ్యబోతున్నాను. వాడేదో ఖర్చులో ఉన్నానని రాశాడు. మిగిలిన వాళ్ళు కూడా తలా కాస్తా పంపుతారు. మాలో ఏ ఒకణ్ణీ మిగిలిన వాళ్ళం చూస్తూ, చూస్తూ చావనివ్వం....అసలు రహస్యం నీ కర్థం కాలేదు. మేం రంగయ్య తాతతో ఊరికే పోట్లాడి ఇవతలికి రాలేదు. శాస్త్రీయంగా ఆ ముసలాడి మీద తిరుగుబాటు చేశాం !" అన్నాడు.

"వెళ్ళిరా, బాబూ ! మీరే గెలిచారు, సందేహంలేదు" అంటూ నా దారి నేను పట్టాను.

ముద్రణ :
ప్రచురణ : కాలభైరవుడు కథల సంపుటిలో,
యువ బుక్ డిపో : మద్రాసు.

# అమ్మమ్మ

అన్నపూర్ణ అమ్మమ్మ నెరుగుదు. ఆవిడ డెబ్బయి రెండేళ్ళు బ్రతికి, అన్నపూర్ణ ఆరేడేళ్ళపిల్ల అయివుండగా పోయింది. ఆవిడ చచ్చినప్పుడందరూ ఆశ్చర్యంగా చెప్పుకున్నారు. యోగులకు వచ్చే చావన్నారు. ఆవిడకు జబ్బు చెయ్యలేదు. మంచాన్నపడి తీసుకోలేదు. ఒకనాడు మధ్యాహ్నము భోజనాలయాక. "నేను పడుకుంటున్నాను. పలకరించకండర్రా" అని పీట తలకింద పెట్టుకుని వసారాలో పడుకుంది. మళ్ళా లేవలేదు. సూర్యాస్తమయం లోపల దహనం కూడా అయిపోయింది.

అన్నపూర్ణకు అమ్మమ్మకన్న అమ్మే ఎక్కువ ముసలిదిగా కనబడేది. అమ్మమ్మకు ఒక్క పన్నూ ఊడలేదు. చత్వారం వచ్చి పోయిందట. సూదిలో దారం ఎక్కించేది. ఒక్క చెవుడు మాత్రం వుండేది. కాని ఎవరన్నా అరిస్తే మండిపడేది. మెల్లిగా మాటాడితే తెలుసుకునేది. అమ్మమ్మకు కళ్ళు కనపడవు. పళ్లు చాలా భాగం ఊడిపోయినై. శుక్లాలుతీసి కళ్ళజోడు పెట్టినాక అమ్మమ్మ క్కూడా కళ్ళు వచ్చినై. కాని తరువాత కొద్దిరోజులకే పక్షవాతం వచ్చి మంచానపడి తీసుకున్నది.

ఒకనాడు అమ్మ సందుకాయపెట్టెలో వస్తువులేవో సద్దుతుంటే అందులో ఒక ఫొటో కనిపించింది. ఆ ఫొటోలో అమ్మమ్మ అమ్మమ్మను ఒళ్ళోపెట్టుకుని కూచుని ఉంది. ఆ ఫొటోకేసి కాస్సేపుచూచి తనలోతాను నవ్వుకుంటూ "ఆ రోజుల్లో ఏం నగలు పెట్టుకునేవాళ్ళో !" అన్నది అమ్మ.

"ఏదమ్మా నన్ను కూడా చూడనియ్యవూ ?" అంటూ అన్నపూర్ణ అమ్మ చేతిలోనుంచి ఫొటో తీసుకుంది. అమ్మ చెబితే నమ్మాలిసిందేగాని ఆ ఫొటోలో అమ్మమ్మ గుర్తుపట్టేట్టు లేదు. ముక్కుకు పుడకలూ, బులాకీ, చెవులకు దుద్దులూ, పుడకలూ, మెళ్ళోకంటే, నానుపట్టెడా, జిగిని గొలుసూ, నడుముకు మువ్వా వడ్డాణమూ, చేతులకు మురుగులూ, దండకడియాలూ, కాళ్ళకు అందెలూ, కడియాలూ, మట్టెలూ ఉన్నై.

"ఈ ఫొటో తీసినప్పుడు అమ్మమ్మ కెన్నేళ్ళుంటాయమ్మా ?" అని అడిగింది అన్నపూర్ణ.

"పద్దెనిమిదో, పందొమ్మిదో ఉందవూ? అమ్మమ్మకి అయిదో ఏడు" అన్నది అమ్మ.

అదీ నమ్మశక్యంగాలేదు. అమ్మమ్మ నలభై ఏళ్ళదానిలాగా కనబడింది అన్నపూర్ణ కళ్ళకి. అమ్మమ్మ వళ్ళోకూచునే పిల్లలాగాలేదు. తనలాగే ఏ పదేళ్ళదో అనిపిస్తున్నది. తను ఇప్పుడు అమ్మ ఒళ్ళో కూచుని ఫొటో తీయించుకుంటే ఏమన్నా బాగుంటుందీ?

అన్నపూర్ణ ఆ ఫొటోను తీసుకుపోయి నాన్నకు చూపించింది.

"ఎక్కడ దొరికిందే ఇదీ? ఈమధ్య కనిపించకపోతే పోయిందనుకున్నా" అన్నాడు నాన్న.

ఇంతలో రాములన్నయ్య వచ్చాడు. "ఏఁవిటీ నాన్నా, అదీ?" అంటూ ఫొటో తీసుకున్నాడు. కాస్సేపు దానికేసిచూచి, "అమ్మమ్మా, అమ్మమ్మాకాదూ?" అన్నాడు.

"అవునన్నయ్యా. అమ్మ చెప్పింది. ఈ ఫొటోతీసి ఎన్నేళ్ళయిందంటావ్?" అన్నది అన్నపూర్ణ.

"అమ్మమ్మకి అయిదేళ్ళని కాబోలు చెప్పింది. అంటే 1898లో తీశారన్న మాట. తస్సాదియ్యా. అప్పటి ఫొటోగ్రాఫర్లే నయం. హైపో చక్కగా కడిగే వాళ్ళు. పీ.ఓ.పీ. పేపరయినా ఫొటో చూడు చెక్కు చెదరకుండా ఎట్లా ఉందో!" అన్నాడు అన్నయ్య.

"ఇదిగో పురుగు తినేస్తున్నది" అంటూ అన్నపూర్ణ ఒకమూల తినేసిన భాగం చూపించింది.

"అది ఫొటోగ్రాఫర్ తప్పుకాదు. మన తప్పు. దీన్ని రీ కాపీ చేయించి ఎన్‌లార్జి చేయిద్దాం. ఇట్లా ఇచ్చెయ్యి" అన్నాడు రాములన్నయ్య. అంతే ఆ తర వాత ఆ ఫొటో మళ్ళీ ఎవరికీ కనిపించలేదు.

* * *

అమ్మమ్మ పేరే పెట్టారు అన్నపూర్ణకు. అందుచేతనో, మరెందుకోగాని అమ్మమ్మను గురించి ఎవరేం చెప్పుకుంటున్నా అన్నపూర్ణ శ్రద్ధగా విని జ్ఞాపకం పెట్టుకునేది.

అమ్మ ఒకసారి అన్నది.... అమ్మమ్మ ఎన్నడూ గుడికిపోయిగాని దేవుడికి దణ్ణం పెట్టుకునిగాని ఎరగదట. ఆవిడ జీవితం దేవుడితో నిమిత్తంలేకుండానే జరిగిపోయింది.

ఒకసారి అమ్మ అమ్మమ్మని నిలవదీసి అడిగిందట..... "ఏఁ అమ్మమ్మా? నీ ఉద్దేశం దేవుడున్నాడనా, లేడనా?" అని అమ్మ అడిగితే "అందరూ ఉన్నా డనే అంటున్నారుగాదుటే! నేను మాత్రం చూచానూ?" అన్నదట. "అయితే నువు ఏడాది కొకసారన్నా గుడికిపోవేఁ?" అని అమ్మ అడిగిందట. "నాకు తీరికేదే" అన్నదట అమ్మమ్మ.

అయితే అమ్మమ్మకుమటుకు దేవుడంటే చాలా భక్తి. ఏవోస్తోత్రాలు చదివేది; ఏవేవో పూజలు చేసేది; పురాణాలు వినబోయేది; తరుచు గుడికివెళ్ళేది.

అమ్మమ్మకు లేని దైవభక్తి అమ్మమ్మకెట్లా వచ్చిందని అన్నపూర్ణ ఆశ్చర్యపడేది. అమ్మమ్మ మిన్నువిరిగి మీదపడినా చలించకుండా రాయల్లే ఉండేది. అమ్మమ్మకు ఎప్పుడూ దేన్నిగురించో ఆందోళనే.

అమ్మ మరోరకం. పూజలూ, స్తోత్రాలూ, గుడిప్రదక్షిణాలు లేవుగాని అమ్మకు దేవుడంటే నమ్మకం ఉంది. భయంకూడా ఉంది. ఒకసారి రాములన్నయ్యకు జబ్బు చేస్తే వైద్యం చేయించారు. వైద్యందారి వైద్యానిది జబ్బుదారి జబ్బుదీ అయింది. "ఏమండి ఏడుకొండలవాడికి మీదుకట్టనా?" అని అడిగింది అమ్మ నాన్నని.

"ఏమో, నీకు తృప్తి కలిగేట్టయితే కట్టు.... దేవుడు లంచాలకు పాల్పడతాడనుకోవడం నాకంత ఇషంలేదు" అన్నాడు నాన్న.

జబ్బులో కూడా రాములన్నయ్య, 'దేవుడూలేడు. గీముడూలేడు' అన్నాడు. అమ్మ అంకిళ్ళు నొక్కుకుని, 'నువ్వూరుకోరా, నీ పుణ్యం ఉంటుందీ' అన్నది.

తరువాత రాములన్నయ్యకు నయమయింది. అందరూ కలిసి తిరుపతి వెళ్ళనూ వెళ్ళారు, తిరుపతినుంచి తిరిగివచ్చిన తరువాత వెంకటేశ్వర సమారాధన చేస్తూ బంధువులందర్నీ పిలిచారు. అమ్మమ్మ వచ్చింది కాని ఆమ్మమ్మ రాలేదు.

"ఆవిడెందుకు వస్తుంది? ఆవిడకు ఏ పోలేరమ్మ జాతరంటేనో ఇష్టంగాని ఆపదమొక్కులవాడంటే సరిపడదులే" అని అమ్మమ్మ చెప్పింది.

ఆమ్మమ్మకు గ్రామదేవతల్లో నమ్మకం ఉందనివిని అన్నపూర్ణ ఆశ్చర్యపోయింది. ఈమాట వినగానే అమ్మమ్మమీద అన్నపూర్ణకి కొద్దిగా గౌరవం తగ్గింది. అవకాశం దొరికినప్పుడు ఆమ్మమ్మని అడిగిందికూడా 'ఏఁ, ఆమ్మమ్మ నీకు అంకాలమ్మా, పోలేరమ్మా అంటే ఇష్టమేటగా?' అంటే ఆవిడ నవ్వుతూ, 'వాళ్ళు ఊళ్ళో ఎప్పుడూ ఉండేవాళ్ళేగాదుటే? అభిమానం ఉండదూ?' అన్నది.

ఆమ్మమ్మ అంటే నాన్నక్కూడా గౌరవమే.

దేవుడిలో నమ్మకం ఉన్నవాళ్ళంతా దేవుడున్నట్టుగా ప్రవర్తిస్తున్నారూ? చాటుగా ఎన్ని వెధవపనులు చెయ్యటం లేదు? దేవుడు చూస్తాడన్న భయం ఉంటే అట్లా చెయ్యగలరా ? ఆ ముసలావిడ దేవుడిపేరు జపం చెయ్యకపోతే ఏఁ, దేవుడున్నాడన్నట్టే నడుచుకునేది. అదే కావలసింది" ... అనేవాడు నాన్న.

"అమ్మమ్మ నిజమైన భౌతికవాది, ఆవిడకి అవకాశం దొరికితే నామాదిరిగానే ఫిజిక్సు చదివి, రిసర్చిచేసి డాక్టరేట్‌కూడా సంపాదించి ఉండేది. ఆటువంటి మనిషికి దేవుడిలో నమ్మకం ఉండటానికి వీల్లేదు. డార్విన్ చూడు" అనేవాడు రాములన్నయ్య.

* * *

రాములన్నయ్యకు గొప్ప శాస్త్రవేత్త కావాలనీ ! ఎప్పుడు పడితే అప్పుడు "మా సైంటిస్టులు ఇది ఒప్పుకోరు. అది ఒప్పుకోరు" అంటుంటాడు. ఏవేవో పుస్తకాలు తెచ్చి చదువుతూ ఉంటాడు ! అందులో ఏవైనా బొమ్మలుంటే తన్న

పూర్ణకు చూపించి వాటినిగురించి చెబుతూ ఉంటాడు. అన్నపూర్ణకు అవన్నీ అర్థం కావు.

ఒకసారి రాములన్నయ్య ఒక పుస్తకం తెప్పించి అందులో చంద్రుడి బొమ్మ, ఇంకేవేవో బొమ్మలూ చూపించాడు. అందులో ఒక బొమ్మ దీపావళికి వెలిగించే విష్ణుచక్రమల్లే ఉంది. అయితే గుండ్రంగాలేదు; కోలగాఉంది. అదేమి టంటే అదొక బ్రహ్మాండమన్నాడు. ఇంకో బొమ్మ చూపించి అది అండాండమనీ, మరోబొమ్మ చూపించి పిండాండమనీ అన్నయ్య చెప్పాడు.

"మరీ నువ్వు దేవుడు లేడంటావుగదా ఇవన్నీ ఎవరు చేశారు ?" అన్నది అన్నపూర్ణ.

"వీటిని ఒకరు చేస్తారా ? వాటంతట అవే జరుగుతై, ప్రకృతి నియమం. సూర్యుడిచుట్టూ భూమి తిరుగుచున్నది. ఎవరూ దాన్ని తిప్పక్కర్లేదు. తిరిగే భూమిని ఆపటానికి ఏ భగవంతుడున్నా రావాలి. విత్తులోంచి చెట్టు పుడుతుంది. ప్రకృతి నియమం" అన్నాడు రాములన్నయ్య.

"ఒకవేళ పుట్టకపోతే? అప్పుడు నువ్వూ నేను పాతిపెట్టిన మామిడి టెంక మొలవలేదు. జ్ఞాపకం ఉందా ?" అన్నది అన్నపూర్ణ.

"దానికింకేదో ప్రకృతినియమం అడ్డుపడి ఉండాలి" అన్నాడు రాములన్నయ్య గంభీరంగా.

"ఈ నియమాలన్నీ దేవుడే చేస్తున్నాడేమో ?" అన్నది అన్నపూర్ణ.

"అదే పొరపాటు. దేవుడంటే మనిషి మాదిరిగానే ఉంటాడనీ, ఉంటే రెండు చేతులుంటాయని మనవాళ్ళ ఉద్దేశం. మనకుండే బుద్ధులే దేవుడికీ వుంటాయని మనం అనుకుంటాం. అయితే నీకొక సంగతి తెలుసా? ఒకప్పుడు భూమిమీద మనుషులే లేరు. ఇంకా అంతకుముందు చెట్లూ, చేమలూకూడా లేవు. ఇవాళ సూర్యుడిలో నిప్పు తప్ప ఇంకేమీలేదు. ఒకప్పుడు భూమి మీద కూడా అంతే. అసలు మనుషులే లేక పూర్వపు మనిషిలాంటి దేవుడుండేవాడని ఎట్లా అనుకోవటం?" అన్నాడు అన్నయ్య.

అన్నపూర్ణకు ఇదంతా రాములన్నయ్య కల్పనే అనిపించింది. కాని మనిషి లేనప్పుడుండిన జంతువులను గురించి అన్నపూర్ణ అన్నయ్యచేత చాలా విషయాలు చెప్పించుకుని విన్నది. ఒకప్పుడు ప్రపంచంలో పెద్దపెద్ద రథాలంతేసి బల్లులుండే విట. అవి పొడుగాటి తోకలు ఝాడిస్తూ రొచ్చులో గెంతుతూ ఆడుతూ ఉంటే భూకంపం వచ్చినట్టుగా ఉండేదిట. ఈ బల్లుల బొమ్మలు కూడా రాములన్నయ్య తరవాత తెచ్చి చూపించాడు. ఉక్కకూడా లక్ష్యపెట్టకుండా అన్నపూర్ణ ఇంట్లో దీపం ముందరకూచుని ఆ బొమ్మలన్నీ చూచింది.

"ఏమేవే, నువు దీపం ఆర్పి బయటకువచ్చి పడుకుంటావా ? నన్ను బయట తాళం వేసుకుని వెళ్ళమన్నావా !" అని అడిగింది అమ్మ. నడివేసవికాలం. అందరూ ఆరుబయట పడుకుంటున్నారు. అన్నపూర్ణ బలవంతాన పుస్తకం మూసి దీపం

ఆర్పేసి బయటికివచ్చి రాములన్నయ్య మంచంపక్కనే తన మంచంమీద పడు కున్నది.

రాములన్నయ్య మేలుకునే ఉన్నాడు. వెల్లకిలాపడుకుని నక్షత్రాలకేసి చూస్తున్నాడు.

"ఆరోజుల్లో సినిమాలుంటే బలే బాగుండేదికాదూ ?" అన్నది అన్నపూర్ణ.

"ఏ రోజుల్లో ?" అన్నాడు రాములన్నయ్య.

"ఆ పెద్ద పెద్ద బల్లులున్న రోజుల్లో, వాటిని ఎవరన్నా సినిమాతీస్తే మనం చక్కగా వాటిని చూచి ఉండేవాళ్ళం" అన్నది అన్నపూర్ణ.

"అప్పటికి మనుషులే లేరు. కామెరాలు లేవు. ఫిల్ము లేదు. అందాకా ఎందుకు ? అమ్మమ్మా వాళ్ళనాన్న సినిమా చూచి ఉండరు" అన్నాడు రాము లన్నయ్య. అతను కాస్సేపుండి, "ఆ కనబడే నక్షత్రాల మధ్య మన భూమి వంటిది ఉండి, అందులో మనుషులున్నారనుకో, వాళ్ళు భూమికేసి టెలిస్కోపులతో చూస్తే భూమిమీద ఆ బల్లులు కదులుతూ కనపడవచ్చు" అన్నాడు.

అన్నపూర్ణ అర్థం చేసుకున్నది. ఆ నక్షత్రాలనుంచి కాంతి మనదాకా రావటానికి ఒక్కోసారి కోట్లకొద్దీ సంవత్సరాలు పడుతుందిట. అంత దూరం నుంచి టెలిస్కోపులతో ఈ భూమిమీద జరిగేది చూడటం అసంభవం. ఆ సంగతి రాము లన్నయ్యకు తెలుసు. అయినా అన్నపూర్ణను తృప్తిచెయ్యటానికి అతను అట్లా చెప్పాడు. జనసామాన్యం కోసం శాస్త్రవిషయాలు రాసేవారి లక్షణాలు రాము లన్నయ్యలో కొన్ని లేకపోలేదు.

"ఏ నక్షత్రంలోనుంచన్నా చూస్తే అమ్మమ్మ చిన్నపిల్లగా ఇప్పుడు కని పిస్తుందా ?" అని అడిగింది అన్నపూర్ణ.

"ఓ !" అన్నాడు రాములన్నయ్య.

అన్నపూర్ణ కళ్ళు మూసుకుని కాస్సేపట్లో నిద్రపోయింది. ఆమెకు కలలో పెద్ద పెద్ద బల్లులు గెంతుతూ కనిపించాయి. అందులో ఒక బల్లి మెడ చాచుకుని అన్నపూర్ణవేపు వచ్చింది. దగ్గిరగా చూస్తే దాని ముఖం అమ్మమ్మ ముఖంలాగే ఉంది.

* * *

అన్నపూర్ణ స్కూలు ఫైనల్ పరీక్షల బరువు దించేసుకున్నది. ఈ పరీక్షలో పాసయినా, తప్పినా ఇక మరి చదువు లేదు. అప్పుడే ఆమె జీవితంలో ఒక యుగం అయిపోయి ఇంకో యుగం ప్రారంభం కాబోతున్నది. పెద్దవాళ్ళు సంబంధాలు చూస్తున్నారు.

అన్నపూర్ణకు సంబంధం చూడాలంటే అట్టే దూరం పోనవసరంలేదు. బంధు వుల బలగం చాలా ఉంది. అన్నపూర్ణకు ఈడయినవాళ్ళు ముగ్గురు నలుగురున్నారు. వాళ్ళలో ఎవరా అనేది తేల్చుకుంటే మూడు ముళ్ళూ క్షణంలో పడిపోతై. వాళ్ళ

కూడా నలుగురూ నాలుగు రకాలు. ఒకడికి చదువూ, తెలివీ ఉన్నాయి. ఒకడు అన్నపూర్ణకు ఈడూజోడూగా ఉంటాడు. ఒకడికి కాస్త మంచి ఆస్తి ఉంది. ఏ ఒకర్ని చేసుకున్నా మిగిలినవాళ్ళు కాస్త గునుస్తారు. ఎందుకంటే అన్నపూర్ణ చక్కనిపిల్ల. ఇంత బలగంలోనూ కనుముక్కుతీరు పిల్లలు ఏ ఇద్దరు ముగ్గురో మాత్రమే ఉన్నారు. ఎవరూ నొచ్చుకోకుండా ఏదో ఒక సంబంధం నిశ్చయించటానికి చర్చలు సాగుతున్నై.

రాములన్నయ్యకు ఈ సంబంధాలలో ఒకటీ నచ్చలేదు. నిజానికి అన్నపూర్ణకు కూడా ఏ సంబంధమూ నచ్చలేదు. కాని సంబంధం విషయంలో తల్లిదండ్రులు చెప్పినట్టు రాజీపడదామనుకుంది. కాని రాములన్నయ్య తన అభిప్రాయం చెప్పిన మీదట అన్నపూర్ణకికూడా ఈ సంబంధాలను తోసెయ్యాలనిపించింది.

అందరూ భోంచేస్తున్న సమయంలో నాన్న రాములన్నయ్యతో, "ఏరా ? అమ్మడికి ఎవరిని చేస్తే బాగుంటుందంటావు? సీతాపతి మంచి ఉద్యోగంలో ఉన్నాడు. సుబ్బారావుకు ఆస్తి ఉంది. లక్ష్మీకాంతం చూట్టానికి బాగుంటాడు" అన్నాడు.

రాములన్నయ్య వెంటనే సమాధానం చెప్పలేదు. అతను కాస్సేపుండి మాట్లాడటం మొదలుపెడితే అన్నపూర్ణ ఇంకేదో విషయం మాట్లాడుతున్నాడనుకుంది.

"పూర్వం కోతులు అడివిచెట్లమీదే ఉండేవి. నేలమీదికి దిగివచ్చేవికావు. అవి ఉండే చెట్లచుట్టూ రింగులాగా చెట్లు కొట్టేస్తే వాటిపని ఖైదులో ఉన్నట్టయి పోయేది. మన సంగతి అట్లాగే ఉంది. ఇంత ప్రపంచం ఉంది. రైళ్ళూ రేడియోలు ఉన్నై. ఉద్యోగాల కోసం జనం వేలకొద్దీ మైళ్ళు పోతున్నారు. మనం అమ్మడికి మొగుణ్ణి వెతకాలంటే మన మురికిగుంటలోనే వెతకాలి !" అన్నాడు రాములన్నయ్య.

"అయితే ఇంకేం, నువు మంచి సంబంధం తీసుకురా" అన్నాడు నాన్న.

"నాకోసం వస్తాడే సుదర్శనం ? వాడికిచ్చి చెయ్యండి" అన్నాడు అన్నయ్య.

"వాళ్ళు మన శాఖకాదే !" అన్నాడు నాన్న.

"ఏం శాఖో, ఏట్లోశాఖ. మా సైంటిస్టులకు ఈ శాఖల్లో నమ్మకంలేదు. ఒకప్పుడు మన పూర్వీకులు చెట్లమీద ఉండేవాళ్ళు. ఇంకా అంతకు పూర్వం మడుగుల్లో ఉండేవాళ్ళు. ఇంకా పూర్వం నీళ్ళల్లో ఉండేవాళ్ళు. మనం ఏశాఖ ?" అన్నాడు రాములన్నయ్య ఉపన్యసించేవాడల్లే.

ఆ ప్రస్తావన అక్కడితో ముగిసింది.

ఆ సాయంకాలం అన్నపూర్ణ, వసారాలో కూచుని జడవేసుకుంటుండగా ఒక ముసలివాడు వచ్చాడు. మోకాళ్ళదాకా ఒక కొల్లాయిగుడ్డ కట్టుకున్నాడు. పైన ఇంకో కొల్లాయిగుడ్డ వేసుకున్నాడు. చంకలో ఏదో మూట ఉన్నది. పుస్తకంలో చూచిన జవాను మనిషిమల్లే కనిపించాడు అన్నపూర్ణకు.

"మహాలక్ష్మి ఉందిటరా ?" అన్నాడాయన అన్నపూర్ణకేసి చూడకుండా దిక్కులు చూస్తూ.

"అమ్మా" అని కేకవేసింది అన్నపూర్ణ. అమ్మ లోపల్నుంచి వచ్చి "నువ్వా, తాతయ్యా ? రా రా, ఎప్పుడు రావటం!" అంటూ అమ్మ ఆయన్ని పరామర్శించింది.

ఆయన అమ్మమ్మ ఆఖరు తమ్ముడట. అమ్మ చెప్పింది. ఆ రాత్రి అమ్మ ఆయనకోసం మడికట్టుకుని వంట చేస్తుంటే చూస్తే అన్నపూర్ణకు ఏనక్షత్రం నుంచో చూస్తూన్నట్టుగా కనిపించింది. నాన్నకోసం అమ్మ ఎప్పుడూ మడి కట్టుకోదు.

భోజనాల దగ్గిర అన్నపూర్ణ పెళ్ళి విషయం వచ్చింది.

"ఇది అచ్చు మా అన్నపూర్ణక్కయే. దాన్ని అడక్కుండా ఏ సంబంధమూ చెయ్యకండి. మా అన్నపూర్ణమ్మ కిట్టాగే చిన్నప్పుడు మా నాన్న సంబంధం ఏదో చూస్తే చెప్పకుండా ఇంటినుంచి బయలుదేరిపోయింది" అన్నాడు జావా మనిషి.

ఈ మాట వింటూంటే అన్నపూర్ణకు అమ్మమ్మమీద ఎక్కడలేని గౌరవమూ వచ్చింది. తన కిష్టంలేని సంబంధం చేస్తే తానుకూడా అమ్మమ్మలాగే ఇంట్లోనుంచి వెళ్ళిపోదామనుకుంది అన్నపూర్ణ.

ముద్రణ :

ప్రచురణ : కొడవటిగంటి కుటుంబరావు కథల సంపుటిలో,

జయా పబ్లికేషన్స్ : విజయవాడ.

# తల్లి ప్రేమ

గుడ్ల నీళ్ళు కుక్కుకుని ఏడుస్తున్నది. తన ఏడుపే తనది. నేను పావు గంట నిలబడ్డా నాకేసి చూడలేదు.

"ఏవమ్మా, ఏడుస్తున్నావు ?" అన్నాను.

"ఏడవకేం చెయ్యను. నాయనా, నా బంగారు నాయనేం చేస్తున్నాడో ! ఎట్లా బతికున్నాడో ! నేను లేకపోతే వాడికి ప్రపంచమే లేదు. ఒక్క క్షణం కనిపించక పోతే కాలుగాలిన పిల్లెల్లే తిరిగేవాడు. పాపిష్టి చచ్చిందాన్ని, విసుక్కునేదాన్ని. నేను లేకుండా ఇంతకాలం ఎట్లా ఉన్నాడో !"

"ఆడవాళ్ళింత అర్థాయుస్సుగా ఉన్నప్పుడు తల్లుల్లేని వాళ్ళకి తక్కువేమిటి ? వాళ్ళతో బాటే నీ కొడుకునూ !"

"అయ్యో, మా వాడందరివంటివాడు కాదు, నాయనా, వొట్టి అర్భకుడు. వారానికోసారి జ్వరం వచ్చేది."

"నీకు పెంపకం చాతకాకనేమో ! నీ సహాయం లేకుండా నీ కొడుకారోగ్య వంతుడయినాడేమో."

"ఓరి పుట్టుకుంకా ! నీకు తల్లి ఉంటే ఇట్లా మాట్లాడవు !"

"సరే పోనియి. నివ్వుంటే నీ కొడుక్కు ఇంకేం చేసుకునే దానివి ?"

"నయానో భయానో ఇంత చదువు చెప్పించుకునేదాన్ని. మావాడికి చదు వంటే పడేదికాదు. పిల్లలకు చదువంటే భయం కాదా ఏమిటి ?"

"నీ కొడుక్కిదే నూరిపోశావా ?"

"నూరి పోసేదేమిటి ? వాడికి తెలీదా ? అక్షరాభ్యాసం రోజునే బావురుమని ఏడిచాడు నా తండ్రి."

"అప్పటికే వాణ్ణి తరిఫీదు చేశావు గామాలు."

"నేనా ? నీ నోరు పడా...బ....డికి పోతాడని రోజూ కానీ అర్థణా ఇచ్చే దాన్ని. వాడు మరీ మొండితనం చేస్తే అణా బేడా కూడా ఇచ్చేదాన్ని. అవన్నీ తీసుకుని కూడా వాడు బడికి పొయ్యేవాడు కాదు."

"సందేహ మేముందీ....నీ కొడుక్కు ఇంకా ఏం చేసుకునే దానివి ?"

"తల్లినైన తర్వాత ఏం చేసుకోలేను. అసలే వాడు దొంగతనాలూ, అల్ల రులూ మరిగాడు. ఆ నెపం మీద అందరూ వాడిమీదికి ఒంటి కాలిమీద వచ్చేవాళ్ళే-

వాళ్ళ పిల్లలంతా బుద్ధిమంతులైనట్టు! నేనుంటే నా బిడ్డణ్ణి ఆదుకునేదాన్ని.... నా తండ్రి కాకులచేత ఎన్ని మాటలు పడుతున్నాడో, ఎంత బాధ పడుతున్నాడో!"

"ఓ వేళ నీ కొడుకు మారాడేమో - నువు ఇవతల పడ్డ తరువాత! ఇప్పు డంవరి వంటివాడే అయినాడేమో!"

"ఓరి మాలకాకి! నీ మాటలు చూస్తే మండుకొస్తున్నది. నా కొడుకట్లా ఒక్క నాటికి మారాడు!"

"నీ ఆత్మ విశ్వాసం మట్టుకు చాలా గొప్పగా ఉంది."

"అంటే?"

"ఎందుకులే పోనీ!....ఇంకా ఏం చేసుకుని ఉండేదానివి కొడుక్కి?"

"అన్నిటికన్నా ముఖ్యంగా, పెళ్లాంమాట అత్తమామల మాట వినకుండా చేస్తి ఉండేదాన్ని."

"ఏం వింటే?"

"వింటే ఇంకెందుకన్నా పనికొస్తాడా?"

"ఎట్లాగూ ఎందుకూ పనికిరానివాణ్ణే కంటివిగా?"

"ఇక అంతేనా? కాస్తన్నా నామాట విని బాగుపడతాడా? అత్తవారన్న తర వాత పనికొచ్చేమాట చెబుతారా?"

"ఏమో. మొత్తంమీద నువు దాటిపోవటమే నీ కొడుక్కి మేలయింది.చదువు కున్నాడు. బుద్ధిమంతు డనిపించుకున్నాడు. ఉద్యోగం సంపాదించుకున్నాడు. రాయల్లె ఆరోగ్యంగా తయారయినాడు, పెళ్ళి చేసుకున్నాడు. పెళ్ళాం ప్రేమ సంపాదించాడు. పెళ్ళాన్ని పోగొట్టుకున్నాడు. అన్నీ అయిపోయినై. విచారించకు. అట్లా వెర్రిగా చూడకు-నేనే నీ కొడుకును. నిన్ను చూడటానికి రాలేదుగాని.- చూసి నందుకు సంతోషం కలగలేదు. వెళ్ళొస్తా!"

ముద్రణ : 10 డిసెంబరు 1944, ఆనందవాణి

# తండ్రిప్రేమ

బోనులో పులిలాగా పచారు చేస్తున్నాడు. జుట్టు రేగి ఉంది. మొహం కంది ఉంది. మధ్య మధ్య ఆంబోతల్లే గట్టిగా శ్వాస విడుస్తున్నాడు. పిడికిళ్ళు బిగబట్టి పళ్ళు పటా పటా కొరుకుతున్నాడు.

"చాలా ఇబ్బందిలో ఉన్నట్టున్నారే?" అన్నాను.

"వాణ్ణా?" అన్నాడు కళ్ళు పెద్దవిచేసి, "వాణ్ణి దుంపనాశనం చేస్తాను. వాడి శ్రాద్ధం పిల్లులికి పెడతాను. వాణ్ణి ఉప్పుపాతర్లో ఊరేసి గద్దలకి మాధాకవళం వేస్తాను."

"ఎవర్నో, అల్లుణ్ణి దీవించినట్లు దీవిస్తున్నారే?"

"వాణ్ణే! ఇంకెవర్ని?"

"ఏం చేశాడేవిటి?"

"ఏం చేశాడా?......" ఆయన నోట మాట రాలేదు. "నా కూతుర్ని చేసుకున్నాడు. దాన్ని అనుభవిస్తున్నాడు, దానికి పిల్లల్ని కంటున్నాడు!.... నా కూతురు! పువ్వులాంటిది! దానికోసం అప్పుచేసి ఎంత కోమలమైన బట్టలు కొన్నాను. దానికేసి ఎవరూ మొహం చిట్లించటానికి లేకుండా చూశాను. దాన్ని ఎవరూ తప్పుపట్టటానికి వీల్లేకుండా చేశాను. అది రాణి! దేవత! గంధర్వస్త్రీ!"

"పాపం ఒక్కతే కూతురు కాబోలు, మీకంతగా అనిపిస్తుంది."

"ఒక్కతేమిటి? నలుగురున్నారు. భ్రాష్టం మొహాలు. వాళ్ళు ఎదట కనిపిస్తే తన్నాను. అందులో రెండోదాన్నీ మూడోదాన్నీ మొహం చెక్కేసి రక్తం చూడ బుద్ధయేది. వాళ్ళు, నా కడుపున ఎందుకు పుట్టాలి—"

"పుట్టలేదనుకుంటానే!"

"నా ఆఖరు కూతురొకత్తే చాలదా? వాళ్ళకి తగినశాస్తే చేశాను. వాళ్ళకి బట్టలివ్వలేదు. తిండికూడా పెట్టలేదు.... అసలు వాళ్ళవి ఎప్పుడూ ఏడుపు మొహాలే! నా ఆఖరు కూతురు - నా చిలక - నా గోరింక - నా మామిడి పండు - నా ముత్యాల మూట—"

"కానివ్వండి కానివ్వండి."

"దానికి నేను తప్ప ప్రపంచంలో ఇంకోపురుగు - ఈగ - దోమ - పేను లేకుండా చెయ్యటానికి నా శక్తి అంతా ధారపోశాను. అది మిగిలిన వాళ్ళని బురద

మట్టల్ని చూసినట్టు చూస్తుంటే నాకెంతో ఆనందంగా ఉండేది. అది నన్నే ఓ వెం-
అణువుకింద చూసేది. తప్పేముందీ? అది రాణి, దేవత, కిన్నరి! ...

దాన్నీ నన్నూ వేరు చెయ్యటానికి దానిపెళ్ళి చెయ్యమన్నారు. చచ్చినా చెయ్యలేదు—"

"మరి మీ అల్లుడు?"

"విను!........ రజస్వలానంతర వివాహాలంటే నాకు హడల్! అయినా నా చిలుకకోసం దానిక్కూడా! పాల్పడ్డాను.... దానికి పదిహేడేళ్ళొచ్చినై! పద్దెనిమిదీ, పంధొమ్మిదీ!.... ఆహా! ఏమి దాని శరీరం! ఏమి దాని అందం.... పెళ్ళిమటుకు చెయ్యలేదు. చచ్చినా చేసిఉండను. నేను రెండు రోజులు పొరుగూ రెళ్ళితే, నేనొచ్చే టప్పటికి నా బంగారుబొమ్మ పెళ్ళిపీటలమీద కూచునిఉంది. దాని ప్రక్కన ఓ రాక్ష సుడు కూచుని ఉన్నాడు.... ఆ రాత్రే గర్భాదానంట!....పురుగులు పడిపోతార్లే! ....

"ఏమిటే తల్లీ - నా బంగారు తల్లీ - అంటే నాతల్లి మొహం చిట్లించి 'కనపట్టంలా?' అంది.... ఆ రాత్రే నేను నూతిలో గెంతేశాను!"

"ఓవేళ మీ అమ్మాయికి నీమీద ఇష్టంలేదేమో? మిమ్మల్నిచూస్తే పరమ అసహ్యమేమో?"

"ఎవడ్రా, నువ్వు?—"

"అడిగారు గనక చెబుతున్నాను. నేనే అల్లుణ్ణి! ఆ రాక్షసుణ్ణి.... నా మీద చెయిచేసుకుంటె మక్కెలు విరగదంతాను!.... నీ బంగారపు చిలకని నేను ఏవిధంగా మనిషిని చేశానో తెలుసా? గుంజ కంటగట్టి పలుపుతో బాదాను. మాసిక వేసిన గుడ్డలు కట్టించాను. తిండిపెట్టక మాడ్చాను.... నమ్ము నమ్మకపో, నీ కూతురు మళ్ళా మనిషి అయింది. మనిషి అయింతరవాత ఇద్దరమూ గట్టిగా అర్నెల్లన్నా సుఖపడలేదు. దానికి ప్రేమంటే ఏమిటో తెలుస్తూ తెలుస్తూ ఉండగానే దాటి వచ్చే శింది; దానికోసమే వెతుకుతున్నాను. పాపిష్టివాడివి, నువు కనిపించావు!"

నా మాటలు మా మామ సాంతం వినకుండానే మూర్ఛపోయినాడు.

ముద్రణ : ౩ డిసెంబరు 1944, ఆనందవాణి.

# దయ్యం

అక్కడ దయ్యం ఉండేది. అందుకని ఆ ఇల్లు పాడుపెట్టారు. ఆ ఇంటో రాధ తల్లి చచ్చిపోయింది. రాధతల్లి దయ్యమయిందని అందరికీ తెలుసును. కాని, అంత మహాఇల్లాలును దయ్యమనటాని కెవరికీ నోరు రాలేదు.

రాధకు దయ్యమంటే భయమే, ఆ ఇల్లంటేనూ భయమే. ఆ ఇంటో ఉన్న దయ్యం పొరుగింటి మహలక్ష్మమ్మకు పట్టినప్పుడు చూసి రాధ భయపడి, ఒకరోజల్లా కన్ను మూసి ఎరగదు.

కాని, ఆ ఇంటోనే ఉంది అమ్మ. "అమ్మేదే" అని తను యేడ్చినప్పుడు, "ఆ ఇంటో ఉందమ్మా" అని అమ్మమ్మ చెప్పలా? అయితే ఆ ఇంటోనే దయ్యం ఉంది కదా, అమ్మకు భయంకాదూ? అన్నట్టు అమ్మకు భయంలేదు. తనకు చీకట్లో పోవటానికి భయం వేస్తే అమ్మ తోడు వచ్చేదికాదూ?

రాధకు ఒక్కసారి అమ్మను చూడాలనిపించింది. ఎవరన్నా చూస్తే కోప్పడతారు. అందుకని రాధ ఒకనాడు, ఒక రాత్రివేళ అమ్మ ఉన్న యింటికి, దయ్యం ఉన్న ఇంటికి బయలుదేరింది.

బిక్కుబిక్కుమనే ఆ ఇంటో అడుగు పెట్టినప్పుడు రాధకు భయ్యం వెయ్యలేదు. "అమ్మా!" అని పిలిచింది.

జవాబు రాకపోవటం చూసి, "నువ్వు లోపల లేవుటే అమ్మా!" అన్నది రాధ, అనుమానంతో.

"నా కోసం వచ్చావుటే, నాతల్లీ?" అన్నది రాధ.
"నీ కోసం వచ్చానే?" అన్నది రాధ.
"నేను నీ కోసం కనిపెట్టుకున్నానే!" అన్నది రాధ.
"ఇన్ని రోజులు నాకు కనపళ్ళేదేమే, అమ్మా?" అన్నది రాధ.
"నేను నీ కోసం ఇక్కడే ఉన్నానే!" అన్నది రాధ.
"నేను నీ దగ్గర పడుకోవద్దుటే, అమ్మా?" అన్నది రాధ.

"నిన్ను నిద్రపుచ్చుతాను రావే, తల్లీ!" అన్నది రాధ. మర్నాడు రాధకోసం అందరూ వెతికారు. ఆ దయ్యాల కొంపలో కటిక నేలమీద, ఆ దుమ్ములో బోర్లా పడుకుని గాఢ నిద్రలో కనిపించింది రాధ.

రాధను లేపి వాళ్ళవాళ్ళు, అక్కణ్ణించి తీసుకుపోయినారు.

"నేనమ్మ దగ్గిర పడుకున్నానే? నేనమ్మదగ్గిరే ఉంటానే!" అని మూడేళ్ళ రాధ పెనుగులాడింది.

"అయ్యో, ఇంకే మమ్మే! మీ అమ్మ చచ్చిపోయి దయ్యమయిందే!" అన్నారు రాధ బంధువులు.

రాధ అకారణంగా ఏడవటం మొదలుపెట్టింది. ఏం చేసినా ఆ ఏడుపు పోలేదు. అందర్నీ కొట్టడం మొదలుపెట్టింది. ఎవరో మల్లే మాట్లాడటం మొదలు పెట్టింది.

రాధకు దయ్యం పట్టిందన్నారు. వీభూది పెట్టించారు. ముగ్గులు వేయించారు. రాధ పోరు మానలేదు. తనకు చికిత్స చెయ్యటానికి వచ్చినవాళ్ళమీదా తన తల్లిని దయ్యమన్న వాళ్ళమీదా రాధ నిప్పులు కక్కేది. పళ్ళు పటపటా కొరికేది. ఏది దొరి కితే అది వాళ్ళమీద గిరాటు వేసేది.

వారంరోజుల్లో రాధ చిక్కి శల్యమయి మంచం పట్టింది. రాధ గొంతు వెలుగు రాచుకుపోయింది. హీనస్వరం పడ్డది. రాధ మంచి నీళ్ళు కూడా ముట్టటం మానేసింది.

మరో నాలుగయిదు రోజులకు రాధ అంతరించింది.

రాధను తల్లి దయ్యమైపట్టి తీసుకుపోయిందని అంతా అనుకున్నారు.

ప్రచురణ : 1942, కవిరాట్టు గల్పికల సంపుటిలో,
యువ కార్యాలయం, తెనాలి.

# అంపకాలు

బాబాయి ఊరుకెళ్తున్నాడంటే ఈసారి చిట్టి కెందుకో పట్టరాని దుఃఖం వచ్చింది. పెద్దవాళ్ళతో బాటు తనుకూడా కళ్ళల్లో వత్తులేసుక్కూచుంది-మామూలుగా దీపాలు పెట్టగానే నిద్రపొయ్యేది. చుట్టి బెట్టులు బిగించిన బాబాయి పరుపు, పెట్టె తాళం వేసిన బాబాయి పెట్టె చూస్తూ ఎట్లా నిద్దరపోవటం?

"నేనివాళ పోనమ్మా, రేపు నిద్దర లేచి, చక్కగా మనిద్దరం మొహం కడుక్కునీ-" అని బాబాయి బుజ్జగిస్తున్నకొద్దీ చిట్టి బాబాయి మెడకుచేతులు పెనేసి "ఉఁహుఁ! ఉఁహుఁ!" అని తల అడ్డంగా తిప్పుతూ కొంతసేపు మారాం చేసింది.

అమ్మ కోప్పడ్డది.

"బాబాయికి బరువు కాదుటే? చంకదిగు ఛడవాకానా! దిగుతావా, దిగవా?" అని అమ్మ ఉరిమింది.

నాన్నకూడా కోప్పడ్డాడు.

చిట్టి బావురుమన్నది. దాని కన్నీటితో బాబాయి మొహమంతా తడిసింది. అతనికి ఈ ప్రేమను నమ్మాలో నమ్మరాదో తెలీలేదు. చిట్టాం ఆదివరకు తనమీద ఇంత ప్రేమచూపించి ఎరగదు. పోనీ, ఇదంతా వొట్టిమంకుతనం అనుకుందామంటే, ఆ కన్నీళ్ళో?

పదికూడా కొట్టింది. ఇక బయలుదేరకపోతే మెయిలందదు.

"ఇక దిగమ్మా చిట్టీ! నేను మళ్ళీవస్తాగా! నీకు మంచి మంచి బిస్కత్తులూ పిప్పరమింటు బిళ్ళలూ"

చిట్టాం మళ్ళీ బావురుమన్నది. బాబాయి ఇక పట్టలేకపోయినాడు. పిల్లను దగ్గిరికి తీసుకుని కళ్ళనీళ్ళు తుడిచి, ముద్దులాడి ఆఖరుకు బలవంతాన వదిలించుకుని బయలుదేరాడు. పోతూ, పోతూ, "పిల్లనేం అనకమ్మా, వొదినా!" అని హెచ్చరించాడు.

బాబాయి వెళ్ళిన పావుగంట దాకా చిట్టి ఏడుపు తిరుగుమొహం కాలేదు. ఆఖరుకు ఏడుపు ఎక్కిళ్ళుగానూ, ఎక్కిళ్ళు నిద్రలోకీ ఉపశమించింది.

మాటల అలికిడికి చిట్టి మేలుకున్నది కాని కళ్ళు తెరవలేదు. అందరూ ఒక్కసారిగా మాట్లాడుతున్నారు. అన్ని గొంతుల్లోనూ బాబాయి గొంతు స్పష్టంగా వినిపిస్తున్నది చిట్టికి.

"మెయిలు ఏడుగంటలు లేటు. స్టేషన్లో ఉండి ఏమిటి చెయ్యటం? మెయిలు కోసం వచ్చినవాళ్ళంతా ఇళ్ళకు తిరిగివెళ్ళారు. మళ్ళా ఏ నాలుగింటికో లేచి వెళతాను.... చిట్టాం-పిచ్చిముండ! అప్పుడే నిద్రపోయి నట్టుందే?" అంటున్నాడు బాబాయి.

"పోయింది ఏడిచీ ఏడిచీ" అని తల్లి జవాబు చెబుతున్నది.

చిట్టికి కళ్ళు తెరవాలని ఎంత మాత్రమూ లేదు. బాబాయి మొహం చూడటాని కెందుకో సిగ్గేసింది. బాబాయి తిరిగిరావటం చిట్టి కిష్టం లేదు. తన దుఃఖమంతా వృధా చేశాడు! తెల్లారు జామున కూడా మళ్ళా చిట్టికి మెళుకువ వచ్చింది. కానీ అప్పుడు కూడా చిట్టి నిద్రపోతున్నట్టే కదలకుండా పడుకున్నది.

మళ్ళా రైలుకు వెళ్ళబోతూ, "చిట్టా మను లేపనా?" అన్నాడు బాబాయి నవ్వుతూ. నిజంగా లేపుతాడేమోనని చిట్టికి తగని భయం వేసింది.

"ఇంకా నయం!" అని తల్లనేదాకా చిట్టాం ప్రాణం కుదుటపళ్ళే.

ప్రచురణ : 1942, కవిరాట్టు గల్పికల సంపుటిలో.

యువ కార్యాలయం, తెనాలి.

# చిట్టి

కాంతం కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తున్నది. ఏడవగలుగుతున్నది- అదృష్టవంతురాలు. కాంతం ఏడుపు తన గుండెల్లో నగారావాయింపు. ఆ ఏడుపు చెవులపడుతుంటే తనకు భయమేస్తున్నదనీ, చిట్టిని గురించి ఆలోచించటానికి తోచటంలేదని కాంతం తెలుసుకోదు. కాంతం, తల్లి దురదృష్టవంతురాలు. దాని బాధ, తనకు తెలీదు. తనకు భయమేస్తున్నది గాని ఏడుపు రావటంలేదు. తన గుండె అడుగున చిల్లిపడి అశ్రువులన్నీ ఎటో కారిపోయినై. చిట్టిని చూచి అస్తమానమూ నవ్విన కాంతమూ ఈ విధంగా ఏడవట మేమిటి ?....ఎక్కడో పొరపాటు జరిగింది. దేవుడింకా తెలుసుకోలేదు.

కాంతం సమీపానికి వెళ్ళటానికి తనకు ధైర్యంలేదు. కాంతం చిట్టి కోసం ఏడవకుండా ఉంటే ఎంత బాగుండును! ఏడిచి చిట్టిచావు నిజం చేస్తున్నది కాంతం....

“అమ్మా, నాకళ్ళకి నిద్దరొస్తుందే ?” అనేది చిట్టి. అది జ్ఞాపకంవచ్చి తనకేడుపు రావటం దేనికి ? అప్పుడు తను నవ్వాలా ? “నీ కెక్కడ ఆకలవుతుందే, చిట్టితల్లీ ?” అని అడిగితే చిట్టి వాళ్ళమ్మతో, “నోట్లోనే !” అనేది గట్టిగా - కాంతం చెవిటిదైనట్టు! చిట్టికి నోట్లో ఆకలయేది, చిట్టికళ్ళకి నిద్దరొచ్చేది ! అవన్నీ జ్ఞాపకం తెచ్చుకుంటే కాంతం ఏడవదు. అట్లా ఏడుస్తుంటే కాంతంతో ఇవన్నీ మాట్లాడటం ఎట్లా ?

మొగుడు చచ్చిపోతే పెళ్ళాంలాగా కాంతం ఇంకో మనిషైపోతుంది. ఇక ముందు కాంతం చిట్టికి అమ్మ అనేమాట ఉండదు. చిట్టికి అమ్మకాని కాంతంతో తను ఎట్లా మాట్టాటం ? ఏడవకుండా ఉంటే కాంతం మారేదికాదేమో! తనుమాత్రం బతికి ఉన్నంతకాలమూ చిట్టితండ్రిగానే ఉండిపోవాలి. అది అసాధ్యంకాదు. చిట్టిని తల్చుకొని తాను ఎప్పటట్లే నవ్వగలగాలి. ప్రయత్నిస్తే సాధ్యమవుతుంది....

అద్దంలో చూసుకుంటే తన మొహమంతా వికారంగా ఉన్నది. అయ్యయ్యో ఈ మొహం చిట్టి ఎల్లాపోల్చుకుంటుంది ! తను కూడా మారితే యెట్లా ? తనకి కాంతం కొత్తదై పోయినట్టు, తను కాంతానిక్కూడా క్రొత్తవాడైపోతే ఎట్లా ?....

కాంతం తన దుఃఖమంతా ఖర్చుచేసుకుంటున్నది ? దుఃఖమంతా అయిపోయి మళ్ళా మామూలు మనిషి అయి కాంతం ఇతర విషయాలు మాట్లాడేటప్పుడు తన కెట్లా ఉంటుంది? చిట్టిని మరిచిన కాంతంతో తను కాపరం చెయ్యడం ఎట్లా ?....

చిత్రం ! మనిషికి జబ్బుచేస్తే మొదటి ప్రయత్నంలోనే నయం చెయ్యాలి. ఒకసారి విఫలమై రెండోసారి విజయం పొందటం అంటూ ఉండదు. చిట్టికి చేసిన జబ్బు ఆటే ప్రమాదకరమయిందికాదు. చివరిదాకా డాక్టరామాట అంటూ వచ్చాడు. తనకు తట్టలేదుగాని చిట్టి జబ్బు నయంచేసే మందు ఆయుర్వేదంలో తప్పకుండా ఉంటుంది. హోమియోపతీలో కూడా ! ఇటువంటి జబ్బే ఆయనెవరో ఏపిస్‌తో నయం చేశాట్ట. చిట్టికి ఏపిస్ వేస్తేసరి ! షాపులో పేటెంటు మందులున్నై — విటామను బీ ఉన్నటువంటివి !....

"ఏమండీ, పాపం, మీ పిల్ల పోయిందిటగా ? హరి హరీ ! ఎంత చలాకీ పిల్లండీ ! పోయివస్తాను. ఈ బస్సుకు మాచారం పోతున్నాను ! ఈ రైతులేం చంపుకుతింటున్నారండి — కాకపోయినా !" ఆయన అంతలోనే చిట్టివిషయం మరిచిపోయినాడు !....

కాంతం ఏడుపు వినిపించటంలేదు. పాపం, ఏడిచి, ఏడిచి అలిసిపోయిందేమో! లేదు. లేదు. నిశ్శబ్దంగా ఏడుస్తున్నది. పాపం, కాంతం ! తనకేసి ఎంత చిత్రంగా చూసింది! చిట్టి జబ్బు నయం కానందుకు కాంతం తనని క్షమించలేదు. ఇక చిట్టిని గురించి తను ఎవరితో మాట్లాడుతాడు ?....

చిట్టికీ తనకూ ఇరవై రెండేళ్ళు తేడా. ఈ తేడా క్షణక్షణమూ జాస్తి అవుతున్నది గామాలు ! ఇంకా పాతికేళ్ళుపోయినా చిట్టి మూడేళ్ళదేగదా ! తనకో ? తనకి యాభై అవుతై! అప్పుడు తను చిట్టికి తాతయ్యల్లే ఉంటాడు గామాలు!....

నిశ్శబ్దంగా ఏడుస్తుండే కాంతాన్ని చూసి తన గుండె కరగిపోతున్నది. నిజానికి ఈ కాంతం వెనుకటి కాంతం కన్న ఒకవిధంగా ఎంతమంచిది ! ఈ కాంతం ఇంకోరిపిల్లల్ని చూసి అసూయపడలేదు. చిన్నచిన్న విషయాలను గురించి మనస్సు క్షోభ పెట్టుకోలేదు. చిట్టి ఈ విధంగా తల్లికొక కొత్త ఆధ్యాత్మికశక్తి నిచ్చింది గామాలు?....

రెండు యుగాలు—లేక రోజులా—గడిచిన తరువాత ఈ మధ్యాహ్నం కాంతం మారిన కంఠంతో తనను పలకరించింది.

"లేవండి, పోయి స్నానం చెయ్యండి - నాలుగు మెతుకులు నోట్లో వేసుకుందురుగాని."

"కాంతం !"

కాంతం దగ్గరకువచ్చి బుజాలమీద చేతులు పెట్టి, తన మెడమీద మొహం పెట్టి నిశ్శబ్దంగా ఏడవసాగింది. తనకిక ఏడుపాగలేదు. తనూ కాంతమూ కలిసి ఏడవటాని కిప్పుడవకాశం దొరికిందా ? తన కన్నీళ్ళు ఇంతకాలమూ పైకిరాంది

ఇంచుకా ? ఇదివరకు కాంతం ఏడుపు స్వార్థంవల్లనే బాగుండలేదా? ఇద్దరూ కలసి సమంగా కన్నీరు కార్చటం ఎంత బాగుంది !...

కామంతో కాంతాన్ని కావలించుకోవటం మాత్రమే తా నెరుగును. ఇట్లా దుఃఖంతో కావలించుకోవటం ఎరగడు !...

ప్రచురణ : 1942, కవిరాట్టు గల్పికల సంపుటిలో,
యువ కార్యాలయం, తెనాలి.

# భేడాకాసులు ఆదా

"నాన్నా ! కృష్ణలీలలు సినిమా చూడవద్దూ ?"

"ఉండరా, ఒకటేగోల!....అయితే, బారసాలకు అందర్నీ పిలవాలిసినదేజే ? వాళ్ళకు బట్టలూ అవీ కూడా పెట్టొద్దూ ?

"బాగుందే, వాళ్ళంతా పిల్లలకు ఏవైనా చదివిస్తే అవన్నీ తీసుకుని ఊరు కుంటే ఏం బాగుంటుందీ ?"

"ఆఁ ! చదివింపులు ! గళ్ళ రుమాలాలూ, సిల్కు చేతి గుడ్డలూ చదివించిన వాళ్ళందరికీ బట్టలు పెడుతూ కూర్చుంటే - చేతిలో తడిలేదు."

"అయితే మానెయ్యండి, నాకేం ?"

"అవును నీకేం ! మాటపడేది నేనేగా !"

"అందుకనే నలుగుర్నీ పిలవండి, అన్నాను."

"మంచిపని చేశావు !"

* * *

"మంచి సినిమా, నాన్నా ! అంతా వెళుతున్నారు, నాన్నా !"

"ఉండరా, ఒకటేగోలా !...మాట్టాడవేమే ? చౌకలో పోతుంది, ఏటవతల సంబంధం చూస్తాముటే ?"

"ఇంకో ఐదువందలకు లోపిస్తారుటండీ ! ఊళ్ళోవాడూ, చదువుకున్నవాడూ ఉండగా. ఇంకొంచెం ఆస్తి ఉందిగదా అని పిల్లదాన్ని ఏటవతల ఇచ్చుకుంటే మీరాదాచేసే అయిదువందలూ తిరగటానికి సరిపోదూ ?"

"ఏం తిరగటమో ! చేతులో తడిలేదు."

"అయితే మానెయ్యండి, నాకేం ?"

"అవును నీకేం ? మాటపడేది నేనేగా !"

"అందుకనే ఊళ్ళో సంబంధం చెయ్యండి అన్నాను."

"మంచిపని చేశావు !"

* * *

"ఇవాళ సినిమా ఆఖరురోజు, నాన్నా! పులులూ, సింహాలూ- మంచి సినిమా, నాన్నా !"

"ఉండరా, ఒకటేగోలా!.... చెప్పవేమే? ఇల్లమ్ముదామా, పొలమమ్ముదామా?

రెంటికి ఒకటే ధర వచ్చేట్టుంది. కాకపోతే, ఇంతకన్న మనకు పొలంమీదే ఎక్కువ గిట్టుబాటవుతున్నది."

"అందుకని ఇల్లులేకుండా చేసుకుంటారటండీ? మన నట్టింట మనం తినక మాడినా ఎవరికీ తెలీదు. ఇల్లూ వాకిలీ లేక చెట్టూ పుట్టా పట్టిపోతే మనకు పొలం ఉందని మన్నించే దెవరండీ?"

"ఎవరో అనుకుంటారని నష్టపడతాముటే? కొంపకేం? అయిదు రూపాయలు పారేస్తే ఏ వసారా అయినా దొరక్కపోదు. గంగగోవంటి భూమి—"

"అయితే మీ యిష్టమొచ్చినట్టు చెయ్యండి, నాకేం?"

"అవును నీకేం? మాటపడేది నేనేగా?"

"అందుకనే పొలం అమ్మండీ అన్నాను."

"మంచిపని చేశావు!

* * *

"సినిమాకు పోవద్దు, నాన్నా?"

"బంగారమంటి పొలం కాస్తా పోయింది. ఇంకా సినిమా ఏమిట్రా, వెధవా? జరిగినదంతా సినిమా కాదూ?"

ప్రచురణ : 1942, కవిరాట్టు గల్పికల సంపుటిలో,
యువ కార్యాలయం, తెనాలి.

# రాసిన రాత

ఒకడు చిన్నవాడు, కవి, మంచివాడు, బీదవాడు. రెండోవాడు అందగాడు, పెద్ద ఉద్యోగి, తెలివిగలవాడు, సంపన్నుడు.

ఈ ఇద్దర్లోనూ ఎవరో ఒకరు తన భర్త కావాలి. ఆమె తన అంతరాత్మలో రెండోవాణ్ణే స్థిరం చేసుకున్నది. కాని, ఆ అంతరాత్మ ఏ అజ్ఞాత కారణం చేతనో ఆమెచేత ఆ విషయం వెంటనే బయట పెట్టించలేదు. పైకామె ఇద్దరితోనూ సమంగానే ప్రవర్తిస్తున్నది. ఆమె తండ్రికూడా రెండోవాణ్ణే తన అల్లుడుగా ఎన్నుకున్నాడు, కాని కుమార్తె అభిప్రాయం బయట పెట్టందీ తన అభిప్రాయం ఆయన బయట పెట్టదలచలేదు.

ఇంతలో ఒక దైవజ్ఞుడొచ్చాడు. తలవని తలంపుగా, అమ్మాయి జాతకం చూశాడు.

"ఈ పిల్లకు త్వరలోనే వివాహం జరగబోతున్నది" అన్నాడు దైవజ్ఞుడమోఘంగా. "అందగాడు, పెద్ద ఉద్యోగి, తెలివిగలవాడూ, ధనికుడూ అయిన భర్తను చేపట్టుతుంది."

"దైవజ్ఞులు చెప్పింది నిజమేనా, నాన్నా?" అన్న దమ్మాయి.

"నాకు మటుకు నాకు సందేహం లేదమ్మా!" అన్నాడు తండ్రి.

"అయితే నేను కవిగార్ని చేసుకుంటాను, నాన్నా! నాకు కావలసిన లక్షణాలన్నీ ఉన్న భర్త రాసిపెట్టి ఉన్నప్పుడు నాకిష్టమైన వాణ్ణెందుకు చేసుకోకూడదూ? నాక్కావలసిన లక్షణాలు రెండు ఆయనలో ఉన్నప్పటికీ, నాకు నచ్చినవాడు కవిగారే!"

ప్రచురణ : 1942, కవిరాట్టు గల్పికల సంపుటిలో,

యువ కార్యాలయం, తెనాలి.

# రెండో పెళ్ళి

శేషాచలంగారు ముప్పైతొమ్మిదో ఏట పదేళ్ళ పిల్లని రెండో పెళ్ళి చేసుకున్నాడు. ముప్పై తొమ్మిదేళ్ళ వాడికి పెళ్ళాం అవసరమనేది శేషాచలంగారంగీకరించాడు గాని తనకన్న ఇరవై తొమ్మిదేళ్ళు చిన్నదైన పెళ్ళాం ఆయనకు తృప్తికరంగా లేదు. తనకు ముప్పై ఏళ్ళ కన్య ఎట్లా దొరుకుతుందీ ? దొరికితేమటుకు పెళ్ళాడితే నలుగురూ ఏమంటారు? పోనీ, పెళ్ళి చేసుకోకుండా ఉందామా అంటే ఇతర విషయాలట్లా ఉంచి తనకిన్ని నీళ్ళు వదలటానికన్నా లేరే !

తీరా పెళ్ళి అయింతరవాత ఆలోచిస్తే నలుగురూ బలవంతాన తన పెళ్ళి చేసినట్టుగా తోచిందాయనకు.

"ఇంకా నలభై కూడా రాలేదుగా ?" అన్నారు కొందరు, ఇంకో సంవత్సరంలో తనకు వివాహయోగ్యత లేకుండా పోయేటట్టు.

"నీకు బుద్ధి ఉందా ! నీకన్న ముప్పయ్యేళ్ళు చిన్నపిల్లనేమని పెళ్ళాడావు !" అన్నవాడు లేడు, రేపటినించీ ఆ మాట అననివాడూ ఉండడు.

పెళ్ళికి ఎదిగిన పిల్లలు రెండు జాతులుంటే బాగుండును-తనకు ఈడయిన వారిని చేసుకోదగినవాళ్ళూ, ముసలివాళ్ళను మాత్రమే చేసుకోదగినవాళ్ళూ అంటూ! ఒక పిల్లకు చిన్న మొగుడే దొరుకుతాడో పెద్దమొగుడే దొరుకుతాడో నిర్ణయించటానికి లేకపోవటం దారుణం.

లేదా చిన్నపిల్లల ఆటల్లో 'దొంగ' అయే మనిషిని నిర్ణయించటానికి కొన్ని నిబంధనలు పెట్టినట్టు, పెద్దవాళ్ళకు చిన్నపిల్లల్ని అంటగట్టటానికి కూడా కొన్ని నిబంధనలు పెడితే ?

తన పెళ్ళాన్ని ఏ డెబ్బయ్యేళ్ళ మొగుడికో ఇవ్వాలని శాసనం జరిగి ఉండి ఆ మీదట తను.... నలభై కూడా లేనివాడు— మొగుడైతే ఎంత సంతోషించేది !

ఆడవాళ్ళెంతలోకి ముసలాళ్ళవుతార్లే? ఇద్దరి పిల్లల్ని కంటే తన భార్య మరో పదేళ్ళలో అవ్వ అవుతుంది.

శేషాచలంగారనుకున్నట్లే పార్వతమ్మ ఇరవై ఏళ్ళయినా రాకపూర్వమే ఇద్దరు పిల్లల్నికని నేవళం పోగొట్టుకొన్నది. ఆ దంపతుల వయస్సులో తేడా గమనించడం కూడా మరిచారు ప్రజలు. చిన్నపిల్ల మొగుడు కావటంవల్లనో ఏమో శేషాచలంగారి పది సంవత్సరాల కాలంలోనూ ఏమి మారలేదు—తెల్ల వెంట్రుకలు జాస్తికావటం తప్ప.

ఇంకో ఇరవై ఏళ్ళు గడిచినై. శేషాచలంగారు రాయల్లే ఉన్నాడు. ఒక చత్వారంలేదు. పల్లు కదలటంలేదు. నడుము నొప్పి లేదు. చెవుడు లేదు. పార్వతమ్మ అప్పుడే రెండు దంతాలను పీకించి కళ్ళజోడు పెట్టింది. ఆవిడ తలకట్టు జనపనార పాళానికి వచ్చేసింది.

శేషాచలంగారు తన వివాహం గురించి ఒకప్పుడు పడ్డ దిగులంతా పూర్తిగా మరిచాడు.

వాళ్ళ పెద్దబ్బాయి బియ్యే ప్యాసయి, ఉద్యోగం సంపాదించి పైకొస్తున్నాడు. వాడు కథలూ అవీ రాస్తున్నట్టు, వాటిని నలుగురూ బాగున్నవంటున్నట్టూ విని శేషాచలంగారు సంతోషించారేకాని, ఆ కథలేవీ తనుమాత్రం చదవలేదు.

ఒకనాడు అబ్బాయి ఇంటో లేని సమయంలో పోస్టుబంట్రోతొచ్చి ఒక పత్రిక పడేసి పోయినాడు. శేషాచలంగారు పరధ్యాన్నంగా పత్రికవిప్పి పేజీలు తిప్పుతుంటే కుమారుడి పేరు కళ్ళపడ్డది. ఆయన చిరునవ్వు నవ్వుకుంటూ చదవ నారంభించాడు. కథపేరు 'మా తాత.' అబ్బాయికి మంచి ఊహాజ్ఞానం ఉండి వుండాలి. లేకపోతే వాడేతాత నెరుగును గనుకా ?

చదువుతున్నకొద్దీ శేషాచలంగారి మొహం పాలిపోయింది. అబ్బాయి కథలో తాత మూడు మూర్తులా శేషాచలంగారే !

ప్రచురణ : 1942, కవిరాట్టు గల్పికల సంపుటిలో,
యువ కార్యాలయం, తెనాలి.

# నమ్మదగిన మాట

గోపాలానికొక పెద్ద ధర్మసందేహం పట్టుకుంది - ఆ సినిమా ట్రూపులో బొంబాయి వెళ్ళిన తన తమ్ముడు పార్వతీశం ఎవతెనన్నా తగులుకున్నాడా, లేదా ?

తన తమ్ముడి నైతిక క్షేమంతో గోపాలానికేం పనో ఊహించటం కష్టం. తమ్ముడు ఎవతెనన్నా తగులుకున్నాడని రుజువైతే తన కెక్కువ తృప్తో, నీతిగా ఉన్నాడంటే ఎక్కువ తృప్తో గోపాలానికే తెలీదు.

గోపాలానికి ఒక్కటే తెలుసు. పార్వతీశాన్ని తను పెంచి పెద్దవాణ్ణి చేశాడు. చదువు పూర్తిగా చెప్పించాడు ! ఇక ఇంటివాణ్ణి చెయ్యటం మాత్రమే తనమీద ఉంది. ఈ పరిస్థితుల్లో పార్వతీశం ఇప్పుడే కోతి కళలు పోవటం జరిగితే, ఏ నిక్షేపమంటి పిల్లనో తెచ్చి వాడి కంటగట్టటం తనవల్ల ఒక్కనాటి కూడా జరగదు !

తన తమ్ముడిమీదకంటె, గోపాలానికి, ఆ తమ్ముడికి ముడిబెట్టబోయే పిల్ల మీద ఇంత అభిమానం దేనికో అదికూడా మనం సులభంగా ఊహించలేం.

ఏమైనా పార్వతీశం ప్రవర్తనను గురించి స్పష్టంగా తెలుసుకునేదాకా గోపాలానికి నిద్రపట్టే లక్షణాలు కనిపించలేదు.

అసలే సినిమా కంపెనీ ! అందరూ లఫూటుగాళ్ళు చేరతారు. ఆ పైన ఆడవాళ్ళూ మగవాళ్ళూ కలిసి తైతక్కలాట్టం! ఆ ముండలన్నా సంసార్లా అంటే - సంసార్లు హాయిగా మొగుళ్ళకు వంటచేసిపెడుతూ పిల్లల్ని కనక సినిమాల్లో కెందుకు పోతారు.

పార్వతీశం వెంట తమ గ్రామంనించి ఇంకా అయిదారుగురు వెళ్ళారు. అసలా సినిమా తీసిన కంపెనీ ఆ వూరివాళ్ళదే. అందుకని గోపాలం నలుగురి దగ్గిరా ఆరా తియ్యటానికి బయల్దేరాడు.

"ఏమోయ్, లక్ష్మీనారాయణా ! నువుకూడా బొంబాయి వెళ్ళావుగామల్లు, ఏమిటి కబుర్లు? మా తమ్ముడు, పార్వతీశం ఒళ్ళు దగ్గిరపెట్టి మసులుకున్నాడా !" అన్నాడు గోపాలం.

"వొళ్ళు ఎవరిదగ్గిర పెట్టి ?" అన్నాడు లక్ష్మీనారాయణ విచక్షణగా.

తాగుబోతు వెధవ ! వాణ్ణి అడగటం తనదే పొరపాటు !

"ఏమండీ, కృష్ణశాస్త్రిగారూ! మీరంతా కలిసేవున్నారు గామాలు. మా తమ్ముడు పార్వతీశం, ఆడవాళ్ళ జోలికేమీ పోలేదుకద ?"

"ఎబ్బే, అటువంటిదేమీ ఉన్నట్టులేదులెండి. నా కతనితో అచే పరిచయం కలగలేదుగాని-వస్తాను !"

ఎందుకు చెబుతాడూ ? అంతా తోడుదొంగలు !

"ఏమోయ్, సూర్యం మావాడు బొంబాయిలో భటాచోరుముండ ల్నైవర్నీ తగులుకోలేదుగద ?"

"ఓ రహస్యం చెప్పనా ? మళ్ళీ ఎవరితోనన్నా అనేరు! నేను తలుపు కంతల్లో నుంచి చూశాగాని, నాకేమీ కనిపించలా. చీకట్లో ! తెలీని మాట చెప్పి ఎట్లా పాపం కట్టుకునేదీ !"

పీడో దొమ్మరముండాకొడుకు ! చిన్నంతరమూ పెద్దంతరమూ ఎరగడు !

ఇంత శ్రమపడి ఆ ముండదగ్గరికి పోయి అదేమంటుందో ఆ సంగతి కూడా తేల్చుకొస్తే సరిపోతుందిగా !

గోపాలం ప్రాణాలరిచేతిలో పట్టుకొని దాని ఇల్లు విచారించుకుంటూ వెళ్ళాడు.

పొద్దుకూకిం దప్పుడే, "కూర్చోండి, పంతులుగారూ ?" అంటూ అది తన ఎదటే చీర విప్పి మరో చీర కట్టసాగింది.

"అయితే - ఇదుగో - చూడూ ! నీ పేరేమిటో ? మీ వెంట పార్వతీశమని ఒక కుర్రాడొచ్చాడే ! వాడు మీతో వచ్చిన ఆడవాళ్ళ నెవర్నన్నా మరిగాడా?"

"ఆ అబ్బాయి అటువంటివాడయితే నే నొదిలిపెడతానుటండీ, పంతులుగారూ!····వెళుతున్నారేం ? రాత్రికుండరూ ?"

అదురుతున్న గుండెతో గోపాలం బయటపడ్డాడు. తన తమ్ముడి శీలం చెడలేదని రూఢి అయిందిగాని, అందువల్ల కలగదగిన సంతోషం మాత్రం గోపాలానికి కలగలేదు.

ప్రచురణ : 1942, కవిరాట్టు గల్పికల సంపుటిలో,
యువ కార్యాలయం, తెనాలి.

# ఒకతల్లి పిల్లలు

(అన్నేశ్వరంగారి ఇల్లు - ఒకనాటి ఉదయం)

అన్నే : ఇంకా ఉత్తరాలకోసం వెతుకుతూనే ఉన్నావట్రా, రాఘవులూ?

రాఘ : చిన్నమ్మాయి రాసిన ఉత్తరం ఒకటీ దొరకదే.

అన్నే : మిగిలినవో?

రాఘ : పెద్దబ్బాయి రాసినవి ఎనిమిదున్నై, పెద్దమ్మాయి రాసినవి మూడున్నై, చిన్నబ్బాయి రాసినవి అయిదున్నై, చిన్నమ్మాయి రాసినవే కనబట్టం లేదు.

అన్నే : అదికూడా రెండుసార్లు రాసిందిరా-నాకు జ్ఞాపకం.

రాఘ : ఈ ఉత్తరాలు ఇన్నిసార్లు కట్టలు విప్పాను కట్టాను. చిన్నమ్మాయి ఉత్తరం చూసినట్టు నాకెక్కడా జ్ఞాపకం లేదు.

అన్నే : అయితే పోనీ, అది రాసిందని నేను అనుకున్నానేమో. ఒక్కోసారి మనం అనుకునే విషయాలు కూడా నిజమల్లేనే ఉంటై. కిందటిసారి నాకు జబ్బు చేసినప్పుడూ—

రాఘ : డాకరుగారు తొమ్మిదింటికి వస్తామన్నారుగాదూ? తొమ్మిది కావచ్చింది.

అన్నే : ఏవేవో కొత్తచోట్లు చూశా, కొత్త మనుషులు కనిపించారు. ఆ మనుషులు కనిపిస్తే గుర్తు పట్టగలనన్నమాట.

రాఘ : (నవ్వుతూ) ఇంకా సేపటికల్లా మీ మనవలూ, మనవరాళ్లూ వస్తారు. గుర్తు పడితే చాలు.

అన్నే : (గర్వంగా) ఎంతమాటన్నావురా. నా మనవలనూ, మనవరాళ్ళనూ నేనే గురుపట్టలేనుగా. చాల్లే, ఎవరన్నా వింటే నవ్విపోతారు.

రాఘ : వాళ్ళను మీరు చూసి ఎన్నాళ్ళయిందీ?

అన్నే : (ఆలోచిస్తూ) పెద్దబ్బాయి ఉపనయనానికి మేమింకా కలిసే ఉన్నాంగా - వాడికిప్పుడు పదమూడో ఏడు - తరవాత ఏణ్నర్థానికో ఏమో నా కొడుకు నాతో భాగాలు పడ్డాడు - వెర్రివాడు. ముప్పై ఏళ్ళు నిన్నగాక మొన్నల్లే ఉంది సుమా—

రాఘ : పెద్దబ్బాయి పెళ్ళిచేసుకున్నాక భార్యతో కూడా మిమ్మల్ని చూడరాలా?

అన్నే : (ఆలోచన పాడయి) ఏమిటదీ?

రాఘ : మీరు పెద్దబ్బాయిని చూసి దాదాపు ఇరవయ్యేళ్ళయిందన్నా.

అన్నే : నీ మొహం కాదూ?

రాఘ : సరే, మీ యిష్టం.

అన్నే : (ఆశ్చర్యంతో) వాణ్ణిచూసి ఇరవయ్యేళ్ళయిందిట్రా! చిన్నతనంలో ఎట్లా ఉండేవాడనుకున్నావు? బంగారునాయన. నా దగ్గిర్నించి వాళ్ళమ్మదగ్గరికి వెళ్ళేవాడుకాడు. నీకు అమ్మకన్న తాత ఎక్కువట్రా? అనేది పార్వతి.... వాడే కాదురా, రాఘవులూ! నలుగురూ నామీద ఎక్కి తొక్కేవాళ్ళు. సుఖ మంటే అదిరా, రాఘవులూ! అన్ని సుఖాలూ మరుపు కొచ్చినా - మనవలూ మనవరాళ్ళూ మీద ఎక్కి తొక్కిన సుఖం మరపురాదు. నీ కూతురి కడు పున నలుసులు పుట్టుకొస్తే నీకే తెలుస్తుంది.

రాఘ : అదంతా నిజమే. ఆ నలుసులు అట్లాగే ఉండిపోరుగా! వాళ్ళు పెరిగి కోరలూ, గోళ్ళూ పెంచుకుంటారు. వాటితో మనని బరుకుతారు, రక్కు తారు, పీకుతారు, రక్తం కళ్ళజూస్తారు. నాకు మనవలు పుడితే కవచం తొడుక్కు తిరుగుతాను.

అన్నే : నీ మొహం. అనుభవం లేక అంటున్నావు. నువ్వు నా మూడో మనవడివి కాదుట్రా? నీ చిన్నతనం చూడలేదని నాకు ఎంతో బాధగా ఉంటుందిరా, రాఘవులూ.

రాఘ : నా చిన్నతనమా?

అన్నే : అవున్రా. చిన్నప్పుడు నువు చేసిన పనులు జ్ఞాపకం ఉంటే చెప్పు.

రాఘ : ఒకసారి ఉండేలు బద్దతో కుందకు చిల్లిపొడిచా. మానాన్న కొడవలితో నానెత్తిన చిల్లి పొడిచాడు. అది మానటానికి ఆర్నెల్లు పట్టింది.

అన్నే : ఛీ, ఛీ. ఏం మనిషిరా మీ నాన్న?

రాఘ : మానాన్న మంచి మనిషే. నేనే శనిగాణ్ణి. చిన్నతనంలో నా అంత శనిగాడు ఇంకొకడుంటాడనుకోను. ఒక్క మంచిపని చేసినట్టు జ్ఞాపకం లేదు.

అన్నే : (గంభీరంగా) రాఘవులూ, నిన్నుగురించి నువు అట్లా మాట్లాడితే నేనూరుకోను, తెలిసిందా. నీవంటి బుద్ధిమంతుడు నూటికి కోటికి ఒక డుండడు. మీ నాన్న నా కొడుకల్లేవే కర్కోటకుడై ఉండాలి! చిన్న తనంలో నీలో ఉన్న మంచితనం కూడా నీకు జ్ఞాపకం రాకుండా చేసేశాడు. నా మనవలూ, మనవరాళ్ళూ చిన్నతనంలో ఎంత ముద్దుపనులు చేసేవాళ్ళో వాళ్ళకు చెప్పిన వాళ్ళులేరు. నాకూ వాళ్ళకూ మధ్య నా కొడుకు అడ్డంవచ్చి, వాళ్ళను వేరుచేశాడు. లేకపోతే వాళ్ళ జీవితాలు ఇంత భ్రష్టయి వుండవు. వాళ్ళు చిన్నతనంలో చేసిన ప్రతిపనీ నాకు జ్ఞాపకం ఉందిరా, రాఘవులూ. ఒకసారి ఏం జరిగిందంటే—

రాఘ : మరి మీ అబ్బాయి అలా ఎందుకయినాడూ ? ఆయన్ని పెంచలా ?

అన్నే : నేను పెంచితే వాడు అట్లా అవుతాడుట్రా ? వాణ్ణి వాళ్ళమ్మ పెంచిందిలే. పెంచటంలో కూడా ఎట్లా ? విషంపోసి పెంచిందనుకో విషం. అసలు

వాడు నూటికి తొంభై తొమ్మిదిపాళ్ళ తల్లి పోలిక. దాని ముక్కునుంచి ఊడిపడ్డాడు. ఎక్కడ ఉన్నా నా పోలిక అంటూ ఉంటే అదిచూసి వాడు సిగ్గుపడేటట్టు తయారుచేసింది. వాడు తల్లి కొడుకుగా పెరిగాడు.

రాఘు : అందరూ తల్లి కొడుకులుగానే పెరుగుతారు.

అన్నే : అందరూ తండ్రి అంటే అసహ్యించుకుంటారుట్రా, వెర్రివాడా ? మొదటి నుంచికూడా నా కొడుకు నమ్మకమేమిటంటే, నాకు ప్రపంచ జ్ఞానంలేధనీ, నేను అసమర్థుణ్ణనీ, నన్ను గురించి సిగ్గుపడాలనీ, నా సలహాప్రకారం చేస్తే తాను బాగుపడననీ. వాడి తల్లికికూడా నన్ను గురించి అటువంటి ఉద్దేశమేలే.

రాఘు : అటువంటి అపోహాలు ఎంతో కాలం ఉండవే.

అన్నే : మావాడికి నన్ను గురించి యెప్పుడు అభిప్రాయం మారిందో నాకు తెలీదు. నాతో భాగాలు పడేనాటికి పోలేదు. వాడి భాగం వాడు పంచినాక నేను లక్షరూపాయలు సంపాదిస్తానని వాడు ఊహించి ఉండడు. అది చూశాక వాడి ఉద్దేశం మారిందేమో మరి. నేను డబ్బు సంపాదించే కాలంలోనే వాడు తన ఆస్తి యావత్తూ క్షవరం చేసేసుకున్నాడు. లక్షాధికారి కొడుకు బికారిగా చచ్చిపోయాడు.

రాఘు : పోనివ్వండి, మీ డబ్బు మీ అబ్బాయికి పనికిరాకపోతే ఆయన పిల్లలకైనా ఉపయోగపడుతున్నది.

అన్నే : ఉపయోగపడుతున్నదా? అదే నా అనుమానం. వాళ్ళు సుఖపడుతున్నారా? ఒక తల్లి పిల్లలమధ్య ఉండదగిన అప్యాయత వాళ్ళమధ్య ఉన్నదా ? లేదు. రాఘవులూ వాళ్ళ తండ్రి వాళ్ళమధ్య గోడలుకట్టి మరీ వెళ్ళాడు. ఆ నలుగురినీ వచ్చి నా దగ్గిర ఒక ఏడాది ఉండమన్నాను. వాళ్ళురారు. నలుగురూ ఒక చూరు కింద నిలబడరు, ఇడివాన కురుస్తున్నాసరే. అందుకే చివరికి - (కారు హారన్) డాక్టరల్లే ఉంది. వెళ్ళి తీసుకురా.

రాఘు : (పక్కనున్న హాలులో నుంచి) రండి. డాక్టరుగారూ. తాతగారు మీ కోసమే ఎదురుచూస్తున్నారు.

డా : ఆయనకు ఒంట్లో సరిగాలేదా ఏం ?

రాఘు : బాగానే ఉన్నా రండి. మిమ్మల్ని పిలిచింది—

డా : హలో (ఉల్లోపుగా అన్నేశ్వరం ఉన్న గదిలోకి వచ్చేసి) హలో, తాతగారూ, బాగానే ఉన్నారే. తప్పకుండా రమ్మన్నారనే సరికి ఏం ముంచుకొచ్చిందో అనుకున్నాను.

అన్నే : విశేషం ఉండే రమ్మన్నానయ్యా, డాక్టరూ ! ఇవాళ నా మనవలూ, మనవరాళ్ళూ నన్ను చూడడానికి వస్తున్నారు. వాళ్ళు నన్ను చూసి, నా దగ్గరకి వచ్చి చాలా ఏళ్ళయింది. విశేషం కాదూ మరీ ?

డా : ఏది విశేషమో నాకర్థం కాలేదు - వాళ్ళు ఇన్నాళ్ళూ మీ దగ్గరికి రాక పోవటమా, ఇప్పుడు రావటమా ?

అన్నే : రెండూనూ.

డా : అందుకని పార్టీ ఏమైనా ఇస్తున్నారా ఏమిటి ? నాకీమధ్య పార్టీ తగిలి చాలా కాలమయింది.

అన్నే : వాళ్ళు వచ్చేసరికి ఇక్కడ డాక్టరొకడు ఉండటం అవసరం. అందుకని నీకు కబురుచేశా. అందుకే మిగిలిన కేసులు చూసుకుని మరీ రమ్మన్నా.

డా : మీ మనవలూ, మనవరాళ్ళూ జబ్బుతోగాని బాధపడటం లేదుగద.

అన్నే : వాళ్ళకు అంతో ఇంతో జబ్బున్నమాటా నిజమే మరి, అయితే అది నీ ఇంజక్షన్లకు లొంగే జబ్బుకాదు.

డా : ఇవాళ అన్నేశ్వరంగారు మంచి ఫారంలో ఉన్నట్టున్నారు. నేనిక వేళాకోళం కట్టిపెట్టి, అంపశయ్య మీద ఉన్న భీష్మణ్ణి ధర్మరాజు అడిగినట్టు వినయ విధేయతలతో అడుగుతాను. ఏమిటీ విశేషం?

అన్నే : (నవ్వి) మొత్తానికి నాటకాలాడ వలసినవాడివి. దారి తప్పి వైద్యంలో పడ్డావు. బోనులో పులిలాగా ఎందుకల్లా పచార్లుచేస్తావు? కూచో. విషయం చెబుతా.... ఈ వచ్చేవాళ్ళు నా కొడుకు పిల్లలు. వీళ్ళెందుకు వస్తున్నారో తెలుసా? నాస్థితి చాలా ప్రమాదకరంగా ఉందని రాఘవులుచేత టెలిగ్రాము లిప్పించాను. రిప్లయి టెలిగ్రాములు; నా పెద్ద మనవడు తప్ప మిగిలిన ముగ్గురూ జవాబు లిచ్చారు. వాళ్ళు వచ్చే వేళ అయింది. రాఘవులూ నువ్వు హాలులో ఉండి వాళ్ళను అక్కడే కూచోబెట్టు. నేను చెప్పేనదాకా ఎవ్వరినీ ఈ గదిలోకి రానీయొద్దు.

రాఘ : నాకు తెలీదా? (పోతాడు)

డా : తాతగారూ, మీకిప్పుడు ఎన్నో ఏడూ?

అన్నే : ఎనభై ఆరో ఏడు నాయనా.

డా : ఎలాంటి శరీరతత్వమండి మీదీ? చత్వారంలేదు. చెవుడులేదు.

అన్నే : చత్వారం వచ్చి పోయిందిగా. చెవుడేరాలేదు, నీ దయవల్ల.

డా : మీ వాళ్లవస్తే వాళ్ళను ఆ హాలులో కూచోబెడతారా ? తర్వాత ఏం చేద్దా మని మీ ఉద్దేశం ?

అన్నే: చూడు, బాబూ ఈ పిల్లలు నాకు చంటిపిల్ల లంటివాళ్లు. నీకు తెలీనిదేముంది ? చంటిపిల్లలను మనం దేవుళ్ళల్లే చూడాలి. వాళ్ళపట్ల మనం దేవుడల్లే ప్రవ ర్తించాలి. అవునంటావా ?

డా : అది సాధ్యమవుతుందిటండీ ?

అన్నే: సాధ్యమైనంతవరకే అనుకో - తయిందా, నేను డబ్బు సంపాదించా. రెండు తరాలపాటు హాయిగా కూచుని అనుభవించవచ్చు. నా కొడుకు భీష్మించు

కూర్చుని నా డబ్బు ముట్టనేలేదు. నా డబ్బంతా నా కొడుకు పిల్లలకే ఇచ్చేశా. కాని వాళ్ళు సుఖపడలేదు. ఇవాళ కూడా వాళ్ళు కష్టాలలోనే వున్నారు. వాళ్ళ కష్టాలు డబ్బుతో తీరేవే అయినా కూడా నా దగ్గిర ఇక డబ్బులేదు. చెప్పుకోదగినంత లేదు.

డా : వాళ్ళ కష్టాలు ఎలాటివీ ?

అన్నే: ఉన్నది నలుగురు. ఒక గర్భవాసాన పుట్టినవాళ్ళు. అయినా ఒకరి పొడ ఒకరికి గిట్టదు.

డా : గర్భ శత్రుత్వం.

అన్నే: తమకు తామే శత్రువులైనవాళ్ళు ఎప్పుడూ లోకానికి శత్రువులుగానే ఉంటారు.

డా : 'నీ భీకర శత్రులార్వర ప్రభిన్నుల చేసిన ప్రాణికోటిలో నీకు విరోధిలేడు'.... అన్నట్లుగానా !

అన్నే: వాళ్ళను బాధించేది అరిషడ్వర్గం కాదులే. వాళ్ళు తమలో ఉండే మంచి తనాన్ని పూర్తిగా మరిచిపోయినారు. అది ఆత్మద్రోహం. అంతకన్న పాపం మరొకటి లేదు.

డా : మీరేదో కొత్త వేదాంతం కనిపెట్టినట్టున్నారు. అది నాకు సరిగా అర్థం కావటం లేదు.

అన్నే: ఇందులో పెద్ద వేదాంత మేముందోయ్ ? ప్రతి మనిషికీ చిన్నతనంలో సమస్త సద్గుణాలూ ఉంటై. ఇంకోరి ఆనందాన్ని పంచుకోవటమూ, ఇంకోరికి సహాయం వెళ్ళటమూ చిన్నపిల్లల్లో కూడా ఉంటుంది. అయితే పెద్దయిన కొద్దీ ఈ గుణాలు తరిగిపోతై. జీవితం అటువంటిది. దానికేం చేస్తాం? కాని నే ననే దేమంటే, మనకు స్వతహాగా ఉన్న మంచితనాన్ని బొత్తిగా పోగొట్టుకోవటం అపచార మంటాను. చాతనైతే దాన్ని పెంచుకోవాలి, లేక పోతే ఉన్నదైనా దక్కించుకోవాలి. అది కాస్తా పోయినాక యిక జీవితానికి అర్థమేమున్నదీ ?

డా : ఏమోనండీ, తాతగారూ. నన్నడిగితే పదిరాళ్ళు సంపాదించి వెనకవేసుకున్న వాడు ప్రయోజకుడు. నావాళ్ళు, నావాళ్ళు అని పాకులాడినవాడు చివరకు పూలవుతాడు. ఈ ప్రపంచంలో ఎవరి కెవరు ?

అన్నే: దీపాలను నమ్ముకోవటంకన్న చీకట్లో తడుముకోవటమే సరిఅయిన జీవితా దర్శమంటావా ?

డా : ఎక్కడున్నాయండి ఆ దీపాలూ ?

అన్నే: వెర్రివాడా, నువ్వొక దీపానివి కావూ ? నేనొక దీపాన్ని కానూ ? అద్దాలకు పట్టిన మసి తుడిచేసుకోవాలే గాని....ఇంతకూ అసలు సంగతి మనం మాట్లాడనేలేదు. మావాళ్ళు వస్తారు. నాకు ప్రాణం మీదికి వచ్చినట్టు వాళ్ళతో

చెప్పాలి. ఎట్లాగైనా వాళ్ళు నలుగురు ఏకం కావటం నాకు ముఖ్యం. ఆ తరువాత నేను హాయిగా కన్ను మూస్తాను. అందుకనీ-

రాజ్యం: (హాలులోకి వచ్చి, రాఘవులుతో) అన్నేశ్వరంగారిల్లు ఇదేనన్నారు.

రాఘ : అవును. మీ పేరు ?

రాజ్యం: రాజ్యలక్ష్మి, అన్నేశ్వరంగారి చిన్న మనవరాలిని. మా తాతకెట్లా ఉందో ?

రాఘ : స్పృహలేదు. డాక్టరుగారు అయిదు నిమిషాల కొక ఇంజెక్షనిస్తున్నారు.

రాజ్యం : ఆయన్నొకసారి చూస్తా.

రాఘ : వీల్లేదు, వీల్లేదు. కాస్సేపట్లో డాక్టరుగారు బయటికొస్తారు. ఆయన అనుమతి తీసుకుని—

డా : (రహస్యంగా) ఆ వచ్చింది మీ మనవరాలా ?

అన్నే : (రహస్యంగా) అవును. దాన్ని నేను కిందటిసారి చూసినప్పుడు పన్నెండేళ్ళ పిల్ల. ఇప్పుడు పాతికేళ్ళుంటయ్యేమో.

డా : (రహస్యంగా) వీళ్ళని మీరు చూసి ఎన్నో ఏళ్ళయిందంటున్నారే. వాళ్ళ అంతరాత్మల్లో ఉండే విషయాలు మీకెలా తెలుసూ ?

అన్నే : ఇవిగో వాళ్ళ ఉత్తరాలూ .... ఇప్పుడు మనం చెయ్యవలసిందేమిటంటే - (ఇంకా రహస్యంగా మాట్లాడుతాడు)....

రాజ్యం : నేనొక్కత్తెనేనా వచ్చింది ?

రాఘ : డాక్టరుగారొచ్చారుగా ?

రాజ్యం : (చిరాకుగా) ఇడియట్ ! మా అక్కయ్యగాని, అన్నయ్యలుగాని రాలేదా అని అడిగాను.

రాఘ : వస్తే కనిపించరూ?

రాజ్యం : నీకు మర్యాదగా మాట్లాడటం కూడా చాతకాదా? ఎవరు నువ్వు? మా తాత నౌకరువేనా?

రాఘ : సహం నౌకరునూ, సహం మనవణ్ని.

రాజ్యం : అంటే?

రాఘ : అసలు మనవలు తాతగారికి సేవ చెయ్యకుండానే ఆయన సొత్తు తినేస్తే నేను ఆయనకు సేవచేస్తూ తినేశాను. సొత్తు తినకుండా ఉంటే అచ్చగా నౌకర్నయే వాణ్ని, సేవ చేయకుండా ఉంటే అచ్చగా మనవణ్నయేవాణ్ని.

రాజ్యం : తెలివి చాలాదాకా ఉందే. అవతల తాతయ్య ప్రాణం అటో యిటో అన్నట్టుంటే నీకు చీమ కుట్టినట్టయినా లేదులాగుందే?

రాఘ : మీ కళ్ళు ఏ ఇనప్పెట్టెమీద ఉన్నయ్యో, నావీ దానిమీదే. అయితే నాకు ముందే తెలుసు - ఆ ఇనప్పెట్టె ఏనాడో ఖాళీ అయింది. కుట్టటానికి చిన్న చీమ కూడా లేదు అందులో.

రాజ్యం : అందరూ నీలాగే డబ్బు మనుషులనుకున్నావా?

రాఘు : కొందరు తాతగారితోపాటు ప్రాణాలు కూడా వదలచ్చు. నేనెందుకు కాదంటానూ?

రాజ్యం : నా కలాటి ఇచ్చకాలు చాతకావు. పొయ్యేవాళ్ళవెంట ఎవరూ పోరు.

రాఘు : పొయ్యేవాళ్ళ వెంటపోరు. ఉండేవాళ్ళ వెంట ఉండరు. నీ బోటి వాళ్ళు ఏం చేస్తారు తల్లీ? తొంభై ఏళ్ళ తొక్కు, దిక్కులేని బతుకు బతికి దిక్కులేని చావు చావనా? మీరంతా ఉండి ఆయనకు ఏం ఒరిగించినట్టు?

రాజ్యం : బాగుందే. నా బతుకు నేను బతుకుతున్నాను. దిక్కులేకుండా పోవటానికి తొంభై ఏళ్ళ తొక్కే కావాలా? నాదీ దిక్కులేని బతుకే. తాతయ్యకు తవ్వుకు పోయినంత డబ్బున్నా ఉంది, నాకు చిలిగవ్వలేదు.

రాఘు : అవసరము వచ్చినప్పుడు తాతగారికి రాసి డబ్బు తెప్పించుకోలా? డబ్బు పనికొచ్చిందిగ్గాని, మనిషి పనికిరాలేదు గామాలు.

రాజ్యం : ఆ డబ్బు తీసుకున్నందుకే నీ బాబుగాడి సొమ్మంతా పోయినట్టు చెప్పుతున్నాడే. వచ్చి ఇక్కడ తిష్టవేస్తే ఇంకా ఏమనేవాడివో.

(పురుషోత్తం వస్తాడు)

రాఘు : ఓహో, పెద్దబ్బాయిగారా, సరిగా సమయానికి వచ్చారు. కూచోండి.

పురు : ఏ రాఘవులూ, బాగున్నావా? ఏమిటి విశేషం? (రాజ్యాన్ని చూసి) ఓ, నువ్వా?

రాజ్యం : అవును, నేనే. ఏం? కాకూడదా?

రాఘు : ఊరుకోండమ్మా, తగాదాలాడటానికి తరవాత బోలెడంత సమయం— ఆ ముసలాయన హరీ అన్నాక.

పురు : (ఆశ్చర్యంతో) ఏమిటీ? తాతయ్య ఇంకా బతికున్నాడా?

రాజ్యం : (వెటకారంగా) ఎంత పొరపాటయిందీ. ఈ సంగతి తెలిస్తే ఇంకో నాలుగైదు వేలు అవసరానికి పట్టుకుపోయే వాడివిగద.

పురు : నీ మాదిరిగా ఆడజన్మ ఎత్తివుంటే డబ్బుగలవాళ్ళను ఇట్టే ఆకర్షించి—

రాఘు : (అడ్డుపడి) డాక్టరుగారు నన్ను పిలుస్తున్నట్టుంది. ఇప్పుడే వస్తా. (వెళతాడు)

రాజ్యం : నన్నేమీ ఎత్తిపొడవక్కర్లేదు. ప్రేమంటూ ఒకటి ఉందనికూడా నీకు తెలీదు. తెలిస్తే ఆబాకులూ, చెవాకులూ మాట్లాడవు.

పురు : నాచేత మాటలు పడటం ఇష్టంలేని దానివి నన్ననకు. ఇన్ని బొప్పెలు కట్టినా నీకింకా చిన్నప్పటి గుణం మారలేదు. నువ్వు అందరిమీదా నోరు పారేసుకోవచ్చుగానీ, నీ పైన ఈగ వాలరాదు.

రాజ్యం : నా మీదకు ఈగల్ని తోలే అధికారం నీకులేదు. ఎవరంటే పడాలో, ఎవరంటే తిరగబడాలో నాకు బాగానే తెలుసు. బొప్పెలు కట్టింది నాకు కాదు, నీకు. నీ చరిత్రంతా నాకు తెలియటంలేదనుకోకు, అంతా తెలుసు.

పురు : (ఆవేశంతో) ఆటే వదరకు. నన్ను గురించి నీకు ఏనాడూ ఆవగింజంత కూడా తెలియదు. నీ చరిత్ర ఏమిటో నేను మాత్రం ఎరగను-నాకక్కర్లేదు కూడాను. (ఇద్దరూ బిగుసుకుపోతారు)

అన్నే : (రహస్యంగా) వింటున్నావా, డాక్టరూ? నా పెద్ద మనవడూ, చిన్న మనవ రాలూనూ. రాఘవులూ నువు అక్కడే ఉండు. చప్పున వాళ్ళు లోపలికి రాగలరు.

రాఘ : (రహస్యంగా) ఏం మాటలు వినాలిసొస్తుందో అని పారిపోయి వచ్చా.

అన్నే : (రహస్యంగా) నువు లేకపోతే ఇంకా విజృంభిస్తారు.

రాఘ : (రహస్యంగా) వెళుతున్నా.

పురు : ఏం, రాఘవులూ? తాతయ్య ఏ స్థితిలో ఉన్నారు?

రాఘ : ఇంకా స్పృహరాలేదు. డాక్టరుగారు అక్కడే వున్నారు.

పురు : ఇంకా చెప్పవేం? ఒకసారి ఆయన్ని చూస్తా.

రాఘ : వద్దు వద్దు. ఎవరినీ లోపలికి రానివ్వద్దని డాక్టరుగారు ఖచ్చితంగా చెప్పాడు.

పురు : నాకు తాతయ్యమాటే జ్ఞాపకం లేదు. ఈ వూరు వేరే పనిమీద వచ్చి, ఈ ఇంట్లో ఎవరుంటున్నారో అని తొంగి చూశానన్నమాట. రైలుకింకా గంట టైమున్నది. అందుకని—

రాఘ : తాతయ్యగారు మీక్కూడా టెలిగ్రాం ఇచ్చారు. రిప్లయిడ్ టెలిగ్రాం. సమాధానం రాలేదు. మిగిలిన ముగ్గురూ సమాధానాలిచ్చారు.

పురు : ఏమిటీ? శకుంతలా, ప్రసాదూ కూడా వస్తున్నారా ఏమిటి?

రాఘ : అవును పెద్దబ్బాయిగారూ.

పురు : అపూర్వ సమ్మేళనం. 'ఓగు లెల్ల కూడి రొక్క చోట' అన్నట్టుగా.

రాజ్యం : నువ్వు కూడా ఓగుల్లో ఉన్నావుకద.

పురు : నిన్ను ఒక్కత్తెనే అనటంలో నాకేమీ ఆనందంలేదు.

శకుం : (లోపలికివస్తూ) అందరూ వచ్చినట్టున్నారే?

రాఘ : పెద్దమ్మాయిగారు కాదూ? దయచెయ్యండమ్మా. ఇలా కూచోండి. తాతయ్య గారికి స్పృహలేదు. డాక్టరుగారు మత్తుమందిచ్చారు.

శకుం : కళేబరం కోసం చేరిన గద్దలమన్నమాట. హాఁ, ఆయన కేం? ఆయన దేవుడే. ఆయన చేసిన ద్రోహమల్లా మావంటి మనవరాళ్ళనూ మనవలనూ కనటమే.

రాజ్యం : (రోషంగా) నిన్ను కావలిస్తే అనుకో. మమ్మల్ని అనటానికి నువ్వెవరవు? నేను తాతయ్య కీర్తిప్రతిష్ఠలకు ఎటువంటి కళంకమూ తీసుకురాలేదు.

పురు : అవును. నువు ఇన్నాళ్ళూ కాపురం చేస్తున్నది కట్టుకున్న మొగుడితోనే అని ఆయన అనుకుంటున్నారు.

శకుం : నీకేమన్నా పిచ్చిపట్టిందా ఏమిటి? కట్టుకున్న మొగుణ్ని నమ్ముకునే నాబోటి వాళ్ళంటే దానికి నామోషి.

రాజ్యం : నీ కూతురు····

శకుం : నువు తెగబడితే ఏం చేశాం? నా కూతురూ అంతే. లేదా ఏమంటే నా కూతురు నేను చచ్చానా బతికానా అని అప్పుడప్పుడూ కనుక్కుంటుంది. పస్తులు పడుకున్నామని వింటే బోరుమని ఏడుస్తుంది. దగ్గిర ఉంటే డబ్బు పంపిస్తుంది.

రాజ్యం : నేను కూడా నీకు డబ్బు పంపిస్తే నా అంత పతివ్రత లేదని ఒప్పుకునే దానివే.

శకుం : ఒకరి పాతివ్రత్యం నాకెందుకే, పిచ్చిదానా? నా కష్టసుఖాలు పంచుకున్న వాళ్ళు నాకు అయినవాళ్ళు. మంచిచెడ్డలు చూడటానికి దేవుడు లేడూ?

రాజ్యం : మంచి చెడ్డలు చూడటానికి దేవుడున్నాడో లేడో కాని, డబ్బులు అడిగి నప్పుడల్లా పంపటానికి తాతయ్య ఉన్నాడు.

శకుం : తవుడు తింటూ ఒయ్యారం దేనికి? తాతయ్య డబ్బు నే వొక్కత్తెవే తిన్నానా? అందరూ తిన్నాం.

రాజ్యం : మేమందరమూ అయిన దానికీ కానిదానికీ దేవుడి పేరెత్తటంలేదు.

పురు : (గట్టిగా) మీరిద్దరూ కాస్సేపు నోరుమూస్తారా? దిక్కుమాలిన సజ్జు. అందరూ విని ఏమనుకుంటారో అని సిగ్గన్నా లేదు.

రాజ్యం : (వెటకారంగా) చెప్పొచ్చాడు సజ్జనుడు. నువు చేసిన వెకిలి పనులన్నీ చాలా రహస్యంగా చేశాననుకుంటున్నావు గామాలు. పాలు తాగే పిల్లి. ఉష్ట్రపక్షి. చేసేదేసే కాపురం చెడగొట్టినవాడివి. చేసుకునే ఉద్యోగంలో నుంచి వెళ్ళగొట్టించుకున్నవాడివి. నువు మాకు నీతులు చెప్పటమేమిటి?

పురు : పొగరు తలకెక్కి నీకు విచక్షణాజ్ఞానం కూడా లేకపోయింది. నేను ఎవరి కాపురం చెడగొట్టాను? దేవకి దేనా? నేనా రాత్రి లేవదీసుకు పోకపోతే మర్నాడు జనానికి దేవకి శవమే కనబడేది. ఆ దౌర్భాగ్యురాలు విషం తెచ్చుకుని దాచిపెట్టుకున్నది. నేనొక ప్రాణాన్ని కాపాడాను. నువ్వో, ఒక ప్రాణం తీసినదానివి. నీ మూలంగా ఆ నాయుడి పెళ్ళాం ఆత్మహత్య చేసుకున్నది. అంతపని జరిగినాక మరొకరయితే కుక్కిన పేనులాగా అణిగి మణిగి జీవితం వెళ్ళబుచ్చేవాళ్ళు. నువుమటుకు మనిషి రక్తం మరిగిన పులిలాగా—

ప్రసా : (వస్తూ) ఓ హలో, హలో, హలో, ఫుల్ హౌస్. మైడియరెస్ట్ బ్రదర్. మై వెరీ డియరెస్ట్ సిస్టర్స్. మీరంతా ఇంకా బతికి బాగుండటం చూచి ఈ దీనుడు దిగ్భ్రాంతుడై పోతున్నాడు.

పురు : చాల్తే. చౌకబారు నాటకాల్లో లాగా మాట్లాడకు.

ప్రసా : చౌకబారా, ఇందులో చౌకబారు ఏమీలేదే. నాకీ ప్రపంచంలో మీ ముగ్గురి మొహాలు చూడటమంత రోత మరొకటిలేదు.

పురు : అందులో నీ ప్రత్యేకత ఏదో ఏడిచిందనుకుంటున్నావేమో. అటువంటి దేమీలేదు. ఈ విషయంలో అందరూ నీలాంటి వాళ్ళమే. కాని నీలాగా మేం దప్పని చెప్పుకోం. కాస్త నిగ్రహించుకో.

రాజ్యం : నిగ్రహించుకోవటం ఇంటావంటాలేదు. తనకు ఏ క్షణం ఎవరిమీద మోజుపుట్టినా మరుక్షణం ఆ సంగతి లోకానికంతా చాటాలి. లేకపోతే నిద్ర పోలేడు.

ప్రసా : నీలాగా నేను సిగ్గుమాలినవాళ్ళను ప్రేమించను. ఎవరిని ప్రేమించినా పురానాగానే ప్రేమిస్తాను. అందులో సిగ్గుపడవలసిందేమీ లేదు.

రాజ్యం : కాని దప్పుకొట్టవలసింది చాలా ఉంటుంది.

ప్రసా : అది నా ఆత్మవిశ్వాసానికి సంబంధించిన విషయం.

పురు : నీ ఆత్మవిశ్వాసమే అమలు జరిగేట్టయితే నీ చరిత్ర ఆంధ్రదేశపు చరిత్ర అవుతుంది. తగ్గు తగ్గు.

ప్రసా : ఆంధ్రదేశంలో ఉన్న అపూర్వ స్త్రీలు నన్ను ప్రేమించితే అదికూడా నా తప్పే?

శకుం : అపూర్వ స్త్రీలను కొందరిని మేం చూశాంలేరా బాబూ.

రాజ్యం : ఇంకా రెండురోజులు పోనీ నీమీదే పేడనీళ్ళు చల్లని మనిషల్లా అపూర్వ స్త్రీ అవుతుంది.

ప్రసా : నా తోబుట్టువులు నన్ను చూసి ఇలా అసూయతో ఉడికిపోవటం చూసి నేను చాలా గర్వించవలసివస్తోంది. మీరు మరికాస్త ఉడుకొక్క గలందులకు చెబుతున్నాను. మనపేరు త్వరలోనే వెండితెరపై కెక్కబోతోంది.

రాజ్యం : మహాప్రసాదం అని ఎవరో సినిమా తీయబోతున్నారుట. నేనూ విన్నాను.

పురు : హియర్, హియర్!

ప్రసా : మీ అల్పబుద్ధి చూస్తే నాకు నవ్వాలో ఏడవాలో కూడా తెలియకుండా ఉంది.

రాజ్యం : ఏడుస్తూనే ఉంటివిగా?

ప్రసా : నేను పిక్చరు తియ్యబోతున్నాను. స్క్రిప్ట్ రెడీ, స్టార్స్ రెడీ అంతా రెడీ—

రాజ్యం : తాతయ్య ఒక లక్ష రూపాయలివ్వటమే తరవాయి. అయితే చిక్కేమి టంటే తాతయ్య దగ్గిర డబ్బులేనట్లు కనబడుతుంది. ఈ పేకముక్కల మేడ కూలిపోవటం చూడందే నేనిక్కణ్నుంచి పోను.

ప్రసా : నాన్సెన్స్, తాతయ్య దగ్గిర డబ్బు అయిపోవటమేమిటి? అట్లా ఎన్నటికీ జరుగదు. అయినా నేనిప్పుడే తాతయ్యను అడిగేస్తాను.

రాఘ : తాతయ్యగారికి స్మారకం లేదు బాబూ. డాక్టరుగారు ఇంజెక్షనిచ్చి నిద్ర పుచ్చారు. అరుగో డాక్టరుగారే వస్తున్నారు.

పురు : ఏమండీ డాక్టరుగారూ? తాతయ్య ఎలా ఉన్నాడు? ఏమిటి జబ్బు?

డా. : ముసలితనం తప్ప ఆయనకు వేరే జబ్బేమీ లేదు.

ప్రసా : అయితే ఆయనింకా చాలాకాలం బతుకుతాడు.

డా : నేనా మాట అనలేదు. కొమ్మ పండినపండు ఏ క్షణాన ఏ రకంగా రాలి పోతుందో ఎవరూ చెప్పలేరు. మామూలు రోగి అయితే ప్రాణాపాయం ఏపాటి వున్నదీ నేను సులువుగానే చెప్పగలను. కాని అన్నేశ్వరంగారి విషయంలో ఏమీ చెప్పటానికి వీల్లేదు. మీరు నలుగురూ ఆయన కొడుకు సంతానం అనుకుంటాను?

పురు : అవునండీ నేను పెద్దవాణ్ని. నా పేరు పురుషోత్తం. నా తరవాతది శకుంతల. తరవాతవాడు వీడూ- ప్రసాద్. ఆఖరుది రాజ్యలక్ష్మి- రాజ్యామని పిలుస్తాం.

డా : స్వయంగా నాకు మిమ్మల్ని గురించి ఏమీ తెలియదు. కాని మీరు నలుగురూ కూడా మీ తాతగారికి మనఃక్లేశం కలిగించినట్టు నాకు తెలిసింది.

పురు : (తప్పుచేసినవాడల్లే) నేను చాలాసార్లు ఆయన దగ్గర డబ్బు తీసుకున్నాను. ఆయన కిష్టం లేకుండా యిచ్చాడని నాకు ఏనాడూ అనుమానం తగల్లేదు. నన్ను గురించి మరి ఆయనకెందుకు మనఃక్లేశం కలిగిందో—

ప్రసా : మా కుటుంబ వ్యవహారాలు మేము మీతో మాట్లాడి తీరాలాండీ డాక్టరుగారూ.

డా : (తాపీగా) అలాటిదేమీ లేదు. ఆయన బతికి ఉన్నంతకాలమూ నాకు ఆయన ఆరోగ్యంతోనే సంబంధం. ఆ తరవాత ఆయనకు ప్రతినిధిగా ఆయన విల్ అమలు చెయ్యటానికి హక్కు పొంది ఉన్నాను.

ప్రసా : అలా చెప్పరేం? నేను నా అనుమానాన్ని విత్ డ్రా చేసుకుంటా.

డా : (వెటకారంగా) ధన్యుణ్ణి. తాతగారి సొమ్ము మీకందరికీ ఎంతెంత ముట్టిందో నాకు కొంచెం ఐడియా ఇవ్వగలరా? ఆశ్చర్యపడకండి. ఆయనను నేను కూడా తాతగారనే పిలుస్తుంటాను. ఈ రాఘవులుకూడా ఆయనకు ఒకరక మైన పెంపుడు మనవడే.

పురు : చాలాకాలంగా తాతయ్యను కనిపెట్టుకుని ఉన్నాడు. నేనెరుగుదును.

డా : మీలో ఏ ఒకరూ అతనిలా తాతగారికి సేవచేసి ఉండరు. మీరు కలిగించిన విచారాన్ని ఈ రాఘవులు కొంతవరకు పోగొట్టాడని కూడా చెప్పగలను.

శకుం : మీ మాటలకు అడ్డొచ్చినందుకు క్షమించండి డాక్టరుగారూ. ఇంతకు ముందుకూడా ఈమాటే అన్నారు. మేం తాతయ్యకు కలిగించిన విచార మేమిటి?

డా : ఆ సంగతి నాకంటే మీకే బాగా తెలిసి ఉండాలి.

శకుం : తెలిస్తే ఎందుకడుగుతానండి? నా మీద తాతయ్యకు ఏనాడుగాని కొంచెం కూడా కోపం రాలేదని ఈనాటివరకూ అనుకుంటున్నాను. అది పొరపాటే నన్నమాట.

డా : అందులో పొరపాటేమీ లేకపోవచ్చు. ఎందుకంటే, ఆయనకు ఎవరిమీదా ఎన్నడూ కోపంరాగా నేను చూడలేదు. ఒక్కొక్కసారి ఆయన మనిషా, దేవుడా అనికూడా నేను ఆశ్చర్యపడతాను. ప్రపంచంలోవున్న పాపా న్నంతా క్షమించేటంత ఔదార్యం ఆయనలో ఉన్నట్టు నాకు తోస్తుంది.

ప్రసా : అటువంటివాళ్ళే పాపాన్ని పెంచేది.

డా : నేను చాల అల్పప్రాణిని. తాతగారి ఔదార్యాన్ని విమర్శించే తాహతు నాకు లేదు. మీరు స్వానుభవంమీద చెబుతున్నారేమో, నాకైతే తెలీదు. కాని ఇతరులలో పెరిగే పాపం ఆయనను చాలా బాధించింది. మీరు నలుగురూ పుణ్యాత్ములుగా బతికితే ఆయన మనస్సు చాలా సుఖపడేది.

రాజ్యం : ఇదంతా మిట్ట వేదాంతం. మనిషి అన్న తరువాత సాధ్యమైనంత సుఖ పడాలని ఉంటుంది. సుఖంకోసం చేసే ప్రతిపనీ పాపమే అనవచ్చు. అది అర్థం లేనిమాట.

డా : మీరంతా సుఖపడాలనే తాతగారి ఉద్దేశంకూడా. మీరు సుఖపడ్డందుకు ఆయన ఎప్పుడూ బాధపడలేదు. కాని, ఇతరులకు సుఖం కలిగించే శక్తి మీలో క్షీణించిపోతున్నకొద్దీ ఆయనకు మీ గురించి విచారం పెరిగిపోయింది. ఆయన ఉద్దేశంలో పాపమంటే ఇంకొకరిని సుఖపెట్టలేకపోవటమే. నాతో ఆయన ఈ మాట అన్నారు.

ప్రసా : మా తాతయ్య సత్యకాలపు మనిషి గనక అలా అనుకున్నాడుగాని ఈ ప్రపంచంలో ఒకరినొకరు సుఖపెట్టరు. డాక్టరుగారూ, ఎవరి సుఖం వారు చూసుకుంటారు.

డా : ప్రపంచం సరిగా నడవ వలసినట్టే నడుస్తున్నదని మీ అభిప్రాయమా, ప్రసాద్ గారూ? అట్లాగే అనుకున్నా మీరు మీ తాతగారి మూలాన ఏమీ సుఖం పొందలేదా ?

ప్రసా : నాకు తెలుసు, ఈ పుణ్యపాప విచారణ యావత్తూ రూపాయ అణా పైసల దగ్గరికి వస్తుందని. నాకాయన డబ్బు ఇచ్చాడనేగా మీరనేది ?

డా : అవును. మీరాయన దగ్గిర డబ్బు పుచ్చుకున్నది సుఖపడటానికే అనుకుంటున్నాను. కొంచెం ఆలోచించండి. పుణ్యపాపాలను డబ్బుతో ముడిపెట్టేది మీరేనేమో. ఎందుకంటే మీ దృష్టిలో సుఖపడటం తప్ప మనిషికి ఉత్తమాదర్శం లేదు. సుఖాన్ని డబ్బుతో కొనవచ్చు. అందుచేత ప్రపంచంలో పుణ్యాత్ములెవరంటే లక్షాధికారులూ, కోటీశ్వరులూనూ.

ప్రసా : అందుకు సందేహమేమిటి ? మా తాత చేసుకున్న పుణ్యం చాలా వరకు డబ్బే.

డా : (నవ్వి) అయితే మైనర్లు పుణ్యం చేసుకునే అవకాశం లేదు. గామాలు.

పురు : డాక్టరుగార్ూ, మనం చేస్తున్న ఈ సంభాషణ చాలా అప్రస్తుతమేమో. నాకు సెలవిచ్చినట్టయితే ఒక్కసారి మా తాతయ్యను కళ్ళచూసి నా దారిన నేను పోతాను.

డా : ఆయన్ను మీరిప్పుడు చూడడం సాధ్యంకాదు. మన మాటలు అప్రస్తుతంకావని రుజువు చేస్తాను. మీవాళ్ళంతా ఉన్నారు కదా, వెళ్ళిపోవాలని మీకెందుకు తొందర ?

పురు : వాళ్ళతో నాకేం పొంతన ? వాళ్ళు ఆహ్వానాలపై వచ్చినవాళ్ళు. నేను దారినపోతూ తొంగిచూసినవాణ్ణి.

డా : అలా అనుకోకండి, మీకూ ఆహ్వానం వెళ్ళింది. మీ ఎడ్రస్ సరిగా మాకు తెలియలేదు.

పురు : దైవికంగానైనా వచ్చానుగదా. ఇక వెడతాను. వీళ్ళు దేనికోసం వేచి ఉన్నారో నాకు తెలియదు. నేను మటుకు గోతిదగ్గిర నక్కను కాను. మా తాతయ్య నాకివ్వవలసిందేమో ఏనాడో ఇచ్చాడు. నేను నా కాళ్ళపైన నిలబడగలిగాను. కుంటివాళ్ళనైతే చివరంతా మొయ్యాలి. నేను చాలా కాలంగా నా కాళ్ళపైనే నడుస్తున్నాను.

డా : అందుకు మిమ్మల్ని తప్పక అభినందిస్తాను. మీ తాతయ్యగారు కూడా అంత వరకు సంతోషించేవారేగాని, ఆయన మీనుంచి అంతకన్న ఎక్కువ ఆశించారనుకుంటాను.

పురు : ఏమిటది ?

డా : ఇందాకటి నుంచీ ఆ విషయం చెబుతూనే ఉన్నాను. మీరు నలుగురూ ఆయనకు కావలసినవాళ్ళు. మీరే ఆయన భవిష్యత్తు. మీమధ్య పరస్పరం ప్రేమ లేకపోగా శత్రుత్వం పెరగటం ఆయనను చాలా బాధించింది. మీరు ఒకరి సుఖంకోసం ఒకరు పాటుపడితే ఆయనకు ఏ విచారమూ లేకుండాపోయేది. కాని అలా జరగలేదు.

ప్రసా : డాక్టరుగారు హాస్యధోరణిలో ఉన్నట్టున్నారు.

డా : చాలా సీరియస్‌గా చెబుతున్నాను.

ప్రసా : నేను నమ్మలేను.

డా : నమ్మలేకపోవటానికి కారణం ఉన్నది. మీరు నలుగురులో ఒకరి కొకరు మీలో ఉన్న దుర్గుణాలనే ప్రదర్శిస్తూ వస్తున్నారు. సాధారణంగా చిన్న కిల్లీకొట్టు వాడు కూడా తనకున్న సరుకులను సాధ్యమైనంత ఆకర్షవంతంగా చూపించ డానికి ప్రయత్నిస్తాడు. మీలో మీరు మీ విషస్వభావాలనే ప్రదర్శించుకోవ టానికి అలవాటు పడిపోయారు. ఇప్పుడు మీ మంచితనాన్ని బయటపెట్టు కుంటే అవతలివాళ్ళు అవహేళన చేస్తారన్న స్థితికి దిగజారారు.

ప్రసా : ఇదంతా మీరు ఊహించుకుంటున్నారు.

పురు : డాక్టరుగారూ, మీరన్న దానిలో కొంత నిజం లేకపోలేదు. ఒప్పుకుంటాను. కాని ఇది ఎవరి తప్పంటారు? నా తప్పే అయితే నేను ఈ క్షణం దిద్దుకుంటాను. కాని నాకు తెలుసు. తప్పు నాదికాదు.

డా : మీ ఉద్దేశంలో మొదటి తప్పెవరిది?

పురు : అట్లా అడిగితే చెప్పటం కష్టం. కప్పను పట్టటం పాము తప్పా, పాముకు చిక్కటం కప్ప తప్పా? ఎవరూ చెప్పలేరు.

డా : మీరు మీ విషయమే ఆలోచిస్తున్నారా? అందరి విషయమూ ఆలోచిస్తున్నారా?

పురు : ఇంకొకరి సంగతి నాకెందుకు? నా సంగతి చెప్పండి.

డా : మీరు మీ తోబుట్టువులకు మీలోని చెడు స్వభావాన్నే చూపిస్తున్నట్టు తెలుసుకున్న మరుక్షణం మారకపోవటం మీ తప్పు.

పురు : నాతో చెడ్డగా ఉండేవాళ్ళతో నేనెందుకు మంచిగా ఉండాలో నా కర్థం కాలేదు.

డా : పురుషోత్తంగారూ, మీ స్వభావానికి మీరే బాధ్యులన్నట్టుగా మాట్లాడుతున్నారు. కాని అది అపోహ కావచ్చునని మీకు తట్టలేదా?

పురు : నా స్వభావం నాదే. అందులో అపోహ ఏమీలేదు. పైపెచ్చు మిగిలినవాళ్ళ స్వభావం కూడా వాళ్ళదేనని నా దృఢనమ్మకం.

డా : మీ స్వభావాలన్నిటినీ మీ తండ్రిగారు విడిచేశారని మీ తాతగారి నమ్మకం.

పురు : మా నాన్నను నేను బాగా ఎరుగుదును. ఆయన వాస్తవికదృష్టి కలవారు. గాలిమేడలు కట్టి సంతోషించడం ఆయనకు సరిపడేదికాదు.

డా : ఒక్కొక్కసారి సంకుచిత దృష్టి కలవాళ్ళు వాస్తవిక దృష్టి కలవాళ్ళుగా చలామణీ అవుతారు.

పురు : మా నాన్న అలాటివాడని నేననుకోను.

డా : మీపైన ఆయన ప్రభావం ఎలాటిది?

పురు : అది ఇంకొకరు చెప్పాలి.

డా : నేను చెప్పవచ్చా?

పురు : చెప్పండి.

డా : నాకు మంచిదిగా తోచలేదు. నాకు పగటి కలలు కనేవాళ్ళతో విశ్వాసం ఉందిసుమండి. అలాటి పగటి కలలు ఎప్పటికైనా నిజం కావటం మూలానే ప్రపంచం ముందుకు నడుస్తున్నది. మీరు చెప్పే వాస్తవిక దృష్టి గలవాళ్ళు సాధించిన ఘనవిజయం బతుకు తెరువు నేర్చుకోవటమే.

శకుం : ఎందుకొచ్చిన చర్చ పోనిస్తురూ.

డా : అమ్మా, మీరుకూడా ఓర్పుగా నా మాటలు వినండి. నేను చెప్పేది నా సొంత విషయం కాదు. ఇంతకుముందు ప్రసాద్‌గారు దబ్బును పెంచిన పుణ్యం లేదన్నట్టుగా తెల్చారు. కన్నడిగితే మీరంతా మీ మీ స్వభావాలను బలవంతాన మార్చుకున్నారు. ఒకప్పుడు మీ మధ్య ప్రేమ బంధాలుండేవి. వాటిని

ఎవరూ ప్రోత్సహించలేదేమో. లేక వాటిని ఎవరన్నా అవహేళన చేశారో, మొత్తానికి మీరు మీలో ఉండిన ప్రేమలను పూర్తిగా మరిచిపోయారు. మీ తాతయ్య మీ చిన్ననాటి విషయాలను ఎంతో శ్రద్ధగా జ్ఞాపకం ఉంచుకుని పెన్నిధిని దాచుకున్నట్లు గుండెలో దాచుకున్నారు. అందులో మీకేమి నీతి కనిపించలేదా?

ప్రసా : నేనంత పెద్ద ఆర్భాటమేమీ చేయలేదు.

ప్రసా : నాకు జ్ఞాపకం ఉన్నంతవరకూ పీళ్ళెవరూ ఎన్నడూ నాపైన ప్రేమ చూపించ లేదు. (నవ్వి) చూపించారనుకుంటేనే ఎబ్బెట్టుగా వున్నది. ప్రేమ. డామ్ నాన్సెన్స్.

డా: ఒక్క చిన్న సంగతి జ్ఞాపకం చేస్తాను, ప్రసాద్‌గారూ. మీ చెల్లెలు రాజ్యలక్ష్మికి ఎవరో ఒక బొమ్మ ఇచ్చారు. దానికోసం మీరు ఏడ్చి రాగాలుపెట్టి, ఆమెను కొట్టి తీసేసుకున్నారు. తరవాత మీ నాన్నగారింటికి వచ్చి మిమ్మల్ని గొడ్డును బాదినట్టుబాది ఆ బొమ్మ ఆమె కిప్పించేశారు. ఆ రాత్రి మీకు జ్వరం వచ్చింది. ఒళ్ళుతెలియని జ్వరం. ఈ రాజ్యలక్ష్మిగారు తన బొమ్మను తెచ్చి మీ పక్కలో పెట్టి 'అన్నా, బొమ్మ తీసుకో. జ్వరం మానెయ్యి' అన్నారట. ఆ ముసలాయన దేవుడల్లే ఇది గమనించి తన గుండెలో దాచుకోకపోతే ఈనాడు నేనీ సంగతి మీకు జ్ఞాపకం చెయ్యలేను.

ప్రసా : చిన్నతనంలో అజ్ఞానంచేత అందరమూ అటువంటి పనులు చేస్తాం.

డా : క్షమించండి, ప్రసాదుగారూ, మీ చెల్లెలు ఆనాడు చేసిన పని అజ్ఞానమైనదీ, మీ నాన్నగారు చేసినపని జ్ఞానమైనదీ అంటే నేను ఒక్క క్షణం కూడా ఆమోదించబోను. చిన్ననాడు సహజంగా మీలో ఉండిన మంచితనం చూసి ఇవాళ మీరు సిగ్గుపడితే పడండి. కాని సిగ్గుపడటమే ప్రగతి లక్షణమని మాత్రం చెప్పకండి. (కాస్సేపు ఎవరూ మాట్లాడరు) ఇంకా ఇటువంటివి చాలా చెప్పగలను. పురుషోత్తంగారూ, మీ తమ్ముడు కాలవ ఒడ్డున కాలు జారి కాలవలో పడి కొట్టుకుపోతుంటే మీరు కూడా దూకిన సంగతి జ్ఞాపకం ఉన్నదా ? ఎందుకు దూకారు ? మీకు ఈతరాదు. ఆ సంగతి మీకూ తెలుసు. ఎవరో సమయానికి అటుగావచ్చి మిమ్మల్నిద్దర్నీ బయటికి ఈడ్వకపోతే ఆ రోజు మీ రిద్దరూ అయిపోయి ఉందురు. ఇది జరిగి ముప్ఫై ఏళ్ళు దాటి ఉండాలి. ఈ లోపల మీరు చాలా జీవితం చూశారు. ఎంతో జ్ఞానం సంపాదించారు. ఆనాడు మీరు మీ తమ్ముడి వెంట కాలవలో ఎందుకు దూకారో చెప్పండి. అందుకు మీరిప్పుడు సిగ్గుపడుతున్నారా ? మిమ్మల్నిద్దరినీ రక్షించిన మనిషి కూడా నీటిలో కొట్టుకుపోతున్న మిమ్మల్ని చూసే రక్షించ వచ్చాడనీ, మీరు చెప్పినదాకా మీ తమ్ముడి సంగతి ఆ మనిషికి

తెలియదనీ విన్నాను. ఈ ప్రసాద్‌గాప ఆనాడే పోయి ఉంటే ఎక్కువ తృప్తిగా ఉండేదా?

పురు : (గట్టిగా నిట్టూర్చి) డాక్టరుగారూ, నేనీ ప్రశ్నలకు సమాధానం చెప్పలేను. ఆ సంగతి మీకు తెలుసు. ఒక్క విషయం మాత్రం ఒప్పుకుంటాను. ఆరోజు నేను ఏ ప్రసాద్ కోసం కాలవలోకి దూకానో ఆ ప్రసాద్ పైన నాకింకా చాలా ప్రేమ ఉన్నది. వాణ్ణి అప్పుడప్పుడూ జ్ఞాపకం చేసుకుంటాను. వాడు ఆనాడేపోతే నాకు తృప్తిగా ఉండేదా అని అడిగారే, వాడు ఆనాడు కాక పోయినా ఆ తరువాత ఎప్పుడో మారిపోయాడు. అందుకు నాకు విచారంగా ఉంది. అంతకన్న నన్నేం చెప్పమన్నారు.

డా : మిగిలిన వాళ్ళ దృష్టిలో మీరు కూడా అలాగే మారిపోయారేమో !

పురు : కావచ్చు. మా శకుంతలను చదువు సంధ్యలు సరిగాలేని చవటకు కట్టబెడు తుంటే నాకు మండిపోయింది. నేనా రోజల్లా అన్నం తినలేదు. కనుక్కున్న వాళ్ళులేరు. శకుంతలకు తప్ప నేనీ సంగతి ఇంకెవరికీ చెప్పలేదు.

శకుం : ఆ రాత్రి నేను నీకు లడ్డులూ, చక్కిలాలు తెచ్చి యిచ్చా. ఇద్దరమూ జామచెట్టు కింద కూచుని తిన్నాం. మా ఆయన చచ్చిపోతే నాకు మళ్ళీ పెళ్ళి చేస్తాననీ, అప్పుడందరూ నిన్ను వెలివేస్తారనీ, నువు లక్షలను సంపా దించి నాకు, రెండో మొగుడికి మేడ కట్టిపెడతాననీ అన్నావు, జ్ఞాపకం ఉందా ?

పురు : (తనలో తాను నవ్వుకుంటూ) చిన్నతనపు బుద్ధులు. తలుచుకుంటే ఆశ్చర్యం వేస్తుంది. ఆ రోజుల్లో ప్రపంచం యింకోరకంగా ఉండేది. (ఏదో జ్ఞాపకం వచ్చినట్టుగా) నీకు జ్ఞాపకం ఉందా, శకుంతలా ? శేషగిరి గాడు ఎప్పుడూ నన్ను అంటిపెట్టుకుని తిరిగేవాడు. వాడు పోయినప్పుడు నేను కుంగిపోయాను.

శకుం : శేషగిరి చచ్చిపోకపోతే పెద్దయినాక నువు వాణ్ణి పెళ్ళి చేసుకునేదానివేనా ? అని నన్నడిగావు. నేను ధైర్యంగా ఓ అన్నా.

పురు : నువు మరచిపోలేదన్నమాట. అప్పుడు నాకెంత తృప్తి కలిగిందో నీకు తెలుసా ?

శకుం : చిన్నతనంలో కొన్ని కొన్ని సంగతులు సులభంగా తెలుస్తాయి. నీకు సంతోషం కలుగుతుందని తెలిసే నేనామాట అన్నది. (కొంచెం ఆలోచించి) చిన్నప్పుడు నేను ప్రతి దానికీ అబద్ధాలాడేదాన్నా ఏమిటి ? నా మాట ఎవరూ నమ్మేవాళ్ళు కాదన్నట్టు జ్ఞాపకం - ఏమబద్ధాలాడానో జ్ఞాపకంలేదు.

పురు : ఆఁ, అదేమీలేదు. నాన్న మనలో ఒక్కొక్కళ్ళకి ఒక్కొక్క గుణం ముద్ర చేసి పెట్టాడు. ఈ ముద్రలను చివరకు మనం కూడా నమ్మాం. నాకు లెక్కలు రావని ముద్రవేశాడు. పరీక్షలు వచ్చినప్పుడల్లా దగ్గర కూచుని

నాచేత లెక్కలు చేయించేవాడు. ఆయన చేసే హంగామాతో నేను లెక్కల్లో సున్నాలు తెచ్చుకునేవాణ్ని. నేను థర్డ్‌ఫారమూ, ఫోర్తుఫారమూ గుంటూరులో ఉండి చదివాను చూడు, అప్పుడు లెక్కల్లో 70 కి తక్కువ రాలేదు.

శకుం : నాన్న అట్లా ఎందుకు చేసేవాడో.

పురు : జబ్బు. పిల్లలు తండ్రిని దేవుడల్లే చూడాలని చెబుతారు చూడూ, దాన్ని ఆయన తిరగేశాడు. తండ్రులు పిల్లలకు దేవుడల్లే కనపడాలనుకున్నాడు. మనపట్ల దేవుడల్లే వ్యవహరించటానికి తన శక్తివంచన లేకుండా ప్రయత్నించాడు. నేను లెక్కలు రానివాణ్ణి. నువు అబద్ధాలాడేదానివి. ప్రసాదు మొండిపట్టు గలవాడు. ఆ వంకపెట్టి వాణ్ణి గొడ్డును కొట్టినట్లు కొట్టేవాడు. ఆయన ప్రసాదును కొట్టినప్పుడల్లా నేను దొడ్లోకి వెళ్ళి బాదం చెట్టును క్రరతో కొడుతూ... చావు, చావు... అనేవాణ్ణి. (నవ్వి) ఒకసారి అమ్మ చూసింది. ఆవిడ, నాన్నతో, వీడు మిమ్మల్ని చూసి చెయ్యి దురుసు నేర్చుకుంటున్నాడు అన్నది. నాన్న చేసేపని నచ్చి నే నాయిన్ను ఇమిటేట్ చేస్తున్నాననుకున్నది. ఆ బాదంచెట్టే నాకు నాన్న అనీ, నేను చావమంటున్నది నాన్న నేననీ అమ్మకు తెలియలేదు.

ప్రసా : చూడు పురుషోత్తం! నువూ, నేనూ కలిసి, ఒకసారి నాన్న ఫౌంటెన్ పెన్‌ను అరిటిచెట్ల మురుగులో లోతుగా కూరేశాం. జ్ఞాపకం ఉందా ?

పురు : కానీపెట్టి సోడా కొని ఇద్దరం తాగినందుకు ఇద్దర్నీ కొట్టాడు. సోడా తాగటానికీ - బీడీ తాగటానికీ తేడా లేదు ఆ దౌర్భాగ్యుడి ఉద్దేశంలో.

రాజ్యం : మిగిలినవాళ్ళ సంగతి నాకు తెలీదుగాని, ప్రసాదన్నయ్య నాన్న వినకుండా భయంకరమైన మాటలనేవాడు. ఒకరోజు నాకు చాకు చూపించి, 'రాజీ ! దీంతో సఫా' అన్నాడు. 'ఏం సఫా చేస్తావు ?' అన్నాను. నా గుండెల్లో రైళ్ళు పరుగెత్తాయి. ప్రసాద్ తల ఎగరేసి, 'వాణ్ణే' అన్నాడు. మనిషికి రాక్షసి మొహం పడింది. రొప్పుతున్నాడు. నిజంగా నాన్నను చంపెయ్య బోతున్నాడనుకున్నాను. వద్దంటే నన్నే చంపుతాడేమోనని భయం; ఎవరితోనన్నా చెబితే, నాన్నకు తెలిసి ప్రసాదును చంపుతాడని భయం. కుమ్ములో పెట్టిన వంకాయల్లే అయిపోయాననుకో !

ప్రసా : నేనంత పెద్ద ఆర్భాటమేమీ చేయలేదు

రాజ్యం : ఇంకానయం. ఆ మధ్యాహ్నం గదిలో నాన్న పడుకుని నిద్రపోతుంటే పిల్లిలా లోపలికి పోవటం చూశాను. నాకేమీ తోచక ఇంటికప్పు ఎగిరి పోయేటట్టు, అమ్మా ! నాన్న ఎక్కడే ? అని గావుకేక పెట్టాను. అమ్మ నోరు నొక్కుకుంటూ, నాన్న నిద్రపోతున్నారు; అరవకే అన్నది. తరవాత నన్ను చూచి అమ్మ నవ్వింది. దీనికి ఉన్నట్టుండి వాళ్ళ నాన్నమీద చాలా అపేక్ష పుట్టుకొచ్చింది అని అందరితోనూ చెప్పింది. అందరూ నన్ను చూసి నవ్వారు.

నాకు నామోషీ అయింది. కాని ఆరోజు నాన్న చావకుండా కాపాడానని చాలా సంతోషించాను.

ప్రసా : నేను గదిలోకి వెళ్ళింది అందుక్కాదులే.

రాజ్యం : కాకపోవచ్చు. కాని నాకు తెలీదుగా. తరవాత నీ చాకుతీసి అటకమీద గిరవాటేసేశానులే. ఆ సంగతి నీకు తెలియక దానికోసం చాలా వెతుక్కున్నావు, పాపం.

పురు : ఏమిటో, తలుచుకుంటే చిన్నతనంలో అనుభవించిన బాధలు కూడా బాగానే వుంటాయి. నాన్నా, తాతయ్యా భాగాలు పడినప్పటినుంచీ జీవితం ఇంకో రకంగా మారిపోయింది. అప్పటితో నా చిన్నతనం అయిపోయిందనుకుంటా.

శకుం : మనం తాతయ్యంటే ఇష్టంగా ఉండటం నాన్న కిష్టంలేదు. నువు గమనించావా ఎప్పుడన్నా ?

పురు : గమనించకేం ? నాన్న అసూయపడేవాడు. పైకి పిల్లల ప్రేమతో పనిలేనట్టు పోజు పెట్టేవాడు. లోపల తాతయ్యను చూచి కుళ్ళుకునేవాడు. కాని నాన్నకు నిజమైన షాక్ ఎక్కడంటే ఆయన రంగూన్ వ్యాపారం సాగించి రెండు చేతులా డబ్బు గడించటం మొదలు పెట్టాక. పులిని చూసి నక్క వాత పెట్టుకున్నట్లు తను కూడా అడ్డదిడ్డంగా వ్యాపారంచేసి ఉన్నదంతా క్షౌరం చేసేసుకున్నాడు.

ప్రసా : తాను తినలేదు, మనల్ని తిననివ్వలేదు.

పురు : మనకేం లోటొచ్చిందీ ? తాతయ్య సొత్తు తినేసామా ? లేదా ?

ప్రసా : డబ్బు ఖర్చు చెయ్యటం ఒక పెద్ద విద్యా ఏమిటి ? నోట్ల రూపంలో ఉంటే చెదలు కూడా తినేస్తాయి. మనకు సంపాదించే అవకాశాలు లేకుండా చేశాడే. నువు డాక్టరు చదువు కోసం కలలు కన్నావు; చదువు మానవలసి వచ్చింది. నేను ఇంజనీరు అవుతానని ఎంతో ఆశపడ్డాను. శకుంతలకు వట్టి దిక్కుమాలిన సంబంధం చేశారు. రాజ్యం బ్రతుకు చెప్పనే అక్కర్లేదు.

పురు : ఏమైనా అవతల తాతయ్య డబ్బు లేకపోతే మన బతుకులు మరీ భ్రష్టుగా ఉండేవి.

ప్రసా : నా జీవితానికి అర్థంలేదనే విషయం పైకి తెలియకుండా ఉండటానికి తాతయ్య డబ్బు బాగా వినియోగించింది. వేలకువేలు ఖర్చుచేసి లోకాన్ని ఉద్ధరించాను. ముఖ్యంగా ఆడవాళ్ళను ఉద్ధరించాను. ఇది ఎంతోకాలం సాగదని నాకు తెలుసు. తాతయ్యకు జబ్బుగా వుందని టెలిగ్రాం రాగానే అలారం మోగినట్టయింది.

పురు : ఏదో సినిమా తీసే ప్రయత్నంలో వున్నానన్నావ్ ?

ప్రసా : అది నిజమే. కాని చేతిలో డబ్బులేదు. తాతయ్య ఎలాగూ బ్రతకడు. ఆయనకు మిగిలినదంతా ఒక మొత్తంగా పుచ్చుకుని సినిమా తీద్దామనుకున్నాను.

మిమ్మల్నందర్నీ చూడగానే నా గుండె జారిపోయింది. టెలిగ్రాములు అందరికీ వెళ్ళాయని నాకేం తెలుసూ ?

పురు : నేను టెలిగ్రాం చూసి రాలేదు ప్రసాద్. నాకు తాతయ్య సొమ్మేమీ అవసరం లేదు. అదివరకు ఆయన దగ్గర చాలా డబ్బు పుచ్చుకున్నాను. ఒక ఫౌండ్రీ, కార్ఖానా నడుపుకుంటున్నాను. నేనెలాగో బతుకుతాను. నా వంతు కూడా నువే తీసుకో.

శకుం : నా సంగతేమిటన్నయ్యా? నేనూ పిల్లలూ చాలా క్షోభపడిపోతున్నాం. నన్ను మా ఆయన ఎంత మోసం చేశాడో మీకు తెలుసుగా? తాతయ్య నాకు ఎంత డబ్బు పంపించారో చెప్పలేను. అంతా నా మొగుడే తాగేశాడు. ముందు నన్ను నగలు చేయించుకోమని కాల్చుకు తినటమూ, తరవాత వాటిని అమ్మేసి తాగటమూనూ. ఆయన పోయాక తాతయ్య నెలనెలా పంపిస్తున్న రెండు వందలతోనూ కాలక్షేపం చేస్తున్నాం. ఓర్చలేక కంట్లో నిప్పులు పోసుకుంటానేగాని, రాజ్యం బతుకే సుఖంగా వున్నది. దానికి అండాదండా ఉన్నారు. తిండికీ, బట్టకూ లోటులేదు. నలుగురి నోళ్ళలోనూ నానితే ఏంగాక, సుఖంగా బతుకుతున్నది.

రాజ్యం : నువ్వే సుఖంగా వున్నావని నేననుకుంటున్నాను. నేనే సుఖంగా వున్నానని నువ్వనుకుంటున్నావు. ఇస్తివాయినం, పుచ్చుకుంటి వాయినం. సరిపోయింది.

ప్రసా : అదేమిటి? నువ్వు నాయుడితో ఉండటంలేదా?

రాజ్యం : (కళ్ళనీళ్ళ పర్యంతమై) ముప్పై నిండకుండానే నా బతుకు కుక్కలు చించిన విస్తరి అయింది. నాకన్న నాలుగేళ్ళు చిన్నదానితో పోటీ చెయ్యలేక నేను వీధిలో వచ్చిపడ్డాను. నాక్కూడా తాతయ్యే నెలనెలా కొంత డబ్బు పంపిస్తున్నాడు. అందులో కొంత దాచి వెనకేసుకుందామని ఒకప్పుడనుకున్నాను. కాని రేపు గురించి ఆలోచించటం చాలా బుద్ధితక్కువగా తోచింది. నాయుడు నన్ను విడిచి క్షణం ఉండలేడని ఎంతో గర్వపడ్డాను. చివరి రోజుల్లో ఆయన నన్ను వదిలించుకోవటానికి నానాపాట్లూ పడుతుంటే నాకవి అర్థంకూడా కాలేదు. మగవాడికేమన్నా భవిష్యత్తున్నదేమో గాని ఆడదానికి అటువంటిది లేదు. అందుకేనేమో మా ఆడవాళ్ళు ఉన్న జీవితం వున్నట్టుగా వెళ్ళిపోతే చాలునని దేవుళ్లకు దణ్ణాలు పెట్టుకుంటారు. నాకు అటువంటి వాళ్ళను చూస్తే చాలా వెటకారంగా వుండేది. శకుంతలక్కయ్యకు బతకటం చాతకాదనుకునేదాన్ని.

శకుం : (నిట్టూర్చి) అందులో అబద్ధం ఏమీలేదులేవే, తల్లి.

పురు : రాజ్యం, నువు ఏనాడు నా దగ్గిర వచ్చి వుంటానన్నా నాకేమీ అభ్యంతరం లేదు. పాపం, శకుంతల పిల్లలు గలది. దానికి నువ్వేమీ సహాయం చెయ్యలేవా?

ప్రసా : నన్ను ఈ పిక్చరు తియ్యనివ్వండి. అందరం హాయిగా బతుకుదాం రాజ్యం! నా పిక్చర్లో వేషం వేస్తావా?

రాజ్యం : నేనా?

ప్రసా : అవును. ఏం? డబ్బు ఖర్చుచెయ్యటమే తెలిసి ఏం లాభం, రాజ్యం. సంపాదించటంకూడా నేర్చుకుందాం. ఆ నాయుడు బాబుల్లాంటివాళ్ళు నీ చుట్టూ కుక్కల్లాగా కారాడేటట్టు చేస్తాను. ఎట్లాగో సినిమా తీయటంలో అంతులేని డబ్బు మంచినీరులాగా ఖర్చయిపోతుంది. నన్నడిగితే శకుంతలక్కయ్య కూడా వేషం వెయ్యొచ్చు. తప్పేమిటంటాను.

రాజ్యం : అవును ప్రసాద్. నువు చెప్పింది బాగానే ఉంది. తాతయ్య డబ్బులో నా వాటాకూడా నువే తీసుకుని పిక్చరు తియ్యి. పెద్దన్నయ్య ఎట్లాగో ఇస్తానన్నాడాయె.

శకుం : ఇన్నాళ్ళూ ఒకరికొకరం కాకుండా బతికాం. ఈ రూపంలోనైనా మనం బతుకులు కలబోసుకుందాం. నా వంతుకూడా ప్రసాదుకిస్తాను.

ప్రసా : ఉండండి. మీరంతా ఎగిరే ఎద్దుకు గంత తగిలించేస్తున్నారు. పిక్చరు తీద్దామనుకున్నప్పుడు నాకు కొంచెం కూడా బరువూ, బాధ్యతా తోచలేదు. అందులోకి మీరంతా వస్తామంటుంటే నాకు అదురు పుట్టుకొస్తున్నది. ఒకవేళ నేను దెబ్బతింటే మీరంతా కూడా నష్టపడతారే. ఇదివరకల్లా నట్టేట నావ మునగటమూ, నేను ఏదో విధంగా వొడ్డుకు ఈదుకొస్తూ వుండటమూ జరిగింది. ఈసారి మీరంతా వుంటే నేను నావ నడపటం క్షేమమా?

పురు : బాధ్యతతో పనులు చెయ్యటం ఎప్పటికొప్పటికి నేర్చుకోవద్దుట్రా?

ప్రసా : బతికున్నాళ్ళూ బాధ్యత నుంచి తప్పించుకోవటమే ఆదర్శంగా పెట్టుకుని వున్నవాణ్ని మరి.

డా : మీ కుటుంబం చర్చలో జోక్యం కలిగించుకుంటున్నాను. మన్నించాలి.

పురు : (నవ్వుతూ) చెప్పండి, డాక్టరుగారూ. మీ ఆధ్వర్యం కిందనే ఈ చర్చ అంతా జరుగుతున్నది. అయితే ఇంతసేపూ మేము మిమ్మల్ని మరిచిపోయాం.

డా : తాతయ్యగారి దగ్గర డబ్బు దాదాపు ఏమీ లేదు. ఆయన ఆ సంగతి నాతో చెప్పారు.

పురు : నిజమేనా, డాక్టరుగారూ?

డా : నేను హాస్యానికి అనటంలేదు.

పురు : పాపం, ప్రసాద్ ప్లానులన్నీ పాడేనన్నమాట.

ప్రసా : నావి కేవలం ప్లానులే. నిజం చెప్పాలంటే, నేనీ పిక్చరుతీసి బయట పడేస్తాననీ, దానికి డబ్బొస్తుందనీ నా అంతరాత్మలో ఏమూలా నమ్మకం

లేదు. తాడూ కోలా లేకుండా పిక్చర్లు తీయటానికి పూనుకునేవాళ్ళను చూస్తున్నాగా.

రాజ్యం : అదేంమాట? తాడూ కోలా లేకుండా సినిమాలలో డబ్బు చేసుకునే వాళ్ళూ వున్నారు, నన్నడిగితే పెట్టుబడి లేకుండానే సినిమాలు తీస్తున్న వాళ్ళు కూడా వున్నారు. (ప్రసాద్ నవ్వుతాడు) ఏం. నవ్వుతున్నావ్ ?

ప్రసా : నా మొదటి ఆలోచన అదే! పెట్టుబడి లేని వ్యాపారమే చేద్దామనుకున్నాను. అన్నయ్య బాధ్యత అంటున్నాడే, ఇది జరిగే పనికాదు. నేనింకేదైనా చూసుకుంటాను. నాకు ఫరవాలేదు. మగవాణ్ణి, కాని, పాపం, మీ ఆడవాళ్ళిద్దరూ ఏమయేటట్టు?

శకుం : నిండా మునిగినదానికి చలేమిటి" వంటలు చేసుకు బతుకుతాను. రాజ్యం సంగతే మరీ ఘోరం.

రాజ్యం : (చిరాకుగా) నన్ను గురించి ఎవరూ దిగులు పడక్కర్లేదు. బతుకు తెరువులన్నీ నాకు బాగా తెలుసు. ఏట్లో పారేస్తే ఎదురీదేస్తాను. జీవిత సముద్రంలో ఒంటరిగా తెప్ప నడుపుతున్నందుకు ఇన్నాళ్ళూ గర్వపడ్డాను కూడా. అయితే ఈ కాస్సేపటిలో ఒక కల వచ్చినట్లయింది. తెప్ప ఒడ్డు కొచ్చిందనిపించింది. అయినవాళ్ళ మధ్య ఆప్యాయంగా బతక వచ్చుననుకున్నాను. కాని, అది కలే! మళ్ళీ నా వాస్తవ జీవితం నాకుండనే ఉన్నది.

పురు : ఆ కల ఏదో రూపంలో నిజం చేసుకుందాం, రాజ్యం. నేను చాలా కాలంగా పేద జీవితం గడపటం నేర్చుకున్నాను. ఇన్నేళ్ళూ మీరెవరూ నన్ను చూడ రాలేదు. అందుచేత మీకు తెలీదు. నా కార్ఖానాలో పనిచేసే వాళ్ళు బతుకుతున్నట్టే నేనూ బతుకుతున్నాను రాజ్యం! నీ విలాసాలూ, డ్రెస్సులూ, ఖులాసా తిరుగుళ్ళూ మానేసి నా దగ్గిర వచ్చి ఉండు. మనం సుఖాలు పంచుకోనేలేదు. కష్టాలన్నా పంచుకుందాం.

రాజ్యం : (ఆవేశంతో) నీ సుఖాలూ వద్దు, కష్టాలూ వద్దు, నేను నీ ఇంటి కెందుకు రావాలి? నువ్వెవరో, నేనెవరో. (ఏడుస్తుంది).

పురు : ఊరుకో రాజ్యం, చిట్టితల్లివికాదూ. (రాజ్యం ఇంకా ఏడుస్తుంది) చిన్నప్పుడు ఎంత ఏడుపులో కూడా నేను నవ్విస్తే నవ్వేది.

రాజ్యం : (ఎగబీలుస్తూ) నేను సుఖంగా బతుకుతున్నానని మీరలా అనుకుంటున్నారన్నమాట. నా జన్మకి సుఖంలేదు. రైలుకింద పడదామని అదివరకు రెండు సార్లు ప్రయత్నించాను. పడితే పీడ విరగడైపోయి వుండేది.

పురు : రాజ్యం, నువిక ఒంటరిగా బతకటానికి వీల్లేదు. నావెంట వచ్చేస్తున్నావు.

రాజ్యం : నేను రాను.

పురు : రాకపోతే తన్ని లాక్కుపోతాను, అంతే.

రాజ్యం : అక్కయ్యను తీసుకుపో.

పురు : అది వస్తుంది (కలలు కంటూ) మా ఇల్లు ముచ్చటగా ఉంటుంది. ఇంట్లో పచ్చగా ముగ్గురాడవాళ్ళు, సందడిగా పిల్లలు.... నీ సంగతేమిటిరా ప్రసాద్? నువు కూడా మా కొంపలో ఇమడలేవూ?

ప్రసా : నేనా పిక్చరు తీస్తాను. అందులో నాలుగు డబ్బులు ఏదో విధంగా వెనక వేసుకున్నాక పై సంగతి చూస్తాం.

అన్నే : (అవతల గదిలోంచి) శ్రీమన్నారాయణమూర్తీ.... నాయనా....

రాజ్యం : (ఉలిక్కిపడి) ఏమిటదీ?

పురు : ఆ మాట్లాడింది తాతయ్యేనా డాక్టరుగారూ?

రాఘ : నేను వెళ్ళి చూసివస్తా (వెళతాడు)

డా : రాఘవులుకు తాతగారీ యిల్లు ఇచ్చేశాడు. అతని పేర యీ పది పదిహేనేళ్ళ నుంచీ బాంకులో డబ్బుకూడా వేస్తూవస్తున్నారు. ఈపాటికది పెద్ద మొత్తమై వుండాలి.

పురు : అంత డబ్బుండి కూడా యితను తాతయ్యకు సేవ చేస్తున్నాడా?

డా : దానిలో ఆశ్చర్యమేముందీ?

పురు : మాకు బతకటం చాతకాకపోవటమే ఆశ్చర్యమనుకోండి.

డా : యుద్ధంవచ్చి తాతగారి వ్యాపారం పాడుచెయ్యకపోతే మీకెవరికీ ఏ లోటూ వుండేదికాదు.

రాఘ : (ఆదుర్దాగా వస్తూ) డాక్టరుగారూ! ఒక్కసారి తాతగారిని చూడండి.

డా : వస్తున్నా! (మిగిలినవాళ్ళతో) మీరిక్కడే ఉండండి.

రాజ్యం : ఎందుకి డాక్టరుగారు మనని తాతయ్యకు ఎడంగా ఉంచుతున్నారూ?

పురు : నాకేమీ అర్థం కావటంలేదు. ఆయనకు వేరే జబ్బేమీ లేదుట. ఏ జబ్బూ లేకపోతే మత్తుమం దెందుకిచ్చారూ?

ప్రసా : అర్థంలేని మాట. మత్తుమందిచ్చినంతమాత్రాన మనం తాతయ్యను చూడ రాదనటం దేనికీ? ఈ డాక్టరుగారు ఏదో నాటకమాడుతున్నట్టు నాకు అను మానంగా వుంది.

శకుం : ఇంతకుముందు మనం విన్నది తాతయ్య గొంతేనా? అదేదో మాదిరిగా వినపడిందే. అరుగో డాక్టరుగారు.

రాజ్యం : ఆయన మొహం అలా ఆయిపోయిందేమిటి ?

డా : (వణకుతున్న గొంతుతో) ఏం పని చేశాను. ఏం పని—

పురు : ఏం జరిగిందో చెప్పండి డాక్టరుగారూ. ముందు కూచోండి.

రాఘ : (విచారంతో) ఇంకేం కావాలి. బాబూ. తాతగారు దాటిపోయారు.

పురు : (నిట్టూర్చుతూ) హు, అనుకున్నదేగా, పెద్దవాడూ, అందులోనూ జబ్బుగా ఉన్నట్టున్నాడూ.

డా : నన్ను మన్నించాలి పురుషోత్తంగారూ. మీరు వచ్చేసరికి తాతగారికి ఏ జబ్బూలేదు. ఆయన సలహాపైనే నేను మీతో అబద్ధం ఆడాను. మీరిక్కడ కూచుని మాట్లాడుకోవటం మొదలు పెడితే, మీలో ఉండే మంచితనాన్ని మీరే గుర్తించుతారని తాతగారి ఉద్దేశం.

పురు : అంటే నాకర్థం కాలేదు.

డా : ఆయన హృదయం నాకే ఒకంతట అర్థంకాలేదు. మొత్తంమీద ఆయన ఉద్దేశమేమిటంటే మీరంతా మీలో ఉన్న మంచితనాన్ని మరచిపోయి, సుఖం లేని జీవితాలు జీవిస్తున్నారని. డబ్బుతో మీకు సుఖంరాదని ఆయనకు ఏనాడో తెలిసిపోయింది.

ప్రసా : డాక్టరుగారూ, తాతయ్య బతికే ఆశలేదా ? ఏదన్నా ఇంజెక్షనిస్తే-

డా : అదీ అయింది. ఆయన చావు నాకు చాలా వింతగా వున్నది. ఆయన ఆనందంతో ప్రాణం విడిచాడా అని నా అనుమానం.

శకుం : మేం ఒకళ్ళతో ఒకళ్ళం గర్భశత్రువుల్లాగా మాట్లాడుకుంటూంటే విని తాతయ్య గుండెపగిలి ఉంటుంది.

ప్రసా : అవును, తాతయ్యను మనమే చంపాం.

డా : అటువంటి అపోహ మీకు వద్దనే వద్దు. ఇంతకాలానికి మీరు తాతగారికి ఆనందం కలిగే మాటలు మాట్లాడారు.

రాజ్యం : (కన్నీళ్ళతో) బతికినన్నాళ్ళూ లేకపోయినా, చచ్చేముందైనా మావల్ల తాతయ్యకు ఆనందం కలిగిందా, డాక్టరుగారూ ?

డా : మీరు మళ్ళీ పాత ధోరణిలో పడకండి. ఆయన ఆత్మకు శాంతి ఉండాలంటే మీరు ఒకరిపైన ఒకరు ప్రేమగా ఉండండి. ఆయనకు మీపైన ఎంత ప్రేమో మీలో ఒక్కరికీ తెలీదు.

పురు : నేను కొంచెముగా ఊహించగలుగుతున్నాను, డాక్టరుగారూ....మా మంచి తనంలో మాకులేని విశ్వాసం తాతయ్యకున్నదంటే-

డా : రాఘవులూ, మనం తాతగారి అంత్యక్రియలను గురించి చూద్దామా.... పురుషోత్తంగారూ, మీరంతా లోపలికి వెళ్ళి తాతగారిని ఆఖరిసారి చూడండి. (అందరూ కలిసి గదిలోకి వెళ్ళే విరామం. అందరూ తాతగారి శవం చుట్టూ చేరి చిన్న గొంతులతో మాట్లాడుతారు)

శకుం : తాతయ్య అటే మారలేదు. నేను కిందటిసారి చూసినట్టే వున్నారు.

రాజ్యం : మొహం నవ్వుతున్నట్టుగా వుంది కాదూ !

పురు : ప్రసాద్, మనం తాతయ్య ఆఖరు కోరిక దక్కించగలమా ?

ప్రసా : డాక్టరుగారన్న మాటలు నా కర్థం కాలేదనుకుంటున్నావా, అన్నయ్యా ?

రాఘ : (ఎడమ నుంచి) పెద్దబ్బాయి గారూ !

పురు : ఇక్కడే వున్నావా, రాఘవులూ ?

రాఘ : లేదు, వెళుతున్నా. మీతో ఒక్కమాట చెప్పిపోదామని వచ్చా— బయట డాక్టరుగారు కాచుకున్నారు.

పురు : చెప్పు రాఘవులూ !

రాఘ : మీరంతా ఏదన్నా కలిసి చేయదలిస్తే నన్ను మరిచిపోకండి. నా దగ్గర పదిహేనువేలదాకా డబ్బున్నది...వస్తా. (వెళతాడు)

పురు : (ఆశ్చర్యంతో) ఏం మనిషి !

ప్రసా : తాతయ్యకు ప్రతినిధి లాగున్నాడే.

పురు : ప్రసాద్, ఇవాళనుంచి మనం అయిదుగురం. తాతయ్యా, ఇకనుంచి మేం అయిదుగురం.

ముద్రణ : మే, 1959, అభ్యుదయ.

"నాకు ఒకటే ఆశయం — నా రచనలవల్ల కూడా మనోవికాసం పొందదగిన వాళ్ళు తెలుగు వాళ్ళల్లో ఉండితీరాలి, వారందరూ నా కథలు చదవాలని నా కోరిక. వారందరికీ నా రచనల మీద ఎంత త్వరగా ఏవగింపు కలిగితే అంత ఉపకారం చేసిన వాణ్ణవుతాను తెలుగు సారస్వతానికి. అప్పటికి తెలుగు సారస్వతానికి నాతో పని అయిపోతుంది. నా కథలు చిరస్థాయిగా ఉండిపోవాలనే ఆశ నాకు ఏకోశానా లేదు.

ఇంకా ఎప్పుడో పుట్టబోయే వాళ్ళ కొరకు రాస్తున్నాననే అహంకారం కూడా నాకు లేదు. నేను ఆకాశం నించి ఊడిపడ లేదు. నాకు పూర్వం కథలు రాసిన వారు ఎక్కడ విడిచి పెట్టారో నేను కథారచనను అక్కడే అందుకోగలను కాని అంతకు పైన ఎట్లా అందుకోగలను?"

—కొడవటిగంటి కుటుంబరావు

('కారుణ్యం' 1937, ముందుమాట)

Cover Printed at Sri Balaji Art Printers, Chikkadpally, Hyd-